## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ ప్రభ

## విషయసూచిక



గమనిక:—ఇప్పటికే సీరియల్ శీర్షికలు రామకృష్ణప్రభలో ఐను వున్నందున వీటికి మఱొకటి చేర్చడం బాగుండదని తాత్కాలికంగా ముండకోపనిషత్తు ప్రారంభించడం లేదు. ఇంకో మూడునెలల్లో గీతాగేయాలు పూర్తి అవుతుంది. ఆ తరువాత ముండకోపనిషత్తు ప్రారంభిస్తాము. ఉపనిషత్తు ప్రియులకు ఈవిధంగా తాత్కాలికంగా ఆశాభంగం కలిగించినందులకు చింతిస్తున్నాము.



ధన్యవాదాలు:—హైదరాబాదునుండి ఒక సోదరి రెండునెలల్లో సుమారు నూటపాతికమంది చందాదారులను రామకృష్ణ ప్రభకు చేర్పించారు. పత్రికాముఖంగా ఈమెకు మా ధన్యవాదాలు తెలుపుకోలేకుండ ఉండలేకపోతున్నాము.

---

### చందాదారులకు గమనిక :

జీవితచందాలను వాయిదాల మీద చెల్లిస్తున్నవారు ఏకారణంచేతనైనా వాయిదాల మీద నిర్ణీతకాలం లోపల పైకం పంపలేని పరిస్థితులు ఏర్పడినప్పుడు బాధపడక, అంతవఱకు చెల్లించిన పైకాన్ని సంవత్సర చందాల కింద లెక్కించుకొనుడని మాకు ఉత్తరం వ్రాయవచ్చును. అవిధంగా మార్చుటకు మాకేమి ఇబ్బంది లేదని మనవి చేస్తున్నాము.

చందాదారులు కొందరు వారి అడ్రసులు వ్రాయునప్పుడు పేరు, కేరాఫ్, ఊరు, పోస్టు, వయా, తాలూకా, జిల్లా, రాష్ట్రం-అన్నీ వ్రాస్తున్నారు. బాగానే ఉన్నది. కాని, ముఖ్యంగా ఉండవలసిన పిన్‌కోడ్ వ్రాయడం మఱచిపోతున్నారు. కనుక దయచేసి మీ విలాసాలలో పిన్‌కోడ్ తప్పక వ్రాయవలసినదిగా మనవి. మేము పత్రికల మీద ముద్రించి పంపే మీ అడ్రసులలో ఏవైనా లోపాలుంటే దయచేసి తెలియజేయండి.

# నైతికత: నీతిశాస్త్రాల ప్రయోజనము

ఈ రోజులలో ప్రతివస్తువునూ దాని ప్రయోజనాన్ని బట్టి మదింపు చేస్తాము— దానివలన రూపాయలు, పైసల ప్రయోజనం కలుగుతుందనేది ప్రమాణం. సత్యాన్ని ప్రయోజన ప్రమాణంతోనో, ధనప్రమాణంతోనో నిర్ధారించాలని కోరడానికి వ్యక్తికి ఏమి అధికారమున్నది? ఒకవేళ ప్రయోజనం లేదనుకుందాం. అది సత్యం కాకపోతుందా? ప్రయోజనం సత్యానికి గీటురాయి కాదు అయినప్పటికి సత్యం వలన అత్యధిక ప్రయోజనం ఉన్నది. ఆనందం - ప్రతిఒక్కరు దాని కోసమే ప్రయత్నిస్తున్నారని మనకు తెలుసు. అయితే అత్యధిక సంఖ్యాకులు అశాశ్వతము, అవాస్తవికము అయిన విషయాలనుండి ఆనందం పొందాలని ప్రయత్నిస్తున్నారు. ఇంద్రియాలలో ఏనాడూ సుఖం కనిపించలేదు. ఇంద్రియాలలోను, ఇంద్రియానుభవంలోనూ శాశ్వత ఆనందం పొందిన వ్యక్తి యింతవరకు లేడు. ఆనందం ఆత్మయందు మాత్రమే లభిస్తుంది. కాబట్టి ఆత్మానందాన్ని అనుభవించటమే మానవజాతికి పరమ ప్రయోజనము. సర్వ దుఃఖానికి అజ్ఞానమే మహామాతృక. అఖండ శక్తి దుఃఖిస్తుంది, రోదిస్తుంది; మనం అల్ప బుద్ధులము, అల్ప దేహులము అని భావించడం ప్రాథమికమైన అజ్ఞానము. ఎప్పుడైతే నేనొక స్థూలశరీరము అని భావిస్తానో అప్పుడు దాన్ని జాగ్రత్తపడుచుకోవాలని, రక్షించుకోవాలని, యితరుల దేహాలేమైపోయినా, నా దేహం మాత్రం నాజూకుగా ఉంచుకోవాలని అనుకొంటాను. అప్పుడు మీరు, నేను వేరవుతాము. ఎప్పుడైతే ఈ వేర్పాటుభావన తల ఎత్తుతుందో అది అన్నివిధాలైన దుర్మార్గానికి బాటవేస్తుంది. అనంతమైన దుఃఖానికి దారి తీస్తుంది.

నేటి మానవజాతిలోని బహుకొద్దిమంది తనకు స్వార్థపరత్వాన్ని, సంకుచితత్వాన్ని, అల్పత్వాన్ని వీడగల్గినట్లైతే దాని ప్రయోజనం— ఈ భూతలం రేపు స్వర్గధామమవుతుంది. అంతేగాని కేవలం యంత్రాల సాయంతో పదార్థవిజ్ఞానప్రగతితో మాత్రమే అది ఎన్నటికీ జరగదు. నిప్పులో నూనె పోస్తే మంటలు పైకెగసినట్లు అవి కేవలం దుఃఖాన్ని పెంచుతాయి. ఆత్మజ్ఞానం లేని పదార్థ విజ్ఞానమంటే కేవలం అగ్నిలో ఆజ్యం పోయటమే. మరోమాటలో చెప్పాలంటే పరుల సొత్తును అపహరించే స్వార్థపరునికి, ఇతరుల కోసం తన జీవితాన్ని అర్పించకపోగా వారి జీవితాలతో చెలగాటమాడటానికి సాయంగా యింకొక ఆయుధం అందజేయటమే.

ఈ ప్రపంచం సుఖదుఃఖాల, శుభాశుభాల మిశ్రమం. ఈ రెండింటిలో ఒకటి పెంపొందించాలంటే అవశ్యం రెండవదీ వర్ధిల్లవలసిందే. సంపూర్ణమైన మంచి ప్రపంచంగాని, దుష్ట ప్రపంచంగాని ఎన్నడూ ఉండబోదు. ఎందుకంటే ఆ భావనే విరుద్ధమైన పదజాలంతో కూడి ఉన్నది. ఈ విశ్లేషణద్వారా వెల్లడైన మహారహస్యమేమంటే మంచి, చెడులు అనేవి కోసి ఎండవేసిన రెండు విడిభాగాలు కావు. ఈ ప్రపంచంలో యిది మంచిది, పూర్తిగా మంచిది; అనిగాని యిది చెడ్డది పూర్తిగా చెడ్డది అనిగాని దేనికీ ముద్ర వేయజాలము. ఇప్పుడు మంచిదిగా కనుపించే విషయమే రేపు చెడ్డదిగా కనుపించవచ్చు. ఒకడికి దుఃఖదాయిని అయింది మరొకడికి ఆనందప్రదం




ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

సంపుటము 39 1982 - జనవరి సంచిక 1

# వరద! రామకృష్ణ! పరమహంస!

శ్రీకరుడవీవు! శ్రీరాముడవు నీవు
కృష్ణమూర్తి వీవు విష్ణు వీవు
సత్స్వరూప మీవు శారదాపతి వీవు
వరద రామకృష్ణ పరమహంస!!

అవధరింపు కరుణ ఆశ్రితార్తిహరణ
నిన్నుఁ దలపగాను నిత్యమేను
బలుకు పద్యములను భవ్యభావములను
వరద రామకృష్ణ పరమహంస!!

వంగదేశమందు బ్రాహ్మణకులమందు
ధర్మమిలను నిల్ప దయను నీవు
అవతరించితివట భవతారిణీదాస
వరద రామకృష్ణ పరమహంస!!

మతములెన్ని గలవో మహిని పథములన్ని
యను నుదార భావమును వచించి;
సర్వజనుల నీవు సమ్మతింపగ జేతు
వరద రామకృష్ణ పరమహంస!!

సత్యవర్తనమున, సాధు శీలంబున
భక్తిభావమునను ముక్తి దొరుకు,
ననుచు సర్వజనుల కనయంబు బోధింతు
వరద రామకృష్ణ పరమహంస!!

పాఠశాల చదువు పట్టకున్నను నీకు
పారమార్థికులగు పండితులకు,
నబ్బురముగ దోచె నయ్య నీను తెలివి
వరద రామకృష్ణ పరమహంస!!

చదువురాదు నీకు సర్వజ్ఞుడవు నీవు;
సతిని గల్గు బ్రహ్మచారి నీవు;
భక్తుడవును నీవు, భగవంతుడవు నీవు,
వరద రామకృష్ణ పరమహంస!!

ఆడజాతినెల్ల అమ్మగా జూచెదు,
భార్య గూడ నీకు భవ్యజనని,
విశ్వమంత నీకు విశ్వేశ్వరియె యు
వరద రామకృష్ణ పరమహంస!!

డబ్బు చేతితోడ తాకజాలవు నీవు
తాకినంత తేళ్ళు తాకినట్లు
తల్లడిల్లితివట తలమె యింత విరక్తి
వరద రామకృష్ణ పరమహంస!!

నిన్ను నాశ్రయింతు, నీపేరె స్మరియింతు
నిష్ఠ లేదు నాకు నీతి లేదు;
నీవె దిక్కు నాకు, నిఖిలాత్మ! రక్షింపు
వరద రామకృష్ణ పరమహంస!!

మతములన్ని నీకు మాన్యతమములయ్యె
మహిత శక్తితోడ మాన్యుడైతి
ధర్మరక్ష సేయ ధరణి బుట్టిన దేవ,
వరద రామకృష్ణ పరమహంస!!

తప్పులెల్ల సైచి తనయుని గతి నన్ను
సర్వదేశములను సర్వగతుల
నిండు కరుణతోడ నిత్యంబు రక్షింపు
వరద రామకృష్ణ పరమహంస!!

—వెలుదండ రామేశ్వరరావు

# ఓ నాణెమా!

"ఓ నాణెమా? నీ కథ ఏమిటి? ఎవరో మహాపురుషుడు నీ స్పర్శ తగలగానే కరెంట్ షాక్ తిన్నట్లు విలవిలలాడిపోయేవాడట? నీలో ఇంత పాపం దాగి ఉందా! పైకి తళతళ మెరుస్తున్నావే!"

"అయ్యా! నే నేపాపం చేయలేదు. నా దేహం లోహమయం. ఇందులో నా తప్పేముంది? నా తమ్ముళ్ళు చెల్లెళ్లు కూడ నాలాగే లోహమయులే. నా పెద్దన్నలు పెద్దక్కలు - వారి దేహాలు మాత్రం కాగితమయాలు. లోహమయాలు కానీండి కాగితమయాలు కానీండి మా తప్పేమీ లేదు. మేమేమీ పాపం చేసుకోలేదు. కాని మానవ సమాజంలో జరిగే సకల అన్యాయాలకు, అక్రమాలకు, దోపిడీ విధానాలకు, వంచనలకు, పాపాలకు మా కుటుంబీకులందరం ఉపకరణాలయి పోయాము. దీనివల్లే మా స్పర్శ ఆ మహాత్మునికి భరింపరాని వేదన కలుగజేసింది. కేవలం లోహస్పర్శ వల్ల ఆ బాధ కలిగేటట్లుంటే ఆయన ఏ పూజాపాత్ర భోజనపాత్ర ముట్టుకో డానికి శక్యం అయ్యేది కాదు."

"ఓ నాణెమా! నీవు చెప్పేది నాకేమీ అర్థం కావడం లేదు. కొంత వివరంగా చెబితే నీకు వచ్చే నష్టం ఏముంది?"

"వివరించి చెప్పడానికి నేను ఆర్థిక శాస్త్రంలో (Economics) పట్టా పుచ్చుకో లేదు. ఒకవేళ పట్టాపుచ్చుకున్నవాడు వివరంగా చెప్పినా వినే ఓపిక నీకు ఉండదు. కాబట్టి నా నాలుగు మాటలు ఆలకించు. శ్రమకు తగిన ఫలం - ఇదీ ఉత్తమ మానవ సమాజ లక్షణం. "శ్రమకు తగిన ఫలం" అనే ధర్మం ఏ సమాజంలో లోపిస్తుందో ఆ సమాజం అధర్మమైన సమాజం. పూర్వం అంటే మేము పుట్టకముందు మానవ సమాజంలో "ఇందమ్మా పుల్లగూర అంటే ఇందమ్మ తియ్య గూర" అనే బార్టర్ విధానం ఉండేది. వస్తువులనిచ్చి వస్తువులను తీసుకొనేవారు. ఎంత బుద్ధి చాకచక్యం ఉన్నా శరీర శ్రమ లేక వస్తువుల ఉత్పత్తి సాధ్యంకాదు కాబట్టి ప్రతి ఒక్కరూ శ్రమజీవనం సాగించేవారు. కొందరు ధాన్యం పండించేవాళ్ళు, మరికొందరు బట్టలు నేసేవాళ్లు, మరికొందరు కుండలు చేసేవాళ్ళు, మరికొందరు పశువులు మేపేవాళ్ళు, మరికొందరు వడ్రంగం ఇత్యాది పనులు చేసేవాళ్ళు. పరస్పరవస్తు మారకం చేసుకుంటూ అందరూ సమాన ఆర్థిక స్థాయిలో జీవనం సాగించేవారు. వాళ్ళలో శ్రమైక జీవనానికి ఇష్టపడని పాపపురుషులు కొందరు దోపిడీ వృత్తికి దిగి దోచుకోవడమే తమ జీవనంగా చేసుకొన్నారు. ఆ దోపిడీగాళ్ళ పోరు పడలేక ప్రజలు ఆ దోపిడీగాళ్ళలో ఒకడిని తమ రక్షకుడుగా ఉండమని అతనికి కావలసిన అవసరాలన్నీ తీరుస్తామనీ చెప్పారు. దానికి ఒప్పుకొన్న మొదటి దోపిడీగాడే రాజ్యవ్యవస్థకు మూలపురుషుడు. వాడి రాజ్యవ్యవస్థ నడవడానికి చాల సిబ్బంది అవసరం కదా! వాళ్ళంతా ప్రభుత్వోద్యోగులు, సైనికులు, తదితరులూ. వాళ్ళ పోషణ భారమంతా శ్రమైక జీవుల మీద పడింది. రాజ్యవ్యవస్థ పెరగను పెరగనూ శ్రమైక జీవుల భారం కూడ పెరిగింది. వారి శ్రమలో అధిక భాగం జీతగాళ్ళకు పోసాగింది. అదీ చాలకపోతే ఆ దోపిడీదారు, ప్రక్క భూములను కూడ కైవసం చేసుకోవడం జరిగింది. ఇలా రాజ్యాలు తయారయ్యాయి. వాటితోబాటు నగరాలు, నాగరికతలు, వ్యాపారాలు తలెత్తాయి. అదే సమయంలోనే ఒక ఆర్థిక నిపుణుడు మమ్మల్ని తయారు చేసి రంగంలో ప్రవేశపెట్టాడు. అప్పటినుండి పరిస్థి

కలాన్ని కదలనీయకుండ చేస్తే జడ్జిమెంటు ఇవ్వడంలో మనస్సుకు శక్తి చాలా తగ్గిపోతుంది. నీవేదైనా చూస్తున్నప్పుడు నోటిలోపల నీ నాలుకను ఏమాత్రం చలింపనీయకుండ జాగ్రత్త వహించావంటే మనస్సు యొక్క కలాన్ని కదలనీయకుండా పట్టుకొన్నావని అర్థం. అప్పుడు అంతఃకరణంలో, జడ్జిమెంట్లవల్ల కలిగే అల్లకల్లోలం చాల వరకు తలెత్తే అవకాశమే ఉండదు. ఇలా చేసి చూడు. నీకే తెలుస్తుంది. దీనికి చాల చురుకుదనం, అవధానత ఉండాలి. మందం, జడత్వం, ఏమఱుపాటు ఉంటే సాధ్యం కాదు. ''కన్నెత్తి చూడకు'' అనే మూర్ఖమైన సలహాలో నిజంగా చాల నష్టం ఉంది. దాన్ని ఆచరించాలనుకునేవాడికేమో లోపల మనస్సు పీకుతూనే ఉంటుంది చూడాలని. కాని సలహా పాటించాలి గదా! కాబట్టి చూడు, చూడకు అనే పోరాటం వాడి మనస్సులో కలుగుతుంది. ఇది ఎలా ఉంటుందంటే ఎడమ చేయి కుడిచేయి పరస్పరం జగడం చేసుకున్నట్లుగా ఉంటుంది. ఇదంతా వట్టి అవివేకం. ఈ అవివేకపు సాధనలవల్ల 'అహం' మరింత బలపడడం తప్ప మఱొక ప్రయోజనం లేదు. ఈ చూడడం అనేది నీ నయనపథంలో యాదృచ్ఛికంగా తారసపడే వారి విషయంలోనే సుమా! ''భగవంతుని సుందరవిభూత్యావిర్భావ దర్శనార్థం'' సందులు గొందులు పనిగట్టుకొని తిరగమని నేను చెప్పడం లేదు. అలా తిరగడం కోతిచేష్ట అవుతుంది. ఇక మాటల విషయం: **అవసరం ఉంటే మాట్లాడు. లేకుంటే మాట్లాడకు** – నియమం. ఈ నియమం సర్వత్ర పాటిస్తే చాల మంచిది. ఎవడో ''పలుకే బంగారమా!'' అన్నాడు. పలుకు బంగారం కాకపోయినా బంగారంలా వాడుకోవడంలోనే నేర్పు ఉంది. బంగారం పిసినిగొట్టు చేతిలో ఎందుకూ ఉపయోగపడదు; దుబారాకోరు చేతిలో దుర్వినియోగం అవుతుంది; పొదుపరి చేతిలో సద్వినియోగం అవుతుంది. మాటల విషయంలోనూ ఇంతే. మధ్యేమార్గమైన మాటల పొదుపరితనం ఉండాలి. అవసరం వస్తే మాట్లాడు. అంతవఱకే మాట్లాడు. మాటలు పొడిగించవద్దు. మాట్లాడే ఉద్దేశమే లోపల పెట్టుకొని పైకిమాత్రం ఏదో ఒక నెపం కల్పించుకొని పోయి మాట్లాడవద్దు. మాట్లాడేటప్పుడు మాట్లాడే ప్రతిమాట ఎందుకు, ఏం ప్రయోజనం కొఱకు అనే గమనికతో మాట్లాడు. ఏవిధంగా మాట్లాడుతున్నావో అనే ఎఱుక (Awareness) కూడ ఒకవైపు ఉండనీ. ఇలా జాగ్రత్త పడ్డావంటే అర్థరహిత ప్రలాపం, అసంబద్ధప్రలాపం, అధికప్రలాపం, ఉబుసుపోక ప్రలాపం—ఈ అన్ని దుబారా ప్రలాపాలకు దూరం అవుతావు. దానివల్ల మనస్సుకూడ చాలవఱకు శాంతంగా ఉంటుంది. అదిగో ఆవులు వస్తున్నాయి. నీకు పని తగిలింది. ఇక నిలుపుదాం. ఈ ప్రస్తావన ఈరోజు ముగించేసి వేఱే విషయం రేపు తీసుకోవాలనుకున్నా. అయినా చెప్పవలసింది కొఱత కొంత మిగిలిపోయింది. దాన్ని రేపు తప్పక ముగించేసి ఆ మర్నాడు వేఱే విషయం తీసుకుందాం.

-(:o:)—

# సౌందర్యశోభా సంక్రాంతి

## డాక్టర్ టి. ఆర్. కృష్ణన్

జ్యోతిశ్శాస్త్రంలో దివాకరుని దివ్యయాత్రా ఘట్టాలు మేష, కటక, తులా, మకర, సంక్రమణములు. స్వక్షేత్రం సింహరాశి. మేష రాశి ఉచ్ఛస్థానం. రవి మేషాది పన్నెండు రాసుల్లో నెలకొక రాశిగ సంచరిస్తాడు. ఆ రాసుల్లో మకరరాశి ముఖ్యము. ఈ రాశిలో రవి ప్రవేశించిన కాలమే సంక్రాంతి. మకర సంక్రాంతికి వెనుక ముప్పదిరోజులూ ఆదిత్య దేవుడు ధనూరాశిలో వుంటాడు. ఈ మాసాన్ని మకరమాసమని కూడ పిలుస్తారు. ప్రభాకరమూర్తి ఈ మజిలీ చేరగానే ప్రకృతి పులకించి పరిపరివిధాల విలాసాల చూపుతుంది. ఆ ఫలితమే సశ్యశ్యామలం. పంటకారును బట్టి ఒకపుడు సంవత్సర కాలపరిగణన ఉండేది. హేమంతరువాతనుండి, మార్గశిరమాసంనుండి, నూతనసంవత్సరం లెక్కగట్టే వారు. మార్గశిరమాసాన్ని 'అగ్రహాయణికమ్' అని అన్నారు. అంటే అగ్రమందు—హాయనం-సంవత్సరము అని విశదమవుతుంది. సంవత్సరారంభం అని చెప్పక నే చెప్పుచున్నది. మార్గశిరామాసంలో వచ్చే మకరసంక్రాంతిని ఒకపుడు ఉగాదిగ కొనియాడినట్లు గ్రంథముల ద్వారా తెలుస్తున్నది. అందుకేనేమో శ్రీనాథకవి సార్వభౌముడు మకరసంక్రాంతిని 'పెనుబంధువు' అన్నాడు. శ్రీ కృష్ణభగవానులవారు పంచ సహస్రవర్షములనాడు విజయునకు గీతాబోధ చేస్తూ ప్రసంగవశంలో 'మాసానాంమార్గశీర్షోహం' అన్నాడు.

సంక్రాంతి పండుగ సూర్యునికీ, సూర్యోపాసనకూ ప్రధానసంబంధం కలిగినది. ఇది సూర్యగమనములో ఒక మార్పును సూచిస్తుంది. సంక్రాంతి ప్రారంభదినమునకు రెండు వారములకు మునుపే భానుమూర్తి ఉత్తర దిక్కుగ పయనం సాగించియుంటాడు. కాని ఆయన పుష్యశుద్ధపూర్ణిమరోజు ప్రవేశించి నప్పటినుండిగాని ఉత్తరాయణము ప్రారంభించడం జరగదని భారతీయుల భావన.

1. భోగి 2. సంక్రాంతి 3. కనుము 4. ముక్కనుము అని నాలుగురోజుల విశిష్టాతి విశిష్టమైన ఆంధ్రులపండుగ సంక్రాంతి.

భోగి :- శ్రీరామచంద్రుడు హనుమసుగ్రీవాది వానరసేన సహకారంతో ప్రకృతిస్వరూపిణియైన సీతామాతను తీసికొనిపోయిన లంకాధిపతి దశగ్రీవుని దునుమాడినాడనీ, తద్రావణ శవదహన సూచనగ వాడవాడ, వీధివీధిలోను హెనుమంటలు చేసెదరు. భోగి అనే పదం పోగు, పొంగు అనే తెలుగు ధాతువునుండి సంస్కృతీకరింపబడిన మాట. అందులకే నిరుపయోగ వస్తువులను చేర్చి, కాల్చి మంగళస్నానాలు చేయడం. మత్స్యపురాణం సంక్రాంతి వ్రతం గురించి తెలియచేస్తూ స్త్రీపురుషులు సంక్రాంతికి ముందుదినం మాత్రమే భుజించి మరునాడు కాలకృత్యాద్యనంతరం తిలాజలంలో స్నానం చేయాలన్నది. ప్రాతస్సమయాన లేచి అభ్యంగనాదికాలు నిర్వర్తించుకొని, ముద్దుగుమ్మలు ముంగిళ్ళపాడుకునే గొబ్బిపాటలలో గోపాలుని స్మరణము, గోపాలుని భక్తిజీవి గోవుగణ్యత విశదమగుతుంది. గొబ్బి అనే శబ్దం గోపి, గోవు అనే శబ్దాల వికృతిరూపమని వుండడముతో గొబ్బిపాట లంటే పరోక్షంగా గోపికాగీత లే.

భోగమంటలలో వెలుగొందే సామ్యవాద కౌటుంబిక జీవనము నయనానందకరమే!

సంక్రాంతి :- దీనిని గురించి ఆధ్యాత్మిక

గ్రంథమైన నాగరఖండము "రవేః సంక్రమణం రాశౌ సంక్రాంతిరితి కథ్యతే" అని, తత్ర మేషాదిషు ద్వాదశ రాశిషు క్రమేణ సంచరతః సూర్యస్య పూర్వస్మాద్రాశేరు తర రాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః' అని జయసింహ కల్పద్రుమ గ్రంథమూ అభిభాషిస్తున్నవి. సంవత్సరములో ప్రతిమాసము వచ్చే సంక్రాంతిని కూర్చుకొనగ వచ్చు పన్నెండు సంక్రాంతులను నాలుగు తెగలుగ విభజించి మొదటి తెగలోని అయనసంక్రాంతులలోని మకర (ఉత్తర) సంక్రాంతిని సర్వోత్కృష్ట, సర్వజనానంద సంధాయిగా భావింపబడుచున్నది. ఈ పండుగ ప్రతిసంవత్సరము జనవరి పదునాల్గవ తేదీననే వస్తుంది. ఇదే దీని క్రమ విశిష్టత. ఈరీతిగ మరే పండుగకు లేని లక్షణంతో పండుగలలో కెల్ల ఖచ్చితమైనదని పేరు సంపాదించుకొన్నది. మన పూర్వీకులు స్వర్గలోకంనుండి భూలోకమునకు దిగివచ్చి, మనం చేసి అట్టిపెట్టిన పిండివంటలను భుజించి వెళ్ళుతారని నమ్మకం. పెద్దలు(పితృదేవతలు) వస్తారని ఇంటింటికి వెల్ల వేసి ముస్తాబుచేయుటం. పిండివంటలు పెట్టి. కొత్తబట్టలు చూపిస్తూ కొన్ని ఘుడియలవరకూ వీధిగుమ్మం బంధిస్తూ నిశ్శబ్దంగ వుంటారు. అట్లా చేస్తే పెద్దలు వచ్చి ఆ వంటల నారగిస్తారని. ఆ రాత్రి చిక్కుడుగింజలతో రథం తయారుచేసి, వాకిటిలో ముగ్గులు వేసి, ఆ రథమును వుంచి, హారతులతో పెద్దలను స్వర్గానికి సాగనంపుతారు. పూర్వమొకప్పుడు వాస్తవికంగానే పెద్దలు మానవస్వరూపంలోనే వచ్చి, ఆరగించి, ఆ రోజంతా ఇక్కడే కాలక్షేపం చేసిపోయేవారట! పెద్దలు గుమ్మం దగ్గరికి వచ్చిన వెంటనే ఆ యింటి యజమానురాలు కాళ్ళుకడిగిన నీటిని వత్తుకోకుండ తడికాళ్ళతోనే వుండి, తడి ఆరగనే వెళ్ళుతుండేవారట! దేవేంద్రుడి ఆజ్ఞ అంతవరకేనట. కాని వారిపుడు దృశ్యరూపంతో రాక అదృశ్యంగ రావడానికి ఈ క్రింది సంఘటనయే కారణమని తెలుస్తోంది.

ఒక నూతన దంపతుల జంటలోని భర్త చనిపోగా యథాప్రకారంగ భర్త స్వర్లోకం నుండి సంక్రాంతిరోజు వచ్చాడు భూలోకానికి. ఆ అమ్మాయి అందరివలె కాక కాళ్లుకడిగే నీటిలో ఆముదమును బాగా రంగలించి కలిపి పోసింది. అందరు భూలోకంనుండి తిరిగివచ్చినా ఈ నూతన వైవాహికానంతరము మృతుడైన యువకుడు రాలేదు. కారణము తడిఆముదం మూలంగ ఆరకపోవడమే. ఎంతకూ తడి ఆరితేగా! ఈ విషయం తెలిసిన ఇంద్రుడు అప్పటినుండి సంక్రాంతిరోజు మృతజీవులు భూలోకానికి మానవశరీరరూపంతో వెళ్ళకూడదని, అదృశ్యరూపంలో వెళ్లాలని శపించాడట! అంమవలన అదృశ్యరూపంగానే పెద్దలు వస్తారని మనవారి నమ్మకము.

సంక్రాంతిరోజు కాలకృత్యాద్యనంతరము తిలాజలంతో స్నానమాచరించి, మూడుపాత్రలలో యమ, రుద్ర, ధర్మదేవతల ప్రీత్యర్థం ఆహారసంభారములను ధేను సహితంగా సద్విజుసికి దానం చేయాలి. భూ, గో, దేవతల పూజల అంతరార్థం గల ఈ కార్యకలాపము నరులకు కైవల్య సంధాయి. ఉత్తరాయణ పుణ్యకాలమున నువ్వులను సద్విజులకు దానమొసగినవారు సహస్రధేనుదాన ఫలితాన్నందుకుంటారని, పితృదేవతలు తద్వారా తనివినొందెదరని, భీష్మాది సత్పురుషాది పుణ్యమూర్తులు తరించినది ఈదినాన్నేనని పౌరాణిక కథన ప్రతీతి. ఇక ఆనాడు దాసర్లు, జంగం దేవర్లు, గంగిరెడ్లవారు, అడవిచెంచులు, ఆబోతులసరదాలవారు, బుడబుడక్కలవారు, ఇంకా

ఇంకా అనేకరకాలవారు చేసే హడావుడి అనుభవైకవేద్యమే కదా!

కనుము :- మూడవనాడైన కనుమునాడు రైతులు తమ కృషికి ఆధారభూతమైన పశువులను శుభసూచకములైన పసుపుకుంకుమలతో నలంకరించి, మేళతాళాలమధ్య అర్చించి, ఈ పండుగనాడు వాటికి తమ కృతజ్ఞత నర్పించుకుంటారు. ఇంతటితో ముగియలేదు. వ్యావసాయపరికరములకు పొంగళ్ళను నైవేద్యం పెట్టి, పూజించిన తదుపరి పొంగలి మెతుకులను పొలాల్లో చల్లుతారు. దీన్నే 'పొలి చల్లడం' అంటారు. ఈ చల్లడాన్ని మొసర్లు అని కూడ పిలుస్తారు. మొసర్లు అంటే మెతుకులు. మొసర్ల పండుగ అపభ్రంశమై 'మొసళ్ల' పండుగ అయిందనిపిస్తుంది. పొలి చల్లిన అనంతరం గుమ్మడికాయను దిగదుడిచి, పగలకొడ్తారు. ఇది పశుబలికి ప్రత్యామ్నాయం. సాయంకాలం పశువుల ఊరేగింపు. పొలిమేర మైదానాల్లో ఎడ్లపరుగుపోటీలు కోడి పందాలు, పొట్టేళ్ళపందేలు, వగైరాలు వారి వారి వీలునుబట్టి జరుపుతారు. ఈరోజు కొన్ని ప్రాంతాల్లో స్త్రీలు పుట్టినింటి క్షేమం కోరి 'కాకిపిడచలు' పెడ్తారు. ఇది ఒక విధమైన వ్రతం. దీనిని స్త్రీలు మంత్రరహితంగ తమ తమ పితృదేవతలకు చేసే శ్రాద్ధంవంటిదంటారు.

ముక్కనుము :- ఈ రోజుకూడ పశువుల సంబరం వుంటుంది. ఈ పండుగరోజులో స్త్రీలు చేసే వ్రతములలో గొబ్బి గౌరి వ్రతంముఖ్యం. దీనిని భోగినుండి మూడునాళ్ళు జరిపి, నాల్గవ నాడైన ఈ ముక్కనుమునాడు దాపుననున్న చెరువులోనో, మరే జలాశయంలోనో ఆ దేవతను ఓలలాడిస్తారు. భోగినుండి పదిరోజులూ బొమ్మలకొలువు పెడ్తారు. సంక్రాంతి పండుగ నూతన కృషికి ప్రోదికావడం వలన సృష్టికే విమోచన కాలమని, అందుకే 'సంక్రాంతికి సంకెళ్ళలో నున్నవారికి కూడా విడుదల' అనే సామెత. ఈ పండుగ జరుపుకొని తరించడమే మన వంతు కర్తవ్యం వక్తవ్యం కూడ. గీతాసారం 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' కదా!

### శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4, జనవరి నెల విశేషకార్యక్రమములు

| | |
|---|---|
| 1 వ తేది శుక్రవారము | స్వామి శారదానంద జయంతి - కల్పతరుదినము |
| 6 వ తేది బుధవారము | వైకుంఠ ఏకాదశి |
| 14 వ తేది గురువారము | మకర సంక్రాంతి |
| 16 వ తేది శనివారము | స్వామి వివేకానంద జయంతి |
| 17 వ తేది ఆదివారము | స్వామి వివేకానంద జయంతి - బహిరంగ సమావేశము |
| 20 వ తేది బుధవారము | ఏకాదశి |
| 27 వ తేది బుధవారము | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 29 వ. తేది శుక్రవారము | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 30 వ తేది శనివారము | శ్రీ శ్రీ సరస్వతీపూజ (వసంత పంచమి) |

# గోవర్ధనోద్ధారణ

కుమారి పి. రాజ్యలక్ష్మి

భగవంతుడు వ్రజములో పుట్టినది మొదలు సమస్త వ్రజమండలము, లక్ష్మికి క్రీడాస్థలమైంది. అచ్చటికే వచ్చి లక్ష్మీదేవి, బహిరంగముగా ఆడసాగింది. లక్షలకొలది గోవుల వెన్నను దాచుటకే స్థలము లేకపోయింది. అప్పుడు భగవానుడు ఇంద్ర పూజను మాన్పించి, గోవర్ధన పూజను చేయించాడు. ఇంద్రపూజ నెందుకు మాన్పింపవలసి వచ్చింది? ఇంద్రుడు పూజార్హుడు కాడా అని అనుమానం రావచ్చును. కాకేమి? పూజార్హుడే. అతడు దేవతలకు రాజు. వర్ణాశ్రమాచారపరులు అతనిని పూజించి తీరవలసినదే. కానీ, అతని ఎదురుగా, భగవంతుడు వుండగా, అతనికి పూజ జరుగకపోయినా బాధ లేదు. దేవేంద్రుని గర్వాన్ని అణచటానికి అతనిపైన యింకొకడున్నాడని తెలపటానికే భగవంతుడు ఈ విధంగా చేసాడు. ఇంద్రుడు చేసిన పొరపాటు ఏమిటంటే భగవంతుని కూడ సామాన్య గోపబాలుడని తలంచుట, తానే సర్వ శ్రేష్ఠుడనే గర్వం కలిగి వుండటమే. కావున గర్వహారి అయిన హరి, వాని గర్వమును హరించుటకు ఈ వినోదమును రచించాడు.

ఇంద్రయాగము చేయతలచి, తన వద్దకు వచ్చిన నందాది గోపవృద్ధులను చూసి కృష్ణుడు యిలా అన్నాడు — ''మీరు ఇంద్రయాగము చేయ తలపెట్టారు, బాగానే వుంది. మరి ఈ యాగము చేయుట వలన వచ్చే ఫలమేమిటి? అసలు ఈ యాగానికి అధిపతి ఎవరు?'' పుత్రుని మాటలను విని నందుడు యిలా అన్నాడు— 'ఈ యాగానికి అధిపతి దేవేంద్రుడు. యాగము చేస్తే, ఇంద్రుడు సంతృప్తి చెందును, ఇంద్రుడు తృప్తిచెందితే, వానలు బాగా కురుస్తాయి, వాన కురిస్తే పచ్చికపపుగా పెరిగి, ధేనువులు బ్రతుకుతాయి. ధేనువులు బ్రతికితే ఘనమైన పాడిసంపద కలిగి మానవులు ఆనందముగా జీవిస్తారు.'' తండ్రి మాటలు విన్న కృష్ణుడు నవ్వుకొని, యిలా అన్నాడు—''కర్మవశమున జంతువులు పుట్టుట, గిట్టుట జరుగుతుంది. కర్మయే జనులకు దేవత, కర్మయే సుఖదుఃఖములకు కారణభూతులు. కర్మకు సర్వ జీవులు బద్ధులు కావలసినదే. కాబట్టి, కర్మ చేతిలోనే అంతా వుండగా, యిప్పుడు ఇంద్ర పూజలు చేయుటవలన వచ్చేదేమీ లేదు.''

మేరా కహ్యో సత్య కరి జానో।
జొ చాహౌ వ్రజ కీ కుశలాయీ, తౌ గోబర్ధన మానౌ॥

[కృష్ణుడు, నందునితో యిలా అనసాగాడు.]
''తండ్రీ! మీరు బృందావనముయొక్క మంచిని కోరేవారే అయితే, నా మాటలు విని, గోవర్ధన పర్వతాన్ని దైవముగా ఎంచి, దానికి పూజలు కావించండి. గోవర్ధన పర్వతానికి పూజలు చేయటము వలన మీ గోసంపద వృద్ధి చెందుతుంది. ఇన్ని ఏళ్ళనుండి ఇంద్రుడికి పూజలు చేస్తున్నారు, ఈ పూజల వలన మీరు ఏం పొందగలిగారు? కాబట్టి యిక మీ పట్టుదల మాని, గోవర్ధనగిరిని పూజించి మీ మీ సంపదలను పెంపొందించుకోండి. మీ కోరికలు నెరవేరాలని, మీరు అనుకుంటుంటే, నా మాటలను సత్యముగా భావించండి.''

నందుడికి, కృష్ణుని మాటలలో సత్యము గోచరించింది. బ్రాహ్మణులను పిలిచి గోవర్ధన పూజకు కావలసిన ఏర్పాట్లను కావించాడు నందుడు. ఈ విధముగా ఇంద్రయాగములో ఈయవలసిన భాగమును గోవర్ధనగిరి రాజమునకు యిప్పించాడు శ్రీ కృష్ణుడు. గోవర్ధన పర్వతము ఎంత ఎత్తున వున్నదో, అంత ఎత్తున

అన్నం రాశిగా పోసారు. రకరకములైన పిండి వంటలను, నైవేద్యముగా సమర్పించారు.

గిరివర శ్యామ కీ అనుహారి।
కరత భోజన అధిక రుచి యహ, సహస భుజా పసారీ।

"శ్రేష్ఠమైన గోవర్ధన పర్వతము, కృష్ణుని స్వరూపమే. కృష్ణుడు, శైలరూపములో నందాదులు సమర్పించే నైవేద్యాన్ని అందుకొన్నాడు. రాధకు, గోవర్ధనగిరి కృష్ణ రూపముగా కనిపించ సాగింది. రాధ, కృష్ణుని ఈ రూపాన్ని చూసి ఆశ్చర్యపడసాగింది. కృష్ణుడు మటుకు ఏమీ తెలియని అమాయకుడిలా నమస్కరించాడు."

ఈ విధముగా గోపకులు, హరి సమేతులై గిరికి పూజ చేసి, ఉపహారములను సమర్పించి, బ్రాహ్మణ ఆశీర్వాదవచనములతో గిరికి ప్రదక్షిణము చేసి అత్యంత ఆనందమును అనుభవించారు. ఈ విధముగా పర్వత ప్రదక్షిణము చేసి గోపకులు ఆట-పాటలతో హాయిగా వుండటం చూసిన మహేంద్రుడు కోపోద్రిక్తుడయ్యాడు.

వ్రజవాసిని మోకొ బిసరాయో।
భలీ కరీ బలి మేరీ జో కథు, సో సబలై
పరబత హి చఢాయో॥

"బృందావన వాసులు నన్ను పూజింపకుండా, గోవర్ధనగిరిని పూజించి, నన్ను అవమాన పరచారు. తుచ్ఛమానవులు అమితమైన గర్వముతో నన్ను తూలనాడుతారా! ముప్పదికోట్ల దేవతలకు అధిపతినైన నన్ను కాదని కృష్ణుని ప్రేరణతో గిరిని పూజించారు. దీనికి తగిన ప్రతిఫలము వీరు తప్పక అనుభవించి తీరవలసినదే. ఇక ఈ గోపకులను ప్రాణాలతో వదలను. వీరికిప్పుడు గోవర్ధనగిరి ఎలా సహాయము చేస్తుందో చూస్తాను."

ఈ విధముగా దేవేంద్రుడు, ప్రళయకాల రుద్రునిలాగా, ఆవేశముతో తన సైన్యములైన మేఘములను పిలిచి, బృందావనమును వర్ష ధారలతో నేలమట్టము చేయమని ఆజ్ఞాపించాడు.

గిర వర బిరథన లాగే బాదర।
మేఘవర్తా, జలవర్తా సజి, ఆయె లై-లై ఆదర॥

"గోవర్ధనగిరి మీద నల్లని మేఘాలు ముసిరాయి. 'మేఘవర్త' 'జలవర్త' అనే పేరుగల ప్రళయకాల మేఘాలు, తమ సైన్యాన్ని వెంట పెట్టుకొని వచ్చాయి. అఖండమైన నీటి ధారలతో భూమి చిల్లుపడుతుందా అనేలాగా వర్షం కురియసాగింది. మేఘాలు ఇంద్రుని ఆజ్ఞను పాలిస్తూ తమ ధారలతో, గోవర్ధనగిరిని, భూమితో కలిపివేయటానికి ప్రయత్నించ సాగాయి. ఈ అకాల వర్షాన్ని చూసి బృందావన వాసులు భయపడసాగారు. ఇంద్రునికి పూజ చేయకుండా ఉపేక్షించటము వల్లనే తమకు యింతటి కష్టము వచ్చిందని బాధపడ సాగారు. కృష్ణుడు, కళ్ళెత్తి ఒకసారి ఆకాశం వైపు చూసాడు కోపంగా. 'మీరు మహేంద్రుని ఉపేక్షించారు కాబట్టే మిమ్ములను ప్రాణాలతో ఒదలము' అని మేఘాలు తమతో చెపుతున్నట్టుగా అనిపించ సాగింది కృష్ణునికి."

వర్ష ధారలకు ఆగలేక బృందావనవాసులు భయంతో యిటూ అటూ పరుగెత్తసాగారు. కొంతమంది తమ – తమ గోవులను తీసుకొని, వనాలలోకి పరిగెడితే, మరి కొందరు, తమను తాము రక్షించుకోవటానికి చెట్లను ఆశ్రయించ సాగారు. నందాది గోపవృద్ధులు ఏం చేయాలో, ఎలా తమ ప్రాణాలను రక్షించుకోవాలో తెలియని అయోమయావస్థలో పడ్డారు. చివరకు అందరు కృష్ణుని వద్దకు వచ్చి యిలా అన్నారు.

రాఖి లేహు అబ నందకిశోర ।
తుమ జో ఇంద్ర కీ మేటీ పూజా, బరసత హై
అతి జోర ॥

"'కృష్ణా! ఈ ఆపదనుండి మమ్ములను యిక నీవే రక్షించాలి. నీవు మమ్ములను ఇంద్రునికి పూజ చేయనీయకుండా చేసావు. దానికి ప్రతిఫలం యిప్పుడు అనుభవిస్తున్నాం. వ్రజవాసులందరు, నీ మీద ఆశ పెట్టుకొని, చకోరము చంద్రుని చూసినట్టుగా నీవేపు చూస్తున్నారు. కృష్ణా! ఇక నీవు తప్ప, మమ్ములను ఈ భయంకర ప్రళయాన్నుంచి రక్షించే వారు ఎవరూ లేరు.' గోపకుల మాటలు విని, కృష్ణుడు యిలా అన్నాడు. 'మీరు ఏమీ భయపడవద్దు. ఈ ఆపదనుండి నేను మిమ్ములను తప్పక రక్షిస్తాను. గోవర్ధనగిరిని, చిటికెన వ్రేలు మీద ఎత్తి మీ భయాన్ని తీరుస్తాను. ఇంద్రుడు మన మీద కోపంతో ఎంతటి వర్షం కురిపించినా, ఒక్క చుక్క కూడ మీ మీద పడకుండా మిమ్ములనురక్షిస్తాను! నన్ను నమ్ముకున్న వారిని, నేనెన్నడూ కష్టాలపాలు చేయను.'"

శ్యామ లియో గిరిరాజ ఉఠా యీ ।
ధీర ధరౌ హరి కహత సబని సౌ, గిరి గోవర్ధన
కరత సహా యీ ।

"శ్యామసుందరుడు, గోవర్ధనగిరిని, తన చిటికెన వ్రేలుతో ఎత్తాడు. [కృష్ణుడు, అందరితో యిలా అన్నాడు] 'మీరు ఏమీ అధైర్య పడవద్దు, మీరు పూజించిన గోవర్ధనగిరి, మీకు తప్పక సహాయపడుతుంది. పసివాడు, యింత పెద్ద పర్వతాన్ని, తన వ్రేలు మీద నిలపగలడా! అని భయపడక, దీనికిందకు వచ్చి మీ ప్రాణాలను రక్షించుకోండి. ఈ గోవర్ధనగిరి తనను ఎత్తి మీ ప్రాణాలను రక్షించమని నాతో చెప్పింది. కాబట్టి మీరు నిర్భయంగా మీ ప్రాణాలను రక్షించుకోవచ్చును.'"



ఈ విధముగ పలుకుతున్న, కృష్ణుని పలుకులను విని, గోపకులు తమ – తమ భార్యా పిల్లలను, గోవులను తీసుకొని గోవర్ధనగిరి క్రింద తల దాచుకొన్నారు.

గిరి జని గిరై శ్యామ కే కరతై ।
కరత విచార సబై వ్రజవాసీ, భయ ఉపజత
అతి ఉర తై ॥

"గోవర్ధన గిరి క్రింద, తమ తలలను దాచుకున్నారే కానీ, గిరి, కృష్ణుని చేతినుండి జారి క్రిందపడుతుందేమోనని, గోపకులు భయపడసాగారు. చూడబోతే పర్వతము యింత పెద్దగా వుంది, కృష్ణుడా చిన్నవాడు, తొట్రుపాటుతో అది కాస్తా క్రిందపడితే! ఇలాటి భయముతోనే వారు, వారము రోజులు గడిపారు. అవిరామముగా కురిసి – కురిసి మేఘాలు అలసిపోయాయి. కృష్ణుడు, గోపికలను గోపకులను అఖండ జలధారలనుండి రక్షించాడు. ఈ విధముగా ఏడు రోజులపాటు తన చిటికెన వ్రేలు మీద గిరిని వుంచి గిరిధరుడు, ఇంద్రుని గర్వాన్ని అణిచాడు."

గోపాలుడు తన శ్రీ హస్తమును ఛత్రముగా కావించి అనాథలను, సనాథలను కావించాడు.

మేఘని జాయి కహీ పుకారి ।
దీన హ్వై సురరాజ ఆగై, అస్త్ర దీన్హే డారి ॥

"మేఘాలు, ఇంద్రుని వద్దకు వెళ్ళి తమ అస్త్రాలను అతని పాదాల వద్ద వుంచి, తమ పని అయిపోయిందని, తాము అలసిపోయామని మొర పెట్టుకున్నాయి. అంతేకాదు ఏడురోజుల పాటు, అఖండ వర్షాన్ని కురిపించినా, ఏమీ లాభం లేకపోయిందని వాపోయాయి. ఏకధారగా వర్షాన్ని కురిపించినా, ఒక్క చుక్క కూడ బృందావన వాసులమీద పడలేదని, యిందులో తమ తప్పు లేశమాత్రమైనా లేదని మొరపెట్టుకొన్నాయి. తమ కార్యము నెరవేరకపోవటానికి కారణం, శ్రీకృష్ణుడు గిరిని

ఎత్తి పట్టుకోవటమేనని, అవి మహేంద్రుడికి చెప్పాయి. ఈ విధముగా ఇంద్రుడి ముందు ఆర్తనాదాలు చేస్తూ మేఘాలు, తమను రక్షింపమని వేడుకొన్నాయి.''

ఇంద్రుడి గర్వం అణచి, నందాది గోప వృద్ధులతో కలిసి బృందావనానికి తిరిగి వచ్చాడు మాధవుడు. బృందావనములో ఎక్కడ చూసినా కృష్ణుని గురించిన చర్చలే! ఇంతటి చక్కటి పుత్రుని కన్నందుకు అందరూ నంద-యశోదలను పొగడసాగారు. యశోద మటుకు, ఏడురోజులపాటు అవిరామముగా కృష్ణుడు గోవర్ధనగిరిని ఎలా ఎత్తగలిగాడా అని ఆశ్చర్యపడసాగింది.

తే రౌ భుజని బహుత బల హోయి కన్హాయా ।
బార-బార భుజ దేఖి తనక సౌ, కహతి జసోదా మైయా॥

''యశోద, మాటి-మాటికి, చిన్నగా వున్న కృష్ణుని భుజాలను పట్టుకొని, 'కన్నయ్యా! నీ చేతులలో గిరిని మోసేటంత బలం వున్నదా!' అని అడిగింది. కృష్ణుడు, తల్లి మాటలకు మనసులో నవ్వుకొని 'అమ్మా! నేను అంత పెద్ద పర్వతాన్ని మోసేటంతటి బలవంతుడినా? గోపాలురు కూడ, తమ కఱ్ఱలను ఎత్తిపట్టుకొని నాకు సహాయపడ్డారు కాబట్టి నేను గిరిని పట్టుకోగలిగాను. అసలు నేను గోవర్ధన గిరిని ఎత్తగలనని నీవు ఎలా అనుకున్నావు? కారణం, అది చాలా పెద్దది, నేనేమో చిన్నవాడిని.' ఈవిధముగా కృష్ణుడు, తన మాటలతో తనను చూసి ఆశ్చర్యపడుతున్న తల్లిని సముదాయించాడు.''

శ్రీకృష్ణుడు, పరబ్రహ్మస్వరూపుడు. దీనుల పాలిట దయ కలవాడు. ధర్మానికి ఎప్పుడైతే హాని కలుగుతుందో, అప్పుడు తనకు తానే రూపాన్ని కల్పించుకొని, తన భక్తులను రక్షిస్తాడు. అలాంటివాడు, గోవర్ధనగిరిని ఎత్తాడు అనటములో ఆశ్చర్యమేమీ లేదు. యశోద అమాయకురాలు కాబట్టి, హరి తన పుత్రుడే అని అనుకుంటోంది కానీ, సర్వవ్యాపి అనుకోవటం లేదు.

సురగన సహిత ఇంద్రవ్రజ ఆవత ।
ధవల బరన ఐరావత దేఖ్యో ఉతరి గగనత్తై
ధరని ధసావత॥

దేవతాగణ సహితముగా, దేవేంద్రుడు బృందావనానికి వచ్చాడు. శ్వేతవర్ణములో వున్న ఐరావతాన్ని, ఇంద్రుడు దివినుండి భువికి తీసుకొని వచ్చాడు. శివుడు, బ్రహ్మ, దిక్పాలకులు, నారద-తుంబురులు కృష్ణుని స్తుతింపసాగారు. బృందావనములోనివారు దేవతాగణాన్ని చూసి భయకంపితులైనారు. గోపాలురు పరుగున వచ్చి, నందుడితో యిలా చెప్పారు – 'ఏడురోజులపాటు, అవిరామముగా వర్షం కురిపించినది చాలక, ఈరోజు మనలను సంహరించటానికి, దేవేంద్రుడు దేవతా సమేతుడై వస్తున్నాడు.' వారి మాటలు విని నందుడు వచ్చి చూసేసరికి, ఎదురుగా ఇంద్రాది దేవతలు, కృష్ణుని స్తుతిస్తూ కనిపించారు.''

మాధవుడు, కన్నులు తెరవని చిన్నపాపగా వున్నప్పుడే, తనకు పాలీయవచ్చిన పూతనను సంహరించాడు. మూడవనెలనాడు ముద్దు బాలుడయి, కోపించి శకటాసురుని నేల కూల్చాడు. ఏడాది కఱ్ఱవాడయి యెగసి తృణావర్తుని మెడపట్టుకొని కూల్చి, మృతుని చేసాడు. తల్లి తనను కోపించి రోటికి కట్టగా, మద్దివృక్షాలను నేలకూల్చి, కుబేరుని పుత్రులను శాపవిముక్తులను చేసాడు. ఇన్ని లీలలను చూపినవాడు, గోవర్ధనగిరిని ఎత్తి, ఇంద్రుని గర్వాన్ని అణచుటే కాక, వ్రజవాసులను రక్షించాడు అనటంలో ఆశ్చర్యమేమీ లేదు. కృష్ణుని లీలలను చూసి తన్మయులయిన బృందావనవాసులు ధన్యజీవులు.

**పై సంచికలో రాధాకృష్ణులు**

వివేక విద్యుత్తరంగాలు—6

# నైతిక జీవనానికి మూలం స్వార్థ త్యాగము

నీతిశాస్త్రం నిరంతరం 'నేను కాదు, నీవు' అని ప్రకటిస్తుంది. 'స్వార్థ రాహిత్యమే' దాని నినాదం. ఇంద్రియాలద్వారా అఖండశక్తి, అనంత సంతోషం కోసం ప్రయత్నించే మానవుడు అంటిపెట్టుకొని వుండే వ్యర్థ వ్యక్తిత్వ భావాలను నైతికసూత్రాలు విడనాడాలంటున్నాయి. నీవు యితరులందరికంటె వెనుక నిలవాలి. ఇంద్రియాలు 'నేను మొట్టమొదట' అంటాయి. నీతిశాస్త్రం 'నేను చిట్టచివర' అంటుంది. ఈవిధంగా భౌతికస్థితిలో, వ్యక్తిత్వ నిర్మాణం మీదగాక, నిర్మూలన మీద; త్యాగము మీద నీతిశాస్త్ర నియమావళు లన్నీ ఆధారపడి ఉన్నాయి. భౌతిక స్థాయిలో అనంతత్వపు వ్యక్తీకరణ అనేది అసాధ్యము, అనాలోచనీయము కూడ.

అందుచేత మానవుడు అనంతత్వపు గాంభీర్యాన్ని అన్వేషించటానికి భౌతికావస్థ నుండి ఇతర ఉన్నతావస్థలకు చేరుకోవాలి. ఇలా వివిధ నైతిక నియమాలు అన్వేషించబడినాయి. కాని అన్నింటిలోని మూలభావన ఒక్కటే— స్వార్థపరిత్యాగము. సంపూర్ణమైన స్వార్థ రాహిత్యమే నీతిశాస్త్రపు లక్ష్యం. వ్యక్తిత్వాన్ని విస్మరించమని కోరినట్లైతే ప్రజలు బెదిరిపోతారు. వారు తమ వ్యక్తిత్వమనుకొనేదాన్ని పోగొట్టుకుంటామేమోనని మిక్కిలి భయపడుతున్నట్లు అనిపిస్తుంది. వారే నీతిశాస్త్రపు అత్యున్నతాదర్శాలు సరియైనవని ప్రకటిస్తారు. కాని, నీతిశాస్త్రాలన్నింటి ఉద్దేశ్యం వ్యక్తిత్వాన్ని నిర్మూలించడమే. నిర్మించడం కాదని ఒక్కక్షణం కూడా యోచించరు.

ప్రయోజనవాద ప్రమాణాలు మానవుల నైతిక సంబంధాలను వివరించలేవు. ప్రయోజనవాదాన్ని స్వీకరించినట్లైతే అసలు మనం ఏ నైతిక సూత్రాలనూ గ్రహించలేము. మానవాతీతమైన ఆమోదం అని అందరూ వ్యవహరించేదాన్ని నేను అతీంద్రియ జ్ఞానమంటాను. అది లేకుండా నీతిశాస్త్రానికి అస్తిత్వం లేదు. అనంతత్వం కోసం ఆరాటం లేకుండా ఆదర్శం ఉండనేరదు. సామాజిక జీవన పరిస్థితులకు మానవులను పరిమితం చేసే ఏ వ్యవస్థా మానవాళి నైతిక సూత్రాలకు భాష్యం చెప్పలేదు. ప్రయోజనవాది మనలను భగవత్సందర్శనం కోసం చేసే కృషి మానమంటాడు. అతీంద్రియత్వ ప్ర— అసాధ్యము, అసంగతము అంటాడు. అందుకు బదులుగా నైతికతతో సమాజ సంక్షేమానికి సహకరించమంటాడు.

మనం సత్కార్యాలు ఎందుకు చేయాలి? సత్కార్యాచరణ రెండవ అంశం. మొదట మనకొక లక్ష్యం ఉండాలి. నైతికత అనేదే పర్యవసానం కాదు, అందుకు సాధనం మాత్రమే. లక్ష్యం లేకపోయినట్లైతే మనం నీతిమంతులుగా ఎందుకుండాలి? ఇతరులకు నేను ఉపకారం ఎందుకు చేయాలి? అపకారం చేయకూడదా? మానవాళి ఆదర్శం ఆనందమే అయితే నేను సంతోషం సమకూర్చుకొని యితరులకు దుఃఖం ఎందుకు కలిగించకూడదు? నాకు అవరోధం ఏముంది? రెండవపక్షంలో, ప్రయోజనానికి అవకాశం బహు స్వల్పంగా ఉన్నది. వర్తమాన సామాజిక ఆచార వ్యవహారాలన్నీ ప్రస్తుతసమాజంలోని పరిస్థితుల నుంచి ఏర్పడినవే. సమాజం శాశ్వతమని భావించటానికి ప్రయోజనవాదికి ఏమి హక్కున్నది? యుగాలకు పూర్వం సంఘం లేదు, యుగాంతరంలో ఉండకపోవచ్చు. బహుశ ఉన్నత పరిణామం వైపు మనం చేస్తున్న ప్రయాణంలో ఇదొక

వర్తమాన దశ అయివుండవచ్చు. కేవలం సమాజంనుంచి గ్రహింపబడిన నియమమేదీ శాశ్వతం కాదు; అది మానవ స్వభావాన్ని సమగ్రంగా సమన్వయించలేదు.

అందుచేత, ప్రయోజనవాద సిద్ధాంతాలు, మహాఅయితే, వర్తమాన సాంఘిక పరిస్థితులలో మాత్రమే పనిచేస్తాయి. అంతకు మించి వాటికి చెల్లుబడిలేదు. కాని మతం నుండి, ఆధ్యాత్మికతనుండి గ్రహింపబడిన నైతికత, నీతిశాస్త్ర నియమావళి తన పరిధిలో సంపూర్ణ మానవతత్త్వాన్ని యిముడ్చుకొని ఉంది. అది వ్యక్తిని పరిగణిస్తుంది. కాని దాని సంబంధాలు సర్వతోముఖంగా ఉంటాయి. అది సంఘాన్ని కూడా గుర్తిస్తుంది, ఎందుకంటే, సంఘమంటే వ్యక్తుల సమూహమే కదా! వ్యక్తికీ అతని శాశ్వతసంబంధాలకు వర్తించే నీతిశాస్త్రం ఏ పరిస్థితులలోనైనా నిర్ణీతసమయంలో సమస్త సమాజానికీ నిశ్చయంగా వర్తించాలి.

మనం ప్రపంచానికి ఋణగ్రస్తులము, ప్రపంచం మనకేమీ బాకీ లేదనే విషయం గుర్తుంచుకోవాలి. లోకోపకారం చేయడానికి మనకు మహదవకాశం లభించింది. లోకానికి హితం చేకూర్చడంతో నిజంగా మనకు శ్రేయస్సు ఒనగూడుతుంది. రెండవ అంశం: ఈ సృష్టి భగవన్మయము. ఈ ప్రపంచం దిక్కులేక నీనుండి కాని నానుండి కాని సాయం కోసం కాచుకొని లేదు. జగత్తు సర్వదా విష్ణుమయమై ఉన్నది. ఆయన అమృతమూర్తి నిత్యచైతన్యస్వరూపము. అఖండమైన జాగరూకత గలవాడు. లోకమంతా నిద్రిస్తున్నప్పుడు ఆయన మేల్కొని ఉంటాడు. నిరంతరం కార్యనిమగ్నుడై ఉన్నాడు. ప్రపంచంలోని మార్పులకు చేర్పులకు అన్నిటికీ ఆయనే మూలకారణము. మూడవది, ఎవ్వరినీ ద్వేషించరాదు. ఈ ప్రపంచం సర్వదా మంచిచెడుల మిశ్రమంగా ఉంటుంది. బలహీనుడిపట్ల సానుభూతి చూపడం, నేరస్థుణ్ణి సైతం ప్రేమించడం మన కర్తవ్యం. ఈ ప్రపంచమొక గొప్ప నైతిక వ్యాయామశాల. ఇందులో మనం ఆధ్యాత్మికంగా మరింత, మరింత బలవంతులమయేటట్లుగా సాధన చేయాలి. నాల్గవది, మనం ఏ విషయంలోనూ, దురభిమానగ్రస్తులం కాకూడదు. ఎందుకంటే దురభిమానం ప్రేమకు విరుద్ధం......ఇంకా, మనం ఎంత మవునంగా వుంటే మన నాడీశక్తి అంత సక్రమంగా పనిచేస్తుంది. మనం ప్రేమమూర్తులమవుతాము. మన కార్యనైపుణ్యం ఇతోధికమవుతుంది.

ఈ ప్రపంచంలో మీరు రకరకాల మనుషులను చూస్తుంటారు. మొదటిరకం వారు దివ్యపురుషులు. ఎవరి ఆత్మసుఖపరిత్యాగం సంపూర్ణమై, తమ జీవితాలను ఆహుతి చేసి కేవలం లోకారాధన చేస్తుంటారో అలాంటివారు ప్రథమశ్రేణికి చెందిన దివ్యపురుషులు. ఏ దేశంలోనైనా అలాంటివారు ఒక వంద మంది వుంటే చాలు, ఆ దేశం ఎన్నటికీ నిరాశ చెందనక్కరలేదు. కాని దురదృష్టవశాత్తు వారు బహు కొద్దిమంది. తరువాతివారు తమకు హాని కలుగనంతవరకు పరోపకారం గావించే సత్పురుషులు. మూడవతరగతివారు తమ [illegible]స్సు కోసం ఇతరులకు హాని చేసేవారు. కేవలం ఇతరులకు కీడు చేయడం కోసమే కీడు చేసే ఉచ్చరింపరాని అధమ (నాల్గవ) వర్గం

ఒకటున్నదని ఒక సంస్కృత కవి* పేర్కొన్నారు. ఒకవైపు కేవలం పరోపకారం కోసం పరోపకారం చేసే మహాత్ములు ఎలాగైతే ఉన్నారో, అలాగే మరోవైపు ఇతరులకు అపకారం కోసం అపకారం చేసే దురాత్ములున్నారు. తద్వారా వారికేమీ ప్రయోజనం ఉండదు, హాని చేయడం వారి స్వభావము.

రెండు సంస్కృతపదాలున్నాయి. ఒకటి ప్రవృత్తి, రెండవది నివృత్తి. మనం సంసారమని వ్యవహరించే "నేను, నాది" అనే భావన చుట్టూ తిరుగుతుండటమే ప్రవృత్తి. దాని నుంచి మరలడమే నివృత్తి. 'నేను' అనే కేంద్రం చుట్టూ ఐశ్వర్యం, అధికారం, పేరుప్రతిష్ఠలు, మొదలైనవన్నీ సమీకరించడం ప్రవృత్తిలో భాగం. ప్రియమైన తన చుట్టూ, అన్నివైపుల నుండి సర్వం సమీకరించుకోవడం మానవులలోని సహజ ధోరణి. ఈ ధోరణికి అంతరాయం ఆరంభమైనప్పుడు-నివృత్తి అలవడినప్పుడు-నైతికత, మతం మొదలవుతాయి. ప్రవృత్తి, నివృత్తి అనేవి కార్యస్వభావం తెలుపుతాయి. మొదటిది దుష్కార్యం. రెండవది సత్కార్యం. ఈ నివృత్తే నైతికతకు, మతానికీ తొలిమెట్టు. నివృత్తి సమగ్రమయితే స్వార్థత్యాగం సంపూర్ణమవుతుంది. మరో ప్రాణి కోసం తన సర్వస్వం త్యాగం చేయడానికి సంసిద్ధం కావడం...ఇదే సత్కార్యాల చరమఫలితం.

ఒకడు ఏ తత్త్వశాస్త్రం అధ్యయనం చేయకపోయినా, ఏ దేవుణ్ణీ, ఏ నాడూ విశ్వసించకపోయినప్పటికీ, జీవిత కాలంలో కనీసం ఒక పర్యాయమైనా దైవప్రార్థన చేయకున్నా, పరులకోసం తన జీవిత సర్వస్వం అర్పించడానికి సిద్ధమైతే, ఆ స్థితి కేవలం సత్కర్మల ప్రభావమే. మతాచార పరాయణుడు తన ప్రార్థనతో, వేదాంత జ్ఞానంతో చేరుకొన్న స్థితికి అతనూ చేరాడు......

ఇక్కడ మత సిద్ధాంతాల ప్రశ్నే లేదు.- అన్ని మతోద్దేశాలను తీవ్రంగా నిరసించేవారు సైతం సంపూర్ణ స్వార్థత్యాగం యొక్క ఫలితం చూసినప్పుడు దానికి నివాళులర్పిస్తారు.

భౌతిక వాంఛలు అధికాధికంగా యాంత్రిక క్రియల స్థాయికి దిగజారుతూ పాశవికమైన మానవుడికి సన్నిహితంగా ఉన్నాయి. అలాంటి ఇంద్రియ బంధాన్ని నివారించాలనే కోరిక జనించినప్పుడు మానవుని హృదయంలో మతం ఉదయిస్తుంది. మతం ఈ విధంగా ఇంద్రియాల

ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థముద్యమభృతః స్వార్థావిరోధేన యే
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ విఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే

—భర్తృహరి సుభాషితము.

తమ కార్యంబుఁ బరిత్యజించియు బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్
దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాస్వార్థభంగము గావించెడు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్

—ఏనుగు లక్ష్మణకవి ఆంధ్రీకరణము.

వలలో చిక్కుకోకుండా మానవుణ్ణి తప్పించి, తన స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకొనేందుకు అతనికి తోడ్పడుతుంది. ఆ లక్ష్యంవైపు ప్రథమ ప్రయత్నమే నైతికత. నైతికత పతనాన్ని నివారించి ఇంద్రియ బంధాన్ని ఛేదిస్తుంది. సదాచరణని విధిపూర్వకమూ, నిషేధపూర్వకమూ అని రెండు విధాలుగా విభజించవచ్చు. నీతి శాస్త్రం 'ఇది చేయవలసింది' అని గాని 'ఇది చేయవద్దు' అని గాని ఆదేశిస్తుంది. 'ఇది చేయవద్ద'ని నిషేధించినప్పుడు మానవుని బానిసగా మార్చే ఒకానొక వాంఛను నిరోధిస్తున్నది. ఫలానా పని 'చేయవలె'నని నిర్దేశించినప్పుడు మానవ హృదయాన్ని ఆవహించిన దౌర్బల్యాన్ని ఛేదించి మోక్షానికి మార్గదర్శనం చేస్తున్నది.

మానవుడు సాధించేందుకు విమోచనం అనేది ఉన్నట్లైతేనే నైతికత అనేది ఆవశ్యకం.

తనను తాను మనస్సుగాను, పదార్థంగాను కూడ అభివ్యక్తం చేసుకొంటుంది ఒక ప్రాణి. న్యాయమనే సుస్థిరమార్గం వెంట అది పయనిస్తుంది. ఏకత్వంగా అది స్వతంత్రము. అనేకత్వంగా న్యాయబద్ధము. ఇలా బంధంలో చిక్కుకొని ఉన్నా స్వేచ్ఛాభావం సదా మదిలో మెదులుతుంటుంది. దీనినే 'బంధ విమోచన' లేదా నివృత్తి అంటారు. వాంఛల ద్వారా మనలను సాంసారిక విషయాలలో క్రియాశీలకంగా పాల్గొనేట్లు నడిపించే భౌతిక శక్తులనే ప్రవృత్తి అంటారు.

సంసారబంధంనుంచి మనలను విముక్తం చేసే చర్య నైతికమైనది. అలా చేయజాలనిది అనైతికము.

ఏ నీతి శాస్త్ర విధానమైనా మీరు అవ్యక్త దైవభావన ద్వారా పొందవలసిందే. 'నీతోటి వారిని నీవలె ప్రేమించు' అనే సత్యం ప్రతి దేశంలోనూ అత్యంత ప్రాచీన కాలంనుంచీ బోధింపబడింది. భారతదేశంలో 'సమస్త జీవరాశినీ నీవలెనే ప్రేమించు' అని ఉద్బోధింపబడింది. మనుష్యులకు తదితర ప్రాణులకు నడుమ మనం వ్యత్యాసం చూపము. అయితే ప్రాణికోటిని మనవలెనే ప్రేమించటంవలన ప్రయోజనమేమిటో ఎవరికీ తెలియదు. అవ్యక్తమైన దైవ భావనకు కారణమేదో తెలియదు. ప్రపంచమంతా ఒకే కుటుంబమని గ్రహించినప్పుడు మనకు అది అవగతమవుతుంది-సృష్టిలోని ఏకత్వము, ప్రాణికోటిలోని సామ్యము-అంటే ఎవరినైనా నొప్పించటంలో నన్ను నేను నొప్పించుకొంటున్నాను; ఎవరినైనా ప్రేమించటంలో నన్ను నేను ప్రేమించుకొంటున్నాను. అందుచేత ఇతరులను ఎందుకు బాధించరాదో మన మనసుకు అవగతమవుతుంది. కాబట్టి నీతిశాస్త్రానికి మూలము అవ్యక్తదైవమే లక్ష్యమని గ్రహించవచ్చు.

(పై సంచికలో: నైతికత స్వయంగా పరమావధి కాదు స్వేచ్ఛ దాని లక్ష్యం)



# గుణత్రయ విభాగ యోగము

1. దేని తెలిసియు - మానులెల్లరు
ఈ సంసార - బంధమిడిచియు
ఉత్తమంబగు - మోక్ష సిద్ధిని
పొంది నారలో - ఆత్మ విషయము
జ్ఞానములలో - ఉత్తమంబగు
అట్టి జ్ఞానము - మరల జెప్పెద.

2. ఇట్టి జ్ఞానము - నాశ్రయించెడి
ఎల్ల జనులును - నన్ను జేరుచు
సృష్టి వేళను - జనన మందరు
ప్రళయ వేళను - నాశమందరు.

3. భూతకోటుల - జన్మస్థానము
మూల ప్రకృతి - దానియందున
గర్భహేతువు - బీజముంచెద
దాన స్వరము - జననమందు-నర్జున!!

4. సకల జాతుల - యే మూర్తులు
జనన మందునో - వాటికెల్లను
తల్లి ప్రకృతి - బీజమిడుటచె
తండ్రి నేనని, తెలియు మర్జున !!

5. సత్త్వ రజస్తమోనామములను
ప్రకృతి గల్గు - మూడుగుణములు
నాశమందని - ఆత్మ నెప్పుడు
కాయ మందున - కట్టివైచు-నర్జున !

6. గుణములందున - సత్త్వ గుణమది
నిర్మలంబై - వెలుగునిచ్చును
కలుగ దాపద - జ్ఞాన, సుఖాశచె
కట్టు జీవుని - పాపరహితుడ!

7. రజో గుణ మది - విషయ సుఖముల
రాగ, తృష్ణల - కలుగజేసియు
కర్మములచే - లెస్స ఆత్మను
కట్టివైచును - తెలియు మర్జున!

8. తమోగుణమది - అజ్ఞానముచె
కల్గి, మోహము - కలుగజేయును
మరపు, అలసత - నిద్రచె, లెస్స
కట్టు జీవుని తెలియు మర్జున!

9. సత్త్వగుణమది - సుఖమునందును
రజో గుణమది - కర్మలందును
తమో గుణమది - కప్పి జ్ఞానము
ఆపదలంగు - జేస్సు జీవుని.

10. రజో తమముల - అణచి సత్త్వము
సత్త్వ తమముల - అణచి రజస్సు
సత్త్వ రజస్సుల - అణచి తమమును
ప్రవర్తిల్లు నంచు - తెలియు మర్జున !!

11. దేహమందలి - ఇంద్రియ ద్వారముల
ఎపుడు కలుగునో - జ్ఞాన వెలుగది
తెలియు మప్పుడు - సత్త్వ గుణమది
వృద్ధి నొందిన - దంచు బాగుగ.

12. రజో గుణమది. వృద్ధి నొందగ
కలుగు లోభము - శాంతి లేమియు
కర్మ ప్రవృత్తి - బహుళ కోర్కెలు
మనుజు డొందును - తెలియు మర్జున!!

13. తమో గుణమది - వృద్ధి నొందగ
కలుగు నరునకు - మంద బుద్ధియు
అలసత్వమును - అజాగ్రతయును
అజ్ఞానమును - తెలియు మర్జున!!

14. సత్త్వగుణ మభి - వృద్ధి నొందగ
తనువు వెడలిన - జీవు డరయగ
అమలినములగు - ఉత్తమ జ్ఞానులు
పొందు లోకము - లందు నాతడు

15. రజో గుణ మభి - వృద్ధి గాంచగ
మరణ మందిన - మనజు డరయగ
జనన మందును - కర్మాసక్తుల
తమో గుణమభి - వృద్ధి గాంచగ
తనువు విడచిన - మనుజుడెపుడు
పశు, పామరుల - జనన మందును

16. సాత్త్విక కర్మ - ఫలము, నిర్మల
సత్త్వ సుఖమని - రజో కర్మల
ఫలము దుఃఖము - తామస కర్మ
ఫల మజ్ఞాన - మంచు చెప్పుదురు.

17. సత్త్వగుణముచె - కలుగు జ్ఞానము
రజోగుణముచె - కలుగు లోభము
తమోగుణముచె - కల్గెడు, మరపు
అజ్ఞాన, భ్రమలు - మానవులకును.

18. సత్త్వ యుక్తులు - ఊర్ధ్వలోకము
రజో యుక్తులు - మర్త్యలోకము
తమో యుక్తులు - అధోలోకము
పశుల జన్మల - నందుచుందురు.

19. ఎపుడు గుణముల - కంటె యితరము
ఎవడు కర్తగ - నెంచకుండను
ఆత్మ గుణముల - కంటె వేరని
అరయు జ్ఞానియె - మోక్ష మందును.

20. దేహాయునికికి - హేతు వయ్యెడు
ఈ గుణంబుల - దాటు జీవుడు
జన్మ, మృత్యు - జరా, దుఃఖముల
వదలి బాగుగ - మోక్ష మందును.

అర్జున ఉవాచ:-

21. గుణా తీతుని - తెలియ దగియెడి
గుర్తు లెయ్యవి? - వాడు నడచెడి
వర్తనెట్టిది? - మూడు గుణముల
దాటు టెట్టులో? - చెప్పు కేశవ!!

శ్రీ భగవాను ఉవాచ:-

22-25. సత్త్వ సుఖమును - రజో ప్రవృత్తి
తమో తంద్రత - ఎవడు పొందియు
ద్వేషమందడో - అవ్వి తొలగిన
తిరిగి కోరడో - తటస్థు డగుచు
గుణకార్యముల - చే చలింపడో
గుణ వర్తన - ఎరిగి బాగుగ
నిశ్చల చిత్త - వృత్తి నుండునో
సుఖదుఃఖముల - సమత గాంచుచు
ఆత్మ స్థైర్యము - నంది యుండునో
మట్టిరాయియు - కాంచనంబును
సమతగాంచునో - ప్రియాప్రియముల
సమత మెలగుచు - ధైర్యముండునో
నిందాస్తుతుల - సమతగాంచుచు
మానావ మా - నముల, తుల్యుడో
శత్రు మిత్రుల - సమత గాంచుచు
సర్వ కర్మల - కర్తృత్వ బుద్ధి
కలిగియుండడో - వాని చెప్పుదురు
గుణాతీతు - డంచు నర్జున!!

26. నన్ను యెవ్వడు - అచంచలమగు
భక్తి యోగము - చేత గొల్చునో
వాడీ గుణముల - లెస్సదాటుచు
అర్హుడయ్యెడి - బ్రహ్మమగుటకు.

27. నాశరహితము - నిర్వికారము
శాశ్వత ధర్మ - రూపమయ్యెడి
నిరతిశయానంద బ్రహ్మమె
నేనయి వెలుగొందుచుందును.

గేయరచన:- చీమకుర్తి వేంకటేశ్వర్లు

# సద్దర్శనము

వివరణము: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(క్రిందటి సంచిక తరువాయి)

భోద్ధారమాత్మానమజానతో యో
బోధః స కిం స్యాత్పరమార్థబోధః
బోధస్య బోధ్యస్య చ సంశ్రయం స్వం
విజానతస్తద్ ద్వితీయం వినశ్యేత్

ఆంధ్రానువాదం: ఈ తెల్సుకొనేవాడెవడో గ్రహించకుండా (ఆత్మయే అవి) సంపాదించిన జ్ఞానం నిజమైన జ్ఞానం అవుతుందా? ఆత్మను తెల్సుకోగానే ఈ తెల్సుకొనే వ్యాపారం అంతా తెలియబడే వస్తువుతోపాటు మాయం అవుతుంది.

వివరణము: మన అనుభవం అంతా మన అహంకారంగా, బుద్ధిగా, మనస్సుగా, శరీరంగా, ప్రపంచంగా - ప్రకాశించే ఆత్మయే.

ఈ గుంపులో మొదటిది అహం-కారం. దాని స్పందనలే, ఆలోచనలన్ని. ఈ ఆలోచనల సముదాయమే, ప్రవాహమే మనస్సు. మనం ప్రపంచం అని వ్యవహరించేది కూడా మనస్సు మీద స్పందనయే కాబట్టి, దీని బతుకంతా మనస్సు మీద ఆధారపడి వుంది. అది లేకపోతే ఇది లేదు. ఇక్కడ మనస్సు అంటే నీ మనస్సు నా మనస్సు కాదు. అసలు మనస్సనేది ఒకటే వస్తువు. అది ఎవడు గ్రహిస్తే, వాడు ఇది తనదే అనుకొంటాడు. ఇక్కడ మనస్సుయొక్క తత్త్వం వివరించబడ్డది ఇక్కడ విశేషం ఏమిటంటే ఈ ప్రపంచాన్ని తన స్పందనం వల్ల బయటపెట్టినప్పటికి ఇది తనకంటే వేరైనదీ, నిజమైనదీ అని మనస్సు అనుకొంటుంది ఇదే అవిద్యన్నా, అజ్ఞానం అన్నా! ఇదే మానవుడిని పిల్చి పిప్పి చేసేది! ఈ అహంకారాదులతో కూడుకొన్న వ్యక్తి ప్రపంచ వ్యవహారంలో గణితం, వైద్యం, సాహిత్యం మొదలైన ఎన్నో విషయాలు లౌకికజ్ఞానంతో సంబంధించినవి గ్రహిస్తుంటాడు. ఈ ప్రపంచజ్ఞానం అంతా తన మానసిక వ్యాపారం తప్ప వేరేమీ లేదని, ఇదివరకు చెప్పుకున్నాం కదా. కాని ఈ వ్యక్తి ఇది మరచిపోయి లోకవ్యవహారం అంతా చేస్తాడు.

శ్రీ భగవాను అడిగే ప్రశ్నేమిటంటే ఈ ప్రపంచాన్ని గురించి నీవు సంపాదించిన తెలివితేటలు అన్నీ ఇవన్నీ, వీటన్నిటికీ మూలమైన నీ ఆత్మనుంచే వస్తున్నవని గ్రహించకపోతే ఈ తెలివితేటలకు విలువ ఏమిటి? ఏవిషయమైనా తెలుసుకోవాలంటే మూడు పరికరాలు కావాలి. కర్త, కర్మ, క్రియ. తెలుసుకొనేవాడు, తెల్సుకొనబడేవి, తెల్సుకొనే క్రియ. మనం ఏవిషయమైనా మన మనస్సులో స్పందన వల్లనే తెలుసుకోగలం. మన ముందర ఒక ఆవు నిలుచున్నదనుకోండి అదిఎంతసేపైనా నుంచోవచ్చును కానిమన మనః స్పందనం వల్లనే అది ఆవు అనే జ్ఞానం కలుగుతుంది. ఈ ప్రక్రియ లేకుండా మనం ఏదీ తెల్సుకోలేం. క్రియ ఉంటేనే కదా కర్మ ఉంటుంది ఈ తెల్సుకొనే వ్యాపారం అంతా నేననే చైతన్యం మీద తెలుసుకొనేవాడు, తెలుసుకొనుట. తెల్సుకొనబడేది మొదలైన స్పందనాలు (కెరటాలు) ఉంటేనే కుదురుతుంది తెలుసుకొనే కర్త, అహం, నేను అనే అంశం లేకపోతే ఈ వ్యాపారం ఏం ఉంటుంది? కర్త లేని కర్మ ఉండదు కదా! మనకు గోచరించే ప్రపంచం అంతా తెలుసుకొనబడితేనే, తెల్సుకొనుట అనే క్రియ మీదనే ఆధారపడి ఉంది. కర్త లేని ఈ క్రియగాని కర్మగాని ఉండదు. కాబట్టి తెలియబడే ఈ జగత్తంతా తెల్సుకొనుట అనే క్రియ ఉంటేనే ఉంటుంది. ఆ క్రియ, తెల్సుకొనేవాడు కర్త ఉంటేనే, ఉన్నంతసేపే ఉంటుంది.

కాని నిజంగా ఈ తెల్సుకొనేవాడు ఎవడు? మామూలుగా స్ఫురించే నేను అనే భావానికి సత్యత్వం ఉన్నదా? తెల్సుకొనేవాడు, తెలియుట, తెలియబడేవి, ఈ మూడింటిని ప్రకాశింపచేసే ఆత్మ విలాసం యొక్క భాగం కదా ఈ 'నేను'. కాబట్టి సాక్షిఅయిన ఆత్మలోనే, ఈ 'నేను' అనే స్పందన!

కాబట్టి ఈ క్రియా కలాపమైన చిత్తవృత్తులన్నీ ఆ కర్త 'నేను' మీదనే కదా స్పందనాలు? ఈ కనబడే జగత్తు దీనిలో గోచరించే సృష్టి విశేషాలు, సత్యాలు, నిత్యాలు అన్నీ చిత్తవృత్తులని తేలింది. ఆ నేననే కర్త మీద ఆధారపడిన క్రియాకలాపం - ఈ కర్త, కర్మ, క్రియలు చూచే ఆత్మ సాక్షి ఒకడున్నాడు కదా? కాబట్టి ఇవి ఆ సాక్షి చైతన్యం మీద స్పందనాలే! కాని ఆ ఆత్మ ఈ కర్త, కర్మ, క్రియలకు సాక్షి మాత్రమే కాని, సంబంధి కాదు. ఇప్పుడు శ్రీ రమణ భగవాను వేసిన ప్రశ్న ఆలోచించండి! ఈ జగత్తంతా నేననే తెల్సుకొనేవాని మీదనే కలిగే స్పందనవిశేషం. ఇట్టి పరిస్థితిలో, ఈ ప్రపంచ జ్ఞానం యొక్క సత్యత్వం, దీనిని తెలుసుకొనేవాడెవడో తెలియకపోతే ఎలా నిర్ణయించగలం?

**అయితే** మనం చేయవలసిందేమిటి? ఈలోకంలో వ్యవహరించే ముందు ఈ వ్యవహరించేవాడు తెలుసుకొనే వాడు ఎవరో విచారించాలి. ఆ తెలుసుకొనేవానిని పట్టుకో కుండా, మనం ఎన్ని విద్యలు నేర్చినా ఎంత జ్ఞానం సంపా దించినా, అవన్నీ అన్నిరకాల అవిద్యలు - పారమార్థిక దృష్ట్యా. ప్రపంచవిషయం ఏమీ తెలియకపోవడం ఒక రకం అజ్ఞానం అయితే, తెలుసుకొనేవాడెవడో తెలియ కుండా, ప్రపంచవిషయంలో సంపాదించిన తెలివితేటలన్నీ మరోరకపు అజ్ఞానం. మరింత అజ్ఞానం. ప్రాపంచిక జ్ఞానం తాత్కాలికంగా ప్రమాణం కావచ్చు. దైనందిన జీవనంలో ఉపయోగించవచ్చును. కాని దేశకాలాలతో పాటు మార్పు చెందే స్వభావం గలది. కాబట్టి దానివలన శాశ్వతమైన సుఖంగాని శాంతిగాని దొరకదు ఆత్మ ఒక్కటే దేశకాలాతీతమై నిర్వికారమైన నిత్యవస్తువు కాబట్టి శాశ్వత సుఖప్రాప్తి కలుగచేయగలదు. అట్టి ఆత్మ సాక్షాత్కారం అంటే, తెలుసుకొనేవానిని తెలుసుకొనుటే; మనస్సు, దాని వ్యాపారమైన ఆలోచనా పరంపరలతోనే - 'మునగానాం తేలానాం' అయినంతకాలం మనకు ఆత్మ అందుబాటులో లేదు.

ఆత్మ ఈ మనస్సుకు గల ఆలోచనలకు తెలుసుకొను టకు అతీతము. దృగ్దృశ్యవివేకం అనే వేదాంతగ్రంథంలో మొదటిశ్లోకం ఇది:—

రూపం దృశ్యం లోచనం దృక్ తద్దృశ్యం
దృక్ తు మానసం
దృశ్యాధీవృత్తయఃసాక్షీ దృగేవ న తు దృశ్యతే

**వివరణం :** మనం ఇంద్రియాల ద్వారా ఏది గ్రహిం చినా అది దృశ్యం అవుతుంది. దీన్ని గ్రహించిన ఇంద్రి యం అంతవరకూ గ్రహించే కర్త అవుతుంది. ఈ ఇంద్రి యాల వ్యాపారాన్ని గ్రహించే కర్త మనస్సు అవుతుంది. ఈ మనస్సునూ, దీని వ్యాపారం ఆలోచనలు గ్రహించే కర్త నేను, నాది అనే వస్తువు. అది సాక్షిగా ఉండి, ఈ మనోవ్యాపారం అంతా చూస్తుంటుంది. కాని ఈ సాక్షిని చూచేదేమీ లేదు. అందరిలోనూ ఈ సాక్షిగా ఉండేది ఆత్మయే. మనం గ్రహించే ఏ జ్ఞానానికైనా మనలో ఉండే నేను అనే అహం వస్తువు గ్రహిస్తున్నట్లు కనిపిస్తుంది. కాని నిజంగా ఈ 'నేను' కు పైన ఒక సాక్షి ఉంటే కదా ఈ 'నేను' దాని గ్రహణ వ్యాపారం నడుస్తుంది. కాబట్టి ఆ 'సాక్షి'యే ఆత్యంతికమైన వస్తువు - ఈ తెలుసుకొనే

వంలో; కాబట్టి ఈ లౌకికజ్ఞానం ఎంత సంపా దించినా అది నిజమైన జ్ఞానం కాదని గ్రహించి ఆ సాక్షి అయిన అంతర ఆత్మ వస్తువును పట్టుకోడానికి లోపలి వెదుకు. ఏ జ్ఞానానికయినా, దాన్ని గ్రహించే సామగ్రి కంతకూ అదే ఆధారం.

అట్టి ఆత్మ వస్తువునందు మెలకువయే వేదాంతంలో అపరోక్షానుభూతి అంటారు. అది మనస్సుకు అతీతమైన ప్రశాంతమైన. ఆనందస్వరూపమైన సచ్చిదానందముతో ఏకమైన కైవల్యస్థితి

14\. నిద్రా న విద్యా గ్రహణం న విద్యా
గృహ్ణాతి కించిన్న యథార్థబోధే
నిద్రాపదార్థగ్రహణేతరా స్యాత్
చిదేవ విద్యా విలసంత్యశూన్యా

ఆంధ్రానువాదం : నిజమైన జ్ఞానం నిద్రలో కాని. కలలో కాని జాగ్రతలోకాని లేదు. ఏమంటే అక్కడ ఎంతసేపూ విషయజ్ఞానం. ఏదో ఒక వస్తుజ్ఞానం ఆ వస్తువును తెల్సు కోడం, అనుభవించడం. ఆత్మ సాక్షాత్కారంలో ఈ సామగ్రి ఏమీ ఉండదు. అందుచేత అది మన జాగ్రత్త, నిద్రా, కల అనే మూడవస్థలు కానిది, ఇతరమైనది. ఇది శుద్ధమైన ప్రకాశించే, చైతన్యమైన జ్ఞానం. ఇది సత్యమైనది శూన్యం కాదు.

ఇక్కడ శ్రీ రమణమహర్షి వారు, మానవుడు మాము లుగా గుర్తించే జాగ్రత్త, స్వప్న, నిద్రలను తెలిపి జ్ఞానం యొక్క ఈ అవస్థలను విడదీసి చూపిస్తున్నారు గాఢనిద్రలో, బయటస్థితి ఏమీ తెలియదుకదా. ఏమంటే మనస్సు, శరీరం విశ్రమించి పనిచేయకుండా మనలో ఉండే 'నేననే' వస్తువును లోపలికి లాగుకుంటుంది. గౌడ పాదకారికలో యీ శ్లోకం చూడండి.

కార్యకారణబద్ధౌ తావిష్యేతే స్వప్నతైజసౌ
ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తు తుర్యే న సిద్ధ్యతః

అంధ్రానువాదం: మన జాగ్రత్తలోగాని స్వప్నంలో గాని, ఆత్మవికాసం రెండుభాగాలుగా ఉంటుంది. కారణ కార్య స్వరూపాలుగా ఉంటుంది. కారణం కర్త, కార్యం కర్మ. జాగ్రత్తలో 'నేను' కర్త. ప్రపంచం కర్మ. స్వప్నంలో, మనస్సు ఒక ప్రపంచం సృష్టించుకొంటుంది. ఆ ప్రపంచం కర్మ. 'నేను' కర్త. స్వప్నంలో, గాఢ నిద్రలో కర్మ అనేది ఉండదు. ఒక్క నేను అనే కర్తయే మిగిలి ఉంటాను. శుద్ధ చైతన్యస్ఫూర్తియైన 'నేను' రెండు పనులు చేసుకొంటుంది. తన పుట్టిల్లయిన, ఆత్మ కనపడ

కుండా కప్పేస్తుంది. ఇది ఆవరణ. మొదటిది. ఇక రెండవపని ఏమిటంటే, అనేక ఇతరరూపాలలో స్ఫురించి విజృంభిస్తుంది. ఇది విక్షేపం. జాగ్రత్తలోనూ స్వప్నం లోనూ, ఈ రెండుపనులూ జరుగుతుంటాయి. మనిషి తన స్వస్వరూపమైన ఆత్మను మర్చిపోతాడు. ఇది ఆవరణ. తాను దేహమని, మనస్సనీ బుద్ధని, ఈ ప్రపంచం తన కంటే వేరనీ అనుకోవడం, విక్షేపం. ఇక్కడ 'నేను' తన అసలు స్వరూపాన్ని మరచి, దేహం మొదలైనవి లేదని నమ్మి వ్యవహరించడం విక్షేపం.

ఈ జాగ్రత్తు స్వప్నం రెంటిలోనూ తనకంటె వేరైన వస్తువులను అనుభవిస్తూ ఉంటాడు మనుష్యుడు. ఇక్కడ కర్త, కర్మ, క్రియ కలాపంతో వ్యవహరిస్తాడు. మహర్షి ఈ రెండు అవస్థలనూ 'గ్రహణం' అని పేర్కొన్నారు. అంటే తనకంటే వేరైన ఒక వస్తువును గుర్తించుట. ఇది తన స్వరూపాన్ని గుర్తించుట, ఆత్మానుభూతి ఎలా అవుతుంది? ఆత్మ ఒక్కటే గుర్తించబడవలెను కదా? అంతకంటే వేరుగా నీవుగాని మరి ఒకటిగాని ఏదీ లేదు కదా? ఆత్మ ఈ కర్త, కర్మ, క్రియా కలాపానికి, అవతల వున్నది కదా? కాబట్టి ఈ గ్రహణం ఉండే జాగ్రత్ స్వప్నదశలలో ఆత్మానుభూతి ఎలా ఉంటుంది? అయితే గాఢనిద్ర సంగతేమిటి? ఇక్కడ 'నేను' బయట ఇతర వస్తువుగా స్ఫురించే విక్షేపం లేదు కాని ఆత్మవస్తువును మరుగుపరచే ఆవరణముంది. ఆ స్థితిలో అహంకారం, శరీరం, మనస్సు మొదలైనవాటిని వదిలి ముడుచుకొని బుట్టలో పడుకున్న పామువలె ఆత్మను గుర్తించకుండా నిద్రిస్తూంటుంది. ఈ స్థితిలో ఏమీ తెలియకపోవడం, శుద్ధ అజ్ఞానం మొదలైనవాటిలో జీవుడు మునిగి ఇంద్రియ జ్ఞానం లేకుండా ఉంటాడు. ఇది ఆత్మ సాక్షాత్కారం ఎలా అవుతుంది? ఏమీ తెలియని స్థితిలో శుద్ధచైతన్యమైన సచ్చిదానందం అని ఎలా అంటాం? కాబట్టి తేలిందేమిటంటే ఆత్మానుభూతి నిద్ర, కల. జాగ్రత్త సితులకంటే విలక్షణమైనది అని అనుభవం వల్ల తెలుసుకోనేదేకాని, చెప్పేది కాదు. కాని దాన్ని ఏదో విధంగా సూచించడం కొరకు శ్రీ మహర్షివారు అది శుద్ధజ్ఞానము, శుద్ధచైతన్యము, ఆత్మ ప్రకాశముకాని, శూన్యంమాత్రం కాదు అని నిర్వచించారు. 'శూన్యం మాత్రం కాదు' అని చెప్పవలసివచ్చిందంటే కర్త, కర్మ. క్రియవల్ల కలిగే జ్ఞానం కాదన్నారు కదా? ఇదికాక ఇంకేం జ్ఞానం కాని, అనుభూతిగాని ఏమున్నది? అనే శంక కలుగవచ్చు. ఆత్మ స్వప్రకాశం. దీపం వంటిది. దీపాన్ని గుర్తించటానికి ఇంకో దీపం ఎందుకు? అదే కనపడుతుంది. నిద్రవంటి మూడు స్థితులు ఈ తురీయమునుండి వచ్చినవి. తురీయస్థితి ఆత్మ సాక్షాత్కారం.

ఈ మూడు స్థితులు ఆత్మ వల్లనే కలిగినవి. ఆత్మయే వాటిని గుర్తింపచేసేది. ఇవి నేననే వస్తువుకే ఉన్నవి. దానిలోనే ఎప్పుడీ ఉంటవి. ఈ 'నేను' శుద్ధచైతన్యం యొక్క కిరణంగా పుట్టి కర్తగా, భోక్తగా, ఈ జాగ్రత్ స్వప్నాలను అనుభవిస్తూంటుంది. ఈ జాగ్రత్, కలల అనుభవాల నుండి చాలించుకొని కనపడకుండా విశ్రమించే స్థితి నిద్ర. ఈ మూడు స్థితులూ, ఆత్మస్వరూపమైన తురీయం మీద సముద్రము మీద కెరటాలవలె వచ్చి పోతుంటాయి. జాగ్రత్ స్వప్నాలకు, 'నేను' కర్తా, భోక్తా కాని, త్రిపుటి అనే కర్త, కర్మ, క్రియ కలాపం ఇంతకూ ఆత్మ సాక్షిగా ఉండి ప్రకాశిస్తాడు. గాఢనిద్రలో ఆత్మ, ఆవరణ చాటున మరుగుపడి ఉన్నప్పటికీ, ఆత్మ ఏవిధంగాను మార్పు చెందదు. సూర్యుడు కనపడకుండా మనకు మేఘములు కప్పినా, ఇవి సూర్యుని ఏం చేయగలవు? ఈ 'నేను' నిద్రలో ఉన్నప్పటికీ ఆవరణమే గుర్తిస్తూ ఉంటుంది. లేకపోతే నిద్ర లేచాక 'నేను బాగా నిద్రించా, నాకు ఏమీ తెలియలేదు' అని ఈ 'నేను'కు ఎలా తెలిసింది? మనకు ఏవిషయమైనా ఎలా జ్ఞాపకం వస్తుంది? దాన్ని ఎప్పుడో ఒకప్పుడు చూచి అనుభవించి ఉండాలి? కాబట్టి ఈ 'నేనే' నేను బాగా నిద్రించానని, నాకు ఏమీ తెలియలేదని గుర్తించి ఉండాలి - లేచాక ఇలా చెప్పడానికి. కాని, ఈ నేను నిద్రపోవడం ఏమీ తెలియకుండా ఉండడం - ఈ వ్యవహారం అంతా ఆత్మ సాక్షిగా చూస్తుంటాడు. కాబట్టి ఇక్కడ విశేషం ఏమిటంటే (ఆత్మ) జీవుడు ఈ నేను తనే అని భ్రమపడి లేచాక పైవిధంగా జ్ఞాపకం తెచ్చుకొని దేహం, మనస్సు తానే అనుకొని చెపుతాడు. కాబట్టి జ్ఞాపకం కలుగుట ఆత్మ వల్లనే.

ఒక చిన్నపిల్లవాడు చీకటి గదిలోకి వెళ్ళాడనుకోండి. 'ఏం చూచావురా?' అంటే చీకటి తప్ప ఏమీ కనబడలేదంటాడు చీకటికి వస్తువులను కనపడకుండా చేసే స్వభావం ఉంది. కాని చీకటిని మనం చూడగలం. అలాగే నిద్రలో ఈ 'నేను' ఆత్మ కనపడకుండా కప్పుకొనే అజ్ఞానంలో ఉంటాడు. అజ్ఞానంలో ఉన్నానని గుర్తిస్తాడు. లేకపోతే తరువాత నాకేమీ తెలియదని ఎలా చెప్పగలడు? మనం నిద్రలో ఏమీ తెలియదు అని అన్నామంటే మనలో ఉండే ఆత్మ మనకు తెలియకపోవుట, అజ్ఞానం గుర్తిస్తుంటాడన్నమాట. ఇంకో విశేషము ఏమిటంటె - స్వప్న-

జాగ్రత్, నిద్రలో ఆత్మ జ్ఞానం, అసాధ్యం అయినప్పటికి, జాగ్రదవస్థే ఆత్మ లాభానికి పట్టుకొమ్మ.

నిద్రావస్థలో ఏమనిషి ఏపని చేయలేడుకదా! ఆలోచింపలేడు. దానిలో పురోగతికి ముందంజ ఏం వేయగలడు? ఇక స్వప్నావస్థ అంటే అది జాగ్రదవస్థలో కలిగిన అనుభూతుల కార్యకలాపం, సుఖదుఃఖాలు, భయాలు వీటి ఆధారభూతములే కదా కలలు? కాబట్టి ఈ కలల వల్ల ఆధ్యాత్మిక ప్రయోజనం ఏముంటుంది?

కాని జాగ్రత్తవిషయం వేరు జాగ్రదవస్థలోనే మనిషి జ్ఞానంకాని, విజ్ఞానంకాని సంపాదించి సంరక్షించినా, నాశనం చేసినా. లోకవ్యవహారం అంతా సాగింపగలడు. జాగ్రత్తలోంచే తురీయస్థితికి పొందగలడు. తన నిజస్థితిని పొందగలడు.

కాబట్టి జాగ్రత్ స్థితి, ఆత్మ సాక్షాత్కారము కాకపోయినా దానివల్లనే, జీవన్ముక్తిమార్గం లభిస్తుంది. కాబట్టి జాగ్రదవస్థను మనం కాదని, పశుప్రయోజనాలకు దుర్వినియోగం చేయకూడదు. జాగ్రదవస్థలో ప్రతిక్షణము, మనలను ఆత్మకు ఒక మెట్టు దగ్గరకు తీసుకుపోవాలి. కాబట్టి ఈ అవస్థలో ఏమరక, జాగరూకతతో, చైతన్యవంతంగా, ఆత్మ సాక్షిగా, సామర్థ్యంతో వ్యవహరించాలి. ఉన్నతాశయాలతో, నైతికదృష్టితో, వేదాంతమే జీవితాదర్శంగా కాలం గడపాలి. జీవన్ముక్తియే లక్ష్యంగా స్థైర్యముతో నిస్సంకోచంతో ముందుకు సాగాలి.

(తరువాయి పైసంచికలో)

# అహం బ్రహ్మాస్మి

మునుముందుకు పయనించు
గమ్యం చేరేదాక
త్యజిస్తూ, నవీనం గ్రహిస్తూ
లక్ష్యాన్ని సమీపించు
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

కాంచన కామినీ బంధాలను
త్రెంపుకొని, ఉత్సాహంతో గమించు
కామ క్రోధాది అరివీరులను
నిర్జించి జయనాదంతో సాగిపొమ్మ
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

భార్యా పుత్రులనే మాయాజాలాన్ని
ఛేదించి నిశ్చలతతో నడిచిపొమ్మ
అహం మమతల అంధకారాన్ని
జ్ఞానాగ్ని చేత దహించి
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

ఇల్లు-బట్ట-తిండి కోసం
నీ ఆయుష్షునంతా ఖర్చుపెట్టకు
రాకరాక లభ్యమైన
నరజన్మను వృథాపరచకు
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

త్రిగుణములనే దారులందు
సాత్త్వికమైన దారి ననుసరించు
ధ్యేయం చేరేవరకు పయనించు
అంతిమందు దాన్నికూడ వదలివేసి
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

ఇంద్రియములనే మిలమిల మెరుపుల
ఆకర్షణలకు లోబడి ఆగిపోకు
విషయములనే వాసనల
గంధాలకు లోబడి నిలిచిపోక సాగిపొమ్మ
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

దేహభ్రాంతిని వదలివేసి
కర్మ సిద్ధాంతాన్ని సమన్వయించి
జనన మరణ భ్రమణమునుండి
సత్వరము ముక్తుడవయ్యేందుకు పయనించు
'అహం బ్రహ్మాస్మి'ని అనుభవించు.

ప్రకాశశ్రీ

ఓం ప్రకాశ్

# ఈ సంసారం ఎలా జనించింది?

[జ్ఞాని శుకబ్రహ్మ కథ]

ఇంకా ఏమూలో శుకదేవుని మనసులో సంశయం చోటు చేసకొన్నది. ఆ సంశయాన్ని ఎలా వెలికి తీయాలో తెలియక శుకదేవుడు మథన పడుతున్నాడు. అసలు సంశయం యొక్క స్వరూపమేమిటో తెలిస్తే కదా, దాన్ని బయటికి లాగే ప్రయత్నం చేయవచ్చు. ఆ సంశయ మేమిటీ!?

శుకదేవుడు తనను తాను పునః పరిశీలించుకున్నాడు.

సర్వశాస్త్రాల్లో శుకదేవుడు పరిపూర్ణుడై యున్నాడు. అతనెరుగని శాస్త్ర విషయమంటూ లేదు. శాస్త్ర అధ్యయనమందు నిష్ణాతుడు అయ్యాడు. అతనిలో వివేకం జనించింది. ఏమిటిదంతా? నేనెవర్ని? ఈ లోకం తీరేమిటీ? ఈ లోకానికి నాకేమిటి సంబంధం? ఈ జనన మరణాలు, ఈ సుఖదుఃఖాలు, ఇవన్నీ ఏమిటీ? అసలు ఈ జీవితం యొక్క లక్ష్యం ఏమిటీ?- అంటూ విచారణ చేశాడు. అలా విచారణ చేయగా చేయగా అతనికి 'పరమ మనోహరమైన, పరమార్థసత్యము' అనుభూతమైంది. అదే పరమార్థ సాధన ఉచ్ఛస్థితి. అదే గమ్యస్థానం. అట్టి అనుభవం కల్గినా, అదే 'సచ్చిదానందఘన పరమాత్మ వస్తువు' అన్న విశ్వాసం కల్గలేదు. తత్కారణంగ అతని మనసులో అల్పమైన అశాంతి చేరి అలజడి ప్రారంభించింది. చంద్రునిలా సుందరమైన, బాలక వయస్సులో నున్న అతని వదనంలో సందేహం పులుముకుంది.

అయితే జీవనవిధానంలో రావలసిన మార్పు వచ్చేసింది. అతని చిత్తం క్షణభంగుర భోగాల నుండి సర్వదా విరక్తి చెందింది. చిత్తచాంచల్యం నశించింది. ఇంత పరివర్తనము, ఊర్ధ్వగమనము సంభవించినా, ఆ విషయం అతనికి దృఢపడలేదు. అందుకే అతని మనసులో అశాంతి కల్లోలం రేపింది.

శుకదేవునికి తనలో ఎంత అన్వేషించినా ఏలోపమూ కనబడలేదు. తన వ్యవహారంలో లోపం లేదు. తన ఆలోచనల్లో లోపం లేదు. తన భావాల్లో కూడ ఎట్టిలోపం కన్పించలేదు. అయినా ఏదో సంశయం ఇంకా మిగిలి వున్నట్లే, ఇంకా నశించనట్లే అన్పిస్తున్నది. ఏమిటదీ? నిజంగా తన మనస్సు శాంతించలేదా! నిజంగా తనకు సాధనా పరమైన సిద్ధి లభించలేదా? నిజంగా తనకు జ్ఞానోదయం కల్గలేదా?

—శుకదేవునికి ఏదీ స్పష్టంగ అవగతము కాలేదు.

— ఏం చెయ్యాలి? ఎవర్నాశ్రయించాలి? ......

'శ్రీకృష్ణద్వైపాయన మహర్షి - వ్యాస భగవానులవారు'

ఔను. వారినే ఆశ్రయించాలి. వారి ద్వారానే తన సంశయం నివృత్తం కావాలి.

శుకదేవుడు మేరుగిరివైపు ప్రయాణం సాగించాడు. ఆ యోగి త్వరలోనే దాన్ని చేరాడు. మేరుగిరిపైన ఒక ఏకాంతస్థానంలో, శ్యామ

వర్ణుడు, సూర్యతుల్య తేజశ్శాలి అయిన మహర్షి ఒకరు ఆసనమందు ఆసీనులై యున్నారు. వారే శ్రీకృష్ణద్వైపాయన మహర్షులు. వ్యాసభగవానులు ...... శుకదేవుని కన్నులు సంతోషంతో మెరిసాయి. త్వరిత్వరగా అడుగులు వేసి ఆ మహర్షి పాదపద్మాలపైన పడిపోయాడు. మహర్షి నెమ్మదిగా కన్నులు తెరచి చూశాడు. శుకదేవుణ్ని దీవించి లేవనెత్తాడు.

"కుమారా, ఎంత కాలానికి మళ్ళీ కన్పించావు. బాగున్నావా?"

"తండ్రీ! ఏమని చెప్పేది. ఎంతో కాలంగ నా మనసు అశాంతితో పీడింపబడుతోంది. నాలో నాకే తెలియని సంశయమేదో బాధ పెడుతోంది."

"సంశయమా? ఏమిటది కుమారా!"

"తండ్రీ! చెబుతాను. సంసార రూపమైన ఈ ఆడంబరము ఎలా ఉత్పన్నమయింది? ఇదెలా శాంతిస్తుంది? ఏలా నశిస్తుంది? ఇది ఎంతవరకు విస్తరించి యున్నది? అసలు ఈ సంసారం ఎవరిదీ? ఎవరు దీని కర్త? ఎవరు దీని పోషకుడు? ఎవరు దీని లయకారుడు ?— ఈ సంశయం ఎంతకీ తీరకున్నది? మీరు నాకు తండ్రే కాదు, గురువులు కూడ. అనుగ్రహించి నాకు జ్ఞానోపదేశం చేయండి. ఈ నా సంశయాన్ని తీర్చండి."

కుమారుడైన శుకదేవుని మనఃప్రవృత్తిని తండ్రి శ్రద్ధగా గమనించాడు. తత్త్వోపదేశమే దీనికి తగిన ఔషధమని నిశ్చయించాడు. కుమారునికి నిత్యానిత్య వివేక జ్ఞానం, సత్య వస్తు దర్శన జ్ఞానం, జగన్మిథాత్వ తత్త్వం, మొదలగునవెన్నో బోధించాడు. ఆత్మ జ్ఞానాన్ని, తత్సంబంధమయిన విషయాలెన్నో విశదంగ చెప్పాడు. తానెరిగిన, తన అనుభవంలో నున్న, ఆవశ్యకమైన, యుక్తమైన విషయాలన్నీ తెలియజేశాడు. విశుద్ధంగా స్పష్ట పరిచాడు.

తండ్రిగారి మాటలు ఏకాగ్రతతో విన్నా, శుకదేవుని మనస్సు మాత్రం శమించినట్లు కనబడలేదు. అతని ముఖంలో అతృప్తే గోచరించింది.

"తండ్రీ! మీరు చెప్పిన విషయాలు జ్ఞాన పూరితములైనవి. కాని అవన్నీ నాకింతకు పూర్వమే తెలుసును. నాకు మరేదయినా చెప్పండి. ఈ సంశయంనుండి నివృత్తి కల్గించండి."

కుమారుని ప్రార్థన విన్నాడు. కాని వ్యాస భగవానులతనికేమీ చెప్పలేక పోయాడు. 'శుకదేవునికి సత్య దర్శనమయింది. కాని అదతనికి దృఢంగా ఋజువు కాలేదు. శుకదేవునికిప్పుడు కేవల జ్ఞానోపదేశాలకన్నా, ఆ జ్ఞానాన్ని అనుష్ఠాన పూర్వకంగా, ఆచరణాత్మకంగా, సాధించిన వారి సాంగత్యం అవసరం. శుకదేవుని సంశయం, తనకు ప్రాప్తించిన జ్ఞానాన్ని, ఈ సంసారంలో వ్యవహారంలో ఏలా ప్రదర్శించాలన్నదే! జ్ఞానికి, అజ్ఞానికి ఇరువురికి ఎదుట సంసారం కనబడుతూనే యుంటుంది. అయితే వారిద్దరికి భేదమెలా తెలిసేదీ? ఇరువురూ ఒకేలా జీవిస్తారు కదా? మరి వారి వ్యవహారంలో ఈ జ్ఞానం ఎలా అనుష్ఠింపబడాలీ? ఈ సంసారాన్ని, జ్ఞాని ఏ భావంతో స్వీకరించాలి? అన్నదే శుకదేవుని సంశయం. తనలాంటి నిత్య ధ్యానపరుని వల్ల శుకదేవుని సంశయం నివృత్తి కాదు. దానికై నిష్కామ కర్మయోగి ఆదర్శమే తగినట్టిది. అలాంటి వారెవ్వరున్నారు?

—'మిథిలాధిపతి, విదేహరాజు, జనక రాజర్షి'

... నిజమే! అతని ద్వారానే శుకదేవునికి శాంతి స్థిరపడాలి.

వ్యాస భగవానులీవిధమైన నిశ్చయంతో కుమారుని వైపు సహర్షంగా చూశాడు.

"కుమారా! శుకదేవా! నాకు తెలిసినంతా చెప్పాను. ఇంతకు మించి నేనేం చెప్పలేను. ఒకపని చేయి. భూమండలంలో మిథిలా నగ రాన్ని జనకుడనే రాజర్షి పాలిస్తున్నాడు. అతను 'తెలిసికోదగ్గ తత్త్వం' గూర్చి యథార్థ రూపంలో తెలుసుకున్నాడు. ఆ మహారాజు నాశ్రయించు. నీకు సంపూర్ణ తత్త్వజ్ఞానం ప్రాప్తిస్తుంది. నీ సంశయమంతా తీరిపోతుంది. వెళ్ళు."

శుకదేవుడు తండ్రిగారి ఆశీస్సులందుకొని మిథిలానగరం వైపు పయనించాడు. విదేహ రాజ్యాన్ని చేరాడు. రాజవీధిలో పయనించి, సింహద్వారం సమీపించాడు. లోనికి ప్రవేశించ బోయాడు; బెత్తాలు ధరించిన ద్వారపాలకు లతన్ని ఆపేశారు.

"నేను వ్యాసపుత్రుణ్ని. నన్ను శుకదేవు డంటారు. నన్ను వెళ్ళనివ్వండి. రాజుగారితో అత్యవసరంగా మాట్లాడాలి."

శుకబ్రహ్మ చెప్పిందంతా విన్న భటుల్లో ఒకడు త్వరగా వెళ్ళి ఆ సమాచారం జనక మహారాజుకందజేశాడు. మహారాజు ఒక్క క్షణం ధ్యానమగ్నుడై సర్వమూ గ్రహించాడు. ఎంతో నిర్లక్ష్యంగా, అవహేళన పూర్వకంగా శుకుని గూర్చి మాట్లాడాడు.

"శుకుడా! వచ్చాడా! వస్తేనేం? నాతో అతనికేం పని? అతన్ని అక్కడే ఉండనివ్వండి."

మహారాజు ఆదేశం విని భటుడు వెళ్ళి పోయాడు. శుకదేవుడలాగే ఆ ద్వారం వద్దే నిశ్చలంగా ఉండిపోయాడు. రాజు పిలుపుకోసం ఎదురుచూస్తు అక్కడే నిలబడిపోయాడు. అతన్ని చూసి పలువురు పలురకాలుగా మాట్లా డినా, వ్యవహరించినా, వాటిని లక్ష్యపెట్టలేదు. మనోపూర్వకమైన, వాగ్రూపకమైన మౌనం వహించి, తనలో తానే స్థితుడై యున్నాడు.

ఒకరోజు గడిచింది. రాజు పిలుపు రాలేదు. శుకబ్రహ్మ కదల్లేదు. రెండు రోజులు గడి చాయి. మూడవరోజు కూడ గడిచిపోయింది. రాజెలాంటి చర్య తీసుకోలేదు. అతని అన్నపానీ యాల గూర్చిగాని, అతని అవసరాల గూర్చి కాని ఏ మాత్రం పట్టించుకోలేదు. అసలు శుక దేవుడనే వ్యక్తి ఒకడు తన రాజద్వారం వద్ద వేచియున్నాడన్న సంగతే జ్ఞాపకం లేనట్లు వ్యవహరించాడు.

శుకబ్రహ్మలో ఎలాంటి మార్పు లేదు. అదే నిశ్చలమైన మనసుతో రాజుపిలుపుకై వేచియున్నాడు. అతనిలో సహనం అసహనం అన్న రెండు భావాలు కూడ లేవు. వేచి యుండాలి కనుక వేచియున్నాడు. అతని మనసులో ఎలాంటి క్షోభ లేదు. స్థిరచిత్తుడై నిరీక్షిస్తున్నాడు. ప్రసన్నవదనంతో గంభీర వర్చస్సుతో ఏకనిష్ఠుడై యున్నాడు.

నాల్గవరోజు, ఐదవరోజు రెండూ గడిచి పోయాయి. ఆరవరోజు కూడ వెళ్ళిపోయింది. చూస్తూండగానే ఏడవరోజు ప్రయాణాన్ని ముగించుకొని సూర్యుడు అస్తగిరిని చేరాడు. చంద్రుడు రాత్రిని పాలించి విరమించుకున్నాడు. ఏడు రోజుల క్రితం ఏలాంటి భావంతో ఉన్నాడో శుకదేవుడు అదేభావంతో వేచియున్నాడు.

అమోఘం. ఇతని దీక్ష అనితర సాధ్యం. ఎంతటి అమానిత్వం! ఎంతటి దేహాభిమాన రాహిత్యం!! జనకమహారాజుకు మహాసంతోష

మయింది. ప్రథమ పరీక్షలో శుకుడు నెగ్గాడు చాలు..

జనకమహారాజు భటుల్ని పిలిచి ఆదేశిం చాడు.

"శుకదేవుణ్ణి లోనికి రానివ్వండి."

శుకదేవుడు నిశ్చలమానసంతో, నిర్భావంతో, ఏమీ జరగనట్లే ద్వారం దాటి రాజభవన ప్రాంగణం లోకి వచ్చాడు. కాని అక్కడతనికి రాజభవన ప్రవేశం లభించ లేదు. శుక దేవుడక్కడే ఆగిపోయాడు.

మరల కాలచక్రంలో సప్తదివసాలు గడిచి పోయాయి. రాజుద్వార శుకదేవుని యడల అదే నిర్లక్ష్య, ఉదాసీన ధోరణి ప్రదర్శిత మయింది. రాజదర్శనం కాదుగదా, రాజు నుండి పిలుపు కూడ రాలేదు. శుకదేవుడు మాత్రం స్థిరచిత్తంతో, చలించని మనసుతో, రాజర్షి పిలుపు కోసం ఎదురుచూస్తూ కూర్చు న్నాడు.

ఇంత అవమానం ఇంత అమర్యాద జరిగినా శుకబ్రహ్మ ఏ మాత్రం చలించనందుకు, ఎట్టి రకంగా కూడ క్రోధ ద్వేషాదులు వ్యక్తం చేయనందుకు జనకమహారాజు విస్మయానంద భరితుడయ్యాడు. ఎంతటి జితేంద్రియుడు ఎంతటి స్థితప్రజ్ఞుడని ప్రముదిత హృదయుడయ్యాడు. అయినా చూద్దాం. ఇంతకన్నా కఠిన పరీక్షలు పెడదాం అని మరో పరీక్షను ఏర్పాటు చేశాడు.

ఎంతవారయినా కాంతా దాసులన్నది పురుష స్వభావరీత్యా చెప్పబడుతున్నది. కాంతలతో పాటు మధుర పక్వాన్నాలు, పానీయాదులుంటే ఇక పురుషుని పని చెప్పాలా? శుకుని పైన సుందరకాంతలను, మధుర భోజ్యపదార్థాలను, సర్వవిధ దైహిక, మానసిక పరమైన సేవలను జనకుడు ప్రయోగించాడు.

సేవకులు వచ్చి అత్యంత వినయంతో, శ్రద్ధాభక్తులతో, శుకదేవుణ్ని మిక్కిలి ఆదర పూర్వకంగ రాజభవనం లోకి కొనిపోయారు. మహారాజ గౌరవాలన్నీ చేశారు. సన్మానాలతో శుకదేవుణ్ని నింపేశారు. ఆ గౌరవాలు, ఆ సన్మానాలు, ఆ సేవలు, శుకదేవునికి వరుసగా ఏడు రోజుల పాటు లభ్యమయ్యాయి. ఆ గౌరవానికి దుఃఖించకుండా ఉండటం వేదాంతుల స్వభావం. అయితే గౌరవం వచ్చినా పొంగిపోకుండా సమత్వబుద్ధి వహించియుండాలి. శోకహర్షాలకు రెంటికీ అతీతులై యుండాలి. సమభావంతో దర్శించగల్గాలి. వారే స్థితప్రజ్ఞులు. గాంభీర్యము, ప్రసన్నత వారియందు సర్వదా తేజరిల్లుతుంటాయి. శుకదేవుడు జ్ఞాని ఆ లక్షణాలను ప్రత్యక్షంగా, ప్రయోగ పూర్వకంగా జనకమహారాజు పరీక్షలకు గురిచేస్తున్నాడు. శుకదేవునికి కావలసిన సమాధానం కూడ ఇదే. సిద్ధాంత రీత్యా అతను సర్వమూ ఎరుగును. కాని ఆ సిద్ధాంతం ప్రాయోగిక సత్యంగా ఎరుగవలసివుంది. అందుకే జనకుడు శుకదేవుని యందిలా వ్యవహరించాడు.

ఆ చివరి ఏడురోజులు ఎంతటి మానమర్యాదలు శుకునికి కల్పించినా, జనకుడు తన దర్శనం మాత్రం ఇవ్వలేదు. అడుగడుగునా పరీక్షలే!

ఆ పరీక్షలకు తట్టుకొని సమస్థితిలో ఉండటమే పరమాత్మ అనుభవానికి ప్రత్యక్ష నిదర్శనం!

ఇరువదొక్క రోజులు గతించినా, రాజదర్శనం కాలేదు. విచిత్రమేమిటంటే, శుకదేవుడు కూడ తిరిగిపోలేదు! గురువుకు తగిన శిష్యుడు! అసలతనికి రోజులు గడుస్తున్నట్లే లేదు. తాను వచ్చినది రాజదర్శనానికి. దానికి

కాలగమనంతో అతనికి సంబంధం లేదు. రాజ దర్శనం అయ్యేవరకు అతనికి తానప్పుడే వచ్చానన్నట్లుగా ఉండేది. ఎంతటి చిత్త స్థైర్యం సంపాదించాడు శుకబ్రహ్మ!

ఆ ఏడురోజుల్లో కాంతామణుల సపర్యలు కూడ అతని మనస్సును ఆకట్టుకోలేక పోయాయి. వారు అతిసుందరులు. యావనంతో మదోన్మత్తులై యున్నారు. కమనీయ కాంతితో మనోహరంగా ఉన్నారు. అట్టి అందాల భరిణెలు శుకబ్రహ్మకు సపర్యలు చేశారు. స్నానాదులు చేయించారు. అన్నపానాదులు కల్పించారు. నృత్యాదులు దర్శింప జేశారు. సంగీత గానంతో మైమరిపించేందుకు యత్నించారు. సమస్తవిధమైన లాలనా పాలనాదులు చేశారు. ఎన్నో ఎత్తులు వేశారు. ఎన్నో విధాల తమవైపు శుకుణ్ని ఆకర్షించుకొనేందుకు ప్రయాస పడ్డారు.

కాని శుకబ్రహ్మ చలిస్తే కదా! పర్వతంలా దృఢంగా ఉన్నాడు. పిల్లవాయువులెన్ని వీచినా దృఢమూలం గల వృక్షంలా స్థిరంగా ఉన్నాడు. ఆ భోగాలు, ఆ అనాదరణ, ఆ ఉపేక్షాప్రదర్శన వ్యాసపుత్రునిలో ఎట్టి వికారాన్ని పుట్టించలేక పోయాయి. పూర్ణచంద్రుని మాదిరి నిర్వికారుడై, భోగము-అనాదరములందు, హర్ష విషాదరహితుడై, సముడై, స్వస్థుడై, మౌనుడై, ప్రసన్నచిత్తుడై యున్నాడు.

శుకుని సమత్వం చూసి మహదానందంతో జనకుడు అంతరంగిక సేవకులను పంపి శుకబ్రహ్మను తన అంతర్గృహానికి ఆహ్వానించాడు.

శుకదేవుడు ప్రసన్నచిత్తంతో జనకుణ్ని చూడవచ్చాడు. జనకుడు అత్యంత ఆదరంతో లేచి ప్రణామం చేశాడు. స్వాగతం పల్కాడు.

“బ్రాహ్మణోత్తమ! పరమ పురుషార్థ సిద్ధి కోసం లోకంలో నున్న ఆవశ్యకమైన కర్తవ్యాలన్నీ మీరు పూర్ణంగ సాధించారు. సర్వ మనోరథాలు మీకు సిద్ధించాయి. మీరు కృతకృత్యులయ్యారు. ఆప్తకాములయ్యారు. ఇంకా దేనికోసం మీరిలా దయచేశారు?”

‘రాజర్షి ఈ సంసార రూప ఆడంబరమేలా ఉద్భవించింది? ఇదెప్పుడు శాంతిస్తుంది? లేదా ఎప్పుడెలా నశిస్తుంది? ఈ విషయమై మీ నుండి సమాధానం కోరి వచ్చాను. యథార్థంగా మీరీ విషయం ప్రతిపాదించి తెలియజేయండి.”

శుకదేవుని సంసారం గూర్చిన ఉత్పత్తి వినాశముల ప్రశ్న విని, జనకమహారాజు వాస్తవ తత్త్వం ఎరిగించాడు. శుకదేవుడు శ్రద్ధగా విన్నాడు. కాని అందతనికి నూతనత్వమేమీ గోచరించలేదు. అదంతా తానెరిగినదే! తనతండ్రి ఇంతకు పూర్వం చెప్పిందే! జనకుడు క్రొత్తగా చెప్పిందేమీ లేదు. ఆ విషయమే శుకుడు జనకునికి చెప్పాడు.

“మహారాజా! ఇదంతా వివేకజ్ఞానం చేత నేనెరిగియే యున్నాను. మా తండ్రిగారు కూడ ఇదే విషయం చెప్పారు. ఇప్పుడు ఆ విషయమే మరల మీరూ చెబుతున్నారు. శాస్త్రము మహావాక్యాల అర్థం కూడ ఇదే విధంగ దర్శనమవుతుంది. అదేమంటే— ఈ సంసారము వినాశశీలం గలది. మన సంకల్పం చేతనే ఉత్పన్నమౌతుంది. సంకల్పం పూర్తిగా నశించినప్పుడు, ఇది కూడ వినష్టమై పోతుంది. కనుక కేవలం సంకల్పజనితము, క్షయశీలము గల ఈ సంసారం నిస్సారమైనట్టిది. శాస్త్రాలు నిర్ణయించే సత్యమిదే. మహారాజ! ఇదేనా అవిచలమైన సత్యం? ఇదే సత్యమయితే, సంది

గ్రరహితంగ, స్థిరంగ ఇది నా హృదయమందు నిలిచేలా దీన్ని విపులంగ బోధించండి. సంసార విషయాల్లో తిరిగే చిత్తం ద్వార ఎక్కడెక్కడో భ్రమిస్తూ నేనీరోజు మీద్వార శాంతి పొందాలనుకుంటున్నాను.''

శుకుని హృదయం గ్రహించిన జనకరాజర్షి తత్త్వాబోధకుపక్రమించాడు.

''మునివర్యా! శ్రద్ధగా వినండి. ఈ బ్రహ్మాండమంతటిలో అఖండమైన చిన్మయ పరమపురుష పరమాత్మకు మించి మరో వస్తువు లేదు. మీరు స్వయంగా వివేకంతో ఈ తత్త్వాన్ని దర్శించారు. గురురూపంలో మీ తండ్రి వద్ద శ్రవణం చేశారు. ఇంతకు మించిన తెలిసికోదగ్గ నిశ్చయ జ్ఞానం మరొకటి లేదు. మునికుమారా! మీరు వయస్సులో బాలకులయినప్పటికి, విషయభోగ త్యాగమందు శూరవీరులగుటచే, మీరు నిజంగా మహావీరులు. మీ బుద్ధి, దీర్ఘకాలపర్యంతము పీడించే రోగరూప భోగములనుండి పరిపూర్ణంగ విరక్తి చెందింది. అయినా ఇంకా ఏదో తెలుసుకోవాలనుకుంటున్నారు. బ్రాహ్మణ శ్రేష్ఠా! ప్రాప్తించవలసిన యోగ్యమైన వస్తువును, పూర్ణంగా మీరు పొందారు. మీ చిత్తము పూర్ణకామమయింది. మీరు దృశ్య వస్తువు (బాహ్యవిషయముల) యెడల దృష్టి పాతము చేయటం లేదు; కనుక మీరు ముక్తులు. ఇంకా పొందవలసింది కాని, తెలుసుకోవలసింది కాని ఏమీ లేదు. ఈ భ్రమను త్యజించి వేయండి. అదే మీకు సమాధానం కూరుస్తుంది.''

మహాత్ముడైన జనకుని ఉపదేశము విని శుకబ్రహ్మ, అత్యంత శుద్ధమైన పరమవస్తువు పరమాత్మయందు మౌనంగ స్థితుడై పోయాడు. అతనియందున్న శోకము, భయము, శ్రమ! ఇలాంటివన్నీ నష్టమైపోయాయి. అతను నిరీహుడయ్యాడు. సర్వదా సంశయరహితుడయ్యాడు.

శుకదేవుడు జనకుని వద్ద సెలవు గైకొని మేరుగిరి పైకి వెళ్ళి చేరాడు. ఒక ప్రశస్తమయిన శిఖరమందు సమాధిమగ్నుడయి కూర్చున్నాడు. పదివేల సంవత్సరాలు దొర్లిపోయాయి. నిర్వికల్పసమాధిలో అలాగే స్థితుడై పోయాడు. తైలమున్నంతవరకు జ్యోతి ప్రకాశించి, తైలము సమాప్తము కాగానే ఆరిపోతుంది. ప్రారబ్ధము క్షీణించగానే శుకబ్రహ్మ పరబ్రహ్మలో లీనమై పోయాడు. అద్వైతస్థితి నొందాడు.

ఉత్కృష్ట జ్ఞాని శుకబ్రహ్మ సర్వదా ముక్తుడయ్యాడు.

## కథా వివేచనము

శ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మ రచితము, వావిళ్ళ రామస్వామి 1965 సం॥పు ప్రచురితమైన 'శ్రీ మదాంధ్ర వచన జ్ఞాన వాసిష్ఠ' మందీ శుక చరిత్రము, వైరాగ్య ప్రకరణము చివర కానవస్తున్నది. గీతా ప్రెస్, గోరఖ్‌పూర్ వారి యోగా వాసిష్ఠమందిది ముముక్షు వ్యవహార ప్రకరణారంభమున కానవస్తున్నది. శ్రీ శుకబ్రహ్మాశ్రమం వారి 'వసిష్ఠగీత'లో కూడ ఇది 'శుకవిశ్రాంతి' పేరిట ముముక్షు ప్రకరణమందే కనబడుతున్నది. విజ్ఞులు సరైన క్రమం నిశ్చయింతురుగాక:

జగత్సత్యత్వానికి, బ్రహ్మసత్యత్వానికి అనాదిగా మనిషిలో పోరాటం సంభవిస్తున్నది. ఈ పోరాటం కారణంగానే ఒకరు అద్వైతాన్ని పరిష్కారంగా అందిస్తే మరొకరు ద్వైతాన్ని సమాధానంగా చెప్పారు. వీరిద్దర్నీ కాదని మరొకరు, వారికీ వీరికీ కోపం రాకుండా, విశిష్టాద్వైతాన్ని సాధించి, దాంతో ఆ పోరాటాన్ని ఆపుచేసుకోమన్నారు.

నిజానికి జగత్తనేది లేదు. మనిషి యొక్క మానసిక విన్యాసమే జగత్తు. మనమ్ము శాంతంగా ఉన్నప్పుడు, మనిషి సుషుప్తిలో ఉంటాడు. అప్పుడతనికి జగత్తు లేదు.

తానున్నాడు. తాను, తానుగానే ఉన్నాడు. ఇది సహజ సిద్ధంగా ప్రకృతి కల్పించే క్షణకాలపు సత్యానుభవము. ఈ సత్యాన్ని నిత్యానుభవంగా సాధించమని చెప్పటానికే ప్రకృతి ఈ సుషుప్త్యవస్థను కల్పిస్తుంది.

దాన్ని సాధించాలంటే, మనోనాశం జరగాలి. మనోనాశం జరగాలంటే, దాని సంకల్ప వికల్ప వృత్తులన్నీ శమించాలి. జాగ్రదవస్థలోనే ఇది సాధింపబడాలి. స్వప్నావస్థలో, సుషుప్త్యవస్థలో దీనికై ప్రయత్నం కొనసాగటానికి అవకాశాలు లేవు.

జాగ్రత్తులో సాధించబడినప్పుడు, సాధకునికి ఆ సత్యమెలా అనుభూతమవుతుందో అలాగే అతని ఎదుటనున్న సంసారం కూడా కనబడుతుంది. సంకల్పజనితమే సంసారమయినప్పుడు, ఆ సంకల్పం నశించినప్పుడు, ఈ సంసారం కూడ నశించాలి కదా! ఈ సంకల్ప నాశనమంటే సత్య, సచ్చిదానంద స్వరూప పరమాత్మ అనుభవమే కదా! సంసారం కనబడుతుండగా, ఈ పరమాత్మ అనుభవం కల్గిందంటే, అదెల కుదురుతుంది?

ప్రతిసాధకుడు ఎదుర్కొనే ప్రశ్న ఇది. ఇదొక విధంగా మూఢనమ్మకం. బ్రహ్మసత్యం, జగత్తూ సత్యం అనే భావనయే దీనికి కారణం. జాగ్రత్తు సత్యం, స్వప్నం సత్యం అన్నట్టి రకం ఇది. రెంటిలో ఏదో ఒకటి మాత్రమే సత్యం. రెండవది, మొదటిదానిపైన ఆధారపడియుంటుంది. జాగ్రత్తు సత్యం. స్వప్నం దాన్ని ఆధారంగా గొని నిలిచిన అవస్థ. జాగ్రత్తులో మేల్కొన్నవారికి స్వప్నం యొక్క అనుభవం ఉండనే ఉంటుంది. అదింకా మెదలుతూనే ఉంటుంది. నిజం కాబోలు అన్న భ్రాంతి కూడ జనిస్తుంది. కాని జాగ్రత్తుకు, స్వప్నానికి గల భేదం మనిషి ఎరుగును గనుక, ఆ స్వప్నగత అనుభవాన్ని తలచుకొని, తన వెర్రికి తానే నవ్వుకుంటాడు. తన ఊహా ప్రపంచానికి తానే విస్తుపోతాడు.

అలాంటి అనుభవమే సిద్ధిని సాధించిన సాధకులకుంటుంది. సత్యదర్శనమవుతుంది. సంసారం కూడ వ్యవహారంలో అడ్డుకుంటుంది. 'ఈ రెండూ నిజమైతే నే నెరింగినదేమిటి' అన్న సంశయంలో పడిపోతాడు. సంసారం కూడ కేవలం తన మనోగతకల్పనల అనుభవమే తప్పించి నిజం కాదన్న సత్యం అతనికి తట్టదు. ఆ సత్యాన్ని చెప్పటానికే గురువులు అవసరం. పసివానికి స్వప్నం అనిజం జాగ్రత్తే నిజం అని చెప్పే అనుభవజ్ఞులయిన పెద్దలవంటి వారే, సాధకులవిషయంలో ఈ గురువులు.

స్వల్పకాల స్వప్నాలు నిత్యం కంటున్నట్లే, ఈ జన్మాదులుకూడ, మన వ్యవహారరీత్యా దీర్ఘకాలస్వప్నాలు. నిజానికి అసలు కల కంటున్న వ్యక్తిరీత్యా అది కూడ స్వల్పకాలిక స్వప్నమే! మనమిప్పుడు చదువుతున్నాము, ఆలోచిస్తున్నాము అన్నదికూడ, (ఎవరికి తెలుసు?) ఒక స్వప్నమే!

ఇలాంటి స్వప్నాలనుండి జాగ్రత్తులోకి రావటమే సత్పదార్థదర్శనం. తాను కేవలం బ్రహ్మస్వరూపుడనని ఎరగటమే అపరోక్షానుభూతి. బ్రహ్మను ఆసరా గొని మాయామయమగు ప్రపంచసృష్టి చేస్తున్నది మనసు. అదే సంసారం. అదొక పెద్ద భ్రాంతి. అదొక స్వప్నభ్రాంతి. శుకదేవుడంతటివాడు ఈ స్వప్నభ్రాంతికి లోనై, తనలోని సంసారాన్ని వేరుగా భావించి, ఆ కల్పితసంసారం నిజమనుకొని బాధపడ్డాడు. గురువుల సహాయంతో అది కేవలం భ్రమ మాత్రమేనని ఎరిగి సంసారం గూర్చిన ఆలోచన మాని మౌని అయ్యాడు. బ్రహ్మనిష్ఠుడయ్యాడు.

—పై సంచికలో, 'మనసుచేసే గారడి' (లవణరాజు



# రేవానదీ తీరంలో

ముహింక్రే

1600 సంవత్సరాల క్రితం జరిగిన కథ. పాండ్య దేశంలో తామ్రపర్ణినదీ తీరంలోని గురునాథాశ్రమంలో బ్రహ్మచారిగా ఉంటున్న కందసామి ఒకనాడు మఠాధిపతి సన్నిధికి పోయి ఇలా విన్నవించాడు: "స్వామీ! ప్రొద్దస్తమానం మనం భూతదయ, కరుణ, జీవసేవ అనే పదాలు మన ఉపదేశాల్లో ఉపన్యాసాల్లో వాడుతుంటాము. కాని మన గోశాలలలో పని చేసేవాళ్ళకు, వంటశాలలో పనిచేసేవాళ్ళకు, తోటల్లో మడుల్లో పనిచేసేవాళ్ళకు, తదితరమైన పనివాళ్ళకు బత్యం చాల తక్కువగా ఇస్తున్నాము. పనివాళ్ళలో కొందరు తినడానికి ఏమీ లేక ప్రొద్దున ఆకలికడుపులతో వచ్చి పని చేస్తున్నారు. నేను మాత్రం ఇక్కడ సుష్టుగా భోంచేసి పోయి వాళ్ళనుండి పని చేయించుకోవడం నాకెందుకో అధర్మంగా తోస్తుంది. ఏదో తెలుగు సామెత చెప్పినట్లుగా చేసేది ధర్మోపన్యాసాలు..." కందసామిని వాక్యం ముగించనీయ లేదు అధిపతి. "ఫో బైట ఫో" అని గొంతు చించుకొని అరిచాడు. కందసామి వాక్యం ముగించకుండానే అక్కడ్నుంచి వచ్చేసి గబగబ ఒక బానలో కొంత నీళ్ళు పోసి అందులో ఎఱ్ఱమట్టి వేసి బాగా కరగదీసి ఆ రంగునీళ్ళలో తను కట్టుకున్న తెల్ల బట్టలను ముంచి కాషాయగుడ్డలుగా మార్చి వాటిని తీసి పిండి ఆ తడిగుడ్డలను ధరించి ఆశ్రమం నుండి విశాల ప్రపంచంలోకి అడుగుపెట్టాడు. నడక ఉత్తరదిక్కుగా సాగించాడు. నదులు అడవులు కొండలు గుట్టలు దాటుకుంటూ ప్రయాణం సాగించి సాగించి ఉత్తర దేశంలోని రేవానదీ తీరం చేరుకున్నాడు. అక్కడొక సాధువు ఇతణ్ణి చూచి దగ్గరకు వచ్చి "ఎవరు మీరు? ద్రవిడ దేశీయుల్లా కనబడుతున్నారు. కాశీయాత్ర చేస్తున్నారా? కాశికి పోయే మార్గం ఇది కాదుగదా?" అని ప్రశ్నించాడు. కందసామి సమాధానంగా "నేను పాండ్య దేశీయుణ్ణి. నా పేరు మురుగానంద.

> 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో
> నామ నగాధిరాజః ।
> పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య స్థితః పృథివ్యా
> ఇవ మానదండః ॥'

అని ఒక సంస్కృత కవి చెప్పాడు కదా! ఆ నగాధిరాజదర్శనార్థం నా పయనం" అన్నాడు. రేవా నదీతీర సాధువు మందహాసం చేస్తూ "ఆ కవి నాకు తెలుసు. కీర్తిశేషులయి ఒక సంవత్సరం కూడ కాలేదు. ఆ మహానీయుడు ఉజ్జయినీ నగరం నుండి తరచు ఈ జాబాలాశ్రమానికి వచ్చి కొన్నాళ్ళుండి పోయేవాడు. ఆయన వ్రాసిన కవిత్వం అంత త్వరగా మీ దేశానికి కూడ ప్రాకిందా? ఆశ్చర్యం! సరే అది అటుండనీ. హిమవన్నగం ఇక్కడికి బహు దూరం. మీరు కొన్నాళ్లు మా ఆశ్రమంలో విశ్రమించి పునఃప్రయాణం సాగించవచ్చు. రండి" అని ఆహ్వానించాడు. కందసామి తల పంకించి ఆ సాధువు వెంబడే నడుస్తూ రేవానదీ సుందరదృశ్యాన్ని చూస్తూ తన్మయుడు కాసాగాడు. ఆ నదీతీరంలో ఇసుకతిన్నెల మీద ఒకచోట అతనికి ధాన్యపు పోగులు చిన్న చిన్నవి కనబడ్డాయి. సాధువుకు వాటిని చూపించి "ఈ చిన్ని ధాన్యపుపోగులు ఎందుకిక్కడ పోయబడినాయి" అని అడిగాడు. సాధువు సమాధానం చెప్తూ "ఇక్కడి మునులు జీవనోపాధి నిమిత్తం ఏనాటికానాడు సేకరించిన నీవార ధాన్యంలో ఆఱవభాగం తీసి ఇక్కడ పోగుగా ఉంచి వెళ్తుంటారు. వాళ్ల ఉద్దేశమేమంటే : ఆర్జనలో ఆఱవ భాగం ప్రభుత్వానికి న్యాయంగా పోవలసి ఉంది. కనుక ప్రభువు వచ్చి అడగకపోయినా తమ ధర్మంగా తాము

సేకరించిన నీవార ధాన్యంలో అఱవభాగం ఇక్కడపోసి పోతుంటారు. ఇదీ సంగతి. ఇదేదో ఆరాధనా విశేషం అనుకున్నారు కాబోలు. అలాంటిదేమీ లేదు'' అన్నాడు. కందసామి ఆశ్చర్యానికి అంతు లేదు. ''ఆహా! ఇక్కడి మునులు ధర్మాచరణలో ఎంత జాగరూకులు!'' అనుకున్నాడు. ఆ ఆశ్చర్యాన్ని మనస్సులో ఉంచుకోలేక సాధువుతో ''నేను మా పాండ్య దేశంలో కొన్నాళ్లు ఒక ఆశ్రమంలోఉన్నాను. ఆ ఆశ్రమానికి మడిమాన్యాల ద్వారా ఆర్జన దండిగా ఉన్నా పీసమెత్తు కూడ ప్రభుత్వానికి ఎప్పుడూ ఇచ్చింది లేదు. పైగా దేవుని రథ సేవకని పవ్వళింపు సేవకని విహారసేవకని వేద పాఠశాలకని, గోశాలకని, ధ్వజస్తంభానికని, కుటీర నిర్మాణానికని ఇలా పలువిధాలుగా చీటికి మాటికి పాండ్యరాజునుండి సామంత రాజులనుండి ధనికులనుండి వరహాలు రాబట్టు తూనే ఉంటారు. ఆ ఆచరణకు ఈ ఆచరణకు ఎంత వ్యత్యాసం!'' అన్నాడు. ఈ మాటలు వినవలసివచ్చినందుకు ఆ సాధువు కొంత అయి ష్టాన్ని ముఖంలో వ్యక్తం చేస్తూ ''లోకుల ప్రవృత్తిలో తీరులో రూపురేఖల్లో వేష భాషల్లో సిద్ధాంతాల్లో అనంత వైవిధ్యం ఉంటుంది. వాటిని ఒకదానితో ఒకటి పోల్చి హెచ్చుతగ్గుల తీర్మానాలు ఉత్కృష్ట నికృష్ట తీర్మానాలు బాగు ఓగు తీర్మానాలు ధర్మా ధర్మ తీర్మానాలు మనం చేయకూడదు. పోలికలు, పోలికల వలన జనించే తీర్మానాలు- ఇవన్నీ మనో చేష్టలు. వీటిలో నిత్యం మనస్సును ప్రవర్తింపజేశామంటే సత్యానికి దూరమై పోతాం. సత్యం అందుకోవాలంటే మనస్సు యొక్క చేష్టలు అణగాలి. పోలికలు తీర్మా నాలు చేస్తుంటే మనస్సు అణగేదెట్లా సాధ్యం? నీవు నాకన్నా వయసులో చాలా చిన్న వానిలా కనిపిస్తున్నావు గనుక తమ్ముని శ్రేయస్సు కోసం చెప్పే అన్నలా నన్ను భావించు. ఉపదేశకండూతితో నేనీ మాటలు చెప్పడం లేదు'' అని ఆ సాధువు ఆశ్రమం వైపు నడక సాగించాడు. కొంతసేపటికి వా రిద్దరు చెట్లు పొదలు తీగలు కుటీరాలతో శోభాయమానంగా ఉన్న ఆశ్రమం చేరు కున్నారు. మునికన్యలు కొందఱు కడవలతో చెట్లకు నీళ్ళు పోసి చటుక్కున దూరంగా వైదొలగడం కందసామి చూచాడు. ఇది ఒక వింత ధోరణిగా అతనికి కనబడింది. ఆ వింత ధోరణికి అర్థం సాధువును అడిగాడు. సమా ధానంగా సాధువు ''చెట్లపాదులకు పోసిన నీళ్ళను చూచి చెట్లమీద ఉన్న పక్షులు బిలబిలమంటూ వచ్చి ఆ నీటిని త్రాగ డానికి ఉవ్విళ్ళూరుతాయి. కాని మనిషి దగ్గర ఉంటే అవి వచ్చి అక్కడ వ్రాలడానికి జంకు తాయేమో అనే భావంతో మునికన్యలు చెట్ల పాదులకు నీళ్ళు పోసి చటుక్కున దూరంగా జరిగి వెళ్ళిపోతున్నారు. దీనినే సహృదయత అంటారు. ఈ సహృదయతాలక్షణాన్ని ఆశ్ర మవాసుల్లో వికసింపజేయడమే ఆశ్రమప్రధాన లక్ష్యంగా ఉండాలని మేమనుకుంటాము. తాళ పత్రగ్రంథాల్లో ఉండే వేదాలను ఇతిహాసా లను పురాణాలను కావ్యాలను స్మృతులను శాస్త్రాలను తలకెక్కించడం ప్రధానం కాదు. వాటిని తలకెక్కించడంలోనే కాలాన్ని వెళ్ళ బుచ్చుచూ హృదయసౌకుమార్యాన్ని, సహృ దయతను కోల్పోవడం వాంఛనీయం కాదు. ఈ మునికన్యల తీరు వింతగా కనబడడం నీకే కాదు మా కవిమిత్రుణ్ణి గుఱించి నీకు చెప్పానే అతనికి కూడ ఇది వింతగానే కనబడింది. కాని అతనిలో అద్భుతమైన కవితాహృదయం ఉన్నందువల్ల సమాధానం మమ్మల్ని అడ

క్కుండానే స్వయంగా తెలుసుకొని ఆ భావాన్ని తన కావ్యంలో కూడ ప్రకటించాడు. ఆ కవికావ్యాలు చదివినట్లున్నావు. ఆ శ్లోకం జ్ఞాపకం రావడంలేదా? అయితే విను.

'నేకాంతే మునికన్యాభిస్తత్ క్షణోజ్ఝిత వృక్షకమ్।
విశ్వాసాయ విహంగానామాలవాలాంబుపాయినామ్॥'

ఇది ఆ శ్లోకం. రఘువంశమహాకావ్యం ప్రథమ సర్గలో ఉంది'' అన్నాడు. కందస్వామి మౌనంగా నడుస్తూ కొన్ని క్షణాల తరువాత సాధువుతో ఇలా అన్నాడు. ''యథాలాపంగా మీరు చెప్పే మాటల్లో నాకు ఎంతో ప్రయోజనం కనబడుతున్నది. నేనడిగిన ప్రశ్నలకు సమాధానరూపంలో ఎంత ఉపయోగకరమైన మాటలు చెప్పారు! మీ సాహచర్యం లభించడం నా అదృష్టం. అవును నిజమే. తాళపత్రగ్రంథాలను తలకెక్కించడం నిజంగా వెఱ్ఱితనం. తాళపత్రగ్రంథాలు బండ్లకొలదీ ఉన్నాయి. వాటిని పఠించడంతోనే కాలాన్ని వెళ్ళబుచ్చేవాడికి ప్రకృతి సౌందర్యం చూచి ఆనందించే అవకాశం ఉంటుందా? పఠనా జనిత జడత్వం ఆవహించిన హృదయంలో జీవరాసులయెడ ప్రేమసౌహార్ద్రాలు పెంచుకొనే అవకాశం ఉంటుందా? దయార్ద్ర భావానికి చోటుంటుందా? ఉండదు ఉండదు ఉండదు. ఆశ్రమవాసులకు ప్రధానంగా ఉండవలసిన లక్షణం సహృదయత అన్నారు. ఎంత సత్యమైన మాట! పోలికలు తీర్మానాలు చేయరాదని మీరు చాల ఉపయోగకరమైన మాట కూడ చెప్పారు. ఆమాట గాఢంగా నా హృదయంలో నాటుకుంది. 'ఈ తత్త్వవేత్త కన్నా ఆ తత్త్వవేత్త గొప్ప, ఆ గ్రంథం కన్నా ఈ గ్రంథం గొప్ప, ఆ అవతార పురుషుడికన్నా ఈ అవతార పురుషుడు గొప్ప'-ఇలా ఎన్నో రకాలుగా నాహృదయంలో ఇన్నాళ్ళు నాటుకొనిపోయిన దురభిమానభావాలన్నీ ఒక్కసారిగా పటాపంచలయ్యాయి. ఈ పోలికలు, తీర్మానాలు అజ్ఞానపు గనులని ఇప్పుడు తెలుసుకున్నాను. జీవకరుణాహృదయునులైన ఈ ఆశ్రమవాసినుల తీరు చూచినప్పటినుండి నా స్మృతిపథంలో మెదలుచున్న ఒక ఉదంతం మీకు చెప్పాలని ఉంది. పోలికలు, తీర్మానాలతో కాదు. ఊరక ఒక ఘటనగా సంఘటనగా చెబుతాను. వినండి. చోళమండలంలో నేను ప్రయాణం చేస్తూ పాలారునదీ తీరంలోని ఒక ఆశ్రమంలో ఒకరోజు అడుగు బెట్టాను. ఆ ఆశ్రమం నిండా నారికేళవృక్షాలు. ఆ ఆశ్రమంలో అడుగు పెట్టిన వెంటనే నన్నొక దృశ్యం ఆకర్షించింది. ఒక నారికేళ వృక్షం చుట్టూ ఆ ఆశ్రమవాసులైన బ్రహ్మచారులు సన్యాసులు గుమికూడి 'పట్టు కొట్టు' అని పెద్దగా అఱవడం దూకడం చూచాను. నాకాశ్చర్యం వేసి దగ్గరకు పోయి చూస్తే ఏమున్నది? 'మరనాయ్' అనే జీవిని తప్పించుకు పోనీయకుండా మళ్ళించి చంపే ప్రయత్నంలో ఉన్నారు. ఆ దృశ్యం చూడలేక నేను దూరంగా వచ్చేశాను. 'మరనాయ్'ని సంస్కృతభాషలో ఏమంటారో నాకు తెలియదు. దాని రూపు ఇప్పుడు సరిగా గుర్తులేదు. ముంగిస నక్క కుక్క ఈ మూడు జంతువుల పోలిక ఉన్న చిన్న జంతువది. నారికేళవృక్షాల నెక్కి నారికేళాలకు చక్కని చిన్న రంధ్రం చేసి నారికేళ జలాన్ని త్రాగే జంతువది. భగవంతుడు దానిని ఆ విధంగా సృష్టించాడు. పాపం దాని దోషం ఏముంది? ఎలాగో అది చేతికి దొరికింది కదా అని దాన్ని వాళ్లు కసితో చంపివేయడం నాకు కర్కశం అనిపించింది. ఆ హింసాకాండను చేసింది

సాధారణజనులైతే నాలో ఆ మనోవిక్రియ కలిగి ఉండదు. ఆశ్రమవాసులు ఆ విధంగా ఒక అల్ప ప్రాణిని చుట్టు ముట్టి మట్టు బెట్టడం చూసి మనస్సులో వాళ్ళను విమర్శించకుండ ఉండలేకపోయాను. ఈ ఉదంతం ఊరక చెప్పాను. ఆ ఆశ్రమాన్ని ఈ ఆశ్రమంతో పోల్చి నిందించడం నా ఉద్దేశం కాదు. మీరన్న అమూల్యమైన మాటలు నేను ఎన్నటికీ మఱచిపోను'' అన్నాడు కందసామి. కంద సామి చెప్పినదంతావిని సాధువు ఇలా అన్నాడు: ''మురుగానందం! నీకు ఒక మాట చెప్పాల నుంది. విను. కనబడినదాన్ని కనబడినట్లు గానే చూడు. అది మరొకవిధంగా ఉండాలని ఎందుకనుకోవాలి? మనిషిని మనిషిగానే చూడు. సన్యాసి, బ్రహ్మచారి, వైదికుడు, బ్రాహ్మణుడు, క్షత్రియుడు అనే తొడుగుల రూపంతో చూడవద్దు. తొడుగుల రూపంతో మనుషులను చూచి నప్పుడు ఆ తొడుగులకు తగిన ప్రవర్తన వారిలో కనబడనప్పుడు మనస్సు విమర్శనకు దిగుతుంది. ఏమి సన్యాసి, ఏమి బ్రహ్మచారి, ఏమి బ్రాహ్మణుడు అని. ఈ విమర్శనా ధోరణి మనోచేష్ట. మనోచేష్ట లను శమింపజేయడమే మన లక్ష్యం కాబట్టి మనం ఉన్న దాన్ని ఉన్నట్లుగా ఉన్న తీరును ఉన్నట్లుగా ఉన్న రూపును ఉన్నట్లుగా చూడాలిగాని 'ఇట్లుండవలెను అట్లుండవలెను' అనే విమర్శనా ధోరణులకు దిగరాదు. మని షికి తొడుగులు తగిలించకుండ మనిషిని మని షిగా మనం చూడగలిగితే చాలు చాలవఱకు సాధనాగమ్యం చేరినట్లే.''

---

## నవంబరు సంచికలోని సమీక్షమీద లేఖ

సమీక్షకులు అనుకొనినట్లు ఈ గ్రంథము భాగవతకృష్ణునకు మాత్రమే పరిమితమైనది కాదు ఒకవ్యక్తి ఊహించిన కృష్ణుడూ కాదు. 'మహాభారత కృష్ణుడు' 'జైమినీభారత కృష్ణుడు' 'కృష్ణావతార కృష్ణుడు' ఇంకా ఎన్నో గ్రంథాలలో ల కృష్ణుడు యిందులోనికి వచ్చాడు, ఇంకా మిగిలిన ఏడుభాగాల లోనికి వస్తాడు. ఈ నవంబరు 'శ్రీ రామకృష్ణప్రభ' సంచికలోనే తెలుగుదేశపు వారెవరూ యెరుగని క్రొత్తవిధముగ 'కాళీయమర్దన' గాథ హిందీగ్రంథముల ఆధారముతో ప్రచురింపబడింది. అలా కృష్ణగాథలనంతముగా ఉన్నాయి. వీటయినన్ని కృష్ణగాథలను సమీకరించి అందలి తత్వమును విశదీకరించుచే ఆశయముగాగల యీ గ్రంథమునకు సమీక్షకులు విధించిన పరిమితి చెల్లదు.

ఆయా పాత్రపోషణలో ఏలోపములు జరిగేయో చెప్పకుండా పాత్రపోషణ లేదనడం సబబు కాదు ఏపాత్రలు, రచయితకే తెలియకుండా, ప్రయోజనరహితంగా ప్రవేశపెట్టబడలేదు. ఏవాక్యమూ అనవసరముగా అర్థరహితముగ వ్రాయబడలేదు. అనుచితము, అసమంజసము అయిన ఊహాగానాలు మచ్చుకైనా లేవు. గ్రంథాన్ని సమగ్రంగా చదివిన వారు ఆ విషయాలను గ్రహించి ఆనందించగలరు.

రాధవిషయము భాగవతములో అసలు లేనేలేదనే మాట వాస్తవమే. కాని రాధ లేకపోలేదు. ఇతరగ్రంథాలలో రాధనుగూర్చిన గాథలున్నాయి, ఆంధ్రప్రజానీకానికి రాధ ఒక ఆరాధ్యదేవత. ఆడవారిలో రాధలు, మగవారిలో రాధా కృష్ణులు మనలో ఎందరున్నారో సమీక్షకులకు తెలియని విషయం కాదు. ఆ రాధను గురించి, రాధాకృష్ణ సంబంధములను గురించి ఎన్నెన్నో అనాహ్లాదకరమగు గాథలు పుక్కిటి పురాణాలుగా వ్యాపించాయి. క్రైస్తవమతప్రచారకులకు మన పురాణాలను అపహసించడానికి సాధనాలవుతున్నాయి. అలాంటి ప్రమాదాలను అరికట్టడానికి రాధను బృందావన కృష్ణుని ఆరాధ్యదేవతగా, అర్ధాంగిగా చిత్రించి ప్రకటించారు మున్షీగారు. ఆ రాధామాధవప్రణయంలోని ఆధ్యాత్మికత వివరింప బడింది యీ కృష్ణచరిత్రలో. బహుళప్రయోజనసాధకములగు రాధామాధవగాథలలో ప్రాశస్త్యమును, రామణీయకతను, ఆవశ్యకమును సమీక్షకులు ఆమోదింతురు గాక!

ఇక మూల్యం విషయం - గ్రంథానికి ఉపయోగించిన కాగితములరకము, ఆకాశాన్నంటుతున్న కాగితపుధరలు, రోజురోజుకి పెరిగిపోతున్న ముద్రణ బైండింగు చార్జీలు కాలాన్నిబట్టి ఆరోహణమార్గంలోనున్న చిత్రకారుల విలువలు, వీటన్నిటిని మించి, ప్రెస్సునుండి బయటపడిన పుస్తకం చదువరికి అందేలోగా మారే చేతులు, ఆ మారడంలో అయ్యే ఖర్చులు, కమీషన్లలో సన్నిహితసంబంధం కలిగియుంటే సమీక్షకులు ధరను గూర్చిన సూచనను చేసియుండేవారు

# బలవానింద్రియ గ్రామో

మేరికపూడి సీతాపతిరావు

వ్యాసభగవానుడు తమ శిష్యులకు భాగవతం బోధిస్తున్నారు. శిష్యులందరూ ఏకాగ్రతతో వింటున్నారు. ఒక సందర్భంలో వ్యాస భగవానుడు "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" అని అన్నారు. అనగా "ఎంత విద్వాంసునైనను ఇంద్రియములు వశపరచుకొనును. ఇంద్రియములను జయించుట మిగుల కష్టము" అని యర్థము. ఈ మాటలు విన్న వైశంపాయనుడు వెంటనే "గురువర్యా! ఇంద్రియములు సామాన్య మానవుని లోగొనును గాని విద్వాంసులను గూడా వశపరచుకొనునా? ఈ మాటలు విపరీతముగా ఉన్నవి. వీటిని నేను ఒప్పుకొనను. కనుక మీరు 'బలవానింద్రియగ్రామో విద్వాంసం నాపకర్షతి - ఇంద్రియములెంత బలవంతమైనవైనను విద్వాంసులను మాత్రము లోబరచుకొనలేవు'-అని సవరింపవలసినదని ప్రార్థించుచున్నాను" అన్నాడు. వ్యాసభగవానులు నిర్విణ్ణులైనారు. "అఁ. ఏమీ. అటులనా" అని ఊరకున్నారు. "ఈనాటికి ప్రవచనం చాలించుదాము" అంటూ వ్యాసభగవానులు లేచి తమ ఆశ్రమంలోనికి వెళ్ళారు. శిష్యులు వారి వారి కుటీరాలకు చేరుకొన్నారు.

వైశంపాయనుడు సాయంకాల అనుష్ఠానాదికములు ముగించుకొని ఆశ్రమంలో ఒంటరిగానే ఉన్నాడు. ఎందుకో ఆయనకు మానసికంగా వైకల్యం ఏర్పడింది. ఆయన 'ఇలా ఎందుకున్నదా' అని ఆలోచన చేసేటంతలో ఆకసంలో మబ్బులు కమ్ముకుంటున్నాయి. ఆకసంలో గాఢాంధకారం అలముకొన్నది. చిన్నగా చినుకులు ప్రారంభమైనవి. చూస్తుండగానే జడివాన. గాలి. ఉరుములు మెరుపులు. వైశంపాయనుడి మనసులో కూడా సంఘర్షణ ప్రారంభమై బయటి వాతావరణం వలెనే మనసులో కూడా ప్రశాంతి కొరవడింది. ఇంతలో బయట తలుపు తట్టిన చప్పుడైంది. వైశంపాయనుడు ఎవరా అని ఆలోచన చేసేటంతలో ఒక స్త్రీ కంఠం వినిపించింది. తలుపు దగ్గరకు వెళ్ళి గడియ తీశాడు. ఎవరో ఒక స్త్రీ వానలో తడిసి ముద్దైన గుడ్డలతో వణుకుతూ ఆయన అనుమతి కోసం చూడకుండానే లోపలికి వచ్చి నిలబడింది. ఆమెను వైశంపాయనుడు ఆశ్చర్యంతో చూస్తున్నాడు. "ఈ సమయంలో నీవు ఒంటరిగా ఈప్రాంతానికి ఎందుకు వచ్చావు" అన్నాడు. ఆమె దారి తప్పి వర్షం నుంచి తప్పించుకొనడానికి వేరే మార్గం లేక ఆశ్రమానికి వచ్చినట్లుగా చెప్పి తనకు కట్టుకొనడానికి ఏదైనా ఒక పొడిగుడ్డ ఇమ్మన్నది. ఆయన తన శాటీని ఇస్తాను కట్టుకొమ్మన్నాడు. ఆమె గుడ్డ మార్చుకొనడానికి మరుగుగా ఉంటుందని ఒక తడిక అడ్డంగా ఉన్న గదిలోకి వెళ్ళి తడిక మీదగా చేయి జాపి పొడిగుడ్డను అందివ్వమన్నది. ఆయన తడికకు ఆవలి వైపున ఉండి గుడ్డ అందించాడు. అలా గుడ్డను ఆమెకందించే సమయంలో ఆమె హస్తస్పర్శ ఈయనకు కలిగింది. అంతకు మునుపే మనో వైకల్యము. ఒంటరితనము. దానికితోడు కామ ప్రకోపకారకమైన వాతావరణం. ఇక చెప్పేదేమున్నది? వైశంపాయనుడు విజ్ఞత కోల్పోయాడు. తడిక దాటి ఆమె కడకు వెళ్ళాడు. మసక మసకగా ఉన్న వెలుగులో ఆమె చీర మార్చుకొనే ప్రయత్నంలో ఉండగా చూచాడు. ఆమె తన ఎదురుగా ఈయనను చూచింది. అనుకొనని పరిణామం. వెంటనే ఆమె "స్వామీ ఏమిటిది? మీరు ఎందుకిలా వచ్చారు? నేను చీర మార్చుకొనేదెలా? దయచేసి అవతలకు వెళ్ళండి" అని ప్రాధేయపడింది

## బలవానింద్రియ గ్రామో

ఈయనగారు ఆమె చెప్పేది వినగలిగే స్థితిలో గాని విని అవతలకు పోగలిగే స్థితిలో గాని లేడు. ఒక అడుగు ముందుకు వేశాడు. ఆమె ఒక అడుగు వెనుకకు వేసింది. ఈయన స్థితిని ఆమె గ్రహించి ఈయననుంచి తప్పించుకొనే ప్రయత్నంలో అటూ ఇటూ పరుగిడింది. ఆయన కూడా ఆమెను అందుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. అప్పుడామె "స్వామీ! మీరిలా చేయడం భావ్యమేనా? నన్ను వదలండి" అన్నది. ఇవి ఆయన చెవికెక్కలేదు. అలసిపోయి ఆమె "అయ్యా! మీరు విద్వాంసులు. గుర్తించండి. విద్వాంసులిలా చేస్తారా?" అన్నది. ఈ మాటలకూ ఆయన చలించలేదు సరిగదా ఆమెను అంది పుచ్చుకొని కౌగిలిలో చేర్చుకొనడానికి ప్రయత్నం చేశాడు. ఆమె మాత్రం "అయ్యా! మీరు విద్వాంసులే ఇలా చేయవచ్చా" అని అంటూనే ఉన్నది. కాని ఆయన మాత్రం ఆమెను కౌగిలిలో చేర్చుకొని పరవశతం పొందేటంతలో... తను అనుభవింపవలసినది కోమలమైన స్త్రీ స్పర్శ కావడానికి బదులుగా గడ్డము మీసములతో గరుకుగానున్న పురుష దేహస్పర్శ పొందేడు. వివశత్వం పోయి బాహ్య ప్రపంచంలోకి వచ్చాడు. తన కౌగిలిలో గురువైన వ్యాసభగవానుడు. బయట వాన లేదు. ఉరుములు లేవు. మెరుపులు లేవు. అంతవరకు జరిగినదంతా స్మృతికి తెచ్చుకొన్నాడు వైశంపాయనుడు. ఎదురుగా గురువైన వ్యాసభగవానుడు. ఇక వైశంపాయనునికి నోట మాట రాలేదు. వ్యాసుని కాళ్ళ మీద పడి "గురువర్యా! నా తప్పిదాన్ని మన్నించండి. పొరపాటున మీమాటకు ఎదురు చెప్పి విద్వాంసులైనవారు ఇంద్రియముల జయించుదురని భావించాను" అని అంటూ "బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అన్న మాటను ముమ్మారు ఉచ్చరించాడు. తనకు గుణపాఠం నేర్పడానికి వ్యాసభగవానుడిలా చేశాడని భావించాడు వైశంపాయనుడు.

---

ఇదే నీకు నా ప్రార్థన ప్రభో!
నరుకు నరుకు.
నా హృదయంలోని దరిద్రాన్ని సమూలంగా నరుకు.
నా సుఖదుఃఖాల్ని తేలికగా తీసుకునే బలాన్ని నాకియ్యి.
సేవలో నా ప్రేమను సఫలం చేసుకునే శక్తిని ప్రసాదించు.
దీనుల్ని నిరాకరించే దుర్గతినించి నన్ను తప్పించు.
మదాంధులముందు మోకరించనీని అభిమానాన్ని నాలో పెంపొందించు.
నిత్యజీవనంలోని అల్పవిషయాలనించి నా మనసుని తప్పించే నేర్పు నియ్యి.
ప్రేమలో నీ సంకల్పానికి నాశక్తిని అర్పించుకొనే బలాన్ని కటాక్షించు.

—చలం తెనిగించిన గీతాంజలినుండి.

---

బాలల శీర్షిక

# నేతాజీ సుభాష్‌చంద్రబోస్

అరిపాక సూరిబాబు

భారతదేశపు స్వాతంత్ర్య సంగ్రామములో గాంధీజీ తర్వాత చెప్పుకోదగ్గవారిలో అగ్రగణి వీరుడు నేతాజీ! "జైహింద్" అనే నినాదాన్ని దేశం అన్ని మూలలా ప్రజ్వలింపజేసిన గొప్ప దేశభక్తుడు. "ఆజాద్ హింద్ ఫౌజ్" అనే భారత స్వాతంత్ర్యసేనను ఏర్పరచి వేలాది వీరులను తయారు చేసిన నాయకుడు. అందువలనే అతను అందరికీ నేతాజీ అయి కీర్తిగాంచాడు. దేశం కోసం అహర్నిశలు తన దీక్షను దృఢంగా కొనసాగించిన ధీరోదాత్తుడు. ఆధ్యాత్మికజ్ఞానం, విజ్ఞానప్రగతి. రాజకీయ పరిజ్ఞానం అన్నీ నిండుగా మేళవించిన మహామేధావి!

ఒరియా, బెంగాలి, సంస్కృతం, హిందీ, తెలుగు. పంజాబి. ఇంగ్లీష్, జపాన్, చైనా, రష్యా మొదలగు భాషల నెరిగిన బహుభాషావేత్త. కొన్ని భాషల్లో ఉద్దండుడు! సాటి మానవులను సమాదరించే సహృదయం, మాతృదేశంపై భక్తిశ్రద్ధలు, ధార్మికజీవనంపై అచంచల విశ్వాసం కల్గిన సుభాష్‌చంద్రబోస్ జీవితంలో సంభవించిన సంఘటనలు ఉత్తేజాన్ని కల్గించి మనలో నవచైతన్య బీజాలు నాటగలవనుటలో సందేహం లేదు!

ఈనాటి విద్యార్థులు సుభాష్‌చంద్రబోస్ గురించి సమగ్రంగా తెలుసుకోవడం ఎంతో అవసరం! వారి భావి జీవితానికి బాటలు తీర్చిదిద్దగలవు.

ఈ వీరకిశోరము తే 23-1-1897 న ఒరిస్సా రాష్ట్రమైన కటక్‌లో జానకీనాధుడనే న్యాయవాదికి పుత్రుడుగా జన్మించాడు. పచ్చని మేనిఛాయతో ముద్దుగొల్పు మోముతో ఉన్న ఈ శిశువుకి తల్లి-తండ్రులు సుభాష్‌చంద్రబోస్ అని నామకరణం గావించారు.

జానకీనాధుడు సామాన్య కుటుంబీకుడు. కుటుంబం పెద్దది. దానికితోడు ఎప్పుడూ బంధువులు వచ్చి రోజులు తరబడి వుంటుండేవారు. ఆదాయం వస్తున్నప్పటికీ ఖర్చు అధికం కావడం వల్ల మిగిలేది కాదు. కన్నబిడ్డలకు కావలసిన సదుపాయాలు అంతగా చేయలేకపోయేవాడు. అలాగని నిర్లక్ష్యం చేయలేదు. పౌరుషంగా, ఆత్మవంచన లేకుండా తన జీవితాన్ని కొనసాగించేవాడు.

ఐదవ సంవత్సరం వయస్సులో పాఠశాలలో సుభాష్‌ను జాయిన్ చేసారు. ఎంతో సంబరపడిపోయాడు అన్నలతోను, అక్కలతోను కలిపి తనూ చదువుకోసం పాఠశాలకు వెళుతున్నందుకు. నేనూ పెద్దవాడ్ని అయిపోయాను అన్నంత తృప్తి ఆ లేతప్రాయంలో సుభాష్‌లో కల్గింది! కాలం దొర్లుతుంది! సుభాష్ వయసు పెరుగుతుంది. తను చదువుతున్న విద్యావిధానం తీరుతెన్నులు నచ్చేవి కావు. తోటి విద్యార్థులతో వ్యాఖ్యానాలు, విమర్శనలు చేసేవాడు. స్కూల్ పుస్తకాలు ఆంగ్లేయుల గొప్పతనం గురించేగాని, భారతీయుల గురించి వుండేవి కాదు. అవి సుభాష్‌కి దేశాన్ని అవమానించినట్లు బాధ కలిగేవి. తను చదువుతున్న స్కూల్ ఆంగ్లేయులకి ఉద్దేశించబడినది. బెంగాలి, సంస్కృతం భాషలు నేర్చుకోవాలని తనకి ఉన్నా అవకాశం లేకపోయింది. ఇంగ్లీష్ భాష మాట్లాడ్డంలో కట్ట అనిపించుకున్నాడప్పుడే ఆ స్కూల్లో చదవడం ఇష్టం లేకపోవుటచేత, భారతీయ పాఠశాల్లో చేర్పించారు సుభాష్‌ని. అప్పటికి అతని వయస్సు 12 సంవత్సరాలు. అందులో ప్రవేశించిన క్రొత్తల్లో సుభాష్ రాసిన పాఠాలు ఉపాధ్యాయుడు చదువగా విద్యార్థులు హేళనగా కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వేరు. తనకి బెంగాలి, సంస్కృతం రానందున కదా ఇలా హేళన చేస్తున్నారు? అని మనస్తాపం కలిగింది. పట్టుబట్టి కృషి చేస్తే మాతృభాష నేర్చుకోలేనా? అని దీక్ష వహించాడు. రాత్రనక పగలనక కష్టపడి చదివాడు. తత్ఫలితంగా ఆ సంవత్సరం క్లాసంతటికి ఫస్ట్ వచ్చాడు సుభాష్!

తను చదువుతున్న పాఠశాల ప్రధానోపాధ్యాయుడు వేణీమాధవదాసు జీవితవిధానం బాగా గమనించాడు. అతనివలె ఆదర్శంగా నడుచుకోవాలని మనసులో నిశ్చయించుకున్నాడు. దురదృష్టవశాత్తు వేణీమాధవదాసు బదిలీ కావల్సి వచ్చింది. ఆనాడు వీడ్కోలుసభ పాఠశాల ఆవరణలో ఘనంగా జరిగింది. అంతా ఆనందంగా కరతాళధ్వనులు చేస్తున్నారు. కానీ సుభాష్ కన్నీరుపెట్టుకొని బావురుమన్నాడు. తన మనసుకి నచ్చిన ఒకే వ్యక్తి తనకి దూరంగా వెళిపోతున్నందుకు చాలా బాధపడ్డాడు.

ఒక ప్రక్క విద్యాధ్యయనంచేస్తూ, తీరికసమయాల్లో సంస్కృతభారతం, కాళిదాసుకావ్యాలు శ్రద్ధగా పఠించేవాడు. ఏకాంతప్రదేశాల్లో కూర్చొని ప్రకృతిసౌందర్యాన్ని ఆసక్తితో చూస్తూ మైమరచిపోతుండేవాడు. ఆ ప్రశాంత ప్రదేశాల్లో ఏవేవో ఆలోచనాతరంగాల్లో ఊగిసలాడేవాడు. పలానాదృష్టి అని నిర్ణయించుకోలేక సతమతమయ్యేవాడు. తను దేనికోసం తపన పొందుతున్నదీ నిర్ధారించుకోలేకపోయాడు. మానసికకల్లోలసాగరంలో ఒకనావ చేజిక్కింది. ఆనందతరంగాలలో తేలియాడిపోయాడు. అదే వివేకా

నందుడు రాసిన ఒక గ్రంథం। చదువుతున్నకొద్దీ తనలో మాటుమణిగి వున్న ఆధ్యాత్మికభావాలు వికసించసాగేయి. ఇన్నాళ్ళబట్టి అన్వేషించినది ఈ గ్రంథంలో ఇమిడివుంది. 'ఆత్మనో మోక్షార్థమ్-జగద్ధితాయ చ' (నీ ముక్తి కొరకును, ప్రపంచహితవుకొరకును ప్రయత్నించుము) అను వివేకానందుని సూక్తిసారాన్ని తన జీవితపుబాటగా గ్రహించాడు। "సోదరులారా! మీశక్తికొలది ఉద్ఘోషింపుడు. కట్ట బట్టలేని భారతీయుడును, అక్షరజ్ఞానంలేని భారతీయుడును, బ్రాహ్మణుడు అయిన భారతీయుడును, కడజాతిగా నెన్నబడు భారతీయుడును, ఎల్లరను నా సోదరులే యని గొంతెత్తి చాటుడు"-అని ఆవేశంతో వివేకానందుడు పలికిన మాటల్లో యథార్థాన్ని తెలుసుకున్నాడు సుభాష్. వివేకానందుని ఉపన్యాసాలు, రచనలు అన్నీ కూలంకషంగా అర్థం చేసుకుంటున్నాడు. శ్రీరామకృష్ణపరమహంస బోధనలు చదవగా చదవగా, "అహంభావము, కోరికలు నశించిననేకాని ముక్తి లేదు" అన్న సూక్తి సుభాష్‌చంద్రుని హృదయంలో నాటుకుంది. తదాదిగా భక్తిరసప్రధానమైన పాటలు పాడుకుంటూ భజనలు చేసేవాడు మిత్రులతో కలసి.

చదువుయందు శ్రద్ధ సన్నగిల్లి పాటలు పాడుకుంటూ తిరగడం వల్ల తల్లిదండ్రులకు చాలా బాధ కల్గింది. తల్లి నానావిధాల బ్రతిమలాడి చెప్పింది; బాగా చదువుకుని అభివృద్ధిలోకి రమ్మని. ఎవరు ఎన్ని చెప్పినా మనసులో నిశ్చయాన్ని మార్చుకోలేదు. మానసికవికాసం, ఆధ్యాత్మిక ధ్యానం ఈ రెండే తనమనసులో తిష్ఠ వేసుకున్నాయి. జపం, హఠయోగం చేసేవాడు. గురువు వద్ద శుశ్రూష చేస్తే సాధన సఫలమౌతుందని, విశ్వమానవకల్యాణమునకు పాటుపడనిదే ఆధ్యాత్మిక అభివృద్ధి లేదని నిర్ణయించుకున్నాడు. తోటి మానవులకు, రోగగ్రస్తులకు సేవ చేస్తూ, చేతనైనంత దానములు చేస్తూ, గ్రామపురోభివృద్ధికి మిత్రులతోకలసివెళ్ళి కొన్ని పల్లెలలో గ్రామాల్లో పాఠాలు చెప్తుతుండేవాడు. ఇలా కొన్నాళ్ళు సాగింది।

అప్పటికి మెట్రిక్ పాసయిన సుభాష్‌చంద్రుని తల్లిదండ్రులు పై చదువులకి కలకత్తా పంపించారు. కటక్‌లో ఉన్నత తరగతులు లేకకాదు, తమమాట లక్ష్యపెట్టలేదని, సాంప్రదాయాల్ని ఖాతరు చెయ్యడంలేదని, భజనలు చేస్తూ పిచ్చిగా పాడుకుంటూ సంచారం చేస్తున్నాడని, ఇవన్నీ తమ కళ్ళముందు కనిపిస్తుంటే సహించలేక కలకత్తా పంపించారు.

కలకత్తా చేరేక 'సాధు' సంసేవనపై కొంచెం ఉత్సాహం తగ్గించి మంచి 'గురువు'కోసం అన్వేషణ ఆరంభించాడు. స్థానికంగా ఎవరూ శక్తిమంతుల్లా కనిపించలేదు. అందుచేత స్కూల్‌కి వేసవి సెలవులు ఇవ్వగానే ఇంట్లో వారికి, ఇతరులకు చెప్పకుండా బయలుదేరాడు.

అది 1914-వ సంవత్సరం. హృషీకేశ్, హరిద్వార్, కాశీ, గయ, మధుర, బృందావన్‌వంటి పుణ్యక్షేత్రాలను దర్శించాడు. 'ధర్మం అంటే ఏమిటి? దేముడంటే ఏమిటి?' అన్నటువంటి తన సందేహాలు తీర్చగల్గేవాడికోసం శ్రమపడి వెతికాడు. అనేకమంది కనిపించినప్పటికి, ఎవరూ తనకు సంతృప్తికరంగా సమాధానాలు చెప్పలేక పోయేసరికి విసుగుజెందాడు. ధర్మం, దేవుడు గురించిన జిజ్ఞాసను శాంతింపజేసుకొని తిరిగి కలకత్తా చేరుకున్నాడు.

సుభాష్‌చంద్రునిలో భగవంతుని భక్తికి మూలబీజాలు తల్లివల్లే నాటాయి. ఆమె దైవభక్తురాలు. నిత్యం పూజలు చేస్తూ, పురాణాలు చదువుతుండేది. దానధర్మాలు చేస్తూ గృహిణిగా తనధర్మాన్ని నెరవేర్చుకుంటుండేది. చరిత్రలు, పురాణాలు తనపిల్లలకి చదివి వినిపిస్తుండడంవల్ల సుభాష్‌లో అవి చెరగని ముద్ర వేసుకున్నాయి. అందరివలె చదవడం, వినడం కాకుండా ఆచరణలో పెట్టడంకోసం తను కృషి చేయసాగాడు.

అప్పుడు ప్రపంచ ప్రథమ సంగ్రామం జరుగుతుంది. దేశంలో రాజకీయ వాతావరణం అన్నిచోట్ల ప్రబలుతుంది. విధ్వంసక చర్యలకు, విప్లవనాయకులకు నిలయమైన కలకత్తానగరంలో వేడి పుంజుకుంది. ఆనాడు ఆంగ్లేయులు, మన భారతీయులకు చాలా ఇబ్బందులు కల్గజేసేవారు. దౌర్జన్యాలు జరుపుచుండేవారు. సుభాష్‌మాత్రం ఏ విప్లవకారుల జట్టుతోను కలవలేదు రాజకీయ వాతావరణం గమనించడమే కాని, పాల్గొనాలనే దుడుకుతనం తనలో కల్గలేదు. ఎందుచేతనంటే తనలో ఆధ్యాత్మికమైన చింతన ఎక్కువగా వుండడం వల్ల.

ఇంచుమించు అదే కాలంలో తను చదువుతున్న కళాశాలలో ఒక ప్రొఫెసర్ ఒక సందర్భంలో భారతదేశాన్ని, భారతీయులను తూలనాడాడు. బాధాకరమైన ఆ మాటలు విన్న సుభాష్ హృదయం అట్టుడిగిపోయినట్లయింది. తన మిత్రుల అండదండలతో, ఆ ప్రొఫెసర్‌పై మాటలతో, ఎదురు తిరిగారు. మాటామాటా పెరిగిపోయి విద్యార్థులకు, ప్రొఫెసర్‌కి చాలా గొడవలు జరిగాయి. ఈ కారణంగా సుభాష్ బృందంపై రిపోర్టు వెళ్ళింది. దీని ఫలితంగా

సుభాష్ బృందం పేర్లన్నీ రిజిష్టర్ బుక్‌లోంచి తీసి వేసారు.

కళాశాలలో జరిగిన ఈ సంఘటన వల్ల సుభాష్‌చంద్రుడు విద్యార్థులందరకూ నాయకుడుగా పరిగణనలోకి వచ్చాడు. అప్పుడు ప్రభుత్వ నిర్బంధ విధానం చాలా కఠినంగా వుండేది. నాయకులన్న వారందర్నీ జైళ్ళలో పెడుతున్నారు. కొందరు బంధువులు ఈ పరిస్థితిలో సుభాష్ ఇక్కడ వుండడం మంచిది కాదని తల్లితండ్రుల దగ్గరకి కటక్ వెంటనే పంపించేసారు.

కటక్‌లో తీరిగ్గా కూర్చొని ఎన్నాళ్ళుండగలడు? తన అభిప్రాయాలు తల్లిదండ్రులకు, అక్కడి మిత్రులకూ నచ్చలేదు. కటక్‌లో వుండాలనిపించలేదు. విదేశాలకు వెళ్ళి చదువుకుంటానని తండ్రితో చెప్పాడు. "కలకత్తాలో బియ్యే చదువు పూర్తి చేసి మంచిపేరు తెచ్చుకుంటే తర్వాత విదేశాల సంగతి" అన్నాడు జానకీనాథుడు.

ఎలాగయితేనేం తన అన్న శరత్‌చంద్రబోస్ వేరొక కళాశాలలో తమ్ముడు సుభాష్‌చంద్రుని జాయిన్ చేసాడు. క్రమశిక్షణతో జాగత్తగా చదువుకుంటూ, సైనిక శిక్షణ కూడా పొందాడు. అప్పుడు తండ్రికి తృప్తి కల్గింది.

1919 సం॥లో బియ్యే పాసయిన తర్వాత ఇంగ్లండ్‌లో చదువుకోడానికి పయనమయ్యాడు సుభాష్.

కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో ఐ. సి. యస్. పరీక్షకై సుభాష్ చదువు ప్రారంభమైంది. అక్కడ విద్యార్థులకివ్వబడే స్వాతంత్ర్యం, గౌరవం చూచి ఆశ్చర్యపడ్డాడు. చదువు సక్రమంగా కొనసాగింది. ఐ.సి.యస్. పరీక్షలో సుభాష్ నాల్గవవాడుగా ఉత్తీర్ణుడయ్యాడు....కలకత్తా తిరిగి వచ్చేసాడు.

ఉన్నతవిద్య నభ్యసించినవాడు ఉన్నతోద్యోగి కాగలడని అంతా ఆశపడుతుంటారు. అసలు చదుకోవడమే ఉద్యోగం కోసం అనే దృక్పథం కల్గినవారు కూడా వున్నారు. సుభాష్‌చంద్రుడు ఏమిటిచేస్తాడిప్పుడు? అనే ఆత్రుతతో కొందరున్నారు. ఉద్యోగావకాశాలు వస్తే తిరస్కరించాడు సుభాష్. ఇక్కడనుంచి తన జీవితం ఎన్నో మలుపులు తిరగడం ప్రారంభించిందని తెలుసుకున్నాడు. తను మానవసేవ చేస్తూ, ఆధ్యాత్మికోన్నతికి పాటుపడవలెనని సంకల్పించుకున్నాడు. ఉద్యోగం చేసి ప్రభుత్వం యందు చిక్కుకొన్నచో ప్రజాసేవకు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు అవకాశమంటుందా? ధనం సంపాదించి సుఖమయ జీవనం గడపడమంటే గిట్టలేదు. పెళ్ళిచేసుకుంటే ఎన్నో బంధాలు. అందుచేత బ్రహ్మచారిగానే వుండి తనకు నచ్చిన విధంగా దేశానికి సేవ చెయ్యాలి అని మనసులో నిశ్చయం చేసుకున్నాడు.

మహాత్మాగాంధీ దేశ స్వాతంత్ర్యం కోసం ఉద్యమం జోరుగా సల్పుతున్నట్లు విన్న సుభాష్‌చంద్రబోస్ బొంబాయిలో గాంధీగార్ని కలుసుకొని "దేశ స్వాతంత్ర్యసాధన విషయమున పథకమేమైన వుంటే తెలుపవలసింది"ని ప్రార్థించాడు. గాంధీ ఏమీ వివరించలేదు. బోస్‌తో ఎక్కువగా ఏ విషయం మాట్లాడలేదు. తనకు ఆశాభంగమైనందుకు బాధపడ్డాడు.

బెంగాల్ దేశంలో ప్రముఖనాయకుడుగా వన్నెకెక్కిన చిత్తరంజన్‌దాసు ఇంటికి వెళ్ళి మాట్లాడాడు. ఇద్దరు మనసిప్పి మాట్లాడుకున్నారు. దేశస్వాతంత్ర్యమనే యజ్ఞంలో తను ఒక సమిధయై సాయపడ్డానికి సుభాష్‌చంద్రబోస్ సిద్ధపడ్డాడు. ఈవిధంగా దేశానికి, ప్రజలకు సేవచేయడం మంచిదనుకున్నాడు.

అప్పుడు వేల్సుయువరాజు భారతదేశమునకు రానున్నట్లు ప్రచారం ఘనంగా కొనసాగుతుంది. భారతదేశం రాకుండా మరలిపొమ్మని వీరావేశంతో భారతీయనాయకులు పెద్దపెట్టున నినాదాలు చేసారు.

గాంధీమహాత్ముని సహాయనిరాకరణ సమరసంరంభం కడలితరంగాలవలె ఉవ్వెత్తున లేచి భారతీయులందరిని తాకింది. దీంతో సోమరిపోతులు, పిరికిపందలు తప్ప అందరూ ఈ ఉద్యమంలో దూకినవారే. న్యాయస్థానములు, కార్యాలయాలు, కళాశాలలు ప్రజలచే బహిష్కరించబడి మూతపడినవి. మన నాయకుల హయాంలో జాతీయకళాశాలలు వెలశాయి. పంజాబురాష్ట్ర జాతీయవిద్యాధిపతి లాలాలజపతిరాయ్, వంగదేశపు జాతీయవిద్యాధికారిగా చిత్తరంజన్‌దాసు, కలకత్తా జాతీయకళాశాలాధిపతిగా మన సుభాష్ చంద్రబోస్ నియమితులయ్యారు. స్వార్థత్యాగం, పరోపకారపరాయణత, దేశభక్తివంటి మంచి విషయాలను ప్రజలకు బోధించుట ఈ కళాశాలల ముఖ్యోద్దేశ్యం!

వేల్సు యువరాజు మనదేశం వచ్చాడు. మననాయకులు కోపోద్రేకంతో 'వెడలిపో మాదేశంనుంచి' అని గట్టిగా రోడ్లంట తిరిగి అరిచారు. ఆ సందర్భముగా ప్రభుత్వంవారు అనేకమందిని పట్టుకొని జైల్లో పెట్టారు. సుభాష్‌చంద్రుడు ఆరు నెలల కారాగారశిక్షను అనుభవించడం జరిగింది.

గయలో జరిగిన కాంగ్రెస్‌సమావేశంలో 'స్వరాజ్య పక్షం' అనునది ఒకశాఖ ఏర్పడింది. ఈ పక్షము తరపున

'ఫార్వర్డు' అను దినపత్రికను సుభాష్ చంద్రబోస్ సంపాద కత్వమున 1922 వ సం॥లో వెలువడసాగింది.

స్వరాజ్యపక్షం ఎన్నికలలో పాల్గొని ఘనవిజయం సాధించింది. సుభాష్‌చంద్రుడు కలకత్తానగర ప్రధాన కార్యనిర్వాహకపదవి నలంకరించాడు. నెలకు మూడువేల రూపాయలు జీతం అంటే అందులో సగం చాలనన్నాడు తనకు. ఆ పురపాలకసంఘానికి అధ్యక్షుడుగా తన మార్గ దర్శకుడు చిత్తరంజన్‌దాసు ఎన్నుకోబడ్డారు. ఇద్దరు నిస్వార్థపరులు కలసి కలకత్తానగరాన్ని ఎన్నో నూతనవిధా లతో రూపుదిద్దారు. ఆ కార్యాలయంలో పనిచేసేవారందరూ ఖద్దరువస్త్రాలనే ధరించాలనే నిబంధన చేసారు. ఉచిత వైద్యశాలలు ఏర్పాటుచేశారు. అలాగే పాఠశాలలు కూడా తెరిచారు. ప్రజోపకరమైన సాంఘికసేవాకార్యక్రమాలు విస్తృతపరిచారు.

ప్రభుత్వం సుభాష్‌చంద్రుని నేరస్థునిగా జైల్లో పెట్టింది. ఆ నేరం ఏమిటంటే ప్రజలను, ప్రభుత్వంపైకి ఉసిగొల్పి తిరుగుబాటు చేయిస్తున్నాడని. సాక్ష్యాధారాలు ఏమీ లేవు. జైల్లో ఉంటూనే ప్రజావసరాలు తెలుసు కుంటూ, తన సూచనలు అందజేస్తుండేవాడు. సుభాష్ చెయ్యవలసిన పనులను చిత్తరంజన్‌దాసు చేస్తుండేవాడు.

సుభాష్ దోషి అయితే, చిత్తరంజన్ నిర్దోషి ఎలా అవుతాడు? ఈ ప్రశ్న ప్రభుత్వాన్ని నిలదీసి అడిగారు ప్రజలు. అలజడి రేగింది. ప్రభుత్వం సుభాష్ నిర్దోషని తెలుసుకుంది. పొరపాటుని ఒప్పుకొని విడుదల చేస్తే ఘనత వహించిన ఆంగ్లసామ్రాజ్యానికి అవమానం కదా! అందు చేత విడిచిపెట్టరాదు సుభాష్‌ని అని నిర్ణయించింది. ఆ జైలునుంచి ఆలీపూర్‌జైలుకి బదలాయించారు. అక్కడ కూడా ప్రజలు సుభాష్ నిర్దోషని, వెంటనే విడుదల చేయా లని నినాదాలు చేసారు. కానీ ప్రభుత్వం వినలేదు. ఆ రాత్రికి రాత్రే ఉత్తరబర్మాలోని మాండలేజైలుకి సుభాష్‌ను తర లించారు. ఈ జైలు నరకానికి ప్రతిరూపంలాంటిది. ఈ జైలులో బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్‌వంటి వారు కూడా కొన్నాళ్ళు వుండవలసివచ్చింది.

తను, తోటిబంధితులందరు కలసి అధికారుల ప్రవర్తన పట్ల నిరసనగా నిరశనవ్రతం ప్రారంభించారు. ఈ వార్త దేశం నలుమూలలా ప్రాకింది. ప్రజలు మళ్ళీ అలజడి చేసారు. ప్రభుత్వానికి పిచ్చెత్తినట్లయింది. బంధితులు తన ఆశయాన్ని సాధించారు. సుభాష్‌చంద్రుని విడుదలపట్ల న్యాయస్థానం మూగబోయింది. పరప్రభుత్వం హయాంలో వున్న న్యాయస్థానం భారతీయులకు సరైన న్యాయం చేకూ ర్చడం అన్నది కల్ల! ..

1926 సం॥ లో ఎన్నికలు వచ్చాయి. అప్పటికి సుభాష్ జైల్లోనే మ్రగ్గుతున్నాడు. తన మనసు దేశంకోసం, ప్రజల కోసం సేవచేయాలనే తపన అధికమయింది. ప్రజలు సుభాష్‌నాయకత్వాన్ని అభిలషిస్తున్నారు. సుభాష్‌చంద్రుడు జైల్లో వుంటుండగానే శాసనసభ్యుడిగా ఎన్నికయ్యాడు. తర్వాత అతని విడుదలకు శాసనసభలో ప్రయత్నాలు జరి గాయి. కానీ నిష్ఫలమయ్యాయి.

జైల్లో సుభాష్‌చంద్రుని ఆరోగ్యం పూర్తిగా చెడిపో యింది శరీరం శుష్కించిపోయింది. ఏక్షణంలో ఎలా వుంటుందో అన్న అనుమానపరిస్థితి ఏర్పడింది. ప్రజలు, నాయకులు ఎన్ని ఆందోళనలు జరిపినా ప్రభుత్వం పట్టిం చుకో లేదు.

రంగూన్‌జైల్లోకి సుభాష్‌ని తరలించారు. సుభాష్ సోద రుడగు డాక్టర్ సునీలచంద్రబోసు రోగలక్షణాలను పరీ క్షించాడు. బాధపడ్డాడు. తన మిత్రుడగు మరొక డాక్టర్ కేల్‌సల్ అనునతనితో సంప్రదించి వారిరువురు ప్రభుత్వ మునకొక విన్నపము అందజేసినారు. ఇది ప్రభుత్వానికి చురకలా తగిలింది. విధిలేక, విడుదల చేస్తామని ఒప్పు కున్నారు. అయితే ఒక షరతుపై విడుదల చేస్తామన్నారు. అదేమంటే సుభాష్ భారతదేశంలో అడుగుపెట్టరాదని.... చావు బ్రతుకులమధ్య ఏక్షణంలో ఎలా వుంటుందో అన్న సమయంలో తనవారిని తనదేశప్రజలను కళ్లారా చూచి ఈ ప్రాణాలు విడిచిపెడితే ఆనందంగా కన్ను మూయవచ్చని ఆరాటపడ్డాడు. ప్రయోజనం లేకపోయింది.

కొన్నాళ్ళు గడిచాక ప్రభుత్వం ఆలోచించింది; సుభాష్ జైల్లో చనిపోతే కొన్ని ఉపద్రవాలు ముంచుకొస్తాయని విడుదల చేసారు.

1927 సం॥ న బంగాళదేశం చేరుకున్నాడు. చిక్కి శల్యమైయున్న అతను ఇప్పుడు ఏపని చెయ్యలేడు. కదల లేడు. ఆరోగ్యం సమకూర్చుకోవడమే ఇప్పుడు చెయ్య వలసింది. అదేకాలంలో దేశబంధు చిత్తరంజన్‌దాస్ స్వర్గస్థుడయ్యాడు. తను ఎంతో దుఃఖించేడు. తనకి మార్గ దర్శకుడు, ఆరాధ్యపురుషుడు అయిన చిత్తరంజన్ మృతి ఎంతో వెలితి కల్గించింది. తను దుఃఖిస్తూ, అనారోగ్యంతో వుంటే దేశప్రజలేం కావాలి? ఆలోచించాడు. తను ధైర్యం తెచ్చుకున్నాడు.

ఆరోగ్యం మెరుగు పడుతోంది. తన ప్రజలకు చేయవలసిన సేవాధర్మాన్ని ఆచరించసాగాడు. బంగాళదేశ ప్రజలు సంబరపడిపోయారు. బంగాళారాష్ట్రానికి కాంగ్రెస్ అధ్యక్షుడుగా సుభాష్‌ని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఆ సంవత్సరంలో మదరాసులో డాక్టర్ అన్సారీ అధ్యక్షతను జరిగిన భారతజాతీయకాంగ్రెసుకు సుభాష్‌చంద్రబోస్, జవహర్‌లాల్ నెహ్రూ కార్యదర్శులుగా నియమితులయ్యారు.

ఆనాటి కాంగ్రెసుపెద్దల ఆలోచనలు స్వాతంత్ర్యం సాధించడంకోసం. యువకార్యకర్తలకి వారి పథకాలు అంతగా నచ్చకపోవడంతో సుభాష్, నెహ్రూల నాయకత్వంలో 'యువజనకాంగ్రెసు' సంఘం అవతరించింది. అందరి ధ్యేయం ఒకటే అయినప్పటికీ మార్గాలు వేరువేరు.

సుభాష్‌చంద్రుని సమరశంఖానినాదం కలకత్తానగరమంతా ప్రతిధ్వనించింది. దేశంలో ఈ ఉద్రిక్తత అవిరతముగ జరిగితేనేకాని ప్రభుత్వం లొంగదు. స్వరాజ్యసాధనకు గట్టి పూనిక వుండి తీరాలి. సుభాష్ అప్పుడే స్వరాజ్య సమరసన్నాహం చేస్తే బాగుండునని తహతహలాడాడు. వినే నాధుడు లేకపోయాడు. గాంధీ ప్రత్యక్షంగా ఎదిరించడానికి ఇష్టపడలేదు. సుభాష్, నెహ్రూ కలిసి గాంధీగార్కి ఎన్నో విధాల చెప్పి ఒప్పించడానికి కృషి చేసారు. కానీ లాభం లేకపోయింది. సుభాష్ దృక్పథం గాంధీగార్ని కదిలించలేదు సరికదా ప్రోత్సాహాన్నివ్వడానికి అంగీకరించలేదు.

1929 లో లాహోరుకాంగ్రెసులో జవహర్‌లాల్ నెహ్రూనే అధ్యక్షుడిగా చేసాడు గాంధి. దీనివల్ల సుభాష్ నుండి నెహ్రూ వేరుచేయబడ్డాడు. ఆశయాల విషయంలో నెహ్రూ మెత్తబడినమా, సుభాష్ ఏమాత్రం లొంగలేదు. పూర్ణ స్వరాజ్యపు తీర్మానము నెగ్గింది. కాని కాంగ్రెసుపెద్దల పద్ధతి సుభాష్‌కు నచ్చకపోవడంతో 'ప్రజాస్వామ్య కాంగ్రెసు సంఘం' అనుదాన్ని సుభాష్ స్థాపించాడు.

ఇంతలో అనగా 1930 సం॥ లో సహాయనిరాకరణోద్యమం ఉద్ధృతం కాసాగింది. సుభాష్‌ని మళ్ళీ జైల్లో పెట్టారు. బాగా లాఠీదెబ్బలు తినవలసివచ్చింది. ప్రజల్లో తుఫాన్ చెలరేగింది. సుభాష్‌ని లాఠీలతో కొట్టి చెరసాల్లో హింసించడం సహించలేకపోయారు. ఎదురు తిరిగారు ప్రజలు. జైలు అధికారిని బదలాయించడం జరిగింది కాని సుభాష్‌ని విడిపించడం జరగలేదు. సుభాష్‌ని హింసించడం మాత్రం లేదు. ఈ సమయంలోనే సుభాష్ కలకత్తా పురపాలకసంఘాధ్యక్షుడుగా జైలులోవుండగానే ఎన్నికైనాడు.

జైలునుంచి విడుదలయ్యాక అఖిలభారతశ్రామిక జన సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ప్రజాసేవ కార్యక్రమాలు విస్తృతంగా చేపట్టాడు.

కాంగ్రెసునిర్వాహకవర్గం బొంబాయిలో సమావేశమైంది. అంతవరకు సుభాష్‌ను ఖాతరు చేయని పెద్దలు ఈనాడు ప్రత్యేకంగా ఆహ్వానించడం జరిగింది. బొంబాయిలో జరిగిన మీటింగ్‌సందర్భంగా సుభాష్‌ని జైల్లో పెట్టారు. తన సేవాకార్యక్రమాలు మళ్ళీ కుంటుపడినందుకు విచారించాడు. అశాంతి, అనారోగ్యం తనని పీడించాయి. రోగలక్షణాలు పరీక్షించగా 'క్షయవ్యాధి' అని నిర్ధారింపబడింది. ప్రభుత్వం క్షయరోగిని జైల్లో ఉంచడం ఇష్టం లేక విడుదల చేయడానికి నిశ్చయించుకున్నారు. దీనికి మళ్ళీ షరతు విధించారు. తల్లిదండ్రులను కూడా చూడకుండా నేరుగా స్విట్జర్లెండ్ దేశమునకు వెళ్ళవలెనని. విధి లేక వెళ్ల వలసివచ్చింది.

ఆ దేశంలో పరిస్థితులను, పరిపాలనాపద్ధతులను బాగా పరిశీలించేవాడు. వైద్యసహాయానికి విఠల్‌భాయ్‌ని కలుసుకున్నాడు. వారిద్దరు దేశసమస్యలు చర్చించుకొని పరిష్కార మార్గాలు అన్వేషిస్తుండేవారు.

ఒకనాడు సుభాష్‌చంద్రునికి టెలిగ్రామ్ వచ్చింది. అది చదవగా తన తండ్రి మరణదశలోనున్నాడని వుంది. వెంటనే స్వదేశానికి బయలుదేరాడు. కలకత్తా చేరినవెంటనే తెలిసింది తండ్రి మరణించాడని. తనకు జన్మనిచ్చిన తండ్రిని అంతిమక్షణాల్లో చూడలేకపోయాననే దుఃఖంతో కృంగిపోయాడు. ఈలోగా ప్రభుత్వం ఒక ఉత్తరువు జారీ చేసింది. 'సుభాష్‌చంద్రబోసు ఇల్లు విడిచి ఎక్కడికీ వెళ్ళరాదు, ఎవరితోనూ మాట్లాడరాదు' అని. మరల వారం రోజులు తర్వాత సుభాష్‌ని విదేశానికి పంపించివేసింది ప్రభుత్వం.

విదేశాల్లో వుంటుండగానే 'భారతీయసమరం' (Indian struggle)అను గ్రంథాన్ని రచించాడు. జెనీవాలో విఠల్‌భాయ్ పటేల్ విగ్రహాన్ని ఆవిష్కరించాడు. ఆఫ్ఘనిస్థానపు పూర్వచక్రవర్తియగు అమానుల్లాను కలుసుకున్నాడు. డబ్లిన్‌నగరంలో 'డీవెలరా'ను కలుసుకొని రాజమర్యాదలను అందుకున్నాడు. అక్కడ తనతో సహృదయతతో మాట్లాడినవారందరితోనూ భారతదేశం అనుభవిస్తున్న ఇడుములను వివరించేవాడు. అందరూ సానుభూతితో మీ సమరసంరంభానికి సహకరిస్తామని అనేవారు. ఆవిధంగా వివిధదేశాలలో మనకు బలం, అండదండలు చేకూర్చడం చేసాడు.

1936 సం॥ లో లక్నోలో కాంగ్రెసుసమావేశం ఏర్పాటు కాబడింది. దీని అధ్యక్షుడు నెహ్రూ సుభాష్‌చంద్రునికి ఆహ్వానం పంపించాడు. దీన్ని పురస్కరించుకొని సుభాష్ బయలుదేరాడు. ప్రజానాయకుడు వస్తున్నాడని ప్రజలు ఉత్సాహంతో స్వాగతమివ్వడానికి బారులు తీరి నిల్చున్నారు. సుభాష్ రానేవచ్చాడు. ప్రజల్లో ఆనందం తాండవించింది. జై జై ధ్వానాలు మిన్నుముట్టాయి. ఈలోగా ప్రభుత్వం సుభాష్‌ని బంధించింది. ఆంగ్లశాసనసభలో ఈవిషయము ప్రస్తావనకు వచ్చినవి. భారతశాసనసభలోను కొంత అలజడి రేకెత్తింది. దేశం మొత్తం మీద ప్రజాక్రోధాగ్ని ప్రజ్వలించింది తమ ప్రియతమనాయకుడు సుభాష్‌బాబును వెంటనే విడుదలచెయ్యాలని. 1937 సం॥ విడుదల చేసారు. అనారోగ్యకారణం వల్ల ఐరోపాదేశం బయలుదేరాడు. ఇప్పుడు ప్రభుత్వం బంధీగా కాకుండా స్వేచ్ఛగా వెళ్ళాడు. ఒకప్రక్క చికిత్స పొందుతూ, లండన్ నగరంలో ఎన్నో సమావేశాల్లో భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వం చేస్తున్నదౌర్జన్యాలు తీవ్రంగా విమర్శించాడు. సంవత్సరకాలం విదేశాల్లోనే వున్నాడు.

ఇంతలో భారతదేశంలో ఒక్కవిశేషం జరిగింది. 'భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షపదవి'కి ఎన్నికలు ఏర్పాటయ్యాయి. గాంధీగారు డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యను పోటీలో నిల్చోమని బలవంతపెట్టారు. కాదనలేక నిల్చున్నాడు. ఈ ఎన్నికలో సుభాష్‌చంద్రబోస్ గెలుపొందాడు. అప్పుడు సుభాషు విదేశాల్లో వున్నాడు. ఈవార్త తెలియగానే స్వదేశం వచ్చాడు. 'సీతారామయ్య ఓటమి నా ఓటమిగా భావిస్తున్నా'నని గాంధీగారన్నారు. ఆ మాటలకు అందరిలో పశ్చాత్తాపం రేకెత్తించింది. ఫలితంగా సుభాషు ఆధ్యక్షుడేకాని ఎవరూ ఇతన్ని అనుసరించేవారు లేకపోయారు బిపిన్‌చంద్రరాయ్‌వంటివారుకూడా వ్యతిరేకులయ్యారు. నామమాత్రంగా అధ్యక్షుడుగా మెలగడం కష్టమనిపించింది. కాంగ్రెస్‌సంస్థలోని విరోధకశక్తులపై రోత జనించింది. ప్రయోజనశూన్యమైన ఈ పదవి ఎందుకు? అని వెంటనే పదవికి రాజీనామా ఇచ్చాడు. 'క్రమశిక్షణ' చర్య సుభాషుచంద్రునిపై గైకొన్నారు పెద్దలు. సంస్థనుంచి బహిష్కరించారు. వంగరాష్ట్రినాయకత్వం వహించరాదన్నారు.

బెంగాల్‌దేశంలో రెండు కాంగ్రెసుసంఘాలు ఏర్పడ్డాయి. సుభాషుచంద్రుని సంఘము పేరు 'ఫార్వర్డు బ్లాక్'

'హాల్‌వెల్' అను విదేశీయుని విగ్రహం తొలగింపవలెనని కలకత్తాలో ఒక ఉద్యమం లేవదీసాడు. దీనిఫలితంగా మళ్ళీ జైల్లో పెట్టారు సుభాషుని. దేశస్వాతంత్ర్యం కోసం, ప్రజల స్వేచ్ఛకోసం ఎన్ని పాట్లు పడుతున్నప్పటికీ కొందరు నాయకులు అపార్థం చేసుకోవడం తన హృదయాన్ని గాయపర్చింది.

1431 జనవరి 26 వ తేదీన స్వాతంత్ర్యమును సాధించుటకై నాయకులు - ప్రజలు ప్రమాణపత్రాలు చదువుతున్నారు. కొందరు విచారించారు సుభాషుచంద్రుడు ఇలాంటి పవిత్రదినమున బంధితుడుగా వున్నాడని. మామూలుగా అధికారి జైలు గదిలోకి చూచాడు. సుభాషు కనిపించలేదు. తలుపు తెరచి చూచారు. లేడు. వెదకేరు అన్ని మూలలూ ఊరంతా గాలించారు. ఎక్కడా జాడ లేదు. నిఘావేసి వున్నారు దొరలు.

జైలునుంచి మాయమయి బెర్లిన్ చేరుకున్నాడు. భారతదేశపు సర్వాధికారిగా పరిగణింపబడ్డాడు సుభాషుచంద్రుడు జర్మన్ నియంత హిట్లర్‌చేత.

అంతవరకు ఏకాకిగా వున్నవాడు ఇప్పుడు తనకు తోడునీడ అవుసరమున్నదని భావించాడు. తనకు 45 ఏళ్ళ ప్రాయమప్పుడు జర్మనీలోనే వివాహం చేసుకున్నాడు. వారికి ఒక కుమార్తె జన్మించింది.

జర్మన్‌నుండి జపాను చేరుకున్నాడు. అక్కడ స్వేచ్ఛాభారతసంఘపు కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. జపానులో రాసబిహారిబోస్ భారతీయులకు నాయకత్వం వహించేవాడు. 1913 జూలై 3 వ తేదిన సింగపూర్‌లో భారతదేశ స్వాతంత్ర్యోదమమునకు సుభాష్‌చంద్రుడు నాయకత్వంవహించి 'నేతాజీ' అనిపించుకున్నాడు, ఉద్యమానికి నూతనచైతన్యం కల్గింది. స్త్రీలుకూడా అధికసంఖ్యాకులు ముందుకు వచ్చారు. స్త్రీలు ప్రత్యేకంగా 'ఝాన్సీరాణి దళ'మను పేరుతో సైనిక దళమొకటి ఏర్పడింది. సింగపూర్‌లోను, రంగూనులోను శిక్షణశిబిరములేర్పడ్డాయి. 'భారతస్వాతంత్ర్యసమితినిధి' నొకదాన్ని ఏర్పాట్లు చేసేరు. స్వేచ్ఛాభారతప్రభుత్వమేర్పాటయింది. ఈ ప్రభుత్వ అధినేత సుభాషుచంద్రబోస్. ఈ ప్రభుత్వము తొమ్మిది విదేశపు ప్రభుత్వములు సమాన ప్రతిపత్తిగల స్వతంత్రప్రభుత్వముగ అంగీకరించినవి. సింగపూర్‌నుండి రాజధాని రంగూన్‌కి తరలించి స్వదేశానికి సమీపస్థులైనారు. ఇంక ఆలస్యం చేయకుండా 'భారత జాతీయసైన్యం' (అజాద్ హింద్ ఫౌజ్) రణభేరీ మ్రోగించింది. 18-3-1944 వ తేదీన సుభాషుచంద్రబోస్ సైన్యసమేతంగా ఇంఫాల్‌ప్రాంతమున భారతభూమిపై అడుగుపెట్టారు. విధి వక్రించింది. వర్షము కుండపోతగా

కురుస్తుంది. ఎటుచూచిన జలమయం. కీకారణ్యప్రదేశమది. దారితెన్ను కనిపించలేదు. కాలు కదపడానికి సావకాశం లేదు. మోకాళ్ళలోతు బురద. ఆహారపదార్థాలు అయిపోయాయి. కొనుక్కోడానికి, వండుకొని తినడానికి అవకాశం లేదు. రోగాలు వస్తున్నాయి. వైద్యసదుపాయాలు లేవు. ఈలాంటి విపత్కరవాతావరణంలో యుద్ధం ఎలా చేస్తారు? విజయాన్ని ఎలా పొందగలరు? వెనుకకుపోక తప్పలేదు. మార్గమధ్యంలో శత్రువులను ఎదుర్కొంటున్నారు.

రంగూన్‌నుంచి 24-4-1945 తేదిన 'బాంకాక్' ప్రయాణమయ్యారు సుభాషచంద్రుని బృందం. 28-5-45 తేదినాటికి రంగూన్‌లోని భారతీయ కార్యకలాపములకు సర్కారువారు ఆటంకపర్చారు. ఆగస్టు 15 రాత్రి సింగపూర్ రేడియోనుండి సుభాషచంద్రబోస్ గంభీరమైన ప్రసంగం చేసాడు. 'తాత్కాలికమగు ఓటమికి మనసు చెదరనీయవద్దు, ధైర్యము చిక్కబట్టి సమయం కోసం వేచియుండాలి. మన ధ్యేయాన్ని ఎప్పటికి మరువవద్దు' ఈ మాటలు ప్రజల్లో ఉత్తేజాన్ని కల్గించాయి.

ఆ తర్వాత బాంకాక్ బయలుదేరాడు. ఐదురోజుల తర్వాత టోక్యో రేడియోవార్తల్లో సుభాషచంద్రబోస్ విమానప్రమాదంలో మరణించాడని తెలియజేసింది. అది 23-8-1945 తేది. ఈవార్తను కొందరు నమ్మారు. మరి కొందరు ఇది రాజకీయతంత్రం అన్నారు. ఏది ఏమైనప్పటికి 1945 లో అతని ఆ చూకీ ఎక్కడవున్నది తెలియలేదు. ఆయన మరణం ఈ నాటికి ఎవరికీ పూర్తి నమ్మకం కలలేదు. పార్లమెంట్‌సభ్యులు H. V. కామత్, సమర్ గుహ ఆ మధ్య కొంత కొత్తసమాచారాన్ని అందించారు. సుభాషచంద్రబోస్ జీవించివున్నారని, యోగిరూపంలో, భారతదేశంలో వున్నారని

1948-49 మధ్యకాలంలో చైనాదేశంలో సుభాషచంద్రబోస్ పర్యటించినట్లు అప్పటి పత్రికల్లో ఫొటోలతో సహా వార్తలు వేసేరట!

సమర్‌గుహ ఎంతో పరిశోధన చేసి విషయాలు సేకరించి, చాలా ఫోటోలు కూడా సేకరించివుంచారు. ఈ ఫొటోలను మొరార్జీ దేశాయికి, జయప్రకాశ్ నారాయణకి మొదలగు ప్రముఖులకు చూపించారు. 78 సం॥ ప్రాంతంలో సుభాషచంద్రుని ఒక ఫొటో భారతదేశంలో అన్ని భాషల పత్రికల్లోనూ ప్రచురించడం జరిగింది.

నేతాజీ సుభాషచంద్రబోస్ అందరినీ ఆశ్చర్యపరుస్తూ త్వరలో తిరిగివస్తారని సమర్‌గుహ ఎన్నో సందర్భాలలో అన్నారు. బంగాళీలంతా నేతాజీ పునర్దర్శనానికి నిరీక్షిస్తున్నామంటున్నారు!

నేతాజీ జన్మదినమైన జనవరి 23 వ తేదిన (1978) ఢిల్లీలో పార్లమెంట్ సెంట్రల్‌హాలులో నేతాజీ వర్ణచిత్రాన్ని రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి ఆవిష్కరించారు. 'నేతాజీ ఇంకా బ్రతికేవున్నారని శ్రీ సమర్‌గుహ ప్రగాఢ నమ్మకం. బ్రతికేవుండాలని, మళ్ళీ మనలో ఒకరై మనల్ని ఉత్తేజపర్చాలన్నదే నా ఆకాంక్ష! దేశసేవకు అంకితం కావాలన్నదే సుభాషచంద్రబోస్ ఆశయం. పదవీ వ్యామోహం ఆయనకు ఎన్నడూ లేదు. దేశానికి ఒక సైన్యం వుండాలని మొదట గుర్తించిన భారతీయనాయకుడు నేతాజీయే! సైనికదళం బలం ఎంతైనా కానివ్వండి. అది చేసిన సేవ ఎంతైనా కానివ్వండి. ఇండియన్ నేషనల్ ఆర్మీ లక్షలాది భారతీయులను ఉత్తేజితులను చేసింది. రాళ్ళను రత్నాలుగా మలచిన విశిష్టవ్యక్తుల్లో నేతాజీ ఒకరు ... నేతాజీ గొప్ప పట్టుదలగల మనిషి. అనుకున్నది సాధించేవరకు ఎవరినైనా ఎదిరించేవ్యక్తి' అని రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారన్నారు.

# బాలల రామకృష్ణ

పండిత సభలో

గదాయి పెద్దవాళ్లు ఆలోచించినటు ఆలోచించేవాడు. చాలా తెలివిగలవాడు. నిజానికి అతడు గొప్ప మేధావి.

ఒకసారి లాహాబాబుగారి యింట్లో పండిత సభ జరిగింది. ఏదో విషయానికి సరియైన శాస్త్రార్థము కొరకు తీవ్రంగా వాదిస్తున్నారు. అందరికి సమ్మతమైన అర్థాన్ని ఎవరూ సూచించలేక పోయినారు. అందుచే అంతులేకుండా వాదము సాగింది.

గదాయి కూడా తన యీడు పిల్లలతో అక్కడ కూర్చున్నాడు. మిగతావాళ్ళకు ఏమీ అర్థం కాలేదు. తాను ఎంతో శ్రద్ధగా వాళ్ళు చెప్పేది వింటున్నాడు. మిగతా పిల్లలు-పండితులు తలలెల్లా ఆడిస్తున్నారో, చేతులెట్లా ఊపుతున్నారో, వాళ్ళల్లో వాళ్ల ఎట్లా నవ్వుకుంటున్నారో కనిపెడుతున్నారు. కొందరు పిల్లలు పండితులు చేసినట్లు వెటకారం చేస్తూ ఆనందించారు. కాని గదాయి అమితశ్రద్ధతో వింటూ విషయం అర్థం చేసుకున్నట్లు కనుపించాడు. వాదము ఒక స్థితిలో యున్నపుడు నిలబడి "మీరు వెతుకుతున్న అర్థము యిది కాదా" అని అన్నాడు. పండితులు యిది విన్నారు. అదే సరైన అర్థమని తోచింది. చెప్పింది ఎవరా అని అటు యిటు చూచి గదాయి అని తెలుసుకొని ఆశ్చర్యపడ్డారు. అంతమంది పండితులను కలవరపరచిన సమస్యకు యింత చిన్నవాడు సమాధానం సూచించాడు. కొందరు పండితులు గదాయికి ఒక రకమైన దివ్యశక్తి ఉందనుకున్నారు. యితరులు అతనిని ఆనందంతో కౌగలించుకున్నారు.

బైటికి అందరివలె పిల్లవాడుగా కనుపించినా యిటువంటి సంఘటనలు అతని అద్భుత మేధాశక్తిని నిరూపిస్తాయి.

పండితులు చేయు వాదోపవాదములకు
అంతమనునది గనుపింప దెంతకైన
అంతయు గదాయి విని విని అంతలేచి
సత్యమును విప్పి చెప్పి సంశయము దీర్చె.

---

ఈ సంచికలో :- ట్రెయినింగ్ కాలేజీ ఉపాధ్యాయులకు
స్వామి రంగనాథానందజీ గావించిన ఉపన్యాసానువాదము.

---

# 'భవిష్యత్తు వారిదే'

"నేటి బాలల ద్వారానే రేపటి భారతదేశాన్ని మనం నిర్మిస్తాం" అని నవభారత నిర్మాత జవహర్లాల్ నెహ్రూ అన్నారు. ఈ మహత్తర ఆదర్శాన్ని పాటిస్తూ మన రాష్ట్రంలో బాలల పరిస్థితులను మెరుగు పర్చడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీవ్రతరంగా కృషి చేస్తోంది.

బాలల ప్రతిభను ప్రోత్సహిస్తూ విద్యాయేతర కార్యక్రమాలను అభివృద్ధిపరిచే లక్ష్యంతో 1976 లో బాలల అకాడమీని ఏర్పాటు చేసిన ప్రప్రథమ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. ఈ లక్ష్యంతోనే ప్రతి సంవత్సరం రాష్ట్రస్థాయి పోటీలను నిర్వహిస్తున్నారు.

మన రాష్ట్రంలో 66 బాల్వాడీలున్నాయి. పాఠశాలలకు వెళ్లే బాలబాలికలకు వినోద కార్యక్రమాలను అందించడానికి వీలుగా 26 బాలవిహార్ లు పనిచేస్తున్నాయి.

నిరాశ్రయులు, నిరాధారులు, ఆర్థికంగా వెనుకబడిన తరగతుల బాలల పోషణ నిమిత్తం 65 బాలల సంరక్షణ గృహాలు పనిచేస్తున్నాయి. వాటిలో 5 గృహాలను ప్రత్యేకంగా కుష్ఠురోగులైన బాలల నిమిత్తం నిర్వహిస్తున్నారు.

వ్యవసాయ కూలీలకు చెందిన 5 సంవత్సరాల లోపు వయస్సుగల బాలల నిమిత్తం మన రాష్ట్రంలో 138 క్రెచెస్ ఉన్నాయి. వాటిలో 23 క్రెచెస్ ప్రత్యేకంగా గిరిజన బాలల నిమితం ఉద్దేశించబడినాయి.

మన రాష్ట్రంలో బాలల రోగ నిరోధక చికిత్స, ఆరోగ్యపరీక్ష, సంరక్షణ, సాంప్రదాయేతర విద్య కార్యక్రమాల నిర్వహణ నిమిత్తం 13 కేంద్రపరమైన పథకాలు, 9 రాష్ట్ర పరమైన పథకాలను అమలు జరుపుతున్నారు.

బాలల అభివృద్ధి పథకాల నిమిత్తం 1981-82 సంవత్సరంలో రు. 20 లక్షలు కేటాయించారు. ఆంధ్రప్రదేశ్ లో జాతీయ బాలల నిధి నిమిత్తం రు. 10 లక్షలు కూడా మంజూరు చేశారు.

**ఆంధ్రప్రదేశ్ లో బాలలను ఉత్తమ జాతీయ పౌరులుగా తీర్చిదిద్దడానికి నిరంతరం కృషి జరుగుతోంది.**

నెం. 55. డి. ఐ. పి. ఆర్.

# శ్రీ రామకృష్ణ ప్రభ

## విషయ సూచిక



గమనిక:—స్థలాభావంచే ఈసంచికలో వి. వి. తరంగాలు, గీతాగేయాలు ప్రచురించలేదు.

---

శ్రీ రామకృష్ణదేవుల జయంతిని పురస్కరించుకొని మద్రాసు రామకృష్ణమఠంలో ఫిబ్రవరి 26 వ తేదినుండి 28 వ తేదివరకు వార్షిక అంతర్యోగం (Annual Retreat) జరుగును. ఈ మూడురోజుల కార్యక్రమాలు ఇంగ్లీషు, తమిళంలో ఉండును. ఇందు పాల్గొనదలచినవారు వివరాలకు వ్రాయవచ్చును.

---

## శ్రీ రామకృష్ణ ప్రభకు

## చందాదారుగా చేరండి - చందాదారులను చేర్పించండి

---

ధన్యవాదాలు : శ్రీ రామకృష్ణప్రభకు చాల ఏండ్లుగా చందాదారులను చేర్పించే విషయంలో సహాయం చేస్తున్న వారిలో విజయవాడకు చెందిన కొత్తా గోపాలకృష్ణరావు ఒకరు. ఈయనకు ఎప్పుడూ జీవితచందాల మీదనే కన్ను. ఈ విషయం ఎఱిగినవారం కాబట్టి ఈయనకు లేఖ కూడ వ్రాశాము: "జీవితచందా ఒక్కసారిగా చెల్లించేవారు చాల తక్కువగా ఉంటారు కాబట్టి మీరు సంవత్సర చందాల సేకరణ మీద కూడ మనస్సు ఉంచండి" అని. ఇంతవ్రాసినా ఆయన మా మాటను ఏమాత్రం లక్ష్యపెట్టలేదు। ఈ రెండునెలల్లో సంవత్సరచందా ఒక్కటి కూడా చేర్చలేదు। కాని ఈ రెండునెలల్లో ఆయన సేకరించినవి 30 జీవిత చందాలు। ఈ కృషికి మా ధన్యవాదాలు.

---

## చందాదారులకు మనవి

సంవత్సర చందాదారులు కొందరు తమ చందాకాలం ముగిసినప్పుడు దానిని కొనసాగింపు (Renewal) చేయక ఆపివేస్తున్నారు. ఇది ఎందుకో అర్థం కావడం లేదు. నిబ్బుబిక్కు అఱిగిపోతే వెంటనే క్రొత్తది కొనుక్కోలేని ఆర్థిక పరిస్థితుల్లో ఉన్నవారు తప్ప తక్కినవారు తమ చందాలను నిలిపివేయక కొనసాగించవలసినదిగా మనవి. "మనియార్డర్ ఫారం తీసుకరావాలి, దాన్ని పూరించాలి, ఇప్పుడెక్కడ కుదురుతుంది? తరువాత చూసుకుందాంలే" అనుకొని తరువాత దాని విషయం పూర్తిగా మరచిపోయే వాళ్ళసౌకర్యం కోసమే మేమే పత్రికల్లో మనియార్డర్ ఫారాలు పెట్టి పంపుతున్నాము. "పత్రికను మేము చదవడం లేదు. చందా కట్టడం ఎందుకు?" అని నిలిపివేసేవాళ్ళకు ఒక చిన్న సూచన. పత్రికను మరోవిధంగా వినియోగించుకొనే ఉపాయం ఉంది। పత్రికను ఇంటిలో రేడియో మీదనో టేబిల్ మీదనో మరెక్కడనో పడవేస్తే, ఇంటికివచ్చే అతిథుల స్నేహితుల దృష్టిలో అది తప్పక పడుతుంది. (రంగుల ముఖచిత్రం ఉండనే ఉంది కదా।) "అబ్బో। ఇక్కడ రామకృష్ణప్రభ చదివేవాళ్ళున్నారే।" అని వాళ్ళు మనస్సులో చాల ఆశ్చర్య పడతారు. కాబట్టి చదవనివారుసైతం చందా ఆపివేయకూడదని మా మనవి.

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవబంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహా విష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర స్థలము సముద్రమట్టానికి మూడువేల అడుగుల ఎత్తున, ఆంధ్రప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణముతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పుచుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలుస్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్‌ల నుండి, తిరుపతికి బస్సులుకూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధరాత్రివరకు బస్సులు రెండు కొండ దారులమీదుగా మిమ్ములను తిరుపతినుండి తిరుమలకు తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొనవచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన అన్ని సౌకర్యములతో కూడివున్న దేవాలయపు ధర్మసత్రములు, అద్దె వసతిగృహములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వర స్వామివార్ల దేవాలయాలను, తిరుచానూరులోనున్న శ్రీ పద్మావతీ అమ్మవారి దేవాలయమును యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయము, నారాయణవనములోని శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయము, నాగలాపురంలోని శ్రీ వేదనారాయణ స్వామివారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

శ్రీ స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవకార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన తక్కిన వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.





ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ

సంపుటము 39 | 1982 - ఫిబ్రవరి | సంచిక 2

# మల్లికార్జున పంచరత్నములు

శ్రీగిరి వెండికొండయట, శ్రీభ్రమరాంబ భవానియంట, యా
శ్రీగిరిలోయలన్ జెలగు శ్రీకరవాహిని గంగయంట, యా
శ్రీగిరినాథుడే ప్రమథసేవ్యుడు శంకరుడంట, భూమిపై
శ్రీగిరి యొక్కటే పరమశైవపదంబట, మల్లికార్జునా.... 1

చంద్రకళాధరా, త్రిపురసంహర, శాత్రవలోకభీకరా
ఇంద్రయమాదివందితమహేశ్వర, శూలధరా, హిమాఖ్యశై
లేంద్రసుతామనోహర, మునీశ్వరమానసమందిరా, దయా
సాంద్ర, శుభంకరా, శరణు శంకర శ్రీగిరిమల్లికార్జునా.... 2

హస్తిభుజంగలూతల ప్రియంబున బ్రోచిన సచ్చరిత్ర, యో
కౌస్తుభధారిమిత్ర, విషగాత్ర, త్రినేత్ర, యుమాకళత్ర, మా
నాస్తిక తత్త్వమున్ యణచి నన్ గృపజూడవె భక్తవత్సలా
మస్తకమంటి మ్రొక్కెడుదు మారవినాశన మల్లికార్జునా.... 3

ఏ కృప కుంతిమధ్యమున కేర్పడె పాశుపతాస్త్ర జ్ఞానమున్
ఏ కృప రామచంద్రుడల ఇంతిని బొంది తరించె కష్టముల్
ఏ కృప శివాజి భవదీప్సితమంది కృతార్థుడయ్యెనో
ఆ కృప నాపయిన్ బరపు ఆశ్రితవత్సల మల్లికార్జునా.... 4

పూలతో స్త్రీల, తేటులతో పూరుషులన్ దగ బోల్చ పాడి, శ్రీ
శైలమునందు భిన్నముగ, శాంభవియే భ్రమరమ్మ, శంభుడున్
లీలగ మల్లికాసుమములే తమ నామములందు దాల్చినా
రేలకొ, యెంచజాలము మహేశ్వరులీలలు మల్లికార్జునా.... 5

—రాయసం ప్రభావతి

# సంపాదకీయం-5

మొన్న ప్రారంభించిన విషయాన్ని ఈ రోజు ముగిస్తాము. ఒక సన్యాసి చాల నిష్ఠతో జపతప సాధనలు చేస్తుండినాడట. అతని నియమ జీవితాన్ని చూసి అక్కడి ప్రజలు వేనోళ్ళ అతనిని పొగడుతూ తఱచు అతని దర్శనానికి కూడ వస్తుండేవారట. కొన్నాళ్ళకు అతని కీర్తి దూరప్రాంతాలకు కూడ అల్లుకొని పోయింది. రోజురోజుకి దర్శనార్థం వచ్చే జనం ఎక్కువౌతుంది. అప్పుడు ఆ సన్యాసి ఇలా ఆలోచించాడు: "ఇంటి దగ్గర ఐదారుమంది కుటుంబీకుల మధ్య సాధనలు సాధ్యం కాదని కొన్నాళ్ళ ముందు ఇల్లు వదలిపెట్టి వచ్చాను. ఇక్కడేదో ప్రశాంతంగా సాధనలు చేస్తామని కూర్చున్నాను. కాని ఇప్పుడేమో నిత్యం ఏబయిఅరవై మంది నా చుట్టూ ఉండని దినం లేదు. ఇప్పుడు చూడబోతే ఇల్లే నయం అనిపిస్తుంది. గుట్టుచప్పుడు లేకుండ అక్కడే సాధనలు సాగించి ఉండవచ్చు. ఇప్పుడిక తిరిగి వెళ్ళడం అగౌరవం. ఒకటే మార్గం ఉంది. ఈ జనం ఎగబడని చోటికి వెళ్ళిపోతాను." ఇలా ఆలోచించి అతడు ఒక దుర్గమమైన కొండ శిఖరం మీదికి పోయి ఒక చిన్న కుటీరం నిర్మించుకొని సాధనలకు కూర్చున్నాడట. అక్కడికి భక్తజనం రావడం లేదు. సాధనలు నిర్విఘ్నంగా సాగుతున్నాయి. ఒకరోజు ఒక యువతి ఒంటరిగా ఆ కొండ శిఖరాన్ని ఆరోహించింది. పర్వతారోహణం చేయాలనే ఉబలాటం ఒకవైపు, సాధుసందర్శనం చేయాలనే సత్సంకల్పం ఒకవైపు-ఈ రెండు ఉద్దేశాలు జతకూడినందున ఆ సాహసానికి పూనుకొని విజయం సాధించింది. తెల్లవారుఝామున బయలుదేరి సూర్యాస్తమయానికి ఆమె కొండ శిఖరం మీది సాధకుని కుటీరం చేరుకోగలిగింది. మఱునాడు ప్రొద్దున వాళ్ళిద్దరక్కడ లేరు. ఎక్కడో దూరప్రాంతానికి పారిపోయి కాపురం పెట్టారు. ఇక్కడ తప్పేదైనా ఒక వేళ ఉంటే అది అంతా పూర్తిగా సాధకుడిదే. పర్వతారోహకురాలి తప్పేమీ లేదు. పదిమంది దృష్టిలో ఉన్నంతవఱకు అతను ఒక దంభాచారంగా సాధనలు ముక్కుబట్టి సాగించాడు. బలీయమైన కామవాంఛలను అణచిపెట్టాడు. "వాళ్ళేమనుకుంటారో వీళ్ళేమనుకుంటారో ఏదైనా జరిగితే అది బైటకు పొక్కి గౌరవం మంటగలసిపోతుందే" అనే ఊహాపోహలతో అతను ఎవరినీ కన్నెత్తియైనా చూడకుండ పరమయోగ్యుడని పదిమందిలో అనిపించుకున్నాడు. కాని ఏకాంతంలో అతని దంభాచారం అంతా కుప్పగా కూలిపోయి నిజమైన మనిషి బైటపడ్డాడు. ఇదీ కథ. లైంగిక వాంఛ సర్వప్రాణి సాధారణం. అది తప్పు ఒప్పు అనే తీర్మానాలకు దిగకుండ దాని సంగతి మరో కోణంనుంచి గమనించుదాం. లైంగికవాంఛ సర్వప్రాణి సాధారణం అన్నాము. కాని "అది" మనుష్యులకు మాత్రమే ఒక ప్రధాన సమస్యగా ఎందుకయ్యిందో చర్చిస్తాము. మానవుడు తన దైనందిన జీవితాన్ని చాల యాంత్రికంగా నడుపుతూ ఆనందానికి దూరం కావడమే ప్రధానకారణం. ఎవ్వరూ తమ పనులను ఆనందంతో చేయడం లేదు. ఏదో బరువుగా చేస్తున్నట్లే కనబడుతున్నారు. విద్యార్థులు ఆనందంతో చదవడం లేదు. ఉపాధ్యాయులు ఆనందంతో పాఠాలు చెప్పడం లేదు. రైతులు కార్మికులు ఉద్యోగస్తులు ఎవరూ పనులను ఆనందంతో చేయడం లేదు. గృహిణులు ఇంటిపనులను ఆనందంతో చేయడం లేదు. ప్రతి ఒక్కరూ తమ దైనందిన జీవితంలో చేయవలసిన పనులను ఆముదం త్రాగిన ముఖాలతో చేస్తున్నారు. ఒకవైపు రోజులిలా

## సంపాదకీయం-5

నిరానందంగా గడుపుతూ మరోవైపు ఆనందాన్ని వివిధోపాయాల ద్వారా పొందాలని ప్రజలు ప్రయత్నిస్తున్నారు. కబుర్లు, కాలక్షేపాలు, క్రీడలు, క్లబ్బులు, పుస్తకాలు, పత్రికలు, రేడియోలు, టి. వి. లు, సినిమాలు, విలాసయాత్రలు, ఆధ్యాత్మికసాధనలు - ఇలా ఎన్నో వాటినుండి ఆనందం పొందాలని చూస్తుంటారు. కాని వీటిలో దేనియందూ తనను తాను మఱచిపోయేంత ఆనందం మానవులకు లభ్యం కాదు. ఇక స్త్రీపురుషులకు మిగిలింది ఒక్కటే. జీవితంలో ఏకదేశంగా, ఒక అంశంగా ఉండవలసిన "దానికి" ఎక్కడలేని ప్రాధాన్యత రావడానికిదే కారణం. ప్రజలు తమ దైనందిన జీవితాలను యాంత్రికంగా నిస్సారంగా నిరానందంగా నెట్టడమే ప్రధాన కారణం. ఈ యాంత్రికజీవనమే కాకుండ అహంకారజీవనం కూడ ఒక ప్రధానకారణం. స్పర్ధలు, వైషమ్యాలు, ఆశలు, విభేదాలు, పట్టుదలలు, ఈర్ష్యాసూయలు ఇత్యాదులతో దైనందిన జీవితాన్ని అనుక్షణం అహంకారపూరితం చేసుకొంటూ మనిషి ఆనందానికి దూరమవుతున్నాడు. ఇక అతనికి మిగిలిన ఆనందం ఒకటే. "నేను" అనే భావం తాత్కాలికంగా అణగిపోయే "ఆ" ఆనందం ఒకటే అతనికి మిగిలి ఉన్నది. అందుకే "అది" ఒక ప్రధానసమస్యగా తయారయింది. కాని ఏ సుఖమూ తగిన మూల్యం చెల్లించనిదే ఈ లోకంలో దొరకదు. మేధస్సు యొక్క వికాసానికి దోహదం చేసే చరమధాతువును త్యాగం చేయనిదే "ఆ" సుఖం దొరకదు. ఇంకా లోతుగా ఆలోచిస్తే లైంగికవాంఛ కానుక "పుత్రైషణ" దాగి ఉంది. కాని దీనిని ఎవరూ ఒప్పుకోరు. ఒప్పుకోకపోయినంత మాత్రాన అది అసత్యం కాబోదు. "పుత్రైషణ" మానవునిలో ఎందుకున్నది అనేది ప్రశ్న. మానవునికి తాను "ఈ దేహం" మాత్రమే అనే పరిమిత భావం గాఢంగా ఉంది. మతగ్రంథాల మాటలన్నీ కూడ అతని ఈ గాఢ భావాన్ని పోగొట్టలేవు. "నేను దేహం కాను" అని పైకి వట్టి మాటలు చెప్పటకు మాత్రమే అన్ని మతగ్రంథాలు పనికివస్తాయి. దేహంలో మాత్రమే గాఢమైన అస్తిత్వభావం మానవునికి ఉంది కనుక ఆ దేహం ఒకప్పుడు నశించిపోతుందని తెలుసు కనుక దాని నాశనం తరువాత తన అస్తిత్వాన్ని సంతానంలో నిలబెట్టుకోవడానికి లేదా సంక్రమింపజేయడానికి దేహి వాంఛిస్తాడు. ఆ అంతర్గత వాంఛయే పైకి లైంగిక వాంఛగా అభివ్యక్తమౌతుంది. నాస్తికత అంటే ఇదే. దేహానికి మించిన అస్తిత్వాన్ని అనుభూతం చేసుకోలేని స్థితియే నాస్తికత్వం. ఇన్నికోట్లు క్రైస్తవులు, ఇన్నికోట్లు మహమ్మదీయులు, ఇన్నికోట్లు హిందువులు, ఇన్నికోట్లు బౌద్ధులు అనే లెక్క ఉంది. అదంతా ఉత్తి లెక్క. అందరూ నాస్తికులే. లక్షలలో ఒకడు ఆస్తికుడుంటే ఉండవచ్చు. ఈ నాస్తిక భావానికి అంటే దేహభావానికి అజ్ఞానమే కారణం. ఆ అజ్ఞానాన్ని, ఆ అంధకారాన్ని పటాపంచలు చేసే వెలుగు బ్రహ్మచర్యం వల్ల కలుగుతుంది. బ్రహ్మచర్యం ఎందుకనే రహస్యం ఇది. ఈ బ్రహ్మచర్యం పదిమంది మెప్పు కోసం కాదు, లోకాపవాద భీతి వల్ల కాదు, బ్రతుకు తెఱువుకోసం కాదు, బాదరబందీ లేని తేలిక జీవనం కోసం కాదు. అజ్ఞానాన్ని పారద్రోలడం కోసం మాత్రమే. అజ్ఞానం పోతే నాస్తికభావం పోతుంది; నాస్తికభావం పోతే దేహభావం పోతుంది; దేహభావం పోతే పుత్రైషణ పోతుంది; పుత్రైషణ పోతే లైంగికవాంఛ పోతుంది. ఇప్పుడు తేలిం

వాంఛకు అతీతుడు లెక్కనవారు కాదు అని.

తక్కిన వాళ్లు చేయవలసిందేమిటంటే: "దానికి" కూడ జీవితంలో ఒక సముచిత స్థానం ఇవ్వడమే. "దానిని" ఒక జీవిత సమస్యగా చేసుకోవడంగాని, జీవితమంతా "దానిని" ఆక్రమించనివ్వడం కాని కూడదు. ఆత్మసాక్షాత్కార తహతహ హృదయంలో లేకుండ పట్టి బ్రహ్మచర్యం ఆశ్రమ నియమాలకు, మతాల నియమాలకు, సాంఘిక నియమాలకు లొంగి పాటించేవాళ్ళలో కొన్ని వక్రతలు పొడసూపుతాయి. వాటిని కూడ తెలుసుకుంటే మంచిది. (1) క్రమేణ అతడు ఒక పరమ స్వార్థజీవిగా మారే అపాయం ఉంది. తాను, తనతిండి, తన సౌకర్యాలు, తన ఆరోగ్యం, తన అధికారం గురించి మాత్రమే మితిలేని శ్రద్ధ జూపుతూ తక్కిన ఏ విషయాన్నీ అంతగా పట్టించుకోని స్థితికి దిగజారే అపాయం ఉంది. (2) ఒకవైపు అరికట్టిన చపలత మఱోవైపు పొడుచుకొని వచ్చే అపాయం కూడ ఉంది. సాధారణంగా జిహ్వ అలా పొడుచుకొని వచ్చే ద్వారంగా ఉంటుంది. అన్ని హంగులు లేనిదే భోజనం సహించలేని స్థితికి దిగజారే అపాయం ఉంది. (3) దైనందిన జీవితంలో సాధారణ జనులు పడే యాతనలు అతనికి లేనందువల్ల సుఖంగా దీర్ఘంగా నిదరపోగలిగి క్రమేణ పగటి నిద్రా కాలం కూడ పెంచుతూ చివరకు పట్టి సోమరిగా తయారయే అపాయం ఉంది. (4) అల్ప విషయాలకు సైతం సణిగే గొణిగే స్వభావం, చిరచిరలాడే స్వభావం, మండిపడే స్వభావం, నచ్చుబెట్టే స్వభావం, సాగదీసి సాగదీసి చీవాట్లు పెట్టేస్వభావం-ఇలాంటి మనోప్రవృత్తి విజృంభించే అపాయం ఉంది. (5) లైంగిక వాంఛలను అసహజ రీతుల్లో తీర్చుకొనే అపాయం కూడ ఉంది. ఈ అపాయాల గురించి చెప్పడంలో నా ఉద్దేశం ఏమంటే అలాంటివి తలెనీయకుండ ఎప్పటికప్పుడే జాగ్రత్తపడమని చెప్పడానికోసమే. బ్రహ్మచర్యం ఉత్తమ జీవితవిధానం కాబట్టి దాని లోతుపాతులు నాకు తెలిసినంతమట్టుకు చెబుతున్నాను. ఉత్తమమైనది కష్టసాధ్యం అనే మాట సత్యం. ఒకోసారి దేహం, ఇంద్రియాలు, హృదయం "ఆ" అనుభవం కోసం ఆక్రోశించవచ్చు. కామ సంబంధాలైన తలంపులు ఉద్ధృతంగా లేచి హృదయాన్ని అల్లకల్లోలం చేయవచ్చు. అలా జరగనీయకుండ చేయడానికి ఉపాయం చెబుతాను విను. "నేను" "నా తలంపు" అనే విభాగం వల్లనే అన్ని అనర్థాలు కలుగుతాయి. వాస్తవానికి "నేను" "నా తలంపు" ఒకటే. రెండూ మనోవికారాలే. "నేను" కూడ ఒక మనోవికారమే, మనస్సులో ఏర్పడిన ఒక కేంద్రమే, ఒక అంశయే. మనస్సులో కలిగే అన్ని ఘర్షణలకు కారణం నేను, నా తలంపు అనే విభేదాన్ని కల్పించుకొనడమే. ఈ విభేదం వల్ల మనస్సులోని ఒక భాగమైన "నేను" మఱో భాగమైన "తలంపును" అరికట్టేప్రయత్నం, అదిమేప్రయత్నం, మఱోవైపుకు త్రిప్పే ప్రయత్నం, తప్పించుకొనే ప్రయత్నం, దూషించే ప్రయత్నం – ఇలాంటి ప్రయత్నాలు చేయడం జరుగుతుంది. ఇది సమస్యాపరిష్కారం కాకపోవడమేగాక మరిన్ని చిక్కులు తెచ్చి పెట్టుకోవడం అవుతుంది. మనస్సును అనవసరమైన ఘర్షణకు ఆయాసానికి పాల్పడజేసి మనోశక్తిని పాడు చేయడం అవుతుంది. కాబట్టి అటువంటి అనర్థకరమైన ప్రయత్నాలేమీ చేయకుండ ఊరక ఆ తలంపుల యొక్క ప్రతికదలికను అత్యంత తూష్ణీం భావంతో ఎప్పటికప్పుడు గమనిస్తూ వాటిని అవగతం చేసుకొంటుంటే చాలు. పైన చెప్పిన మూర్ఖమైన ప్రయత్నాలేవీ చేయకుండ సాక్షి మాత్రంగా ఉండి మనోవృత్తులను అవలోకిస్తూ ఉంటే "నేను" "నా తలంపు" అనే విభేదం

అంతరించిపోతుంది. ఆ అద్వయస్థితిలో సమస్య కూడ మాయమైపోతుంది. తలంపుల విషయంలో నిగ్రహరూపమైన ఏ విధమైన ప్రయత్నాలు చేయకుండ, తప్పొప్పుల తీర్మానాలు చేయకుండ, తప్పించుకొనే ప్రయత్నాలేవీ చేయకుండ, వాటిని సంతృప్తిపఱచాలనే సంకల్పం కూడ తలెత్తనీయకుండ ఊరక వాటిని గమనిస్తుంటే చాలు. తరువాత సమస్యఉండదు. మనస్సు ప్రశాంతి పొందుతుంది. ఇది చేసి చూడు. నీకే తెలుస్తుంది. మౌనం అంటే ఇదే. ఇలా బ్రహ్మచర్యంలో కొన్నేండ్లు ఉండడం మంచిది. అలా ఉంటే కొన్నేండ్ల తరువాత విధి నిషేధ శాస్త్రాలన్నీ నీకు అనవసరం అవుతాయి. స్వతహాగానే నీ ప్రవర్తన ఋజువయిపోతుంది. బ్రహ్మచర్యంలోని క్లేశం అనుభవానికి వస్తే హృదయంలో ఒకరకమైన అనుకంప కూడ కలుగుతుంది. దానివల్ల శీలవిషయమైన పరచర్చ(gossip)నుండి పూర్తిగా విముక్తి పొందుతావు. లోకంలో ఈ పరచర్చ (scandal mongering) లేని తావు లేదు. ఇది ఒక అనాగరిక లక్షణం, సంస్కారహీన లక్షణం. చదివినవాళ్ళు చదువుకోనివాళ్ళు అందరిలోనూ ఇది కనబడుతుంది. సాంఘిక కట్టుబాటులకు బాహ్యం అనిపించే స్త్రీపురుషుల గోప్యవర్తనలను వెలికి తీసి ప్రకటించి చర్చించి ప్రజలు ఎందుకు ఆనందపడతారో అర్థం కాదు. ఈ "ధర్మప్రసంగాల" వెనుక ఈర్ష్య దాగి ఉంది. పలానా పలానా వ్యక్తి "ఆ విధంగా" పొందుతున్న సుఖం తనకు లేదే అనే అంతర్గత ఈర్ష్యాభావమే పైకి ధర్మకంచుకం తొడుక్కొని శీలాశీలవిచారానికి దిగి నిందితులను వేలెత్తి చూపి వాళ్ళగురించి చెడ్డగా మాట్లాడి ఆనందం పొందుతుంది. ఇది పిరికితనంతో కూడిన ఒక క్రూరమనోప్రవృత్తి. కొన్నేండ్ల బ్రహ్మచర్యపాలన వల్ల ఈ దుర్గుణం సమూలంగా నశిస్తుంది. శీలవిషయమై ఎటువంటి తీర్మానాలు చేయడంగాని ఆ విషయాలు వినాలనే కుతూహలం గాని లేని ఒక ఉదార హృదయం కలుగుతుంది. ఈ ఒక సంస్కారం ఎంత మేలో చూడు! బ్రహ్మచర్యం వల్ల ఇంకా ఎన్నో మేళ్ళున్నాయి. వాటిని వివరిస్తూ కూచుంటే కాలం మించిపోతుంది. సరే ఒక మాట విను. నీ గ్రహచారం చాలక ...ద్దల వ... వల్లనో మరేకారణం వల్లనో వివాహం చేసుకున్నావనుకో! "అయ్యో! నా బ్రహ్మచర్యం పోయిందే!" అని అప్పుడు ఏడవ్వద్దు. బ్రహ్మచర్యం ఎక్కడికీ పోదు. వివాహం చేసుకుంటే బ్రహ్మచర్యానికి సున్న చుట్టడమే అని ఎందుకనుకోవాలి? అలా అనుకోవడం మూర్ఖత్వం. "బిందుపతనమే" బ్రహ్మచర్య లోపం అయేటట్టుంటే లోకంలో ఎవడూ బ్రహ్మచారి కాడు. స్వప్నంలో అయినా అది తఱచు జరిగే తీరుతుంది. కాబట్టి మూర్ఖమైన అభిప్రాయాలు అవతలపెట్టి దాంపత్యజీవితంలో కూడ బ్రహ్మచర్యజీవితాన్ని పాటించవచ్చుననేది గ్రహించాలి. వివాహం అంటే "లైసెన్స్" అనుకొనేవాళ్ళు మనుషులు కారు. జీవితంలో "దానికి" కూడ సముచితస్థానం ఇచ్చి నియమబద్ధమైన జీవితం గడుపుతూ ఉంటే అది కూడ బ్రహ్మచర్యమే అవుతుంది. వివాహితులు సాధారణంగా ఇలా అంటారు: "మేము సంసారంలో చిక్కుకున్నందువల్ల ఆధ్యాత్మికంగా పురోగమించలేకున్నాము" అని. ఇలా అనడం వాళ్ళ సోమరితనాన్ని కప్పిపుచ్చుకొనే సాకు మాత్రమే. ఉపనిషత్ద్రష్టలందరూ సంసారం చేసినవాళ్ళే! యాజ్ఞవల్క్యుడికి ఇద్దరు భార్యలు. సరే అతనికి ఎందరు భార్యలైతే మనకెందుకు? ఈ ప్రసంగం ఇంతటితో ఆపుదాము. రేపటినుండి వేఱే విషయం తీసుకుందాము.

# శ్రీ రామకృష్ణ పరమహంస

భగవదవతారమూర్తి, భారత ఆధ్యాత్మిక పునరుజ్జీవన ప్రదాత, అఖిల ప్రపంచమునకు ఆధ్యాత్మిక భిక్ష పెట్టిన మహనీయ తపస్వి, యోగేశ్వరేశ్వరుడు....శ్రీరామకృష్ణ పరమహంసను గురించి అలౌకికమైన ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రతిభాసంపత్తి, ప్రగాఢమైన దేశభక్తిగల మహనీయుడు, విప్లవకారుడు, పూర్ణయోగమూల మహాపురుషుడు, దివ్య నవజీవన ప్రవక్త, పురాణగాధ భవిష్యత్సంకేతమైన సావిత్రి మహాకావ్య సృష్టికర్త, మహర్షి, మహాయోగి, భారత ఆధ్యాత్మిక పరిణామంలోనే విప్లవాన్ని సంకల్పించి, సాధించిన దివ్య చైతన్య విజ్ఞానమయ భగవన్మూర్తి, యుగపురుషుడైన శ్రీ అరవిందుల ప్రవచనములు....

## శ్రీరామకృష్ణుడెవరు?

మానవునియందావిర్భవించిన భగవంతుడే; కాని ఆయన వెనుకగా అనంతమైన నిర్గుణ నిరాకార పరబ్రహ్మతత్త్వ సహితుడై, విశ్వవిరాట్ స్వరూపుడై, ఆ భగవంతుడున్నాడు. వివేకానందుడెవరు? శివుని త్రినేత్రమునుండి వెల్వడిన అరుణారుణోజ్జ్వల ప్రకాశ దివ్యకరుణా కటాక్షము; కాని ఆయన వెనుకగా ఒక దివ్యాలోకమున్నది, అందుండియే వివేకానందుడవతరించినాడు, అందుండి ఆ శివుడే ఆవిర్భవించినాడు; బ్రహ్మయు, విష్ణువు అందుండియే అభివ్యక్తమైనారు; సర్వాతీతమైన ఓంకారమందుండియే జనించినది.

అవతారమూర్తులను, మహాపురుషులను భక్తిభావంతో ఆరాధించటం మానవులకు సహజమైయున్నది. మనము హిందువులము, సహజంగా మన జాతిస్వభావం ఆధ్యాత్మికమైంది. మానవాళికై భారతదేశం నిర్వహిస్తున్న మహనీయ కర్తవ్యం మరి ఏ ఇతర దేశం ఊహించనైన ఊహించలేదు. మానవజాతినే 'ఆధ్యాత్మికం' చేయటం! మనం ఆరాధిస్తున్న ఈ మహనీయులందరూ ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడినవారే. అయితే ఇట్టి ఆరాధన ఆధ్యాత్మికాభివృద్ధిలో మొదటిదశ. ఆత్మసాక్షాత్కారం, దివ్యానుభూతిలేని ప్రజా హృదయం సందేహపూరితం అవుతుంది. ఆ సందేహ నివృత్తియే జ్ఞానప్రాప్తి. చరిత్రకందని కాలంలోని ఋషులు, నేటి విజ్ఞానశాస్త్రవేత్తలు, హేతువాదులకంటె అధికంగా సందేహాలు వెలిబుచ్చినవారే! మత సాంప్రదాయ సిద్ధాంతాలను తృణీకరించి అంతులేని ఆత్మసంశయంలో మునిగిపోయి సత్యసాక్షాత్కారానికై తపస్సు చేశారు. వారు ప్రతిదానిని సందేహించారు. ఇంద్రియాల సాక్ష్యాన్ని, జీవిత సత్యాన్ని, సందేహాస్పదమైన ఈ బ్రహ్మాండాన్ని, తుదకు భగవంతుని అస్తిత్వాన్నే శంకించారు. ఇట్టి సంశయం చివరకు బుద్ధుని ఉపదేశాల్లో పరాకాష్ఠనందుకొన్నది! దేనిని అంగీకరించడు, దేనిని ముందుగా ఊహించడు. దేనిని గూర్చి మూఢంగా సిద్ధాంతీకరించడు! ఆత్మశిక్షణ, ఆత్మసాధన, ఆత్మసాక్షాత్కారం మాత్రమే ఇంద్రియాలనుండి, బుద్ధి బంధిఖానా నుండి విముక్తినివ్వగలవు. ఈ స్థితిలో నిజమైన ఆధ్యాత్మికత అంటే ఏమిటో తెలియచెప్పవలసిన అవసరం కలిగింది. అది అభివ్యక్తమై, స్థిరమై, ఈ జగత్తు సత్యమేనని, ఆత్మస్వరూపమేనని నిర్ధారించవలసి వచ్చింది; మానవుని జీవనకృత్యం, భగవత్ ఆనందపారవశ్యం లోకాన్ని చూపింపవలసి వచ్చింది; అందుకే శ్రీరామ

కృష్ణ పరమహంస అవతరించారు. రెండువేల సంవత్సరాల పూర్వం నుండి జరిగిన ప్రగతి, బుద్ధుని అనంతర ప్రగతి-అంతా కూడ దక్షిణేశ్వరంలో అవతరించిన భగవానుని దివ్య ఆధ్యాత్మికానుభూతి, ప్రబోధాల సామరస్యానికి ప్రారంభం మాత్రమే...

ఒక మహనీయ దివ్యజ్యోతి ప్రాగ్దిశలో ఉదయిస్తోంది; దిగంతాలకు ఆ వెలుగు ప్రసరిస్తోంది; ఒక నవయుగారంభానికి నాందీ ప్రస్తావన జరుగుతోంది. సనాతనమైన హిందూ ఆధ్యాత్మిక సంపూర్ణాభివ్యక్తియే భారత పునరుత్థానమునకు సంకేతము. ఆ వెలుగు కిరణం ప్రసరించిన ప్రతిసారీ లోకంలో ఒక మతం పుడుతుంది! అన్ని మతాలు, అన్ని మార్గాలు ఆ వెలుగులోంచి పుట్టినవే, ఆ వెలుగులోకి అంతరించిపోయేవే! ఆధ్యాత్మిక జ్ఞానం భారత దేశంలో ఉన్నది. ప్రపంచానికి ఆధ్యాత్మికజ్ఞాన భిక్షపెట్టేది భారతమాతయే. బౌద్ధమతం, క్రైస్తవ మహమ్మదీయ మతాలు ఇవన్నీ అసంఖ్యాక మార్గాలు. కాని భారత దేశమే అద్భుతమైన ఆధ్యాత్మిక పరిశోధనాగారమైంది. పుణ్యభూమి, తపోభూమి, ధర్మభూమి, కర్మభూమి, ఆర్యభూమియైన ఈ భారతభూమిపైననే భగవంతుడవతరించాడు ప్రతియుగంలోను అనేక వేలమంది మహాత్ములవతరించి ఆధ్యాత్మిక సాధనలు చేశారు, తమ జ్ఞానాన్ని శిష్యులకు ధారపోశారు, పేరుప్రఖ్యాతుల నాశింపక కరిగి ఆత్మలో లయమైపోయారు. అట్టివారి ఉగ్రతపోచర్యల ఫలితంగా లభించిన మహత్తర ఆధ్యాత్మికశక్తి మూలకంగానే అవతారపురుషులు, దివ్యమూర్తులుద్భవించారు. కేవలాత్మ సాక్షాత్కారంతో తృప్తిచెందక వారి తపోఫలితాన్ని, ఆనందపారవశ్యాన్ని ప్రపంచానికి ధారపోశారు. ఈ మహాత్ములందరిలోను చివరివాడు, అందరికంటె మహోత్తమ దివ్యమూర్తి శ్రీరామకృష్ణపరమహంస, ఎందుకంటే ఇతరులు (అవతారపురుషులు, ప్రవక్తలు...) భగవంతుని, పరిమితమైన ఏకపక్షమైన స్వరూపంలో దర్శించగా, పరమహంస భగవంతుని అనంతమైన ఏకత్వమును, అపరిమితమైన భిన్నత్వమును దర్శించారు. గతకాల శతసహస్ర మహర్షుల ఆధ్యాత్మికానుభూతులన్నీ పరమహంసలో మూర్తీభవించి, విమూర్తమై ఏకమైనవి! ప్రపంచానికి హిందూమత చరమ సందేశాన్ని శ్రీరామకృష్ణ భారత దేశానికి ప్రసాదించారు. వారి దివ్యజన్మలో ఒక నవయుగం ఆరంభమైంది; భూమిపైన గల మానవులంతా పరమహంస కృపచే భగవంతుని తెలియగల నూతనశకం మొదలైంది; మానవ జీవనంలో ఆధ్యాత్మిక సాధన ఆరంభమైనది. శ్రీరామకృష్ణపరమహంస మహనీయ జీవితంలో సమన్వయమైన సత్యాన్ని హిందూ మతం ప్రపంచానికి ప్రసాదించవలసియున్నది. ప్రపంచపరిణామంలో, ఈ విషయంలో, క్రైస్తవ మతం విఫలమైంది; మహమ్మదీయమతం కొన్ని కాలాల్లో ప్రయత్నించినా పూర్తిగా ఫలించలేదు; బౌద్ధమతం అల్పకాలం పరిమిత సంఖ్యగల అనుయాయులలో సగము మాత్రమే నెరవేర్చగలిగింది. ప్రపంచ ఆధ్యాత్మిక పరివర్తనకే భారత దేశం పునరుజ్జీవనమైంది; భగవంతుడే పరమహంసరూపంలో అవతరించి నవజీవనాన్ని ప్రసాదించాడు; మహాత్ములనేకులు జన్మించారు; భారతమాత బిడ్డలహృదయంలో మహాత్పరిణామం సంభవించింది. ఈ ఉద్యమం మొదట్లో రాజకీయమైనదైనా ఆధ్యాత్మిక లక్ష్యసిద్ధితో సంపూర్ణమవుతుంది.[2]

**భారతాత్మ ప్రబోధం :**

స్వాతంత్ర్య సమరకాలంలో బెంగాల్, పంజాబ్ లలో మతసంబంధమైన ఉద్యమాలారంభమైనవి, మహారాష్ట్రములో రాజకీయ చైతన్యం కలిగింది; బెంగాల్లో సాహిత్యకృషి తీవ్రమైంది. ...భారతఆత్మ ప్రబుద్ధమైంది వీధిలో కాదు, హిందూమతములో, హిందూ మత సనాతన సత్యసాధనలో, విజయాన్ని సాధించింది. చరిత్రలో ఎల్లప్పుడూ అనేక నిదర్శనలున్నాయి, మహత్తర సంఘటనలున్నాయి. కాని కలకత్తాలో విద్యార్థులైన యువకులు పూజాకుసుమాలై చదువు లేని హిందుతపస్వి ఆత్మసాక్షాత్కార జ్యోతిర్మయానంద పారవశ్యమున మునిగిన మహాయోగేశ్వరుడు, పాశ్చాత్యవిద్యాసాంప్రదాయ స్పర్శలవలేశమైనా లేని పరమ పవిత్రమూర్తి దివ్యపదసన్నిధిలో ప్రణమిల్లినప్పుడు స్వాతంత్ర్య సమరంలో ఆధ్యాత్మిక విజయం లభించింది. వివేకానందుడు ఈశ్వర విభూతి; ఈ ప్రపంచాన్నే తన రెండు చేతులలోనికి తీసికొని మలచి యిష్టానుసారం మార్చివేయగల మహత్తర ఆధ్యాత్మికశక్తి సంపన్నుడు. దీనిని, వివేకానంద ప్రపంచ దిగ్విజయాన్ని. దైవనిర్ణయంగా జగద్గురుడైన, అవతారవరిష్ఠుడైన పరమహంస పరిగణించారు. భారతాత్మ ప్రబుద్ధమై జాగృతమై జీవించియేయుండుటగాక ఆధ్యాత్మికంగా అఖిలప్రపంచాన్ని జయించ వీలున్నదనుటకు వివేకానందవిజయమే ప్రథమ ప్రత్యక్ష చిహ్నము.[3]

యౌగిక దివ్యశరీరాన్ని గురించి వ్రాస్తూ శ్రీఅరవిందులు వైష్ణవ భక్తి యోగసాధనా సాంప్రదాయంలో చిన్మయశరీరమని, వేదములో జ్యోతిర్మయ దేహమని పేర్కొంటూ, "ఆధ్యాత్మికంగా పరిణమించిన మహాత్ముల శరీరాలు దివ్యతేజస్సుతో ప్రకాశిస్తూంటాయి, ఒక జ్యోతి కనిపిస్తుంది, ఒక తేజోవలయం వారి నావరించి ఉంటుంది. ఈ విధమైన అద్భుతం చరిత్రలో ఆరంభంగా మహావియాధ్యాత్మిక దివ్యావతారమూర్తియైన శ్రీరామకృష్ణుని జీవితంలో లిఖితమైంది."[4]

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన శ్రీ అరవిందుల అనేక గ్రంథాల్లో ప్రముఖమైన 'యోగసమన్వయము'లో శ్రీరామకృష్ణపరమహంసను మహోన్నతంగా సంభావించారు శ్రీఅరవిందులు, "...ఇటీవలి కాలంలో సంభవించిన అపూర్వ ఆధ్యాత్మిక సంఘటన, మహత్తర ఆదర్శ అయిన శ్రీరామకృష్ణపరమహంస అద్భుత జీవితంలో మహోన్నతమైన ఆధ్యాత్మిక శక్తి మహత్త్వం మనకు దర్శనమిస్తుంది. ప్రథమంగా దివ్యసాక్షాత్కారమును నేరుగా ఎదుర్కొని, భక్తిబలంతో బలవంతంగా భగవత్ సామ్రాజ్యసర్వాన్ని వశపరచుకొన్నట్లు, పొందిన అనంతరం, ప్రపంచంలో గల అన్ని యోగసాధనలను, ఒక దాని తరువాత ఒక దానిని, నమ్మశక్యం కాని విధంగా, మహావేగంతో సాధిస్తూ, వాని లోని సారాన్ని గ్రహించి వేస్తూ, ఎల్లప్పుడు అందరి హృదయ సత్యాన్నే స్వీకరిస్తూ, ప్రేమశక్తితో భగవంతుని సాక్షాత్కారం పొంది, భగవంతుడినే వశపరచుకొంటూ, సహజసిద్ధమైన ఆధ్యాత్మిక శక్తి స్వభావాన్ని విభిన్నదివ్యానుభూతుల్లోనికి విస్తరింపజేస్తూ, అంతర్జ్ఞాన లీలావిలాసంచే జీవితాన్నే దివ్యం చేస్తూ..."[5] సాగిన పరమహంస జీవితం సర్వయోగ సమన్వయంగా భాసిస్తుంది.

పృథ్వీచరిత్రలోనే, శ్రీరామకృష్ణపరమహంస అవతారం అపూర్వమైనది, అద్భుతమైనది, సామాన్యమైనది కాదు.

**నభూతోనభవిష్యత్ :**

ఆ దివ్యావతారప్రయోజనం కూడ ప్రత్యేకమైనది, ఆ కాలానికి సంబంధించినది. దీర్ఘకాలం పరస్పరవిరుద్ధాలైన మతాలతో, సాంప్రదాయాలతో, సాధనలతో విచ్ఛిన్నమై పోయిన ప్రపంచం మహాకష్టంలో ఈ మతాలు, ఇవన్నీ, సమగ్రమైన ఒకే సత్య స్వరూప ఖండాలనీ, ఆ సాధనలన్నీ ఒకే మహోన్నత ఆధ్యాత్మికానుభూతి వైపుగా సాగుతున్నాయనే సత్యం దిశగా శ్రమిస్తున్న—ఆ సత్యం, సమస్తమానవాళికి ప్రస్తుతం అత్యంతావశ్యకమైన, ఆ సత్యం యుగాంతరపురుషుడైన, జగద్గురూత్తముడైన శ్రీ రామకృష్ణ పరమహంస మహనీయమైన నిశ్చయాత్మకమైన దివ్యానుభూతితో ఆదర్శప్రాయమై చిరస్థాయిగా నిలుస్తుంది. భగవంతుని తెలుసుకోవాలి, భగవంతునితో ఏకత్వభావం పొందాలి. భగవంతుని భక్తితో వశపరచుకోవాలి; ఇదే ముఖ్యం...[6]

1913 ప్రాంతంలో ఒక లేఖలో శ్రీ అరవిందులు ఇలా వ్రాశారు :... "శ్రీరామకృష్ణుని నుంచి మనం దేనిని గ్రహిస్తున్నామో, ఏ ప్రయోజనాన్ని పొందుతున్నామో (ఆ వర ప్రసాదాన్ని) దానిని కూడ మనం సదా జ్ఞప్తి యందుంచుకోవాలి...నా విషయంలో, నన్ను ఈ యోగసాధనకు మళ్ళించినది వ్యక్తిగతంగా శ్రీ రామకృష్ణపరమహంసయే. ఆలీపూర్ జైలులో వివేకానందుడు సాక్షాత్కరించి నా యోగసాధనకు ఆధారభూతమైన ఆధ్యాత్మిక జ్ఞాన ఆధారములను నాకు ప్రసాదించాడు."[7]

పరమేశ్వరుడు సంకల్పించి, కాళీమాత అనుగ్రహించిన శ్రీ రామకృష్ణ పరహంస ఆవిర్భావమహిమచే, వివేకానందుని మహనీయ కార్యసాధనచే దక్షిణేశ్వరంలో ఆరంభమై పుదుచ్చేరిలో కొనసాగుతూన్న ఈ ఆధ్యాత్మిక దివ్యపరివర్తనాయోగము ఇంకనూ ఫలించవలసివుంది. కాలమే సాధింపగలదు,—"అహమేవ అక్షయః కాలః."

—సేకరణ, అనువాదం: కె. యస్. భాస్కరరావు

**అధో జ్ఞాపికలు :**

1. The Hour of God, Sri Aurobindo Birth Cent. Vol. 17, Page 98.
2. Bandemataram, Sri. Aurobindo Birth Cent. Vol. 17, 99.
3. Sri Aurobindo Birth Cent. Vol. 27 page 3 7; 4. Vol. 16 page 23.
5. Sri Aurobindo Birth Cent. Vol. 17 page 98. 6. Vol. 20 page 36.
7. Sri Aurobindo Birth Cent. Vol. 27, page 435.

**శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4, ఫిబ్రవరి నెల విశేషకార్యక్రమము**

| | | |
|---|---|---|
| 8 వ తేది | సోమవారము | స్వామి అద్భుతానంద జయంతి |
| 22 వ తేది | సోమవారము | మహా శివరాత్రి |
| 25 వ తేది | గురువారము | భగవాన్ శ్రీ రామకృష్ణ జయంతి |
| 4 వ తేది | గురువారము | ఏకాదశి దినములు |
| 19 వ తేది | శుక్రవారము | ఏకాదశి దినములు |

# విజ్ఞానానికై మానవాన్వేషణ: దాని రెండు పరిమాణాలు

హైదరాబాదు, రామకృష్ణమఠంలో 28-9-1981 నాడు ఏర్పాటు చేసిన సాధనా సమావేశములో, హైదరాబాదు ప్రభుత్వ ట్రెయినింగు కాలేజీ ఉపాధ్యాయుల నుద్దేశించి, స్వామి రంగనాథానందజీ గావించిన ఉపన్యాసమునకు స్వేచ్ఛానువాదము

-వి. యస్. ఆర్. ఆంజనేయులు

మీరందరు ఉపాధ్యాయులు. విద్యాసముపార్జన, విద్యా ప్రదానము మీ కర్తవ్యము. అధ్యయనము బోధ అనేవి ఉత్తమ కార్యాలు. భారతీయ సాంప్రదాయంలో అధ్యయనము, బోధ ఎప్పుడూ కలిసే నడుస్తుంటాయి. అందువల్లనే ఉపనిషత్తులలో మీరిలా చదువుతారు. "స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం" (తైత్తిరీయ 1-11-1) ఇది ఒక చక్కని భావం. దాన్ని మనం మరచి పోయాము. విద్యాసముపార్జనలో మనము ఒక కాలంలో చాలా దిట్టలము. ఈ ప్రపంచాన్ని విన్నవారంతా ఎల్లప్పుడు విద్యయందలి ఆసక్తి చేతనే విన్నారు. విద్యను ప్రచారం చేశారు.

పురాతన గ్రీకునాగరికత కాలంలో ఎంత మహత్తరమైన బుద్ధి వికాసముండేది? మధ్యయుగంలో 400 సంవత్సరాలక్రితం అరబ్బీ నాగరికతలో ఎట్టి మహత్తరవిద్యా పరిమళం గుబాళించేది? విజ్ఞానశాస్త్రము, మానవసంస్కృతి అధ్యయనము, ప్రతి ఒక్కశాస్త్రము ఆ కాలంలో అభివృద్ధి చెందింది. హిందూదేశ చరిత్రలోకి పొండి, 4000 సంవత్సరాలక్రితం ఎన్ని విశ్వవిద్యాలయాలు? రావల్పిండి వద్దనున్న తక్షశిల, పాట్నావద్దనున్న నలందా, అనేక యితర ప్రాంతాలలో ఎన్నో విశ్వవిద్యాలయాలు ఉండేవి. విద్యయందలి ప్రేమ, విద్యాసముపార్జనమందలి జిజ్ఞాస, యితరులకు నేర్పాలనే ఆకాంక్ష, గ్రంథరచన, ప్రచారము, బోధలవల్ల సర్వత్రా ప్రభావితం చేసినది. ఆ విధంగా ఈ జాతి పూర్వకాలంలో ఒక మహత్తర నాగరికతను నిర్మించినది.

తర్వాత యిటీవలి శతాబ్దాలలో మనము స్తబ్ధులమై పోయాము. జ్ఞానమంతా అదృశ్యమైంది. అజ్ఞానము, మూఢవిశ్వాసము, బలహీనత నిలిచిపోయినాయి. తర్వాత ఆధునికయుగం వచ్చింది. పాశ్చాత్యసంపర్కం ఏర్పడింది. వాళ్ళొక కుదుపు కుదిపారు. మనం నిద్ర లేచాము. ఆ మెలకువ వస్తున్న స్థితిలో ఈ జాతిని పునర్నిర్మాణము చేస్తున్నాము. దీనికి విద్య మూలం. వైజ్ఞానిక విద్య, అధ్యయనము. యితర అన్నిరకాలైన విద్య అవసరము. మన బుద్ధులు విప్పారాలి. రాబోవు తరానికి, దూరదూరాలనుండీ వచ్చే చిన్నపిల్లలకు వీటిని అందించాలి. అదే బోధనా విధానము.

మనది ప్రజాప్రభుత్వం. "ప్రజాప్రభుత్వం" అనే మాటను గుర్తుపెట్టుకోండి. ఉండటానికి, అభివృద్ధి చెందటానికి, ఆత్మసంతృప్తి చెందటానికి ప్రతివానికి హక్కు ఉంది. చిన్నబిడ్డ అభివృద్ధిచెంది, సంపూర్ణత నొందటానికి మనం సాయం చేస్తాము. అదీ విద్య. మీరు నేర్పే విద్య దానిమీదనే ఆధారపడింది. కాని నేటి మన విద్యాసముపార్జనలో ఒక పరిమితి వుంది. అది విద్యలోయుండే ఒకానొక పరిమాణము మాత్రమే. మీరు బోధిస్తున్న విజ్ఞానశాస్త్రాలు, మానవసంస్కృతి అధ్యయనము, యితర శాస్త్రాలు అన్నీ మనం ఈ ప్రపంచంలో ఎలా మెలగాలో, ఉద్యోగం ఎలా సంపాదించాలో, డబ్బు ఎట్లా సంపాదించాలో, జీవిత భోగాలెలా అనుభవించాలో అనేది మాత్రమే తెలుపుతున్నాయి. అదీ మనమీనాడు నేర్చుకుంటున్న విద్య. అంతకంటే యెక్కువేమీ లేదు. అదే నేటి మన విద్యలోయున్న పరిమితి. అందువల్లనే దానివల్ల శీల నిర్మాణం కావటం లేదు. ధార్మికబుద్ధి అలవడటము లేదు. దయార్ద్రహృదయము కలగటం లేదు. మీరు చూడటం లేదా? నేరము (Crime) పెచ్చుటిల్లుతున్నది, అవినీతి పెరుగుతున్నది, లంచగొండితనం, అన్నిరకాలైన దురభ్యాసాలు. - అన్నిసమయాలలో విద్యార్థులు కాపీ కొట్టడం, మొదలైన అన్నిరకాల అవలక్షణాలు నేటి సంఘములో చోటు చేసుకుంటున్నాయి. మనము పుస్తకాలు చదువుతున్నాము. కాని వాటిల్లో విద్యలోయుండే మరో పరిమాణం లోపిస్తున్నది. ఆ దృక్పథాన్నిగూర్చి మనకేమీ తెలియదు. నేడు దాన్ని మనం అనుమానిస్తున్నామంటే అది మతం అనే మాటలో ముడిపడి వున్నందువల్ల మతమంటే కావలసినంత మూఢాచారము, కావలసినంత నేరము, కావలసినంత బహిష్కరణలు, కావలసినంత యుద్ధము? అందువల్ల మనం మతాన్నుండీ దూరంగా ఉండటానికి చూసున్నాము. మత కారణంగానే మనదేశం

రెండు ముక్కలయింది. దానివల్లనే మతమంటే మీకు అంత తిరస్కారముంది. ముమ్మాటికీ సత్యమే. మతం పేరుతో మనం అంటరానితనాన్ని అభ్యసించాము. మతం పేరుతో యితరులను అణగదొక్కాము. మతం పేరుతో మనం అనేక మూఢవిశ్వాసాలను కౌగలించుకున్నాము. భౌతికశాస్త్రాల ఆవిర్భావానికి అడ్డు తగిలాము. పాశ్చాత్య దేశాలలో అనేక మతయుద్ధాలు చెలరేగినాయి. అదంతా ముమ్మాటికీ సత్యమే. దీనికి భిన్నంగా 'మత విజ్ఞాన శాస్త్రము' ఒకటి ఉంది. అది మానవుని ఉత్కృష్ట జీవిత విజ్ఞానశాస్త్రము. దాన్ని మనం నేడు వృద్ధిలోకి తేవాలి. "నేను ఎలా నీతినియమాలు కలిగి నైతిక వర్తనుడనవుతాను? పొరుగువాడి బాగోగులు పట్టించుకునేవాడినెలా అవుతాను? నేను నీతిపరుడనెలా అవుతాను?" అనేవన్ని మానవుని అంతరాంతర వ్యక్తిత్వ స్థితినుండి వస్తాయి. కేవలం బుద్ధివికాసం వల్ల మీరు మంచి నడవడిని పెంపొందించుకోలేరు. గొప్ప గొప్ప మేధావులను, ఏమాత్రం శీలం లేనివారుగా మీరు తరుచు చూస్తుంటారు. మేధావి ఖుంత కూడా కావచ్చు. భారతదేశంలో నేడు అనేక అనర్థాలు మేధావులవల్లనే జరుగుతున్నాయి. నేరస్తులు కూడా మేధావులే. వారికి ఎంతో జ్ఞానముంది. కాబట్టి బుద్ధి పెరిగినంతమాత్రాన నడవడిక పెరగదు.

భావోద్వేగ వికాసమనేది ఒకటి వుంది. భావోద్వేగ పారిశుద్ధ్యము అవసరం. అందువల్ల 4000 సంవత్సరాల క్రితమే ఉపనిషత్తులలో విద్య రెండువర్గాలుగా విభజింపబడింది. నేటికి గూడా అదియెంత చక్కగా సరిపోతుందో చూడండి. ముండకోపనిషత్తులో విద్యార్థి గురువు దగ్గరకు పోతాడు. పోయి యిలా మనవి చేస్తాడు. "అయ్యా! నేను ఒక మహత్తర సత్యాన్ని తెలుసుకోటానికి వచ్చాను. ఏ సత్యాన్నుండి యీ సర్వజగత్తు ఉద్భవమైంది? ఈ వైవిధ్యానికి వెనుక ఏదో ఒక ఏకత్వముండాలి. ఆ సత్యాన్ని నేను తెలుసుకో గోరుతున్నాను."

"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి."

"హే ప్రభో ఏ జ్ఞానసముపార్జన వల్ల యీ ప్రపంచంలోని సర్వము మీకు తెలియబడిందిః" అనేదే ఆ ప్రశ్న

ఒక మట్టిముద్దను తీసుకోండి. మట్టి స్వభావాన్ని అధ్యయనం చేయండి మీరు మట్టి స్వభావాన్ని తెలుసుకున్నారు గాన, మట్టితో చేసిన వివిధరకాల మట్టి ఆకారాలు, మట్టి బొమ్మలు అన్నీ మీకప్పుడు పూర్తిగా అవగతమౌతాయి. అదేవిధంగా యీ విశ్వమంతా కూడా ఒక మూలతత్త్వం మీద ఆధారపడివుంది. దాన్ని మనం తెలుసుకోగోరుతున్నాము. అందువల్లనే విద్యార్థి ఎంతో దూరంనుండీ గురువు దగ్గరకు పోయి ప్రశ్నిస్తున్నాడు. "కస్మిన్ను భగవో" అని. చూడండి ఎంత వినయత చూపుతున్నాడో! "హే భగవాన్ ఏది తెలుసుకుంటే ఈ విశ్వంలో సమస్తము తెలియబడుతుందో అది ఏమిటండీ?" ఈ ప్రశ్నకు గురువు అత్యుత్కృష్టమైన సమాధానము చెపుతున్నాడు. ఈ విషయాన్ని గూర్చి నేను అమెరికా విశ్వవిద్యాలయాల్లోనూ, యితర విశ్వవిద్యాలయాల్లోనూ మాట్లాడినప్పుడు వారు ఎంతగా ప్రభావితులైనారో! ఏమి అద్భుతము! ఇది ఒక విజ్ఞానశాస్త్రము - భౌతికవిజ్ఞానానికన్నా వున్నతమైన విజ్ఞానము ఆ సమాధానమే గురువుగారు యిలా చెపుతున్నారు "ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదన్తి పరాచైవాపరా చ" [ముండక 1-1- ]. మానవుడు రెండురకాలైన విద్యలను ఆర్జించాలి. 'ద్వే విద్యే వేదితవ్యే పరా అపరా చ' ఒకటి పరావిద్య మరొకటి అపరావిద్య. ఒకటి ఉత్తమ విద్య రెండవది సామాన్య విద్య. పరా - అపరా అనే సంస్కృతపదము అసాధారణ సాధారణ విద్యలను సూచిస్తున్నది. అపరా అంటే యేమిటి? భౌతిక విజ్ఞానశాస్త్రాలన్నీ, ఆర్థిక రాజనీతి మొదలైన శాస్త్రాలన్నీ అపరా విద్యలే. పవిత్ర మతగ్రంథాలైన కొరాన్, బైబిల్, వేదాలు మొదలైనవన్నీ అపరా విద్యలే అని గురువు చెపుతున్నాడు. ఆయన శాస్త్రీయ దృక్పథాన్ని గమనించండి. ఆయన అప్రతిహత ధైర్యాన్ని గుర్తించండి. ఎంతో గౌరవప్రపత్తులతో చూడబడే వేదాలు కూడా తక్కువ స్థాయివేనట! భౌతిక, రసాయనిక, శాస్త్రాలవలే పవిత్ర మతగ్రంథాలన్నీ సామాన్యవిద్య - అపరా విద్యకు చెందినవే. యిది మొదటి సమాధానము.

ఇక పరావిద్యకు సంబంధించినవేవి? వేదాలు, కొరాన్ మొదలైనవన్నీ అపరా విద్యకే చెందితే పరావిద్య అనేదేమిటి? నీవు భౌతిక విజ్ఞానశాస్త్రంలోను, రసాయన శాస్త్రంలోను, ఖగోళశాస్త్రంలోను, ఆర్థికశాస్త్రంలోను, రాజనీతి శాస్త్రంలోను, లేక క్రైస్తవతత్త్వశాస్త్రంలోనూ, హిందూతత్త్వశాస్త్రంలోను, మహమ్మదీయ తత్త్వశాస్త్రములోనూ పండితుడవు గావచ్చు. కానీ నీవు వాటివల్ల సర్వోత్కృష్టమైన దాన్ని సాధించినవాడివి గాదు. నీవు సాధించవలసినది యింకా కొంత మిగిలే వుంది.

వేదాల్లో వున్నదేమిటి? బైబిల్, కొరాన్‌లలో వున్నదేమిటి? రామకృష్ణుడు దీనికి చక్కని సమాధానము చెప్పాడు. "వాటిల్లో దేవునిగూర్చిన సమాచారము మాత్రమే

వుంటుంది. కానీ దేవుడు వుండడు. ఈ రెండింటిలో తేడా ఎలా వున్నదో గమనించండి. పంచాంగం ఎంత వాన కురుస్తుందో తెలుపుతుంది. ఈ సంవత్సరంలో 50 అంగుళాల వానపడుతుందని పంచాంగంలో వున్నదనుకోండి'' అని నవ్వుతూ రామకృష్ణుడు యిలా అంటాడు. ''మీరు పంచాంగాన్ని పిండితే అందులోనుండీ ఒక్క వానచుక్కైనా రాలదు. వాన యింత కురుస్తుందని మాత్రమే దానిలో వుంటుంది.'' అదేవిధంగా వేదాలు, కొరాన్, బైబిల్ గ్రంథాల్లో సర్వోత్కృష్ట విషయముండదు. దాన్ని గూర్చిన సమాచారమే మీకు వాటిల్లో దొరుకుతుంది. మీ స్వానుభవం వల్ల మీ అంతట మీరే దాన్ని పొందాలి. పుస్తకాలు పట్టుకుంటే అది రాదు. ఇలా చెప్పటంలో ఉపనిషత్తులు సాహసము చూపిస్తున్నయి. అపరావిద్యలో లేని ఉత్తమజ్ఞానమే పరావిద్య.

పరావిద్య అంటే ఎమిటో సమాధానము చెపుతున్నారు. 'యయాతదక్షరమధిగమ్యతే' (1-1-5 ముండక). దేని వల్ల అక్షరజ్ఞానము సాక్షాత్కరిస్తుందో అది పరావిద్య. మిగిలినవన్నీ నశించిపోయేవే. వస్తుంటయి, పోతుంటయి. భౌతికశాస్త్రం ప్రకృతిలో నశించే విషయాలను గూర్చి తెలుపుతుంది. రసాయనశాస్త్రం, మిగతా విజ్ఞానశాస్త్రాలన్నీ అలాంటివే. నశ్వరమైనవాటికి సంబంధించిన తత్త్వశాస్త్రము అటువంటిదే. వాటివల్ల యథార్థ సత్యం మనకు గోచరం కాదు. కాని దివ్యత్వం అనుభూతమైనప్పుడే మీరు సత్యాన్ని తెలుసుకుంటారు. ''నాకిప్పుడు పరావిద్య లభించింది: అనేకత్వంలో ఏకత్వం, అనిత్యత్వం వెనుక నిత్యత్వం, మృత్యువు వెనుక అమృతత్వం నేను దర్శించాను'' అనేదే అసలు మతం. అదే మతాన్ని గూర్చిన విజ్ఞానశాస్త్రం. అదే ఆధ్యాత్మికత. హిందూ ఆధ్యాత్మిక తత్త్వమైనా, ముస్లిం ఆధ్యాత్మికత్వమైనా, బైబిల్ యూదుల ఆధ్యాత్మికత్వమైనా ఒకటే. దాన్ని మీరు ప్రయత్నించవచ్చు. సత్యాన్ని తెలుసుకున్నపుడు సమస్తం వేరుగా ఉంటుంది.

కాబట్టీ సమస్య యేమంటే: రెండూ జ్ఞానాన్వేషణ చేసే విద్యలైనపుడు ఒకదాన్నుంచి రెండవది తెలుసుకోవచ్చునా? పసిబిడ్డ పుట్టినపుడు జ్ఞానం కోసం దేవులాడుతుంది. మనం నివసిస్తున్న ప్రపంచం ఏమిటి? ఇదే పసిబిడ్డ వెతుకుతున్న జ్ఞానం. ఆ బిడ్డ, తర్వాత శాస్త్రవేత్త అవుతాడు. అనేక శాస్త్రాలు చదువుతాడు. విజ్ఞానశాస్త్రంలో నిష్ణాతుడౌతాడు. రాజనీతిలోనూ, అర్థికశాస్త్రంలోనూ దిట్ట అవుతాడు. అది విద్యలోగల ఒక పరిమాణం.

రెండవ పరిమాణాన్నిగూర్చిన ప్రశ్న చివరకు వస్తుంది. ''నేనెవరు? నా సంగతి నాకు తెలియటము లేదు. 'చుట్టూ ఉన్న ప్రపంచాన్నిగూర్చి నాకు తెలుసు కానీ, నాలో దాగి యున్న రహస్యమేమిటి? అవగతం కావటము లేదు.' దీనికి సమాధానం పాక్షికంగా మనం భౌతికశాస్త్రాల్లో చదవవచ్చు. జంతు దేహశాస్త్రంవల్ల, శారీరశాస్త్రంవల్ల, నాడీశాస్త్రంవల్ల శరీరమంటే ఏమిటో తెలుసుకుంటాము మానసికశాస్త్రం వల్ల మనం ప్రవర్తన ఎలా ఉంటుందో కొంత వరకు తెలుసుకోవచ్చు కాని యిన్ని చదివినా తెలియబడనిదేదో యింకా మిగిలే ఉంటున్నది. మనుష్యునిలో దాగి యున్న ఆ అద్భుత రహస్యమేమిటి? దీన్ని తెలిపేది ఒక అద్భుత విజ్ఞానశాస్త్రం. అది మానవుని అంతర్యాన్ని తెలుసుకొనే విజ్ఞానశాస్త్రము. ఆ శాస్త్రంలోనుంచే జీవితంలో శ్రేయోదాయకమైనదంతా ఆవిర్భవించింది. ఆ ఉన్నతమైన పరిమాణంనుండే ప్రేమించే శక్తి, గొప్ప ఆశయానికి అంకితమయ్యే శక్తి, మనశ్శాంతి మొదలైనవన్నీ వస్తాయి.

నేడు ప్రపంచంలో ఎంతో విజ్ఞానం మీరు చూడటం లేదా? ప్రపంచాన్నిగూర్చిన విజ్ఞానమెంతో వుంది. మనం చంద్రమండలానికి పోగలం. ఎన్నో మహత్కార్యాలు మనం సాధించగలం. అయినా ఎంతో బాధ, ఎంతో నేరం, ఎంతో అపరాధం కనిపిస్తున్నాయి. వందలమంది ఆత్మహత్యలకు గూడా పాల్పడుతున్నారు. విజ్ఞానశాస్త్రం యివ్వగల్గినన్ని మంచి విషయాలు - సుఖజీవనము, సౌఖ్యమైన యిండ్లు, అనేకమైన అధునాతన వస్తుసముదాయాలు - యిస్తున్నా మనశ్శాంతి లేదు. విసుగెత్తుతున్నది. నిరాశ కల్గుతున్నది. ''నాకిలా ఉంది, నాకిలా ఉంది'' అంటున్నారు. నేటి స్థితి యిది. ప్రపంచమంతా ఆ ఉత్తమజ్ఞానానికై అర్రులు చాస్తున్నది. ''నాకు మనశ్శాంతి కల్గించేది, నాచుట్టూఉన్న ప్రజలను నేను ప్రేమించగల్గేట్లు చేసేది ఉత్తమ జ్ఞానమేమైనా ఉందా?'' భర్తలను ఎలా ప్రేమించాలో తెలియని భార్యలున్నారు. వారు కలిసి మాత్రమే జీవిస్తారు. ఒకొరికొకరి మధ్య సామరస్యమే లేదు. లక్షలమంది ప్రజలు వైజ్ఞానికంగా ఎంతో పరిణితి చెందినవారు అలా ఉన్నారు.

అందుచేతనే ఉపనిషత్తులలో గురువుచెప్పిన సమాధానము నేటికి కూడా సరిపోతున్నది.

''కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి.'' అనే ప్రశ్నకు యిలా సమాధానము చెప్పారు. ''అథ పరా.'' అది పరావిద్య. విద్య అంటే విజ్ఞాన

శాస్త్రం. పరావిద్య అంటే నాశముగాని, అమృతత్వమైన దివ్యత్వాన్ని సాక్షాత్కరింపచేసేది. 'ఈ శరీర మనస్సునే సముదాయం వెనుక ఆ పరావిద్య దాగి ఉంది. మనకా జ్ఞానము రావాలి. దాన్నే సర్వప్రపంచము అన్వేషిస్తున్నది. మీరు రష్యా పొండి, జర్మనీకి పొండి, అమెరికా పొండి, హాలెండ్‌కు పొండి. ఎక్కడికి పోయినా సరే యిదే ప్రశ్న. నేను ఏడాది కొకసారి ఆయా దేశాలకు పోయి విశ్వవిద్యాలయాల్లో వందలాది ప్రజల నుద్దేశించి ప్రసంగిస్తాను. ఎక్కడ చూచిన "మేము సత్యాన్ని తెలుసుకో గోరుతున్నాము. మాలో వున్న ఏ అద్భుత పరిమాణంలో మేము ప్రశాంతంగా ఉండటము, ప్రజలను ప్రేమించటము తెలుసుకోగలమో మాకు అర్థం కావటం లేదు" అంటున్నారు.

పాశ్చాత్యదేశాల్లో నేడు ప్రజాహృదయంలో ఈ అప్రతిహతమైన ఆకాంక్ష ఉంది. సామూహిక రేడియో ద్వారా నేను అమెరికాలో ప్రసంగిస్తున్నపుడు "స్వామీజీ మాట్లాడండి" అంటారు. నేను మాట్లాడతాను. కొంత సేపైన తర్వాత ప్రశ్న వినపడుతుంది. కాని ప్రేక్షకులు నా ఎదుట ఉండరు. వారు ఎక్కడో గ్రామాల్లో, గృహాల్లో ఉంటారు. అమెరికా రేడియో విధానము ఆశ్చర్యంగా ఉంటుంది. రేడియో స్టేషనులో మాట్లాడుతున్న నాతో యిండ్లలోనున్న టెలిఫోన్‌లనుంచీ మాట్లాడవచ్చు. అలా అనేక ప్రశ్నలు వేస్తారు. నేను సమాధానము చెపుతాను చివరకు ఈ ప్రశ్న వేస్తారు "స్వామీజీ మీరు ధ్యానం నేర్పుతారా మేము ధ్యానం చేయాలనుకుంటున్నాము. మేము మా హృదయాంతరాలలోకి పోయి సత్యమేమిటో కనుగొనాలని ఉంది." వెంటనే కొద్ది నిమిషాలు సర్వత్రా ప్రశాంతి నెలకొంటుంది. "ఇలాచెయ్యండి, అలా చెయ్యండి" అని నేను చెపుతాను. అందరు నిశ్శబ్దముగా కూర్చొని ఉంటారు. తర్వాత వాళ్ళు ఎంతో కృతజ్ఞత తెలుపుతారు. ఆ విధంగా పరావిద్య వారి హృదయాలనూ, మనస్సును ఆకర్షిస్తున్నది.

మనదేశానికి యిది ఎంతో అవసరంగా ఉంది. నైతిక విలువలు, నీతి నియమాలు లోపించటము వల్లనే నేడు దేశంలో దురాచారాలన్నీ ఏర్పడుతున్నాయి. నేటి విద్య నీతినియమాలను నేర్పటం లేదు. శ్రద్ధ అంతా డబ్బు సంపాదించటంలోను, భోగలాలసతలోను, సుఖాలలోను కనపిస్తున్నది. డబ్బు సంపాదించటానికి ఉన్న ఏకైకమార్గం మోసం చెయ్యటం, దొంగతనం చెయ్యటం, అవినీతి. శక్తి అంతా ఒకే మార్గాన్నిబట్టి పోతున్నది ఉత్తమ మార్గంలోకి తిరిగిపోవటం వల్లనే నేడు దేశమంతా ఎలా బాధపడుతున్నదో గమనించండి.

విజ్ఞానానికి రెండు పరిమాణాలున్నాయి. ఒకటి భౌతికం, రెండవది దానికి అతీతమైనది. ఒకటి సామాన్యం; రెండవది అసామాన్యం. దీన్ని మనం గమనించాలి. తార్కిక దృష్ట్యా తలంపును బుద్ధిని సూక్ష్మతరం చేసి, ప్రపంచ విషయాలను అర్థం చేసుకోగలం. కాని నాలోను, మీలోను దాగియున్న సత్యాన్ని దైవాన్ని సాక్షాత్కరించుకోవాలంటే, యీ తర్కము, యీ బుద్ధి చాలవు. ఇంద్రియస్థాయిని అధిగమిస్తేనే అంతఃపరిమాణాన్నుండి, ఆ జ్ఞానం లభిస్తుంది.

దానికి ముఖ్యసాధనం ధ్యానం. ధ్యానము వల్ల మనము భౌతికస్థితిని దాటి పైకి పోగలుగుతాము. యింద్రియాలు యెప్పుడూ బైటకి లాగుతాయి. ఇంద్రియం ఏం చేస్తుంది? ప్రపంచాన్నిగూర్చిన సమాచారం అందిస్తుంది. అంతకంటే ఇంకేం చేయలేదు. మన తత్త్వమేమిటో అది తెలియ చేయలేదు. ఇంద్రియం ఒక వస్తువు. అది మనస్సుతో ముడిపడి ఉంది. మీరు చెప్పే లౌకికజ్ఞానం ఇంద్రియాలద్వారా లభిస్తుందన్నమాట నిజమే. దాన్ని పొందండి. కానీ అక్కడితో ఆగిపోగూడదు. మన గురువులు "బాహ్య జ్ఞానాన్ని సంపాదించండి. అక్కడ ఆగవద్దు, బాహ్యాన్ని అతిక్రమించండి. ఇంద్రియాలను దాటండి" అని చెప్తున్నారు.

ధ్యానంలో మీరేం జేస్తారు? ఇంద్రియాలను నిశ్చబ్దం చేస్తారు. చూడండి. ఈ కండ్లు చురుకుగా ఉన్నాయి. చెవులు చురుకుగా ఉన్నాయి. స్పర్శ చురుకుగా ఉంది. ప్రతిది చురుకుగా ఉంది. కాని ధ్యానంలో కూర్చున్నపుడు అన్నీ శాంతిస్తాయి. ఈ స్థితిలో భౌతికంగాను, శారీరకంగానూ శాంతి కోరుతాము. శాంతి సాధిస్తాము. అప్పుడే ధ్యానం సాధ్యపడుతుంది.

అందువల్లనే కఠోపనిషత్తులో మొట్టమొదటిగా యీ విషయం వివరించబడింది. మానవుడు పరిపూర్ణంగా శాంతించినపుడే, పరిపూర్ణ నిశ్చలత పొందినపుడే, అంతర్ముఖుడౌతాడు. ఉపనిషత్తు యిలా ప్రవచిస్తున్నది.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిం
తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణామ్.

మీ నిజస్వభావాన్ని దేనివల్ల తెలుసుకోగలుగుతున్నారో దాన్నే యోగమంటారు. ఎప్పుడు యోగాన్ని సాధిస్తారో, ఎప్పుడు యింద్రియాలన్నీ మనస్సు, బుద్ధితోసహా శాంతి

స్తయ్యో, అప్పుడు మహత్తరమైన అనుభూతి లభిస్తుంది. మీ నిజతత్త్వం వ్యక్తమవుతుంది.

సాధారణంగా మనస్సు యింద్రియాలద్వారా నఖ శిఖాలపట్టి వేలాది విషయాలవైపు పోతుంది. చిన్న బిడ్డను చూడండి! క్రొత్తగా పుట్టిన బిడ్డ యింద్రియాలలోనే చిక్కియుండి తొట్రుపాటుతో అటు ఇటు చూస్తూ వుంటుంది. ఆ మనస్సులో స్థిరత్వమేమీ వుండదు. నెమ్మది నెమ్మదిగా కొంచెము మనస్సు స్థిరత్వం చెందే స్థితికి ఎదిగి విషయాలను అర్థం చేసుకొనే విద్యార్థిగా పెరుగుతుంది.

జ్ఞానమంటే. యింద్రియ సముదాయాన్ని, ఉద్రేకాన్ని నిగ్రహించి ప్రపంచవిషయాలను గూర్చి పరిశీలించుట యన్నమాట. ఉద్రేకంలో ప్రశ్న వేయలేము; ఆస్థితిలో జ్ఞానం కానీ, అనుభూతికాని రానేరాదు. పశువులన్నీ యింద్రియస్థాయిలోనూ, ఉద్రేకస్థితిలోనూ ఉంటాయి. కోతికి ఒక అనుభవము వస్తే అది ఉద్రేకం చెందుతుందే కాని, జ్ఞానం కలగదు. కాబట్టి ఉద్రేకాన్ని నిగ్రహించి ప్రశ్నించినప్పుడే జ్ఞానం వస్తుంది. యింద్రియస్వభావాన్ని యింద్రియానుభవాన్ని నిగ్రహించుకొన్నప్పుడే ప్రశ్నించ గలిగే మనస్సు ఏర్పడుతుంది.

మానవుడు ఆ విధంగా పశుత్వమును అధిగమించి మానవుడై జ్ఞానాన్వేషకుడౌతాడు. కాని జంతువులు జ్ఞానాన్ని ఆర్జించలేవు. ప్రకృతి సిద్ధమయిన జ్ఞానం వాటి స్వభావంలో సహజంగా వుంటుంది. జీవరాశులన్నింటిలో ఒక్క మానవునికే ప్రశ్నించే శక్తి, జ్ఞానాన్ని ఆర్జించే శక్తి వున్నది.

అందువల్లనే మానవుడికి శైశవం చాలాకాలముంటుంది. జంతువుల శైశవం అత్యల్పం. దూడ పుట్టిన మొదటిగంటలో పెనగులాడి రెండవగంటలో గంతులు వేస్తుంది. దాన్ని గూర్చి ఆదుర్దా పడము. కాని మానవ శిశువు 16, 17 సం॥ లు శైశవంలోయుండి యితరులపై ఆధారపడతాడు. దీనికి కారణం ఏమిటి? అంతకాలం అతనిలో మనస్సు పెరుగుతూ రావటము వల్ల. బిడ్డకు జ్ఞానం అభివృద్ధి చెంది ప్రశ్నించే స్థితి ఏర్పడి రెండవపరిమాణంలో అడుగు పెడుతుంది. శైశవస్థితి దాటినప్పుడే విద్యార్థి అవుతాడనే మాట గుర్తు పెట్టుకోండి.

క్రొత్తగా పుట్టినబిడ్డ సుఖాన్ని, సుస్థిరతను తప్ప ఇంకేమీ కోరదు. మూడు, నాలుగు సంవత్సరాలు దాటేటప్పటికి దానిలో క్రొత్త ఆకాంక్ష రేకెత్తి 'అమ్మా యిదేమిటీ? అదేమిటి?' అని ప్రశ్నించి తెలుసుకోగోరుతుంది. ఆ స్థితి వచ్చే వరకు బిడ్డకు కావలసింది అమ్మ వొడిలో ఉండటము మాత్రమే. తర్వాత బిడ్డ విద్య నార్జించే విద్యార్థి అవుతాడు. బిడ్డకు యిది రెండవ జన్మ.

మొదటి జన్మ భౌతిక అవయవనిర్మాణము; రెండవ జన్మ మానసికము, ఆధ్యాత్మికము. హిందూదేశవిధానంలో జ్ఞానార్జనమంతా ఆధ్యాత్మికమే. ప్రతి విద్య ఆధ్యాత్మికమే. చెప్పులెలా కుట్టాలోకూడా ఆధ్యాత్మికజ్ఞానమే. మీరు శరీర స్థితిని దాటితే ఉన్నతస్థితిలో ఉన్నవారవుతారు. రెండవ జన్మకు సరైన పదం 'ద్విజత్వం'. బిడ్డ యింటినుంచి పాఠశాలకు పోయినప్పుడు ద్విజుడౌతాడు. జ్ఞానసముపార్జనలో ఆగటమనేది ఉండదు, మీరు అలసినపుడు ఆగి మళ్ళీ బయలుదేరుతారు. అలాగే జ్ఞానాన్వేషణ కూడా సాగుతూనే వుండాలి. అది మొదట మిమ్మల్ని విషయప్రపంచంలో ఉన్నతస్థితికి కొనిపోయి, తర్వాత రెండవ పరిమాణము లోనికి దారి తీస్తుంది.

"నేను ప్రపంచజ్ఞానం సంపాదించాను. కానీ నాకు సుఖం కలగటము లేదు. సంతృప్తి లేదు. సందేహాల పుట్టగానే ఉన్నాను. నేనేం చెయ్యాలి" అనే జిజ్ఞాస రెండవ మెట్టు. అక్కడ మౌలికమైన ప్రశ్నలు ఉత్పన్నమౌతాయి. 'నా నిజస్వభావం ఏమిటి? నేను అనేది ఎవరు? అద్భుతమైన ఆత్మ ఎవరు? నాకేమీ గోచరం కావటం లేదు. ప్రపంచాన్నిగూర్చి అంతా తెలుసుకున్నాను గాని, నాగూర్చి నాకేమీ తెలియదు. ఇక్కడేదో తికమక ఉంది. నిస్పృహాయుడ నౌతున్నాను' అనిపిస్తుంది.

నేడు అనేకమందిని మీరు చూడటం లేదా? వాళ్ల మనస్సులో ఏదో పొరపాటు జరిగితే నిస్పృహాయులై పోతున్నారు. మానసిక వైద్యుని దగ్గరకు పోవాలి. అద్భుతమైన ఈ యంత్రాన్ని బాగుచెయ్యటానికి ఎక్కడెక్కడికో పోవాలి.

విద్యలో వున్న రెండవ పరిమాణం అద్భుతమైన పరిమాణం. ఆ పరిమాణమునుండే జీవితంలోయుండే మాధుర్యం, వడవడికలోయుండే సౌందర్యము వస్తుంది గాని, ప్రాపంచికస్థితినుండి రాదు. గొప్పపండితుడు అల్ప మనస్కుడుగానే యుండవచ్చును. చిన్ని విద్యార్థివి అణగద్రొక్కే స్వభావం కలవాడై యుండవచ్చును. హిందూదేశంలో యిలాంటివి కోకొల్లలు. సంకుచితస్వభావమే దీనికి కారణము. పాండిత్యము ఒక్కటే మిమ్మల్ని గొప్పవాళ్ళను చెయ్యదు. కాబట్టి జ్ఞానసముపార్జనకై అద్భుతమైన ఈ రెండవపరిమాణంలో ప్రతిబిడ్డను ఉపాధ్యాయులైన మీరు

వడిపించాలి. మీదగ్గర చదువు ముగించుకొని వెళ్ళేటప్పుడు మీరిలా చెప్పాలి. 'అబ్బాయిలూ, మిమ్మ జ్ఞానమార్గంలో పెట్టాను. మీరు నివసిస్తున్న ప్రపంచాన్ని గూర్చి కొంత నేర్పి, కొంతదూరం తీసుకువచ్చాను. యీ అన్వేషణ యింకా కొనసాగించండి. యింద్రియసుఖాల స్థితిని దాటి మానవునకు సాధ్యమైన ఉత్కృష్టమైన జ్ఞానాన్ని పొందటానికి యత్నించండి.' ఉత్తమజ్ఞానాన్ని అన్వేషించే ప్రతి ఉపాధ్యాయుడుగాని, ఉపాధ్యాయినిగాని విద్యార్థిని ఆ విధంగా మార్గంలో పెట్టి, 'నాకు దాన్నిగూర్చి ఎక్కువ తెలియదు. ఉత్తమ ఆచార్యుల వద్దకు పోయి మీ అంతట మీరు నేర్చుకోండి' అని చెప్పాలి.

ఇటువంటి ఉత్తమజ్ఞానం_భగవంతుని గూర్చిన జ్ఞానం ఆత్మను గూర్చిన జ్ఞానం_ఒకటి వుంది. అది మహోత్కృష్టమైనది. అదే పరావిద్య.

మీకు చెప్పటానికి సంతోషిస్తున్నాను. కొంతమంది గొప్ప భౌతికశాస్త్రవేత్తలు యీ విధమైన రెండవ పరిమాణానికి చెందిన ఉత్తమ జ్ఞానాన్ని పొందటానికి యెంతో ఆరాటపడుతున్నారు. ఒకే ఒక ఖగోళ_భౌతికశాస్త్రజ్ఞుని (Astro physcist) R. A. మిల్లికన్‌ను ఉదహరించదల్చుకున్నాను. తన ఆత్మకథ చివరిభాగంలో యిలా వ్రాశాడు. ఆయన మాటలనే ఉదహరిస్తున్నాను.

"మానవుని సుఖమైన మనుగడకు రెండు స్తంభాలున్నాయి. విజ్ఞానశాస్త్రము, మతము. రెండవదాని సహాయము లేకుండా వీటిలో ఏ ఒక్కటీ తన పూర్తి ఫలితాన్ని యివ్వలేదు." విజ్ఞానశాస్త్రంగాని, మతంగాని తనంతట తానేమీ చేయలేదు. ఆయన చెప్పినట్లు మనకు రెండూ కావాలి. ఆయన యింకా యిలా చెప్పాడు. విజ్ఞానశాస్త్రానికి సంబంధించినంతవరకు విశ్వవిద్యాలయాలు, పరిశోధనాలయాలు ఉన్నాయి. కాని ఎవ్వరిపీ మినహాయించకుండా ప్రతివారికి మతంలో ఒక మహోత్కృష్టమైన అవకాశం వుంది. మీ నిజతత్త్వమేమో మీరు తెలుసుకున్నారా? అది తెలుసుకుంటే జీవితము సుఖమయమౌతుంది. పరిపూర్ణత లభిస్తుంది. వేదాంతము దీన్ని 'ఆత్మ' అంటుంది. ఆ ఆత్మ ప్రతిమానవునిలోనూ వుంది. దాన్నిగూర్చి తెలుసుకోండి. ఏ కొంచెం తెలుసుకున్నా బలం కలుగుతుంది. స్థిరత్వమేర్పడుతుంది. యితరులను ప్రేమించి సేవించే శక్తి లభిస్తుంది. మానవజీవితానికి సుగుణాత్మకమైన సంపద సిద్ధిస్తుంది.

నేడు భౌతికశాస్త్రవేత్తలు, అనేక యితర విజ్ఞానశాస్త్రవేత్తలు మతంవైపుకు మరలుతున్నారని మీకు చెప్పాలనుకుంటున్నాను. ప్రాణానికి సంబంధించిన జీవశాస్త్రం తీసుకోండి. ఇరవయ్యో శతాబ్దంలో జీవశాస్త్రంలోవుండే ఒక అద్భుతమైన భావమేమంటే పరిణామం చెందుతున్న జీవరాసులలో మానవునిలో గుణం ప్రధానంగా వుంటుంది. మిగిలిన జీవరాసులలో పరిమాణం ప్రధానంగా వుంటుంది. మానవునిలో గుణం ముందు పరిమాణం తలవంచుతుంది. 'జీవిత లక్ష్యమేమిటి?' అనేది మానవుని ముందున్న ముఖ్య విషయంగాని, పరిమాణం గాదు. మీరు ఎంత ఆహారము తిన్నారు. ఎన్నిసంవత్సరాలు బ్రతుకుతున్నారు అనేది సమస్యగాదు. జీవితకాలం 50 సంవత్సరాలా? 80 సంవత్సరాలా అని గాక, జీవితంలో సాధించిన అర్హతలేమిటి అనేది ప్రధానం. ఎటువంటి మార్పును జీవశాస్త్రం నొక్కి చెపుతున్నదో చూడండి. మానవుడు గుణముగాని పరిమాణం గాదు.

మానవునకు సాధ్యమైన దానిని తెలిపే క్రొత్త విజ్ఞానశాస్త్రం ఆవిర్భవిస్తున్నది. జూలియన్ హక్స్లే యిలా చెప్పాడు "మానవునిలో దాగివుండి, అతడు సాధించగల విషయాలన్నీ అర్థం చేసుకొనే విజ్ఞానశాస్త్రమేదైనా వుందా? దిగజారిపోయిన నేను, నన్ను నేను మరల ఉద్ధరించుకోగలనా? అది సాధ్యమేనా? నేరం చెయ్యాలని, ఆత్మహత్య చేసుకోవాలనే తలంపును నిగ్రహించుకోగలనా? నాలో అలాంటి శక్తి ఉన్నదా?" కావున మానవునకు సాధ్యమైన వాటినన్నిటినీ తెలిపే నూతన విజ్ఞానశాస్త్రం మనకు కావాలి.

ఒకరు మిమ్ము ద్వేషిస్తే మీరు దాన్ని స్వీకరించి, ప్రేమగా మార్చి తిరిగి అతనివైపు ప్రేమగా పంపగలరా? అలా చేసే విధానమేదైనా ఉన్నదా? ఇది ఎంత ఉదాత్తమైన భావమో చూడండి. మిమ్ము ప్రపంచం ద్వేషిస్తే దాన్ని పవిత్రప్రేమగా, దయాదాక్షిణ్యాలుగా మార్చి తిరిగి పంపుతారు! భూమిలోనుండి రాతిసిబొగ్గు తీసి, దాన్ని క్రమపద్ధతిలో మార్పు చేస్తే దానిలోనుండి బంగారు కడ్డీ వస్తుంది. క్రమపద్ధతిలో మార్పుచెయ్యటమంటే అదే. అలాగే శీలమనేది. ప్రతి అనుభవాన్ని క్రమపద్ధతిలో మార్పు చేసి ప్రేమగా దయగా యివ్వండి. క్రీస్తుమహాశయుడు ఇతర గురువులు అలా చేసి చూపారు. అది ఒక విజ్ఞానశాస్త్రం_విద్యలో ముఖ్యంగా అభివృద్ధి, సంతృప్తి చేరిన విజ్ఞానశాస్త్రం.

దీనిని మీరు కొంతవరకే ఆచరిస్తున్నారు. ఉద్యోగం కొరకు, పనికొరకు, సుఖజీవనం కొరకు విద్య అవసరమే గాని, అదే పరిపూర్ణమైన విద్య కాదు. అది విద్యలో ఉండే అల్పభాగం మాత్రమే. ఈ విషయాన్ని అంతర్జాతీయసంస్థ గుర్తించింది. యునెస్కో (Unesco) ప్రపంచంలో నడుస్తున్న విద్యను పరిశీలించమని ఒక కమీషనును ఏర్పాటు చేసింది. ఎడ్గన్‌మూర్ దాని అధ్యక్షులు. ఫ్రాన్సు దేశ ప్రధానమంత్రి. అప్పుడాయన విద్యాశాఖామాత్యుడుగా వున్నారు. ఆ కమీషన్ ప్రపంచమంతా పర్యటించి ఒక రిపోర్టు తయారు చేసింది. దానికి ఒక చక్కటి పేరు పెట్టారు. 'ఆచరణ నేర్చుకొనుట' (Learning to be) అని దాని పేరు. విద్య అనేది ప్రధానంగా ఆచరించటంగాని, ఏమి చెయ్యాలో అనే దాన్నిగూర్చి తెలుసుకోటం గాదు. 'ఇది చెయ్యి' 'అది చెయ్యి' అని చెప్పేది బాగానే వుంటుంది. కాని 'నీ వెవరు? నీ జీవిత తత్త్వమేమిటి?' అనే విషయం విద్యలో ఉండాలనే సంగతి అంతర్జాతీయ ఆలోచనా పథంలో ముందుకు వస్తున్నది. ఆచరించటానికి ఉద్యుక్తులైనపుడు మీరు స్వచ్ఛమైన ఆధ్యాత్మికత, శాంతి, నిశ్చలత, ధ్యానము, ఆలోచనానిమగ్నత అనే నియమాలు పాటించటం దగ్గరకు వస్తున్నవారగుచున్నారు. యిదంతా ఆచరణ నేర్చుకోవటమే. ఆచరించి మాట్లాడినపుడు చాలా చక్కగా ఉంటుంది. అవి మొదట నీ హృదయాన్ని నింపి, దీవనలే నీ నోటినుండి వెలువడేట్లు చేస్తాయి. ఈ విధమైన మార్పు నేటి విద్యావిధానవిషయంలో దిగ్మండలమంతటిలో కనిపిస్తున్నది. ఈవిధంగా విద్యాన్వేషణలో రెండు పరిమాణాలు కనిపిస్తున్నయి. దీనిలో ఒకటి సామాన్యమైన విద్య. అది మంచి గృహవసతిని, సుఖజీవనాన్ని, అన్నింటితోను సౌఖ్యాన్ని సమకూర్చే విద్య. అది మనకవసరమే. అందువల్ల దాన్ని మనం ఉంచుకుందాం. కాని ఆ విద్య ఒక్కటే చాలదు. ఆ సామాన్యవిద్యను అతిక్రమించి, మనం పరావిద్యను సాధించాలి. పరావిద్య ఆధ్యాత్మికసారము. అది ఆధ్యాత్మికశక్తి అవటం చేత మీకు కండపుష్టి, మానసికశక్తి, ఆధ్యాత్మికశక్తి అనే మూడు విధాలయిన శక్తులను కలిగిస్తుంది. ఆ ఉన్నతస్థితికి వచ్చినపుడే మీకు ఆధ్యాత్మికశక్తి లభిస్తుంది.

ఇతరదేశాలలోవలెగాక హిందూదేశంలో ఈ రెండు విద్యలకు - అనగా ప్రాపంచికజ్ఞానానికి (అపరావిద్యకు) ఆధ్యాత్మికజ్ఞానానికి (పరావిద్యకు) వైవిధ్యం లేదు. కాని యితరదేశాలలో వీటిమధ్య పరస్పరపోరాటం బాగావుంది. ఈ పాశ్చాత్యవిధానాన్ని నేడు మన పాఠశాలల్లోను, కళాశాలల్లోను నేర్చుకుంటున్నారు. ఒకమతంతో యింకోమతానికి తగాదా ఏర్పడింది. విశ్వాసానికి, తర్కానికి, మతానికి, విజ్ఞానశాస్త్రానికి తగాదా ఏర్పడింది. అలా ప్రతివాటిల్లోను వైరుధ్యమే. ఇవన్నీ పాశ్చాత్యానుభవాలు. అటువంటివి మనకిక్కడలేవు. జ్ఞానమనేది ఒకటే. దానికై అన్వేషణ సాగించి ఉత్కృష్టస్థితిని సాధించండి. 'అన్వేషణ సాగించు' అనే మాట వాడబడింది. ప్రాపంచిక, ఆధ్యాత్మికవిద్యలకు సరస్వతి లేక వాణి అనే దేవత ప్రతీకగా నిలచింది. మనదేశంలో సరస్వతీపూజ చేసినప్పుడు ఏం చేస్తాము? వేదాలు, ఉపనిషత్తులు మాత్రమే సరస్వతి విగ్రహము దగ్గర పెట్టం. డాక్టర్లు వారి స్టెతస్కోపులు, వడ్రంగులు వారి పనిముట్లు అక్కడ పెడతారు. దేనికంటె - ప్రతిది పవిత్రమైనదవటం వల్ల. సరస్వతీదేవి విద్యలన్నింటికీ అధ్యక్ష పీఠం వహిస్తున్నది. కావున విద్యలోగల పరావిద్య, అపరావిద్య అనే రెండు పరిమాణాలను ఐక్యం చేసే ఒక అద్భుత సమ్మేళనం మనకు కావాలి. నేడు భారతదేశంలో భౌతిక, ఆధ్యాత్మికవిజ్ఞానముల సంగమం అవసరం. ఈ రెండవ పరిమాణాన్నుండి సేవాశక్తి, త్యాగం, అంకితమొనర్చుకోవటం లభిస్తాయి. మొదటిదాన్నుండి సంపద, సంక్షేమం, సుఖం, సుస్థిరత మొదలైనవన్నీ వస్తయి. ఈ రెంటి మధ్య సంఘర్షణ లేదు గావున. మీరు యీ రెంటినీ జోడించవలసి వుంది. ప్రపంచమంతటా, నిర్మలమైన ఆధ్యాత్మికతను, నిజమైన భౌతికవిజ్ఞానాన్ని ఒక్కచోట చేర్చాలనే ఆకాంక్ష కన్పిస్తున్నది.

ఈరెండూ ఒకే సత్యానికి చెందినవే; కన్నులు మూసుకున్నప్పుడు ఒకే సత్యాన్ని చూస్తాము. తెరచినప్పుడు ఒకే సత్యాన్ని చూస్తాము. కండ్లు తెరచి అదే సత్యాన్ని అనంత రూపాల్లో ఈ ప్రపంచములో చూస్తాము. వేదాంతము "ఉన్నది ఒకే సత్యం" అని చెపుతున్నదిగాని సత్యం రెండుగా వున్నదని చెప్పటం లేదు.

మీరీ అద్భుతవిధానాన్ని అనుసరించాలని కోరుతున్నాను.

# రాధా - కృష్ణులు

కుమారి పి. రాజ్యలక్ష్మి

సూరదాసు చేసిన రాధా - కృష్ణుల శృంగార వర్ణన క్షణికమైన ఘటనకాదు అని అనటంలో అతిశయోక్తి లేదు. కారణం ప్రేమ, సంగీతమయమైన జీవనములో ప్రవహించే ఒక ధార వంటిది. అందులో లీనమైనవారికి, దివ్య మాధుర్యము తప్ప యింక ఏదీ కనబడదు. రాధా-కృష్ణుల ప్రేమోల్లాస లీలలను చదువుతూవుంటే, సూరదాసు హృదయం, ప్రేమతో నిండిన అక్షయ బండారమా అనే అనుమానం కలుగక మానదు. అంతేకాదు, ప్రేమోదయ కాలంలో వుత్పన్నమయ్యే హృదయ ప్రేరిత భావాలు, హాస పరిహాసాల కాంతి నలువైపులా విరజిమ్మబడ్డాయా అని అనిపిస్తుంది సూరదాసు చేసిన రాధాకృష్ణుల లీలలను చదువుతుంటే.

ఒక రోజున కృష్ణుడు, బొంగరాన్ని త్రిప్పుతూ బృందావన వీధుల వెంట నడవ సాగాడు. పచ్చ పీతాంబరము ధరించిన కృష్ణుని శిరస్సున నెమలిపింఛము, చెవులకు మకర కుండలాలు తేజోమయంగా వెలిగిపోతున్నాయి. మిత్రుల కోసమని శ్యామసుందరుడు, యమునా నదీ తీరానికి వచ్చాడు. కానీ అంతలోనే అతనికి, తామర రేకులవంటి పెద్ద-పెద్ద కన్నులు, చంద్రబింబము వంటి ముఖము కలిగిన రాధ కనిపించింది. అందమంతా తన స్వాంతం చేసుకొని వున్న రాధను చూడగానే కృష్ణుడు మంత్రముగ్ధుడిలా నిలబడిపోయాడు. ఆమె బృందావనవాసి కాదని తెలుసుకున్న మాధవుడు, ఆమె వద్దకు వెళ్ళి యిలా ప్రశ్నించాడు-

బూఝత శ్యామ కౌన తూ గోరీ।
కహా రహత, కాకీ హై బేటీ, దేఖీ నహీ కహీ
బ్రజ ఖోరీ॥

"'ఓ సుందరీ! ఎవరు నీవు? ఎక్కడ నివసిస్తావు? ఎవరి కుమార్తెవు? నిన్ను యింత వరకు బృందావనములో, ఎక్కడా చూసి నట్లుగా గుర్తులేదే' [కృష్ణుని మాటలకు రాధ సమాధానం యిస్తూ] 'బృందావనం రావలసిన అవసరం నాకేంటి? నేను మా వూరిలో, మా యింటివద్దనే ఆడుకుంటాను. బృందావనంలో వెన్న దొంగతనం చేస్తూ తిరిగే నందకుమారుని కథలు చాలా విన్నాను.' గడుసుగా సమాధానం చెప్పే రాధ మాటలకు, కృష్ణుడు నవ్వి, 'నేను వెన్న దొంగతనం చేసాను కానీ, నీ వద్ద ఏమీ దొంగతనం చేయలేదుగా? యిక నాతో ఆడుకోవటానికి నీకు అభ్యంతరం ఏమిటి? చక్కగా యిద్దరం కలసి ఆడుకుందాము రా!''

ఈ విధంగా కృష్ణుడు తన మాటలతో రాధ మనస్సును హరించివేసాడు. మోహనుడు తన యింటికి వెళుతు-వెళుతు, రాధతో, "రాధా! నీవు మా యింటికి ఆడుకోవటానికి తప్పక రావాలి. మా యింటి వద్దకు వచ్చి, 'కృష్ణా!' అని పిలుస్తే చాలు నేను వస్తాను. నీవు మరుకు రోజుకు ఒక్కసారి అయినా మా యింటికి రాకపోతే నేను వూరుకోను" అని వెళ్ళిపోయాడు.

రాధ, తన యింటికి వెళుతూ, తన వెంట నున్న చెలులతో, "శ్రీకృష్ణుడు తన ఇంటికి రమ్మని చెప్పాడు. కానీ వాళ్ళ యింటికి ఎవరెళతారు? అయినా వాళ్ల యింటివద్దనే ఆడుకునే అవసరం నాకేంటి?" అంది. రాధ, తన చెలులతో కృష్ణుని యింటికి వెళ్ళనని అన్నది కానీ తన మనస్సును హరించిన

మురళీధరుని చూడకుండా వుండటం రాధకు సాధ్య మేనా!

ఖేలన కై మిస కువరీ రాధికా, నంద మహరీ కై ఆయీ।
సకుచ సహిత మధురే కరి బోలీ, ఘర హో
కువర కన్హాయీ॥

''రాధ, కృష్ణునితో ఆడుకునే వంకతో, అతనిని చూడటానికి నందుని యింటికి వచ్చింది. కానీ, సంకోచముతో బయటే నిల్చుని నెమ్మదిగా, 'కృష్ణా! యింటిలో వున్నావా?' అని పిలిచింది. కోకిల స్వరంలా వున్న రాధ గొంతు వినగానే, మోహనుడు అత్యంత ఆనందంగా బయటకు వచ్చాడు. అతడు, రాధను తన తల్లి వద్దకు తీసుకొని వచ్చి- 'అమ్మా! నీవు ఈమెను గుర్తించావా? నిన్న నీ మీద కోపం వచ్చి, యమునా నదీ తీరానికి పారిపోతే, నన్ను తీసుకొని వచ్చింది! నిన్ను చూసి ఎలా సిగ్గుపడుతున్నదో చూడు. అసలు మన యింటికి రానని అంటే, నేనే ఒట్టువేసి రమ్మని చెప్పాను.' కృష్ణుని మాటలు విని రాధ సిగ్గుతో తలదించుకొన్నది.''

ముద్దులు మూటకడుతున్న రాధను చూడగానే యశోదకు చాలా ఆనందం వేసింది. ఆమె రాధను దగ్గరకు తీసుకొని యిలా ప్రశ్నించింది——

నామ కహా తేరోరీ ప్యారీ।
బేటీ కౌన మహర్ కీ హై తూ, కో తేరీ మహతారీ॥

'' 'ముద్దుగుమ్మా! నీ పేరు ఏమిటి? నీవు ఎవరి కుమార్తెవు? నీ తల్లి-తండ్రుల పేరేమిటి? ఇంతటి సౌందర్యరాశిని కన్న, నీ తల్లితండ్రుల వంటి అదృష్టవంతులు ఎక్కడా లేరేమో.' యిలా పలుకుతూ యశోద, అందమైన రాధ ముఖాన్ని, తన చేతులలోకి తీసుకొని ముచ్చటగా చూడసాగింది. [యశోద, మాటలకు రాధ సమాధానం యిస్తూ] 'నేను వృజభానుని కుమార్తెను. నా పేరు రాధ. నా తల్లి పేరు సునయనాదేవి. మీరు, మా అమ్మకు బాగా తెలుసు. మీరు, మా అమ్మను, యమునానదీ తీరాన చూసే వుంటారు'. రాధ మాటలకు యశోద, అడ్డం వస్తూ, 'అదా అలా చెప్పు. మీ అమ్మ నాకు తెలియకపోవటం ఏవిటి! ఆవిడ చాలా చెడ్డది. నీ తండ్రి వృజభాను డంతటి దుష్టుడు ఎక్కడా లేడు!' యశోద ఇలా, ఆటలు పట్టిస్తూ మాట్లాడే సరికి, రాధ ముఖం కోపంతో ఎఱ్ఱపడింది. (రోషంతో, ఆమె యశోదతో, 'మా తల్లితండ్రులు మీ పట్ల, ఏం చెడుగా ప్రవర్తించారని, మీరు యిలా మాట్లాడుతున్నారు? మా తల్లి-తండ్రులు మీకు యింత అయిష్టులు అని తెలిస్తే, అసలు మీ యింటికి వచ్చేదాన్ని కానేకాదు.' రాధ మాటలకు యశోద నవ్వి, ఆమెను హృదయానికి హత్తుకొన్నది.''

జసుమతి రాధా కువరి సంవారతి।
బడే బార సీమంత సీస కే, ప్రేమ సహిత నిరువారతి॥

''యశోద, రాధను అలంకరించసాగింది. ఆమె, రాధకు పాపడి తీసి, అందమైన శిగ అల్లింది. విశాల నేత్రాలకు కాటుకను, నుదటను తిలకాన్ని తీర్చిదిద్దింది. తెల్లటి నుదుటి మీది తిలకాన్ని చూస్తూ వుంటే, ప్రాతఃకాల సూర్యకాంతి, చంద్రుడు ఒకేసారి శోభిస్తున్నట్లుగా గోచరించసాగింది యశోదకు. తన వద్దనున్న చీరను రాధకు, పావడాగా ధరింపచేసింది. ఆమె ధరింపచేసిన నీలపు వస్త్రాలలో రాధ, మబ్బులమధ్య మెరుపు తీగలా మెరిసిపోసాగింది. మిఠాయిలు, పళ్ళు మొదలైన వాటితో, రాధ ఒడి నింపి, వారిని ఆడుకోవటానికి పంపింది యశోద. రాధా-కృష్ణులు ఒకరి

చేయి ఒకరు పట్టుకొని వెళుతూ వుంటే, యశోద ఆనందంతో తనను తాను మరచిపోయింది.''

బాయుతి జననీ కహా హంతీ ప్యారీ ।
కిననేరే భాల తిలక రచి కీనొ, కిహి కచ గూంది
మాంగపిర పారీ ॥

''రాధ, కృష్ణునితో కలిసి ఆడుకొని, ఇంటికి రాగానే, తల్లి, రాధను చూసి – 'రాధా! యింతసేపు ఎక్కడ ఆడుకుంటున్నావు తల్లీ! నీ నుదుట యింత చక్కగా తిలకాన్ని తీర్చి దిద్దినదెవరు? ఎవరు నీ నిడుపాటి కురులను దువ్వి యింత అందంగా శిగ అల్లారు?' [రాధ, తల్లిమాటలకు] 'అమ్మా! నేను నందుని ఇంటికి ఆడుకునేందుకు వెళ్ళాను, యశోద నన్ను తన వద్దకు పిలచి, మన గురించి అన్నీ అడిగింది. నీ పేరు అడిగి తెలుసుకొని, నీవు మంచిదానివి కాదని, చాలా దుష్టురాలవని అని నన్ను ఆటలు పట్టించింది. ఇదిగో ఈ నీలపు వస్త్రాలను నాకు కట్టి పళ్లు, మిఠాయిలతో నా ఒడి నింపి నన్ను, కృష్ణుని ఆడుకోవటానికి పంపింది. వెళుతున్న మా వైపు ఆనందంగా చూసి, అస్తమిస్తున్న సూర్యునికి నమస్కారం చేసింది'. రాధ చెప్పిన ఈ మాటలు వినగానే, వృజ భానుడు – సునయనాదేవుల హృదయాలు ఆనందంతో నిండిపోయాయి.''

రాధా – కృష్ణుల స్నేహం రోజు – రోజుకు పెంపొందసాగింది. గోవులను మేపటానికి కృష్ణుడు వనానికి వెళితే, అతని వెంట రాధ కూడ వుండేది. రాధను విడిచి మాధవుడు, మాధవునికి దూరంగా రాధ ఒక్క క్షణమైనా వుండేవారు కాదు. ఒక్కొక్కసారి యశోద, వీరి అల్లరిని భరించలేక పోయేది. ఒక రోజున కృష్ణుడు లేకుండా చూసి యశోద, రాధతో యిలా అన్నది——

బార – బార తూ హ్యా జని ఆవై ।
మై కహా కరౌ సుతహి నహి బరజతి,
ఘరతే మోహి బొలావై ॥

'' 'రాధా! మీరు చేసే అల్లరిని భరించలేక పోతున్నాను. ప్రతిరోజు మా యింటికి వచ్చి అల్లరి చేస్తేకానీ, నీకు తోచదా?' యశోద మాటలు విన్న రాధకు కోపం వచ్చి, 'నాకు యిష్టం అయి నేనేమి మీ యింటికి రావటం లేదు. నీ కొడుకే మా యింటికి వచ్చి, నన్ను యిక్కడికి పిలుచుకొస్తాడు. నేను రానని మొండికేస్తే, ''రాధా! నిన్ను చూడకుండా ఒక్క క్షణమైనా నిలువలేను,'' అని అమాయకంగా ముఖం పెడుతాడు. ఆ మాటలు వినగానే నా హృదయం క్షోభతో విలవిల్లాడుతుంది. మరి, ఆ సమయంలో కృష్ణుని మాటలు వినకుండా నేను ఎలా వుండగలనని అనుకున్నావు?' ''

రాధ చెప్పిన ఈ జవాబులో గడుసుదనాన్ని, అమాయకత్వాన్ని మూర్తీభవించినట్లుగా చిత్రించారు సూరదాసు.

ఒక రోజు రాధను ఆమె చెలులంతా కలసి యింటికి తీసుకొని వచ్చి, సునయనాదేవితో, 'అమ్మా! నీ బిడ్డను, పాము కాటువేసింది. మేమంతా ముందుగ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నాం. వెనుకగా వస్తున్న రాధ కోసమని ఆగి, తిరిగి చూసే సరికి ఆమె కిందపడి వుంది. నెత్తిన వున్న పాలకుండ కాస్తా ముక్కలై, పాలు నలువైపులా విరజిమ్మబడి వున్నాయి. ఈమెను ''కృష్ణ సర్పం'' కాటువేసిందని మా అనుమానం. త్వరగా కృష్ణుని పిలిపించు. అతనిని మించిన మంత్రకాడు మన బృందావనంలో లేడు.' వారు చెప్పిన మాటలు నిజమనుకొని, భయపడిపోయి, సునయనాదేవి, రాధను తన హృ

వెళ్ళి కృష్ణుని వెంటపెట్టుకొని రమ్మని మొర పెట్టుకో సాగింది.

నంద - సువన గారుడీ భులావహు।
కహ్యే హమారౌ సునతన కోవూ,
తురత జావూ, లే ఆవహు॥

"'ఓ అయ్యలారా! త్వరగా వెళ్ళి నంద నందుని పిలుచుకొని రండి. నా మాటను ఎవరూ ఆలకించ రెందుకు? అయ్యో! ఆలస్యం అయితే నా బిడ్డ ఏమయిపోతుందో ఏమో.' సునయనా దేవి ఈ విధంగా విలపించటం చూసి ఒక గోప వృద్ధుడు, ఆమె వద్దకు వచ్చి 'తల్లీ! అనవసరంగా భయపడవద్దు. కృష్ణుడు తప్పక నీ కుమార్తెను రక్షిస్తాడు. కృష్ణునివంటి మంత్రగాడు ముల్లో కాలలో ఎక్కడా లేడు. అతను వచ్చి ఒక్కసారి తన చేతితో స్పర్శిస్తే చాలు, ఎంతటి విషమైనా దిగిపోతుంది. త్వరగా కృష్ణుని ఇక్కడకు పిలిపించు' అని ఆమెకు ధైర్యం చెప్పాడు."

గోపవృద్ధుని ఆదేశానుసారం ఒక గోపాలుడు యశోద వద్దకు వచ్చి, "అమ్మా! నీవు త్వరగా కృష్ణుని, నాతో వృజభానుని యింటికి పంపు. రాధను, కృష్ణసర్పం కాటువేసిందట. ఆ విషాన్ని దింపగలవాడు కృష్ణుడు ఒక్కడేనని అంతా అంటున్నారు." గోపబాలుడి మాటలు వినగానే, యశోద తనలో తాను నవ్వుకొని, రాధ మూర్ఛకు కారణం తెలుసుకొని, కృష్ణుని పిలిచింది.

తబ హరి కౌ టేరతి నందరానీ।
భలీ భయీ సుత భయౌ గారుడీ,
ఆజు సునీ యహ బానీ॥

"'చాలా ఆశ్చర్యంగా వున్నది! కన్నయ్య మంత్రగాడు అని ఈ రోజే వింటున్నాను,' అనుకొంటు యశోద, వీధిలో తన మిత్రులతో కలసి ఆడుకొంటున్న కృష్ణుని పిలిచింది. తల్లి పిలుపుకు కృష్ణుడు వచ్చి, తనని పిలవటానికి కారణం అడిగాడు. 'కృష్ణా! త్వరగా వృజభానుని యింటికి వెళ్ళు. నీ స్నేహితురాలు రాధను సర్పం కాటువేసిందట, వెళ్ళి ఆమెను రక్షించు. లేకపోతే ఆ అమాయకురాలు ఏమయిపోతుందో ఏమిటో', అని కృష్ణుని కళ్ళలోకి చూసి నవ్వింది."

హరి గారుడీ తహా తబ ఆయే
యహ బానీ వృషభాను సుతా సుని,
మన - మన హరష బఢాయే॥

"కృష్ణుడు, రాధను రక్షించటానికై వృజభానుని యింటికి వెళ్ళాడు. 'కృష్ణుడు వచ్చాడు' అనే మాట రాధ చెవులకు సోకగానే, ఆమె హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కింది. శరీరం రోమాంచితమయింది. కన్నుల వెంట ఆనందబాష్పాలు కురవసాగాయి. రాధ యొక్క ఈ అవస్థ చూస్తూ వుంటే, సునయనా దేవికి భయం అధికం కాసాగింది-శరీరమంతా విషమయమై పోయిం దేమోనని. కానీ కృష్ణుడికి మాత్రం, తల్లి ఒడిలో అమాయకంగా పడుకొని మూర్ఛను నటిస్తున్న రాధను చూడగానే నవ్వు ఆగింది కాదు."

దొంగను పట్టుకోగల తెలివి, దొంగకు తప్ప ఎవరికి వుంటుంది? వృజభానుని కుమార్తె రాధ, చతురురాలు. కృష్ణుని కలవటం కోసమనియింత నాటకాన్ని ఆడింది. ఆమె ఆడింది నాటకమని తెలుసుకున్న వ్యక్తులు యిద్దరే యిద్దరు. వారు - యశోద-కృష్ణులు

రోవతి మహరీ ఫిరతి బిత బానీ।
బార - బార లౌ కంఠ లగావతి, అతి హి శిథిల
భయీ పానీ॥

"అచేతనంగా తన ఒడిలో పడివున్న రాధను,

తన హృదయానికి హత్తుకొని విలపిస్తూ, తన కుమార్తెను రక్షింపమని కృష్ణుని వేడుకో సాగింది సునయనా దేవి. 'కృష్ణా! నా ప్రియ పుత్రికను రక్షించి పుణ్యం కట్టుకో. నీవు చేయ బోయే సహాయానికి, నీకు జన్మంతా ఋణపడి వుంటాను.' కన్నయ్య, తనను పట్టుకొని విల పిస్తున్న సునయనా దేవికి ధైర్యం చెప్పి, రాధ వద్దకు వచ్చి, మంత్రం వేస్తున్నట్లుగా పెదవులు కదుపుతూ, ఆమె శరీరాన్ని స్పర్శిస్తూ, ఆమెను విషరహితను చేసాడు."

రాధ నెమ్మదిగా కన్నులు తెరచి అమా యకంగా ముఖం పెట్టి, 'అమ్మా! నాకే మయింది? ఇలా నా చుట్టూ అందరు ఎందుకు మూగారు?' అని తల్లిని ప్రశ్నించింది. సున యనా దేవి, రాధను దగ్గరకు తీసుకొని, 'కృష్ణ సర్పం నిన్ను కాటువేస్తే, కన్నయ్య నిన్ను రక్షించాడు. అతని దయవల్లనే ఈ రోజు నీవు మృత్యుముఖం నుండి బయట పడగలిగావు,' అని కృష్ణుని పిలచి, తన కుమార్తెను రక్షించి నందుకు కృతజ్ఞతలను తెలుపుకొంది.

రాధా-కృష్ణుల ప్రేమ దిన-దిన ప్రవర్ధ మానం కాసాగింది. బృందావనంలో ఎక్కడ చూసినా రాధా-కృష్ణుల ప్రేమగాథలే చర్చనీ యాంశాలు కాసాగాయి. సునయనా దేవి, రాధను యింటిలోనే వుండమని, కృష్ణుని వెంట తిరగవద్దని నిర్బంధించ సాగింది. తల్లి-తండ్రులు తనను ఈ విధంగా నిర్బంధించటంతో రాధకు చాలా బాధ కలగసాగింది. రాధ ఒక రోజు కృష్ణుని వద్దకు వచ్చి తన బాధను విన్నవించు కొంది.

శ్యామ మహ తుమసె క్యోం న కహూ
జహ - తహ ఘర ఘర కౌ ఘైరా, కౌవీ భాంతి
సహూ॥

"శ్యామసుందరా! నా బాధను నీకు ఎలా విన్నవించుకోను? బృందావనవాసులే కాక, యింటిలో కూడ మన గురించిన చర్చలే కొన సాగుతున్నాయి. నేను నీ వెంట తిరుగుతున్నా నని నా తండ్రి నా మీద కత్తి కట్టాడు. తల్లి, నేను వంశానికి చెడ్డపేరు తెస్తున్నానని, నాలాంటి కూతురు ఎవరికి కలగకూడదని ప్రతి రోజు ఏడుస్తుంది. మోహనా! ఈ బాధనుండి నేను బయటపడేది ఎలా? మన మీద కోపంతో నా తండ్రి-అన్నలు నిన్ను ఏదైనా చేస్తే నేను బ్రతికి వుండగలనా? వారి మాటలు విని సహించలేను. అలాగని, నిన్ను చూడకుండా ఒక్క క్షణమైన వుండలేను. నా ఈ బాధ ఎవారికి కూడ కలగకూడదని దైవాన్ని ప్రార్థిస్తున్నాను."

వ్రజహి బసై ఆపుహి బిసరాయౌ।
ప్రకృతి - పురుష ఏక హి కరి జానహు,
బాతని భేదకరాయౌ॥

రాధ మాటలకు కృష్ణుడు నవ్వి, "రాధా! తల్లి-తండ్రులు, ఏదో అన్నారని నీవు ఎందుకు బాధ పడతావు? మనం ప్రకృతి-పురుషులమని తెలుసుకోలేని మూర్ఖుల మాటలను నీవు పట్టించుకోవద్దు. బృందావనవాసులు మనలను మామూలు మనుషులు అనుకుంటున్నారే కానీ, మన నిజస్వరూపాలను తెలుసుకోలేక పోతున్నారు. మనం ప్రకృతి - పురుషులమనే సత్యాన్ని నీవు కూడ విస్మరించావా? శారీరి కంగా మనలో భేదం వుండి వుండవచ్చు, అంత మాత్రాన నీవు వేరు, నేను వేరు, అనే భావన నీ మనసులోనికి రానీయకు. సృష్టిలోని ప్రతి అణువులోను మనం యిద్దరం మూర్తీభవించి వున్నాము. వేదాలు, ఉపనిషత్తులు కూడ నా ఈ మాటను సత్యమని ఘోషిస్తున్నాయి. అందువలన నీవు లోకలజ్జను వదలి నాతోటి

ఆనందాన్ని అనుభవించు. మన శరీరాలు వేరైనా, ఆత్మలు ఒకటే అన్న సత్యాన్ని ఎప్పుడు విస్మరించకు.''

కృష్ణుడు ఈ విధంగా పలికేసరికి, రాధ హృదయం ఆనందంతో ఉప్పొంగింది. అంతే కాదు ఆతని మాటలద్వార, జన్మ-జన్మల నుండి, యుగ యుగాలనుండి వస్తున్న మాధవుని తోటి తన అనుబంధాన్ని రాధ తెలుసుకో గలిగింది.

ఘరహి జాతి మన హరష బఢాయో।
దుఃఖ డార్యో, సుఖ అంగ భార భరి, చలీ లూట
సొ పాయో ॥

''మోహనుడు చెప్పిన మాటలతో రాధ, తన దుఃఖాన్ని మరచి, తేలికపడ్డ మనసుతో యింటికి మరలింది. కనుబొమలను వక్రంగా పెట్టి, తనలో తాను నవ్వుకుంటూ, నెమ్మదిగా నడుస్తున్న రాధను, ఒక గోపిక దారిలో పట్టుకొని, 'రాధికా! గోపాలుడు ఈ రోజు నీ కోరికను తీర్చినట్లున్నాడే? అందుకోరకే నీ ముఖము యింతటి ఆనందముతో వెలిగిపోతున్నది. కుంజకుటీరములో మాధవుడు, నీకు తీయటి అనుభవాన్ని అందించాడు కదూ! ఈ రహస్యాన్ని నీవు ఎంతగా దాచాలని అనుకున్నా నీ కన్నులు నాకు నిజం చెప్పేస్తున్నాయి' అన్నది.

గోపిక మాటలకు, రాధ ఎలాటి సమాధానం యివ్వక మౌనం వహించింది. రాధ ప్రవర్తనకు మనసులో నవ్వుకొని, రాధ ముఖాన్ని తన చేతులలోకి తీసుకొని, 'సఖీ! స్నేహితుల వద్ద ఎవరైనా తమ రహస్యాలను దాచి పెడుతారా? కృష్ణుని నీవు ఎక్కడ కలుసుకున్నావు? అతడు యిప్పుడు ఎక్కడ వున్నాడో నాకు చెప్పవా? అతని స్పర్శ కోసం నా అణువణువు తపించి పోతున్నది' అంటూ గోపిక, రాధను బ్రతిమిలాడ సాగింది- కృష్ణుని జాడ చెప్పమంటూ. గోపిక మాటలకు రాధ నవ్వి అమాయకంగా ముఖం పెట్టి యిలా అన్నది.

శ్యామ కౌన కారే కి గోరే।
కహా రహత కాకే పై ఢోటా, వృద్ధ తరున
కి దోం హై భోరే॥

''సఖీ! కృష్ణుడు ఎక్కడ వున్నాడని అడుగుతున్నావు, అసలు అతను ఎవరు? తెల్లగా వుంటాడా లేక నల్లగానా? బాలుడా, యువకుడా లేక వృద్ధుడా? ఈ రోజు మొదటిసారిగా నీ నోటినుండి అతని పేరు వింటున్నాను. అనవసరంగా నీవు అతనితో నాకు లేనిపోని సంబంధాన్ని అంటకడుతున్నావు. అసలు అతను ఎక్కడ వుంటాడో కూడా నాకు తెలియదే! అమాయకురాలిని చేసి, ఆడిద్దామని అనుకుంటున్నావేమో, అలాటివి నా వద్ద చెల్లవు. వ్యర్థమైన మాటలు మాని, ఆ కృష్ణుడెవరో, ఎక్కడ వుంటాడో, నీవే వెళ్ళి వెతుకు.''

రాధ మాటలకు, గోపిక ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసి, ఆమెను ఎగాదిగా చూడసాగింది. అంతేకాదు అబద్ధాన్ని అందంగా మలచి, దాన్ని నిజం చేయాలని అవస్థపడుతున్న రాధ స్థితిని చూసే గోపికకు నవ్వు ఆగింది కాదు. ఆమె రాధను ఆటలు పట్టిస్తూ—

సుని రాధే తోహి శ్యామ ది ఖై హై।
జహ - తహా వ్రజ - గలిని ఫిరత హై,
జబ యిహి మారగ ఐహై॥

''రాధికా! నీవు యింతవరకు శ్యామసుందరుని చూడలేదు కదూ. అయితే తప్పక అతనిని నీకు చూపవలసినదే. నీకు తెలుసో తెలియదో కానీ బృందావనములోని ప్రతి వీధి గోపాలునిదే,

ఎప్పుడు చూసినా మాధవుడు తన స్నేహితులతో వీధులవెంట తిరుగుతూనే వుంటాడు. ఈసారి అతను నాకు అగపడితే, పట్టుకొని నీకు తప్పక చూపుతాను. కోటి మన్మధాకారుడైన, కృష్ణుని సౌందర్యాన్ని నీవు ధైర్యంగా చూడగలిగితే, నీవు చెప్పిన మాటలను (కృష్ణుని యింతవరకు చూడలేదన్న విషయం) నమ్మతాను. అయినా, రాధా! అమాయకంగా వుండే నీవు యింతటి నెరజాణవు ఎప్పుడైనావు? మీ యిద్దరి ప్రేమ విషయాలు మాకెవ్వరికీ తెలియవనే అనుకుంటున్నావా? మోహనుడు, నీవు కనిపించగానే ఆనందముతో మురళిని వాయిస్తాడు. అంతేకాదు త్రిభంగి వేషం వేసి, అంగాంగములోను, అనేకమైన హావభావాలను ప్రదర్శిస్తూ, నీ పట్ల తనకు గల ప్రేమను వెల్లడి చేస్తాడు.''

గోపిక మాటలను ఏ మాత్రం పట్టించుకోక, రాధ త్వర-త్వరగా తన యింటికి చేరుకుంది. రాధ ప్రవర్తన, గోపికకు అర్థం కాలేదు. ఆమె తన స్నేహితురాలి వద్దకు వెళ్ళి రాధ గురించి యిలా చెప్పసాగింది—

సునహు సఖీ రాధా కీ బాతేం।
మోసో కహతి శ్యామ హై కైసే, ఐసీ మిలయీ ఘాతై॥

''సఖీ! రాధ ఎంత గడుసుదో చూడు! కృష్ణుడు ఎవరో, ఎలావుంటాడో కూడ, ఆమెకు తెలియదట. అంతేకాదు, మాధవుడు బాలుడా, యవ్వనవంతుడా లేక వృద్ధుడా అని నన్ను ప్రశ్నించింది. మోహనుని, ఆమె స్వప్నంలో కూడ చూసి ఎరగదుట. అమ్మో! ఎంతటి అబద్ధాన్ని చెప్పిందో చూడు! పైగా నాతో, 'నీవు నా ప్రియసఖివి, నీ వద్ద నేను ఎలాటి రహస్యాలను దాచను, నన్ను నమ్ము' అంటుంది. ఆమెకు కృష్ణుడు ఎవరో, ఎక్కడ వుంటాడో తెలియదని అంటే, నేను నమ్ముతానని అనుకుంటోంది కాబోలు. ఆమె నోటినుండే కృష్ణుడు నాకు తెలుసు అని అనిపించకపోతే నాకు మారుపేరు పెట్టు', అంటూ ఆమె, కృష్ణుని కోసమై యమునా నదీ తీరానికి వెళ్ళింది.''

కృష్ణుని, తాను యింతవరకు చూడలేదని రాధ, అబద్ధం చెప్పినప్పటినుండి గోపికకు పంతం వచ్చింది, ఎలాగైనా సరే ఆమె చేత నిజం చెప్పించాలని. ఒక రోజు ఆమెకు ఆ అవకాశం చిక్కింది. ఎప్పటిలాగానే యమునా నదిలో జలకాలాడటానికి రాధ సఖీసమేతంగా వెళ్ళింది. ఆ సమయంలో కృష్ణుడు అక్కడకు వచ్చాడు. పచ్చ పీతాంబరము ధరించిన కృష్ణుని శిరస్సున, నెమలిపింఛం అందంగా నాట్యమాడుతున్నది. చెవులకు మకరకుండలాలను, మెడలో ముత్యాల సరాలను ధరించిన కృష్ణుని సౌందర్యాన్ని చూడటానికి రెండు కళ్లు చాలలేదు గోపీకన్యలకు. రాధ కన్నులలో వుబికి వస్తున్న సంతోషాన్ని చూసిన గోపిక, రాధతో—

హమహి కహ్యౌ హౌ శ్యామ దిఖావహు।
దేఖహు ధరను నైన భరి నీకై, పుని - పుని దరసన పావహు॥

''రాధా! కృష్ణుని యింతవరకు చూడలేదని, అతనిని చూపమని నన్ను కోరావు కదు. నీ కోరికను తీర్చటానికే కాబోలు మురళీధరుడు ఈ రోజు యిక్కడికి వచ్చాడు. కృష్ణుని సౌందర్యాన్ని నీ కనులారా చూసుకో. కారణం, ఎప్పుడు బడితే అప్పుడు కృష్ణుడు నీకు కనబడకపోవచ్చును. ఈ రోజు చాలా సుదినం. అందుకే ఈ సౌందర్యరాశిని నీవు మొదటిసారిగా చూడగలుగుతున్నావు. ఇన్ని నాళ్ళకు మాధవుని మోహన రూపాన్ని చూసిన నీ జన్మ ధన్యమైంది.

తాను, తన స్నేహితురాలికి దొరికిపోయి నందుకు రాధ సిగ్గుతో తల దించుకొన్నది. సిగ్గుతో ఎఱ్ఱపడ్డ రాధ ముఖాన్ని పైకి ఎత్తి, ఆమె విశాల నేత్రాలలోకి కొంటెగా చూస్తూ గోపిక—

కహి రాధా హరి కైసే హై।
తేరై మన భాయె కి నాహీ, కి సుందర, కోవై సేహై॥

"'సఖీ! రాధా! కృష్ణుడు ఎలా వున్నాడు? నీ మనసుకు నచ్చాడా లేదా? యిక ముందె న్నడు, కృష్ణుడు ఎలా వుంటాడని నన్ను ప్రశ్నింపవుగా? నటవర వేషధారుడైన, మోహనుని ముందు, కోటి మన్మథులైనా దిగ దుడుపే కదూ. నీ ప్రియుతముని సరిగ్గా చూసు కున్నావా? మాధవుని ప్రేమను, నీ నుండి నేనెక్కడ దోచుకుంటానోనని యింతటి అబద్ధం ఆడటం న్యాయమేనా నీకు?' అని ప్రశ్నించింది."

తను చేసిన తప్పిదానికి క్షమాపణలు తెలుపుకుంటూ, రాధ తన ప్రియసఖితో యిలా అన్నది—

శ్యామ సఖీ నీకై దేఖే నాహి।
చితవత హీ లోచన భరి అయె, బార-బార పచతాహి॥

"సఖీ! మాధవుని సరిగ్గా చూడలేక పోయి నందుకు చాలా బాధపడుతున్నాను. కృష్ణుని సౌందర్యాన్ని చూస్తూ వుంటే, ఆనందంతో కన్నులవెంట నీరు తిరిగింది. అంతేకాదు కన్నులు ఆర్పకుండా, ఆ ముగ్ధ మోహన రూపాన్ని తనివితీరా చూద్దామని అనుకుంటే, సిగ్గుతో కన్నులు క్రిందకు వాలిపోయాయి. నా నేత్రాలకు దోషాన్ని ఆపాదించటం కూడ తగదేమో. కారణం కృష్ణుని కనుబొమలు విల్లులాగా ఎక్కుపెట్టినట్టుగా వుంటాయి. వంకరచూపులు తూపులవలె ఎదుటివారి మనస్సును హరించివేస్తాయి. ఆ చూపులను తట్టుకోగల శక్తి నాకు వున్నదని అంటావా? అందమైన ఆ కన్నులలోని కాంతిని చూస్తూ ఎన్ని యుగాలైనా గడపవచ్చును. అయినా ఒక్క నిమిషంలో అంతటి సౌందర్యాన్ని చూడ గలగటం సాధ్యమేనా? నీవే చెప్పు."

రాధకు, కృష్ణుని పట్లగల ప్రేమను చూసి గోపికలు ముగ్ధులయ్యారు. అంతేకాదు మదన మోహనుని తన వశం చేసుకున్న రాధ భాగ్యాన్ని పొగిడారు.

తై హి శ్యామ భలే పహి చానే।
సాంచీ ప్రీతి జానీ మన మోహన్, తేరేహి హాథ
బికానే॥

"సఖీ! శ్యామసుందరుని ప్రేమను పొంద గలిగిన నీ అంతటి ధన్యజీవి ఎక్కడా లేదు. కృష్ణతత్వాన్ని తెలుసుకున్న ఏకైక వ్యక్తివి కాబట్టే, మాధవుడు నీ వశం అయ్యాడు. ఇన్ని నాళ్ళనుండి నీవు-కృష్ణుడు వేరనుకొని, మీపట్ల చాలా అపరాధం చేసాం. శరీరాలు వేరైనా, మీ యిద్దరి ఆత్మలు ఒక్కటే అన్న నిజాన్ని ఈనాడు గ్రహించగలిగాం. నీ వంటి సౌందర్య రాశిని ప్రేయసిగా పొందిన మాధవుడు చాలా అదృష్టవంతుడు. మీ ప్రేమ ఎల్లప్పుడూ శాశ్వ తంగా వుండాలని భగవంతుని వేడుకుంటు న్నాము."

తన సఖులు, తన భాగ్యాన్ని పొగుడుతూ, తమ ప్రేమ చిరకాలం వర్ధిల్లుతుంది అనటం విని రాధ హృదయం ఆనందముతో ఉప్పొం గింది. రాధ ఆనందాన్ని చూసి, అదే తగిన సమయమనుకొని గోపిక, రాధను ఈ విధంగా ప్రశ్నించింది—

కహి రాధికా బాత అబ సాంచీ।
తుమ అబ ప్రగట కహీ మో ఆగై,
శ్యామ - ప్రేమ - రస మాంచీ॥

"రాధా! కృష్ణుని ప్రేమరసంలో మునిగి పోయానని యిప్పుడే నాతో అన్నావు. అసలు కృష్ణుని మొదటిసారి నీవు ఎక్కడ చూసావు? గోశాలలోనా లేక యమునా నదీ తీరానా? కృష్ణుని చూడలేదని కల్లబొల్లి మాటలు చెప్పి నన్ను మరపించటానికి ప్రయత్నం చేయకు."

శ్యామ మిలే మోహి ఐసో మాయీ।
మె జల కొ జమునా గయీ ఆయీ॥
దేఖత అమె తిహా కన్హాయీ।
దేఖ తహీ మోహినీ లగాయీ॥

"సఖీ! మొదటిసారి, శ్యామసుందరుని నేను, యమునా నదీ తీరానికి, నీరు తేవటానికి వెళ్ళి నప్పుడు చూసాను. ఆ రోజు అతని సౌంద ర్యాన్ని చూసి, నన్ను నేను మరచాను. నా మనసు నా అధీనం తప్పింది. యింటికి ఎలా వెళ్ళానో నాకే తెలియదు. కృష్ణుని చూసిన నాటినుండి ఈనాటి వరకు, నా కంటిమీద కునుకు అనేది లేదు. శరీరం నిరంతరము కృష్ణుని స్పర్శకై తపించిపోతుంది. ఎప్పుడూ కృష్ణుని ఎక్కడ, ఎలా కలవాలా అనే ఆలో చన తప్ప, ఏ పనీ చేయాలనే కోరిక వుండదు."

మాయీ కృష్ణ-నామ జబితై శ్రవన సున్యోహైరీ,
తబతై భూలీరీ మౌన బావరీ సీ భయీ రీ।

"సఖీ! 'కృష్ణ' అనే నామం నా చెవులకు సోకిననాటినుండి, అతని కొరకు నేను పిచ్చి దాన్నే అయ్యాను. అతని పేరు తలిస్తే చాలు, ఆనందంతో కన్నులు చెమరుస్తాయి. శరీరం రోమాంచితమవుతుంది. తల్లి-తండ్రి-బంధుజనమంతా మాయగా, మాధవుడొక్కడే సత్య స్వరూపంగా గోచరిస్తాడు. స్త్రీ ధర్మా లకు, కులమర్యాదలకు భయపడి, నా అణు వణువున నిండిన మోహనుని విడనాడి వుండటం నాకు సాధ్యమేనా, నీవే చెప్పు?"

రాధ మాటలు విని గోపికలు, ఆమెతో "రాధా! నీ భాగ్యాన్ని పొగడటం దేవతలకు సైతం సాధ్యం కాదు. 'కృష్ణప్రియ' మా సఖి అయినందులకు మేము గర్వపడు తున్నాము" అన్నారు.

ఒక రోజు కృష్ణుడు, స్త్రీ వేషాన్ని ధరించి రాధవద్దకు వచ్చాడు. స్త్రీ వేషధారి అయిన మోహనుని చూసి. రాధకు ఆశ్చర్యంతో పాటు నవ్వును తెప్పించింది. కృష్ణుడు పసుపు పచ్చని చీర ధరించాడు. విశాలనేత్రాలకు కాటుక దిద్దడంతో కన్నులు మరింత విశా లంగా కనబడసాగాయి. మెడలో ముత్యాల సరాలను. చెవులకు ముత్యాల జూకాలను, చేతులకు రత్నకంకణాలను, కాలికి నూపురా లను ధరించిన కృష్ణుని సౌందర్యాన్ని చూడ టానికి, రాధకు రెండు కళ్ళు చాలలేదు. రాధ; నీలపు వస్త్రాలను ధరించి, యింద్రనీల మణుల ఆభరణాలను అలంకరించుకొని, మబ్బుల మధ్య మెరుపు తీగలా మెరవసాగింది. రాధా కృష్ణులు కలసి, యమునానదీ తీరానికి వెళుతూ వుంటే, చంద్రావళి అనే గోపిక వారిని చూసింది. ఆమె, రాధనయితే గుర్తు పట్టింది కానీ రాధ ప్రక్కన, సృష్టిలోని సౌందర్య మంతా తానే అయి వెలిగిపోతున్న స్త్రీని మాత్రం గుర్తుపట్టలేక తనలో తాను యిలా అనుకోసాగింది—

యహ వృషభాను - సుతా వహ కోహై।
యాకి సరి జువతి కోవు నాహీ, యహ త్రిభువన-
మన మోహై॥

"'మెరుపుతీగలా వున్నది, వృషభానుని కుమార్తె అయిన రాధ, కానీ, ఆమె పక్కన వున్నది ఎవరబ్బా! ఆమె అందం ముందర, రతీదేవి కూడ దిగదుడుపే. త్రిభువన మోహిని అయిన ఈ స్త్రీ ఎక్కడను

దగ్గరకు వెళ్ళి, ఆమె సౌందర్యాన్ని తనివితీరా తిలకించి, ఆమె ఎవరో తెలుసుకుంటే గానీ, మనసుకు శాంతి కలిగేలా లేదు.' యిలా అనుకుంటు చంద్రావళి, రాధ వద్దకు వెళ్ళింది.''

కహి రాధా యే కో హై రీ।
అతి సుందరీ సాంవరీ సలోనీ, త్రిభువన-జన-మన మోహేరీ॥

''రాధా! నీ ప్రక్కన వున్న ఈ యువతి ఎవరు? నల్లగా వున్నా, ఈమె తన సౌందర్యముతో త్రిభువనాలను మోహితులను చేస్తున్నది. ఈమె ఎవరు? ఎక్కడ నివసిస్తుంది? ఈమెకు వివాహం అయిందా లేక నవయువతా? ఈ సుందరి మన బృందావన వాసి కాదని నా అనుమానం. ఈ యువతి గురించి తెలుసుకోవాలని నా మనసు ఉబలాట పడుతున్నది.''

మథురా తై యే ఆయీ హై।
కుచ సంబంధ హమారీ ఇనసే, తాతై యినహి బులాయీ హై॥

''సఖీ! ఈమె మధుర నుండి వచ్చింది. ఈ సుందరితో నాకు సంబంధం వున్నది, కాబట్టే ఈమెను పిలిపించాను. లలితతో పెరుగు అమ్మటానికి మధుర వెళ్ళినప్పుడు, లలిత ఈమెతో నాకు పరిచయాన్ని కలిగించింది. ఆ స్నేహాన్ని పురస్కరించుకొని నన్ను చూడటానికి ఈ రోజు మన బృందావనానికి వచ్చింది.''

రాధ మాటలు విన్న చంద్రావళి, ఆమెతో యిలా అన్నది—

ఇనకో వ్రజహీ క్యోం న బులావహు।
కి వృషభాను పుర, కి గోకుల, నికట హి ఆని బసావహు॥

''సఖీ! ఈ సుందరిని మన బృందావనానికి ఎందుకు పిలిపించవు? బృందావనం కాకపోయినా కనీసం వృషభానుపురంలో గానీ, గోకులంలోగానీ వుండి పొమ్మను. మీ యిద్దరు కృష్ణుని ప్రక్కన వుంటే చంద్రుని ప్రక్క తారలలాగా వెలిగిపోతారు. అయినా ఈమె నన్ను చూసి యింత సిగ్గుపడుతున్నది దేనికి? యువతిని చూసి యువతి సిగ్గుపడటం అనేది ఎంతటి ఆశ్చర్యకరమైన విషయం! మేలి ముసుగును తీసి ఒకసారి నావైపుకు చూడమని చెప్పు''

చంద్రావళి, రాధతో యిలా అంటూ కృష్ణుని చేతిని పట్టుకొని, మేలిముసుగును తొలగించి, అందమైన ముఖాన్ని తనకు చూపమని వేడుకోసాగింది. అంతేకాదు తన వైపు ఒకసారి చూస్తే, కృష్ణునితో పరిచయాన్ని కలగచేస్తానని ఆశ కూడ పెట్టింది పాపం.

నంద-నందన హసే నాగరీ-ముఖ చితై, హరిషి చంద్రావలీ కంఠలీయా।
వామ భుజ రవని, వచ్చిన భుజా సఖీ పర, చలే బిన ధామ సుఖ కహిన జాయీ॥

''నందనందనుడు మేలిముసుగును తొలగించి, చంద్రావళిని చూచి కొంటెగా నవ్వాడు. కృష్ణుని స్త్రీ వేషం చూసి, చంద్రావళి ఆశ్చర్యచకితురాలు అయింది. రాధాకృష్ణులు కలసి తనను ఆటలు పట్టించినందుకు కోపం వచ్చినా, జగన్మోహనాకారుడయిన మాధవుడు తమ ప్రియతముడు అయినందుకు గర్వ పడింది. ఎడమచేతిని రాధ మీద, కుడి చేతిని చంద్రావళి మీద వేసి, కృష్ణుడు మధువనానికి వెళ్ళాడు. అందమైన వారి జంటను చూసి ప్రకృతి పులకరించి పోయింది. మెరుపు తీగల ప్రక్క మేఘంలా, బంగారు లతల ప్రక్కన తమాలవృక్షంలాగా మెరిసిపోతున్న కృష్ణుని సౌందర్యాన్ని చూసి రతి-మన్మథులు సిగ్గుతో తలలు వంచుకొన్నారు.''

మాధవుడు ఒకనాడు, రాధ యిష్టసఖి అయిన లలితతో రాధను యమునా నదీ తీరాన తనను కలుసుకోమ్మని సందేశాన్ని పంపాడు. కృష్ణుని ఆదేశానుసారం, రాధ అందంగా అలంకరించుకొని, యమునా నదీ తీరానికి చేరుకొంది. కానీ అక్కడ కృష్ణుడు వుంటేగా? కృష్ణుని రాకకై వేచి-వేచి అలసిపోయిన రాధకు కోపం వచ్చింది. సంకేత స్థలానికి కృష్ణుడు రాలేదని, అతను రాకపోతే తన సౌందర్యం, యవ్వనం వృథా అని పరితపిస్తూ, లలిత మాటలకు మోసపోయానని విలపిస్తున్న రాధ చిత్రణ, సూరదాసు రచనలో పూర్తి సమగ్రతను సాధించుకొంది.

రాదేహి శ్యామ దేఖీ ఆయీ।
మహా మాన దృఢా యీ బైఠీ, చితై కాంపై జాయీ॥

"శ్యామసుందరుడు యమునా నదీ తీరానికి వచ్చి, కోపంతో ఎఱ్ఱబడ్డ ముఖంతో అలిగి కూర్చున్న రాధను చూసాడు. కృష్ణుడు వచ్చాడని తెలిసినా, కనీసం ముఖమైనా తిప్పక దృఢంగా కూర్చున్నది రాధ. క్రోధంతో నిమగ్నం అయిన రాధను చూసి కృష్ణుడు చాలా వ్యాకులపాటు చెందాడు. లలిత, రాధ వద్దకు వెళ్ళి కృష్ణుడు వచ్చాడని చెప్పినా, నోటి నుండి ఒక్క ముత్యాన్ని అయినా రాల్చని రాధను చూసి మాధవుడు మనసులో నవ్వుకుంటూ పైకి మటుకూ బాధగా ముఖం పెట్టాడు. కృష్ణుని ముఖం చూసిన లలితకు, రాధా మాధవులను ఎలా కలపాలో తెలియక అవస్థ పడసాగింది."

లలిత, రాధవద్దకు వచ్చి, కోపంతో సూర్యబింబంలా ఎఱ్ఱబడ్డ ఆమె ముఖాన్ని తన చేతులలోకి తీసుకొని-

యహ ఋత రూసిబే కీ నాహి।
బరష మేఘ మేదినీ కై హిత, ప్రీతమ హరషి మిలాహి॥

"సఖి! ఇది కోపంతో అలిగి కూర్చోవలసిన సమయం కాదు. పృథ్వి హితవు కోరి మేఘాలు వర్షించినట్లే, స్త్రీలు, తమ ప్రియులను ఆనందోల్లాసాలతో కలుసుకుంటున్నారు. గ్రీష్మ తాపానికి వడలి నేలరాలిన లతలు, ఆనందంతో వృక్షాలను పెనవేసుకొని పోతున్నాయి. నదులు సైతం, సాగరంలో ఐక్యమయ్యేందుకు పరుగులు తీస్తున్నాయి. యవ్వనం నదీ ప్రవాహం లాంటిది. ఒకసారి పోతే మరల తిరిగి రాదు. అలాటి యవ్వనాన్ని కోపతాపాలతో వృథా పరచక హాయిగా అనుభవించు."

మోహనుడు, రాధ వద్దకు వచ్చి తాను త్వరగా రానందుకు క్షమాపణలు చెప్పుకుంటూ తనతో మాట్లాడమని తనవైపు ఒకసారి చూడమని రాధను బ్రతిమిలాడసాగాడు. కృష్ణుని మాటలకు రాధ క్రోధితురాలు అవుతూ—

మోహి ఛువో జాని దూర రహౌ జూ।
జాకే హృదయ లగాయీ లయౌ హై, తాకీ బాహ రహౌ జూ॥

"కృష్ణా! నన్ను ముట్టుకోవద్దు, దూరంగా వుండు. యిప్పటి వరకు ఎవరివద్ద వుండి నీ ప్రేమకలాపాలను ప్రదర్శించావో వారివద్దకే వెళ్ళు. నీవొక్కడవే సర్వజ్ఞుడవు, మేమంతా మూర్ఖులమనే నీ అభిప్రాయాన్ని యికనైనా మార్చుకో. నన్ను విడచి ఒక్కక్షణమైనా వుండలేనని చెప్పిన వాడివి యింత ఆలస్యంగా ఎందుకు వచ్చావు? నీకు యిష్టమైన ఆ గోపిక వద్దకే వెళ్ళు. ఆమే నీ హృదయాధిదేవత, నేను నీ దాసిని, నీ చిరునవ్వుకై పరిత

పించే పిచ్చిదాన్ని కదూ. నేనంటే ప్రేమ లేనప్పుడు యిలా నా చేయి పట్టుకోవటానికి నీకు సిగ్గుగా లేదా యికనుంచి నీవు, నాతో మాట్లాడకు, నావద్దకు రాకు.''

రాధ, క్రోధంగా యిలా అనేసరికి నంద నందనుడు చాలా వ్యాకులపాటు పొంది, ఆమెను కోపం విడనాడమని ప్రాధేయపడుతూ యిలా అన్నాడు—

కహా భయీ ధని బాబరీ కహి తుమహి సునావూ ।
మనతే కో హై భావతీ, జిహి హృదయ బసావూ ॥

''ప్రియా! కోపంతో ఎందుకింత పిచ్చిదాని వవుతావు. నీకన్నా ప్రియమైన వారు నాకెవ రన్నా వున్నారా? నిన్ను నా హృదయంలో నే కాక, నా అణువణువున నింపుకొని యింతగా ప్రేమిస్తున్నా నా మీద లేనిపోని నిందను వేయడం నీకు న్యాయమేనా? రాధా! నీవే నా నయనానివి, శ్రవణానివి అనుకున్న నా మీదనా నీకింత అలుక? సౌందర్యాధి దేవత వయిన నిన్ను వదలి, అందరి వెంట పడే అవ సరం నాకేమిటి చెప్పు. ఇకనైనా అలక మాని చిరునవ్వుతో నన్ను అలరించు.''

కృష్ణునితో పాటు, లలిత కూడ రాధను బతిమిలాడుతూ

తోహి కిన రూఠన సిఖా యీ ప్యారీ।
నవల బైస నవనాగరి శ్యామా, వేనాగరగిరిధారీ ॥

''ప్రియసఖీ! గిరిధారీ యింత ప్రాధేయ పడుతున్నా, యిలా అలిగి కూర్చోవటం నీకు న్యాయమేనా? ప్రియమైనవారు బతిమాలినా మాట్లాడకూడదన్న పాఠాన్ని ఎవరు నేర్పారు నీకు? నిన్ను యిలా బతిమిలాడటంతోనే రాత్రి గడచిపోయేలా వుంది. అయినా నీ ముందు నేను గెలవలేకపోయాను. శరత్ పౌర్ణమినాటి ఈ రేయిని వృథా పరచటం నీకు న్యాయంగా తోస్తున్నదా? నీ కటాక్ష వీక్ష ణం కోసం ఎదురు చూసే మాధవుని నిరాశ పర చక, చంద్రబింబము లాంటి నీ ముఖారవిం దాన్ని అతనికి చూపి, అతని భయాన్ని పో గొట్టు. శ్యామా! కృష్ణునికి నీవంటే అత్యం మైన ప్రేమ. కూర్చునివున్నా, నిలుచున్నా, నడుస్తున్నా, నీ నామాన్నే జపిస్తాడు. ఆ సంగతి నీకు కూడ తెలుసు కదా. అలాటి ప్రియతముని, దూరంగా వుంచటం నీకు వుచి తంకాదు.''

తన యిష్టసఖి లలిత, తనను యిలా మంద లిస్తూ హితవచనాలు పలికే సరికి, రాధ తన కోపాన్ని వుపసంహరించుకొని కృష్ణుని వైపు చూసి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వుకే మాధవుడు ప్రపంచాన్ని జయించినంతగా ఆనందపడ్డాడు.

రాధికా బన్య కరి శ్యామ పాయె।
విరహ గయో దూరి, జియ హరష హరి కే భయో
సహసముఖనిగమ జిహి నేతి గా యో ॥

''శ్రీకృష్ణుడు, రాధను తన వశం చేసు కున్నాడు. ఇరువురి హృదయాలలో విరహ బాధ తొలగి, సంతోషానందాలతో నిండి పోయింది. పంచభూతాలు, సహస్రముఖా లతో ఎవరి గానాన్ని అయితే చేస్తాయో, ఆ లీలామానుష విగ్రహధారి, త్రిభంగి వేషమూ ధరించి, మనోహరంగా వేణువు నూదసాగాడు. రాధ తన కోపాన్ని, సిగ్గును వదలి, కృష్ణు నితో కలసి అనంతమైన ఆనందాన్ని అనుభ వించసాగింది.''

—పై సంచికలో 'రాసలీల'

## మెఱుపు మెఱిసింది

ముహింకైర్రి

మహేంద్రా నగరంలోని ఒక ఆశ్రమానికి మా ఇల్లు దగ్గర. తరచు ఆ ఆశ్రమానికి పోయేవాణ్ణి. భక్తుణ్ణిమాత్రం కాను. కాని అక్కడ అందరితో పరిచయం ఉంది. అదీగాక అక్కడ ఒక చక్కని లైబ్రరీ ఉంది. అందులో టైమ్సు, రీడర్స్ డైజెస్ట్, సన్ డే, ఇండియా టు-డే, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ వగైరా వగైరా పత్రికలు చాల ఉంటాయి. అందులో అడుగు పెడ్తే అర దినం కాలాన్ని సునాయాసంగా చంపేయ వచ్చు. నేనక్కడికి పోయినప్పుడల్లా నేను కోరి చదివే పత్రికల్లో ఏదో ఒకటి తిరగవేస్తూ అక్కడ ఒక బ్రహ్మచారి కనిపించేవాడు. అతనితో నాకు కొంత పరిచయం ఎక్కువయింది. అతనొక చిత్రమైన వ్యక్తి. అతణ్ణి ఆశ్రమంలో అంత కాలం ఉండనిచ్చినందుకు ఆశ్రమాధికారులను మెచ్చుకోవాలి. ఏపనీ సరిగా చేయడు. పత్రికా కార్యాలయంలో పని ఇస్తే తెనుగు పత్రికలు పంపవలసినవారికి తమిళ పత్రికలు, తమిళ పత్రికలు పంపవలసినవారికి తెలుగు పత్రికలు పోయి చేరేవి. చందా కట్టినవారికి బదులు కట్టనివారికి పత్రికలు పోయేవి. ఈ గందరగోళం సహించలేక అతణ్ణి పుస్తకవిక్రయశాలకు మార్చారు. అక్కడా అంతే. ఒకరోజు బిల్ బుక్కే ఎక్కడో పోగొట్టేశాడు. దానివల్ల ఎన్ని చిక్కులో చూడండి! అక్కణ్ణుంచి తీసి పూజా మందిరానికి మార్చారు. అక్కడా అంతే. నైవేద్యానికి అమర్చవలసినవి సరిగా చేయడు. తాంబూలంలో ఉంచవలసినవి సరిగా ఉంచడు. "ఎందుకు సరిగా ఉంచవు" అని అడిగితే "ఇదేమి చంద్రమండలానికి పంపించే రాకెట్టా అన్నీ సరిగా ఉంచడానికి ?" అని సమాధానం ఇచ్చేవాడు. పూజారికి ఆ మాటలు విన శక్యం అయ్యేది కాదు. ఆ ఆశ్రమాధికారి ఇవన్నీ సహించగలడు కాని ప్రొద్దున లేచి పూజామందిరానికి వచ్చి ధ్యానం చేయనివాళ్ళను మాత్రం సహించేవాడు కాదు. ఎవరైనా రాకపోతే స్వయంగా తానే వారి గదులకు వెళ్ళి వాళ్ళను లాక్కొచ్చేవాడు. గదుల్లో వాళ్ళు లేకపోతే అక్కడా ఇక్కడా వెదకి దాగుడు స్థలాల్లో నిదరపోయేవాళ్ళను సైతం పట్టుకొని వచ్చేవాడు. కాని మన బ్రహ్మచారి ముందర అతని పంజా పనిచేయలేదు. ఇతను గదిలో ఉండేవాడు కాదు. ఎక్కడ వెదకినా కనిపించేవాడు కాదు. "ప్రొద్దున ఎక్కడున్నావు కనిపించలేదు ?" అని ఆశ్రమాధికారి అడిగితే "బిల్వవృక్షం క్రింద జపం చేస్తుండినాను" అని సమాధానం ఇచ్చి తప్పుకొనేవాడు. పాపం ఆ అధికారి ఆ మాటలు నమ్మి ఊరుకొనేవాడు. మళ్ళీ ఒకనాడు ఆ అధికారి "ఈ రోజు ప్రొద్దున బిల్వవృక్షం క్రింద వచ్చి చూచాను నీవు కనబడలేదే ఎక్కడ నిదురపోయావు చెప్పు" అని గద్దించాడు. "రావిచెట్టు క్రింద ఈ రోజు జపానికి కూర్చున్నాను" అనేవాడు. ఇంకోరోజు ఆ ప్రశ్న వస్తే "అరటిచెట్టు క్రింద జపం చేశాను" అనేవాడు. మొత్తానికి "జపానికి దొంగ" అని తెలిసిపోయింది. వాస్తవం ఏమంటే అతను తన గదినుండి వేకువఝాముననే లేచి ఆశ్రమాధికారికి ఏమాత్రం సందేహం కలగని చోటుకు పోయి హాయిగా తెల్లవారే వరకు నిద్రించేవాడు. అలాంటి "బోనస్ నిద్రకు" అతను ఎన్నుకున్న చోటు "వంటవాని గది"! తరగతుల్లో కూడ అతని తీరు యాదాగుడంగానే ఉండేది. శాస్త్రి ఉపనిషత్ పాఠం చెప్తూ "అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుర్మైత్రేయీ చ కాత్యాయనీ చ" అనగానే ఇతను వాదానికి దిగి "కాదు అతనికి ముగ్గురు భార్యలు" అనేవాడు. "ఏ పుగా

ణంలో చదివావు" అని శాస్త్రి మందహాసం చేస్తూ అడిగేవాడు. "పురాణాల్లో కాదు ఇక్కడే ఈ బృహదారణ్యకంలోనే చదివాను. అతనికి ముగ్గురు భార్యలు" అనేవాడితను. "నేను బృహదారణ్యకం వందసార్లు చదివాను బాబూ! మూడవ భార్య ఉన్నట్లు నాకెక్కడా కనబడలేదు. పోనీలే ఆ మూడవభార్య పేరేమిటో చెప్పు" అనేవాడు శాస్త్రి, వాదంలో క్రిందకు దిగివస్తున్నట్లుగా నటిస్తూ. మన బ్రహ్మచారి సమాధానంగా "భార్య అనగా భరింపబడునది. యాజ్ఞవల్క్యునికి మైత్రేయీ కాత్యాయనులను భరించే అర్హతే గాక ఆత్మవిద్యను భరించే అర్హత కూడ ఉండినందువల్ల 'ఆత్మవిద్య' అతని మూడవ భార్య" అని అనేవాడు. "నీ జవాబుకు సంతోషించాను" అని శాస్త్రి చేతిగడియారం వంక చూసుకొని పాఠం మొదలుపెట్టేవాడు. అతణ్ణి చక్కదిద్దడం మనవల్ల అయ్యేపని కాదు" అనుకొని ఆశ్రమాధికారి నీళ్ళుజల్లి వదిలేశాడు. కాని ఆశ్రమాన్నుండి అతణ్ణి బైట పంపించి వేయడానికి మనస్కరించలేదు. ఇలా కొన్నేండ్లు గడిచాయి. అకస్మాత్తుగా అతనిలో పెద్ద మార్పు వచ్చేసింది. ఆ మార్పు కొట్టవచ్చినట్లు అందరికీ కనబడిపోతున్నది. ఇప్పుడే పని ఇచ్చినా చాల శ్రద్ధగా చేస్తున్నాడు. శ్రద్ధగా చదువుతున్నాడు. పత్రికలతో కాలాన్ని చంపడం లేదు. ఎప్పుడూ అంతర్ముఖంగానే ఉంటున్నాడు. ఈ మార్పు ఎలా సంభవించింది ఎవరూ అతన్ని అడగలేదు. అతనూ ఎవరికీ చెప్పలేదు. ఒకరోజు అతను తోటలో ఏకాంతంగా తిరుగుతుంటే పోయి అడిగాను: "ఇప్పుడు మీరు క్రొత్తమనిషిలా కనబడుతున్నారు. మీకేమైనా అందిందా ఏమిటి?" అని. అతను నవ్వుతూ "అందుకోవడానికి ఇంత మార్పు మీలో ఎలా కలిగింది?" అని మళ్ళీ అడిగాను. "మొదటిసారిగా ఇలా అడిగిన మనిషివి నీవే. కాబట్టి సమాధానం చెబుతాను. దీన్ని ఎవరికీ చెప్పవద్దు" అని అక్కడ తిన్నెపై కూర్చొని ఇలా చెప్పసాగాడు: "జీవితంలో నేనెంతగా నష్టపోయానో నాకు నేనుగా ఎఱిగిన క్షణంలోనే నాలోమార్పు వచ్చిందనుకుంటాను. ఇతరుల ఉపదేశాలవల్ల పుస్తకాలవల్ల కాదు. పోయిన నెలలో ఒక కఱవు ప్రాంతానికి నన్ను పంపారు. మా పని ఏమంటే లారీలలో నీళ్లు తీసుకొనిపోయి కొన్ని గ్రామాలకు పంచిపెట్టి రావడం. అక్కడ ఒక గ్రామంలో ఒక ఇరవై ఏండ్లు నిండని అమ్మాయి కూడ నీళ్ళు పట్టుకుపోవడానికి వచ్చి క్యూలో నిలబడేది. ఆ అమ్మాయి నన్నమితంగా ఆకర్షించివేసింది. అంతటి పవిత్రత అమాయకత ముగ్ధమనోహరత నేనెక్కడా ఇంతవఱకు చూడలేదు. ఒక్క మాట మాట్లాడడానికిగాని తదేకంగా చూడడానికి కాని వీలుకాని పరిస్థితులవి. నేనప్పుడనుభవించిన హృదయారాటాన్ని పూసగ్రుచ్చినట్లు నీకు వివరించడం బాగుండదు. నాకప్పుడనిపించింది జీవితంలో నేనెంతో నష్టపోయాను అని. తెలిసో తెలియకో ఆశ్రమంలో పదేండ్లకు ముందు చేరాను. "గంట కొట్టితే అన్నం" సదుపాయాలమధ్య ఏమఱుపాటువల్ల నైతేనేమి సోమరితనంవల్ల నైతేనేమి జీవితాన్ని చాల తేలికగా నెట్టివేశాను. ఆత్మవికాసంలో శ్రద్ధ చూపకుండా కాలాన్ని నెట్టివేశాను. ఆత్మను ఉపేక్షించినవాడు ఎన్నాళ్ళు సుఖంగా శాంతంగా జీవించగలడు? ఆ అమ్మాయిని చూచిన ఆ క్షణంలో "ఇహానికి పరానికి రెంటికీ దూరం ఐపోయానురా దేవుడా" అని నా హృదయం ఆక్రోశించింది. ఆ క్షణంలోనే నాలో మార్పు వచ్చేసింది. ఇప్పుడు నేను ఆత్మవికాస విషయంలో అశ్రద్ధ చూపడం లేదు.

# సద్దర్శనము

## డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(క్రిందటి సంచిక తరువాయి)

15. సత్యః చిదాత్మా వివిధాకృతిశ్చిత్
సిధ్యేత్ పృథక్ సత్యచితో న భిన్నా
భూషావికారాః కిము సన్తి సత్యం
వినా సువర్ణం పృథగత్ర లోకే

ఆంధ్రానువాదం: లోకంలో రూపాలు, పేర్లు కలిగిన అన్ని వస్తువులు పరమాత్మ అయిన ఆ శుద్ధ చైతన్య స్ఫురణములే; వేరు కావు. ఆ పరమసత్యవస్తువు నుంచి వాటిని విడదీయటం అసాధ్యం. బంగారాన్ని దానితో చేసిన నగల్ని వేరు చేయగలమా?

వివరణము: శుద్ధ చైతన్యమైన ఆత్మ ఒక్కటే అంతటా వ్యాపించి ఉన్న సత్యవస్తువు. అదే మనస్సుగా, శరీరంగా, బుద్ధిగా, అహంకారంగా, ప్రపంచంగా ప్రకాశిస్తూంటుంది. సముద్రంలో పుట్టిన కెరటాలు, సముద్రం కంటే ఎలా వేరు కావో, అల్లే ఈ నామరూపాలు కలిగిన జగత్తులో వస్తువులన్నీ ఆత్మలో పుట్టిన విలాసములే. ఈ జగత్తులో ఉండే విచిత్రవస్తువు చూచేటప్పుడు మనము ఆత్మను గుర్తించనప్పటికీ, అవి ఆత్మకంటే వేరు కావు. వేరు చేయటం అసాధ్యం.

బంగారంతో మనం గాజులు, ఉంగరాలు, హారాలు చేస్తాము. ఉంగరంలో ఉండే బంగారాన్ని ఉంగరంనుంచి విడదీయగలమా? మనం ఉంగరం, గాజులు అని ఏదో పేరుతో పిలుస్తున్నాము. కాని, బంగారం యొక్క నిజస్థితి వీటిలో మారుతుందా?

మీ భార్య నగ ఒక కంసాలికి అమ్మారనుకొండి. ఆ కంసాలి దాన్ని కరిగించి పరీక్ష చేసుకొంటాడు. ఈ లోపుగా ఇంకో ఆయన, ఒక కొత్త నగ చేయించుకోడానికి వస్తాడు. మీకు మీ భార్యకు ప్రియమైన అలంకారం కరిగించడం దుఃఖహేతువు. ఆ వచ్చిన కొత్తమనిషికి, తన భార్యకు దీనితో కొత్తనగ చేయించుకోవడం సంతోషం. కాని కంసాలికి దుఃఖంకాని, సంతోషంకాని ఏముంటుంది? వాడికి కంటె అయితేనేం? కంకణం అయితేనేం? బంగారం మాత్రం మారదని వాడికి ధైర్యం.

అదేవిధంగా మనం జగత్తులో వస్తువులు పుట్టడం, కొంతకాలం ఉండటం, తరువాత నశించటం చూస్తుంటాం. దీనివల్ల కొంత సుఖం, కొంత దుఃఖం కలుగుతుంది. కాని మనం ఉన్నత స్థాయితో, జ్ఞాన దృష్టితో చూస్తే ఇవన్నీ వేరుగా ఉన్నట్లు కనపడవు. కాని అదంతా శుద్ధ చైతన్య వికాసమేనని గుర్తిస్తాం. పుట్టుక, పెరుగుట, చావు-ఇవన్నీ మనకు లోపలి చూపు లోపించినపుడు ఆత్మకంటే వేరుగా స్ఫురిస్తాయి. అవి స్ఫురణలో కలిగే మార్పులు కాని, ఆత్మ మార్పు చెందదు. అక్కడ వచ్చేదీ లేదు, పోయేది లేదు. పుట్టుక లేదు చావు లేదు. అది ఉన్నది; అంతే! పరమాత్మ ఈ జగత్తుయొక్క నిజస్థితి. ఆ పరమాత్మయే సత్యవస్తువు; మనం ఎన్ని రూపాలు, ఎన్ని నామాలు పెట్టినా, దానిమీద పెట్టినవే. అదే శుద్ధ సత్య వస్తువు. ఆ ఒక్క సత్యం తప్ప మరేమీ లేదు. మన తెలివి ఇట్టి అత్యున్నత స్థాయిలో ఉంటే తప్ప నిజంగా శాశ్వతమైన శాంతి లేదు. మీకు ఈ లోక వ్యవహారసుడిగుండంలో, సుఖ దుఃఖ పరంపరనుంచి తప్పి బయటపడే మార్గం లేదు. దీన్ని దాటగలిగితేనే శాశ్వతమైన ఆనంద శాంతులు పొందగలము. ఈ శ్లోకంలో శ్రీ మహర్షివారు కనపడే జగత్తును పరీక్షించి, దీనిలో చిక్కుకోకుండా దానికి ఆధారమైన ఆత్మవస్తువు వద్దకు పొమ్మని హెచ్చరిస్తున్నారు. వేదాంతంలో దీన్ని చిద్విలాసవాదం అంటారు. దీని ప్రకారం, జగత్తు అబద్ధం కాదు. కట్టుకథవంటిదీ కాదు; ఆత్మయే జగత్తుగా ప్రకాశిస్తుంది. ఇది ఆ ఆత్మశక్తి యొక్క దివ్యస్ఫురణ. ఈ జగత్తు సర్వమూ పరమాత్మ విలాసమని మనం గుర్తిస్తే, మనం కాని పని చేయగలమా? ఇతరులనుగాని ఇతరములనుగాని హింసింపగలమా? స్వార్థపరులమై 'నా చిన్ని పొట్టకు శ్రీరామ రక్ష' అని జీవించగలమా? గీత ఏమంటుందో చూడండి.'

## "వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః"

సర్వం వాసుదేవుడేయని జీవించువాడు చాలా అరుదు. ఈ ప్రపంచాన్ని లేనిదని నిరసించుట తగని పని. పరమేశ్వర విలాసమని భావించవలె. అప్పుడు మన జీవితము, పరిశుద్ధమై, త్యాగముతో సేవాపరంగా, విశ్వప్రేమతో కొనసాగును. ఇది నిజమైన ఆ ఈశ్వర భక్తి. అంతరం

గంలో పారిశుద్ధ్యం లేకుండా ఎన్ని పూజలూ, పునస్కారాలు, యాత్రలు ఏం చేసినా, దేవాలయాలకు పోయినా అది భక్తి అనిపించుకోదు. శ్రీ రమణ మహర్షివారు వారి ఉపదేశసారంలో ఇలా అన్నారు.

జగత ఈశధీః యుక్తసేవనం
అష్టమూర్తిభృద్దేవ పూజనం

సర్వ ప్రపంచమూ పరమేశ్వరవిలాసమని గుర్తించి తెలుసుకొన్నతర్వాత దానితో వ్యవహరించినప్పుడు, శ్రద్ధా భక్తులతోనూ, గౌరవ ప్రపత్తులతోనూ మానవ హృదయమది నిండి ఉండాలికదా! జగత్తును ఈ దృష్టితో చూచినవానికి, సకల సృష్టియందూ, అవ్యాజమైన ప్రేమతో జీవితం సవ్య పరిణామం పొందుతుంది. వాని యందుండే దుర్గుణములు నశించి సద్గుణములు విజృంభిస్తవి. మన నైతిక విలువలకు ఆధారం 'నీవు నాకు మంచిగా ఉంటే నేను నీకు మంచిగా ఉంటాననే' బేరం కాదు. ఏమంటే ఇది కొంత తెలివి తేటలు కలిగిన స్వార్థం. కాని మన సనాతన ధర్మం పరిశీలిస్తే పవిత్ర జీవితలక్ష్యం, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే మహా వాక్యం మీద ఆధారపడి ఉన్నది. ఈ సృష్టి అంతా ఒకటే. బ్రహ్మ వస్తువే। బ్రహ్మనుంచే పుట్టింది. దానిలోకే పోతుంది. ఈ భావం సుస్థిరం అయితేనే మిగతా విషయం తానంతట అదే సిద్ధిస్తుంది. మన ప్రాచీన ఋషులు జీవిత లక్ష్యాన్ని ఈవిధంగా నిర్వచించారు: 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.' మానవ జీవితం ఆత్మలాభం కోసం మఱియూ లోకకళ్యాణార్థం। ఇక్కడ గమనించవలసిన విషయం, ఆత్మలాభం ప్రధానం. ఆత్మజ్ఞానం లేకపోతే లోకానికి సరిగా మేలు చేయగలమా? ఇతరులకు అపకారం చేయటంకంటే ఉపకారం చేయడం మంచిదే అనుకోండి. కాని అవ్యాజమైన ప్రేమతో సకల ప్రపంచమునకు శాశ్వతంగా క్షేమం సమకూర్చాలంటే ఆత్మలాభం లేకుండా అది అసాధ్యం. ఆత్మజ్ఞానికి ఆత్మ, దాని విలాసమైన సృష్టి అత్యంత ప్రియమైనవి. మానవసేవ మాధవసేవ ఒకటే. కొందరి దృష్టిలో ఆత్మలాభం కోసం సాధన స్వార్థం. వారి వాదం ఏమంటే నీవొక్కడవు ఆత్మ సాక్షాత్కారం కోసం ధ్యానం చేస్తూ కూర్చోవడం నీకొరకే। దానికంటే లోకానికి మేలుచేయుట గొప్పది కదా! అని. ఈ వాదం శుద్ధ తప్పు. సరియైన జ్ఞాననిష్ఠతో ఒక స్వార్థమే కాదు, మానవునిలో పాతుకుపోయి అతనిని అణగద్రొక్కే అన్ని దుర్గుణాలు భస్మీభూతం అవుతవి. తనేదో గొప్పస్థాయిలో ఉన్నాననుకొని తాను మేలు చేసేవారిని చిన్నచూపుతో చూస్తూ చేసే సంఘసేవ ఒట్టి మోసం. సంఘసేవంటే తోడి మానవునిలో దైవత్వమునకు చేసే పూజ। ఇట్టి పూజ ఈ సృష్టంతా సర్వేశ్వరమయమనే భావం బాగా కుదిరితేనే సాధ్యం అది 'ఆత్మవత్సర్వభూతాని' అనే వాక్య తాత్పర్యం. అదే విశ్వప్రేమ. తనయందు నిఖిలభూతములందు ఒకే ప్రేమ అవ్యాజంగా అప్పుడు వెల్లివిరుస్తుంది. అప్పుడే జ్ఞాన సాధనకు సంఘసేవకు విరోధంలేదు కదా! జ్ఞానసాధన, సంఘసేవను ఆధ్యాత్మిక స్థాయికి తీసుకు పోతుంది. ఇట్లా చెప్పటం వల్ల ఆత్మజ్ఞానులకు తప్ప ఇతరులకు లోకసేవ కుదరదని కాదు. జ్ఞానసాధనతోపాటు, సంఘసేవాతత్పరత కూడా సాధకునికి అత్యావశ్యకమని మాత్రమే. ఈ సందర్భంలో జీవన్ముక్తుని హృదయంలో ఉండే భావపరంపర ఎట్టిదో గ్రహించాలి. ఆయన లోకవ్యవహారం ఏ ఉద్దేశంతో చేస్తున్నాడో పరికించాలి. అట్టి ఉద్దేశములే, సంఘసేవ చేసేటప్పుడు మనలను ఉత్సాహవంతులను చేయాలి. అప్పుడే లోకానికి కాని మనకు కాని ప్రయోజనం. మన ఎడంచేతిని దోమ కుడితే దాన్ని కుడిచేతితో కొడతాము. 'నిన్ను కుట్టింది కాబట్టి నీవే కొట్టుకో. నేను కొడితే నాకేం లాభం?' అని కుడిచేయి అంటుందా? పైకి ఎడంచేయి కుడిచేయి వేరుగా ఉన్నా ఆ రెండూ నీవొక్కడివే కదా? ఆ దృష్టితోనే కుడిచెయ్యి, ఎడమచెయ్యిని కుట్టిన దోమను కొడుతుంది. అదే విధంగా ఆత్మ సాక్షాత్కారం కాగానే ఈ సృష్టి అంతా ఒక్కటే అని గ్రహించాక నిష్కారణంగా లోకాన్ని పూర్తిగా ప్రేమించగలుగుతాం. "సర్వే జనో సుఖినో భవన్తు" అనేది శుష్కప్రియం కాదు. అది జ్ఞానియొక్క ప్రేమఫలం. ఆ ప్రేమ మాత్రం ప్రేమకంటే కూడ చాలా గొప్పది. దీనినే శ్రీ రమణమహర్షివారు తరువాతి శ్లోకంలో నిర్వచిస్తున్నారు.

(తరువాయి పై సంచికలో)

శ్రీ యోగ వాసిష్ఠ కథలు-3

[ఉత్పత్తి ప్రకరణము]

ఓం ప్రకాశ్

# మనసు చేసే గారడి

[సంకల్పవశుడు లవణ రాజు కథ]

"ఆ అన్నం నాకివ్వు."

"చూస్తుంటే మహారాజులా ఉన్నావ్! ఈ చండాలపు కూడు నీకెలా పెట్టేది?"

"చండాలపు కూడా?!"

"ఔను. నేను చండాలపు జాతి కన్నె పిల్లను. నరమాంసం, పీనుగుమాంసం, గిత్త మాంసం, కుక్క మాంసం - ఇలాంటివన్నీ తినే జాతి మాది. మా కూడు నీకెలా ఇయ్యొస్తుంది?"

"అయితేనేం. ముందు నా ఆకలి తీరాలి. ఆ భోజనమే ఇటివ్వు."

"ఊరికే ఎలా ఇస్తానూ? లాభసాటి కాని పన్లు సామాన్యులం మేం చేయం కదా!"

"అయితే ఏమంటావ్?"

"ఏమీ లేదు. నన్ను చూస్తున్నావు కదా! నిండు యౌవనంలోనున్న కన్నెపిల్లని. నీవా అందగాడవు. పైగా మహారాజువు కూడ నన్ను పెండ్లాడు"

"పెండ్లా!? నిన్నా"

"బలవంతం లేదు. నీకు తిండి కావాలి. నాకు మొగుడు కావాలి. అంతే!"

లవణమహారాజు ఒక్క క్షణం ఆలోచించాడు. ఆపద్ధర్మం. పైగా దిక్కూ మొక్కూ లేని ప్రదేశానికి వచ్చి పడ్డాడు తాను. తిరిగి పోదామంటే దారీ తెన్నూ తెలియదు. అందులో ఈ క్షుద్బాధతో ప్రాణం పోయేలా వుంది. ఇలాంటి సమయంలో కులం - జాతి - ఆచారాదులను విచారిస్తుంటే, ముందు తన పని ముగిసేలా వుంది. పూర్వం విశ్వామిత్రుడు లాంటి మహాత్ముడే చండాలపు కూడు, అందులో ఎంగిలిది తిన్నాడు; తప్పదు. ముందు బ్రతికి బయట పడితే ఆ తర్వాత ప్రాయశ్చిత్తాలు చేసుకొని దోష నివారణ చేసుకోవచ్చు.

ఆకలితో వికలమైంది అతని మనసు. ఆ చండాలకన్య వైపు చూశాడు. ఆ కన్నెపిల్ల కళసొంపుగా ఉంది. పుష్టికల దేహం. నిగనిగలాడే సొగసు. నిండు యౌవనం. పురుషునికింత కంటే స్త్రీలో ఏం కావాలి! ఆ నల్లని కన్నుల్లో ఎంత కామం ఉంది? ఆ లావాటి పెదవుల్లో ఎంత దాహం ఉంది? ఆ పెద్దటి నాసికలో ఎంత ఆకర్షణ ఉంది? చండాలపు కన్నె కావచ్చు. కృష్ణవర్ణయే కావచ్చు. అయినా సుందరే సుమా!

క్షుద్బాధతో పీడింపబడుతున్న ఆ రాజు చిత్తం వివేకం కోల్పోయింది. చపలమయింది. యుక్తాయుక్త జ్ఞానం అతనికి నశించింది.

ఆకలి, అంతటి పరమధార్మికుడైన మహారాజును సైతం ఎంత స్థితికి దిగజార్చింది! హరిశ్చంద్రుని వంశజుడైన ఆ లవణున్ని చండాల వంశం వైపు కూడ ఆకర్షింప జేసింది కదా! 'క్షుధాతురాణాం న రుచిర్న శుద్ధిః' అని ఊరికే అన్నారా మరి!

లవణుడు ఆ కన్నె కన్నుల్లోకి చూశాడు.

"సరే. నిన్ను వివాహమాడతాను. ఇకనైనా అన్నం పెడతావా?"

చండాల కన్య సంతోషంతో ఎగిరి గంతేసింది. అతని ఆకలి తీర్చింది. అతన్ని తన వెంట చండాల వాటికకు తీసికెళ్ళింది. పెద్దలకు సంగతంతా చెప్పింది. చండాలోచితవిధి విధానంలో చండాల కన్యకు, లవణరాజుకు పెండ్లి

జరిగింది. లవణరాజును చండాల కన్య భార్య అయింది. ఉత్తరపాదరాజ్యమేలు లవణమహారాజు చండాలుడై పోయాడు.

ఉచ్చైశ్శ్రవం లాంటి ఉత్తమ గుర్రమును కొని, వాయువేగంతో పరిగెత్తే ఆ గుర్రానెక్కి, గమ్యం లేకుండా బహుదూరం ప్రయాణం చేసాడు. అనేక వనములతో శోభించే తనరాజ్యాన్ని విడిచి, గుర్తు తెలియని ఈ చండాలవాటికను చేరుకున్నాడు. తనవల్ల ఎంత పొరపాటు జరిగింది! అయినా ఇప్పుడు వగచి లాభమేమిటి? చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకున్నట్లుయింది తన గతి. అంతా ప్రారబ్ధం! అదెవరికీ తప్పదు.

లవణుడు చండాల జీవితానికి అలవాటు పడ్డాడు. తన పూర్వస్థితిని పూర్తిగా మరచి పోయాడు. భార్య అయిన చండాల కన్యతో, చండాలురయిన ఇతర బంధువులతో తాను చండాలుడుగానే జీవించసాగాడు. రక్తమాంస భోజనం, శుచీపచీ లేని నివాసం, అసహ్యాంగా, కంపు కొట్టే జనం మధ్య అధమాధమంగ బతకటం. లవణరాజుకివన్నీ అలవాటై పోయాయి.

కాలం ఎవరి కోసమూ ఆగదు కదా! లవణుని సంగమం ద్వార చండాలకన్యకు గర్భం ఏర్పడింది. మొదటిమారు పుత్రుడు పుట్టాడు. ఎంతో ఆనందం వేసింది. ఆ పిదప మరో కూతురు కల్గింది. సంతోషం కల్గింది. లవణరాజు కుటుంబం ఇలా రెండు మూడుగా పెరిగి పోసాగింది. చివరి గర్భంలో మరల పుత్రుడు పుట్టాడు. లవణునికి వాని యందు మరింత మమత ఏర్పడింది.

అత్తామామలను, భార్యాబిడ్డలను పోషించే బాధ్యత తనమీద పడింది. ఆహారం కోసం దిక్కులన్నీ పరిభ్రమించేవాడు. ఎంతో శ్రమించే వాడు. దొరికినరోజు దొరికేది, లేని రోజు లేదు. బాధ్యత వహించినందుకు, అతన్ని నమ్ముకొన్న భార్యాబిడ్డల వల్ల అనేకవిధాల మానాలు పడేవాడు. అతని జీవితమిలా దుఃఖాలతో నిండిపోయింది. అగ్నిచే దహింపబడు వాని మాదిరి లోలోన బాధతో నిరంతరం కృంగిపోయేవాడు. చింతలతో నిరాశావాదుడయ్యేవాడు. కుటుంబ పోషణలో అతని బుద్ధి ఈవిధంగా క్షీణించి పోయింది.

పుండుపై కారంలా అతనుండే ఆ వింధ్యా పర్వతప్రాంతాల్లో దుర్భిక్ష్యం అకాలమరణంలా వ్యాపించింది. తిండి నీరు లేక పశువులు, మృగాలు చచ్చిపోసాగాయి. చెట్లు పొదలు ఎండిపోయాయి. మనుషుల కడుపులు కాలిపోతున్నాయి. అలాంటి విపత్కర పరిస్థితిని లవణుడు మున్నెన్నడు చూసినవాడుకాడు. ఆ దుర్భిక్షధాటి తాగలేక పోయాడు. అత్తమామలను వదిలి వేశాడు. తదితర బంధువులసంసర్గాన్ని విడిచి పెట్టాడు. భార్యను, బిడ్డల్ని మాత్రం త్యజించలేక, మమతావ్యామోహాలకు చిక్కి, వెంటబెట్టుకొని ఆ ప్రాంతాన్ని వదిలిపెట్టి మరో సుభిక్షమైన ప్రాంతం కోసం బయలుదేరాడు.

చాలా దూరం ఇలా నడిచారు. దూర ప్రయాణం. అందులో ఆకలి. అంతా అలిసిపోయారు. దారిలో ఒక చెట్టు నీడన అలసట తీర్చుకోవటానికి కూర్చున్నారు. అతని భార్య కూతుర్ని, కుమారుర్ని కౌగిలించుకుని నిద్రలోకి జారిపోయింది. చింతామగ్నుడైన రాజుకు నిద్ర కూడానా! అలా ఆకాశం వేపు నిరాశగా చూస్తూ పడుకొన్నాడు. అతని చివరి కుమారుడు ఆకలి బాధ భరించలేక పోయాడు. బిగ్గరగా ఏడ్వసాగాడు. వాడంటే లవణునికెంతో ప్రీతి. ప్రియమయిన వస్తువు సందే మాయ మెండుగా ఉంటుంది. వ్యామోహం బలంగా ఉంటుంది. అదే చింతలకు

త్వరగా కారణమవుతుంది. దుఃఖాలగు దారి తీస్తుంది.

లవణుడు చటుక్కున లేచాడు. పిల్లవాణ్ని చేరదీశాడు.

"బిడ్డా ఎందుకురా ఏడుస్తావ్. ఆకలేస్తుందా?"

పృచ్ఛకుడనే ఆ ప్రియపుత్రుడు మరింత బిగ్గరగా ఏడ్చాడు. కన్నులనుండి నీరు ఉబికి ఉబికి రాసాగింది. శ్వాస ఎగజిమ్ముతున్నది.

"మా తండ్రే ఏడవకయ్యా ఏం కావాలో చెప్పు!"

లవణుని హృదయం ప్రియసుతుని బాధకు గిలగిల లాడింది. ఏడుస్తూనే చెప్పాడు ఆ పిల్లవాడు.

"అయ్యా! నా కాకలేస్తోంది నెత్తురూ, మాంసం ఇవ్వవా? తింటాను" ఆ పిల్లవాని దీనాలాపాలు, లవణుని హృదయాన్ని బద్ధలు చేసాయి.

ఏం చెయ్యాలి? ఎలా తేవాలి? అన్నమో అంటూ అల్లాడిపోతున్న పసిబిడ్డకు గుక్కెడు ముద్ద పెట్టలేని తానూ ఒక తండ్రేనా? ఛీ ఛీ. వ్యర్థం. భార్యాబిడ్డలకు ఒక్కపూట కూడ అన్నం పెట్టలేని ఈ జీవితం ఎందుకూ! తాను బతికుండే వాంగె బ్రదుకూ లేదు. బతికేకంటే చావటమే నయం.

చావటానికి నిశ్చయించుకొని లవణుడు లేచాడు. చుట్టుపట్లనున్న ఎండుకట్టెల్ని ఏరి తెచ్చి చితిపేర్చాడు. నిప్పంటించాడు. ఆ చితి భగభగ మండసాగింది.

ఆ అగ్నిమంటల్లో పడటానికి సిద్ధమయ్యాడు. భార్యవైపు చూశాడు. జాలేసింది. పాపం నన్నాశ్రయించి జీవితాన్ని పాడుచేసుకుంది. నాసేదో ఒరిగ బెడతాననుకొంది. ఎంత నిరాశగా నిద్రలోకి జారుకుంది! కొడుకులవైపు చూశాడు. అమాయకంగా నిద్రబోతున్నారు. కూతుర్ని చూశాడు. నిశ్చలంగా, నవ్వుతూ నిద్రబోతున్నది. తన అసమర్థతను నవ్వుతున్నదా!

లవణుడిక ఆగలేక పోయాడు. భార్యాబిడ్డల మమతని త్యజించి ఒక్కమారుగా భగ భగ మండుతున్న ఆ మంటల్లో దూకేశాడు.

* * *

"మహారాజా! మహారాజా!" ఆందోళనగా అరిచారు రాజసింహాసనంపై విరాజమానుడై యున్న లవణ మహారాజు క్రింద పడబోతుండగా, గాభరాతో మంత్రులంతా అతన్ని పిలుస్తున్నారు. దూరంగ జయ జయ శబ్దాలు వినబడుతున్నాయి.

లవణ మహారాజుకు మెలుకువ వచ్చింది.

"నేను చావలేదా? నేను మంటల్లో పడి కాలిపోలేదా? ఏది నా చండాలకన్య, నా భార్య. ఏరి నా బిడ్డలు? నా చిన్నకుమారుడేడి?"

మంత్రులకు, సభాసదులకు పరమాశ్చర్యం వేసింది.

మహారాజా! ఏమిటీ మీరంటున్నది! మాకేం బోధపడ్డం లేదు. మీ ఆరోగ్యం సరిగ్గా లేనట్లుంది. రాజవైద్యుల్ని పిల్పించమంటారా?"

ఆ మాటలు విన్న లవణరాజుకు వివేకం ఉదయించింది. కండ్లు నులుముకొని చూశాడు. మహా విస్మయం పొందాడు.

స్వర్గమందలి 'సుధర్మ' సభను బోలు రాజసభలోనే తానున్నాడు మంత్రులు, సభాసదులు తమ తమ ఆసనములందు కూర్చొని యున్నారు. రాజసింహాసనం పైనే తానాసీనుడై యున్నాడు. చుట్టూ దాస దాసీ పరివారము సేవలు చేస్తున్నది. ప్రజలకు అనుకూలంగ ప్రవర్తించు రాజగుటచే, ప్రజారంజకు

దగుటచే, న్యాయం కోసం వచ్చిన ప్రజలు తన విచారణ కోసం ఎదురు చూస్తున్నారు.

ఎంతాశ్చర్యం!

చండాలకన్యా లేదు! ఆ వంటలు లేవు! తానా చెట్టు కింద అసలే లేడు!

ఏమిటీ విచిత్రం!

తానింతవరకు అనుభవించిందంతా ఏమిటి!? నిజం కాదా?

మహారాజు సభనంతా మరొక్కసారి కలయచూశాడు. అలా చూస్తుండగా విచిత్ర వేషధారణతో అట్టహాసంగా, రంగులవస్త్రాల్లో నున్న ఒక వ్యక్తి కన్పించాడు. ఆ వ్యక్తి చేతిలో నెమలిపింఛాల కట్ట ఉన్నది. రాజు దృష్టి అతనిపై పడగానే అతను చిన్నగా నవ్వాడు.

"మహారాజా! క్షమించాలి. మీకు జరిగిన అనుభవమంతా నిజం కాదు. నా ఇంద్రజాల విద్యా కల్పనం వల్ల, మీ మనస్సులో కల్గిన సంకల్పం మాత్రమే!"

అతను ఇంద్రజాలికుడు. కొన్ని నాళ్లు ఘడియల క్రితమే అతను సభను ప్రవేశించాడు. ఒక వింతను చూపిస్తానంటే తానే అనుమతించాడు. వెంటనే అతను ఆ నెమలిపింఛాన్ని తన ముందుంచి కదిలించాడు. ఆ తర్వాత మహారాజుకేమీ అర్థం కాలేదు. ఇంద్రజాలికుణ్ణి చూశాడు

"అంటే, అశ్వాన్ని అధిరోహించి ప్రయాణం చేసింది, ఆకలికి తల్లడిల్లింది, చండాల కన్యను పెండ్లాడింది, బిడ్డల్ని కన్నది, అనేక సంవత్సరాలు సంసార బాధలననుభవించింది, అగ్నిలో దూకింది – ఇదంతా వొట్టి దేనా నీ మాయం!?"

"చిత్తం మహాప్రభూ! అంతా కల్పనయే. అంతా మిథ్యయే. ఒక్క నాళ్లు ఘడియల కాలం మాత్రమే మీరు మోహగ్రస్థులయ్యారు. ఈ ప్రపంచాన్ని మరచి, ఇంద్రజాల ప్రపంచంలోకి లీనమయ్యారు."

మహారాజు నమ్మలేకపోయాడు.

ఇంద్రజాలికుడలా నెమలిపింఛాన్ని ఊపుతుండగానే తనకేదో మత్తు కమ్మినట్లయింది. కాని అంతలోనే తేరుకున్నాడు. అప్పుడే సభలోకి ఒక వ్యక్తి ఒక చక్కని గుర్రాన్ని తీసుకొచ్చాడు. ప్రభువుకు వందనం చేసాడు.

"ప్రభూ! ఈ ఉత్తమాశ్వం మీకు కానుకగ యివ్వదగినది. ఇది మహా వేగం గలది. దీన్నధిరోహించి సూర్యభగవానునిలా, ప్రపంచమంతా చుట్టిరండి."

వాని మాటలకు లవణ మహారాజు సంతోషించి ఆ గుర్రాన్ని అధిరోహించాడు. వంటరిగానే మృగయా వినోదానికి బయలుదేరాడు. ఆ తర్వాత...ఆ తర్వాత...

మహారాజుకు లీలగా తన సంకల్ప ప్రపంచమంతా స్మృతిపథంలోకి వచ్చింది అలా చాలా దూరం వెళ్ళాడు. అలసిపోయాడు. గుర్రాన్ని దిగి ఆహారం కోసం పరిభ్రమించాడు. ఒకచోట ఒక కన్య వద్ద ఆహారం కన్పించింది. అంతే...

రాజుకు ఆశ్చర్యంతో పాటు నవ్వూ వచ్చింది.

"ఎంత విచిత్రం! ఇంత స్వల్పకాలంలో, ఎంత దీర్ఘమయిన, దుర్భరమైన జీవితాన్ని చవిచూశాను! ఇంకా అది అనుభవంలోనే ఉన్నట్లుంది... ఇంద్రజాలికుడా నీ విద్య అమోఘం!"

ఇంద్రజాలికుడు రాజు అభినందనకు వందనం చేశాడు.

"చిత్రం మహాప్రభూ! కాని మా విద్య కన్నా, మనిషి మనసు చేసే గారడియే మరింత గొప్పదైనది ప్రభూ!"

"అదెలా!"

"ఈ మనసే మనకు అనేకానేక జీవితాలను ప్రసాదిస్తుంది. అనేక భ్రమలకు లోను చేస్తుంది. ఈ భ్రమలకు లోనై మనం అనేక జీవితాలను గడుపుతున్నట్లు, అందు అనేక సుఖదుఃఖాలు పొందుతున్నట్లు తలుస్తాము. అదంతా వొట్టి భ్రమ. మనసు చేసే రచనే! ఈ మనస్సు కల్పాన్ని క్షణంగాను, క్షణాన్ని కల్పంగాను మారుస్తుంది. దేశ కాల క్రమమంతా దాని ఆధీనంలోనే ఉంటుంది. భ్రమలన్నింటికీ ఈ మనసే మూలము. సుఖదుఃఖములకు మూలమైన భయంకర సంసారానికి ఈ మనసే ప్రభువు. దీనివల్లనే అన్ని విపత్తులు కల్గుతాయి. ఈ మనస్సే జగద్రూప వికల్పాన్ని సృష్టిస్తుంది ఈ మనస్సు ఆడే నాటకంలోని దృశ్యాలన్నీ, సంఘటనలన్నీ సత్యంగా భ్రమపెట్టే మిథ్యా రూపాలే! మనస్సు ఊహాలోకంలో, స్వప్న లోకంలో, సంకల్ప కల్పనల్లో, బహుయోజన దూరం ఆవు గిట్టను దాటినంత సులభంగా ప్రయాణం చేస్తుంది. అలాగే అది వ్యావహారిక ప్రపంచమందు కూడ తన లీలల్లో, అఘటిత ఘటనాల్ని కల్పిస్తుంది.

"వివేకవంతులు ఈ మనోవ్యాపారాన్ని గుర్తించి, బ్రహ్మాండమండలి లోకములన్నింటిలో, వాటియందలి పర్వతాది వస్తువ్రల్లో చిత్రము యొక్క విన్యాసాన్నే చూస్తారు. అందుకే వారు మనసు చేసే మాయకు వెరువరు.

"ఈ మనసు తుచ్ఛమైన విషయాల్ని ఆశ్రయిస్తుంది. ఆ విషయాలు దూరమైతే దుఃఖిస్తుంది. నశిస్తే, తానే నశించినట్లు భావిస్తుంది. లోకవ్యవహారములందంతా ఈ మనసే మోహాన్ని చెందుతుంది. ఈ మనస్సు వివేకరహితమైనట్టిది. ఇట్టి మనసు మంత్రాలకు, గారడీవిద్యలకు, మందులకు వశమవుతుంది. వివేకవృత్తితో కూడిన మనసు దేనికీ లోబడదు.

కనుక ఎల్లప్పుడూ వివేకమూ, విచారణలతో ఈ మనసు క్రియలను పరిశీలిస్తుంటే, మనోవృత్తులన్నీ తెలిసిపోతాయి. వివిధ రచనలు చేసేది, అతిగా విస్తరించియుండేది, ఎన్నెన్నో భ్రమలు కల్పించేది ఈ మనసేనని తెలిసిపోతుంది. జ్ఞాన విచారాలవల్ల త్వరలోనే ఈ మనసు వాసనారహితమై పోతుంది. ఆత్మలో స్థిరపడుతుంది. పరమశాంతి లభిస్తుంది. అప్పుడు భేదకల్పనమంతా, మనసుచేసే గారడంతా నశించిపోయి, పరమాత్మపదము లభిస్తుంది.

"కనుక మహారాజ! వివేకంతో, జ్ఞాన విచారణతో ఈ మనస్సును పరిశీలించండి. నా ఇంద్రజాలం కంటే ఈ మనసు గారడెంత గొప్పదో మీకే విదితమవుతుంది."

ఇంద్రజాలికుని మాటలు సభాసదులంతా శ్రద్ధగా విన్నారు.

"ఇంద్రజాలికా! నీ మాటల్లో అపూర్వ సత్యముంది. ఇప్పుడు నా అనుభవమంతా కేవలం మిథ్యయేనని స్పష్టపడింది."

లవణమహారాజు ఆ ఇంద్రజాలికుణ్ని సత్కరించి పారితోషికమిచ్చి పంపించాడు.

అదే అట్టహాసంతో ఇంద్రజాలికుడు ఆ సభను వదిలి వెళ్ళిపోయాడు. సభికులంతా ఇంకా ఆశ్చర్యంలోనే మునిగియున్నారు. లవణరాజు ముఖంలో మందహాసం నృత్యం చేసింది.

ఎంత విచిత్రం!!

## కథా వివేచనము

ఈ కథ శ్రీయోగావాసిష్ఠమందు ఉత్పత్తి ప్రకరణములో కానవస్తుంది. పైకి మామూలు కథలాగే ఉన్నా, మానవజీవితానికి సంబంధించిన మౌలిక సమస్యలను గూర్చి ఇది చర్చిస్తుంది.

ఇతర యోనిగత ప్రాణులకు (పశు-పక్షి-మృగాదులకు) లేనిది, నరయోనిగత ప్రాణికున్నది వివేచనాజ్ఞానమే. ఈ వివేచనాజ్ఞానం ద్వారా మనిషి దేవత్వాన్ని పొందటానికి లేదా క్షుద్రయోనిని పొందటానికి స్వతంత్రత గల్గియున్నాడు. ఇతర ప్రాణులకు, వాటి వాటి ఆహారవ్యవహారాదులన్నీ ప్రకృతే స్వయంగా నిర్ణయించింది. ఆ ప్రకృతి నియమాన్ని దాటి అవి ప్రవర్తించవు. మాంసభోజిజీవాలు మాంసాన్ని తింటే, శాకాజీవాలు శాకాహారమే గ్రహిస్తాయి. సింహానికి గడ్డి పెడితే అది తినదు. ఏనుగుకు మాంసం పెడితే అది ముట్టదు. అవన్నీ ప్రకృతి నియమాన్ననుసరించి చరిస్తాయి.

మనిషి అలా కాదు. అతనికి స్వతంత్రం ఇవ్వబడ్డది. తనకుత్తమమయిన జీవిత విధానాన్ని ఎన్నుకోవటానికి స్వేచ్ఛ ఇవ్వబడింది. మనిషికి, ఇతర జంతువులకు ఆహార, నిద్రా, భయ, మైథునాదులు సమానమే అయినా, వీటిలో సైతం మనిషి, తన శ్రేయోమయ జీవితానికి బాటలు వేసుకో వలసిన అవసరముంది. ఆ వివేకబుద్ధి మనిషికివ్వబడింది.

మనిషికి ముందుగా అత్యవసరమైనది ఆహారం. ఈ ఆహారం ఏవిధంగా ఉండాలో, తాను ఔన్నత్యం పొందేందుకది ఎలా ఉపయోగపడుతుందో మనిషి నిర్ణయించుకోవాలి. ఏది పడితే అది తినటం మానవమేధస్సు ఒప్పుకోదు.

శ్రీ కృష్ణభగవానుడు గీతాశాస్త్రంలో మూడురకాల ఆహారాన్ని పేర్కొన్నాడు. లోకంలోనున్న వివిధ భోజన పదార్థాలన్నీ, చివరికి ఈ మూడువర్గాల క్రిందికే వస్తాయి. అవి సాత్త్విక ఆహారం; రాజసిక ఆహారం; తామసిక ఆహారం. బుద్ధిని వికసింపజేసేది, మనస్సును శుద్ధిపరిచేది, నివృత్తిమార్గానికి కొనిపోయేది సాత్త్విక ఆహారం. బుద్ధిని చంచలంగా మార్చేదీ, ఎప్పుడు ఏదో వ్యవహారంలో ఉంచేది, ప్రవృత్తిమార్గంలోనే ఆసక్తి కలిగించేది రాజసిక ఆహారం. బుద్ధిమాంద్యం, సోమరితనం, వివేకరాహిత్యం, మూఢత్వం, అనుత్సాహం ఇలాంటి నికృష్టభావాలను కల్పించి, పశువుకన్నా హీనమయిన జీవితానికి దిగజార్చేది తామసిక ఆహారం.

ఈ కథలో లవణరాజు గైకొన్న ఆహారం తామసికమయినట్టిది.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥
(భగవద్గీత 17-10)

"ఉడికీ ఉడకనిది, రసరహితమైనది, దుర్గంధయుక్తమయినది, పాసిపోయినది, ఎంగిలిది, తినరానిది (అపవిత్రమైనది) ఇట్టి భోజనము తామసులకు ప్రియమైనది."

ఇందులోని అమేధ్యభోజనం క్రింద జంతుసంబంధమైన మాంసం, గ్రుడ్లు, మద్యము, ఇవన్నీ వస్తాయి. ఇవి సహజంగానే అపవిత్రమైనవి. అట్టి ఆహారం గైకొంటే, జడత్వం, మూఢత్వం మనిషికి కలుగుతుంది.

లవణమహారాజు ధార్మికుడు. కాని చండాల ఆహారం గ్రహించిన తర్వాత, అతని జీవితమంతా ఎంత హీనంగా గడిచిందో మనకు తెలుసు. కనుక మనిషి అలాంటి తామసిక ఆహారాన్ని సర్వదా త్యజించాలి. దుర్గంధయుక్తమైన వెల్లుల్లి, నీరుల్లిలాంటి వాటిని కూడ వదలిపెట్టాలి. ఎంగిలి కూడు తినకూడదు. లవణరాజు చండాల జీవితంలో గ్రహించిన ఆహారం తామసపూరితమైనది. అందుకే వివేకం గోల్పోయి, దుఃఖాల పరంపరకు బానిస అయ్యాడు.

మనిషిపై సాంగత్య ప్రభావం కూడ చాలా ఉంటుంది. "సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః". అని శంకరులవారు సెలవిచ్చారు. దుస్సాంగత్యాన్ని సర్వకాలాలందు వదలిపెట్టాలి.

లవణరాజు చండాలకన్యతో, చండాలురతో సాంగత్యం చేశాడు. ఆ సాంగత్య ఫలితంగా ఎంత మూఢమైన జీవితాన్ని గడిపాడో కథద్వార విదితమే కదా! కనుక ఉత్తమత్వాన్ని కాంక్షించే మనిషి, శ్రేయస్సును కోరుకునే మనిషి సత్‌సాంగత్యం చేయాలి. సత్పురుషులతో గడపటం, ఉత్తమగ్రంథాలను అధ్యయనం చేయటం సత్‌సాంగత్యమే అవుతుంది. బుద్ధిని వికసింపజేసేందుకు, ధైర్యాన్ని, ఉత్సాహాన్ని, అభయాన్ని కల్గించేందుకు, చింతలనుండి పరిష్కారం చూపించేందుకు ఉపయోగపడే సాంగత్యమే సత్‌సాంగత్యం.

ఇక మనిషిని నిలువునా ముంచేది, అత్యంత ఆకర్షణీయమయినది, అయస్కాంతంలాంటి శక్తి గలది అయిన కామం ఎంతటి దుఃఖానికి కారణమవుతుందో లవణరాజు

చేష్టగ్వార తెలుసుకోవచ్చు ఈ కామం స్త్రీ, ధన, ఐశ్వర్యాదుల రూపంలో మనిషిలో ఆశలు రేపి, మనిషి మనసును వికలితం చేసి, మనిషిని అధోగతిలోకి లాగుతుంది. స్త్రీకి పురుషుడు, పురుషునికి స్త్రీ కామప్రేరకులు. లవణుడు కన్నెపిల్లని చూడగానే ఆకర్షితుడయ్యాడు. ఆమెపైని కామాసక్తి లవణుణ్ని చండాల జీవితంలోకి లాగేసింది.

మనిషికి కామం అత్యంత బలంగా కన్పించినా, దాన్ని సైతం నిరోధించగల్గాలి, స్త్రీని అనుభవించే నిమిత్తం కాకుండా, స్త్రీ స్పర్శలో ఇంతకంటే మించిందేమీ లేదు అన్న నిశ్చయానికి రావటానికి మాత్రమే వైవాహిక జీవితంలో స్త్రీని స్పృశించాలి. ఒక కొడుకునుగాని, కూతురుగాని పుట్టింతర్వాత, స్త్రీ పురుషులిరువురు తమ కామవాంఛల్ని నిరోధించాలి. పశువులు నిరోధించుకోలేవు. మనిషి నిరోధించగల్గినవాడే, అతను పశువుకన్నా ఉత్తమ ప్రాణిగా ఋజువౌతాడు.

మనిషి అన్ని దుఃఖాలకు, బాధలకు కారణం భయం. ఈ భయం అనేక రూపాల్లో నిత్యమూ మనిషిని వెనాడుతుంది. లవణ మహారాజు భార్యాబిడ్డలను ఎలా పోషించాలో తెలియని భయంతో ఎలా తల్లడిల్లిపోయాడో, చివరికి ఆ భయాన్నుండి ముక్తిపొందటానికి ఆత్మహత్యకు కూడ ఎలా సిద్ధపడ్డాడో మనకు తెలుసు కదా!

ఈ భయానికి కారణం ఎక్కడైన ఎప్పుడు దుఃఖం, బాధ, ప్రతికూలవాతావరణం ముందుకువస్తాయనే! ఎప్పుడూ సుఖాలు, ఆనందాలు, అనుకూల వాతావరణాలు ఉండాలనే ఆశయే! అయితే ఇది అసంభవం. సుఖదుఃఖాలు రాకపోకలు గతించిన ప్రారబ్ధానుసారంగా అవి వస్తుంటాయి. కోరనిదే దుఃఖాలు వచ్చినట్లే, సుఖాలు కూడ వస్తాయి. కనుక ఈ భయానికి ఆస్కారం లేదు. ఈ భయం కేవలం భ్రమాత్మకమయినదే

చివరిగా సంసారం గూర్చి ఆలోచించవలసివుంది. మొత్తంమీద లవణరాజు అనుభవించిన చండాల సంసారం కేవలం భ్రమాత్మకమైనట్టిది అయినా ఎంత వాస్తవంగా అనిపించిందతనికి! ఆ సంసారమే కాదు, మన సంసారాలన్నీ కూడ మన మనోకల్పనలే. కనుక నాటకంలో పాత్రధారిలా, మనము సంసారంలో నటిస్తూ, దానికి అంటకుండా జీవించటం నేర్చుకోవాలి. మనసును ప్రతిక్రియల (reactions) కు లోనుచేయకుండా జీవించాలి. ఈ కథలోని సందేశం ఇంతమాత్రమే!

(పై సంచికలో నా కథ మీకథ కూడ)

# బాలల రామకృష్ణ

## ఏకసంత గ్రాహి

ఖుదీరాం ఉండగానే పెద్దన్న రామకుమారునకు, పెద్దక్క కాత్యాయనికి పెండ్లి అయింది. గదాయి పన్నెండో ఏట చిన్నన్న రామేశ్వరునకు వివాహమయింది. గదాయి పుట్టిన తర్వాత చంద్రాదేవికి కూతురు కలిగింది. ఆమెకు సర్వమంగళ అని పేరు పెట్టారు. ఆమె పెళ్ళి కూడా అయిపోయింది.

ఒక సంవత్సరమైన తర్వాత పెద్ద వదినెగారికి ఒక పిల్లవాడు కలిగాడు. వానికి అక్షయుడు అని పేరు పెట్టారు. కాని కొద్దిరోజులకే పెద్ద వదినెగారు చనిపోయింది. చంద్రా దేవి యిప్పుడు చాలా పెద్దదయింది. ఇంటిపనులన్నీ ఆమెపై పడ్డాయి. దానికితోడు అక్షయుని పెంపకము జతపడింది. గదాయి బడి మానేసి యింటిపనులలో తల్లికి తోడ్పడసాగాడు.

ఆ వూరి స్త్రీలకు గదాయి చేసిన పని మంచిదిగా తోచింది. వాళ్ళలో చాలామంది శ్రీకృష్ణుడో, చైతన్యుడో గదాయిగా ఉద్భవించాడని తలచారు. కొందరు పురుషులు కూడా అలాగే అనుకున్నారు. అతడు పాడే పాటలు, నాటకాలు వినిపించటం వారు వినగోరేవారు. గదాయి సహజంగా యింట్లోనే వుండటం వల్ల యింటిపనులు కాగానే అతని దగ్గర చేరి పాటలు, మాటలు వినేవాళ్ళు.

ఆ రోజుల్లో ఆ గ్రామంలో వీధి నాటకాల జట్లు మూడు ఉండేవి. కొందరు పాటగాళ్లు కూడ ఉన్నారు. గదాయికి గొప్ప జ్ఞాపకశక్తి ఉంది. ఒక్కసారి వింటే చాలు, అతనికి జ్ఞప్తి యుండేది. అతడు కొందరు స్నేహితులను, గొల్లపిల్లలను పోగుచేసి మాణిక్‌రాజా మామిడి తోటలో వేషాలు ఎలా వేయాలో తాను వేసి చూపి వారిచేత వేయించేవాడు.

ఎన్నటికి మరువదొకసారి విన్నదాని,
ధారణాశక్తి యెంతో గదాయికుండె,
నాటకము చూచి మామిడి తోటలోన
ఆడు నద్దాని మిత్రులతోడ గూడి.

సంపాదకులు: స్వామి తన్మయానంద. ముద్రాపకులు: ఎం. తీర్థానందం
(ప్రీడమ్ ప్రెస్, మద్రాసు - 21). ప్రచురణ: శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు - 4.



# శ్రీ రామకృష్ణ సేవాసమితి, బాపట్ల నివేదిక (Report)

శ్రీ రామకృష్ణ వ్యవస్థ అడుగుజాడలలో అనుసరిస్తూ బాపట్లలోని శ్రీ రామకృష్ణ సేవాసమితి తన కార్యక్రమములను గత దశాబ్దిపైగా కొనసాగిస్తూ వస్తోంది. 1977 నవంబరు నెలలో పెనుతుఫాను తాకిడికి సర్వనాశనమైన "గోవింద నగర్" యానాది కాలనీని శ్రీ రామకృష్ణ సేవాసమితి హైదరాబాదు రామకృష్ణమఠంవారి ఆర్థికసహాయంతో శారదాపురిగా పునర్నిర్మించింది. 95 పక్కా సిమెంటు కాంక్రీటు ఇళ్లు నిర్మింపబడ్డాయి, బ్రహ్మాండమైన రెండంతస్తుల శ్రీ రామకృష్ణ సమాజ మందిరము, ఒక చక్కని దేవీ ఆలయము కూడా నిర్మితం అయ్యాయి. సమితివారి ప్రోద్బలంతో శారదాపురిలో ప్రభుత్వ ఆదర్శ పాఠశాల కూడా ప్రారంభింపబడింది. గ్రామప్రజలు తమకాళ్ళపై తాము నిలబడునట్లుజేయడమే సమితి లక్ష్యం. అందుకోసమై అనేక స్వయం ఉపాధి కల్పనాప్రణాళికలను సమితివారు చేపట్టి కొనసాగిస్తున్నారు. సమితివారు సాగిస్తున్న ఈకృషికి రాష్ట్రప్రభుత్వము, స్థానిక కెనరాబ్యాంకువారు తమ చేయూత నందిస్తున్నారు.

గ్రామసీమల స్వయం సమృద్ధి జీవన సాధనలక్ష్యంతో హైదరాబాదు రామకృష్ణమఠం అధ్యక్షులు శ్రీమత్ స్వామి రంగనాథానందజీవారు రూపకల్పన చేసిన "గ్రామశ్రీ ప్రణాళిక" పెద్ద ఎత్తున ఈ శారదాపురిగ్రామంలో 9-12-81 న రంగనాథానందజీవారిచే ఆవిష్కృతం అయింది. చేపలపెంపకం, పాడి పశువులపెంపకం, నవారు నేత, చిరిచాపల అల్లకం, వలలతయారీవంటి అనేక గ్రామీణ ఉపాధి కార్యక్రమాలు ఈ ప్రణాళికలోని కొన్ని అంశాలు.

శారదాపురి గ్రామ ప్రజలకోసం 95 ఇండ్లకూ ఒక్కొక్క ఇంటికి 450 రు. ల ఖర్చుతో సెప్టిక్ మరుగుదొడ్ల నిర్మాణంకూడా సమితివారు పూర్తిచేశారు. ఇందుకయిన ఆర్థికవ్యయం అంతా హైదరాబాద్ రామకృష్ణమఠం భరించింది. గ్రామీణప్రజలకు ఎవరింటికి వారికి ఈ రకం సెప్టిక్ మరుగుదొడ్లు నిర్మించడం దేశంలో ఇదే ప్రథమం.

గ్రామీణప్రజల స్వయం ఉపాధి కల్పనల కోసం 40 మందికి 16,850 రూపాయల ఋణసహాయాన్ని స్థానిక కెనరాబ్యాంకువారు ఈనాడు అందజేశారు.

స్వామి రంగనాథానందజీవారు గ్రామీణులనుద్దేశించి మాట్లాడుతూ ఆరోగ్యము, విద్య - ఈ రెండూ చాలా ముఖ్యం అని నొక్కిచెప్పారు. తమ పిల్లలందరూ చదువుకొనేటట్లు చూడవలసినదని, తమ పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకోవలసిందని ఆయన గ్రామప్రజల నుద్బోధించి సచ్ఛీలం పెంపు చేసుకోవలసిందిగా ప్రబోధించారు.

అదేరోజు సాయంత్రం స్థానిక శ్రీ భావనారాయణస్వామివారి దేవాలయంలో స్వామి రంగనాథానందజీ ఒసంగిన ఉపన్యాసం అనేకవేలమందిని ప్రభావితం ఒనర్చింది. శ్రీ రామకృష్ణ, శారదాదేవి, వివేకానందుల దివ్య జీవితసందేశముల గురించి స్వామివారు తమ సహజమనోహరరీతిలో ప్రసంగించారు. గుడిలోఉన్న దేవునికి మ్రొక్కడమేకాక, మన కళ్ళయెదుట నడయాడే మానవరూపంలోఉన్న మాధవుణ్ణి అర్చించాలని ఆయన ప్రబోధించారు. కారుణ్యం, దయ, ప్రేమ మన జీవితాలలో ప్రతిబింబించాలి అని ఈవిషయంలో శ్రీ శారదామాత జీవితం అత్యంత ఆదర్శనీయమని స్వామి చెప్పారు. సనాతనధర్మం అనుసరిస్తే ఏ తగాదాలూ ఉండవని స్వామి వెల్లడించారు. మధ్యయుగాల కాలంలో మూఢత్వంవల్ల చోటు చేసుకొన్న అస్పృశ్యత, వరకట్నంవంటి దురాచారాలను మనం విడచిపెట్టి, సర్వసమానత్వమును చాటిచెప్పే సనాతన ధర్మసందేశాన్ని అనుసరించాలని ఉద్బోధించారు. సనాతనధర్మం పట్ల ఈనాడు విదేశాలలో వెల్లివిరుస్తున్న ఆదరణను గూర్చి ముచ్చటించి, ఆ సనాతనధర్మమే ఈనాటి దేశసమస్యలన్నిటిని సమ్యక్పరిష్కార మార్గమని ప్రవచించారు.

## శ్రీ రామకృష్ణ సేవాసమితి, తిరుపతి నివేదిక

తిరుపతి సేవాసమితి ఆహ్వానమును పురస్కరించుకొని స్వామి రంగనాథానందజీ తిరుపతిలో నవంబరు 6 నుండి 14 వ తేదివరకు వివిధసభలలో 6 ఉపన్యాసాలు గావించారు. శారదామఠమునుండి ప్రవ్రాజిక అజయప్రాణ, ప్రవ్రాజిక తపస్యప్రాణ డిసంబరు 8 వ తేదీన సమితిని సందర్శించారు. ప్రవ్రాజిక అజయప్రాణ ఆ సందర్భంలో రెండు ఉపన్యాసాలు గావించారు.

# కొయిలాండి (కేరళ) శ్రీరామకృష్ణ ఆశ్రమము - విన్నపము

సుమారు 480 ఏండ్లకు పూర్వము యూరప్ నుండి సముద్రయానమున ఆఫ్రికా ఖండమును చుట్టుకొని భారతదేశతీరమును చేరిన ప్రప్రథమ నావికుని పేరు మీకు తెలిసినదే. అతని పేరు వాస్కోడగామా. వాస్కోడగామా మెట్టిన కేరళ సముద్రతీర ప్రాంతమే కొయిలాండి. ఇక్కడ 1914 వ సంవత్సరములో ఒక భక్తుడు దానముగా ఇచ్చిన 90 సెంట్ల భూమిలో స్వామి నిర్మలానందజీ మహారాజ్, శ్రీరామకృష్ణ ఆశ్రమమును ప్రారంభించినారు. ఇది ఇప్పుడు కాలికట్ శ్రీరామకృష్ణమఠమునకు అనుబంధ శాఖగా కార్యక్రమములను నిర్వహించుచున్నది. ప్రస్తుతము స్వామి చిదంబరానందజీ ఈ ఆశ్రమ కార్యకలాపములను నిర్వహించుచున్నారు. మత ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యకలాపములతో బాటు వివేకానంద అధ్యయన సమాజము, గ్రంథాలయము, అంతర్యోగ కార్యక్రమములు, రామకృష్ణ బాలగోకులము, జయంతి ఉత్సవములు మొదలగునవి ఈ యాశ్రమము నిర్వహించుచున్నది. ఈ ఆశ్రమ భవనము ఇప్పుడు చాల శిథిలావస్థలో ఉన్నది. అది నేలకూలు పర్యంతము చూచుచు ఊరకుండుట మంచిది కాదను తలంపుతో స్వామి చిదంబరానందజీ నూతన భవననిర్మాణమునకు సన్నాహములు చేయుచున్నారు. మూడున్నరలక్షలరూపాయల వ్యయముతో ప్రార్థనామందిరము, వసతిగృహము, డిస్పెన్సరీ, లైబ్రరీ, బాలవిహారము - ఇవన్నియు చేరియుండునట్లు ఒక నూతన భవనమును నిర్మించదలచినారు. ఇందు నిమిత్తము నిధిసేకరణకు పూనుకొని విరాళములకై భక్తులను అభ్యర్థించుచున్నారు. 10,000 రూపాయలకు పైన విరాళముల నిచ్చిన వారల పేర్లను ప్రత్యేకముగా శిలాఫలకములపై చెక్కి భవనమునకు అమర్చబడును. 1000 రూపాయల దానమును ఇచ్చిన వారి పేర్ల పట్టికను సహితము శిలాఫలకమున లిఖించి అమర్చబడును. ఈ సందర్భమున ఒక సావనీర్ ను కూడ ప్రచురించవలచియున్నారు. పారిశ్రామికులు, వర్తకులు మొదలగువారు ఈ సావనీర్ కు ప్రకటనలనిచ్చి కూడ సహాయము చేయవలసినదిగా విన్నపము. కొయిలాండి ఆశ్రమము, శ్రీరామకృష్ణమఠము - మిషన్ శాఖ కనుక ఈ ఆశ్రమమునకు ఇచ్చెడి విరాళములపై ఆదాయపు పన్ను లేదు. చెక్కులు, డ్రాఫ్టులు పంపువారు రామకృష్ణ ఆశ్రమము, కాలికట్, కొయిలాండి పేరున పంపవలెను.

ఇట్లు,

స్వామి చిదంబరానంద, మేనేజరు
స్వామి విపాప్మానంద, ప్రెసిడెంట్
శ్రీరామకృష్ణ ఆశ్రమము,
స్వామి వివేకానందరోడ్డు, మేలూరు పోస్టు,
కొయిలాండి (Quilandy)
కాలికట్ జిల్లా - 673 305

# శ్రీ రామకృష్ణ ప్రభ

## విషయసూచిక



**గమనిక:—స్థలాభావంచే ఈసంచికలో బాలల రామకృష్ణ ప్రచురించలేదు**

## శ్రీ రామకృష్ణ ప్రభకు

### చందాదారుగా చేరండి - చందాదారులను చేర్పించండి

**ధన్యవాదాలు :** శ్రీ రామకృష్ణప్రభకు చందాదారులను చేర్పించవలసినదిగా కోరుతూ సుమారు 30 మందికి లేఖలు వ్రాయగా ఐదారుమందినుండి మాత్రమే సమాధానంగా ఇతోధికసహాయం లభించింది. వారందరికి మా ధన్య వాదాలు. మాజీవీడునుండి ఒకరు, తెనాలినుండి ఒకరు పెద్దసంఖ్యలో చందాదారులను చేర్పించుటకు కంకణము కట్టు కున్నట్లుగా తెలియజేసియున్నారు. వారెవరను సంగతి తరువాత తెలియజేస్తాము.

**సు (స్వీయ) వార్త :** సంపాదకుడు + ప్రూఫ్ రీడర్‌గా పనిచేస్తున్న ఏకైకవ్యక్తిమాత్రమే చదువుతున్న పత్రికలలో ఇది ఒకటియా యనే సందేహాన్ని అపాస్తం చేస్తూ కొన్ని లేఖలు ఇప్పుడు వస్తున్నాయి. ప్రభ ఆకర్షణీయ మైన అంశాలతో కూడి ఉన్నదని, స్థాయి (Standard) ఇప్పుడెంతో మెఱుగుగా ఉన్నదని చెప్తూ లేఖలు వస్తున్నాయి. సంతోషము. రచనలవల్ల కొంత ప్రయోజనం కూడ పాఠకులకు కలుగుచున్నట్లు ఒక లేఖద్వారా తెలిసినది. అక్టోబరు సంపాదకీయం చదివినవాళ్ళు కొందరు ధూమపానాన్ని వదలిపెట్టారని ఆ లేఖ తెలియజేసింది. పాఠకులలో ఈ మార్పు నమ్మదగిన విషయం కాకపోయినా ఆ లేఖను పట్టి ముఖస్తుతి యని కొట్టివేయడానికి వీలు లేదు. నమ్మవలసిన లేఖ యది. ప్రతి పాకెట్టుమీద "Cigarette smoking is injurious to health" అని హెచ్చరిక ఉన్నా లక్ష్యపెట్టని "జీవ న్ముక్తులలో" కొందరిలోనైనా మార్పు వచ్చినందులకు సంతోషము. ఈ సంచికలో అన్నపరెడ్డి వేంకటేశ్వరరెడ్డి రచనను పాఠకులకు అందించుటకు సంతోషిస్తున్నాము. ఇకమీదట వరుసగా ఈయన రచనలు రామకృష్ణప్రభలో వస్తుంటాయి. ప్రభకు ఒక వైవిధ్యం, క్రొత్తదనం ఆపాదింపగల రచనలు చేయుటలో ఈయన సమర్థులు. ఫిలాసఫీ, సైకాలజీ, సోషియాలజీ, లిటరేచర్ - అన్నిటిలో మంచి ప్రవేశమున్న రచయిత.



# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవబంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహా విష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర స్థలము సముద్రమట్టానికి మూడువేల అడుగుల ఎత్తున, ఆంధ్రప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణముతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పుచుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలుస్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్‌ల నుండి, తిరుపతికి బస్సులుకూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధరాత్రివరకు బస్సులు రెండు కొండ దారులమీదుగా మిమ్ములను తిరుపతినుండి తిరుమలకు తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొనవచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన అన్ని సౌకర్యములతో కూడివున్న దేవాలయపు ధర్మసత్రములు, అద్దె వసతిగృహములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, కపిలేశ్వర స్వామివార్ల దేవాలయాలను, తిరుచానూరులోనున్న పద్మావతీ అమ్మవారి దేవాలయము యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయము, నారాయణవనములోని శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయము, నాగలాపురంలోని వేదనారాయణ స్వామివారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

శ్రీ స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవకార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన తక్కిన వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.






మోక్షార్థం జగద్ధితాయ చ

సంపుటము 39 1982 - మార్చి సంచిక 3


మంత్రాలూ కీర్తనలూ జపాలూ విడిచిపెట్టు.
తలుపులన్నీ బంధించి, ఈ గుడి చీకటిమూల వొంటరిగా
ఎవరిని పూజ చేస్తున్నావు?
కళ్ళు తెరిచి చూడు,
నీ ఎదుట ఈశ్వరుడు లేడు.
ఎక్కడైతే గట్టినేలని రైతు దున్నుతున్నాడో,
ఎక్కడ బాట వెయ్యడానికి కూలీలు రాళ్ళు కొడుతున్నారో,
అక్కడ ఈశ్వరుడు ఎండలో వానలో
దుమ్ముకొట్టిన బట్టలతో వాళ్ళ మధ్యన తిరుగుతున్నాడు.
నీ మడిబట్టలు అవతల పెట్టి
అతనివలనే నువ్వూ దుమ్మునేలమీదికి రా!
మోక్షమా? ఆ మోక్షమనేది ఎక్కడ వుందయ్యా?
మన ప్రభువే సంతోషంగా
ఈ సృష్టి బంధనాన్ని తనపైని వేసుకున్నాడు.
శాశ్వతంగా మనతో తానూ కట్టుపడివున్నాడు
నీ పుష్పాలూ, ధూపాలూ, దూరాన పెట్టి
నీ ధ్యానంలోంచి బైటికి రా!
నీ బట్టలు చిరిగి మరకలైతే, ఇంతలో వొచ్చిన ముప్పేమిటి?
నుదుటి చమటతో కష్టించి, కృషిలో అతని ప్రక్కన నిలబడు.

-చలం తెనిగించిన గీతాంజలినుండి

# పూర్ణకాముడు బుద్ధుడు

దానప్ప

రోమన్‌సామ్రాజ్యం; అలెగ్జాండర్-ది గ్రేట్ సాధించిన సామ్రాజ్యం; మొన్నటిదాకా వెలిగిన 'రవి అస్తమించని' బ్రిటిష్ సామ్రాజ్యం; ఇలా ఎన్నో సామ్రాజ్యాలు వెలిశాయి, సమసిపోయాయి. ఎన్నో నాగరికతలు తలలు పైకెత్తాయి, వంగిపోయాయి. వాటికి పూర్వమూ భారతదేశమున్నది; వాటి పెంపులోనూ ఉన్నది; వాటి అంతం తర్వాత కూడ ఉన్నది; భావిలో కూడ ఉంటుంది. భారతదేశం అనేక సంస్కృతులను చూసింది. అనేక రాజ్యాధిపత్యాలను గమనించింది. ఏ సంస్కృతి కానీ, ఏ రాజ్యాధిపత్యం కానీ, భారతదేశపు స్వభావాన్ని, సంస్కృతిని ఏమాత్రం చలింపజేయలేకపోయాయి. పర్వతాన్ని తాకిన మట్టిరాయిలా అవి స్వయంగానే చూర్ణమైపోయాయి. నేడు వెఱ్ఱితలలు వేస్తున్న పాశ్చాత్య నాగరికతకు కూడా భావిలో ఇలాంటి దశే పడుతుంది. అది తప్పదు. దాని సూచనలిప్పుడే చాలా కనబడుతున్నాయి. ఒకప్పుడు భారతదేశపు జీవన పద్ధతుల్ని నాగరికతను హేళన చేసిన ఆ పాశ్చాత్యులే, నేడు తమ సంస్కృతిలో శాంతి కానక, ఆ శాంతిసుఖం కోసం, ఆ మానసిక ప్రశాంతత కోసం భారతదేశం తరలి వస్తున్నారు. ఆధ్యాత్మికతతో రంగరింపబడిన భారతదేశపు నాగరికతను అనుసరించటానికి సంసిద్ధులౌతున్నారు. ఇదే భారతదేశ సంస్కృతిలో నున్న విశిష్టత. సహనం, గాంభీర్యం, సహృదయత; ఇవి భారతదేశ సంస్కృతికి ప్రధాన ద్వారాలు. మాతృమూర్తి లాంటిది భారతదేశపు సంస్కృతి. తన చనుబాలు తాగి, పెరిగి, ఆ స్తనాన్నే తన్నే కొడుకు చర్యను సహిస్తుంది. సమయం కోసం దీక్షగా, ఓర్పుగా ఎదురు చూస్తూ గాంభీర్యం వహిస్తుంది. కాలాంతరంలో అనేక ఆటుపోటులకు గురై, పశ్చాత్తాపచిత్తుడై తిరిగి చెంతకు వస్తే, ఆ కొడుకును సహృదయంతో ఒడిలోకి తీసుకొని ఓదారుసుంది.

ఇదీ భారతదేశపు సంస్కృతి. ఈ సంస్కృతి కోసం ఎందరెందరో మహానుభావులు, సమయం - సందర్భం పిలిచినప్పుడెల్లా అవతరించి, పునః పునః దాన్ని పటిష్ఠం చేశారు. అలాంటి మహాత్ముల్లో గౌతమబుద్ధుడు ఒకానొక విశిష్టకార్యం కోసం అవతరించినట్టి పుణ్యపురుషుడు.

ఆ పుణ్యపురుషుడొకానొక బోధివృక్షం క్రింద కూర్చున్నాడు. స్థిరాసనం వేసి, శరీరాన్ని నిశ్చలనం చేసి, దృష్టిని బాహ్యం నుండి అంతరంలోకి దింపి, స్తంభీభూతుడై కూర్చున్నాడు. అతని దృష్టి దేనికోసమో తీవ్రంగా గాలిస్తున్నది. లోనికి, లోనికి, మరింత గాఢమైన లోతులకు చొరబడి, ధైర్యంగా సాగి, అన్వేషిస్తూ పోతున్నది. ఇతని సత్యాన్వేషణ చూసి "మారుడు" సహించలేకపోయాడు. లోకమంతా తన చెప్పుచేతల్లోనే ఉండాలన్నది అతని తీవ్రకాంక్ష. తను అందించే అసత్య ప్రపంచంలోనే అందరూ తపించి పోవాలని అతని ఇష్టమైన అభిలాష. తన ఏలుబడినుండి ఒక్కడంటే ఒక్కడు కూడ సత్యాన్వేషణకై పోయాడంటే చాలు, అతను నిలువెల్లా క్రోధంతో మండిపోతాడు. ఆ అన్వేషిని నాశనం చేయంటే అతనికిక నిద్రపట్టదు. బుద్ధునిపై కాదు కాదు-గౌతమునిపై కూడ ముట్టడి జరిపాడు

మారవనితలు గౌతముణ్ని ఆక్రమించారు. తియ్యని కూతలు కూశారు. మెత్తని అరుపులు అరిచారు. గళ్ళుగళ్ళుమంటూ గజ్జెల చప్పుళ్ళు చేశారు. కంచు ఘంటలు చెవులు చిల్లులు పడేలా మ్రోగించారు. అయినా గౌతముడు చలించలేదు. హోరుమంటూ సముద్రంలా ఘోష పెట్టారు. సింహంలా భీకర గర్జనలు చేశారు. అయినా గౌతముని దృష్టి, లోనికే పోతున్నది. భీకరమైన ఆకారాలు ధరించారు. సుందరమైన రూపాలు చూపారు. కోరలతో కొరుక్కుతినేలా మీది మీదికి వచ్చారు. సుకోమల-సుందర-పీన స్తనయుత నగ్నశరీరాలతో కౌగలించుకోటానికి ప్రయత్నించారు. అయినా గౌతముని ధ్యానం సడలలేదు. మారవనితలు పరాజయంతో సిగ్గుపడి, తలలు వంచుకొని, దిక్కులుపట్టి పారిపోయారు. మారుడు కోపంతో పండు పటపటలాడించాడు. ప్రకృతి ఉయ్యాలలా ఊగిసలాడింది. భూమి కంపించింది. పంచభూతాలు భయానకంగా సంచలించాయి అయినా గౌతముని స్థిరత్వం తగ్గలేదు. అతని దృష్టి గమ్యాన్ని చేరువకు చేరింది మారుడు భయంతో గజగజ వణికిపోయి ఒకే ఒక [illegible]లేసి, తోక ముడిచి, పారిపోయాడు. ప్రకృతి శాంతించింది. ప్రశాంతం వ్యాపించింది. పక్షులు మధురంగా కూశాయి. అంతరంగంలో వెలుగుతున్న దివ్యప్రకాశం గౌతముని దృష్టికి గోచరమైంది. దివ్యజ్ఞానంలో అతను మునిగిపోయాడు.

"తెలిసింది. మానవుల దుఃఖానికి కారణమేమిటో తెలిసింది" అంటూ పైకి లేచి నిలబడ్డాడు. "మానవుల సర్వదుఃఖాలకు కారణం ఆశ. ఈ ఆశను జయించిన నాడు, మానవునికి పరమశాంతి లభిస్తుంది. ఈ విషయం ప్రపంచమంతా చాటి చెబుతాను" అంటూ బుద్ధుడు బయలుదేరాడు. గౌతముడుగా వచ్చి తన చెంత కూర్చొని, బుద్ధునిగా వెళుతున్న ఆ జ్ఞానిని, సర్వలోక శ్రేయోభిలాషిని చూసి ప్రకృతి మాత ఆనందంతో మందహాసం చేసింది.

ఔను. ప్రతిమానవుడు కూడ గౌతమునినుండి బుద్ధునిగా పరిణతి చెందవలసిందే: తన పరిణామాన్ని (evolution) ను చివరి వరకూ కొనసాగించవలసిందే; అదే బుద్ధుని జీవితంలోని సందేశం. పూర్ణకామత్వం సాధించి, ఆశను నిర్జించిన నాడు ప్రతిమనిషీ ఒక బుద్ధ డౌతాడు. ఆశను నిర్జించటం, పూర్ణకామత్వం సాధించటం గూర్చే ఈ వ్యాసం, బుద్ధుని జీవితపు మార్గదర్శకత్వంలో చర్చించబోతోంది.

సర్వజీవులు పరిణామదశలోనే ముందుకు సాగుతున్నాయి. భూమి అట్టడుగున సున్న బీజం నుండి వెలువడి, భూమిని చీల్చుకొని వృక్షాలు, లతలు సైతం ఊర్ధ్వానికే గమిస్తున్నాయి. ఎక్కడో చిన్న పాయగా పుట్టిన నదులు పెరిగి, సాగి, విశాలమై, విశాలతరములై, మునుముందుకే గంతులేస్తూ సాగిపోతున్నాయి. ప్రకృతిలోని ప్రతి పదార్థం నూతన వికాసం వైపే పరుగులిడుతున్నది.

అలాంటప్పుడు మనిషి మాత్రం ఎందుకు పురోగమించ కూడదూ-జీవశాస్త్రజ్ఞుడైన డార్విన్ పరిణామవాదసిద్ధాంతం ప్రకారం చూసినా, మనిషికి పురోగమనమే కాని, తిరోగమనం సరికాదన్నది తెలుస్తున్నది. అతని సిద్ధాంతం ప్రకారం జీవులు క్రమపరిణతిని నొందాయి. ఒక దశలోకి చేరి, దాన్నుండి క్రమంగా మరో దశలోకి పరిణమించాయి. ఏకకణజీవినుండి, ద్వికణజీవులు, బహుకణ జీవులు, జలచరాలు, భూచరాలు, ఉభయచరాలు, ద్విపాదులు, చతుష్పాదులు-ఇలా జీవి క్రమపరిణతి చెందుతూ చివరికి కోతి దశకు రాగానే, మహోన్నతమైన మానవజాతికతిచేరువలోకి పరిణమించి వచ్చాడు. ఈ కోతిదశనుండి జీవి క్రమంగా మానవ జాతిలోకి వికసించాడు. ఈ పరిణామవాద సిద్ధాంతం గూర్చి అటు పాశ్చాత్యుల్లోను ఇటు భారతీయ పండిత శాస్త్రజ్ఞుల్లోనూ చాలా విమర్శలు బయలుదేరినప్పటికీ ఒక్కటి మాత్రం ఎంతో స్పష్టంగా కనబడుతుంది-అదే, వికాసం. జీవియొక్క కర్తవ్యం కేవలం వికసించటమే: మొగ్గనుండి పువ్వుకు, పువ్వునుండి పిందెకు, పిందెనుండి కాయకు, కాయనుండి పండుకు పరిణమించి, తన గమ్యం చేరుకోవటమే: డార్విన్ సిద్ధాంతంలో ఒకసరి పరిణతి చెందిన జాతి, మరిక పూర్వపు దశలోకి పోదు; పైగా అది మరొక నూతన జాతిలోకి వికసిస్తుంది, ఇతని సిద్ధాంతమంతా కేవలం ప్రకృతిని, బాహిక క్రియలను పరిశీలించటం ద్వారా వెలువడిన కారణంగా మన వేదాంతపరమైన సంస్కారాలు, వాసనలు, కర్మఫలాలు, జన్మలు - ఇవేవీ ఆ సిద్ధాంతానికి ఆధారాలు కాలేకపోయాయి. వీటి గూర్చి ఆ శాస్త్రజ్ఞునికి తెలుసుకోవలసిన అవసరము లేకపోయింది. అవకాశమూ లేకపోయింది. అయినా అతని సిద్ధాంతం జిజ్ఞాసువులకెంతో ఊతను కల్గించింది.

అతను సీతాకోకచిలుక పరిణామాన్ని మొదట్నుండి గమనించాడనుకుందాం. దాని అంతిమదశకు, దాని పూర్వదశలకు ఎలాంటి సంబంధం ఉండదు. గ్రుడ్డు, పురుగు, గొంగళిపురుగు, నిద్ర, ఆ తర్వాత అకస్మాత్తుగా ఒక క్రొత్త నూతనస్వరూపంతో రెక్కలతో అది సీతాకోకచిలుకగా తయారై రివ్వుమంటూ పూలచెట్లవైపు పరిగెత్తడం - ఈ దశలన్నీ డార్విన్‌ను మొదట తికమకపెట్టియుంటాయి ఈ అంతిమదశకు, తత్పూర్వదశలకూ ఎలాంటి సంబంధం కన్పించలేదు. ఈ సత్యాన్ని గూర్చి అతడెన్నిసార్లు ఎంత దీక్షతో పరిశోధించాడో; ఇలాంటి పరిశీలనల ఆధారంగానే అతను ప్రకృతినంతా జీవులదశలనన్నీ అధ్యయనం చేసి తుదకు తన ఎవొల్యూషన్ థియరీని ప్రవేశపెట్టాడు. అతనికంతా పరిణమించడమే, వికసించటమే గోచరించింది కాని, వికసించిన జీవి మరల పూర్వపుదశలోకి తిరోగమించటం కనపళ్ళేదు. అందుకే అతను మానవుని పరిణామం, దగ్గరి పోలికలుగల కోతినుండి గల్గిందని చెప్పాడు. చూశారా; అతనెంతకీ వికసించటమే ప్రధానోద్దేశంగా ఈ సిద్ధాంతాన్ని లోకానికి చాటాడు. మరి కోతినుండి పరిణమించిన మనిషి దివ్యత్వంవైపు మానవాతీత దశవైపు పరిణమించకూడదా? పరిణమించాలి. అదే డార్విన్ ఆశయం. అదే మన భారతీయ సనాతనధర్మం యొక్క ఆశయం.

మరైతే పరిణమించడంలో మనిషికడ్డుపడేదేమిటీ? కామనలు-దిగువ యోనుల్లో నున్నట్టి కామనలే: ఈ కామనలే మనిషి పురోగతికి అడ్డు తగులుతుంటాయి. ఈ కామనలే ఇక్కడ మార-మారవనితలుగా దర్శనమిచ్చారు. ఈ మారునికి, మనిషికి నిరంతరం పోరాటం. సాధారణంగా మనిషి మారునికి బానిసైయుంటాడు. కనుక ఈ పోరాటం కనబడదు. కాని మనిషి ఎదురు తిరిగినప్పుడు మాత్రం ఈ యుద్ధం బహిర్గతమవుతుంది. మనిషికున్నన్ని కోరికలు మరేతరజీవికుండవు. పశు పక్షి మృగ క్రిమికీటకాది సర్వజీవులకు కూడ ఉండే కోరికలు పరిమితమైనవే. ఆకలి వేసినప్పుడింత తిండి, దాహం వేసినప్పుడు కాస్త నీరు, భయం వేసినప్పుడు కొంత రక్షణయత్నం, నిద్ర వచ్చినప్పుడు పడుకోవటం, ఋతుకాలం సమీపించినప్పుడు (సహజ)మైథున సుఖం - ఇంతకు మించి వీటి కెలాంటి కోరికలుండవు. అసలు వీటివి కోరికలు అని అనలేము కూడ. వీటిని అవి కోరుకోవటం లేదు. అవి సహజసిద్ధంగా వాటికి సంక్రమించియున్నాయి. వాటిగూర్చిన

గ్రహణకూడ వాటికుండదు. ఏదో, ఎవరో నడిపించినట్లు అవి వాటిని యాంత్రికంగా చేస్తుంటాయి.

కోరికకు మూలం సంకల్పం. సంకల్పం చిత్తంలో పుడుతుంది ఈ చిత్తమనేది మనిషి యోనికి మాత్రమే నిర్మితమై యున్నది. దిగువజాతి జీవులకీ చిత్తం లేదు. అంటే వివేచనాశక్తి లేదు. అందుకే కదా బలంలోను, ఆకారంలోను తనకన్నా అధికశక్తి, పుష్టిగల సింహం ఏనుగులాంటి జీవాలను ఐదున్నరారడుగుల మనిషి తన ఆధిపత్యానికి లోబరచుకుంటున్నాడు. ఆ శక్తి ఎక్కడిదీ? ఈ చిత్తంలోని వివేకశక్తియే! ఈ చిత్తం లేనప్పుడు సంకల్పం లేదు. సంకల్పం లేనప్పుడు కోరికా లేదు. అలాటి స్థితిలో అవి జీవన్ముక్తులేకదా అని అనవచ్చు. కాదు. అవి ముక్తి సాధిస్తేకదా, జీవన్ముక్తులయ్యేవి! తమ స్థూలస్థితే తెలియని ఆ జీవులు, దేనిమీద ముక్తి సాధిస్తాయి? తాము దేహధారులమని, తమ కొకఫలానా దేహముందని, తమ దేహం ఫలానా విధంగా ఉంటుందని, ఈ మాత్రం జ్ఞానం కూడా వాటికుండదు. అవి అంత గాఢతమస్సులో యంత్రపుబొమ్మల మాదిరి పడియుంటాయి. ఈస్థితిని మనం నేడు అభివృద్ధి చెందుతున్న హిప్నాటిజం ద్వార అనుభవించవచ్చు. హిప్నాటిక్ ఎక్స్‌పీరియన్స్‌ను ముక్తి అనటానికి వీలుందా?

చూడండి, తన ప్రతిరూపాన్ని చూసే కుక్క మొరుగుతుంది. తన నీడను నీటిలో చూపి కోతి కిచకిచమని వెక్కిరిస్తుంది. తమ దేహధ్యాసే లేని ఇవి ఆత్మధ్యాసకెలా పరిణమిస్తాయి? ఆ పరిణామం, దేహధ్యాసగల మానవులకే సాధ్యం. నిజానికి మానవశరీరపు అసలు కర్తవ్యం ఇదే! దేహధ్యాసనుండి ఆత్మధ్యాసకు పరిణమించటం. బోధివృక్షం క్రింద బుద్ధునికి జరిగినస్థితి ఇదే! అంతక్రితమతనికి తన దేహం గూర్చిన ఆలోచనయే యుండేది. దేహధ్యాస వీడితేగాని, పరమశాంతిదాయకమైన ఆత్మధ్యాస లభించదన్న సంగతి వైపు అతనిదృష్టి పోలేదు. దేహధ్యాసను వదలకుండానే అదేదో సాధిద్దామని ప్రయత్నించాడు. ముందుగా దేహాన్ని కఠినమైన నియమాదినిష్ఠలకు గురిచేశాడు. అన్నపానీయాలందించక శుష్కింపజేశాడు. అయినా దేహచింతన మాత్రం వదలదే!? కొన్ని సంవత్సరాల ఆ వ్యర్థప్రయత్నాన్ని విరమించి ఆలోచించాడు. అప్పుడతనికి మార్గం తెలిసింది. ఔను, తాను ఒకచోట నిలబడే గంతులు వేస్తున్నాడు - ప్రయాణం సాగదు కదా! గమ్యం ఎలా చేరుతాడూ? తాను వేయవలసిన అడుగులు పరిణామక్రమంలో ఉండాలి. పూర్వపు స్థలాన్నధిగమించి, అడుగు ముందుస్థలాన్నాక్రమించాలి. తాను దేహచింతనలోనే యుంటూ, దేహాన్ని అధిగమించాలనుకొంటున్నాడు. ఎంత వెఱ్ఱితనం తనదీ? ఇది కాదు మార్గం. తాను దేహాన్ని దాని మానాన దాన్ని వదిలేసి, ముందుకు సాగిపోవాలి. దేహం తర్వాత ఉన్నదేమిటీ? ఈ మనసే. అంటే ఈ మనసును చేరాలి. దాన్ని కూడ అధిగమించాలి.

బుద్ధునిలోని ఈ పరిణామం క్రమంగా అతనికి పరమశాంతిని చేకూర్చింది. కేవలం బుద్ధుడొక్కడే కాదు, ప్రతిమనిషీ ఆ పరమశాంతిని చేరాలి. దేహధ్యాస అనే బిందువునుండి గమించి, పరిణమించి, ఆత్మధ్యాస అనే బిందువును చేరాలి. ఈ రెండు బిందువుల మధ్యలోనే మారుని ప్రతాపం విజృంభిస్తుంది. ఈ మారుడు, అతని బలగం మనిషి జీవితంలో ఎప్పుడు తటస్థపడతారూ? జన్మ మొదలు మరణపర్యంతం ఇవి మనిషిని నానావిధరూపాల్లో అంటిపెట్టుకునే యుంటాయి. మాయ అని, అజ్ఞానం - అవిద్య - తమస్సు - అంధకారం - మోహం - మూఢత్వం అని ఇలా ఎన్నెన్నో పేర్లతో ఈ మారప్రతాపాన్ని పేర్కొన్నది మన భారతీయ జ్ఞాన వైజ్ఞానిక ఆధ్యాత్మిక సాహిత్యం.

జన్మమొదలు మరణపర్యంతం, మారుని వ్యాపారాలు తటస్థపడినప్పుడెల్లా, వాటిని నిర్లక్ష్యం చేసి, వాటియడల ఉదాసీనత వహించి, వివేకంతో యుక్తిగా వాటి బారినుండి తప్పించుకుని మనిషి పురోగమించాలి. హనుమంతుని సముద్రలంఘన విషయం దీన్నే ప్రస్ఫుటీకరిస్తుంది. బుద్ధుని జీవితం కూడ దీనిగూర్చే చెబుతుంది. జన్మకు మరణానికి మధ్య ఎంత తేడా ఉందీ? స్థూలంగా అయితే ఈ తేడా వయో పరిమితితో నిర్ణయింపబడుతుంది. సూక్ష్మంగా క్షణకాలంకంటే అతి తక్కువ తేడా కనబడుతుంది. చిత్తంలో సంకల్పం కలగటం అది నశించటం జన్మమరణాలు. మరొక సంకల్పం మరొక జన్మ. అలాగే శరీరరీత్యా, రక్తకణాలు తయారవ్వటం నశించటం ఇదొక జన్మమరణం. ఇలా జన్మమరణాలు క్షణ క్షణం సంభవిస్తూనే యున్నాయి స్థూలమైన ఒక జన్మమరణాల్లోనే మనం అనేకానేక జన్మమరణాలు పొందుతున్నాము. కనుక ఈ జన్మమరణాల మధ్య ఉత్పత్తయ్యే సంకల్పాలను ఉపేక్ష చేస్తే, మరొక సంకల్పం ఉదయించదు. అంటే మరొకజన్మ లేదన్న మాట. అదే జీవన్ముక్తి. ఒక సంకల్పమే మరో సంకల్పాన్ని జనింపజేస్తుంది. నిశ్చలమైన తటాకంలో చిన్న రవ్వ వేసిన వెంటనే ఒక తరంగం పుడుతుంది. అది మరొక తరంగ జననానికి కారణమవుతుంది. ఇలా తరంగాలనేకాలు జనిస్తాయి. ఒక్క సంకల్పమే, అనేక సంకల్పాలకు కారణమవుతుంది.

సంకల్పానికి ఆధారం కోరిక. కోరిక, సంకల్పం ఇవి రెండు అవినాభావసంబంధం కలవి. ఒకటున్నదంటే మరొకటి తప్పకుండా ఉండి తీరుతుంది. కనుక సంకల్ప జయం కల్గాలంటే కోరికను జయించక తప్పదు. ఈ కోరికలు సాధారణమైన పరిధిలోనే మనిషిని బంధించి, అతని పరిణామాన్ని ఆపుచేస్తాయి. ఆకలి, నిద్ర, భయ, మైథునాదులనే సర్వజీవ సహజవృత్తుల పరిధులలోనే, మనిషిలో కోరికలు జనిస్తాయి. జంతువుల్లో ఇవి యాంత్రికచర్యలని ఇదివరకే చెప్పుకున్నాం. కాని మనుషుల్లో, ఇవి యాంత్రిం చర్యలుకాక సంకల్పిత చర్యలుగా ప్రస్ఫుటమౌతాయి.

ఆకలిబాధ జంతువులకూ మనిషికీ సమానమే. కాని ఆకలి తీరటానికి దానికి ప్రకృతి సిద్ధంగా లభించిన భోజనంతో జంతువు తృప్తిపడుతుంది. మనిషి ఆలా తృప్తిపడడు. కేవలం ఒక్క ఆకలి తీరటం కోసం తన పంచేంద్రియాలు తృప్తిపడే విధంగా భోజనసామగ్రిని కోరుకుంటాడు. కనులకు విందుగా, వీనులకు పసందుగా, నాసికకు సువాసనగా, జిహ్వకు రుచిపచిగా, స్పర్శకు సుఖకరంగా, ఇలా ఒక్క తిండిలోనే పంచేంద్రియ సుఖానుభవం కోరుకుంటాడు. ఇంతకుమించి కోరుకొనే మనుషులు కూడా ఉంటారు. ఆహా! మనిషి కామానికి ఎంత బానిసో కదా! జఠరాగ్నిని చల్లార్చటం కోసం ఇంతన్నం ఇస్తే సరిపోయే దానికి ఇంతింత ఆడంబరమా! ఈ ఆడంబరాలు నిద్రాది ఇతర కోరికల్లో కూడ చోటు చేసుకొంటాయి.

శుద్ధోధనమహారాజు తన కుమారుడైన బుద్ధుని భవిష్యత్ వాణి ముందే విని, తగు జాగ్రత్తలు గైకొంటాడు. కొడుకు ఎక్కడ విరాగి అయిపోతాడో అన్న భయంతో అతన్ని సర్వేంద్రియసుఖాల్లోనే చిన్నప్పటినుండీ ముంచెత్తుతాడు. షడ్రుచిసమేతమైన దివ్యభోజ్యాలు కల్పిస్తాడు. కాని ఆత్మధ్యానకు పరిణమించవలసిన గౌతమునికివి ఆకర్షణీయాలు కావు. అతను మరేదో ఆశిస్తుంటాడు. హంసతూలికాది తల్పాలు, శయనాగారాలు, సంగీతనృత్యగానాదులు, దాసదాసీజనం వింజామరాదిసేవలు - ఇలా నిద్రించే నిమిత్తం ఏర్పాటు చేస్తాడు. నిద్రించే సమయంలో దృక్కుకు సుందరంగా రమణీయంగా కల్పించేందుకు అందమైన యువతులనే అక్కడ వినియోగిస్తాడు. కటకటా! ఎంత దిగజారిపోతున్నాడీ మనిషి! నిద్రించేందుకు ఇవన్నీ కావాలా, ఇవేవీ లేకుండా నిద్రించటం లేదా ఎవ్వరూ? బుద్ధుని కివేవీ నిద్రకు సాధనలు కాలేకపోయాయి. అతనికి నిద్రాసమయంలో సైతం, మరెక్కడికో, మరెక్కడికో పోవాలన్న తపన ఉండేది. వికసించే పుష్పం తన్ను కప్పిపెట్టిన ఆకుల్ని సైతం బలవంతంగా త్రోసివేసైనా వికసించి తీరుతుంది గాని, తెగిపోయిన మొగ్గలా తన వికాసాన్ని ఆపుకోదు. బుద్ధుడుగా పరిణమించవలసిన గౌతమునికి నిద్రాది సుఖరూపాల్లోనున్న ఈ మారవృత్తులు ఎలా అడ్డుకుంటాయి?

కపిలవస్తు రాజ్యాధిపతి, శాక్యవంశజుడైన శుద్ధోధన మహారాజు తన పుత్రరత్నాన్నెలాగైనా లౌకిక ప్రవృత్తి పరునిగా దిగలాగాలని విశ్వప్రయత్నం చేశాడు. విజ్ఞులనెంతోమందిని సంప్రదించాడు. గౌతముడిలా ఉదాసీనుడై ఎందుకుంటున్నాడు? అతనికేం కావాలి? - 'మైథున సుఖం' అన్న సమాధానం వచ్చింది. 'వయసులోకి ఎదిగినవారి దృష్టి మైథున సుఖం వైపుంటుంది. సిద్ధార్థునికి వివాహం చేయండి' అన్న పరిష్కారం అందింది.

సర్వనాగరికతలకు మూలం ఈ మైథున సుఖవాంఛయే కదా! జంతువులకన్నా, మనిషికి కామవాంఛ అధికం. ఈ కామవాంఛ వల్ల మనిషి మనిషికి మధ్య సంఘర్షణలు చెలరేగకుండా ఉండేందుకే వ్యవస్థలేర్పడ్డాయి. నియమాలేర్పడ్డాయి. సంఘాలేర్పడ్డాయి. ఇంకా చెప్పాలంటే చిన్న చిన్న కులాలు, తెగలు, జాతులు, వంశాలు మొదలు పెద్ద పెద్దవిగా పేర్కొనబడుతున్న చాతుర్వర్ణవిధానాలు, చతుర్విధ ఆశ్రమాలు ఏర్పడ్డాయి. అన్నీ ఈ కామవాంఛ వల్ల మనిషి ఎదుగుదల ఆగిపోకుండా ఉండేందుకే ఉద్దేశింపబడినట్టివి. ఉమ్మడి కుటుంబవ్యవస్థ కూడ ఈ కోవలోదే! మనిషి కేవలం కామవాసన యందే నిరంతరం మునిగిపోకుండా, దాన్ని అవతలికి నెట్టి యితర విషయాలు కూడ ఆలోచించేందుకే ఇవి ఏర్పడ్డాయి. కాని నేడు ప్రబలుతున్న వ్యష్టికుటుంబాలు మాత్రం కేవలం కామవాంఛను కేంద్రంగా గొనే ఏర్పడుతున్నాయి. ఈ విధంగా నేడు మనకు కనబడుతున్న సంపూర్ణమైన సభ్యత, సామాజికత అంతా ఈ కామవాంఛను కేంద్రంగా గైకొని ప్రవర్తిల్లిం దనవచ్చు.

మనిషికి స్వేచ్ఛానిర్ణయం ఇవ్వటం మూలంగా అతను మైథునచర్యకెప్పుడుబడితే అప్పుడే పూనుకోసాగాడు. ఇది కూడదనంటే చాలు, ఘర్షణ మొదలైందన్నమాటే! ఈ మైథునవాంఛ కారణంగానే అనేక గొప్ప గొప్ప యుద్ధాలు చెలరేగాయి. హెలెన్ ఆఫ్ ట్రాయ్ అందుకో తార్కాణం. రామాయణ, మహాభారతాదులకు కీలకస్థానం ఈ మైథున కాంక్షయే అంటే అతిశయోక్తి కాదనుకుంటాను. దీని వల్ల అనేక అనర్థాలు ఏర్పడుతున్నాయి; మనిషి మైథున సుఖానికి అడ్డులేని, ఘర్షణలకు కారణం కాని విధానాలందుకే అమలులోకి వచ్చాయి. ఆ కారణంగానే వివాహ

వ్యవస్థ ఏర్పడింది. మొదట్లో ఇది బహుభర్తృత్వం, బహు భార్యత్వంగా ఉండేది. ఒక స్త్రీగాని, ఒక పురుషుడుగాని, ఎంతమందినైనా వివాహరూపంలో గ్రహించేవారు. ఈ పద్ధతి వల్ల అనేక దురాచారాలు, సుఖవ్యాధులు ప్రబల సాగాయి. దానితో మనిషి ఈ మైథున అనుభవం విషయంలో అనేక సర్దుబాట్లు. సంస్కారాలు చేసుకున్నాడు. చివరికి ఒక పురుషునితో ఒక స్త్రీ; ఒక స్త్రీతో ఒక పురుషుడు మాత్రమే ఉండాలని, ఆ స్త్రీ మరొక పురుషుణ్ని, ఆ పురుషుడు మరో స్త్రీని కన్నెత్తి చూడరాదని నియమించుకొన్నారు. తన మైథునవాంఛ ఎంత అధికంగా ఉన్నాసరే, దాన్ని ఆ ఒక్క పురుషుని లేదా స్త్రీద్వారా మాత్రమే అనుభవించాలి, తృప్తిపడాలి అన్న నిశ్చయంతో ఆ మైథున కాంక్షకు ఒక అవధి ఏర్పరిచారు.

దానితో సాంఘికంగా కొంత శాంతి ఏర్పడింది. మనుషుల జీవితాలు సంఘర్షణలు లేకుండా సాగిపోసాగాయి. అయితే ఈ మైథునపరమైన కోర్కె మాత్రం మనిషిలో చల్లారలేదు. వేశ్యాగృహాలంటూ ప్రత్యేకంగా వెలిశాయి. కామవాంఛాపూరితులంతా రసికులన్న పేరుతో విటవర్గంగా కూడి వాటిని పోషించసాగారు. వారవనితలంటూ ఒక ప్రత్యేక కన్యలజాతి ఏర్పడింది. వారు నిత్యకన్నియలు. సంఘంలో వీరి వృత్తి, కోరివచ్చిన ప్రతిపురుషుని మైథున వాంఛను తృప్తిపరచటం. అక్కడక్కడా అతిరహస్యంగా కులస్త్రీలు, దాంపత్యంలో కావలసినంత స్పర్శాసుఖం పొందలేని స్త్రీలు, పురుషులవెంతకు వెళ్ళటమో, లేదా పిలిపించుకోవటమో చేసేవారు. ఇది బహిరంగ రహస్యంగానే ఉండేది. ఆధునికకాలంలో కాల్‌గరల్స్, ప్లేబాయ్స్‌ల వార్తలు ఎక్కువగానే చెవిన బడుతూనే ఉంటున్నాయి! అయ్యో! ఈ మైథునవాంఛ, అత్యంత సునిశిత వైజ్ఞానిక యుగపు మానవుణ్ని కూడ ఎంత దిగువకు లాగేసింది!! ఇంతింతై అన్నట్లుగా ఈ మైథునకాంక్ష ఇలా అనేక శాఖలుగా విస్తరిల్లింది. కేవలం ఈ మైథునసుఖం కారణంగానే స్టార్ హోటళ్ళలో కేబరేలు వెలిశాయి. నైటుక్లబ్‌ల పేరిట స్త్రీ నగ్నప్రదర్శనలు సాధికారకంగా ప్రదర్శిత మవుతున్నాయి. ప్రభుత్వ అనుమతి లేని ప్రాంతాల్లో రహస్యంగా కొనసాగే ఇలాంటి చర్యలు అప్పుడప్పుడు వెలుగులోకి వస్తున్నాయి. కొన్నింట్లో స్త్రీ సంభోగం, పురుష సంభోగం కూడ కల్పింపబడుతుంటాయి. అవి అందరికీ అందుబాటులో ఉండవు కనుక చాలామంది కేవలం భావాత్మకమైన మైథున సుఖం కోసమే ఈ ప్రదర్శనలకు వెళుతుంటారు. భావాత్మకమో. స్పర్శాత్మకమో ఏదైతేనేం, మైథునవాంఛ మాత్రం వెఱ్ఱితలలు వేస్తున్నదనేది, అది మానవబాహ్య, ఆంతరిక వికాసానికి ఎంతో అడ్డు తగులుతున్నదనేది మాత్రం స్పష్టం. దీన్ని ప్రాతిపాదికగా గొని బ్లూఫిల్మ్‌లన్న పేరిట డబ్బు కక్కుర్తికి లోబడి స్త్రీ పురుష మైథున చర్యలను తెరపై ప్రదర్శిస్తున్నారు. కేవలం దృశ్యరూపాత్మకమైన మైథునవాంఛను అనుభవించటం కోసం మనుషులు వీటికై ఎంతగా ఎగబడుతుంటారో వేరే చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. నేడు వెలువడుతున్న (చౌకబారు) నవలా సాహిత్యంలో కూడ ఈ మైథునాన్ని కేంద్రంగా స్వీకరించి, పుంఖాను పుంఖలుగా నవలలంటూ బజారులోకి వస్తున్నాయి. యువతీయువకులు మొదలు, జీవితమంతా అనుభవించిన వృద్ధులు సైతం వీటిని బఠాసీల్లా నమలి పారేస్తున్నారు. ఏ వారపత్రిక చూసినా, అందులో ప్రకటనల రూపంలో. విషయాంతర్గత రూపంలో నగ్నమైన స్త్రీ బొమ్మలు, మన్మథవిలాసాలు, స్త్రీ సంభోగపరమైన వర్ణనలు విపరీతంగా గోచరిస్తున్నాయి. సెక్స్‌ఎడ్యుకేషన్, ప్రేమ, అనురాగబంధం ఇలా ఏవేవో గొప్పగొప్ప పదాలగారడీతో నేటి నవలలు వీటిని కప్పిపుచ్చటానికి ప్రయత్నిస్తున్నాయి. బూతు పుస్తకంలోని లైంగికవిలాసాలు బూతు; కాని అవే నవలలో ఉంటే, అది ప్రేమః

హే భగవాన్! సంఘం ఏమైపోతోంది? ఒకవంక గగనాంతరాళంలోకి మనిషి వికసిస్తున్నట్లు కనబడుతున్నా, ఇదేమిటీ, కేవలం ఒక్క మైథునవాంఛను అదుపులో పెట్టుకోలేకపోతున్నాడే ఈ మానవుడు! మైథునవాంఛ ఇంత బలీయమైందా?

బలీయమైందనే కపిలవస్తు నగరాధిపతి నమ్మకం. ఎంతటివారైనాసరే ఈ మైథునసుఖం ద్వార లౌకిక ప్రవృత్తిలోకి దిగజారక తప్పదని అతని గాఢవిశ్వాసం. అందుకే ప్రబలమైన ఈ కామానికి లతను బుద్ధుణ్ని గురిచేశాడు. అతిలోక సుందరియైన 'యశోధరా' అనే కోమలాంగిని తెచ్చి కట్టబెట్టాడు భార్యారూపంలో! గౌతమునికి తనకు కావల్సింది దొరికిందన్న భ్రమ ఆమె సాంగత్యంలో జనించింది. మారుని యొక్క ఈ కామప్రవృత్తి నిజంగా శక్తివంతమైందే సుమా! అందుకే అతనిని 'కామః' 'కాముడు' అని ముద్దుగా పిలుస్తారు. గౌతముడా భ్రాంతిలో పడి సుగుణవతి, సుశీల, సుందరాంగి, అనుకూలవతి అయిన అర్ధాంగితో రోజులు హాయిగా గడపసాగాడు. తండ్రికి సంతోషం వేసింది. గండం తప్పిందనుకున్నాడు. గౌతముణ్ని ఈ మూఢత్వంలోనే ఉంచకపోతే విరక్తుడైపోయే ప్రమాదముందనుకున్నాడు. దానికనుగుణంగా మైథునసుఖభోగాల కవరోధం కలగకుండా,

నధిగమిస్తున్నప్పటికీ, మానవవిజ్ఞానం నేడు మానవజాతి నాశనానికి కారణమయ్యే న్యూట్రాన్‌లాంటి బాంబులకు, మారణాయుధాలకు నిలయమైపోయింది. ఏ మూలనుంచి మారణక్రియ దాడిచేస్తుందో తెలియక ప్రపంచమానవుడు క్షణక్షణం భీతితో ఆందోళితుడౌతున్నాడు. మరొకవంక దయాతత్వం నశించి, ప్రేమతత్వం నశించి, అధికాధిక జనం ఆకలిమంటలకు బలైపోతుంటే, అవినీతిపరులు హాయిగా నవ్వుకొంటూ జల్సాలు చేసుకొంటున్నారు. మని షిని క్షణక్షణం భయానికి గురిచేసే, మనిషికి కనీస అవస రాలు సైతం తీర్చలేని ఈ వైజ్ఞానిక ప్రగతి ఎందుకూ? ఎవరికోసం?

మనిషి బుద్ధి పెరిగింది, కాని వివేకం నశించింది. నేటి యుగానికి మరల ఒక బుద్ధుడు రావలసిన అవసరమెంతైనా ఉంది. వెఱ్ఱిమొఱ్ఱి కోర్కెల వలలో చిక్కి తనను తాను నాశనం చేసుకోబోతున్న ఈ వైజ్ఞానిక మానవునికి కామజయం, భూతదయ, అహింస, సోదరమానవధర్మం, ప్రేమతత్వం బోధించేందుకు మరల ఒక బుద్ధుడు వికసించి రావలసి ఉంది.

ఆ బుద్ధుడు మీరే ఎందుక్కాకూడదూ? ఆ వికాసం మీలోనే ఎందుకు జరగకూడదూ? ఉత్తిష్ఠత జాగ్రత! లేచిరండి. సాహసించండి. వికసించండి. బుద్ధత్వం పొందండి.





## శ్రీరామకృష్ణ సేవామండలి, రెంటచింతల నివేదిక

మా సంస్థనుండి మా పరిసర గ్రామాలకు శ్రీ రామకృష్ణపరహంసవారి శారదామాతవారి శ్రీ వివేకానందస్వామివారి వాఙ్మయము విస్తరింపచేయ సంకల్పించి సదరు సంస్థకు స్థిరాస్తిగా 15 యెకరముల భూమి ఖరీదు చేసినాము. ప్రస్తుతము శ్రీరామకృష్ణ గురుకులము పేరుతో ఒక విద్యాలయము ఈ సంవత్సరము జూన్ నెలలో శ్రీ నందానందస్వామిజీ మహారాజ్ వారి ద్వారా ప్రారంభించినాము. శ్రీ రామకృష్ణ బాలవిహార్ (అనాథ శరణాలయము) కూడా ప్రారంభించినాము. శ్రీరామ కృష్ణ గురుకులమునకు వచ్చే జూన్ నెలలో సదరు స్థలములో బిల్డింగు కట్టుబడి చేయుటకు ఏర్పాటుచేయనున్నాము. ప్రస్తుతము ఈ స్కూలుకు 5 లక్షలు కావలెనని అంచనా వేసియున్నారు. శ్రీరామకృష్ణ గురుకులమునకు కావలసిన ద్రవ్యము భక్తులద్వారా విరాళములు కోరబడుచున్నవి. విరాళముల యిచ్చిన దాతలపేర్లు శిలాశాసనముల మీద చెక్కబడును. ధర్మము చేయు దాతలకు ఇన్‌కంటాక్సు ఎగ్జమ్షన్ కూడా కలదు.

వై. సుబ్బరామయ్య, సెక్రటరీ,
శ్రీరామకృష్ణ సేవామండలి, రెంటచింతల.



# నిత్య జీవితంలో పొరపాట్లు ఎందుకు దొర్లుతాయి?

అన్నపరెడ్డి వేంకటేశ్వరరెడ్డి

ఉదయం నిద్ర లేచింది మొదలు సాయంత్రం పండుకోబోయే వరకు మనం నిర్వహించే నిత్య కృత్యాలలో ఎన్నో పొరపాట్లు దొర్లుతుంటాయి. ఈ తప్పులను మనం చెయ్యాలని చెయ్యం. మన అభీష్టానికి వ్యతిరేకంగానే అవి జరుగుతుంటాయి. నోరు జారాలని మనకుండదు. అయినా ఒకటి మాట్లాడబోయి వేరొకటి మాట్లాడుతుంటాము. అలాగే అవతలివాడు చెప్పింది మనకు మరో విధంగా వినిపిస్తుంది. ఆ తరవాత "మీరు చెప్పింది నాకు అలా వినిపించింది. ఏం చేయమంటారు?" అంటాము. అలాగే, వ్రాసేటప్పుడు అక్షరాలు జారవిడుస్తాము. చదివేటప్పుడు అక్కడ ఒకటి ఉంటే మరొకటి చదువుతాము. తరచు జరిగే మరొక తప్పిదం: పెట్టిన వస్తువులు సమయానికి కనిపించక పోవడం. ఒక్కోమాటు ఎదురుగా ఉన్న వస్తువులే కనిపించవు. బొడ్లో తాళంచెవులు పెట్టుకొని ఊరంతా వెదకడం మనకు తెలుసు. చెవులో పెన్సిలు పెట్టుకొని దానికోసం వెదికే గుమాస్తా, నొసటిపైకి ఎగదీసి ఉంచిన కళ్ళజోడు కొరకు వెదికే ప్రొఫెసర్ల సంగతి మనకు తెలుసు. హడావుడిగా సినిమాకు బయలుదేరేటప్పుడు, ఇంటికి తాళం పెడదామంటే, అది కనిపించదు. చెప్పులు కనిపించవు. ప్రయాణం తొందరలో, అన్నీ జాగ్రత్తగా సర్దుకొన్నామనుకొన్నా, తీరా చూస్తే, ఏదో ఒకటి మరిచిపోవడం జరుగుతూనే ఉంటుంది. తరవాత, మనకు బాగా తెలిసిన వ్యక్తిపేరో, ఊరు పేరో నోట్లో ఆడుతుందేగాని బయటికి రాదు. ఆ పేరుకు బదులు అలాంటి మరికొన్ని పేర్లు గుర్తుకు వస్తాయి.

కొన్నిసార్లు ఏ తప్పూ దొర్లకుండ ఉండాలని అతి జాగ్రత్త వహిస్తాము. అయినా తప్పు దొర్లుతుంది. ఉత్తరం పోస్టులో వెయ్యాలని గట్టి నిర్ణయం తీసుకొని కూడ పోస్టు చెయ్యడం మరిచిపోతాము. ఎవరూ బంగారపుటుంగరం పారవేసుకోవాలనుకోరు. అందులో ప్రియుడిస్తే, ఆ ఉంగరాన్ని పారవేసుకోవాలని ఏ యువతి కుంటుంది? అయినా అలా ఉంగరాన్ని పోగొట్టుకొన్న సంఘటనలు అనేకం. ఇంతవరకు నేను ఏకరువు పెట్టిన పొరపాట్లను, జన సామాన్యం, మామూలుగ పట్టించుకోదు. విషయం మరీ ముఖ్యమైతేనో, నష్టం పెద్దదైతేనో లేక అది మరీ అవమానకరంగా ఉంటేనో అప్పుడు వాటిని గురించి ఆలోచించడం జరుగుతుంది. మిగతా అన్ని సందర్భాలలోను, "ఏదో యాదృచ్ఛికంగా జరిగిందిలే"- అని కొట్టి పారవేస్తుంటాము. సరైన శ్రద్ధ వహించకపోవడం వల్ల, ఒళ్ళు దగ్గర లేకపోవడంవల్ల, అలసటవల్ల, మనస్సు మరోచోట లగ్నమై ఉండడంవల్ల ఈ పొరపాట్లు దొర్లాయికాని, అంతకంటె లోతైన కారణం ఏమీ లేదని సరిపెట్టుకొంటాము. ఇవి పాక్షిక కారణాలు, దోహదకారులు మాత్రమే అంటుంది ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్రం. బాగా తెలిసిన ఒక వ్యక్తిపేరో లేదా ఊరిపేరో జ్ఞప్తి చేసుకోవడానికి, తీవ్రంగా నొసలు బొమముడి వేసి ఆలోచిస్తుంటాము. అయినా ఆ పేరు గుర్తు రాదు. ఇక్కడ మనం అలసిపోయి ఉన్నామనిగాని, శ్రద్ధ లేదనిగాని, మనస్సు ఎక్కడో ఉన్నదనిగాని ఎవరైన అనగలరా?

నిత్య జీవితంలో దొర్లే ఇలాటి అనేక పొరపాట్లను ఫ్రాయిడ్ నిశితంగా పరిశీలించాడు. ఫ్రాయిడ్ సత్కార్యవాది. అంటే "ప్రపంచంలో, కారణం లేకుండ ఏదీ జరగదు" అని

అతని నమ్మకం, అందుకని మనం యాదృచ్ఛికాలని కొట్టి పారవేసే "ఈ అల్ప దోషాలకు సైతం కారణం ఉంది; ప్రతి పొరపాటు వెనుక ఒక సంకల్పం ఉంది; ఉద్దేశం ఉంది" అని సిద్ధాంతీకరించాడతడు. అంతెందుకు మనం బురదలో కాలుజారి పడడానికి, ఎదురుదెబ్బ తగిలి తూలి పడిపోవడానికి వెనుక ఒక ఉద్దేశం ఒక కారణం ఉన్నాయన్నాడు ఫ్రాయిడ్.

అయితే ప్రతి పొరపాటు వెనుక ఒక ఉద్దేశం ఉంటే, మనం చేసే పొరపాట్లన్నీ ఉద్దేశపూర్వకంగానే చేస్తున్నామన్నమాట. మరి ఉద్దేశపూర్వకంగా ఎవరైనా పొరపాట్లు చేస్తారా! దీనికి మన వ్యావహారిక జ్ఞానం ఒప్పుకోదు. విషయాన్ని ఇంకొంత లోతుగ పరిశీలిస్తేగాని వ్యావహారిక జ్ఞానానికి ఫ్రాయిడ్‌కు మధ్య ఉన్న వైరుధ్యాన్ని పరిష్కరించలేము. దీనికిగాను మనం ముందుగ కొన్ని వాస్తవదృష్టాంతాలను పరిశీలించాలి.

ఒకసారి ఒక పార్లమెంటు అధ్యక్షుడు సభా ప్రారంభం గావిస్తూ, "మహాశయులారా! ఈ సభను సమాప్తి చేస్తున్నాను" అన్నాడు. అతడు "సమారంభం చేస్తున్నాను" అనబోయి "సమాప్తి చేస్తున్నాను" అన్నాడు. ఈ పొరపాటును అర్థం చేసుకోవడానికి మనకు ప్రకరణాదిక జ్ఞానం (Relevant Knowledge) కావాలి. అంటే అతడు ఏ పరిస్థితుల్లో ఈ తప్పు చేసిందీ తెలియాలి. ఆ సమావేశం వల్ల ఏమీ ప్రయోజనం ఉండదని ఆ అధ్యక్షుడు ఎంతో కాలం నుంచి అనుకొంటున్నాడు. అయినా ఆ మాట బయటికి అనకూడదు. కాని అతని అభీష్టానికి వ్యతిరేకంగా అది బయటపడనే పడింది. సభను ప్రారంభించాలనే నిర్ణయం, దానివల్ల ప్రయోజనం ఉండదనే విశ్వాసం-ఈ రెండు మానసిక ప్రక్రియలు. అంటే ఈ రెండు మానసిక సంకల్పాలు ఒకదానితో ఒకటి జోక్యం చేసుకోవడంవల్ల ఒకదానిని ఒకటి అడ్డుకోవడంవల్ల ఈ పొరపాటు దొర్లింది. ఈ పొరపాటు జరుగుతున్నప్పుడు తనలో ఉన్న వ్యతిరేక సంకల్పం అతనికి తెలుసు. అసలు ఇలాంటి వ్యతిరేక సంకల్పం ఉన్నట్లు తెలియకుండానే పొరపాట్లు జరిగే సందర్భాలున్నాయి.

ఒకసారి ఒక జర్మన్ యువతి గొప్పకళాకారుడైన తన బావతో రోమ్‌కు సందర్శనార్థం వెళ్ళింది. రోమ్‌లో స్థిరపడ్డ జర్మన్ జాతీయులు, ఆ కళాకారుని సన్మానించి ఒక బంగారు ముద్రికను బహూకరించారు. ఆ బంగారుముద్రిక చాల బాగుంది. అయినా ఆ కళాకారుడు దానిని మెచ్చుకోవలసినంతగా మెచ్చుకోలేదు. ఇది ఆమెను బాధించింది. చిరాకు వేసింది. ఇంతలో ఆ కళాకారుని భార్య రోమ్ రావడంతో, మరదలు తిరిగి జర్మనీ వెళ్ళిపోయింది. ఇంటికి చేరిన తరవాత మూట ముల్లె విప్పింది. ఆశ్చర్యం! తన సామానులలో ఆ ముద్రిక ఉంది. తన సామాన్లలోకి అదెలా వచ్చిందో ఆమెకు తెలియదు. పొరపాటున తెచ్చాననుకొంది. అమాయకంగా తెచ్చిన ఆ ముద్రికను వెంటనే పంపిస్తున్నానని బావగారికి ఉత్తరం వ్రాసింది. తీరా పంపవలసి వచ్చేసరికి ఆ ముద్రికను ఎక్కడ దాచిందీ మరిచిపోయింది. తన ఈ పరధ్యానానికి అర్థం ఏమిటి? ఆ ముద్రికను తిరిగి ఇవ్వాలని లేదన్న మాట. తిరిగి ఇవ్వరాదన్న ఉద్దేశం తనలో ఉన్నట్లు ఆమెకు తెలియదు. ఆమెకు తెలియకుండానే ఆ సంకల్పం ఆమెలో ఉన్నదన్న మాట. ఈ దృష్టాంతంలో తిరిగి ఇవ్వాలనే సంకల్పానికి ఇవ్వరాదనే సంకల్పం ఎలా అడ్డు తగిలిందో చూడండి. అలాగే మనం తీసుకొన్న నిర్ణయాలను అసలుచేయడం మరిచి

పోతుంటాము. మన నిర్ణయానికి వ్యతిరేకంగా, మనలోనే ఉన్న వేరొక సంకల్పం అడ్డుకొంటుంది. అందువల్ల మతిమరపు పొరపాటు దొర్లుతుంది. అందుకనే "అయ్యో నా మతిమరుపు మండిపోను" అంటూ ఉంటారు

ఒకామె తనభర్త ఆదేశంపై మరొకామెను భోజనానికి పిలిచింది. తీరా ఆ రోజు ఆ యువతి భోజనానికి వస్తే, "ఈరోజు మిమ్మల్లను భోజనానికి పిలిచానా?" అంది అమాయకంగా ఆ గృహిణి ప్రకరణానిక జ్ఞానాన్ని బట్టి అతిథి చాలా అందమైన యువతి అని దానికి తన భర్త ఎక్కడ ప్రేమమోహితుడవుతాడోనని గృహిణి భయపడినట్లు

అయిన ఆ అందాల యువతి భోజనానికి రాకుంటే బాగుండునని 'ఆ అంతరంగపు టాలోచన. ఈ అంతరంగ సంకల్పం ఆ యువతిని ఆహ్వానించిన సంగతినే మరిచిపోయేట్లు చేసింది.

ఒకవ్యక్తిపై ద్వేషం ఉన్నా, అతనిపై సద్భావం లేకపోయినా, అతనికి సంబంధించిన వస్తువులను, అతనిచ్చిన బహుమతులను ఎక్కడో పెట్టి మరిచిపోతుంటాము. ఒక యువకుడు తను అత్యంత ప్రాణప్రదంగా చూసుకొంటున్న ఒక పెన్సిలును పారవేసుకొంటాడు. కొద్ది రోజులముందు ఈ పెన్సిలు బహూకరించిన అతని బావ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో "నీ ప్రస్తుత నిర్వ్యాపారాన్ని సోమరితనాన్ని మన్నించి ప్రోత్సహించే సమయమూ ఉత్సుకత లేవు" అని ఉంది.

ఒక యువకుడు ఈ కథ చెప్పాడు: "కొంత కాలం నుంచి నాభార్య నేను ఎడమొహం పెడమొహంగా ఉంటున్నాము. అయినా ఒక రోజు ఆమె నాకు ఒక పుస్తకాన్ని చదవమని ఇచ్చింది. కృతజ్ఞతలు చెప్పి గ్రంథాన్ని చదువుతానని మాట ఇచ్చాను. కాని ఆ పుస్తకాన్ని ఎక్కడో పెట్టి మరిచిపోయాను. ఎంతో వెతికాను ఆ తరవాత కాని కనిపించ లేదు. నెలలు గడిచాయి. ఈ సమయంలో దూరాన ఉన్న మా తల్లి జబ్బు పడింది. ఆమెకు సపర్యలు చేయడం తన బాధ్యత అని చెప్పి మా తల్లి వద్దకు ఆమె వెళ్ళిపోయింది అప్పుడు ఒక్కమాటుగ నా భార్య సహృదయత, మంచితనం నాకన్నులు పొడకట్టాయి. ఆరోజు సాయంత్రం కృతజ్ఞత నిండిన హృదయంతో ఇంటికి వచ్చాను. టేబిల్ సొరుగు లాగాను. ఆశ్చర్యం! ఆ గ్రంథం అక్కడే ఉంది. ఆ సొరుగు నిత్యం నేను ఉపయోగించేదే. ఆ పుస్తకం ఇంతకాలం కనిపించకుండా ఈ రోజు కనిపించింది". ఈ పొరపాటుకు అర్థాన్ని వివరించవలసిన పని లేదనుకొంటాను. మరొక దృష్టాంతం. భర్తపై ధాష్టీకం చేసే భార్య, అతడు జబ్బుపడ్డప్పుడు డాక్టరు వద్దకు వెళ్ళి పథ్యమేమిటో కనుక్కొని తిరిగివచ్చి "నా కిష్టమైనవన్నీ ఆయన తినవచ్చు త్రాగవచ్చును"-అని అంది. "ఆయన కిష్టమైనవన్నీ" అనబోయి, "నా కిష్టమైనవన్నీ" అని అంది. ఆమెకు ఉన్న 'ఆధిక్యతా సంకల్పం' ఈ పొరపాటు చేయించింది. ఇలాంటి నాలుక కరుచుకొనే పొరపాట్లను మహాకవులైనవారు రమణీయకతకోసం నాటకీయతకోసం వాడుకొంటారు. దృష్టాంతంగా, మహాకవి షేక్స్పియర్ వ్రాసిన Merchant of Venice ను తీసుకోవచ్చు. Act. 111 So. 2లో, షేక్స్పియర్ చేయించిన జిహ్వాస్ఖాలిత్యాన్ని, రసనిష్పన్నతకు పరాకాష్ఠగా, సాంకేతికంగా అత్యద్భుతమైన, విశేషంగా విమర్శకులు సర్వత్ర అంగీకరించారు. తండ్రికిచ్చిన మాట ప్రకారం మూడు పేటికలలో సరైన పేటికను

ఎన్నిక చేసుకొన్నవానినే పోర్షియో చేపట్ట వలసి ఉంది. దురదృష్టవంతులు కావడాన ఎంతోమంది వరులు సరైన పెట్టెను ఎంపిక చేయలేకపోయారు. తను మెచ్చిన, తనకు నచ్చిన, ప్రేమించిన, బెసానియో గూడ అందరిలాగే సరైన పెట్టెను ఎంచుకోలేకపోతే తన గతి ఏమవుతుందని భయపడింది. తను అతనిదాననే అని చెప్పాలనుకొంది. మరి అది తండ్రికి చేసిన బాసకు విరుద్ధం. ఈ రకమైన మథన ఆమెలో చెలరేగుతుండగా – షేక్స్ పియర్ ఆమెచేత ఒక పొరపాటు ద్వారా, ఆమె ఉద్దేశాన్ని ఎలా వ్యక్తం చేయిస్తాడో చూడండి: పోర్షియో ఇలా అంటున్నది:

“ఎవరో చెప్తున్నారు నిన్ను పోగొట్టుకోనని; నీకు సరైన మంజూష ఏదో చెప్పగలను; అప్పుడు నాది మిథ్యాశపథమవుతుంది; అందుకని అన్నమాట తప్పలేను; నీవు నన్ను కోల్పోవచ్చు...నీ కన్నులభిశప్తములు గాన, నన్ను దహించి రెండుగా చీల్చినవి; నాలోని ఒక భాగం నీది; రెండవ భాగం ‘నీది’— ‘నాది’ అని నేను అనాలి. మరి నాది అయినదంతా నీదె కదా,” అని ముగిస్తుంది. ఒక భాగం నీది అని చెప్పాక, రెండవభాగం నాది అని చెప్పాలి. కాని పొరపాటున రెండవ భాగం గూడ నీదె అంటుంది. “నాదయినదంతా నీదే”, అని ఆ పొరపాటును సమర్థిస్తుంది. ఈ పొరపాటు ద్వారా పోర్షియో “నేను నీదాననే” అని బెసానియోకు స్ఫురింప [illegible]ది. అటు తండ్రికి చేసిన బాస మీరలేదు. ఇటు తన ఉద్దేశము నెరవేరింది. ఇటువంటి పొరపాటు మహాకవులకు మాత్రమే ం. ఈ పొరపాటు రెండురకాల సంకల్పాల రాజీరూపం.

ఇటువంటి పొరపాటే షిలర్ వాలెన్‌స్టీన్ వ్రాసిన “పికోలోమిని” అనే నాటకం ఒకటవ అంకం ఐదవదృశ్యంలో కానవస్తుంది. మాక్స్ పిలోమిని యువకుడు. అంతకు ముందు యుద్ధం అంటే ముందుకు దూకే ఇతడు, రాజు వాలెన్‌స్టీన్ పక్షాన అత్యుత్కంఠతో “శాంతి వలని లాభాల”ను గూర్చి ఉపన్యాసాలివ్వడం మొదలుపెట్టాడు. రాజుగారి అందాలకూతురితో పయనం సాగిస్తున్నప్పుడే అతనికి శాంతి వలని లాభాలు ఆకస్మికంగా తెలిసివచ్చాయి. పికోలోమిని రంగ నిష్క్రమణం చేస్తుండగా అతని తండ్రి అక్టేవియో, రాజసభసభ్యుడు క్వెస్టెన్‌బర్గ్‌ల మధ్య సంభాషణ ఇలా సాగుతుంది:

క్వెస్టెన్‌బర్గ్ : మిత్రమా అతనిని ఆ భ్రమలో పడి కొట్టుకు పోనిద్దామా? అతనిని మనకు దూరం కానిద్దామా? అతని కన్నులు తెరపించవద్దా?

(ఆలోచననుంచి తెప్పరిలి) నా కళ్లు తెరిపించాడు.

క్వెస్టెన్‌బర్గ్ : ఏమిటి మీరంటున్నది?

అక్టేవియో : అభిశప్తమీ ప్రయాణం.

క్వెస్టెన్‌బర్గ్ : ఏమిటి? ఎందుకని?

అక్టేవియో : మిత్రమా నాతో రా! రా నాతో రా! నేను వెళ్ళాలి వెంటనే ఆ అశుభసంకేతాన్ని అనుసరించాలి. నా కళ్ళతో చూడాలి. నాతో రా!

క్వెస్టెన్‌బర్గ్ : ఏమైందిప్పుడు ఎక్కడకు మీరు వెళ్ళేది?

అక్టేవియో : (కంగారులో) ఆమె దగ్గరకు, ఆమె దగ్గరకు.

క్వెస్టెన్‌బర్గ్ : ఏమిటి మీరనేది?

అక్టేవియో : (నాలుక కరచుకొని) రాజుగారి దగ్గరకు.

ఆక్టేవియో చెప్పాలనుకుంది రాజుగారి దగ్గర కని. కాని అతడు నోరు జారి ఆమె దగ్గరకు అని వేశాడు. రచయిత ఈ పొరపాటును ఆక్టేవియో చేత చేయించడంలో ఉద్దేశం ఏమిటి ? ఆ యువసైనికుడు మార్క్వెసిలోమిని కాంతి ప్రేలాపన వెనుక దాగివున్న ప్రభావాన్ని, అంటే రాకుమారి అందాలమత్తు అతని మీద వేసిన ముద్రను ఆక్టేవియో గుర్తించాడని మనకు తెలియజేయడం.

మనం ఇంతవరకు పరిశీలించిన ఉదాహరణలను బట్టి చూస్తే కొన్ని సందర్భాలలో ఒకే విషయంపై రెండు సంకల్పాలుంటాయని, ఒక సంకల్పం రెండవదానితో ఢీకొనడం వల్ల పొరపాట్లు దొర్లుతాయని, మరికొన్ని సందర్భాలలో అయిష్టత గూడ కారణమేనని తేలుతుంది. కొన్ని భావాలు పైకి చెప్పేవి ఉంటాయి. మరికొన్ని చెప్పగూడనివి ఉంటాయి. చెప్పగూడనివాటిని అణచి పెట్టాలని నిర్ణయం తీసుకొన్నప్పుడే పొరపాట్లు ఎక్కువగా దొర్లే అవకాశం ఉంది. అణచబడిన సంకల్పం, లేదా అయిష్టత, మన అభిమతానికి వ్యతిరేకంగా బయటికి రాజొస్తుంది. ఈ లోపల దీనికి బదులు, ఏదో ఒకటి చెప్పాలనుకొంటాము. అణచబడిన సంకల్పం ఈ సంకల్పాన్ని మార్చిగాని, దీనితో మిళితమైగాని, దీనిని ఆవలికి నెట్టిగాని దీని స్థానాన్ని ఆక్రమిస్తుంది. కొన్నిసార్లు రెండు సంకల్పాలు రాజీపడి కొత్తరూపాలు దాలుస్తాయి. అంటే పొరపాట్లు రెండు సంకల్పాల పాక్షిక ఓటమి-విజయాలకు ప్రతీకలు.

అయితే ఇలా రెండు సంకల్పాలు - ఒకటి అవునని రెండవది కాదని - ఢీకొంటున్నప్పుడు, ఆ రెండింటిలో కాదనే సంకల్పం, మనలో ఉన్నట్లు మనకు తెలుస్తుందా ? దీనికి సమాధానం కోసం మనం ఫ్రాయిడ్‌ని ఆశ్రయించాలి. వ్యతిరేక సంకల్పం కొన్ని సందర్భాలలో తెలుస్తూనే ఉంటుంది - పార్లమెంటు అధ్యక్షుని ఉపన్యాసంలో లాగ. మరికొన్ని సందర్భాలలో అలా తెలియదు - బంగారు ముద్రికను తిరిగి ఇవ్వరాదన్న సంకల్పంలా ఈ వ్యతిరేకసంకల్పం వక్తకు తెలియకుండానే, వక్తలో ఎక్కడ ఉంది ? అతని అచేతనంలో అంటే Unconscious లో ఉన్నదంటాడు ఫ్రాయిడ్. అసలు ప్రాథమికంగా మనఃప్రక్రియలన్నీ అచేతనాలు. మనం చేతనాలని చెప్పుకొనే ప్రక్రియలన్నీ వైయక్తికాలు. మన మానసిక ప్రక్రియల మొత్తాన్ని సముద్రంతో పోలిస్తే, సముద్రం లోపలి నీరంతా అచేతనానికి, పై భాగమైన తరంగాలుమాత్రమే చేతన ప్రక్రియలకు సమానమవుతాయి. కాని మనం ఈ అలల భాగాన్నే 'మొత్తం మనస్సు' అనుకొంటాము. మన చేతనంలో ఎలాగైతే ఆలోచన, అనుభూతి, సంకల్పాలు ఉన్నాయో అలాగే అచేతనానుభూతి, ఆలోచన, సంకల్పాలూ ఉన్నాయి. ఈ అచేతన సంకల్పాదులు తనలో ఉన్నట్లు వ్యక్తికి తెలియవు. ఇలా అచేతన సంకల్పాలు వ్యక్తికి తెలియకుండానే వ్యక్తిలో ఉంటూ అతని చేతన సంకల్పాలను ఎదుర్కొంటున్నాయి; ప్రభావితం చేస్తున్నాయి. అందుకే పొరపాట్లు దొర్లుతున్నాయి.

(ఆలిండియా రేడియో విజయవాడ వారి సౌజన్యంతో)

మనో విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన మరొక రచన "నేటి సమాజంలో కల"
పై సంచికలో ప్రచురింపబడును. రచయిత : అన్నపరెడ్డి వేంకటేశ్వరరెడ్డి

# రాసలీల

కుమారి పి. రాజ్యలక్ష్మి

రావణ సంహారం అనంతరం రాముడు అయోధ్యకు తిరిగి వెళుతూ మహామునులను కలుసుకొని, వారికి ఏదైనా కోరికలుంటే తాను తప్పక తీరుస్తానని, వరం కోరుకొమ్మని అంటాడు. కోటి మన్మథాకారుడైన రామచంద్రుని దివ్య మూర్తిని చూడగానే మునులకు విచిత్రమైన మనోవికారం కలిగి, తమ మనసులో వున్న కోరికను తీర్చమని ప్రార్థిస్తారు. వారి కోరికను విన్న శ్రీరాముడు, తాను వారి కోరికను ద్వాపరయుగంలో కృష్ణావతారమెత్తినప్పుడు తప్పక తీరుస్తానని మాట యిస్తాడు. ఆ మహామునులే ద్వాపరములో గోపికలుగా జన్మ ఎత్తి, 'రాసలీల' ద్వారా తమ కోరికలను తీర్చుకున్నారు.

'రసము' అంటే మనసును రంజింపచేసేది అని అర్థం. రసముతో కూడిన అనుభవము కలది రాసక్రీడ. క్రీడ అనగా మనస్సుకు వుల్లాసము కలిగించేటువంటి ఒక ఆట. ఈ 'రాసక్రీడ' సమయములో జీవాత్మ, పరమాత్మతో కలసి అనంతమైన ఆనందాన్ని అనుభవిస్తుంది.

శరదృతువులో ఒక రాత్రి పిండి ఆరబోసినట్లు వెన్నెల బృందావనాన్ని తళ-తళలాడిస్తున్నది. ప్రక్కనే తరంగాల గల-గల ధ్వనులతో యమున వయ్యారంగా ప్రవహిస్తున్నది. సగం రాత్రి అవుతున్నది. కృష్ణుడు, వేణువు తీసుకొని మెల్ల-మెల్లగా నడుస్తూ యమునా నదీ తీరానికి చేరుకున్నాడు. ఆ పండు వెన్నెలలో నీలమేఘశ్యాముడు, గోపికా మనోహరుడు కదంబవృక్షము క్రింద నిలుచుని వేణువుతో పాట పాడనారంభించాడు. ఆ పాట, వెన్నెల తేటకి తేనెను అప్పిచ్చినట్టుంది. బృందావనములో పువ్వుల తీగలపై విహరిస్తున్న మందవాయువులు, పువ్వుల తావులతో పాటు, ... గానామృతాన్ని కూడ మోసుకుంటూ వెళ్ళి గొల్లభామలకు విందు చేయ సాగింది. వేణుగానం, చెవులకు సోకగానే గోపికలు, మాధవుని కోసం యమునా నదీ తీరానికి చేరుకున్నారు. తనకోసమని తనవారిని సైతం వదలుకొని వచ్చిన గోపికలను ఉద్దేశించి కృష్ణుడు యిలా అన్నాడు—

ఇహి విధి వేద - మారగ సునో।
కపట తజి పతి కరో, పూజా తుమ తియ సునో॥

"'ఓ తరుణులారా! భర్తను మించిన దైవము లేడని, భర్తను భక్తితో పూజించేవారు పతివ్రతలని వేదాలు తెలుపుతున్నాయి కపటాన్ని వదలి మీరు మీమీ భర్తలను పూజించండి. దైవస్వరూపమైన భర్తను వదలి, యిలా నా వద్దకు రావటానికి మీకు సిగ్గు కలగ లేదా? ఇక్కడకు రావటం వలన మీకు లాభించేదేమిటి? భర్త మూర్ఖుడైనా, వృద్ధుడైనా, పతితుడైనా, రోగియైనా అతని పట్ల అనురాగం చూపాలే గానీ, యిలా రావటం చాలా తప్పు కాదా? నా మాట విని మీరు, మీమీ యిళ్ళకు తిరిగి వెళ్ళండి. మీ తల్లి-తండ్రులు, సోదరులు, భర్తలు మీ కోరకు వెదుకుతుంటారు. భర్తను పూజించటంలో వున్న ఆనందం, యిలా అర్ధరాత్రి పూట నా వద్దకు రావటంలో ఏమాత్రం న్యాయం లేదని తెలుసుకోండి' అంటూ కృష్ణుడు వారికి హితవు చెప్పాడు."

కృష్ణుడు ఈ విధంగా మాట్లాడేసరికి ఎంతో ఆనందంతో మధువనానికి వచ్చిన గోపికల ఉత్సాహమంతా నీరు కారినట్లు అయింది.

తుమ పావత హమ మోహన జాహి।
కహా జాయి లైహై హమ వ్రజ యహ దరసవ
త్రిభువన నాహి॥

"కృష్ణా! ఈ విధంగా మమ్మల్ని నిరు

త్సాహపరచి, తిరిగి వెళ్ళిపోమనటం నీకు న్యాయమేనా? రాజీవలోచనుడవైన నిన్ను వదలి, మమ్ములను బృందావనానికి ఎలా వెళ్ళమంటావు? నిన్ను మించిన హితుడు-ప్రియుడు మాకు ఈ సకల లోకాలలో ఎవరూ లేరని నీకు తెలియదా? నీవు వేయి చెప్పు లక్ష చెప్పు మేము తిరిగి వెళ్ళటమనేది జరగదు. మా తల్లి-తండ్రీ, తోడు-నీడ సర్వం నీవే అనుకున్న మమ్ములను ఇలా నిరాశపరచటం నీకు భావ్యమేనా గోపాలా?"

గోపికల మాటలు విని కృష్ణుడు నవ్వి, "ఓ యువతులారా! మిమ్మల్ని పరీక్షించటానికి ఇంత నాటకం ఆడాను. నిశ్చలమైన మీ ప్రేమకు నేను దాసుడినయ్యాను. నా మాటలకు లొంగక నిశ్చలంగా వున్న మిమ్మల్ని చూస్తూ వుంటే నాకు చాలా ఆనందంగా వుంది."

కియో జిహి కాజ తప హోష నారీ।
దేహూ ఫల హై తురత లేహూ తుమ అబ మరీ,
హరష చిత కరహూ దుఃఖ దేహూ డారీ॥

"'ప్రియతమలారా! ఏ కోరిక కోసమై మీరు తపమాచరించారో, దాన్ని ఈ రోజు నేను తీరుస్తాను. రాసనృత్యాన్ని రచిస్తాను. నాతో కూడి మీరు అనంతమైన ఆనందాన్ని అనుభవించండి'. అమృతపు తునకల వంటి ఈ మాటలను వినగానే గోపికల ముఖాలు కమలాలలాగా వికసించుకున్నాయి. నలువైపులా గోపికలు, నడుమ రాధా-కృష్ణులు, చంద్రుని చుట్టూ తారల్లాగా మెరిసిపోసాగారు."

ఘనో మాయీ ఘన - ఘన అంతర దామినీ।
ఘన దామిన్నీదామిని ఘన అంతర, శోభిత హరి
వ్రజ భామిని॥

"మబ్బుల నడుమ మెరుపు తీగలా, మెరుపు తీగల ప్రక్కన మబ్బులా మెరిసిపోసాగాడు నీలమేఘశ్యాముడు. యమునా నదీ తీరం. మల్లిక, మధురమైన సువాసనలను వెదజల్లుతున్నది. గోపికల హృదయాలలో కోరికను మరింతగా రేపుతూ చంద్రుడు తన కాంతిని నలువైపులా ప్రసరింపచేస్తున్నాడు. మృగనయనలూ, గజగామినులూ అయిన గోపికలతో కూడి మాధవుడు, రాసనృత్యం ఆడసాగాడు. గోపికలు ఎంతటి అదృష్టవంతులు కాకపోతే దేవతలకు సైతం అలభ్యమైనటువంటి ఇంతటి ఆనందం ఎట్లు లభిస్తుంది!"

కృష్ణునితో కూడి రాసనృత్యం ఆడుతున్న గోపికలకు భూలోకములో అందరికన్నా తాము గొప్పవారమని గర్వించసాగారు. ఇది కృష్ణుడు కనిపెట్టాడు. వారి గర్వాన్ని అణచటం కోసమని మాధవుడు, రాధతో సహా అంతర్ధానమయ్యాడు. ఆ సమయంలో గోపికలు అనుభవించిన బాధ చెప్పనలవి కాదు. కృష్ణుడు అలా ఎందుకు మాయం అయ్యాడో వారికి అర్థం కాలేదు. కృష్ణుని జాడ తెలుపమని వారు మధువనంలోని ప్రతి అణువణువును బతిమిలాడసాగారు.

కహా థోరీ బన బేలీ కహూ తై దేఖే హై నందనందన।
బూఝహూ ధౌ మాలతీ కహూ తై, పాయే హై తన -
చందన॥

"ఓ లతలారా! మాధవుడు ఎక్కడున్నాడో తెలుపరా? మాలతీ! చందనలేపధారియైన కృష్ణుడు ఎక్కడన్నా కనిపించాడా? ఓ చంపకమా! కాదంబరీ! కుముదినీ! గోపాలుడెందున్నాడో కనీసం మీరైనా తెలుపరాదా! ఓ కమలమా! లక్ష్మీపతియైన విశాలనేత్రుని నీవు చూసావా? ఓ తులసీ! నీ ప్రియతము

డైన నీలమేఘశ్యాముడు నీకైనా అగపడలేదా? ఓ హంస మయూరములారా! కన్నయ్య జాడను మీరైనా తెలుపరాదా?''

ఈ విధంగా గోపికలు ఆర్తులై అనేక విధములుగ విలపించసాగారు. యమునా నదీ తీరం వద్ద కానీ, మధువనమందు కానీ గిరిధారి వారికి కనిపించకపోయేసరికి, గోపికలలో ధైర్యం సన్నగిల్లసాగింది.

తబ నాగరీ జియ గర్వ బఢాయో।
మో సమాన తియ ఔర నహి కోవు, గిరిధర
మై హీ బస కరిపాయో॥

''గోపికలను చూసేసరికి, రాధకు తాను అందరికన్నా చాలా గొప్పదాననే అహం భావం కలిగింది. అంతేకాదు తనను మించిన స్త్రీ ఈ ముల్లోకాలలో లేదని, గిరిధరుడు తన వశం అయ్యాడని, తాను ఏది చెపితే అదే చేస్తాడనీ భావించసాగింది. మాధవుడు తన కోసమనే రాసనృత్యాన్ని రచించాడనీ, తన వంటి తెలివికలదీ, అందమైనదీ ఎక్కడా లేదనీ గర్వపడసాగింది. ఆ ఆనందంతో ఆమె కృష్ణుని, తామరతూడులవంటి తన చేతులతో బంధించింది.''

కహై భామినీ కంత సౌ, మోహి కంధ చఢా వహు।
నృత్య కరత అతి శ్రమ భయో, తా శ్రమహి
మిటా వహు॥

''రాధ, గోవిందుని తన చేతులతో బంధించి 'మాధవా! నృత్యమాడియాడి చాలా అలసి పోయాను. సుకుమారమైన నా పాదాలు నృత్యం చేయటంతో ఎలా కందిపోయాయో చూడు. నన్ను నీ బాహువులతో బంధించి నా అలసటను దూరం చేయవా?' రాధ మాటలకు కృష్ణుడు నవ్వి, 'మన శరీరాలు వేరైనా ప్రాణమొక్కటే అన్నది సత్యమే. కానీ ఎప్పుడైతే 'గర్వం' అనేది ఉద్భవిస్తుందో అక్కడ నేను ఒక్క క్షణమైనా వుండను.' ఇలా అంటూ కృష్ణుడు రాధకు కనబడకుండా మాయం అయ్యాడు.''

జో దేఖై ద్రుమకే తరై, మురఛీ సుకుమారీ।
చకిత భయీ సబ సుందరీ యహ తౌ రాధారీ॥

''గోపికలు, కృష్ణుని కోసం వెతుకుతూ తమాలవృక్షం వద్దకు వచ్చేసరికి, ముఖమంతా వడలి నేలమీద వ్యాకులంగా పడి వున్న రాధ వారికి కనిపించింది. కృష్ణునితో సహా అంతర్ధానమైన రాధ ఈ విధంగా కనిపించటంతో వారి ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది. తెలివి లేకుండా పడివున్న రాధను ఎలా సేదతీర్చాలో వారికి అర్థం కాలేదు. అంతేకాదు రాధను వదలి కృష్ణుడు ఎక్కడికి వెళ్ళాడో వారికి ఎంతకూ బోధపడలేదు. మాధవుడెక్కడని ఎంత ప్రశ్నించినా వారికి రాధనుండి ఎలాంటి సమాధానం దొరకలేదు.''

గోపికలంతా, తమ తప్పు ఏదైనా వుంటే క్షమించి ఒక్కసారి తమకు దర్శనమివ్వమని కృష్ణుని ప్రార్థింపసాగారు.

కృపా సింధు హరి కృపా కరౌ హో,
అవ జానై మన గర్వ బఢా యో, సో జిని
హృదయ ధరౌ హో॥

'''హే కృపానిధీ! మా మీద కృప చూపవా? అజ్ఞానులమైన మమ్ములను గర్వం జయించటంతో కన్నుమిన్ను కానక ప్రవర్తించాము. దాన్ని నీవు మనసులో పెట్టుకోవద్దు. కరుణించి నీ సుందరరూపాన్ని దర్శించే భాగ్యం కలుగజేయి. కృష్ణా! మనసా వాచా కర్మణా నిన్నే నమ్ముకొన్న నీ వారిపై యింతటి కాఠిన్యాన్ని చూపటం నీకు న్యాయమేనా!' పదహారు వేలమంది గోపికలు గర్వాన్ని వదలి తనను యిలా ప్రార్థించేసరికి కృష్ణునికి వారిపై జాలి, ప్రేమ కలిగాయి.''

కృష్ణుడు, గోపికల పిలుపు విని ఆగలేక వారి ముందు ప్రత్యక్షమయ్యాడు. మందస్మితవదనుడైన గిరిధరుని చూడగానే గోపికల ఆనందానికి హద్దు లేకపోయింది. గోపాలుడు తిరిగి రాసనృత్యములోని రసమాధుర్యాన్ని గోపికలకు వివరించాడు. గోపిక ప్రక్కన గోపాలుడు, గోపాలుని ప్రక్కన గోపిక, వారి నడుమ రాధా - మాధవులు రాసనృత్యం చేయసాగారు. ముగ్ధ మనోహరమైన ఆ నృత్యాన్ని తిలకించటానికి దేవతలకు రెండు కళ్ళు చాలలేదు. గగనమంతా దేవదుందుభులతో ప్రతిధ్వనింప సాగింది.

బనావత రాసమండల ప్యారో ।
ముకుటకీ లటక, ఝలక కుండలకీ, విరతత నంద దులారో ॥

"రాసనృత్యం అత్యంత మనోహరంగా సాగుతున్నది. నందనందనుడు నృత్యం చేస్తూ వుంటే అతనితోపాటు, శిఖిపింఛం కూడ అందంగా వివిధ రంగులను విరజిమ్ముతూ, నృత్యం చేయసాగింది. చెవులకున్న మకర కుండలాలు తమ కాంతిని నలువైపులా విరజిమ్మ సాగాయి. వక్షస్థలం మీద ముత్యాల సరాలతో పాటు వనమాల శోభించసాగింది. కృష్ణుడు వేణువు నూదుతూ సృష్టిలోని అణువణువును పులకరింపచేయసాగాడు. ఆ స్వర మాధుర్యానికి ప్రకృతి సైతం వివశురాలయింది. వ్రజాంగనలు రాసము యొక్క రసములో మునిగి తేలసాగారు. ఎంతమంది గోపికలు వున్నారో, కృష్ణుడు అన్ని రూపాలై, అందరికి ఆనందాన్ని కలగచేసాడు."

రాసలీల, వ్రజలీలలన్నిటిలోను మనోజ్ఞము, సుఖదము, రసరూపమైనది. ఆ లీలలందు కృష్ణుడు తన సౌందర్యమాధుర్యముల యొక్క పరాకాష్ఠను ప్రదర్శించాడు. కోటి కందర్పుల దర్పహరణము ఆతని రూపరసమును ఎవరు తమ నయనముల ద్వారా పానము కావించారో, ఆలింగ, పరిరంభణ చుంబనముల ద్వారా ఆ ఆత్మారామునితో రమించారో ఆ గోపికలు మహాభాగ్యవంతులు. ఈ రాసక్రీడ ద్వారా గోపికలు కృష్ణునిలో తాదాత్మ్యం చెందారు.

రాసనృత్యాన్ని వర్ణించి చెప్పటానికి వీలుకాని మహత్తరమైన సన్నివేశం. సృష్టిలోని మాధుర్యమంతా ఏకమైనా 'రాసనృత్యానికి' సరితూగదేమో. అంతటి మనోహరమైన లీలను స్వయంగా చూసి ఆనందించి రచించిన సూరదాసు ధన్యజీవి

.పై సంచికలో 'మధురాగమనం'

## 50 ఏండ్ల సాధన

ముహింక్రై

ప్రయాగలో మొన్న జరిగిన అర్థకుంభ మేళకు హాజరయిన భక్తులలో చెంగల్పట్టు జిల్లాలోని పెనుంబేడు గ్రామవాసి ఎల్లయ్య ఒకడు. నూరేండ్లకొకసారి మాత్రమే వచ్చే సోమవతి అమావాస్య వల్ల ఈ కుంభమేళకు ఒక విశిష్టత ఉన్నదని ఏదో పత్రికలో ప్రకటన చదివి, ఉత్తేజితుడైనాడతడు. అటు తిరుపతి దాటని ఇటు కంచి దాటని అతను అంత దూరం ప్రయాణానికి సిద్ధమయ్యాడు. "సోమవతి అమావాస్య ఏమిటి! దాని విశేషమేమి? ఆ రోజు పాటించవలసిన నియమాలేమి? తెలియజేయగలరు" అని ఆ ప్రకటన చేసిన పత్రికాసంపాదకునికి లేఖ వ్రాశాడు ఎల్లయ్య ప్రయాణానికి ముందు, "ఈ పంచాంగవిష

యాలు నాకు తెలియదు. పంచాంగ పండితులెవరినైనా అడిగి మీ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోండి'' అని జవాబు వచ్చింది. "ఈ సోమవతి అమావాస్య రహస్యం తెలుసుకొనేలోపల మళ్లీ సోమవతి అమావాస్య వచ్చేట్లుందే'' అని అనుకొని అతను ఆ రహస్య భేదన ప్రయత్నం విరమించుకొని ప్రయాణానికి సిద్ధమయ్యాడు. ప్రయాగ చేరాడు. త్రివేణీ సంగమంలో మునకలు వేసి లేచాడు. ఒడ్డు చేరాడు అనుకోని విధంగా అక్కడ అతనికి అతని బాల్యమిత్రుడు కొండయ్య కనిపించాడు. కొండయ్య 50 ఏండ్ల ముందు ఇల్లు వదిలిపెట్టి మాయమైపోయాడు. అప్పుడతణ్ని నలుమూలల వెదకినవాళ్ళలో ఎల్లయ్య కూడ ఒకడు. కాబట్టి ఇప్పుడతని ఆశ్చర్యానికి అంతులేదు "కొండా!" అని అరిచి పిలిచాడు. (50 ఏండ్ల తరువాత గుర్తించడం సాధ్యమా అని ప్రశ్నిస్తే మన కథ సాగదు. కాబట్టి వాళ్ళిద్దరూ ఒకరినొకరు గుర్తించినారని అనుకుందాం). కొండయ్య వెనుదిరిగి ఎల్లయ్యను గుర్తించి అతని దగ్గరకు వచ్చి "ఇప్పుడు నా పేరు కొండయ్య కాదు. నేను కట్టుకున్న గుడ్డలు నీకు కనపడడం లేదా? ఎందుకలా ఆ పాత పేరుతో అరిచి పిలిచావు. ఇప్పుడు నా పేరు స్వామి శ్రీహరినామామృతాస్వాదనానందసరస్వతి'' అని అన్నాడు. ఎల్లయ్య అప్పుడన్నాడు కదా: "నీ పేరు చెప్పడంకన్నా సోమవతి అమావాస్య రహస్యం తెలుసుకోవడం సులభం అనిపిస్తుంది నాకు. సరే ఇక కొండా అని పిలువను. హరీ అంటాను. నీవు గ్రామం వదలి 50 ఏండ్లయింది కదా! ఇప్పుడైనా తిరిగి రావచ్చుకదా? ఇన్నేండ్లు సాధనలు చేశావు. వచ్చి మాకేదైనా మార్గం చూపరాదా?'' అన్నాడు. "నేనింకా సాధనలు మొదలుపెట్టలేదు'' అన్నాడు శ్రీహరిసరస్వతి. "ఐతే ఈ 50 ఏండ్లు ఏం చేశావు?'' అని ఆశ్చర్యంతో అడిగాడు ఎల్లయ్య. "ఇల్లు వదలిపెట్టిన వెంటనే నేనొక గురువును ఆశ్రయించాను. ఆ గురువు నాకు మంత్రదీక్ష ఇచ్చి జపం ఎలా చేయాలో కొన్ని నియమాలు చెప్పారు. బిల్వవృక్షం క్రింద కూర్చొని జపం చేయాలన్నారు. ఆ బిల్వవృక్షం కొండ సమీపంగానో సముద్ర సమీపంగానో లేదా నదీతీరానికి చెందిందిగానో ఉంటే అత్యంత శ్రేష్ఠం అన్నారు. జపం రోజుకు కొన్ని వేలు చేయాలి గనుక జపంలో గంటల తరబడి కూర్చొనవలసి యుంటుంది గనుక సులభంగా భిక్ష దొరికే తావును నా సాధనా స్థలంగా ఎన్నుకోమని కూడ చెప్పారు. నేను 50 ఏండ్లుగా తిరిగాను. నా సాధనకు అనువైన స్థలం దొరకలేదు. బిల్వవృక్షాలున్నాయి గాని అవి నాకు కావలసిన తావుల్లో ఉండడం లేదు. నాకు కావలసిన తావుల్లో బిల్వవృక్షం కనబడినప్పుడు ఏమౌతుందంటే ఆ చుట్టుప్రక్కల భిక్ష పుట్టని గ్రామాలుంటాయి. ఒకసారి గోదావరితీరంలో అన్నీ కుదిరినట్లే కుదిరింది అంతలో వెల్లువ వచ్చి ఆ బిల్వవృక్షం కొట్టుకపోయింది. ఈ మధ్య గంగాతీరంలో అన్నీ చక్కగా కుదిరాయి కాని ఒక సందేహం పట్టుకుంది. మా గురువు ఉపదేశించిన మంత్రంలో 'ఐం క్లీం' అనాలా 'క్లీం ఐం' అనాలా సందేహం పట్టుకుంది. ఏమీ తోచక ఈ కుంభమేళకు వచ్చాను. నీవు కనబడ్డావు. సంతోషం'' అన్నాడు శ్రీహరిసరస్వతి అనబడే కొండయ్య. "భేష్! 'సంతోషం' అని వట్టి మాట పలికావు. నేను చూస్తూనే ఉన్నాను. నీ ముఖంలో సంతోష ఛాయలే లేవు. నీడల్లా నీ ముఖంలో విషాదచ్ఛాయలే పులుముకొని ఉన్నాయి. సాధన పేరుతో ఇల్లు

# సద్దర్శనము

## డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(క్రిందటి సంచిక తరువాయి)

16. తద్యుష్మదోరస్మది సంప్రతిష్ఠా
తస్మిన్ వినష్టేఽస్మది మూలబోధాత్
తద్యుష్మదస్మన్మతిఃర్జితైకా
స్థితిర్జ్వలన్తీ సహజాత్మనః స్యాత్

ఆంధ్రానువాదం: 'నీవు' 'అది' అనే భావాలు నేను మీద ఆధారపడి ఉన్నవి. ఈ 'నేను' అనే భావం యొక్క మూలం దగ్గరకు పోతే అక్కడ ఈ 'నీవు' 'అది' అదృశ్యం అవుతవి. ఆ 'నీవు' 'అది' 'నేను' అనే భావం లేని స్థితి అది ఒక్కటి మాత్రమే. అది దేదీప్యమానంగా ప్రకాశించే ఆత్మయొక్క నిజస్థితి.

వివరణము: లోకవ్యవహారంలో మనం గ్రహించే ప్రధాన విషయాలు మూడే. 'నేను' 'నీవు' 'అది.' సమస్త ప్రపంచ వ్యాపారం ఈ మూడింటికీ సంబంధించినదే. చెప్పే వస్తువు, చేసే వస్తువు 'నేను'. ఈ చెప్పుట చేయుట ఎవరికో అది 'నీవు' ఈ రెండు గాక వ్యాపారంలో ఉండేదంతా 'అది' కాని ఈ 'నేను' 'నీవు' 'అది' అనే స్థితులు నిజమైనవేనా? నీవు మాట్లాడినంతసేపు నేనూ మాట్లాడుతున్నాననుకోవడం లేదూ? నీవు నాతో మాట్లాడితే, నన్ను 'నీవు' అంటావు. మరిప్పుడు 'నేను' నీవైనానే. మన రాజకీయవేత్తలు "మనం భారతీయులం. అందరం ఈ క్లిష్టసమయంలో ఐకమత్యంతో నిలబడాలి" అని సింహగర్జన చేస్తుంటారు. ఈ 'మనం' అనే మాటకు అర్థం ఏమిటో కొంచెం లోతుగా ఆలోచించండి. ఇది ఒక వందో, వెయ్యో 'నేను'ల యొక్క సమూహం గదా? 'మనం' అనే వస్తువు వేరుగా ఉన్నదా? లేదు. 'నీవు' 'నేను' కలిస్తే 'మనం' అవుతుంది అని మీరు వాదించవచ్చు. అది మీ ఉద్దేశం కాని నిజస్థితి కాదు. నీవు కూడా ఒక నేనే కదా కాబట్టి ఉన్నవి నేననే వస్తువులే. వాటి సముదాయాన్ని వ్యవహారంలో 'మనం' అంటున్నాము.

నిజంగా 'మనం' యొక్క సమస్యలు 'నేను' యొక్క సమస్యా పరిష్కారం కాకుండా అవి కావు. మన జాతంతా ఆకలితో బాధపడుతుంది అంటాం, జాతికి ఆకలేమిటి? నీకు నాకు ఆకలి బాధ కాని, నీ ఆకలి, నా ఆకలి, వాడి ఆకలి కూడా కలిపి కూడి లెక్క చెప్పగలమా ఇంతని? లేక గుణించగలవా? వేయిమంది ఆకలి వేయి రెట్లవుతుందా? కాబట్టి ఆకలనేది వ్యక్తికి గాని జాతికి కుదరదు. 'నీవు' 'మనం' 'జాతి' ఈ మాటలు నేననే వ్యక్తిని పురస్కరించుకొని వాడే పదాలు. 'నేను' అనే అసలు వస్తువు లేనప్పుడు, ఈ 'నీవు' 'అది' 'మనం' అనే వద్దీ వస్తువులను ఎక్కడినుండి తేగలం? దృక్కనే నేను మీద ఇవన్నీ పుట్టుకువస్తాయి. అప్పుడే ఇవి నిజంగా స్ఫురిస్తాయి. కాబట్టి 'నేను' అంతటికీ మూలాధారం, పునాది. కాబట్టి ప్రపంచానికి మేలు చేయాలంటే దాని సమస్యలు, అర్థం చేసుకోవాలంటే, అసలు ఈ 'నేను' యొక్క నిజస్థితి గ్రహించాలి. 'నేనెవరను' అని విచారిస్తే నీవు ఆత్మలో లీనమైపోతావు. అక్కడ నీవూ లేదు నేనూ లేదు అదీ లేదు. అది ఒకటే స్థితి. కైవల్యం-అది పరిపూర్ణమైన, ఆనందమయిన, స్వయంప్రకాశమైన చైతన్యమైన ఉత్తమ స్థితి అది ఆత్మయొక్క సత్యమైన, సహజమైన స్వరూపం. నీవు ప్రస్తుతం అట్టి నీ సహజస్థితి వదిలిపెట్టి తల్లినుంచి తప్పిపోయిన బిడ్డవలే దారి తప్పి అడవుల్లో తిరుగుతూ నానా బాధలు దుఃఖాలు పడుతున్నావు. దీనినే శ్రీకృష్ణభగవానుడు గీతయందు 'తనయందు, సకలభూతములయందు, అద్దములో బింబమువలె, ఆత్మను చూచే స్థితి అని చెప్పారు. ఈ స్థితిలో విశ్వప్రేమ తప్ప ఏముంటుంది? అప్పుడవ్యాజమైన పరోపకారం తప్ప ఏం చేస్తాం?

ఈ 'నేను' యొక్క మూలకందాన్ని ఒక్కసారి పట్టగలిగినామా ప్రపంచసమస్యలన్నీ వాటంతట అవే పరిష్కారమయి పటాపంచలవుతవి. ఈ లోకోపకారం చేస్తున్నామని సవాళ్లు చేసే రాజకీయవేత్తలకు వాళ్ళ వాళ్ళ గొప్పలు చాటుకోటానికి అక్కడ స్థానం లేదు. శంకరుల వారు ఆత్మసాక్షాత్కారం అంటే విశ్వాత్మభావమని చెప్పారు. అట్టి స్థితి మనలను భూతదయతో ముంచెత్తుతుంది కాని దేనికైన హింస పనిచేయనిస్తుందా? మానవునికి మన ఋషులు చెప్పిన 'ఆత్మనో మోక్షార్థం, జగద్ధితాయ చ' సందేశం మనం పాటిస్తే. పాశ్చాత్యులు మన నాగరికతను అర్థం చేసుకోక మనపై రుద్దిన సంస్కృతి, రాజ్యాంగం మనకేం ప్రయోజనం? కాదని తేల్తుంది. ఋషులు చెప్పే వాక్యం ప్రజలు గమనించకపోతే. ప్రజాస్వామ్యం ఏం ఉపకరిస్తుంది? పాశ్చాత్యులు మానవుణ్ణి ఒక రాజ్యాంగానికి, సంఘానికి పనికివచ్చే జంతువిశేషమని పరిగణిస్తారు. ఎంత నీచమైన అంచనా? ప్రతి మనిషీ పర

మాత్మ స్వరూపమే. వాణ్ణి జంతువనడం ఎంత తెలివి తక్కువ. ప్రజాస్వామ్యం ఆధ్యాత్మిక వ్యాపారం కావాలి. అదీ కాక మనిషి జీవించేది రాజ్యాంగం కోసమేనా? మానవ జీవితానికి ఎన్నో లక్ష్యాలు వుంటాయి. వాటిని సాధించడానికి సాహిత్యం, కళ, దానం, ధర్మం మొదలైన ఎన్నో ఉజ్జ్వలమైన పంథాలుంటాయి. మానవజీవితం అంతా మొత్తం మీద చూస్తే రాజకీయాలు, సంఘసేవ ఒక భాగము మాత్రమే. జీవితమన్నది ఎన్నో ఆదర్శాలతో, ఎన్నో సంస్కృతులతో కృతకృత్యత పొందుతుంది. అట్టి ఉత్తమమైన ఆధ్యాత్మిక ఆదర్శమునుంచి మనిషి క్రిందికి దిగజారి మన ఊరి పంచాయితీబోర్డు ప్రసిడెంటు అవడమే మానవుని పరమావధి అవడం ఎంత తెలివితక్కువ! ఈనాడు మన ఎదుటనుండే ప్రజాస్వామ్యం మానవ జీవితానికి, ఈ ప్రపంచానికి మూలాధారమేదో దాన్నే మరిచిపోయింది. అట్టి స్థితిలో ఉండే ప్రజాస్వామ్యం మానవ సంక్షేమానికి గాని, సంఘోద్ధరణకుగాని ఏం కృషి చేయగలదు? వాటి సమస్యలను ఎలా పరిష్కరించగలదు?

మన సనాతన విజ్ఞాన రీత్యా మానవుడు ఆత్మనుంచి పుట్టి బయటపడ్డ ఒక ఆత్మకణం. అగ్నినుంచి బయటపడ్డ విస్ఫురవ్వవంటిది. ఆధ్యాత్మికంగా పరిపూర్ణవస్తువు. చైతన్య స్ఫురణే అతని మనస్సూ శరీరం కూడా. అందుచేతనే మన ఋషులు ఏమన్నారంటే నీవు ఆత్మవే అని తెలుసుకొని, ఆ ఆత్మసాక్షాత్కార ప్రయత్నం సాగించు. నీ నిజస్థితిని పొందు. అట్టి సాక్షాత్కారంతో లోకసంగ్రాహం సాధించుట నీ ప్రథమ ధర్మము. నీ జీవితాన్ని దీని మీద ఆధారం చేసి అర్థం కామం మొదలైన ఇతర పురుషార్థాలు సాధించుకో. నీకు జీవితంలో ఐహికసుఖం, క్షేమం, జీవితలక్ష్యాలలో జయం కావాలంటే అర్థం ఉండాలి. కామం అంటే కోరికలు. ఇవి భార్యా బిడ్డలయందు గృహధనాదులయందు ఉంటాయి. ధర్మ మోక్షములు ఉత్తమోత్తములని సంసారంలోంచి బయటపడే ఉపాయాలని గ్రహించిన తరువాత మానవుడు అర్థకామాల సంపాదనలో తప్పుడు దారిని పట్టడు. పతనం కాడు. ఆత్మతేజస్సు అతని అన్ని వ్యాపారాలను కాంతివంతం చేసి, ఆ సర్వాత్మభావమే, అతనిని ఉత్తమ ఆదర్శస్థాయిలో పెడుతుంది. అప్పుడు అతడు లోకవ్యవహారంలో ఉన్నప్పటికీ ముక్తుడే. అట్టివాడు విశ్వప్రేమ వెదజల్లుతుంటాడు. అట్టివాడు లోక కళ్యాణం తప్ప ఏం చేయగలడు?

ఇది మన ఋషులు చెప్పిన జీవన్ముక్తి. ధర్మ అర్థ కామాలు ఉత్తమమైన మోక్షం సంపాదించి పెట్టాలి. మన భారతదేశం పురోగమించి, భారతీయుల జీవితము పరమోన్నత స్థాయిని చెందవలెనంటే మన రాజ్యాంగానికి ఈ నాలుగు పురుషార్థాలు పరవడి కావాలి. మానవ జీవితం ఈ నాలుగు పురుషార్థాలకు - ధర్మార్థ కామ మోక్షములకు - లక్ష్యం కావాలి. ప్రపంచంలో అన్ని రాజ్యాంగాలు, 'మనం'ను ఆధారం చేసుకొని మనయొక్క ఐహిక లక్ష్యం పరమావధిగా పరిగణించి, కూర్చబడ్డది. ఇట్టి తప్పుడు సిద్ధాంతాల మీద కూర్చిన రాజ్యాంగములు తప్పుడు దారిని పట్టి విఫలములు అవుతున్నవి. ఈ సామ్యవాదాలు, ప్రజాస్వామ్యం మొదలైనవి అన్నిటికి మానవుని అహంకారం మూలాధారం. ఇవి మానవుని సమస్యలు పరిష్కరించి, మానవజాతిని నిజమైన సుఖ, శాంతి, భద్రతలు ఎట్లు సమకూర్చగలవు? నేటి విద్యాధికులనుకొనే భారతీయులు పాశ్చాత్య వ్యామోహంలో పడి, వారి సాంఘిక పద్ధతులు, ఆచారాలు గుడ్డిగా అనుకరిస్తున్నారు. వారి సంస్కృతికి చాలా మంది బానిసలు. వీరి నాయకత్వాన మనదేశం, దేశీయులు నిర్వీర్యులై అన్ని రంగాల్లోనూ అధోగతి పాలవుతున్నారు. ఈ దుఃస్థితిని అరికట్టడానికి ఇప్పుడు కూడా ఇంకా మించిపోలేదు. సృష్టి అంతటా వున్నది ఒకటే పారమార్థిక సత్యం అని మనం గమనించాలి. దీని నాధారం చేసుకొని మన సంఘవ్యవస్థ అంతా నూతనంగా నిర్మించాలి. ఈ కాలానికి అనుగుణంగా ఏవో కొలది మార్పులతో ఈ నిర్మాణం మన ఋషులు నిర్వచించిన సనాతన ధర్మసూత్రాలు పాటించి జరగాలి. బాగా, తీవ్రంగా మీరే ఆలోచించుకొనండి. మనం ప్రాణాలర్పించి గడించుకొన్న స్వాతంత్ర్యం ఏగతికి పోతోందో ఆలోచించండి. శీఘ్రగతిని ఆలోచించండి.

(తరువాయి పై సంచికలో)

---

## శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4, మార్చి నెల విశేషకార్యక్రమము

| | | |
|---|---|---|
| 9 వ తేది | మంగళవారము | దోల్ పూర్ణిమ; శ్రీ చైతన్య జయంతి |
| 13 వ తేది | శనివారము | స్వామి యోగానంద జయంతి |
| 14 వ తేది | ఆదివారము | శ్రీ చైతన్య జయంతి పబ్లిక్ మీటింగ్ |
| 26 వ తేది | శుక్రవారము | ఉగాది |
| 6 వ తేది | శనివారము | ఏకాదశి దివసములు |
| 21 వ తేది | శుక్రవారము | ఏకాదశి దివసములు |

# నైతికత స్వయంగా పరమావధికాదు : స్వేచ్ఛ దాని లక్ష్యం

నైతికత మానవుని లక్ష్యం కాదు; స్వేచ్ఛను పొందేందుకు సాధనం మాత్రమే. దివ్యత్వాన్ని సాక్షాత్కరింప జేసుకోటానికి మానవునికి యోగం ఒక మార్గమని వేదాంతం బోధిస్తున్నది. ఆంతరికమైన స్వేచ్ఛను పొందటం ద్వారా యిది సాధ్యమవుతుంది. అందుకు సమస్తమూ దోహదం చేస్తుంది. నైతికత, నీతిశాస్త్రము వాటి సముచిత స్థానాలలో సువ్యవస్థితమై పనిచేస్తున్నాయి.

పరమాణువు నుండి మానవుని వరకు, అచేతనము, నిర్జీవము అయిన జడపదార్థపు రేణువు నుండి అత్యున్నతమైన మానవాత్మ వరకూ ప్రతి ఒక్కటీ స్వేచ్ఛకోసం పోరాటం సాగిస్తున్నది. నిజానికి సృష్టి సమస్తం స్వేచ్ఛకోసం జరిగే సంఘర్షణ యొక్క ఫలితమే. అన్ని మిశ్రమాలలోను ప్రతి కణమూ ఇతర కణాలనుంచి విడివడి పారిపోవాలని ప్రయత్నిస్తున్నది. కాని తక్కినవి నిలిపి ఉంచుతున్నాయి. మనభూమి సూర్యునినుంచి, చంద్రగ్రహం భూమినుంచి దూరంగా పారిపోవాలని ప్రయత్నిస్తున్నాయి. ప్రతి వస్తువులోనూ అనంతమైన స్వేచ్ఛాప్రవృత్తి ఉంటుంది.

ప్రపంచంలో మనం చూసే ప్రతి సంఘటనకు స్వేచ్ఛకోసం జరిగే పోరాటమే ప్రాతిపదిక. ఈ ప్రవృత్తియొక్క ప్రేరణ చేతనే సాధువు ప్రార్థిస్తున్నాడు; దొంగ దోచుకొంటున్నాడు. చేపట్టిన కర్మపంథా సక్రమమైనది కానప్పుడు దానిని మనం దుష్కార్యం అంటాము. కార్యమార్గం సక్రమమూ, ఉన్నతమూ అయినప్పుడు దానిని సత్కార్యం అంటాము. కాని ప్రేరణ ఒక్కటే – స్వేచ్ఛకోసం పోరాటం. ప్రాపంచిక బంధంలో చిక్కుకొని ఉన్న తన స్థితిని గూర్చిన జ్ఞానంతో భక్తుడు ఉక్కిరిబిక్కిరై, ఆ పరిస్థితినుంచి విముక్తి పొందాలని అభిలషిస్తున్నాడు అందుచేత భగవంతుని ప్రార్థిస్తున్నాడు. తనకు ధనమో, వస్తుసముదాయమో లేదే అన్న భావంతో దొంగ వ్యథచెంది ఆ వ్యథనుంచి విముక్తి పొందటానికి ప్రయత్నిస్తాడు అందుకే దొంగతనం చేస్తాడు. సచేతనమైనా, అచేతనమైనా సమస్త ప్రకృతికీ స్వేచ్ఛమాత్రమే ఏకైక లక్ష్యము తెలిసినా, తెలియకున్నా ప్రతిదీ ఆ లక్ష్యం వైపుకే పెనుగులాడుతున్నది. భక్తుడు అన్వేషించే స్వేచ్ఛకూ దొంగ అన్వేషించే స్వేచ్ఛకూ చాల వ్యత్యాసమున్నది. భక్తుడు వాంఛించే స్వేచ్ఛ అతనిని అనిర్వచనీయమైన బ్రహ్మానందానికి నడిపిస్తుంది. బందిపోటు ఆశించే స్వేచ్ఛ అతని ఆత్మకు మరికొన్ని క్రొత్తబంధాలను కల్పిస్తుంది.

ప్రతి మతంలోనూ స్వేచ్ఛకోసం జరిపే పోరాటం యొక్క అభివ్యక్తీకరణం కనిపిస్తుంది. సమస్త నైతికతకు, నిస్వార్థతకు అదే పునాది. ఈ స్వల్ప శరీరమే మానవుడనే భావనను అధిగమించడమే ఆ స్వేచ్ఛకు అర్థం. ఒక వ్యక్తి పరోపకారం, సత్కర్మాచరణం చేస్తున్నాడంటే, అతను 'నేను, నాది' అనే పరిమితమైన పరిధిలో యిమిడి ఉండలేడని అర్థం. స్వార్థంనుంచి విముక్తి పొందటానికి హద్దు లేదు. సంపూర్ణమైన స్వార్థరాహిత్యమే లక్ష్యమని నీతిశాస్త్రాలన్నీ స్తున్నాయి. ఒకవేళ ఈ సంపూర్ణ స్వార్థరాహిత్యాన్ని ఒక వ్యక్తి సాధించాడే అనుకొందాము. అతనికేమి లాభం! అతడిక ఏమాత్రం ఫలానా సుబ్బారావు కాడు. అతడు అనంతవ్యాపి. మునుపటి అల్ప వ్యక్తిత్వాన్ని శాశ్వతంగా కోల్పోయాడు. అనంతుడయినాడు. సర్వ మతాలకు, సమస్త నైతిక,

తాత్త్విక బోధనలకు పరమార్థం ఈ అనంత వ్యాకోచాన్ని పొందటమే. తాత్త్వికంగా ప్రతిపాదింపబడిన ఈ వాదనకు వ్యక్తివాది బెదరిపోతాడు.

అయితే అదే సమయంలో, తాను నైతికతను బోధించినా అదే భావనను స్వయంగా వెల్లడిస్తాడు. మానవుని నిస్వార్థతకు పరిమితి లేదంటాడు. ఒకవ్యక్తి వ్యక్తివాద విధానం ప్రకారం సంపూర్ణ నిస్వార్థపరుడు అయినాడను కొందాము. ఇతర విధానాలద్వారా పరిపూర్ణత్వాన్ని సాధించినవారికంటే అతని భిన్నత్వాన్ని గుర్తించడమెలా? అతడు జగత్తుతో తాదాత్మ్యం చెందాడు. అలా కావటమే అందరి ధ్యేయం. అయితే పాపం వ్యక్తివాదికి మాత్రం తన స్వంత తర్కాన్ని దాని సక్రమ పర్యవసానం వరకు అనుసరించే ధైర్యం లేదు. ఏ స్వేచ్ఛ అయితే మానవాళి సర్వస్వానికీ లక్ష్యమో దాన్ని నిస్వార్థ కర్మాచరణం ద్వారా సాధించటమే కర్మయోగం. అందుచేత ప్రతి స్వార్థపూరిత చర్య గమ్యం చేరడాన్ని నిరోధిస్తుంది; ప్రతి నిస్వార్థకర్మ లక్ష్యంవైపుకు నడుపుతుంది. కాబట్టి నైతికతకు ఏకైక నిర్వచనాన్ని యిలా చెప్పవచ్చు: "స్వార్థపరమైనది అనైతికము, నిస్వార్థపరమైనది నైతికము."

(పై సంచికలో "నైతికత : దాని సాపేక్షరూపాలు")


## FORM IV

*(See Rule 8)*

Statement about ownership and other particulars about the Sri Ramakrishna Prabha (according to Form IV Rule 8, circulated by the Registrar of Newspapers for India.)

1. Place of Publication ... : Madras-600 004.
2. Periodicity of its Publication ... : Monthly.
3. Printer's Name : M. Thirthanandam.
   Nationality : Indian.
   Address : Freedom Press, 528, T.H. Road, Madras-600021.
4. Publisher's Name : Swami Tanmayananda.
   Nationality : Indian (Hindu Monk).
   Address : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.
5. Editor's Name : Swami Tanmayananda.
   Nationality : Indian (Hindu Monk.)
   Address : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.
6. Name & Address of individuals who own the newspapers and partners or shareholders holding more than 1% of the total capital.

I, Swami Tanmayananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) SWAMI TANMAYANANDA,
*Signature of the Publisher.*

Date: 1-3-1982.

# గీతాగేయాలు (15, 16, 17 అధ్యాయాలు)

## పురుషోత్తమప్రాప్తియోగము

శ్రీభగవానువాచ:-

వేదములు, యే - వృక్షమునకును
వెలయ పత్రము - లగుచు నొప్పునొ
సంసార - అశ్వత్థ తరువుకు
పైవి మూలము - క్రింద శాఖలు
గల్గి నాశము - లేనిదంచును
చెప్పుచుందురు - దాని నెవ్వడు
తెలియగల్గునొ - అతడెరుగును
వేదార్థమది - నిశ్చయంబుగ.

ఆ సంసార - వృక్షశాఖలు
మూడు గుణముల - వృద్ధిగాంచుచు
విషయములనెడు - చిగుళ్ళగల్గి
విస్తరించెడు - పైకి క్రిందికి
మర్త్యలోకమున - కర్మబంధము
కలుగజేయుచు - దాని వేరులు
క్రిందుమీదులు - వ్యాప్తిగాంచుచు
నాటియున్నవి - యెంతొ దృఢముగ.

ఆదిమధ్యాంతములు లేవిది
ఆ సంసార - వృక్షరూపము
అరయజాలరు - మనుజులీ భువి
గట్టి వేళ్ళతొ - నొప్పుచుండెడి
ఆ సంసార - అశ్వత్థ తరువును
అసంగ మనెడు - ఆయుధముచే
నఱికి లెస్సగ - దేని పొందియు
తిరిగిరారో - ఎవనినుండి
ఈ సంసార - వృక్ష ప్రవృత్తి
వ్యాప్తిగాంచెనొ - అట్టి పురుషుని
పదము చేరగ - భక్తితోడను
శరణాగతిని - చేయవలయును.

అహము, మోహము - విడుచువారలు
సంగదోషము - గెలుచువారలు
ఆత్మజ్ఞానము - గల్గువారలు
కామముల లె - స్స, వీడువారలు
సుఖదుఃఖాది - ద్వంద్వములచే
లెస్సగ విడువ - బడినవారలు
వీడి అవిద్య - చేరబోదురు
అవ్యయంబగు - బ్రహ్మపదమును.

వెలుగబోదది - సూర్యశశులచె
వెలుగబోదది - పావకునిచే
దేనిపొందియు - తిరిగిరారో
తెలియు మయ్యది-నాదు నెలవుగ.

నిత్యమయ్యేది - నాదు అంశమె
జీవలోకము - న, జీవుడగుచు
ప్రకృతిగల్గు - షడింద్రియముల
ఆకర్షించి - తెచ్చు తనతో.

పూర్వదేహము - విడుచునప్పుడు
క్రొత్తదేహము - పొందునప్పుడు
పూలవాసన - గొంచు వాయువు
పోవునట్టుల - షడింద్రియముల
గొంచు తనతో - పోవు జీవుడు.

చెవిని, కన్నును - ముక్కు, నాలుక
మనసు, చర్మము - నాశ్రయించుచు
విషయ సుఖముల - నెల్ల లెస్సగ
అనుభవించుచు - నుండు జీవుడు.

ఉండునప్పుడు - వీడునప్పుడు
కూడి గుణములు - విషయసుఖముల
పొందు జీవుని - చూడజాలరు
మూఢజనములు - చూచు జ్ఞానియె.

చేసి యత్నము - యోగివర్యులు
చిత్తమున పర - మాత్మ గాంతురు
చేసి యత్నము - గాంచరాత్మను
చిత్తశుద్ధది - లేని మూఢులు.

జగమునంతను - వెలుగు నొందగ
జేయగల్గెడి - సూర్యతేజము
చంద్రాగ్నులను - గల్గుతేజము
నా తేజముగ - తెలియగల్గుము.

ధరణి జేరియు - నాదు శక్తిచె
దాల్తు ప్రాణుల - రసరూపియగు
చంద్రు జేరియు - చక్కగా నే
సస్యములు, పో - షించుచుందును.

అన్నిప్రాణుల - దేహ సీమల
ఆశ్రయించుచు - వైశ్వానరుడను
అగ్ని నేనై - ప్రాణాపాన
వాయువులగూడి - చేతు పచనము
నాల్గురకముల - ఓగిరంబులు.

ఎల్లప్రాణుల - హృదయ సీమల
నేనెయుందును-స్మృతియు, జ్ఞానము
మరపు నాచే - జీవులకెల్ల
కలుగుచుండును - వేదవిదుడను
వేదములచే - నెరుగబడియెద
వేదాంతకర్త - నేనె అగుదును.

క్షరుడు, అక్షరు - డనగ పురుషుల
గలరు. యిరువురు - లోకమందున
సర్వ ప్రాణుల - దేహమె క్షరుడని
అక్షరుగ, కూటస్థు చెపుదురు.

జగముల మూట - వ్యాప్తిగాంచుచు
వాని నెవ్వడు - దాల్చుచుండునొ
అట్టి అవ్యయు - జగన్నియంత
ఉత్తమపురుషు - పరమాత్మయని
బుధుల చేతను - చెప్పబడియెడు.

క్షరుని కంటెను - అక్షరునికంటె
అరయ శ్రేష్ఠుడ - నగుటచేతను
జగములందున - వేదములలో
వాసికెక్కుదు - పురుషోత్తముగ.

వీడి మోహము - ఎవడు నన్నే
ఎరుగుచుండునొ - పురుషోత్తముగ
తెలిసి సర్వము - అతడు నన్నే
విందు మనసుతొ - గొల్చు నర్జున!

అతి గోప్యమగు - శాస్త్రమంతయు
పాపరహితుడ! - నీకు చెప్పితి
దీని తెలిసిన - వాడె జ్ఞానియు
కృతకృత్యుగ - తెలియు మర్జున!!

## దేవాసురసంపద్విభాగయోగం

శ్రీభగవానువాచ:—

భయము విడుచుట-చిత్త శుద్ధియు
జ్ఞాననిష్ఠయు-దాన, దమములు
యజ్ఞ, తపసులు-వేదపఠనము
త్రికరణముల-నొక్కటుండుట-
హింస వదలుట-నిజము పలుకుట
క్రోధముడుగుట-త్యాగ, శాంతులు
కొండెము లాడ-కుండుట, భూత
దయయును, విషయ-విరాగత,

మధురభాషలు-చపలముడుగుట-
ఓర్పు, ధైర్యము-శుచియు, తేజము
ద్రోహముడుగుట-గర్వమిడుమట
అనెడు గుణములు-దైవసంపద
గల్గువారల-కుండు నర్జున॥

దంబ, దర్పము-అభిమానమును
అజ్ఞాన, క్రోధ-పారుష్యములు
అసురసంపద-గల్గు నరులకు
అమరియుండెడు-గుణములు అర్జున॥

దైవసంపద-దెచ్చు మోక్షము
దైత్యసంపద-దెచ్చు బంధము
నీదు పుట్టుక-నిర్జరాంశము
నెగులు విడువుము-మదిని అర్జున॥

లోకమందున-గల్గు సృష్టిని
భూతజాలము-రెండు విధములు
'దైవమంచును-అసురమంచును
తెలిపితిని మును-దైవసంపద
తెలిపెదను విను-అసురసంపద

అసురభావము-గల్గువారలు
చేయదగినది-చేయదగనిది
రెండు తెలియరు-సత్య, శౌచములు
సదాచారము-వారికుండవు

జగము సత్యము-కాదటంచును
నిరాధారము-నిరీశ్వరము
స్త్రీల పురుషుల-కామమె గాక
జగతియునికికి-వేరు కారణ
మేదిలేదని-చెప్పుచుందురు.

ఇట్టి దృష్టిని-కల్గి వారలు
చెడ్డమనసుతో-అల్పబుద్ధులై
క్రూరకర్మల-లోకనాశము
చేయుకొఱకై-పుట్టుచుందురు.

తనివితీరని-కామములతో
దంబ, అభిమాన-మదములతో
మోహవశులయి-పట్టువలతో
క్రూరకర్మలు-చేయుచుందురు.

విషయ చింతన-చివర వరకును
విడువకుండగ-ఆశ్రయించుచు
కామభోగము-లనుభవించుటె
పరమార్థమని-నమ్ముచుందురు.

పెక్కు ఆశా-పాశములచే
చిక్కుబడి మనసు-కామక్రోధము
లాశ్రయించుచు-విషయభోగము
లనుభవింపగ-నీతి న్యాయము
ధనసంచయము-సలుపుచుందురు

ఈ కోరికను-ఇపుడు పొందితి
ఇంక పొందెద-ఈ కోరికను
ఇపుడు గలదీ-ధనము నాకును
ఎంతో ఆర్జించగలను ఇకను.

ఈ శత్రువును-ఇపుడు చంపితి
మిగులు శత్రుల-చంపగలుగుదు
నేనె ప్రభుడను-నేనె భోగిని
కార్యకుశలుడ-బలయుతుండను
ధనవంతుడను-సుఖయుతుండను.

జనపమందితి-గొప్ప కులమున
సాటియెవ్వరు-నాకు యింకను
చేతు యజ్ఞము-ఇత్తు దానము
మోదమందుదు-అనుచు మిక్కిలి
మోహవశమున-తలచుచుందురు.

మనసునందలి-బహుళ భ్రాంతుల
మోహమనియెడు-వలను చిక్కుచు
కామ భోగా-సక్తి చేతను
కాంచుచుందురు-ఘోర నరకము.

తమ్ము దామే-పొగడుకొంచును
ధన మదంబుల-విర్రవీగుచు
నీతి వినయము-విధిని మీరుచు
నామమాత్రపు-యజ్ఞములచే
యాగకర్మల-నాచరింతురు.

అహంకారము-బలము, దర్పము
కామ, క్రోధము-లాశ్రయించుచు
అందరందున-గల్గు నన్నే
అసూయ గలిగి-నిందజేతురు.

ఆత్మద్వేషుల-క్రూరకర్ముల
పాపాత్ములగు-నీచ జనముల
చావుపుటుకల-సంసారమున
అసుర సంపద-గల్గెడి నీచ
జన్మల, నెపుడు-నెట్టివైచెద.

అసుర సంపద-గల్గు జన్మల
నందు మూఢులు-నన్ను పొందక
నీచతరగతు-జన్మ లెన్నో
పొందుచుందురు-తెలియు మర్జున॥

కామ, క్రోధ-లోభము లనగను
కల్గు ద్వారములు-మూడు నరకమునకు
ఆత్మనాశము-జేయు నియ్యవి
మనుజు డియ్యవి-వదలి మనవలె.

ఈ ద్వారములు-మూడు బాగుగ
విడుచు మనుజుడు-ఆత్మశ్రేయము
పొందువాడై-మోక్షపదమది
పొందగలుగును-నిజము అర్జున॥

వీడి శాస్త్రము-కర్మ స్వేచ్ఛగ
చేయు నాతడు-సిద్ధిబొందడు
అందబోవడు-సుఖమదెట్టిది
పరమగతియది-పొందబోవడు.

చేయదగినది-చేయగూడని
వేళల దెలుప-శాస్త్రమే గతి
శాస్త్రమార్గము-తెలిపి బాగుగ
కర్మచేయుము-లోకమందున.

## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ:-

వదలి శాస్త్రము-శ్రద్ధతోడను
అర్చ చేసెడి-వారి నిష్ఠను
సత్వరజ-స్తమంబుల, నేదిగ
పల్కుచుందురొ-చెప్పు కేశవ॥

శ్రీభగవానువాచ:-

పూర్వజన్మల-వాసనలచే
పుట్టు జీవుల-శ్రద్ధ లరయగ
సత్వ, రజ స్తమంబు, లనగను
మూడు విధములు-వినుము వానిని

పూర్వజన్మల-వాసనలచే
పుట్టు జీవుల-అంతఃకరణ

మనుసరించుచు-గల్గు, శ్రద్ధయు
సంసారమున-గుణము, లర్జున!

సత్వయుక్తు-అమరగణముల
యక్షరాక్షసుల-రాజసులును
భూతప్రేతముల-తామసులును
పూజ సల్పుచు-నుందు రరయగ
దేహమందలి-భూతజాలము
ఇంద్రియంబులు-అంతరాత్మయు
అలసటందగ-అహము, దర్పము
కామరాగ బలాన్వితు, లగుచు
సర్వజనముల-బాధనందగ
వివేకము విడి-విధిని మీరుచు
వట్టి తపముల-ఘోరనిష్ఠతొ
చేయుచుందురొ-అట్టి తపముల
తెలియుచుండుము-అసురభావము
చేత చేసెడి-తపము లంచును.

ఆహారమును-యజ్ఞ, దాన
తపసు లరయగ-మూడు గుణముల
నొప్పు జనులకు-మూడు విధముల
నుండు ప్రియమై-వినుము చెప్పెద.

తేజ, మాయువు-బలము, స్వస్థత
ప్రీతి, సుఖముల-పెంపుజేయుచు
రసము, స్నిగ్ధత-స్థిరత, హృద్యత
గల్గజేసెడి-ఓగిరంబులు
కడు ప్రియంబులు-సాత్వికులకును.

చేదు, పులుపును-కార, ముప్పును
వేడి, రూక్షత-గల్గియుండుచు
చాల దాహము-దుఃఖ, శోకము
గలుగ జేసెడు-ఓగిరంబులు
కడు ప్రియంబులు-రాజసులకును.

జాముగడచిన-సారమిడచిన
పాచిపోయిన-చెడువాసనతొ
తినగ మిగిలిన-శుద్ధిలేని
నివేదించని-ఓగిరంబులు
ప్రియంబయ్యెడి-తామసులకును.

విధిని మీరక-ఫలము గోరక
'చేయదగినది'-యంచు మనసును
తృప్తిజేయుచు-చేయు యజ్ఞము
చెప్పబడియెడి-'సాత్వికంబని'.

భరతవంశమునందు శ్రేష్ఠుడ!!
ఫలము గోరుచు-డంబమునకై
పేరు కోసము-చేయు యజ్ఞము
తెలియబడియెడు-'రాజసంబని'.

విధిని మీరుచు-అన్నదానము
చేయకుండను-విడిచి మంత్రము
ఏమి దక్షిణ-యివ్వకుండను
వీడి శ్రద్ధను-చేయు యజ్ఞము
చెప్పబడియెడి-'తామసంబని'

దేవ, గురువుల-ద్విజుల, ప్రాజ్ఞుల
సేవ, పూజయు-'త్రికరణశుద్ధి'
శౌచ, మహింస-బ్రహ్మచర్యము
'శరీర తపమని'-చెప్పబడియెడి.

బాధ గలుగని-ప్రియ, హిత సత్య
భాషణంబులు-అనుదినంబును
అభ్యసించెడి-వేదపఠనము
'వాచ్యతపముగ'-చెప్పబడియెడి

మనసు ప్రసన్నత-నొప్పియుండుట
మౌన, మాత్మను-నిగ్రహించుట
సౌమ్యభావము-భావశుద్ధియు
'మనో తపమని'-చెప్పబడియెడి

ఫలము వీడుచు-శ్రద్ధతోడను
మనసు నిలకడ-సడలనీయక
మనుజు లొనర్చు-మూడు తపసులు
'సాత్వికంబని'-చెప్పబడియెడు.

కీర్తికొరకును-గౌరవముకై
డాంబికముతో-చేయు తపసది
నిలకడలేని-ఫలము గలదై
చెప్పబడియెడు-'రాజసంబని'.

పట్టువీడక-ఆత్మనొంచుచు
పరుల నాశము-చేయు బుద్ధితో
తపము జేసిన-'తామసికమగు'
తపసుగ దాని-చెప్పుచుందురు.

దేశకాల పాత్రా-దు లెరిగి
'ఇవ్వవలెనను'-నిశ్చయముతో
ప్రత్యుపకార-మాసజేయక
దానమిచ్చిన-'సాత్వికంబగు'.

ప్రత్యుపకార-మాసజేయుచు
ఫలము తిరిగియు-పొందగోరుచు
అతి కష్టముతో-ఇచ్చు దానము
'రాజసంబని'-చెప్పబడియెడు.

దేశకాల పాత్రా-దు లెరుగక
ప్రియము వీడుచు-గౌరవింపక
నిందచేయుచు-ఇచ్చు దానము
చెప్పబడియెడు-'తామసంబని'

ఓం, తత్, సత్, అను-మూడుపేర్లచె
నొప్పుచుండును-పరబ్రహ్మము
ఈ నామ త్రయ-ముచ్చరించియె
బ్రాహ్మణులు, వేద, యజ్ఞములును
సృజింపబడియె-పూర్వమందున.

వేదవేత్తల-శాస్త్రచోదిత
యజ్ఞ, దాన, తపో-క్రియ లెల్ల
'ఓం'కారము-నుచ్చరించియె
ప్రవర్తిల్లగ-జేయబడియెడి.

ఫలము వీడియు-మోక్షమందగ
దలచు మనుజుల-యజ్ఞ, దాన
తపోకర్మల-'తత్' అను పదము
చెప్పి పిమ్మట-చేయుచుందురు.

'సత్' అనియెడి-బ్రహ్మ నామము
'కలదు', 'మంచిది'-అనెడు అర్థమున
వాడబడియెడి-అటులె ఉత్తమ
కర్మలందున-వాడబడియెడి
'సత్' అను పదము-తెల్ప అర్జున!!

యజ్ఞ దాన-తపసుల గల్గెడి
స్థితియె 'సత్' అని-చెప్పబడియెడి
బ్రహ్మార్పణముగ-చేయు కర్మలె
'సత్' పదముచె-పిలువబడియెడి.

శ్రద్ధ వీడియు-చేయు హోమము
దాన, తపో, కర్మలు-'అసత్' అని
చెప్పబడియెడి-ఇహ పరలోక
ఫలములు దాన-పొంద రర్జున!!

గేయరచన:

చీమకుర్తి వేంకటేశ్వర్లు

# సంపాదకీయం - 6

"ఆధ్యాత్మికత అంటే ఏమిటి?" అనే విషయం నేడు చెప్తాం అనుకొన్నాను గాని అది చాల బరువైన విషయం. ఇంతవరకు చెప్పినవి అంత బరువైనవి కాకపోయినా అవి నీకెంత అర్థమైనవో నీకే తెలియాలి. ఒకానొక విషయంగా మనస్సులో చెలరేగే తలంపులనుండి మనోశాంతిని సాధించే ఉపాయం నిన్న మొన్న కూడ చెప్పాను. ఆ ఉపాయం ఆ ఒక తెగకు చెందిన తలంపుల విషయంలోనే గాక సర్వత్ర పనికివస్తుంది. తలంపులు - అవి ఏవిగానైనా ఉండనీ వాటిని సులభంగా శమింపజేయవచ్చు. అంతర్గత భాషణ (inner talk) చేయకుండ ఊరక మనోవృత్తుల ప్రతికదలికను గమనిస్తూ వాటి విషయంలో ఏ జోక్యమూ కల్పించుకోకుండ సాక్షిమాత్రంగా ఉంటే చాలు, మనస్సు ఒక దారికి వచ్చేస్తుంది. ఇప్పుడు నీవిలా అడగవచ్చు. "మనశ్శాంతికి తాత్కాలిక ఉపాయమే చెప్పారు మీరు. నాకు దీనితో అంత ఉపయోగం లేదు. దీనికి బదులు శాశ్వత పరిష్కార మార్గం చెప్పండి." ఇలా అడగడం ఎలా ఉంటుందంటే "ఆకలి వేసినప్పుడల్లా జఠరాగ్నిని శమింపజేస్తుండడం శ్రమకరం కాబట్టి దానిని శాశ్వతంగా శమింపజేసే ఉపాయం కావాలి" అని అడిగినట్లుగా ఉంటుంది! మనసును శమింపజేయడం అంటే దానిని నిర్వీర్యం చేయడం అని అర్థం కాదు. మన జీవితకార్యకలాపాలకు మనోవ్యాపారం ఎంతో అవసరం. అది లేకుండ ఏ ఒక పనీ చేయలేము. కాని దానికి మన దైనందిన వ్యవహారాల్లో తగుమాత్రమైన స్థానమే ఇచ్చి అంతకు అధికంగా ఇవ్వకఉండడమే నేర్పరితనం. అనవసర ఘర్షణలకు ఆయాసానికి నష్టానికి బాధలకు మనస్సును పాల్పడజేయనీయక ఒక సమరస స్థాయిలో దానిని ఉంచడమే మనోశమనం అంటే. అలా ఉంచగలిగితే మన జీవితరథం అడుగడుక్కీ కుక్కుకుపులుని చప్పుడు చేయక సాఫీగా సాగిపోతుంది. ఇక చెప్పవలసిన బరువైన విషయాల సంగతి రేపు చూసుకుందాం. కొంత కాలక్షేపంగా ఇప్పుడు నా స్మృతులను కొన్నిటిని చెప్తాను.

నేను దక్షిణదేశంలో ఒక ఆశ్రమంలో కొన్నేండ్లు జీవితం గడిపాను. ఒకనాడక్కడికి మీ గుంటూరుజిల్లా మనిషి ఒకాయన వచ్చాడు. "మీరేం చేస్తున్నారు?" అని అడిగాను. "హరికథలు చెప్తుంటాను" అన్నాడు. "హరికథలు చెప్పడమే మీ ప్రధానవృత్తియా లేక అది ఇక్కడి కొందరి పెద్ద ఆఫీసర్లకు మాదిరి ఆదివారాల ఉపవృత్తియా!" అని అడిగాను. "హరికథలు చెప్పడమే ఈ రెండేండ్లుగా నా ప్రధానవృత్తి" అన్నాడు. 'అంతకు ముందు మీరేం చేసేవారు" అని అడిగాను. ఆ ప్రశ్న వినగానే అతను నాటకీయధోరణిలో "అంతకుముందు నేను న్యాయంగా ధర్మంగా సత్యానికి కట్టుబడి వ్యాపారం చేశాను. ఏబది వేలు పోయినవి; పెద్దలు సంపాయించి ఇచ్చిపోయిన పొలం అమ్మవలసివచ్చినది. తరువాత వ్యాపారం మానుకొన్నాను" అన్నాడు.

నాకు పరిచితుడైన వ్యవసాయదారుడొకడు ఒకనాడు ఆశ్రమానికి వచ్చాడు. "ఏం పని మీద పట్టణం వచ్చారు?" అని అడిగాను. "ఏనేమున్నది? మా ముగ్గురు పిల్లలని ఇక్కడి కాన్వెంట్‌లో చదివిస్తున్నాను. వాళ్ళకోసం ఇక్కడే కాపురం పెట్టాను" అని తరువాత తన సంసారబాధలన్నీ చెప్పడం మొదలు పెట్టాడు. అందులో కొంత నీకు వినిపిస్తాను విను : "రోడ్డుమీద తోపుడు బండ్లలో మామిడిపండ్లను చూస్తుంటే పిల్లలకు కొనాలనిపిస్తుంది, కాని కొంటే ఇతర అత్యవసరా

లకు డబ్బు కొరవడుతుంది ఏం చేయను? 'మరో సీసన్‌లో కొంటాంలే' అనుకొని ఉత్త చేతుల్తోనే ఇంటికి పోతుంటాను. ఎంతో బాధగా ఉంటుంది. ఇలానే నాలుగు సీసన్లు పోయాయి. ఏ ఒక్క సీసన్లోనూ పిల్లలకు బట్టలు కొనలేకపోయాను'' చూశావా మధ్యతరగతి సంసారుల బాధలు! సంసారజీవితంలో ఇంకా కాలుపెట్టనివాడికి దానిపట్ల వైరాగ్యం కలగడానికి ఇంతకన్నా ఏం చెప్పాలి? అర్థమైందా!

ఒకనాడు పూర్వపరిచితుడైన ఒక కాలేజి లెక్చరర్ నన్ను చూడడానికి వచ్చాడు. అతణ్ణి చప్పున గుర్తుపట్టడం కొంత కష్టమైంది నాకు. పూర్వం అతను మీసం ఉంచేవాడు కాదు. ఇప్పుడు అతని ముఖానికి మీసం-దక్షిణ దేశసినిమాహీరోల మోస్తరుగా - ఉంది. "ఈ యనుకరణ ఎందుకు?" అని నేనడగలేదు. బహుశా అతనికి వివాహం అయినాక, భార్య అలాంటి మీసం ఉంచుకోమని అతణ్ణి కోరిందేమో! వైవాహిక జీవితాల్లో చిన్నచిన్న వ్యక్తిగత విషయాల్లో కూడ పరాధీనత తప్పదేమో! "తస్మాత్ జాగ్రత జాగ్రత" అని హెచ్చరించడం కన్నా నేనింకేమీ నీకు చెప్పను.

ఆశ్రమంలో అతిథిగా కొన్నాళ్ళున్న ఒక భక్తుని కథ చెబుతాను విను. అతను ఒక పెద్ద ఇంజనీరు. ముప్పైఏండ్ల యువకుడు. పుష్టిగా ఆరోగ్యంగా నిగనిగలాడే దేహచ్ఛాయతో చాల అందంగా కనబడేవాడు. ధనికవర్గానికి చెందినవాడైనా చాల మంచి మనిషి. విద్య, గుణం, రూపం, ధనం, యావనం-అన్నీ ఉన్న అదృష్టవంతుడనిపించేది అతణ్ణి చూస్తుంటే. ఒకనాడు అతను మెట్లు ఎక్కుతూ ఎక్కుతూ ఫిట్సు వచ్చి దభాలున పడిపోయాడు. మెట్ల మీద ఆ దృశ్యాన్ని - చేతులు కాళ్లు విదిలించడం. పళ్ళు కఱచుకోవడం వల్ల నాలుకకు గాయం అయి రక్తం నోటివెంట కారడం, హృదయాన్ని కలచివేసే ఆ మూలుగులు - ఇదంతా చూసినప్పుడు అప్రయత్నంగా నా మనస్సులో గీతాకారుడు చెప్పిన "అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మాం" అనే వాక్యం జ్ఞాపకం వచ్చింది. అందంగా ఆరోగ్యంగా ఉన్నామనుకొంటాం కాని అవి ఎన్నాళ్లో ఎవరికి తెలుసు?

ఒక సందర్భంలో నేను ఆశ్రమంలో గది మారవలసి వచ్చింది. ఆ గదిలో చాల నెలలుగా ఎవరూ లేనందువల్ల దాన్ని శుభ్రం చేయడానికి చాల సేపయింది. క్రింది భాగం అంతా సర్ది పైభాగం శుభ్రం చేయడానికి పూనుకొని చీపురుకట్టతో కిటికీ మీదున్న దుమ్మును, బూజును దులుపుతూ తెలియక అక్కడున్న ఒక కందిరీగల తెట్టును కదిలించాను. అంతే అవి నా మీదికి దాడి సలిపాయి. నన్నక్కడ నిలవనీయలేదు. ఆ రూములో అంతసేపు హడావడిగా బెంచీలు కుర్చీలు అల్మేరాలు అటూ ఇటూ నెట్టూ పెద్ద చప్పుడు చేసినా కదలక మెదలక ఉన్నచోటు తెలియక అంతవరకు పడివున్న కందిరీగలు ఒక చిన్న తాకిడి వల్ల ఎలా విజృంభించి నన్నక్కడ ఉండనీయక చేశాయో ఆలోచించినప్పుడు నాకొక విషయం స్ఫురించింది: "మన మనస్సులో కామవాసనలనే కందిరీగలున్నాయి. సందేహం లేదు. కాని 'అనుభవం' అనే కదలిక లేనంతవరకు అవి మనల్ని ఏమీ చేయవు. అనుభవం అనే కదలిక జరిగిందా అవి విజృంభిస్తాయి. తిరువాత మన జీవితం కష్టాలపాలవుతుంది. లోకం తీరు చూస్తుంటే ఇది సత్యమే అనిపిస్తుంది. చాలమంది వివాహపూర్వమే 'అనుభవాలు' పొందినవారున్నారు 'ఇకచాలు'

అని వారు విరమించడం లేదు. వివాహాలు కూడ చేసుకుంటున్నారు. మనం వారికన్నా మెరుగనుకోవడం భ్రమ. మనం వాళ్ళ మాదిరి మనుషులమే. కాబట్టి సాధ్యమైనంతవరకు 'అనుభవానికి' దూరంగానే ఉంటూ ఆ విషయంలో మన అమాయకతను (Innocence) వీలైనంతమట్టుకు కాపాడుకోవడం శ్రేయస్కరం." ఈ అభిప్రాయంతో నీవు ఏకీభవిస్తావా? 'ఏకీభవించుము' అని నేను బలవంతం చేయను. కందిరీగల తెట్టు కదిలించడం కదిలించకపోవడం ఎవరికి వారు తీసుకోవలసిన నిర్ణయం. ఇతరుల ప్రమేయం లేదు.

ఇలా కబుర్లు ఎన్నైనా చెప్పుకుపోవచ్చు. కాని ఒక ముఖ్యవిషయం నిన్న మరిచాను దాన్ని చెప్పాలనుంది. "ఆధ్యాత్మిక వికాసానికి బ్రహ్మచర్యం ఎలా దోహదకారి అవుతుంది?" అనే విషయాన్ని నిన్న అంత సరిగా వివరించలేదని నాకు తోస్తున్నది. లోకంలోని 'అర చదువు మేధావులు' కొందరు ఆహార నిద్రా మైథునాదులను ఒక గ్రూపు క్రింద చేర్చి ఇవి ప్రాణులకు అత్యవసరం అని తీర్మానిస్తారు. మొదటి రెండు అత్యవసరమే. మూడవది అవసరమో కాదో నాకు తెలియదు గాని అత్యవసరం మాత్రం కాదని చెప్పగలను. అన్నపానాలు లేకుండ మనిషి బ్రతకలేడని అందరికి తెలుసు. అన్నపానాలు ఎంత అవసరమో నిద్ర కూడా అంతే అవసరం. వరుసగా మూడు నాలుగు రోజులు బొత్తిగా నిద్ర లేకపోతే మనిషి మనస్సు గతితప్పిపోయే అపాయం ఉంది. కాని మూడవది లేకపోయినంత మాత్రాన మునిగిపోయేదేమీ లేదు. దాని జోలికి పోకుండ జీవితం సక్రమంగా నెట్టుతున్నవాడికి జీవితం బాగానే సాగిపోతుంది. అయితే ఒకటి: హృదయంలో ఒక విధమైన వెలితి, ఒక అతృప్తి (discontentment), ఒక మూగవేదన (painless sorrow) చోటు చేసుకుంటాయి. ఆధ్యాత్మికతకు కావలసింది అదే. ఈ అతృప్తి (discontentment) చాల విలక్షణమైంది. భౌతిక విషయాల్లో మానవులకున్న అతృప్తి వంటిది కాదది. ధనం, పాండిత్యం, పదవి, కీర్తి - ఇటువంటి భౌతిక విషయాల్లో మానవులకున్న - ఉన్నది చాలక ఇంకా కావాలనే-అతృప్తి వల్ల వాళ్ళు మరింత కార్యమగ్నులై భౌతికంగా లాభం పొందుతారు. ఆధ్యాత్మికంగా దానివల్ల లాభం ఉండదు. దీర్ఘకాలపు బ్రహ్మచర్య జీవితంవల్ల హృదయంలో ఏర్పడే అతృప్తి (discontentment) పైదానికన్నా చాల విలక్షణమైంది. ఈ విలక్షణమైన అతృప్తియే ఆధ్యాత్మిక వికాసానికి దోహదకారి. ఈ అతృప్తిని దీపంతో పోల్చుదాము. అతృప్తి అనే దీపాన్ని (flame of-discontentment) హృదయంలో దీర్ఘకాలం ఆరిపోనీయకుండ జాగ్రత్తపడిన వానిలో చాల పరిణామం కలుగుతుంది. ఈ పరిణామం వల్ల, లోకులు పెద్దగా గణిస్తున్న కీర్తిప్రతిష్ఠలమీద, అంతస్తు-హోదా-పదవులమీద, సంపదమీద, పాండిత్యంమీద-వీటన్నిటిమీద అతనికి విరక్తి భావం జనిస్తుంది. వీటికోసం ప్రయాసపడే జనాన్ని చూసి అనుకంప చెందే ఆత్మోన్నత్యం కలుగుతుంది. బాల్య యౌవనాల్లో తనకున్న ఆదర్శాలు ఆశయాలు ఆశలు ఒక్కొక్కసారి స్మరించుకొని నవ్వుకునే స్థితికి ఎదుగుతాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆధ్యాత్మిక మార్గంలో పడినవాడవుతాడు. నీ ముఖకవళిక చూస్తుంటే ఇదంతా నీకర్థం అవలేదని తెలుస్తున్నది. నీకు బోర్ కొట్టకముందే మర్యాదగా నా ఈనాటి ప్రసంగాన్ని ఇక్కడ ఆపివేయడం మంచిదని భావిస్తున్నాను. రేపటి విషయం: "ఆధ్యాత్మికత అంటే ఏమిటి?"

ఓం ప్రకాశ్

# నా కథ - మీ కథ కూడా

[జ్ఞానయోగి షడ్కికథ]

అడుగులు త్వర త్వరగా వేయసాగాను. అప్పటికే చాలా అలసిపోయాను. ఆ అడవిలో పడి అడ్డదిడ్డంగా తిరిగి తిరిగీ పూర్తిగా అలసిపోయాను. పైన మార్తాండుడు చండ ప్రచండుడై మండిపోతున్నాడు; నిప్పులు చెరుగుతున్నాడు. వనమంతా వేడికి కుతకుత ఉడికిపోతున్నది. ఆకులు ముడుచుకుపోతున్నాయి. చెట్లనుండి వేడి వేడి గాలులు రివ్వురివ్వుమంటు వీస్తున్నాయి. ఆ ఉష్ణతాపానికి భయపడి జంతువులు, మృగాలు కిక్కురుమనకుండ ఎక్కడెక్కడో దాక్కున్నాయి. పక్షులు గూళ్ళు విడిచి కాస్సేపలా ఎగరటానికే సాహసించటం లేదు.

కాళ్లు చుఱుమంటున్నాయి. అడుగు తీసి అడుగు వేసేలోగా పాదాలు నిప్పుకణాలను తొక్కినంతగా మండుతున్నాయి. వనమంతా ఉష్ణవాయువులు వ్యాపించి వీరవిహారం చేస్తున్నాయి. దుమ్మూ ధూళీ ఏకమై అరణ్యాన్నంతా ఆవరించి, ఆ విశాలవనాన్ని ధూసరితం చేశాయి. నా నవనాడులు నీరసించిపోయాయి. ముఖమంతా చెమటతో మలినమై పోయింది. ఆ విశాల వనాన్ని దాటివేయాలన్న తొందరలో వేగంగా అడుగులు వేస్తున్నాను. చేరువలో ఏ చిన్న పల్లె అయినా కనబడకపోతుందా అన్న ఆశతో ముందుకురుకుతున్నాను. నా ఆశకు ప్రాణం వచ్చింది. దగ్గరిలోనే చిన్నపల్లె కన్పించింది. ఆ కుగ్రామంలోకి వెళ్ళి కాసేపు విశ్రమిద్దామన్న నిశ్చయంతో ముందుకు సాగిపోతున్నాను.

‘ఎవరు బాబు నువ్వూ?”

హఠాత్తుగా ఆగిపోయాను. ఎవరిదో మనిషి గొంతులా ఉందే! తలెత్తి చూశాను. ఎవరో మహానుభావుడు. దివ్య తేజస్సుతో వెలిగిపోతున్నాడు. ఏ దేవతాపురుషుడో అయ్యుంటాడు; ఏ బ్రహ్మర్షో అయ్యుంటాడు. ఆ దివ్యమైన ముఖంలో ఎంత ప్రసన్నత ఉన్నది! యథార్థంగా, అతను పూర్ణకాముడు; ఆత్మజ్ఞాని, మహాత్ముడే సుమా! ఎంత ప్రశాంతంగా ఉన్నాయి అతని చూపులు! అమృతం సేవించాడు! మహాసామ్రాట్‌లా, విరాట్ పురుషునిలా ఎంత నిర్భయంగా నిలబడ్డాడు! ఇంత శక్తియుతమైన, దివ్య తేజస్సు ఇతనికెలా లభించిందో! నిలబడింది భూమ్మీదే అయినా, సమస్తలోకాల నధిగమించి. వాటికెంతో పైన ఆకాశంలో స్థితుడైయున్నట్లు, ఆ మహాత్ముడెంత స్థిరమతియై నిలబడియున్నాడూ! సంసారంలో ఏ మాత్రం స్పృశ్య లేనట్లు, ఎంత దృఢమతియై యున్నాడూ! సంపూర్ణ కళాశోభితుడై, నిష్కళంకుడై ప్రకాశిస్తున్నాడు! అంతఃకరణము శాంతించినట్లు, సమత్వ బుద్ధియుతుడై, ప్రకాశమానుడై, నా హృదయానికెంతో ఉల్లాసాన్ని కల్గిస్తున్నాడు. ఎవరీ మహాపురుషుడు? నాలాంటి మూఢబుద్ధులను ఉద్ధరించ వచ్చిన భగవానులు కాదు కదా! ఆ మహాపురుషుని ప్రసన్న మందహాసం నన్ను పూర్తిగా ఆకట్టుకొన్నది. నా అలసటంతా ఏమయిందో, నాలో ఏదో తెలియని ఉత్సాహం ప్రవేశించింది. వెంటనే సాగిలబడి ప్రణామం చేశాను.

“భగవాన్! నేను శాండిల్య గోత్రంలో

ఉత్పన్నమయిన బ్రాహ్మణుడను. నన్ను మజ్జి అంటారు. అడవుల్లో దరుగాని. తెలుసుకోవా లన్న కుతూహలమున్నది. మీ రెవరో తెలుప గలరా?"

"మహాధీయుతుడా! ఆకాశవాసుకనైన వసిష్ఠమునిగా లోకం నన్నెరుగును." ఇలా చెప్పి నన్ను మృదువుగా లేపాడు. పక్కనే ఉన్న గుబురుచెట్టు పూర్ణఛాయలోకి తీసికెళ్ళి, ఒక తిన్నెపైన కూర్చుండబెట్టి, తానూ ఆసీను డయ్యాడు. అదేమి వింతో, అతని చేరువలో నున్న వాయువంతా మలయమారుతంగా మారి చల్లగా సున్నితంగా స్పృశించి, నన్ను సేద తీర్చింది. ఆ మహర్షి అనుగ్రహపూర్వకంగా చల్లని చూపులతో నన్ను ఆలోకిస్తున్నాడు.

ఈ సంసార విభ్రమాలతో విసిగెత్తిపోయాను. ఎంతగా త్రవ్వి చూసినా, ఈ సంసారంలో దుఃఖమే దుఃఖంగాని, సుఖం లేశమాత్రంగానైనా కన్పించటంలేదు. ఈ శరీరాన్నెంత జాగ్రత్తగా పోషించినా, ఏ క్షణంలోనైనా మోసం చేసిపోతుంది. ముసలిదై ముడతలు పడి, అసహ్యంగా మారిపోతుంది. దీని కోసం నా ఆయువునంతా పాడుచేసుకోవాలా! ఇంద్రియ విషయాల సంగ్రహంలో, సేవనంలో ఆయాసం దుఃఖం తప్పించి మరేమున్నాయి? లోకవృత్తులకెరయై బుద్ధి కలుషితమై వివేకభ్రష్టమైపోతున్నది. స్వజనుల్లో ఆసక్తతవల్ల వచ్చేలాభమేమేటి! తమ ప్రయోజనాలు నెరవేరేంతవరకు తన్ను అంటిపెట్టుకుని ఆ తర్వాత ఎంగిలి విస్తరిలా విసరికొడతారు! ఈ భోగాభిలాషయే కదా జన్మ మరణాలకు కారణమవుతున్నది! ఈ మనస్సునకు ఎంతసేపూ అపవిత్రమైన విషయచింతనే తప్పించి, సర్వ దుఃఖాలకాకరమైన ఈ సంసార సముద్రాన్ని తరిద్దామన్న ఉద్దేశమే లేదు కదా! ఎప్పుడూ గంపెడు గంపెడు కోర్కెలతో నన్ను పీడిస్తూ ఉండటం తప్ప దీనికి మరో ధ్యేయం లేనట్లుంది. తనువు శీర్ణమైనా, ఇది మాత్రం చావదు కదా! మదించిన ఏనుగులా ఇది నన్ను త్రొక్కివేస్తున్నది. వాడిదేలిన కత్తుల్లా ఈ ఇంద్రియాలు నన్ను పొడిచివేస్తున్నాయి. భగవాన్! ఏమిటీ చేయటం? వీటి బారినుండి ఎలా బ్రతికి బయటపడటం? నాలో నేను రోదించాను. మహాపురుషుల సేవ చేయలేదు. శాస్త్రజ్ఞాన మందామా, అందులో ఆవగింజమాత్రం కూడ సంపాదించలేదు. ఇక ఎలా ఈ సంసార దుఃఖాన్ని అధిగమించటం!

నా నేత్రాల్లో నీరు నిండిపోయింది. అశాంతితో, ఉద్విగ్నమనసుతో మహర్షులను చూశాను. మహర్షి చిన్నగా నవ్వాడు. మనోస్థితినంతా గ్రహించినట్లు మృదువుగా అధరాలు విప్పాడు.

"బ్రాహ్మణకుమారా! ఎక్కడికో పోయే తొందరలో నున్నట్లున్నావు. మార్గం మరిచి భ్రమిస్తున్నట్లు కనబడుతున్నావు. వీతరాగులు, అకించనులు సంచరించే మార్గం నీకు తెలియదా? ఈ ఎడారియందున్న ఈ మహారణ్యంలో ఎక్కడికని పోతున్నావు? జనసముదాయం గల గ్రామాలే కన్పించని ఈ మార్గంలో కొండొకచో కొంత ప్రజగల కుగ్రామంలో కాస్సేపు విశ్రమించినంత మాత్రాన, చిరస్థాయి సుఖం లభిస్తుందా? సకామ మార్గమందు పయనిస్తూ మధ్యలో స్వర్గాది ప్రాంతాలలో సుఖంగా కాస్సేపు విశ్రమించినా, ఆ పరమానంద సుఖం, ఆ ప్రశాంతస్థితి లభ్యమౌతుందా? పామరులు వసించే ఈ చిరుపల్లెలో నీకు విశ్రాంతి దొరకదు. దేహాభిమానుల నివాసస్థానముగు ఈ శరీరంలో శాంతి లభ్యం కాదు. లవణజలపానంవల్ల దాహం

ద్విగుణీకృతమవుతుంది. ఈ శరీరంలో సుఖభోగాలవాంఛ ఇనుమడిస్తుందే తప్ప, ఎప్పుడూ పూర్తిగా అణగిపోదు. ఈ గ్రామంలో ఈ దేహంలో ప్రాణికి కామమందే, ధనమందే, ద్వేషాదులందే ఆసక్తి యుంటుంది; వాటియందు ప్రవృత్తులు కావటంలోనే ఈ ప్రాణి పరమపురుషార్థమని ఎంచి, తన్ను తాను వంచించుకుంటుంది. ఈ ప్రాణుల ఆలోచనలు దగ్ధమై భస్మప్రాయమై యుంటాయి. వీరు ఆపాతరమణీయ సకామకర్మలందే రమిస్తుంటారు. ఉదారమైన, శీతలమైన, బ్రహ్మానందం చేత సుశోభితమగు వివేకబుద్ధి వీరిలో ఉండదు. గ్రామ్యసుఖభోగాలు మధుమిశ్రితవిషసేవనం వంటివి. క్షణకాలం మధురంగా ఉంటాయి. మరుక్షణమే మృత్యుఘాతకాలవుతాయి. వీటివల్ల నీకు చిరసౌఖ్యం దొరకటం కల్ల. ఈ గ్రామంలో నీకు సుఖవిశ్రాంతి లభ్యం కాదు.''

ఆ మహర్షి మాటల్లో ఎంత అనుభవయుత జ్ఞానముందీ! ఆ జ్ఞానామృతం సేవించగానే నా మనస్సు చప్పున శాంతించిపోయింది. దేవేంద్రుని చేతనుండే అమృతం దీనిముందు ఏపాటిదీ! అనుకొని, ఆనందంతో బ్రహ్మర్షులను తనివితీర తిలకించాను.

''భగవాన్! మీరు దర్శనమాత్రంగానే మిత్రులయిపోతారు. మిమ్మల్ని చూసిన తక్షణమే కమలంలా ప్రాణుల మనసులు వికసించి, ఆశ్వస్తమౌతాయి. నా మనసు మోహపరవశమైపోయింది. ఈ సంసారభ్రమజనితదుఃఖాన్ని నివారించటంలో అసమర్థమై యున్నది. మీలాంటి సాధుపుంగవుల ద్వారానే హృదయం స్వచ్ఛమవుతుంది. నన్ను అనుగ్రహించండి. నాపై కృప వహించండి. తత్త్వజ్ఞానాన్ని నాకు బోధించండి''

ఆ గురుమహర్షికి మరల సాష్టాంగ నమస్కారం చేశాను. వారు స్వయంగా నన్ను పైకి లేవనెత్తి చెంతన కూర్చుండబెట్టుకున్నారు.

''వత్సా! విషాదం చెందకు. మనీషా పురుషుల మార్గంలోకి వచ్చేశావు. సంసార సాగర ఆవలితీరం వైపు చేరుకున్నావు. ఇక భయం లేదు. అభీతుడవు కమ్ము. నీలో రాగాది మలినాలు తొలగిపోయాయి. నీ చిత్తంలో వివేకం ఉదయించింది. నీ బుద్ధిలో, నీ వాణిలో వైరాగ్యం ప్రవేశించింది. నీవు శాంతిపూర్ణుడవు కాబోతున్నావు. ధీరత వహించు. ధీరత వహించు.''

మహర్షి ధైర్యవచనాలు, ఉత్సాహపూరిత వాక్కులు నాలోనున్న అశాంతిని నిరుత్సాహాన్ని దోలాయి. ఆహా! నిజంగా గురువులంటే, వీరేకదా! శిష్యునిలో నున్న అల్పత్వాన్ని గ్రహించకుండా, అతనికి సహజసిద్ధమైన అనల్పత్వాన్నే, శిష్యునిలో ప్రేరేపింపజేయగల్గినవాడే నిజమైన గురువుకదా! నాలో ఇంతవరకు గూడుకట్టుకొనియున్న ఈ భయాలను, ఈ బలహీనతలను, కించిత్తయిన పేర్కొనకుండ ఎంత స్పష్టంగా నాలో ఉత్సాహాన్ని నింపేస్తున్నాడీ మహర్షి. భగవాన్! ధన్యున్నయ్యాను!''

మహర్షులవారు నా భుజాన్ని చల్లగా స్పృశించారు. ఆ లోకం నుండి, నా దృష్టిని మహర్షివైపు త్రిప్పాను.

''ఇప్పుడు చెప్పు. నీవు మహాబుద్ధిమంతుడవు. మహాత్ముల బోధను, సాధకుడు స్వప్రయత్నం చేతనే ఫలవంతం చేసుకుంటాడు. శోకరహిత విశుద్ధ పరమాత్మ తత్త్వాన్ని ప్రాపించటానికి యోగ్యుడౌతాడు. నీవు జన్మాది సంపూర్ణ దుఃఖాల నుండి తరించాలని అభిలషిస్తున్నావు. నీకు తప్పక బోధ గరుపు

తాను. చెప్పు. ఈ సంసారాన్నుండి ఎందుకు దూరంగ పారిపోవాలనుకుంటున్నావు?"

"భగవాన్! ఈ బ్రహ్మాండంలో నున్న భూతాలు, మెరుపు కూడిరి క్షణకాలం మెరిసి అదృశ్యమవుతున్నాయి. పంచమహాభూతాల స్థితే క్షణభంగురమైనప్పుడు, ఈ దేహాదుల స్థితి ఏమని చెప్పాలి? నామనస్సు సంసారం నుండి ఈ విచారణలతో విరక్తమై పోయింది. ఇల్లూ వాకిలి అంటే ఆసక్తి నశించింది. అందుకే ఇలా వాటికి దూరంగ పరిభ్రమిస్తున్నాను. మీ ఆశ్రయం లభించింది. నాకో స్థిర మార్గం చూపండి."

నేను నా స్థితినంతా మహర్షులకు తెలియజేశాను. మహర్షుల వదనం గంభీరమై పోయింది.

"బ్రాహ్మణపుత్రా! 'సంవేదన, భావన, వాసన, కలనా - ఈ నాల్గు శబ్దాల అర్థం సంసారంలో అనర్థం కలుగ జేస్తుంది' ఇవన్నీ మిథ్యారూపాలే; నిష్ప్రయోజనాలే. అవిద్య వల్ల ఇవి విస్తరిస్తున్నాయి. వేదన, భావన- ఈ రెండూ సమస్త దుఃఖాలకు ఆశ్రయమైనట్టివి. అందులో ఈ భావన ఉండే, ఇదే సర్వ ఆపత్తులకు నిలయం. ఈ సంసార మార్గం బహుగహనీయమైనది. వాసనావేశితులై దీనిపై చరించే ప్రాణుల మీద విచిత్రపరిణామాలు గల అనేక సంఘటనలు వచ్చిపడుతుంటాయి. వివేకవంతుడు మాత్రం వాసనారహితుడై ఈ సంసార భ్రమమార్గంనుండి వైదొలగుతాడు. వాసనయే సంసారమనే ముండ్లపొదలను వ్యాపింపజేస్తుంది. నిజానికి అద్వితీయ విశుద్ధ సచ్చిదానందఘన పరమాత్మకు మించి, మరొకటేమీ లేదు. దయ్యం లేకున్నా, ఉన్నదన్న భ్రాంతిలోపడి పసివాడు భయపడతాడు; అలాగే అసత్యయిన ఈ సంసారం, పరమాత్మ తత్త్వజ్ఞానం లేని కారణంగ సత్యంగా (ఉన్నట్లుగా) భ్రమింపజేస్తుంది. పరమాత్మజ్ఞానంతో ఇది క్షణంలో మటుమాయమవుతుంది."

దివ్యమైన, అతిగంభీరమైన, నిగూఢమైన మహర్షి బోధ నా మనసులోన మోహపు తెరలను ఒక్కటొక్కటిగా తొలగించి వేస్తున్నది. వికసిత ఆనంద హృదయంతో మహర్షి వాణి నుండే ఏకాగ్రత వహించి శ్రవణమనననిదిధ్యాసనములు ఏకకాలమందే చేస్తూ దివ్యానందాన్ని అనుభవిస్తున్నాను.

"తత్త్వజ్ఞానం చేత జ్ఞాతమయ్యే వస్తువు, వాస్తవంగ జ్ఞానస్వరూపమే సుమా! వత్సా! జాగ్రత్తగా వినుము. మనస్సును క్షణమాత్రం కూడ చలింపజేయవద్దు. పరమాత్మజ్ఞానం ఏకధారగ వింటే తప్ప పట్టుబడదు. అజ్ఞానం, జ్ఞానానికి పరమ విరోధి. జ్ఞానానికి అది అందదు. వివేకంతో విచారించుము. జ్ఞేయము, జ్ఞానము ఏకరూపాలేనని తెలుసుకొంటావు. అవి భేదరహితమైనవి. ద్రష్ట, దర్శనము, దృశ్యము- ఈ త్రిపుటిలోని ప్రతిదాని బోధరూపమే సారము. జ్ఞానరూపం రీత్యా, ద్రష్టాదులకు భిన్నంగా మరో వస్తువుండదు. "ఇది నాది" అన్న భావనయే బంధానికి కారణం. "నేను ఈ శరీరాదుల్లో ఏదీ కాదు" అన్న అహంతయొక్క అభావమే ఆ మమత్వబంధనాన్ని విచ్ఛేదంచేసి ముక్తిని ప్రసాదిస్తుంది. సుత్తితో కొడిన బంతి ఎగిరెగిరి ఎక్కడెక్కడో క్రింద పడిపోతుంది. వాసన, అభిమానం, అనురాగమనే రసాలచేత రంజితులై లోకులు ఎగిరెగిరి నరకకూపాల్లో పడుతుంటారు. అక్కడ దీర్ఘకాలం వివిధ వాసనాక్లేశాల ననుభవించి, జర్జరులై, కాలాంతరంలో మరల స్థావర, క్రిమి

కీటకాది అనేక రూపాల్లో ప్రకటనవుతారు. మానవజన్మం వారికతిదుర్లభమై పోతుంది.''

'ఏమిటీ, మానవజన్మ అతిదుర్లభమై పోతుందా! ఆ మాట వినగానే ఉలిక్కిపడ్డాను. నేను మానవజన్మకాదు గదా, మానవజన్మకు పరాకాష్ఠ అనబడే బ్రాహ్మణ జన్మనే పొందాను. బ్రాహ్మణ జన్మను పొందికూడ, ఈ అహంకార, మమకారాల్లో పడి బ్రాహ్మణజన్మ ధ్యేయమే మరచిపోయాను. బ్రహ్మయందు చరించటమే బ్రాహ్మణ జన్మలక్షణమంటారు. బ్రహ్మను, సర్వత్రా కనుగొని, సర్వజీవులందు దయ, సమత్వము వహించి, నిస్సంగ, నిరాడంబర జీవితాన్ని గడుపుతూ నిత్యానందచిత్తుడై యుండటమే బ్రాహ్మణ జన్మ ఉద్దేశంగ చెప్పబడుతుంది. అంతటి ఉత్కృష్ట జన్మను పొంది కూడ, సత్వశుద్ధిని, అమానిత్వాన్ని, అదంభిత్వాన్ని, అనహంకారాన్ని సాధించనినాడు, ఆ బ్రాహ్మణుడు జీవిత పర్యవసానంలో చండాలుడుగానో, అధముడుగానో పరిగణింపబడతాడు. భగవంతుడిచ్చిన కార్యాన్ని నెరవేర్చనందుకు ఆ జీవి, కొండచిలువ మింగితే, జర్రున అడగుకు జారినట్లు ఆ బ్రాహ్మణుడు అత్యంత నీచగతులకు పాల్పడతాడు! ఆ బ్రాహ్మణజన్మ యొక్క కర్తవ్యం ఎంత ఉత్కృష్టమయినది!'' బ్రాహ్మణుల్లో, ఇలా ఎంతమందీ కర్తవ్యోన్ముఖులై జీవితం గడుపుతున్నారూ!

''భగవాన్! నేనెంతోకాలం కఠోర నియమాల చేత జీవితం గడిపాను. అయినా ఆ జీవిత విధానంలో నాకేమాత్రం శాంతి లభించలేదు. సత్పురుషుల నెంతోమందిని ఎక్కడికంటె అక్కడికి వెళ్ళి కలిశాను. ఎన్నెన్నో మార్లు పలుదిక్కులకు వెళ్ళి మహాత్ములను దర్శించాను. కాని మనోగతమైన నా అశాంతి మాత్రం దూరం కాలేదు. శాంతికోసమని పెద్ద ఎత్తున తీర్థయాత్రలకు బయలుదేరాను. చాలా పెద్ద దూరాన్ని నిశ్చయించుకొని క్షేత్రాలను, తీర్థాలను దర్శించసాగాను. కనపడ్డ దేవునికల్లా సాష్టాంగం పడ్డాను. ఎదురయిన తీర్థంలో మునకలు వేశాను. ఎంతో కాలం గడిచిపోయింది. అయినా నామనసు మునుపటిలాగే అశాంతి పూరితమై ఉంది. ఏం చేయాలో తోచలేదు. తిరుగుముఖం పట్టాను. ఊరికి చేరువవుతున్న కొద్దీ నాలో నిరాశ, ఆవేదన పెరగసాగాయి. ఇంటికి పోబుద్ధి కాలేదు. ఇలా ఈ అరణ్యంలో ప్రవేశించి తిరగాడుతున్నాను. భగవాన్! దైవం నాపై కరుణ చూపించింది. భగవంతుడే స్వయంగా మీ రూపంలో వచ్చాడన్నంతగా ఆనందం వేస్తున్నది. ఎంత మందిని దర్శించానూ! అయినా నా సంశయాలు విచ్ఛేదము కాలేదు. మహాపురుషులైన మీ దర్శన, శ్రవణాల వల్ల నా మనస్సు నిర్మలమౌతున్నది. భగవాన్, ఇంకా చెప్పండి. ఈ ఆనంద రసప్రవాహాన్ని ఆపకండి!''

నేను తన్మయుణ్ణై పోయాను. నా ముఖంలోని ఆనందాన్ని చూశాడేమో మహర్షి, అత్యంత ఉత్సాహంతో, మరెంత నిగూఢమైన విషయాలను తెలుపసాగాడు.

''విప్రకుమారా! సంసారం యొక్క నిజస్వరూపం తెలుసుకొంటే, నీ అశాంతి దూరమవుతుంది. ఈ సంసారంలో నున్న పదార్థాలు, ఒకదానికొకటి ఎలాంటి సంబంధం లేనివి. భావమే వీటిని కల్పుతుంది. విడదీస్తుంది. ఈ వాసనకు వశీభూతులై, సమస్త ప్రాణులు విభిన్నజన్మల్లో, విచిత్రప్రకారంగ సుఖదుఃఖాలనుభవిస్తుంటారు. అసద్విషయాల్లో తృప్తిని పొందుతున్నామని అనుకొంటారు. ఈ జగత్తు భావన లేదా సంకల్పమాత్రమే! ఏ

సకలపదార్థాన్ని బ్రహ్మ అని అంటామో, అదే సమస్తపదార్థాల వాస్తవిక స్వరూపము. జ్ఞాన యోగి నిర్మల ఆత్మలో నిమగ్నుడై నామరూపాత్మకమైన ఈ ప్రపంచాన్నుండి అతీతుడౌతాడు. అతనికి అభ్యాసం దృఢం కానంతవరకే, స్వప్న వికారం మాదిరి ఈ నానారూప ప్రపంచం భాసిస్తుంది.''

మహర్షి అతిజాగ్రత్తగా ఉపదేశిస్తున్నాడు. నాకు మహర్షి వాణి తప్ప మరేమీ తలపుకు రావటంలేదు.

''కుమారా ముక్తా! ఒక విషయం స్పష్టంగా తెలుసుకో, ఈ మనస్సున్నదే, ఇది చాలా మోసకారి. మనస్సెక్కడైనా ఏదైనా నిర్మిస్తే, అక్కడెల్లా, ఆయా వస్తువుల రూపాల్లో, ఈ మనసే ఉంటుంది. మనసును మించి దృశ్య వస్తువుయొక్క ఉనికి లేనేలేదు. జీవాత్మలో అహంత ప్రవేశించగానే సంసార భ్రమరూప భావ వికారం జనిస్తుంది. ఆ అహంత నశించిన వెంటనే ఆ వికారం శమించిపోగా తన స్వస్వరూప స్థితిలో లీనమై జీవాత్మ సహజ శాంతిని పొందుతాడు.''

మహర్షులవారు జలపాతంలా చెప్పుకుపోతున్నారు. అతని వాణిని జీర్ణించుకోటానికి సర్వవిధాల సిద్ధమై కూర్చున్నాను.

''మోక్షకామి! పరమాత్మ అంటే ఎవరనుకున్నావ్? మోక్షస్వరూపుడు, మనోరహితుడు, మౌని, కర్త, అకర్త, శీతలుడు. అతను జ్ఞానస్వరూపుడు, శాంతుడు. అతను దృశ్య ప్రపంచంలో శూన్యుడైకూడ సర్వత్ర పరిపూర్ణుడు. యంత్రపుబొమ్మ, చేష్టా వాసనా శూన్యమై యున్నట్లు జ్ఞానస్వరూపఆత్మ వాసనారహితమై, స్పందనశూన్యమై యున్నది. వ్యవహార పరాయణంగ కన్పించినా, తన యథార్థరూపంలోనే స్థితమైయున్నది. ఈపరమాత్మబోధ అఖండమైనది; ఇది ఆశా, చేష్టా, ఏషణా, కామనా మున్నగు వికారాలు లేనిది. ఇది బహిర్ముఖవృత్తి శూన్యమైనది. శాంతమైనది. అనంత ఆత్మ స్వరూపమైంది. సమస్త కామనారహితుడైన జీవన్ముక్త జ్ఞాని పురుషునికే ఇది అనుభూతమవుతుంది; ద్రష్ట, దృశ్యము, దర్శనమనే త్రిపుటి రహిత, నిరాకార బ్రహ్మ సాక్షాత్కారము కల్గుతుంది. అలాంటివారికి శరీరానుసంధానమే సంభవించదు. సాధకశ్రేష్ఠా! ఒక నిజం గ్రహించు. సమస్త వస్తువుల అపేక్ష (ఇచ్ఛ) యే సుదృఢ బంధము. వాటి ఉపేక్ష (ఉదాసీత) యే ముక్తి. ఆ ముక్తిలో విశ్రమించే వారికి దేనిగూర్చి ఇచ్ఛ యుంటుంది?''

నేను ప్రఫుల్లిత హృదయుణ్నాయి ఆనందంలో లీనమయిపోయాను. కొన్ని క్షణాలు అలాగే గడిచాయి. నెమ్మదిగా కనులు విప్పి చూశాను. ఎదురుగ్గా దివ్య తేజంతో ప్రసన్న వదనంతో మహర్షి దర్శనమిస్తున్నాడు.

''మహాపురుషా! భగవాన్! ధన్యుణ్నయ్యాను. ధన్యుణ్నయ్యాను.''

ఆ మాటలకు మహర్షి తృప్తిగా మందహాసం చేశాడు.

''కుమారా! నీవు నిజమైన యోగివి, సత్యాన్వేషివి. అందుకే నీ చెంతకు వచ్చాను. తత్త్వజ్ఞాని కేవలం తన యథార్థ స్వస్వరూపంలోనే స్థితుడై యుంటాడు. అతని సర్వ వాంఛలు, చేష్టలు శాంతించిపోతాయి. అతని సర్వ ఉత్కంఠతలు దూరమైపోతాయి. అతనికి తన శరీరం యొక్క భావనకూడ యుండదు. వెళ్ళు, ఈ నా బోధను దృశ్యప్రపంచంలో సమన్వయం చేసుకొని, దానిలో అంటీఅంటనట్లు జీవితం గడుపు. ఇక నిన్ని సాంసారిక

మోహం ఎన్నడూ ఎప్పుడూ ఏవిధంగాను బాధించదు. నీకు శుభమగుగాక! శ్రేయమగుగాక!"

ఆ మహర్షి ఆశీర్వదించి, ఎలా వచ్చాడో అలాగే అదృశ్యమైపోయాడు. భగవంతుడే నాకీ జ్ఞానాన్ని స్వయంగా అందించాడా! ఏమో! అదే అయ్యుంటుంది. లేదా నా ఆత్మయే నాకీ బోధ చేసిందా! అది కూడ వాస్తవమే! జిజ్ఞాసికి, అన్వేషికి, అతని ఆత్మయే అతనికి గురువని అంటారు కదా!

ఏదీ ఏమైనా ఆ బోధవల్ల నాలో పరిపూర్ణ శాంతి చేకూరింది. సంసార జనితమైన భ్రమరూపాత్మక మహామోహం నాకప్పుడే నశించింది. పాము తన కుబుసాన్ని విడిచినట్లుగా, ఆ మాయామోహాన్ని త్యజించివేశాను. ఈ మిథ్యారూపమైన దృశ్యప్రపంచానికి, సంసారానికి భయపడటమేమిటి!

నేను అభీతుణ్నాయి అరణ్యాన్ని దాటి తిరిగి దృశ్య ప్రపంచంలోకి ప్రవేశించాను. ఇంటి వ్యవహారాల్లో ఉంటూ కూడ మహర్షి బోధను అనుసంధానం చేసుకొంటూ జీవించసాగాను.

ప్రారబ్ధవశాన ప్రాప్తించిన కార్యాలను, వాసనాశూన్యుడనై చేస్తూ, అలా నూరు సంవత్సరాలు గడిపాను. చివరికోరోజు, ఆ పర్వతాన్ని చేరి జ్ఞానానుభూతిలో లీనమయ్యాను. తర్వాతేమయిందో చాలాకాలానికి గాని తెలియరాలేదు. నా సమస్త ఇంద్రియాలు శాంతించాయి.

వన్నెవరో తట్టితే, కన్నులు తెరిచి చూశాను. ఎవరో సిద్ధమహాపురుషులు!

"జ్ఞానయోగి, మహాత్ముడా! నీవు పరిపూర్ణస్థితిని సాధించావు. నిర్వికల్ప సమాధి స్థితిని పొందావు. ధన్యుడవు ధన్యుడవు. నిన్ను దర్శించిన మా నేత్రాలు ధన్యత నొందాయి."

వారు నన్ను జ్ఞానయోగి అన్నారు. నవ్వుకున్నాను. నేను జ్ఞానయోగినేమిటి! నేను, నేనే. సర్వమూ నేనే. నేనే సర్వమూ!

ఇది నా కథ. కేవల కాదు. మీ కథకూడ! ఎందుకంటే, నేను, మీరు భిన్నం కాదు కదా!

## కథా వివేచనము

ఈ కథ శ్రీ యోగవాసిష్ఠమందు నిర్వాణప్రకరణంలో ఉత్తరార్ధంలో కనబడుతుంది. ఇది 23 నుండి 26 సర్గల వరకు పరివ్యాప్తమై యున్నది. ఆత్మబోధను తెలిపే చక్కని వృత్తాంతమిది.

ఆత్మబోధకు ఫలానిజన్మయే తగునని నిర్బంధము లేదు. ఏజన్మ అయితేనేం, ఆత్మబోధ బడయవచ్చు. అది బ్రాహ్మణజన్మయే కావచ్చు, లేదా చండాలజన్మయే కావచ్చు. ఆ విభేదం ఆత్మబోధకు అవసరం లేదు

కావలసింది జిజ్ఞాస, విరక్తి, విచారణ, అన్వేషణ. ఈ స్వభావం ఉన్న ప్రతివాడు ఆత్మబోధకు అర్హుడే. బ్రాహ్మణుడయినంతమాత్రానా అతనికివి అవసరం లేకుండా మోక్షం లభిస్తుందనుకోటం అజ్ఞానమనే అవుతుంది. నొక్కి చెప్పాలంటే, బ్రాహ్మణులకే ఈ సాధనాలు అత్యంతం అవసరం. ముందుగా వారే బ్రాహ్మణత్వాన్ని సాధించాలి.

ఈ విషయం షడ్కుద్వార చక్కగా వివరింపబడింది. అతను జన్మరీత్యా బ్రాహ్మణుడైనా, అతని జాతి అతనికి మోక్షమార్గం చూపలేకపోయింది. అతని సాధనమే, ఆచరణమే, అభ్యాసమే అతనికి ముక్తిమార్గాన్ని చూపింది.

-పై సంచికలో విద్యాపురుషుని కథ.

సంపాదకులు : స్వామి తన్మయానంద. ముద్రాపకులు : ఎం. తీర్థానందం
[illegible]స్, మద్రాసు - 21). ప్రచురణ : శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు - 4.



# "శ్రమయేవ జయతే"

నిజాయితీ, కఠోర పరిశ్రమ, స్థిర సంకల్పం ద్వారా అధికోత్పత్తి సాధన - రిపబ్లిక్ దినోత్సవావ మన విజ్ఞప్తి.

జాతికి శంఖారావం వినిపించింది. క్రమశిక్షణకు, కఠోర పరిశ్రమకు పునరంకితమయ్యే తరుణం వచ్చింది. న్యాయసమ్మతమైన సమ సమాజాన్ని ఏర్పాటు చేసేందుకు ఏకైక మార్గాన్ని సూచిస్తూ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మనల్ని చైతన్యవంతుల్ని చేసే సందేశం ఇచ్చారు.

కఠోర పరిశ్రమ, సత్యాన్వేషణకు దీక్షతో పాటుపడడం ద్వారానే గౌరవం, ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం అన్నదే ఆమె సందేశం. ఉత్పత్తి పెరుగుదల, సంక్షేమ పథకాల విస్తరణ ద్వారా బలహీనవర్గాల సమగ్రాభివృద్ధి సాధించగలమనే విషయాన్ని ప్రధాని నూతన కార్యక్రమం స్పష్టీకరిస్తున్నది.

మన రాష్ట్రంలో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతులు, మహిళలు, బాలలు వంటి బలహీన వర్గాల ప్రజలకు మన అభివృద్ధి ఫలితాలు అందజేసే విధంగా వివిధ పథకాలు ముమ్మరంగా అమలు జరుగుతున్నాయి.

- సాంఘిక సంక్షేమ పథకాలకు బడ్జెట్ కేటాయింపు 1977-78 నుండి నేటివరకు రు. 21.57 కోట్ల నుండి రు. 78.12 కోట్లకు (నాలుగు రెట్లు) పెరిగింది.
- 14 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూర్చారు. ప్రస్తుత సంవత్సరంలో మరో 1.05 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూరుస్తారు.
- షెడ్యూలు కులాలవారి కోసం ఒక ప్రత్యేక అనుబంధ ప్రణాళిక అమలు జరుగుతున్నది. ఈ అనుబంధ ప్రణాళిక క్రింద ఖర్చు చేసేందుకు 1980-81 లో రు. 42.80 కోట్లు, 1981-82 లో రు. 50 కోట్లు కేటాయించారు. 1082-83 సంవత్సరంలో రు. 89.37 కోట్ల కేటాయించాలని తలపెట్టారు.
- షెడ్యూలు కులాల ఆర్థిక సహాయ సంస్థ ప్రస్తుత సంవత్సరంలో 1.19 లక్షల మంది దారిద్ర్య రేఖను దాటేందుకు వీలుగా వివిధ పథకాలు చేపట్టింది.
- మెట్రిక్ అనంతర చదువులకోసం స్కాలర్‌షిప్పులు పొందే షెడ్యూలు కులాల విద్యార్థుల సంఖ్య 1977 - 78 లో వున్న 27,538 నుండి 1980-81లో 54,000కు పెరిగింది.
- ఎక్కువ మంది విద్యార్థులు స్కాలర్‌షిప్పులు పొందేందుకు వీలుగా వారి దల్లిదండ్రుల ఆదాయ పరిమితిని రు. 6,000 నుండి రు. 12,000 లకు పెంచారు. వసతి గృహాలలో విద్యార్థుల భోజన ఖర్చులకిచ్చే మొత్తాన్ని నెలకు రు. 85లకు పెంచారు.

• • సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో ఇతర ముఖ్యాంశాలు :—కులాంతర వివాహాలను ప్రోత్సహించడం, పేదలకు ఉచిత న్యాయసహాయం, హరిజనులపై జరిగే అత్యాచారాలు విచారించేందుకు సంచార న్యాయస్థానాలు ఏర్పాటుచేయడం వంటివి.

• • విద్యుదుత్పాదన స్థాపిత ఉత్పాదకశక్తి 2,300 మెగావాట్లకు పెరిగింది.

• • ఆంధ్రప్రదేశ్‌లో నెలకొన్న పారిశ్రామిక శాంతి; అనుకూలవాతావరణం; నీరు, విద్యుచ్ఛక్తి సరఫరా; ప్రభుత్వం ఇస్తున్న ఉదార ప్రోత్సాహం; నూతన పారిశ్రామిక వేత్తలను ఆకర్షిస్తున్నాయి.

• • రు. 6,000 కోట్ల పెట్టుబడి వినియోగించి పరిశ్రమలు ఏర్పాటు చేస్తున్నారు.

• • బలహీనవర్గాలకోసం చేపట్టిన 2,20,000 గృహాల నిర్మాణం వివిధ స్థాయిలలో ఉన్నది. గుడిసెల నిర్మాణానికి సహాయం రు. 400 నుండి రు. 1000 కి పెంచారు.

• • పోలవరం బ్యారేజి, శ్రీశైలం కుడికాల్వ, జూరాల ప్రాజెక్టు నిర్మాణం చేపట్టారు. నాగార్జునసాగర్ కాల్వల ఆధునికీకరణ ముమ్మరంగా కొనసాగుతున్నది.

• • గ్రామాల్లో మంచినీటి సరఫరా పథకాల అమలుకు అధిక ప్రాధాన్యత ఇస్తున్నారు.

• • యువజనులు, స్థానిక సంస్థల సహకారంతో సామాజిక అటవీ పథకాన్ని ముమ్మరంగా అమలు చేస్తున్నారు. పరిశ్రమల కోసం నష్టపరిచిన వాటి స్థానంలో తిరిగి చెట్లు నాటేందుకు పారిశ్రామిక అటవీనిధిని ఏర్పాటు చేశారు.

• • కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు దీక్షతో అమలు జరుపుతున్నారు. 1981 ఏప్రిల్ నుండి డిసెంబరు వరకు, 183075 కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు జరగాలని లక్ష్యం కాగా, 1,83,527 ఆపరేషన్లు చేశారు.

• • 1982-83లో వార్షిక ప్రణాళిక పెట్టుబడి రు. 600 కోట్ల రికార్డు స్థాయి చేరుకుంది.

• • 1980-81లో దుర్భిక్షం, వరదలు వంటి అవాంతరాలను అధిగమించి 100 లక్షల టన్నుల ఆహారధాన్యాలు పండించారు.

ఆంధ్రప్రదేశ్‌లో హరిజనులు, ఇతర బలహీనవర్గాల పరిస్థితి ఇదివరకటికంటే చాలా మెరుగుగా ఉంది. వారికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉన్నది.

మనం 1982 సంవత్సరాన్ని ఉత్పాదక సంవత్సరంగా ప్రకటించుకున్నాం. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ చురుకుగా పురోగమిస్తున్నది. శ్రీమతి ఇందిరాగాంధీ చూపిన బాటలో మన రాష్ట్రం ముందుకు సాగుతూ, శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో ప్రజలు, ముఖ్యంగా బలహీన వర్గాల వారి సంక్షేమం కోసం నూతన 20 అంశాలతో సహా మరిన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయబోతున్నది.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



# శ్రీ రామకృష్ణ ప్రభ

విషయ సూచిక



గమనిక:—స్థలాభావంచే ఈ సంచికలో బాల రామకృష్ణ ప్రచురించలేదు.

---

## రచయితలకు మనవి

ఈ ఒక సంవత్సరం లోపల మన పత్రిక సంఖ్య వేయి ఎక్కువయింది. దీనికి ప్రధానకారణం మంచి రచనలు లభించడమే. కుమారి రాజ్యలక్ష్మి, ఓంప్రకాశ్, తుర్లపాటి లక్ష్మీనారాయణరావు, అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి, చాగంటి సూర్యనారాయణమూర్తి మొ॥ (వయస్సులో చిన్నవారిని మొదట, పెద్దవారిని తరువాత పేర్కొనిన క్రమమిది.) వారి రచనలు ప్రభ స్థాయిని పెంచి తద్వారా ప్రతుల సంఖ్యను పెంచాయని చెప్పడానికి ఎట్టి సందేహం లేదు. ఈ పరిణామానికి ముదమందును సంపాదకుడు. పాఠకుల తరఫున ప్రభ రచయితలకందరికి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాడు. ఆధ్యాత్మిక పత్రికలకు రచనలు చేయడం చాల కష్టం. ఆధ్యాత్మికానుభూతి ఉన్నవాళ్ళు ఆ అనుభూతిని మాటలలో వ్యక్తం చేయలేరు - అది సాధ్యం కాదు కాబట్టి అట్టివారు రచనలు చేయలేరు. అనుభవం లేనివారి రచనల వల్ల పాఠకులకు ప్రయోజనం లేదు. ఈ విశ్లేషణ (Analysis) వల్ల తెలుస్తున్నదేమిటంటే: "ఆధ్యాత్మిక పత్రిక అంటూ ఒకటి లోకంలో ఉండడానికి వీలు లేదు" అని. ఆ మాటకొస్తే ఆధ్యాత్మికసంబంధంగా ఏ పుస్తకమూ ముఖ్యంగా మతగ్రంథాలు లోకంలో ఉండడానికి అర్హత లేనివని ఈ విశ్లేషణదృష్టి తేల్చుతుంది. కాని అవి ఉన్నాయిగదా కోట్ల కోట్ల ప్రతులు లోకంలో ; కాబట్టి ఆధ్యాత్మిక పత్రిక పేరుతో పత్రికలు కూడ ఉండడం అన్యాయం అనిపించుకోదు. ఇంతవరకు ఓపికగా చదివిన రచయితలకు ఒక ముఖ్య మనవి. దయచేసి పద్యాలను పంపకండి. చంపకమాల ఉత్పలమాల శార్దూల విక్రీడితం కందం సీసం గీసం - ఇవన్నీ మనకొద్దు. తెనుగు పాఠ్యపుస్తకాలు చదవాల్సిన తలరాత ఉన్నవాళ్ళకు వాటిని వదలిపెట్టాం. కవితాహృదయం పొంగిపొర్లి ఆ కవితాప్రవాహం గేయంగానో కవితగానో పాటగానో రూపొంది తేనే వాటిని పంపండి. అనుకరణాత్మకంగా ఏదీ వద్దు. రామాయణ భారత భాగవత పురాణాదులకు సంబంధించిన విషయాలను కూడ దయచేసి పంపకండి. వాటిని ఏమాత్రం ఉపేక్షించడం లేదు. కాని వాటి విషయమైన రచనలు ఎట్లుండవలెనో అనే విషయం సంపాదకుడు ఆలోచించి అటువంటి రచనలకు ప్రయత్నిస్తుంటాడని మనవి. చిన్నప్పటి నుండి విని విని విసుగెత్తిపోయిన విషయాల మీద కూడ దయ చేసి రచనలు చేసి పంపకండి. అనువాద రచనలు పంప దలచుకున్నవారు వాటిని వ్రాయకముందే సంపాదకునికి అది సమ్మతమా కాదా అని తెలుసుకోవడం మంచిది. వైజ్ఞానిక సాంకేతిక విషయాల్లో మంచి అవగాహన ఉన్నవాళ్ళకు ఒక మనవి: ఆశ్చర్యం కలిగించే కొన్ని వైజ్ఞానిక సాంకేతిక విషయాల మీద సుబోధంగా రచనలు పంపగలిగితే సంతోషిస్తాము.

ఒక ముఖ్యమైన గమనిక :—మే సంచిక వెలువడుటకు కొంత ఆలస్యము కావచ్చును.
కనుక పాఠకులు దయచేసి మే 15 వ తేదివరకు వేచియుండవలసినదిగా మనవి.

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవబంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహా విష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర స్థలము సముద్రమట్టానికి మూడువేల అడుగుల ఎత్తున, ఆంధ్రప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణముతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పుచుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలుస్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ల నుండి, తిరుపతికి బస్సులుకూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధరాత్రివరకు బస్సులు రెండు కొండ దారులమీదుగా మిమ్ములను తిరుపతినుండి తిరుమలకు తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొనవచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన అన్ని సౌకర్యములతోకూడివున్న దేవాలయపు ధర్మసత్రములు, అద్దె వసతిగృహములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వర స్వామివార్ల దేవాలయాలను, తిరుచానూరులోనున్న శ్రీ పద్మావతీ అమ్మవారి దేవాలయ మును యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయము, నారాయణవనములోని శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయము, నాగలాపురంలోని శ్రీ వేదనారాయణ స్వామివారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

శ్రీ స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవకార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన తక్కిన వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



# ప్రార్థన

దీనబంధూ! మనసు యొక్క కోరికలు తీర్చటానికి ఎంత ప్రయాసపడ్డాను! పలుస్థలాలు గాలించాను. అడుగడుగునా ధూళి పీల్చాను. నానావిధ క్రొంగొత్త ఉద్యోగాలు చేసాను. ఎవరేది చెప్పినా, అది ఆచరించాను. సంయోగవశాత్తు, నీ కృపవల్ల, అప్పుడప్పుడు ధన-పుత్ర, మాన-యశాదులు కూడ లభించాయి. అయినా అంతా వ్యర్థమై పోయింది. ఈ మనసు యొక్క ఆశ నేటివరకు పూర్తి కాలేదు. అది మునుపటిలాగే వ్యస్తమై యున్నది. అశాంతమై యున్నది. చంచలమై యున్నది. అంతే కాదు, దీని ఆకలి మరింత విజృంభించింది. చూస్తుంటే, అభావరహితమైన, లభ్యమైన పిదప ఇక మరేది కోరిక యుండనట్టి వస్తువు యొక్క అన్వేషణలో ఇది ఉన్నట్లున్నది. సత్పురుషుల మాట ప్రకారం, అట్టి వస్తువు కేవలం నీవు మాత్రమే! నిన్ను శరణు వేడి, శ్రద్ధాభక్తులతో నీ భజన చేసినప్పుడు నీవు ప్రాప్తిస్తావు. కాని నీ భజన నా వల్ల సాధ్యం కావటం లేదు. సదా నీ భజనయందే యుండాలని, సర్వదా నీ నామగుణ కీర్తనములందే గడపాలని, నీ ధ్యానమే చేయాలని అనుకుంటాను. కాని, ఏమని చెప్పేది! తీరా అందుకై సిద్ధమయ్యేసరికి నిరాశుణ్ణయి పోతున్నాను. ఎలా వస్తాయో తెలియదు గాని, అనేకమయిన చింతలు, భూత భవిష్యత్తుల చిత్ర విచిత్ర భావాలు మనస్సులో వచ్చి తిష్ఠ వేస్తాయి. ఆ కారణంగ క్షణకాలం కూడ మనసు శాంతమవ్వదు. ఏకాగ్రము నొందదు. అవన్నీ చాలవన్నట్లు, వెలుపలి కామవాసనలు కూడ కట్టకట్టుకుని వచ్చి కూర్చుంటాయి. 'ఈ పని ఇప్పుడే చేయకపోతే అధర్మం' - 'ఆదర్శం నష్టమవుతుంది' - 'కర్తవ్యము యొక్క అవహేళన జరుగుతుంది.' - 'నింద వస్తుంది.' - 'ఆర్థిక, సామాజిక హాని కల్గుతుంది.' - 'ఆ పనులు చేస్తే, ఫలాని ఫలాని లాభాలు వస్తాయి.' - ఇలాంటి నానావిధ భయ ప్రలోభాలు కూడ అప్పుడే వచ్చి, పనుల గూర్చి అలజడి ప్రారంభిస్తాయి. మనసు - ఇంద్రియములతో బాటు కర్మేంద్రియములందు కూడ ఆందోళన ఆరంభమవుతుంది.

ప్రభూ! ఏంచేయాలి నేను? నీ భజన ఎలా చేయాలి? నాకేం తోచటం లేదు. నేను దుర్బలుణ్ని. మనస్సు ఇంద్రియయాలు ఆత్మకన్నా బలంగలవి కావు; అది తెలుసు. అయినా, ఆత్మస్వరూప అజ్ఞాన కారణంగ, వాటిముందు అణగియున్నాను. నీ కృపాశక్తి ఒక్కటే నాకిక ఆధారము.

దేవా! నాకు శక్తినిమ్ము. అమితమైన మహిమ, అచింత్య సౌహార్ద్రము గల నీవు నాకు శక్తినిమ్ము. ఆ శక్తితో, ఈ మనస్సింద్రియములను జయిస్తాను. వీటన్నింటిని సర్వదిశల నుండి మళ్ళించి, కేవలం నీ భజనయందే లగ్నం చేస్తాను. సర్వవిధ విఘ్నాలను తొలగించు కొని గంగాభవాని సముద్రంలో లీనమవుతుంది. అలాగే నా మనసు కూడ సర్వవృత్తులను దాటి, నిరాటంకంగా నీలోనే లీనంకాని. నేను నీవాణ్ని అగుదునుగాక! నిన్ను స్వంతం చేసు కొని ధన్యుణ్ణౌతాను.

—[గీతాప్రెస్ వారి 'ప్రార్థన' అనే చిన్న పుస్తకంనుండి]

# సంపాదకీయం - 7

గేటే (Goethe) అనే జగత్ప్రసిద్ధుడైన జర్మన్ మహాకవి, వృద్ధాప్యంలో తన ఇంటి ప్రక్కనే ఉన్న శిథిలగృహాన్ని కొన్నాడు. "ఆ ఇంటితో ఏం చేసుకుంటావు" అని మిత్రులడిగారు. "ఇప్పుడు నేనున్న ఇంటిలో ప్రశాంతంగా జీవితశేషం నెట్టివేయడానికి ఆ ఇల్లు కొన్నాను. ఇది మీకర్థం కావడం లేదనుకుంటాను. నేను శబ్దాన్ని భరించలేను. ఆ శిథిలగృహాన్ని నేను కొనకుండా ఉంటే ఎప్పుడో ఒకప్పుడు దాని యజమాని ఆ ఇంటిని పడగొట్టి కొత్తది కట్టడానికి ప్రారంభిస్తాడు. అప్పుడు ఉత్పన్నం అయ్యే శబ్దాన్ని తట్టుకోలేక నేను నా ఈ స్వంత ఇంటినే వదలి మరో చోటులో నివాసం వెతుక్కోవలసి ఉంటుంది. అందుకనే దాన్ని కొనేశాను. అది అట్లే పడి ఉండనీ," అని సమాధానం చెప్పాడు. కవులు చింతకులు, ధ్యానపరులు మొదలగువారు శబ్దాన్ని భరించలేరు. శబ్దం వారి ఆలోచనా స్రవంతిని పుటుక్కున తెంపివేస్తుంటుంది. అందుకే వారు నిశ్శబ్దస్థలాలకై ఆరాటపడుతుంటారు. పూర్వపు శోభను గ్రామాలు వేగంగా కోల్పోతున్నా పట్టణాలకన్నా అవి నివాసానికి ఎంతో యోగ్యస్థలాలు. పట్టణాలలో బ్రతుకు నిజంగా మురికి బ్రతుకు. శుభ్రమైన గాలి ఉండదు. చెవులు తూట్లు పోయే రొద అవిరామంగా ఉంటుంది. ఇఱుకు జాగాల్లో గొడ్లకొట్టాల్లో పశువుల్లా పడి వుండాలి. భార్యాభర్తలకు కూడ ఏకాంతం దొరకడం అక్కడ అదృష్టమనే చెప్పాలి. క్యార్ క్యార్ మని పక్కవాటా చంటిబిడ్డ ఏడుపు, లూలూలూ అని తల్లి ఓదార్పు-ఇవన్నీ నిత్యం వినవలసివస్తుంది. రేడియోల రొద, లౌడ్ స్పీకర్ల గాడిదఅఱుపులు తప్పించుకో సాధ్యం కాదు. ఏ కొందరు భాగ్యవంతులో తప్ప పట్టణాలలో అందరి బ్రతుకు ఇలాగే ఉంటుంది. ప్రకృతి సాన్నిధ్యమే ఉండదు. శుక్లపక్షం కృష్ణపక్షం అనే భేదం తెలియని రాత్రులను జీవితమంతా నెట్టివేసే దౌర్భాగ్యులు పట్టణవాసులు. కాలప్రభావం వల్ల పట్టణాల ప్రాధాన్యం హెచ్చిపోతున్నది. అనేక కారణాల వల్ల పట్టణవాసం అంటే ప్రజలకు మోజు పెరిగిపోతున్నది. ముఖ్యంగా ఆడవాళ్ళకు. పొలం దున్నుకుంటూ స్వతంత్ర జీవనం జీవిస్తున్న వాడికన్నా పట్టణాల్లో నౌకరీ చేసేవాడికే "అల్లుళ్ళ మార్కెట్"లో విలువ ఎక్కువ. దౌర్భాగ్యలక్షణాలన్నిటిలో ఇది అగ్రేసరం. నా అభిప్రాయంలో 1000 రూపాయల ఆదాయంతో పట్టణాలలో ఉండడంకన్నా 100 రూపాయల ఆదాయంతో గ్రామంలో ఉండడం శ్రేష్ఠం. పరిశుభ్రమైనగాలి, నిశ్శబ్దవాతావరణం ప్రకృతిమాతతో సాన్నిధ్యం-ఇవన్నీ ఇంత అని విలువకట్టలేని గ్రామీణ విలువలు. పూర్వం పల్లెప్రాంతాల్లో దుర్లభం అనిపించే సకల సదుపాయాలూ ఇప్పుడక్కడున్నాయి. రవాణా సౌకర్యాలు, స్కూళ్ళు కాలేజీలు, ఆస్పత్రులు, సినిమాలు, అంగళ్ళు - అన్నీ ఉన్నాయి. రేడియో, టి. వి. లు కూడ ఉన్నాయి. కాబట్టి పల్లెలో జీవనోపాధి ఉండీ దానిని వదలిపెట్టి పట్టణవాసం కోరేవాడు పరమ మూర్ఖుడని నా అభిప్రాయం. గ్రామపంచాయితీలు ఏర్పడ్డాక గ్రామాల్లో వెధవరాజకీయాలు బలిసిపోయి అక్కడ ఉండడమే నరకంగా కనబడి పట్టణాలకు రావాలని కోరుతున్నవాళ్ళు కొందరున్నారు. గ్రామరాజకీయాలకు భయపడి పట్టణాలకు రావాలని వాళ్ళు కోరుకోవడం ఎలా ఉంటుందంటే "ముల్లు తీసి కొఱ్ఱుచెక్కిన చందముగా" ఉంటుంది. ఏ గ్రూపులోనూ చేరకుండ ఉదాసీనంగా అందరితో మంచిగా అక్కడే

ఉండడానికి ఏం కష్టం? పట్టణాలలో రోడ్ల ప్రక్కనడుస్తుంటే అడుగడుక్కూ కనాకష్టమైన బిక్షగాళ్లు ఎదురవుతుంటారు. దానం చేయాలనుకొన్నా ఎందరికి దానం చేయడం సాధ్యం? ఫుట్‌పాత్‌ల మీద ఎక్కడ చూసినా దిక్కులేని జనం పడి ఉంటారు. మనం చూస్తూ పోగలమేగాని ఏం చేయగలం? నిత్యం కంటి ముందఱ ఈ దృశ్యాలొకవైపు, ఏమీ చేయలేని నిస్సహాయత ఒకవైపు-దీనివల్ల పట్టణ వాసులలో ఒకరకమైన హృదయకాఠిన్యం (Insensitivity) ఏర్పడిపోతుంది. క్రమేణ, ఆ హృదయ కాఠిన్యత వల్ల అతను, దగ్గరి బంధువులు స్నేహితుల కష్టాలను కూడ చూస్తూ ఊరుకునే మనిషిగా మారిపోతాడు. బంధువులు స్నేహితుల సంగతెందుకు? స్వంత తల్లిదండ్రుల విషయంలోనూ అలాగే అయిపోతాడు. నా దురదృష్టం వల్ల పట్టణాల్లో 13 ఏండ్లపైగా ఉండవలసివచ్చింది. ఒక్క దీపావళి తప్ప తక్కిన పండగలన్నీ క్యాలండర్లలో చూసి తెలుసుకోవలసిందే. పండగల వాతావరణమే అక్కడ కనబడదు. గ్రామాల్లో సంక్రాంతి వైభవం ఒకటె చాలు పట్టణాలను కాలదన్ని రావడానికి. పట్టణాల్లో కొక్కొరకో అని తొలికోడి కూతలు వినబడవు, ఆవుల అంబారావాలు వినబడవు, కోయిల కుహూ రావాలు వినబడవు, పచ్చిక మీది మంచుబిందువులు కనబడవు. అక్కడ అంతా కృత్రిమ శబ్దమయమే. అది చెవిలో పడుతుండడం ఏదో పాపఫలమనే అనుకోవాలి. గ్రామాల్లో ఉన్నవాళ్ళలో చాలమంది పట్టణాలకో లేను లకో తరలిపోతే ఎంతబాగుండును అనుకుంటూ ఆ మురికి స్థలాలను స్వర్గాలుగా ఊహించుకుంటుంటారు. నీలో అటువంటి కోరిక ఎప్పుడూ తలెత్తకుండ ఉండడానికే ఈ విషయం చెప్పాను. భూదేవిని నమ్ముకొని హాయిగా ఇక్కడే ఉండు. పదే పదే చెబుతున్నారు. గ్రామీణ జీవనం ఉత్తమం. పట్టణజీవనం అధమం. ఈ విషయం తెలియకుండ ఇంగ్లీషు చదివిన సన్న్యాసులు కొందరు తమ జీవితాలను ధారబోసి పట్టణాల్లో పెద్దపెద్ద ఆశ్రమాలు కట్టారు. ఆ పట్టణాలను ఆధ్యాత్మికతతో ముంచుదామనుకున్నారు కాబోలు కాని జరిగిందేమంటే చాపక్రింద నీళ్ళలాగా పట్టణాల కృత్రిమత, భౌతికత ఆ ఆశ్రమాలకు వ్యాపించింది. వాళ్ళలో కొందరు ఇప్పుడిప్పుడే కన్నులు తెఱుస్తున్నారు. పల్లెలకు పోవాలని చూస్తున్నారు. కాని అది అంత సులభం కాదు. పట్టణవాసానికి అలవాటు పడినవారు అంత సులభంగా గ్రామాల్లో వచ్చి ఉండలేరు. (చేపలవాసనకు అలవాటు పడిన ముక్కులు మల్లెపూ వాసన భరించలేనట్లు). దానికి సాహసం కావాలి. నేనీ రోజు "ఆధ్యాత్మికత అంటే ఏమిటి!" అనే విషయం మాట్లాడుదామనుకున్నాను. కాని ప్రసంగం మఱోవైపుకు వెళ్ళిపోయింది. ఆధ్యాత్మిక వికాసానికి పల్లీయ వాతావరణం దోహదకారిగా ఉంటుందనేది ఎవరూ త్రోసివేయని మాట గనుక ఈ ప్రసంగం మన రేపటి ప్రసంగానికి ఉపోద్ఘాతం అనుకుంటే సరిపోతుంది.



# నేటి సమాజంలో కల

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

"నేటి సమాజంలో కల" అనే శీర్షిక చూడగానే సమాజానికి స్వప్నానికి ఏమిటి సంబంధం ? అనే సందేహం పాఠకునికి కలుగుతుంది. "కలలు కల్లలు, కలలో జరిగింది ఇలలో జరగదు. అలాంటప్పుడు కలలకు మనిషి మీద ఏమి ప్రభావం ఉంటుంది?" ఈ సందేహాల నివృత్తియే ఈ వ్యాసలక్ష్యం. అసలు ఈ సందేహాలు పొడమడానికి ముఖ్యకారణం మనకు కలల గురించి ఉన్న అజ్ఞానమే. అందుకని ఈ వ్యాసంలో కలల స్వరూప స్వభావాలను, ఆధునిక సమాజం తీసే పరుగులను వివరించి, స్వప్నం నేటి మానవునికి ఏమి చేయగలదో వివరిస్తాను.

అనాదినుంచి, కలలు దేవుని సందేశాలను మనకు అందిస్తాయని, అవి అనాగతాన్ని సూచిస్తాయని జనం విశ్వసించేవారు. నిద్రలో ఆత్మ సంచారానికి బయలుదేరుతుందని, ఆ సంచారంలో పొందే అనుభవాలే కలలని అనుకొనేవారు. ఇటువంటి అభిప్రాయాలను ఆధునిక మనోవిజ్ఞానం మన్నించదు. కలలు భావిసూచకాలనే విషయాన్ని గూడ శాస్త్రం ఒప్పదు. భవిష్యత్తును తెలుసుకోవడం అసలు సాధ్యమని భావిస్తే ప్రపంచంలో ప్రతి సంఘటన పూర్వనిర్దేశిత (Predetermined)మని, అలాంటప్పుడు సంకల్పానికి, స్వేచ్ఛకు తావు లేదని అంగీకరించవలసి వస్తుంది. ఇది అనేక తాత్త్విక జటిల సమస్యలను రేపుతుంది గనుక దాని జోలికి మనం ఇక్కడ పోలేము.

మరి ఆధునిక మనోవిజ్ఞానశాస్త్రదృష్టిలో కల అంటే ఏమిటి ? మానవుడు ఈ గడ్డపై అవతరించిన నాటినుంచే కలలు గనడం ప్రారంభించాడు. ఈ కలలు గనే శక్తి అతనికి లేనట్లయితే పద్యం, పాట, కళ, ఇంజనీరింగు సాధ్యమయ్యేవి కావు. అయినా ఈ శతాబ్ది ఆరంభం వరకు కలలమీద శాస్త్రీయ పరిశోధన ఆరంభం కాలేదు. సిగ్మండ్ ఫ్రాయిడ్ అనే ఆస్ట్రియా వైద్యుడు కలలపై జరిపిన పరిశోధనలతో నూతనశకం ఆరంభమైంది. 1895 జూలై 24 వ తేదీన అతడు స్వప్నరహస్యాన్ని ఛేదించాడు. స్వప్నాలు విచిత్రంగాను, కదాకారంగాను, పైకి అర్థరహితాలుగ కనిపించినా ప్రతి స్వప్నానికి అర్థం ఉందని అతడు ప్రతిపాదించాడు.

స్వప్నం అంటే నిద్రించే మనస్సు బాహ్య లేదా అంతర్గత ఉద్దీపనలకు చేసే ప్రతిస్పందన అని చెప్పవచ్చు. ఈ ప్రతిస్పందనానుభవం ఎక్కువగా దృశ్యసంబంధమైన ప్రతీకలతోగూడి ఉంటుంది. ఈ అనుభవంలో సంవేదన అనుభూతులు గూడ ఉంటాయి. చేతనంగా మనకు తెలిసిగాని తెలియకగాని కొన్ని పగటి సంఘటనలు మన నిద్రించే మనస్సు మీద పని చేస్తుంటాయని, దీనికి మనస్సు ప్రతిస్పందిస్తుందని, ఈ ప్రతిస్పందనంలో అచేతనం (Unconscious)లో దాగిన లేదా దాంతమైన వాంఛలు నాటి పగటి సంఘటలను చిలుకకొయ్యలుగ గ్రహించి కలలుగ బహిర్గతమవుతాయని ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించాడు.

ఫ్రాయిడ్ స్వప్నసిద్ధాంతాన్ని అర్థం చేసుకోవడానికి అతని మూర్తిమత్వసిద్ధాంతాలు (theories of Personality) తెలియాలి గనుక క్లుప్తంగా చెబుతాను. అతడు మనస్సును మూడు భాగాలుగ విభజించాడు. మొదటిభాగం చేతనం (Conscious) మనం మేల్కొని ఉన్నంతసేపు అంతర, బాహ్యపరిసరాలతో వ్యాపారం జరుపుతుంది. నిద్రపోయినప్పుడే దీనికి విశ్రాంతి. చేతనానికి అవలిభాగం అచేతనం (Unconscious). ఇందులో మనం లోగడ అనుభవించిన అనుభవాలు, చేసిన ఆలోచనలు, వాంఛలు ఉంటాయి. కని, విని మరిచిపోయిన సంఘనలన్నీ ఇందులో తిష్ఠవేస్తాయి. చేతనమనస్సు భరించలేక, లేదా అవమానకరాలని భావించి గెంటివేసిన అనేక ఆలోచనలు అనుభూతులు, అణచిన కోర్కెలు ఇందులో ఉంటాయి. ఇది అగ్నిపర్వతంలోని లావా లాంటిది. ఇందులో ఒకసారి పడిన విషయాన్ని మామూలుగ ఎంత ఆలోచించినా గుర్తుకు తెచ్చుకోలేము. కాని ఇందులోని అణచబడిన వాంఛలు లావావలె పైకిరావాలని ప్రయత్నిస్తుంటాయి. చేతన అచేతన మనోభాగాలకు మధ్య ప్రాక్చేతనం (Pre conscious) ఉంటుంది. మరిచిపోయిన కొన్ని విషయాలను కొంత ప్రయత్నం మీద గుర్తుతెచ్చుకోగలుగుతాము. ఇలా ప్రయత్నపూర్వకంగా గుర్తుతెచ్చుకోగలిగిన జ్ఞాపకాలన్నీ ఇందులో ఉంటాయి. ఈ ప్రాక్చేతనం సెన్సారు కార్యక్రమాన్నిగూడ నిర్వర్తిస్తుంటుంది. అచేతనంలోనుంచి చేతనంలోకి ప్రవేశించగోరే ఆలోచనలను, వాంఛలను ఇది సెన్సారు చేస్తుంది. రాగూడని వాటిని నిలువరిస్తుంది.

అచేతనంలో దాంతవాంఛలు (repressed desires) ఊరికే గోళ్ళు గిల్లుకొంటూ కూర్చోవు. సందు దొరికినప్పుడెల్ల బయటకు (చేతనంలోకి) రావాలని ప్రయత్నిస్తుంటాయి. అచేతనంలో దాంతమైన వాంఛలు కలల రూపంలో ఈడేరతాయి అన్నాడు ఫ్రాయిడ్. అంటే అతడి సిద్ధాంతంలో కలలు తీరని కోర్కెలను తీరుస్తాయి. దీనిని ఇష్టావాప్తి (Wish fulfillment) సిద్ధాంతమంటారు. కలలు

కదాకారాలుగ విచిత్రాలుగ ఎందుకుంటాయంటే, అచేతనంలోని వాంఛలు ఒకసారి అణచివేయబడినవి గనుక-ఎందుకు అణచివేయబడినవంటే చేతనం భరించలేను - వాటిని ప్రాక్ చేతనంలోని సెన్సారులు యథాతథంగా బయటికి రానీయవు. అందుకని ఆ వాంఛలు ముసుగులు - మారు వేషాలు-వేసుకొని సెన్సారుల కనుగప్పి బహిర్గతమవుతాయి. ఈ వాంఛలు ఎక్కువగ శైశవానికి చెందినవి. ఈ ముసుగును ఒలిచివేస్తే అసలు వాంఛ బయటపడుతుంది. ఇదీ క్లుప్తంగా ఫ్రాయిడ్ ప్రకారం స్వప్నం.

వ్యక్తి జీవితంలో అంతకుముందు రోజుగాని, సంవత్సరాల ముందుగాని జరిగిన సంఘటన తిరిగి నిద్రలో పునరావృత్తం కావడం స్వప్నం అని వ్యక్తిస్మృతి సిద్ధాంతం చెబితే, జాతి అనుభవాలు, చారిత్రక సంఘటనలు స్వప్నంలో పునరావృత్తమవుతాయని జాతిస్మృతి సిద్ధాంతం చెబుతుంది. శరీరంలో కలిగే ఒడుదుడుకులు కలలలో ప్రతిబింబితాలవుతాయని సర్వత్రా గుర్తించారు. యాడ్లర్, వ్యక్తి ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి అతడు ఉపయోగించే జీవితశైలి (Life style) ని స్వప్నాలు ప్రతిబింబిస్తాయన్నాడు. సమస్యల పరిష్కారానికి స్వాపిని సమాయత్తం చేస్తాయంటాడితడు. మానవుడు జాగ్రదవస్థలో సాధించని, అందుకోలేని, అనేక విషయాలను అచేతనం స్వప్నం ద్వారా అందిస్తుందంటాడు కారల్ గూస్టావ్ యూంగ్. అలా అందించి వ్యక్తిలోని లోటును పూరిస్తుంది, అందుకని ఇతని సిద్ధాంతాన్ని పరిపూరకసిద్ధాంతమంటారు.

స్వప్నం ఆత్మ చేసుకొనే నివేదనం అన్నాడు హాల్. తనకు తాను వ్రాసుకొన్న ఉత్తరం, నిద్రలో చేసే ఆలోచన, ఆత్మదర్పణం అంటాడితడు. స్వాపి (dreamer) తనను గురించి, ఇతరుల గురించి, పరిసర ప్రపంచాన్ని గురించి ఏమి అనుకొంటున్నాడో స్వప్నం తెలియజేస్తుంది. గెస్టాల్టు వాదులలో ముఖ్యుడైన పెర్ల్స్, "తనతో తనకు, తనతో ఇతరులకు ఉన్న సంబంధాన్ని తెలియజేసే అస్తిత్వసందేశం స్వప్నం" అంటాడు. అందుకని వీరి ప్రకారం స్వప్నంలో కనిపించే ప్రతిదీ స్వాపి అంతరంగంలోని అంశమే. అంతరంగం నుంచి వైదేశికాలని గెంటివేయబడిన అంశాలను స్వప్నం గుర్తింపజేసి, వాటితో ఎలా వ్యవహరించాలో సూచిస్తుంది స్వప్నం అంటారు వీరు. థామస్ ఫ్రెంచ్, ఎరిక్ ఫ్రామ్‌లకు స్వప్నం వ్యక్తిక సంబంధాలలో ఉత్పన్నమైన సమస్యల పరిష్కారాన్వేషణ. వీరి ప్రకారం స్వప్నం ఒక సమస్యల తోరణం. స్వాపి ప్రస్తుత జీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలను అది ప్రతిబింబిస్తుంది. ఇంక అనేకమంది అనేక విధాల నిర్వచించారు. అందరి నిర్వచనాలు పాక్షిక సత్యాలే.

ఇంతమంది ఇన్నివిధాల నిర్వచించిన తరవాత స్వప్నాన్ని ఇలా అర్థం చేసుకోవచ్చు; స్వప్నం అంతరంగాన్ని ప్రదర్శిస్తుంది. అంటే వ్యక్తి మనోరథాన్ని, అతనిలో మెదిలే బాధలను, కదిలే ఆలోచనలను, అతడు ఎదుర్కొనే సమస్యలను, వాటి పరిష్కారాలను, అతడు ఆత్మీయుల నెలా చూస్తున్నదీ, అతనిని వారెట్లా చూస్తున్నారని అతడనుకొంటున్నదీ, అతని దృక్పథాలను, ఆత్మవిశ్వాసాన్ని, విశ్వాసరాహిత్యాన్ని, అపరాధ భావనను, హర్షాతిరేకాలను, సుఖదుఃఖాలను స్వప్నం సూచిస్తుంది. అంటే ఇవి అన్నీ ఒకే స్వప్నంలో వ్యక్తమవుతాయని కాదు మన తాత్పర్యం. స్వప్నకాలంలో వీటిలో ఏది అతని మనోఫలకం మీద తిష్ఠవేసిందో అది స్వప్నంలో తనను గురించి తాను ఎరుకపరుచుకొంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే స్వప్నం అతని అంతరంగానికి రాచబాట. స్వప్నరహస్యం తెలిస్తే అతడేమిటో తెలుస్తుంది. వ్యక్తి అంతరంగ ప్రభావం వ్యక్తి ప్రవర్తన మీద పడుతుంది. వ్యక్తుల ప్రవర్తన సమాజగతిని ప్లావితం చేస్తుంది. కనుక స్వప్నం ద్వారా వ్యక్తి అంతరంగాన్ని, తద్వారా అతని ప్రవర్తనను, దీనినుంచి సమాజం నడకను అర్థం చేసుకోవచ్చు. ఇదీ క్లుప్తంగా సమాజానికి స్వప్నానికీ ఉన్న సంబంధం.

స్వప్నం ఆచరణలో సమాజానికి ఎలా ఉపయోగపడేది చెప్పేముందు ఆధునిక సమాజ స్థితిగతులను ఒకింత అర్థం చేసుకోవలసిన అగత్యం ఉంది.

ఆధునిక సాంకేతిక, విజ్ఞానశాస్త్రాల సాయంతో సమాజం ఉరకలు పరుగులు తీసింది; తీస్తున్నది. ఈ మెదలు విరిగే వేగంలో మానవుడు తానేమి కోల్పోతున్నది, కోల్పోయింది గుర్తించడం లేదు. తానొకసారి మెడ సారించి, నిలబడి, వెనుదిరిగి చూసుకొనే సమయం అతడికి లేదు. కాలం వేగం పెరిగింది. గడియారం గంటకు నాలుగుసార్లు కొడుతోంది (ఇది నూరెండ్లలో పదహారవ శతాబ్దంలోనే జరిగింది). గంటలు పనిగంటలయ్యాయి. కాలం డబ్బుగ మారింది. ధనార్జనకు మించిన లక్ష్యం మరొకటి లేదు. దీనికోసం మానవుడు వినిమయ వస్తువు (Commodity) అయినాడు. దానితో అతని 'విలువ' పడిపోయింది. 'మేడసుబ్బన్న'కు 'కారు

సుబ్బన్న'కు ఉన్న విలువ పట్టి సుబ్బన్నకు లేదు. కొన్నాళ్ళ వరకు విశ్వకేంద్రమైన 'మనిషి' కేంద్రబిందువు నుంచి వెలుపలికి వచ్చాడు. ఇది ఈనాటి మానవుని స్థితి.

మనిషి వినిమయ వస్తువు అయినప్పుడు అతని ప్రవర్తన అంతకంటె భిన్నంగా ఉండడానికి వీలు లేదు. ఎలా ఉంటే, అంగడిలో తనకు ఎక్కువ రేటు పలుకుతుందో ఆ గుణాలనే అలవరచుకొంటాడు. ఇతరులు, తనలోని ఏ గుణాలను (నిపుణతలను) కొనగలరో, కొంటారో వాటినే అతడు వృద్ధి చేసుకొంటాడు; పెంచుకొంటాడు. నేను ఏదైన ఒక ప్రత్యేక విభాగంలో విశిష్టతను, నిపుణత (Skill) ను సంపాదిస్తే, అది మార్కెట్‌లో ఎక్కువ రేటు పలికితే ఆ నిపుణతనే ఇంకా ఇంకా పెంచుకొంటాను. ఇతరులు నన్ను ఈ విశిష్టతను చూచే కొంటారు. నా ఇతర గుణాలతో వారికి పని లేదు. నా నైతికస్థాయి, విలువ, నిష్కాపట్యం, సత్యసంధత, ఆంతరంగిక సౌందర్యం, కరుణ, దయ-ఇవేమీ వారికి పని లేదు. నాలోని ఆ నిపుణత వరకే కొని, మిగతా నన్ను వదలివేస్తారు. నన్ను కొనదగిన నిపుణునిగా మాత్రమే చూస్తారుగాని, మనిషిగా మాత్రం చూడరు. నేను మనిషిని కాను, నిపుణుని మాత్రమే. అందుకని మానవగుణాలకు చోటు లేదు.

ఇటువంటి పరిస్థితులలో కొన్ని విలువలను ఆధారం చేసుకొని నెలకొన్న కుటుంబం, జాతి, దేవాలయం, వ్యవస్థలు విస్మరించబడుతున్నాయంటే ఆశ్చర్యం ఏముంది? మనిషి అంతరంగం లేని యంత్రమయ్యాడు.

తన వ్యక్తిత్వం, అంతరంగం లుప్తమయ్యాయని మానవుడు ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నాడు. వ్యక్తిని వ్యక్తిగా గుర్తించనట్లయితే మనిషికి భవితవ్యం లేదనే స్ఫురణ ఇప్పుడిప్పుడే జాగరితమవుతున్నది. అందుకనే మనం ఇప్పుడు ఎక్కువగ హరేరామ హరేకృష్ణ భజన సంఘాలను చూస్తున్నాము. మానవశక్త్యుద్యమాలు (Human Potential Movements), మనిషిలో బీజ రూపంలో ఉన్న అంతర్గతశక్తులను వికసింపజేయాలనే ఉద్యమాలు నేడు మనకు కనిపిస్తున్నాయి. ఈ ఉద్యమానికి అనుగుణంగా. మానవసంబంధాల విజాయితీని, నిష్కాపట్యాన్ని, బహిరంగతను ప్రతిపాదిస్తూ పెరల్స్ ఒక ప్రార్థనా మంత్రాన్ని రచించాడు:

''నాపని నేను చేస్తాను. నీపని నీవు చేస్తావు
నేనున్నదీ ప్రపంచంలో నీ ఆశంసల కోసం
కాదు
నా ఆశంసల కోసం కాదు నీవున్నదీ
ప్రపంచంలో
నీవు నీవే నేను నేనే
అదృష్టవశాత్తు నిన్ను నేను, నన్ను నీవు
తెలుసుకొంటే అది స్నిగ్ధం
కాకపోతే మనమేమీ చేయలేం''

వీటి లక్ష్యం వ్యక్తివికాసం.

వ్యక్తివికాసమంటే వ్యక్తిలో అంతర్గతంగా, నిద్రాణంగా ఉన్న సృజనాత్మక శక్తులను వెలికి తీసుకురావడం. ఈ పని జరగడానికి వ్యక్తిలో నిద్రాణంగా ఉన్న ఆ శక్తులేవో తెలుసుకోవాలి. అతని ప్రవర్తన వెనుక ఉన్న ఊట బుగ్గలను శోధించాలి వ్యక్తిలోని వైయక్తికతా శక్తులను గుర్తించాలి అంటే నీలోని నిన్ను నీవు తెలుసుకోవాలి ఆత్మానం విద్ధి. Know thyself. ఆత్మశోధన, ఆత్మాన్వేషణ, ఔద్వేగికక్రమవికాసం జరిగినప్పుడే వ్యక్తి సౌమనస్యంగ ఆరోగ్యవంతుడుగ పక్రమంగ ప్రవర్తించగలుగుతాడు.

ఇటువంటి ఆత్మావగాహన పెంపుదలకు ఈ ఇరవయ్యో శతాబ్ది అంతిమదశలలో అన్నిరకాల ప్రయోగాలు ప్రారంభమయ్యాయి. యోగాలను నిర్వహిస్తున్నారు. మానవతావాదం ఆర్ద్రరహితమైన యాంత్రికతనుంచి మనిషిని విడిపించాలని ప్రయత్నిస్తున్నది. ఇదే దిశలో అస్తిత్వవాదం (Existentialism) మానవుని ''ఇప్పుడు-ఇక్కడ''ను గుర్తించింది. మనోవిశ్లేషణవాదులు ఆత్మకు శస్త్రచికిత్స చేసి లోపలి భాగాలను త్రవ్వితోడి బయటికి తీస్తున్నారు. అంతరంగంలో ఏవైన ''చీకటిగదులు'', ''మరకలు'' ఉంటే వాటిని వెలుగుతో నింపి తుడిచివేస్తున్నారు. మూర్తిమత్త్వం (Personality) లో పడిన ''రంధ్రా''లకు పెరల్స్ అనుయాయులు ''మాట్లు'' వేస్తున్నారు.

''ఆత్మశోధనకు రాచబాట స్వప్నం'' అని ఫ్రాయిడ్ అంటే, ''నీతో నీకు, నీతో నీచుట్టూ ఉన్న ప్రపంచానికి గల సంబంధాన్ని తెలియజేసే సత్తాక సందేశం (existential message) అని, ఆత్మసమీకరణానికి సమన్వయతకు రాచబాట స్వప్నం'' అని పెరల్స్ అన్నాడు. కనుక స్వప్నం ఆత్మావగాహనంలోను, ఔద్వేగికక్రమవికాసంలోను అనన్యమైన పాత్ర నిర్వహిస్తుందనడంలో సందేహం లేదు.

నిత్యజీవితంలో మానవుడు అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాడు ఈ సమస్యలను ఎదుర్కోవడంలో అతడు ధీరువుగానో భీరువుగానో ప్రవర్తించవచ్చు. రెండు ఎదురుదెబ్బలు వరుసగా తగిలితే మనసు చెదిరిపోవచ్చు. రోగగ్రస్తుడు కావచ్చు. ఇక అక్కడనుంచి ప్రపంచాన్ని తననుగూడ వక్రంగా దర్శించ ప్రారంభించవచ్చు. ఇటువంటి సందర్భాలలోను, మరి అనేక ఇతర సంబంధాలలోను మనిషి తనను తాను, ఇతర ప్రపంచాన్ని ఎలా దర్శిస్తున్నాడో తెలుసుకోవడానికి స్వప్నం సహాయపడుతుంది. ఎందుకంటె స్వప్నం, వ్యక్తి గాఢంగా మునిగి ఉన్న దైనందిన సమస్యలను, స్నేహసంబంధాలను అతనికి ప్రదర్శించి పరిష్కరింపబూనుకొంటుంది. ఆ విధంగా స్వప్నం అందించిన పరిష్కారాన్ని వాస్తవప్రపంచ పరిస్థితులతో మేళవించి ప్రవర్తించవలసి ఉంటుంది.

ప్రపంచం ఈ విధంగా యాంత్రికమైపోయినప్పుడు, మనిషి వినిమయవస్తువు అయిపోయినప్పుడు, మానవ సంబంధాలు 'అంగడి విపణ'లను సంతరించుకొన్నప్పుడు, మనిషి రెండవప్రక్కకు తిరిగి ఆత్మపరిశీలన, వ్యక్తిక వికాసావశ్యకతను గుర్తిస్తాడు; ఇప్పుడు గుర్తించాడు.

రాబోయే కొలది సంవత్సరాలలో ఈ ఆవశ్యకతలకు మరింత ప్రాధాన్యాన్నిచ్చి తనను తాను అర్థం చేసుకో ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో స్వప్నం అతని చేతిలో మంచి సమర్థవంతమైన పరికరం అవుతుందనడంలో సందేహం లేదు. అందుకని స్వప్నాన్ని మనోవిశ్లేషణకుని గదికి మాత్రమే పరిమితం చేయవలసిన పని లేదు. ఎవరికి వారు స్వప్నాన్ని ఆత్మశోధక పరికరంగా ఉపయోగించుకోవచ్చు. స్వప్నానికి అర్థం ఎలా చెప్పాలి? అనే విషయాలను విశదీకరిస్తూ ఆంగ్లంలో అనేక గ్రంథాలు వచ్చాయి.* వాటిని చదువుకొని నిత్యజీవితంలో అనువర్తింపజేసుకోవచ్చు.

అంతరంగ సమస్యలను ఎదుర్కోవడానికి భయం వేసి, కొంతమంది సమయం లేదని కుంటిసాకు చెబుతూ ఉంటారు. జీవనసమరంలో అసలే సమస్యలతో వేగలేక, సమయంలేక చస్తూ ఉంటే. మళ్ళీ ఈ స్వప్నాలను గుర్తుపెట్టుకోవడం వాటికి అర్థం చెప్పుకోవడంలాంటి పనులన్నీ చేయడం ఎలా సాధ్యమవుతుందని అనేకమంది అంటూ ఉంటారు. మనిషికి సమయం లేదనేది కుంటిసాకు మాత్రమేనని నా అభిప్రాయం. నిజంగా ఏపని అయినా మనం చేయదలుచుకుంటే సమయం చిక్కకపోదు. అధునాతన జీవితంలో సంకటంలో పడ్డ అంతరంగ వికాసం జీవితార్థంలాంటి ప్రముఖ సమస్యలను ప్రక్కకు నెట్టి, ఇంటిపని, సమాజంలో పటాటోప జీవితం నెరపడం, నీతులు చెప్పడం, ధనార్జనలాంటి కార్యకలాపాలకు ప్రాధాన్యం ఇచ్చి పరుగులు తీస్తే చివరకు కుప్పకూలిపోవడం తప్ప ఒరిగేదేమీ ఉండదు. నిత్యజీవితంలో అసలు ఎన్నో అనవసరమైన పనులు చేస్తుంటాము. ఇతరుల అనుమతి, సానుభూతి, మెప్పులకోసం మన విధి మనం నిర్వహిస్తున్నామని చెప్పుకోవడంకోసం, చాలా అనవసరమైన పనులు చేస్తుంటాము. బహుశ ఇది అంతర్గత వాస్తవ సమస్యలను ఎదుర్కొనలేక అనవసరమైన పనుల్లో తలదూర్చి పలాయనం చిత్తగించడమేమో. కావాలంటే ఎరిక్ బెర్న్ వ్రాసిన "జనం ఆడే ఆటలు" (Games people play) అనే పుస్తకం చూడండి. మరింక కావాలంటే స్త్రీ విమోచనోద్యమ నాయకురాలైన బెటీ ఫ్రెడ్‌మన్ వ్రాసిన "స్త్రీల విధుల చుట్టూ అల్లిన మాయాజాలం" (The Feminine Mystique) అనే గ్రంథాన్ని చూడండి. గృహకృత్యాల మీద స్త్రీ వినియోగం చేసే శక్తిలో ఎక్కువభాగం వృథా అవుతుందని ఆమెకున్న కాలాన్ని మొత్తాన్ని "నింపడానికా అన్నట్లు" గృహకృత్యాలు వ్యాకోచిస్తాయని ఆమె చెప్పింది. ఉదాహరణకు మా శ్రీమతి గ్యాస్ స్టౌ మీద వంట చేస్తున్నప్పటికి, అందులోను నలుగురకే చేస్తున్నప్పటికి, మధ్యాహ్నం రెండుగంటలకు ముందు పూర్తిచేయలేదు. అదే, చీరెలు కొనడానికి బజారుకు వెళ్ళవలసివుంటే ఆ రోజు తొమ్మిదిగంటలకే వంట పూర్తి అవుతుంది. చూడండి మాయ. "గృహకృత్యాలు పూర్తిచేయడానికి వలసిన కాలం ఆమెకు రెండవ (ఇతర) పని మీద ఉన్న ఆసక్తికి విలోమనిష్పత్తిలో ఉంటుంది" అని బెటీ ఫ్రెడ్‌మన్ సిద్ధాంతీకరించింది. ఇది మనకందరికీ అనుభవంలో ఉన్న విషయమే.

మరొక కుంటిసాకు, "మనస్సు పైపొరలను చీల్చుకొని లోపలికి పోయి జ్వలిస్తున్న లావా విస్ఫులింగాలను కెలకడం మహాప్రమాదం," అని చెప్పడము. ఇది మానసికంగా స్వాస్థ్యం లేని రోగులకు వర్తిస్తుందే తప్ప మామూలు సాదామనిషికి, ఆరోగ్యవంతునికి వర్తించదు.

* తెలుగులో ఈ వ్యాసకర్త రచించిన "స్వప్నసందేశం" (స్వప్నమనోవిజ్ఞానశాస్త్రం) చూడవచ్చు. తెలుగులో ఇది ప్రథమ మనోవిజ్ఞాన శాస్త్రీయ గ్రంథం. ప్రతులకు : శ్రీ అరవింద సొసైటీ, తెనాలి-522 201.

కనుక స్వప్నరహస్యాన్ని జనసామాన్యానికి ఎరుకపరిచి ఎవరికివారు దాని లాభం పొందేట్టు చేయవచ్చు.

కొన్ని కొన్ని విషయాలు ఇతరులకు చెప్పకుండ ఉండ లేము, అలా చెప్పకపోతే కడుపు ఉబ్బిపోతుంది. ''రాజు గారివి గాడిదచెవులు'' కథ అందరికి తెలిసినదే. రాజు గారికి గాడిదచెవులున్నవని తెలిసిన మంగలి ఎవరితో చెప్పకోలేక, పుట్టలో చెబుతాడు. పుట్టలోనుంచి మోసు లెత్తిన రెల్లుగడ్డి, గాలికి అటు నిటు ఊగుతూ ''రాజు గారివి గాడిదచెవులని'' శబ్దం చేస్తూ ఉంటాయి. అలాగే అవతలివారికి చెప్పిన తరవాతనే కడుపు ఉబ్బరం తగ్గు తుంది. అలాగే కొన్ని విషయాలను తనలో తాను ఎప్ప టికి అణచుకోరాదు. అలా అణచుకొన్న కొలది అవి ప్రమాదకర రూపాలను ధరిస్తాయి. అందుకే కోపతాపాలు ఆవేశకావేశాలు వచ్చినప్పుడు వాటిని వెడలగ్రక్కడం మంచిదని లోలోపల అణచుకొంటే అతడే కుళ్ళిపోతాడని మనకు తెలుసు. లోపల ఆపుకోలేని దుఃఖం వచ్చినప్పుడు ఎవరిముందైన రోదన ఏడిస్తే అతనికి భారం తొలగినట్లువు తుంది. భార్య మీద కోపం వచ్చిన ఒకడు, ఆమె మీద ఆ కోపాన్ని వెళ్ళగ్రక్కలేక, అది ఆఫీసులో చూపిస్తే, ఎంత ప్రమాదానికి దారితీస్తుందో మనం ఎరుగుదుము. వీటి సారాంశం ఉద్వేగాలను దాంతం చేయకుండ ఎప్పటి కప్పుడు వెలువరించడం ఆరోగ్యకరమని చెప్పడము.

ఇక్కడ ఉద్వేగాలను వెలువరించడం అంటే తనలోకి తాను తొంగిచూసుకొని, ''తనలో ఉన్న ఆ ఉద్వేగం ఏమిటి? దానికి కారణం ఏమిటి?'' అనే దృష్టితో పరిశీ లించినట్లయితే ఆ దృష్టితో దానిని ఎదుర్కొన్నట్లయితే 'కలత' మాయమవుతుంది. మన కుటుంబాలలో భార్యా భర్తల మధ్య తల్లిబిడ్డలమధ్య ఆవేశకావేశాలకు కావలసి నన్ని అవకాశాలేర్పడుతుంటాయి. వాటిని ఎవరికి వారు అణచిపెట్టుకొని లోలోపల క్రుగ్గిపోతే పర్యవసానాలు దారు ణంగా ఉంటాయి. అందుకని సాయంత్రంపూట కుటుంబ సభ్యులంతా ఒకచోట చేరి తమ తమ కలలను చర్చించు కొన్నట్లయితే ఎవరి అంతరంగాలలో ఎవరు ఎవరిని గురించి ఏమి అనుకుంటున్నారు అనే విషయాలు స్పష్ట మవుతాయి. అంటే వారిలో ఒకరిపై ఒకరికి ఉన్న ''మౌలిక అంతర్గత దృక్పథం'' తద్వారా వెల్లడవుతుంది. తండ్రిపై బిడ్డకు ''మౌలికంగా విశ్వాసం ఉందా?'' లేదా ''సంశయాత్మక దృక్పథంతో తండ్రిని చూస్తున్నాడా?'' అనే ప్రశ్నలకు సమాధానం దొరకుతుంది. దీనిని బట్టి విష యాలను, ప్రవర్తనను సరిదిద్దుకోవచ్చు.

పిల్లలకు స్వప్నాలను పరిచయం చేయడం ద్వారా, వాటి ప్రాముఖ్యతను గురించి అర్థం చేసుకొనేటట్లు చేయవచ్చు. స్వప్నాలు ఎక్కడో ఆకాశంనుంచి ఊడిపడినవి కావని, తమ అంతరంగంలో ఏమి జరిగేది తమకు తెలియజేసే ఒకరకమైన స్వైరకల్పనలని వారికి అర్థమయ్యేట్టు చేయ వచ్చు. ఈ విధంగా చేయడం వల్ల చిన్నప్పటినుంచే వారికి తమ అంతరంగ జీవితానికి ప్రవేశం కల్పించినవారమవు తాము. తేలికైన సహజమైన మార్గాన్ని ఉపదేశించినవార మవుతాము. మనం మామూలుగ దాచడానికి, అణచడానికి అలవాటుపడ్డ ఆ రెండవవైపును దర్శించడానికి వారిని సమాయత్తం చేసినవారమవుతాము. దీనివల్ల పిల్లలు తమ జీవితారంభంనుంచి గూడ తమ ''రాత్రి సాహసాలు'' ముఖ్యమని భావిస్తారు. మామూలుగా అయితే ''అదే ముంది, కలేగదా!'' అని త్రోసి పారవేస్తారు.

పిల్లలు పీడకల కని నిద్రలేచినప్పుడు, ఓదార్చి నిద్ర పుచ్చకుండ, ఆ కల ఎందుకు వచ్చింది? ఆలోచించి చెప్పాలి. లేక ఒక కదాకార స్వప్నం వచ్చిందనుకోండి. అటువంటి వింతభావాలు ఎలా వచ్చాయో ఆలోచించ మనాలి. అప్పుడు ఆ స్వప్నాలను పెంచి, పెద్దవి చేసి, విశ్లేషించి వాటిలోని పాత్రలను పిల్లలచేత ఆడించాలి. పిల్లలు ఆ పాత్రలను వహించి, వాటిలో లీనమై నటించ డంతో నూతన అంతర్దృష్టి తటిల్లున మెరుస్తుంది. తామెం దుకు భయపడింది, తాము ఆ కాలంలో ఎదుర్కొనే సమస్యలేమిటో వారికి అర్థమవుతాయి.

కుటుంబంలో సభ్యులంతా ఒకచోట కూర్చొని ఒకరిని గురించి ఒకరు ఏమనుకొనేది, తమ తమ బాధలు, తమకు జరిగే అన్యాయాలను పిల్లలు, పెద్దవాళ్ళుగూడ ఏకరువు పెట్టుకొనే గోష్ఠి కార్యక్రమాలు విదేశాలలో ముఖ్యంగా అమెరికాలో ఇంగ్లాండులో జరుగుతున్నాయి. తమలో తాము సర్దుబాటు చేసుకోవడానికి ఈ గోష్ఠి కార్యక్రమాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. అయితే ఈ గోష్ఠు లలో తమ పాత్రలను స్వప్నాలు నిర్వర్తిస్తున్నాయి. మరొక విధంగా బయటపడడానికి వీలులేని అనేక అనుభూతులు ఈ స్వప్నాలద్వారా బహిర్గతమవుతున్నాయి. ఉదాహర ణకు పండ్రెండు సంవత్సరాల బాలిక ఇటువంటి ఒక కుటుంబ గోష్ఠిలో ఈ కలను చెప్పింది :

"ఒక సంకేత స్థలంలో మరురోజు కలుసుకోవాలని ఒక యువతి యువకుడు నిర్ణయించుకొంటారు. అలాగే నిర్ణీత స్థలానికి నిర్ణీత సమయానికి ఆ యువతి వస్తుంది. కాని ఆ యువకుడు రాడు. ఆ యువతి దిగంబరంగా ఉంది. అందరూ చూచి నవ్వుతూ ఉంటారు. ఆమె సిగ్గుతో అవమానంతో తలెత్తలేక కుంచించుకు పోతుంది."

విశ్లేషణలో ఆ యువతి తానే అని తేలింది. ఆ యువకుడు తన అన్న అని తేలింది. ఈ స్వప్నం అన్నపై ఆమెకున్న అభిప్రాయాన్ని తెలిపింది. ఒప్పందం ప్రకారం కుటుంబ సభ్యులంతా ఎవరూ ఏమీ దాచుకోకుండా గోష్ఠిలో చెప్పాలి. కాని అన్న నిజం చెప్పడం లేదని, తాము చెప్పిన రహస్యాలను, తమ తమ బలహీనతలను అన్న తమ మీద ప్రయోగించడానికి వెనకాడడని ఆమె అభిప్రాయం. మిగతా సభ్యులు గూడ అతనిని గురించి ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అప్పటినుంచి నిజమే చెబుతానని అతడు శపథం చేశాడు. తనలో ఎటువంటి హీనప్రవర్తన కనిపించినా ఎత్తిచూపవలసిందని, దానికి తాను బాధపడనని చెప్పాడు.

కొన్ని స్వప్నాలు మనం ఇతరుల గురించి అచేతనంగా ఏమనుకొంటున్నామో చెబుతాయి. ఈ అచేతన విషయాలు మనకు స్వప్నం ద్వారా తప్ప మరోవిధంగా బయట పడవు. ఉదాహరణకు భార్యాభర్తలిద్దరున్నారు. వారి జీవితం సజావుగానే సాగిపోతోంది. వారి మధ్య ఏరకమైన పొరపొచ్చేలు లేవు. ఒకరంటే ఒకరికి సదభిప్రాయం ఉంది. ప్రేమ అవగాహనలున్నాయి. పది సంవత్సరాల దాంపత్య జీవితం గడిచింది, అప్పుడు భర్త మరొకర్తెతో తిరుగుతున్నట్లు బయటపడింది. దీనికి భార్య చేసేదేమి లేక,వివాహాన్ని రద్దు చేసుకోలేక, అతనితో ఒక ఒప్పందానికి వచ్చింది. ఇకనుంచి అతడు చెడు తిరుగుళ్ళు తిరగకుంటే ఆమె అతనిని క్షమిస్తుంది. దీనికి అతడు హృదయపూర్వకంగానే ఆమోదించాడు. ఈ ఆమోదం ఆమె హృదయాన్ని పులకితం చేసింది. ఈ ఏర్పాటు చేతన స్థాయిలో, అంటే మనస్సు ఉపరితలంలో (పైకి) బాగానే ఉంది. కాని ఆమె అంతరాంతరాలలో ఎక్కడో బెట్టు తప్పిన వీణానాదం మెదలుతూనే ఉంది. అంటే చేతనం ఈ ఏర్పాటును ఒప్పుకొందిగాని అచేతనం ఒప్పుకోలేదు. ఇది అచేతనం కనుక ఈ సంగతి ఆమెకు తెలియదు. ఒప్పందం తరవాత ఆమెకు ఈ కల వచ్చింది :

"భర్తతోపాటు కొన్నాళ్ళు సుదూరప్రాంతాలు చుట్టివద్దామని బయలుదేరింది. తీరా రైలెక్కిన తరవాత చూస్తే లగేజీ, టిక్కెట్లు ఉన్న పర్సు లేవు. ఇంటివద్దనే మరిచిపోయినట్లు కలగంది. టిక్కెట్టు కలెక్టరు అడిగితే ఏమి చెప్పాలి? రైలు వేగం పెరిగింది. అతడొచ్చేలోపల నిద్రపోయి, ఎంతవరకు చేరితే అంతవరకు పోవాలనుకుంది. అంతగా టిక్కెట్టు ఎక్జామినర్ నిద్రలేపితే యాదమరిచి నిద్రపోయాము. స్టేషను దాటి వచ్చాము అని చెబుదామనుకొంది. అసలు అలా సమర్థించుకొంటానికైన ఆమె దగ్గర ఏ స్టేషనుకు టిక్కెట్టు లేదు గదా."

ఇటువంటి ప్రయాణానికి (అంటే భర్తతో మళ్ళీ పూర్వపు లైంగిక సంబంధాలకు) ఆమె మానసికంగా సమాయత్తం కాలేదని ఈ కల చెబుతుంది. స్వప్నంలోని లగేజీ, పర్సులు స్త్రీ లైంగికావయవాలను సూచిస్తాయి. వాటిని ఆమె ఇంటి దగ్గర మరిచిపోయింది. అతడికిక వాటిని అర్పించడం ఇష్టం ద్యోతకమవుతుంది. అంతర్గత సత్యాన్ని ఆమె ఎదుర్కొనలేకపోయింది. దానికి చెల్లించవలసిన మూల్యం ఎక్కువైంది. (అంటే మానసికబాధ). రైలు దిగి వెనక్కిపోలేదు. సత్యాన్ని (టి. సి. ని) ఎదుర్కోలేక నిద్రపోయి తప్పించుకొందామనుకొంది. ఈ విధంగా ఆమె అచేతనంలో పడుతున్న బాధ స్వప్నంలో వ్యక్తమవుతుంది.

విద్య: ఈనాటి మన సమాజం ఎలా ఉందో మనకు తెలుసు. ఎక్కడ చూచిన ఆందోళనలు, సమ్మెలు, లాకౌట్లు, కుమ్ములాటలు, రాజకీయ ప్రహసనాలు, దయ్యాలు వేదికలెక్కి వేదాలు వల్లించటం (రాజకీయ నాయకులు నీతులు వల్లించడం), కాలేజీలు ఎగగొట్టడం, బస్సులు, రైళ్ళు ధ్వంసం చేయడం, కట్నాలకోసం కోడళ్ళను తగులబెట్టడం. ఇలా ఎన్నో కనిపిస్తున్నాయి. వీటికి కారణం ఏమిటి? ఇతర కారణాలు ఎన్నైనా ఉండవచ్చు కాని, మనుష్యులు ఉద్రేకాలను అదుపులో పెట్టుకోలేకపోవడం. ఆ ఉద్రేకంతో విషయాన్ని వక్రంగా చూడడం. సమాజం ఉద్వేగికక్రమవికాసానికి వాతులు (outlets) ఏర్పరచాలి. ఉద్వేగాలను పూడ్చిపెడితే ఏమయ్యేది అందరికి తెలుసు. విడవకుండ పదిరోజులపాటు కట్టు గాయ్యకు కట్టివేసిన ఆవుదూడను ఒక్కమాటుగ వదిలితే అది చెంగనాలు వేసే సంగతి అనుభవవేద్యమే.

అలాగే మన విద్యావిధానం చదవడం వ్రాయడంతో ఉక్కిరిబిక్కిరి అయి ఊపిరి సలపలేకపోతోంది. ఆటలకు గాని ఉద్వేగోత్సర్గానికి గాని వీలు కల్పించడం లేదు. చదువు కొనడానికి విశ్వవిద్యాలయాలకు విద్యార్థులను పంపుతుంటే, వారు ఊసుకోమని మానసిక విపర్యాయాలకు గురై (అందరూ కాదు) తిరిగి ఇల్లు చేరుతుంటే సమాజానికి లాభం ఏమిటి? తమ అంతఃశక్తులను, ఉద్వేగాలను, బుద్ధిబలాన్ని అర్థం చేసుకోవడానికి విద్యార్థులకు అవకాశం కల్పించని విద్యవలని ప్రయోజనం ఏమిటి? సమాజానికి కావలసింది శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతుడైన వ్యక్తి.

దీనికి నేను సూచించే మార్గం ఒక్కటే. ఇంతకు ముందు నేను వివరించిన కుటుంబ గోష్ఠులలాంటివే గురువు ఆధ్వర్యంలో పిల్లలు గోష్ఠి నడిపి స్వప్నవిశ్లేషణం జరిపితే, సమాజం ఆరోగ్యవంతమవుతుంది.

సృజనాత్మకత: స్వప్నాలకు సృజనాత్మకతకు సంబంధం ఉంది. స్వప్నంలో పెద్ద పెద్ద పరిశోధనలు గావించిన శాస్త్రవేత్తలున్నారు. మహాకావ్యాలు రచించిన రచయితలు ఉన్నారు. రాగాలు రచించిన సంగీత విద్వాంసులున్నారు. ఇటువంటి స్వప్నావస్థలోనే కాలరిడ్జ్ (Coleridge), కుబ్లాఖాన్ కావ్యం రచించాడు. ఒటోలోవీ (otto Lowe) నాడీ ప్రచోదనల రసాయనిక ప్రసరణ (Chemical transmission of nerve impulses) న్ని, తనతోకను తాను నోటితో కరుచుకొని ఉన్న సర్పస్వప్నదృశ్యంనుంచి కెకులె, బెంజీన్ వలయాన్ని (Benzine ring) కనుక్కొన్నారు. ఎడమచేతితో పెల్విస్(Pelvis) లో లోతుగ శస్త్రచికిత్సలో ముడివేసే విధానాన్ని ఒక గైనకాలజిస్టు స్వప్నంలో దర్శించాడు. ఈ వ్యాసకర్త "స్వప్నసందేశం" అనే మనోవిజ్ఞాన శాస్త్రగ్రంథాన్ని రచించాడు. "స్వప్న సందేశం" అనే పేరు స్వప్నంలోనే దర్శితమయింది.

ప్రతిమనిషికి సృజనాత్మకశక్తి ఉంది. శక్తి ఉండి గూడ ఎన్నో విషయాలను కనుగొనలేకపోతున్నారు. దీనికి కారణం ఆ శక్తి అంతా పూర్తిగ అతనికి అందుబాటులోకి రావడం లేదు. మరి అది ఎక్కడ ఉంటున్నది? ప్రతి ఒక్కరికి అంతో ఇంతో వ్యాకులత ఉండకపోదు. ఏదో ఒక మానసిక ఘర్షణ ఉండకపోదు. ఈ వ్యాకులత, ఘర్షణలు బోలెడంత శక్తిని హరించి వేస్తున్నాయి. ఆ 'శక్తి' ప్రవాహానికి అవి అడ్డుగోడలై నిలుస్తున్నాయి. ఈ గోడలను తొలగించినప్పుడే ఆ శక్తి సృజనాత్మకరీతిలో మానవునికి ఉపయోగపడుతుంది.

అయితే ఈ అడ్డగోడలను తొలగించుకొన్నవారంతా ఐన్‌స్టైన్‌లు, న్యూటన్‌లు, ఫ్రాయిడ్‌లు, షేక్స్‌పియర్‌లు అయిపోతారని నా తాత్పర్యం కాదు. సృజనాత్మకత ఆకసం నుంచి ఊడిపడదు. అది దేవుని వరంలా, సమాయత్తమైన, సంస్కృతీకరించబడిన, పదును చదును అయిన మనస్సుకే తడుతుంది. ఎంత సృజనాత్మకశక్తి ఉన్నా భౌతికవిజ్ఞానంలో, గణితశాస్త్రంలో సుశిక్షితుడు కాకపోతే ఐన్‌స్టైన్ సాపేక్ష సిద్ధాంతాన్ని కనుక్కొనగలిగేవాడు కాదు. రసాయనికశాస్త్రంలో పరిశోధనలు చేసిచేసి అలసి సొలసి ఉండకపోతే అంటే అతని మేధ పదనై ఉండకపోతే - కెకులేకు బెంజీన్‌రింగు కలలో కనిపించేది కాదు.

మనలోని మానసిక శక్తిని అనూహ్యమైన మొత్తాలలో ఈ అడ్డగోడలు బంధించడం మూలాన మన సృజనాత్మకత శక్తి బయటపడడం లేదు. ఈ అడ్డగోడలను తొలగించుకొంటే, మనం ఐన్‌స్టైన్‌లము కాలేకపోయినా, కనీసం మనం మామూలుగ నిర్వహించే కంటె ఏ పనినైన ఇంకొంత సృజనాత్మకంగా నిర్వహించగలుగుతాము. స్వప్నాల సహాయం వేడితే, మనం అడ్డగోడలను తొలగించుకోగలుగుతాము. మానసికశక్తి ప్రవాహం కావలసినంతగా లభ్యమవుతుంది.



# మథురాగమనం

కుమారి పి. రాజ్యలక్ష్మి

కంసునికి, తన పాలిట మృత్యువై దాపురించిన కృష్ణుని ఏ విధంగానైనా సరే సంహరించాలనే కోరిక దిన - దిన ప్రవర్ధమానం కాసాగింది. అతడు అక్రూరుని పిలచి, బలరామ కృష్ణులను మథురకు తీసుకొని రమ్మని చెప్పాడు. అంతేకాదు తన అశాంతికి కారణభూతుడైన కృష్ణుని సంహరించటమే తన ముఖ్యోద్దేశమని, అందుకోసమై తాను అన్ని హంగులను సమకూర్చుకున్నానని అక్రూరునికి తెలిపాడు. కంసుని మాటలు విన్న అక్రూరునికి బాధతో పాటు, తాను శ్రీకృష్ణుని చూడగలుగుతున్నాననే ఆనందం కూడ కలిగింది.

కంసుని ఆజ్ఞానుసారం అక్రూరుడు బృందావనానికి వెళ్ళాడు. నీలమేఘశ్యాముని చూడగానే అక్రూరుడు ఆగలేక పరుగున వెళ్ళి ఆలింగనం చేసుకున్నాడు. కృష్ణుని స్పర్శతో, అతని దేహం పులకరించింది, కన్నులవెంట ఆనంద బాష్పాలు కురువసాగాయి.

బలరామ - కృష్ణులను మథురకు తీసుకొని వెళ్ళటానికి అక్రూరుడు, వచ్చాడని తెలియగానే యశోద భయకంపితురాలైంది. బలరామ-కృష్ణులను మథురకు తీసుకొని వెళ్ళవద్దని ఆమె అక్రూరుని బ్రతిమిలాడసాగింది.

(మేరే) కమలనైన ప్రానని తై ప్యారే।
యా నైవా కహా మధుపురీ పఠావూ,
రామ-కృష్ణ దోవూ జన వారే॥

"అక్రూరా! కమలనయనుని నా ప్రాణాల కన్నా మిన్నగా ప్రేమించాను. కన్నయ్యను వదలి ఒక్క ఘడియైనా వుండలేననే విషయం నీకు తెలియదా? అదీకాక పసిపిల్లలను మథురకు పంపమని అడగటానికి కంసునికెలా మనసు ఒప్పింది? బలరామ - కృష్ణులు చాలా చిన్నవారు వారికి రాజసభలోను, పెద్దలపట్ల ఎలా మసలుకోవాలో లేశమాత్రమైనా తెలియదు. మథురనిండా రాక్షసులు, మల్లయోధులు నివసిస్తారని విన్నాను. వారిని చూసి నా కన్నయ్య దడుసుకోడా? అక్రూరా! నీకు దణ్ణం పెడతాను, నా నల్లనయ్యను నా నుండి దూరం చేయకు."

జసుమతి అతి హీ భయీ బిహాల।
సుఫలక సుత యహ తుమహి బూఝి యత,
హరత హమారే బాల॥

"యశోద అత్యంత వ్యాకులంతో దుఃఖించసాగింది, తన మాట వినకుండా అక్రూరుడు, బలరామ - కృష్ణులను తన వెంట మథురకు తీసుకొని వెళతాడేమోనని. రోహిణీ దేవి కూడ అక్రూరుని ప్రార్థిస్తూ, 'అక్రూరా! మా జీవనాధారమైన బలరామ-కృష్ణులను నీ వెంట తీసుకొని వెళ్ళి, మమ్ములను ప్రాణరహితులను చేయటం నీకు వుచితమేనా? నీవు బృందావనానికి వచ్చింది మొదలు, మా పిల్లలు మా వెంట పడటమే మానివేసారు. అయినా మీ మహారాజుకు మా పిల్లలతో పనేమిటి? మేము వారిని నీ వెంట మథురకు పంపదలుచుకోలేదు' "

రోహిణీ - యశోదలు, బృందావనవాసులు ఎంతగా బ్రతిమిలాడినా కృష్ణుడు వినక మథురకు ప్రయాణమయ్యాడు. కంసమామను చంపటమే అతని ముఖ్యోద్దేశం కాదు. తన తల్లి-తండ్రులైన దేవకీ - వసుదేవులకు ఆనందం కలిగించటానికి, వారి కోర్కెను తీర్చటానికి మథురకు వెళ్ళాడు. అతని కార్యములన్నింటిలోను తన భక్తులకు సుఖము కలిగించుటే పరమోద్దేశముగ వుంటుంది. మథురాపురవాసినులైన నారీమణులు, బృందావన విషయములను విన్నా, వ్రజాంగనల అనుపమ ప్రేమచర్చలు వారి

చెవి సోకినా, "అయ్యో! మనమా సౌందర్య-మాధుర్య, సజీవ - సాకారమూర్తిని చూడ లేక పోయామే? ఎన్నటికైనా ఈ కన్నులతో శ్యామసుందరుని చూచే భాగ్యం కలుగు తుందా?" అని పరితపిస్తూ వుండేవారు. కంసుడు నిద్రించినా, మేల్కొనినా, తినుచున్నా, త్రాగుచున్నా, సర్వకాల సర్వావస్థలయందు కృష్ణునే ధ్యానిస్తూ వుండేవాడు. "నా పాలిట మృత్యువైన కృష్ణుడు నన్ను చంపుతాడేమో? నాకతని వలననే చావు." ఈ విధంగా భయ వ్యాకులుడైన మామ, మేనల్లునే ధ్యానిస్తూ వుండేవాడు. దేవకీ - వసుదేవుల సంగతి వేరుగా చెప్పనవసరం లేదు. రాత్రి - పగలు వారు తమ పుత్రునే స్మరిస్తూ వుండేవారు. వారి వుత్కంఠతాపరాకాష్ఠను చూసి కృష్ణుడు, తన అన్నతో సహా రథమెక్కి అక్రూరుని వెంట మథురాపురికి వచ్చాడు.

కృష్ణుని అనుపమ సౌందర్యాన్ని చూడటా నికి మథురావాసులకు రెండు కన్నులు చాల లేదు.

భయె సఫల నైన సనాథ హమారే,
మదనగోపాల దేఖతహి సజనీ, సబ దుఃఖ సోక బిసారే॥

"సఖీ! కృష్ణుని సుందరరూపాన్ని చూసి మన నేత్రాలు తరించాయి. అంతేకాదు మదన గోపాలుడు, మథురలో అడుగుపెట్టగానే మన చింతలన్నీ దూరం అయ్యాయి. బృందావన వాసులే కాదు, మనం కూడ చాలా అదృష్ట వంతులమనే సత్యం ఈనాడు కనుగొన్నాను. కానీ ఏం లాభం? కుటిల బుద్ధిగల కంసుడు, కృష్ణుని సంహారించటానికి మల్లయుద్ధమనే పేరుతో, అతనిని ఇక్కడకు రప్పించాడు. ముష్టిక-చాణూరులు మహాబలవంతులు. వీరిని, కోమల శరీరుడైన కమలనయనుడు ఎదుర్కొ నగలడా? దైవమే వీరికి సహాయం చేసి ఈ మల్లయుద్ధమందు గెలిచేలా ఆశీర్వదించాలి."

బలరామ-కృష్ణులు, కంసుని దర్శించుట కోసమని రాజసభకు బయలు దేరారు. కానీ దారిలో మహాబలవంతులైన ముష్టిక-చాణూ రులు వారిని అడ్డగించారు. ఈ సంఘటన కృష్ణునికి చాలా కోపం తెప్పించింది.

సునౌ హో బీర ముష్టిక - చానర సబై,
హమహి నృప పాస నాహి జాన దైహౌ।

"'ఓ ముష్టిక-చాణూరులారా! మమ్ము లను కంసమహారాజు వద్దకు వెళ్ళనివ్వకుండా ఎందుకీ విధంగా అడ్డగిస్తున్నారు? మమ్మల్ని ఈ విధంగా అడ్డగించటం వలన జరిగే పర్యవ సానానికి మీరు చింతించవలసి వుంటుంది. నందుని పుత్రుల వలన మహాబలవంతులైన మీరు మరణించటం ఎంత సిగ్గుచేటు? నా చేతులలో మీకు మృత్యువు రాసిపెట్టివుంటే నేనేమి చేయలేను.' కృష్ణుని మాటలకు ఆ మల్లులు నవ్వి, 'ఓ కృష్ణా! దంభాలు మాని ధైర్యంగా మమ్మల్ని ఎదురుకో. అంతే కానీ ఇలా వ్యర్థ ప్రలాపాలు చేయకు.'"

గహ్యో శ్యామ భుజ మల్ల అపనే దాయీ,
ఝటకి లీన్హో తురత పటకి ధరనీ।

"ముష్టిక-చాణూరులు తమ మాటలతో బలరామ-కృష్ణులను రెచ్చకొట్టారు. అంతే కాదు కృష్ణుని కోమల శరీరాన్ని తమ చేతు లతో బిగించి పట్టుకొని కౌగిలించుకొని వత్తారు. ఆ మహాభాగులైన మల్లుల భాగ్యం వర్ణింపలేనిది. ఒక్కసారి అతని శరీరాన్ని స్పృశించటానికై వ్రజాంగనలు ఎన్నెన్ని వ్రతాలు, జపములు కావించారో, అట్టి శ్యామసుందరుని శరీరమంతా కౌగిలిలో నింపు కొని బలపూర్వకంగా పీడించారు. శ్యామ

సుందరుడు వారిపై ఎక్కి తన చేతులతో వారిని ప్రహారము కావించాడు. క్రిందపడుతూ ఆ మల్ల యోధులు చేసిన ఆర్తనాదాన్ని విని కంసుడు భయంకపితుడయ్యాడు. క్రిందపడిన ఆ మల్ల యోధులు, కరుణించి తమను రక్షింప మన్నట్టు, కృష్ణుని వైపు చూసారు. మందస్మితవదనుడైన మాధవుని చూసి వారు తమను తాము మరచిపోయారు. అంతే కాదు శిఖపింఛమును, మకరకుండలాలను ధరించిన ఆ నల్లనయ్యను చూసి తమ జన్మ ధన్యమైనదని అనుకొని కన్ను మూసారు. ఈ వార్త క్షణాల మీద కంసునికి చేరవేయబడింది.''

నవల నంద-నందన రంగభూమి రాజై।
శ్యామ తన, పీత పట మానొ ఘన మే తడిత,
మోరకే పంఖ మాథై బిరాజై॥

"రాజసభలో నందనందనుడు అసమాన సౌందర్యముతో వెలిగి పోసాగాడు. మబ్బుల నడుమ మెరుపుతీగలా మెరిసిపోసాగింది, అతను ధరించిన పీతాంబరం. నుదుట కస్తూరీ తిలకం, శిఖమున నెమిలిపింఛం అందంగా వెలిగి పోసాగాయి. విశాలమైన కృష్ణుని నేత్రాలు ఎఱ్ఱజీరలతో కమలాలను తలపింప చేస్తూ, సూదంటురాయిలా ఎదుటివారిని తన వైపుకు ఆకర్షింప చేసుకుంటున్నాయి. కనుబొమలు ధనస్సును, ఉంగరాలు తిరిగిన ముంగురులు తుమ్మెద రెక్కలను తలపింప చేస్తున్నాయి. వక్షస్థలముపై వనమాలను, పాదాలకు నూపురాలను ధరించి కృష్ణుడు మందగమనంతో నడుస్తూ వుంటే సభలోని వారంతా కన్నులు ఆర్పటం కూడ మరచి ఆదివ్యమూర్తిని చూడసాగారు. మాధవుడు నెమ్మది-నెమ్మదిగా నడుస్తూ ఎత్తైన ఆసనం మీద కూర్చుని వున్న మామను క్రిందకు యీడ్చి, అతని భావనానుసారంగ చంపాడు. కొనప్రాణాలతో వున్న కంసునికి, తన దివ్యరూపాన్ని చూపి అతనిని తన దివ్యధామానికి చేర్చుకున్నాడు. దుష్టుడైన కంసుడు మరణించటంతో దేవతల ఆనందానికి హద్దులేక పోయింది. గంధర్వులు పుష్పవృష్టిని కురిపించారు. అప్సరసలు ఆడి-పాడారు.''

కంసుని సంహారణానంతరం శ్రీకృష్ణుడు, ఉగ్రసేనునికి రాజ్యాన్ని యిచ్చి, తన తల్లి-తండ్రులైన దేవకీ-వసుదేవులను కారాగార వాసము నుంచి విముక్తులను కావించాడు. దేవకీ-వసుదేవులు తమ ముద్దుల బిడ్డమైన కన్నయ్యను తనివితీరా హృదయానికి హత్తుకొని అనంతమైన ఆనందాన్ని అనుభవించారు.

నందుడు, బలరామ-కృష్ణుల వెంట మథురకు వచ్చి చాలా కాలం వుండి పోయాడు. తన కన్నుల ముందు పెరిగిన కన్నయ్య గొప్పతనాన్ని చూసి నందుడు ఆనందంతో వివశుడు కాసాగాడు. అదీకాక కృష్ణుని వదలి వంటరిగా బృందావనానికి వెళ్ళటానికి అతని మనస్సంగీకరించలేదు. కానీ అతని ఆనందం ఎంతో కాలం నిలువలేదు. ఒక రోజు కృష్ణుడు, నందుని తన నివాసానికి పిలచి—

బేగి వ్రజ కై ఫిరియే నందరాయీ।
హమహి-తుమహి సుత తాత కౌ నాతై,
ఔర్ పరయె హై ఆయీ॥

"'తండ్రీ! ఎంతకాలమని మథురలో వుంటావు. నీవు బృందావనానికి వెళితే బావుంటుందని నేను భావిస్తున్నాను. మన మధ్యనున్న తండ్రి-కొడుకుల బాంధవ్యం ఈనాటితో ముగియబోతున్నది. నీవు నన్నెంతో అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసావు. అది నేనెన్నటికి మరువలేనిది. భౌతికంగా నేను నీవద్ద వుండక పోవచ్చు. కానీ మానసికంగా నీ వెంటనే వుంటాను. తల్లి యశోదకు నా ప్రణామము

లని చెప్పండి. నా చిన్ననాటి చెలులను, గోపికలను నేనెన్నటికీ మరువనని చెప్పండి. తండ్రీ! ఎందుకు కంటనీరు పెట్టుకుంటావు? ఈ మమతలు, మమకారాలు, వియోగాలు అన్నీ ఒట్టి మిథ్య. వీటిని వదలుకుంటే గానీ, మానవులు బాగుపడరు.' కృష్ణుని నోటినుండి వెలువడిన ఈ మాటలను వింటుంటే నందుని కన్నుల వెంట నీరు తిరిగింది."

గోపాలరాయి హైన చరన తజి జై హై।
తుమహీ ఛాడి మధుబన మేరే మోహన్,
కహా జాయి వ్రజ లై హై॥

"'గోపాలా! నన్ను ఒంటరిగా బృందావనానికి వెళ్ళిపోమనటం నీకు న్యాయమేనా? నేను నిన్ను వదలి వెళ్ళలేను, వెళ్ళను. నిన్ను మథురలో వదలి బృందావనానికి వెళ్ళి నేనేం చేయను? నీ తల్లి యశోద, కృష్ణుడేడని ప్రశ్నిస్తే ఆమెకేమని సమాధానం చెప్పను? లేచింది మొదలు నీ ఆట-పాటలు చూచి మురిసిపోయే నీ తల్లి, నీవు లేకుండా జీవించగలదా? వెన్నను కుండలనిండా నింపి, నీ రాకకై వేయికళ్ళతో ఎదురు చూసే నీ తల్లిని నిరాశపరచటం నీకు వుచితమేనా? నీవు యింత త్వరగా మారిపోతావని యింత నిష్ఠూరంగా మాట్లాడుతావని, నేను కలనైనా వూహించలేదు. పదకొండు సంవత్సరాలు కంటికి రెప్పలా కాచిన మేము, నీకు పరాయివారం అయ్యామా కృష్ణా! అసలు నీవు బృందావనంలో ఎందుకు పెరిగావు? నీ అసాధారణ కృత్యాలతో రాక్షసులనెందుకు సంహరించావు? గోవర్ధన పర్వతాన్ని ఎత్తి మమ్మల్ని ఎందుకు రక్షించావు? గోవర్ధనాన్ని ఎత్తి మమ్మల్ని రక్షించకుండా దాన్ని బృందవనం మీద పడవేసి వుంటే మేమంతా హాయిగా మరణించి వుండేవారము కదా. యింతటి బాధను అనుభవించే అవసరం వుండేది కాదు మాకు. మా మాట వదలివేయి. నిన్ను చూడకుండా బృందావనవాసులు నిలువగలరా?' నందుడు, ఈవిధంగా విలపిస్తూ, తనను వెళ్ళమనవద్దని కృష్ణుని బ్రతిమిలాడుకోసాగాడు."

నందుని మాటలకు శ్యామసుందరుడు నవ్వి,

వుతే కహి మాధే యితనౌ బాత।
జితే మాన సేవా తుమ కీన్హీ, బదలౌ దయౌ న జాత॥

"'తండ్రీ! నీవు నా యందు చూపిన ప్రేమానురాగాలకు నేను ఏ విధంగానూ ఋణం తీర్చుకోలేను. కన్నతండ్రి కంటే ఎక్కువగా మీరు నా ఆలనా-పాలనా చూసారు. ఇన్ని సంవత్సరాలు ఆడుతూ-పాడుతూ క్షణాలలాగా గడిపాను. నేను నిష్ఠూరంగా మాట్లాడాననే అనుకుంటున్నారే గానీ, నా మాటలలోని అంతర్యాన్ని మీరు గ్రహించటం లేదు. తండ్రీ! నా యందు దయ వుంచి, శీఘ్రంగా మీరు గోకులానికి తిరిగి వెళ్ళండి.' కృష్ణుడు యింత నిర్దయంగా మాట్లాడుతూవుంటే, నందునికి ఏమని జవాబు చెప్పాలో తెలియక నిశ్చేష్టుడై నిలుచుండిపోయాడు. అతని కన్నుల వెంట నీరు, అవిరామంగా కురియసాగింది. శరీరం చిగురుటాకులా కంపించసాగింది. తాను ఎంత బ్రతిమిలాడినా, కృష్ణుడు తనను మథురలో వుండనివ్వడని, తన వెంట గోకులానికి ఎంతకంటే రాడని తెలుసుకున్న నందుడు ఒంటరిగా గోకులానికి ప్రయాణం అయ్యాడు."

ఒంటరిగా గోకులానికి వచ్చిన నందుని చూడగానే, యశోదకు అనుమానం పొడసూపింది. ఆమె నందుని ప్రశ్నిస్తూ

నంద కహా హో కహ ఛాండే హరి।
లై జా గయె జైసే తుమ హ్యా తై,
ల్యాయె కిన వైసహి ఆగై ధరి॥

"ఓ నందా! నా ముద్దుల తనయుని ఎక్కడ వదలి వచ్చావు? కన్నయ్యను తీసుకొని వెళ్ళినవాడివి తిరిగి యింటికి తేవాలని తెలియలేదా?

కంటికి రెప్పలా కాచి, పెంచి - పెద్ద చేసిన కన్నయ్యను దేవకీ - వసుదేవుల పరం చేసి రావటానికి నీకు మనసెలా ఒప్పింది? కృష్ణ విరహంలో నేనెంతకాలం జీవించివుండాలో కదా! కృష్ణుని కోసమని వచ్చిన బృందావన వాసులకు నా ముఖాన్ని ఎలా చూపను?''

జసుదా కాన్హ.కాన్హ కై ఝూరయ్।
పూటిన గయీ తుమ్హాకీ ఛారే, కై సే మారగ సూఝయ్॥

''యశోద, 'కృష్ణా! కృష్ణా!' అని దుఃఖస్తూ నందుని నిందింపసాగింది. 'నందా! నీవు కృష్ణుని విడచి ఎలా రాగలిగావు? నీ కసలు మార్గం ఎలా గోచరించింది? నీవు ''కృష్ణుడు బృందావనానికి రానని అన్నాడు'' అంటుంటే, ఆ మాట విని నా హృదయం వేయి ముక్కలు కాకుండా వజ్రంకన్నా కఠోరంగా ఎలా వుండిపోయింది? అక్రూరుడు మన పాలిట శత్రువు అవుతాడని నేను కలనైనా వూహించ లేదు. నేను, నా కన్నయ్యను విడచి ఒక్క ఘడియైనా వుండలేను. నందా! నన్ను నా కన్నయ్య వద్దకు తీసుకొని వెళ్ళు!' ''

కృష్ణుని కోసం, ఈ విధంగా విలపిస్తున్న యశోదను ఎలా సాంత్వన పరచాలో నందునికి అర్థం కాలేదు. తన మాటలకు సమాధానం యివ్వక మౌనంగా వుండిపోయిన నందుని చూస్తూ వుంటే యశోదకు దుఃఖం, ఆవేశం ఎక్కువ కాసాగాయి.

నంద హరి తుమ సౌ కహా కహ్యో।
సుని-సుని నిఠుర వచన మోహన్ కే,
కై సే హృదయ రహ్యో॥

''నందా! మాధవుడు నీతో కఠినంగా మాట్లాడుతుంటే, నీ హృదయం బ్రద్దలవకుండా ఎలా నిలచింది? అతని పట్ల స్నేహాన్ని మమ కారాన్ని వదులుకొని నీ వెలా రాగలిగావు? నీ హృదయం వజ్రం కన్నా కఠినమైనదని, నాకు ఈనాడు తెలిసింది. నీ కసలు కృష్ణునిపట్ల ప్రేమానురాగాలు ఏ మాత్రం లేవు. నీకు నిజంగా ప్రేమనేదే వుంటే ప్రాణాలతో నీవు యిలా రాగలిగి వుండేవాడివి కాదు. దశరథు నిలా నీవు కూడ మరణించి వుండేవాడివి. అప్పుడు నీ జన్మ తరించేది.''

నందుని మాటల ద్వారా యశోదకు, కృష్ణుడు బృందావనానికి తిరిగి రాడనే విషయం అర్థమయింది. కృష్ణునిపట్ల గల ప్రేమను చంపుకోలేక ఆమె, దేవకీదేవికి సందేశాన్ని పంపింది.

సందేసౌ దేవకీ సౌ కహియౌ।
హౌతౌ ధాయ తిహారే సుతకీ,
మయా కరత హీ రహియౌ॥

''దేవకీ దేవీ! నేను నీపుత్రుని పెంచిన దాదిని. నీవు అతని కన్నతల్లివి. అతనికే మేమి కావాలో, అతని అవసరాలేమిటో నీకు తెలిసి వుండవచ్చు. అయినా ప్రేమకు వివశురాలినై, కొన్ని విష యాలను చెపుతున్నాను. కన్నయ్యకు నిద్ర లేవగానే వెన్నతో చేసిన రొట్టెలను పెడితే చాలా యిష్టంగా తింటాడు. పెరుగు, వెన్న, మీగడలంటే చాలా ప్రీతి. నల్లనయ్య అన్ని విషయాలలో బుద్ధిమంతుడే. కానీ స్నానం దగ్గరకొచ్చేసరికి పేచీ పెట్టి పారిపోయేవాడు. మంచి మాటలు చెప్పి, బ్రతిమిలాడి అతనికి స్నానం చేయించేదాన్ని. మాధవుడు చాలా మొహమాటస్తుడు. అతని మనసెరిగి ప్రవర్తించాలి. నీవు అతనికి కావలసినవి సమకూరుస్తావని భావిస్తున్నాను. నేను పంపిన ఈ సందేశాన్ని తప్పుగా భావించవద్దని ప్రార్థిస్తున్నాను.''

యశోద పంపిన ఈ సందేశంలో ఎంతటి కరుణ దాగివున్నది! కరుడు కట్టిన హృదయా లను సైతం కరగించే ఆమె వేదనను వర్ణించటం సాధ్యం కానిది.

[పై పంచికలో గోపికా విరహం]

మొసలి పట్టుకుని లాగుతున్నది. 'అమ్మా! అమ్మా!' అంటు ఓ ఏనిమిదేండ్ల బాలుడు గట్టు మీదున్న తల్లిని పిలుస్తున్నాడు. తల్లి తల్లడిల్లిపోతోంది. ఒక్కగా నొక్క కొడుకు, తండ్రిని చిన్ననాడే కోల్పోయిన ముద్దుబిడ్డడు, ప్రాణాపాయంలో చిక్కుకున్నాడు. గుండెలు పగిలిపోతున్నాయి. 'నాయనా' అంటూ నది లోకి పోబోయింది. "అమ్మా, లాభం లేదమ్మా! ఆపత్సన్యాసం గ్రహించటాని కిప్పటికైనా అనుమతివ్వమ్మా" అంటూ ఆ చిన్నారి కొడుకు బ్రతిమిలాడుతున్నాడు. తల్లికి వొప్పుకోక తప్పలేదు "అలాగే" అంది. ఆ బాలుడు 'మానసికసన్యాసాన్ని' స్వీకరించాడు. అంతే, మొసలి పట్టు విడిపోయింది. బాలుడు బ్రతికి బయటికి వచ్చాడు. తల్లి ఆనందంతో కొడుకును హృదయానికి హత్తుకుంది.

లోకహితం కోసం ఎంత త్యాగానికి సిద్ధపడ్డాడా బాలుడు! అత్యంత గాఢమైన మాతృప్రేమను సైతం, అఖిల విశ్వశ్రేయస్సు కోసం త్యజించక తప్పింది కాదు. మహా పురుషుల కార్యకలాపాలన్నీ ఈ విశిష్టతను కల్గియుంటాయి. వారికి తమ శ్రేయస్సు గూర్చిన తలంపే యుండదు. వారు తమ కోసం కాక, పదిమంది హితం కోసం నిరంతర కార్యతత్పరులై యుంటారు. ఏ మహనీయుని జీవిత చరిత్ర చూసినా ఈ సత్యం గోచరిస్తుంది. ఏవ్యక్తి జీవితమైనా, ఏమహాత్ముని జీవితమైనా ఈ దశ నుండే, ఈ స్వార్థత్యాగమనే దశనుండే వికసించినట్లు కనబడుతుంది. వివేకానందుని చూడండి. నరేంద్రుడుగా ఉన్నంతవరకు అతనొక మామూలు యూనివర్సిటీ స్టూడెంటు. ఆ దశలో అతనికి తన గూర్చిన, తన చదువు, తన భావి గూర్చిన ఆలోచనవలే ఉండేవి. కాని వివేకానందుడుగా మారిన దశనుండి అతని జీవితంలో త్యాగం, వైరాగ్యం, విశ్వశ్రేయస్సు చోటుచేసుకొన్నాయి. తన చదువు, తన భవిష్యత్తు, తన పరివార క్షేమమంతా తన దేశపు, ప్రపంచపు జనుల హితం కోసం త్యజించబడ్డాయి. బుద్ధుని చరిత్ర అంతే. బుద్ధుడు కాకముందతడొక అందరిలాంటి లౌకిక విషయభోగజీవితముండాస క్తుడైన సిద్ధార్థుడే! ఆ జీవితాన్ని త్యజించి, సర్వమానవజీవకోటి దుఃఖోపశమనానికి తన్ను తాను త్యజించు కొనగానే అతను బుద్ధుడయ్యాడు. గాంధీ, మహాత్ముడుగా కాకపూర్వం మోహన్ దాస్ కరమ్‌చంద్ గాంధీ, ది బారిష్టర్ మాత్రమే! అలాంటి బారిష్టర్లెంతమందో! కాని అందరూ మహాత్ములయ్యారా? గాంధీ తన జీవితాన్ని తనకోసం కాక, దేశంకోసం త్యజించి కార్యరతుడయిననాటినుండే అతను మహాత్ముడయ్యాడు. అల్లూరి సీతారామరాజు, నేతాజీ సుభాష్ చంద్రబోస్, బాలగంగాధరతిలక్, గోఖలే, రేనడే, పటేల్, సరోజినీ, టంగుటూరు, అంబేద్కర్, నెహ్రూ ఇలా ఎంతో మంది మన ముందున్నారు. పురాణపురుషులైన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, పాండవులు వీరి జీవితాలూ స్వార్థత్యాగము, బహుజనహిత కామ్యములై యున్నాయి. భక్తులుగా కీర్తికెక్కిన వారి జీవితాలు పరిశీలించినా మన కిదే సత్యం గోచరిస్తుంది. త్యాగయ్య, అన్నమయ్య, క్షేత్రయ్య, పురందరదాసు, సూరదాసు, కబీరు, నానక్, నామదేవ్, జ్ఞానదేవ్ ఈ మహనీయుల జీవితాలన్నీ ఈ సత్యాన్నే చాటి చెబుతున్నాయి. వీరంతా మామూలు మనుషులే. లోకం కోసం కార్యరతులు కాక పూర్వం వీరంతా మనలాంటివారే! పండితులు, కవులు, విద్వాంసులు, గృహస్థులు, సామాన్యులు, ఇలా మనలో నున్నవారే!

అయినా మనలో నుండేవారికే మన మధ్య ఇంత విశిష్టత ఎలా చేకూరింది? అదే తమ కోసం కాక, లోకహితం కోసం తమను తాము సంపూర్ణంగా అర్పించుకోవటమే! ఇలా చేసిననాడు, మనమూ అంతటివారము కాగలము. అందులో సందేహం లేదు. అది ఫలాని రంగమే కావాలన్న నియమమేమీ లేదు. ఏ రంగంలోనైనా అది సాధ్యమే! ఐన్‌స్టీన్, న్యూటన్ వీరు శాస్త్రజ్ఞులు. జగదీశ్ చంద్ర బోస్, సి. వి. రామన్ వీరూ శాస్త్రజ్ఞులే. మరి వీరికింత గుర్తింపు ఎలా వచ్చిందో? ఆలోచించండి.

మహాపురుషుల కార్యకలాపాలకు, మన క్రియాకల్లాపాలకు భేదం ఏమిటో గమనించి చూడండి. వారికి తమ శ్రేయస్సుకన్నా, లోకశ్రేయస్సే ముఖ్యం. మాతృప్రేమను సైతం అంత చిన్నవయసులోనే త్యజించి సన్యసించిన ఆ బాలుని ధ్యేయం కూడ లోకహితమే. ఆ బాలుడెవరో కాదు, వేదాంత ప్రతిపాదితమైన అద్వైతసిద్ధాంతాన్ని పునఃస్థాపించి, సుస్థిర పరచిన జగద్గురువు ఆదిశంకరాచార్యులవారు. శంకరాచార్యుల కాలం నాటికి వేదాంత తత్త్వాలు మరుగున పడి, అనేక మతవిషయక వికృతాలు తలెత్తియున్నాయి. ఒకవంక అనేక శాఖలుగా చీలిన బౌద్ధమతం వైదికధర్మాన్ని అణగద్రొక్కటానికి ప్రయత్నిస్తుంటే, మరో వంక వేదమందలి కర్మకాండ ప్రబలి అనేక దేవతారాధనలు, యాజ్ఞికక్రియాకలాపాలు చెలరేగాయి. జనులకు కామ్యదేవతారాధన తప్ప మరో ధ్యేయం లేకుండా పోయింది. ఇహలోకసుఖాలు, దైహికసుఖాలు, భోగాభిలాషలు హెచ్చుపెరిగి, మనిషియొక్క ఆత్మవికాసం ఆగిపోయింది. పూర్వమీమాంసకులకు వేదాంతం గిట్టేది కాదు. అద్వైతప్రతిపాదనమంటే మండిపడేవారు. ఇలా దేశంలో ఫలాభిలాష, కర్మకాండ, వేదాంత వ్యతిరేకత విజృంభించి, వేదాంతసత్యాలు, సనాతన ధర్మలక్ష్యము లుప్తమైపోయే దశ ఏర్పడింది. నాటికి కనీసం 72 మతసంప్రదాయాలైనా ఏర్పడి పరస్పరం కలహించుకొంటుండేవి. మీమాంసకులు, బౌద్ధులు నాస్తికత్వాన్ని ప్రచారం చేయటంలో ప్రముఖ పాత్ర వహించారు. శాక్తేయులు, గాణపతేయులు, కాపాలికులు, ఇలా అనేక చిల్లర మల్లర సంప్రదాయాలేర్పడి లోకుల కొక సన్మార్గమంటూ లేకుండా పోయింది. భారతీయ జీవనంలో క్రమత్వం తప్పింది. అనేక కోణాల్లో దాన్ని సంస్కరించ వలసిన అవసరం ఏర్పడింది. అనేకత్వంలో ఏకత్వ నిర్ణయం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అలాంటి క్లిష్టమైన దశలో అత్యంత సంక్లిష్టమైన స్థితిని చక్కబరచటానికి అపర శంకరు అవతారంగా శంకరులవారు కేరళ రాష్ట్రంలో 'కాలడి' గ్రామమందు సుమారు 1200 సంవత్సరాల క్రితం శివగురు, ఆర్యాంబ అనే సనాతన నంబూద్రి బ్రాహ్మణ దంపతుల కుదయించాడు. గురుకులంలో తర్క, సాంఖ్య, పాతంజల, మీమాంస వ్యాకరణాది శాస్త్రాల్లో పారంగతుడయ్యాడు. ఎనిమిదేండ్ల నాటికే చతుర్వేదాల్లో నిష్ణాతుడయ్యాడు. 16వ ఏటికే ప్రస్థానత్రయానికి భాష్యాలు రచించాడు. 32 ఏండ్లు ఈ లోకంలో ఉండి, ఆ పిమ్మట అదృశ్యుడయ్యాడు.

8వ ఏట తల్లి దగ్గర అలా సన్యాసం స్వీకరించి, ఉత్తర దిశకు బయలుదేరి గురువులైన గోవిందభగవత్పాదులను మెప్పించి, వారి శిష్యరికం స్వీకరించాడు. వారి ఆజ్ఞమేరకు వేదవ్యాసుల అనుగ్రహంతో అద్వైత సిద్ధాంత పరంగ బ్రహ్మసూత్రానికి, పది ఉపనిషత్తులకు,

భగవద్గీతకు అత్యంత విశిష్టమైన భాష్యాలు రచించాడు. శంకరుని భాష్యాలే లేకపోతే, నేడీ గ్రంథాల్లోని సత్యాలు వెల్లడి కావటం జరిగేది కాదేమో! శంకరులవారు కనీసం మూడు పర్యాయాలైనా ఆ మూలనుండి ఈ మూల వరకు భారతదేశమంతా పర్యటించి, అనేక మూఢ సంప్రదాయాలను ఖండించి అద్వైత మతాన్ని స్థాపించాడు. అనేకచోట్ల దేవాలయాల్లో శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించి, దేవతా మూర్తులను క్రౌర్యం నుండి సౌమ్యభావంలోకి మార్చాడు. పశుబలిని, వ్యయప్రయాసలకు నిలయమైన యాజ్ఞిక కర్మకాండను అరికట్టాడు. జ్ఞానమార్గాన్ని, మానసిక ఔన్నత్యానికి కారణమైన "ఏకం సత్" అనే పరమసత్యాన్ని చాటి చెప్పాడు. అద్వైతము, అదొక ప్రత్యేక సిద్ధాంతం కాదు. అందులో అన్నిమార్గాలకూ స్థానముంది. దేహాధ్యాస ఉన్నవారికి ద్వైతం ద్వారానే అద్వైతము సాధ్యం. జీవాత్మధ్యాస ఉన్నవారికి విశిష్టాద్వైతంద్వారానే అద్వైతం సాధ్యం. కేవల బ్రహ్మాధ్యాస, అదే అద్వైతం. సర్వం వాసుదేవమయం అన్నది అన్నింటి లక్ష్యం. దీనికి భక్తిమార్గం సులభమార్గమని గ్రహించిన జగద్గురువుల వారు అనేక స్తోత్రాలు, స్తుతులు రచించి తద్వార అనేకత్వంలో ఏకత్వాన్ని నిరూపించారు. భజగోవిందం, మనీషాపంచకం, కనకధారాస్తోత్రం ఇలా ఎన్నెన్నో స్తోత్రాలున్నాయి. ముప్పయిరెండు జన్మల్లో కూడ సాధ్యంకాని మహత్తర కార్యాన్ని కేవలం ముప్పదిరెండేండ్లలోనే ముగించిన శంకరుడు, నిజంగా భూపకేశుడైన పరమేశుడే! దేశమంతా అద్వైతమతాన్ని స్థాపించి, నలువైపుల అద్వైతమత ప్రచార నిమిత్తం పీఠాలు, మఠాలు మున్నగునవెన్నో నెలకొల్పాడు. శంకరుడు నిర్వహించిన కార్యం అనితరసాధ్యం. అంతటివాడు న భూతో న భవిష్యతి!

ఈ వ్యాసంలో జగద్గురువుల వారి అద్భుత కార్యాలు కొన్ని పేర్కొని, వాటినుండి మన సమాజం గ్రహించవలసిన సందేశాన్ని గూర్చి కాస్త ఆలోచిద్దాము. వారి సందేశాన్ని కించిత్తయినా అమల్లో పెడితే అదృశ్యరూపంలో నున్న ఆచార్యులవారెంతో ఆనందిత హృదయులై మనకు ఇతోధిక సహకారాన్ని, శక్తిని, జ్ఞానాన్ని, తేజస్సును అందిస్తారు.

శంకరాచార్యుడు చూపిన అద్భుతాలు స్వార్థప్రయోజనం గలవి కావు ఇతరులను వంచన చేసి తన పబ్బం గడుపుకునే మేజిక్కులూ కావు. లోకుల కన్నులు తెరిపించేందుకు, లోకహితం కోసం మాత్రమే అవి ప్రదర్శింపబడ్డాయి. ప్రారంభంలో తెలిపిన ఘటనకూడ ఒక అద్భుత క్రియయే. తాను నిర్వహించవలసిన కార్యానికి మాతృమూర్తిని త్యాగం చేయవలసివచ్చింది. ఒక్క తల్లికోసం ఆగిపోతే, దేశానికి చేయవలసిన సేవ ఆగిపోతుంది. దేశసేవ కోసం, తోటి మనుషుల విపత్తులను తప్పించే నిమిత్తం మనిషి ఎంత త్యాగానికైనా సిద్ధపడాలని, అంత చిన్నవయసులోనే శంకరులవారు స్పష్టపరిచారు.

1. దారిద్ర్య నిర్మూలనము :-

సమాజంలో ధనిక-పేదవర్గాలు అనాదిగా ఉంటున్నాయి. దీనికి వారి వారి పూర్వజన్మకృత కర్మలే కారణమనటంలో ఎంత నిజముందోగాని, సమాజంలోని మనుషులే దీనికి కారణమన్నది స్పష్టంగా కనబడుతున్నది. మనిషిలో ఆశ-దురాశ ఎంతో పెరిగిపోయింది. ఏ దారిననైనా సరే, మరో మనిషికన్నా మించి

ఐశ్వర్యాన్ని, సంపత్తును, ఆస్తులను, వస్తు వాహన గృహాదులను సంపాదించి సంగ్రహించు కోవాలన్న అల్పాతిఅల్ప ఆశయంలో మానవుడు పడిపోయాడు. కంటికి కనబడ్డ అందమైన కాంత తనది కావాలి. కన్ను, చెవ్వు, ముక్కు మెచ్చిన పదార్థాలన్నీ తనవి కావాలి. అవి మరొకరికి ససేమిరా దక్కకూడదు. తనకవి లేకున్నాసరే, మరొకరవి అనుభవించకూడదు. తనకవసరము లేకున్నా, సంగ్రహం చేసి దాచుకొంటున్నాడు. ధనం - ధాన్యం - భోగం - గృహాలు ఒకచేతిలో, వందమందికి కావలసిన పదార్థాలన్నీ దోచుకుని సంగ్రహించి మరీ దాచుకుంటున్నాడు. స్వార్థం తప్ప ఒకరికింత సహాయం చేద్దామన్న సంకల్పం లేకపోవటం లేదు. దీనివల్ల మనిషికి అత్యవసరమైన తిండీ-బట్ట-ఆశ్రయము కూడ కరువై పోతున్నాయి. లేక కాదు. ఉండే, అవి దక్కటం లేదు. అవసరానికి మించి కూడబెట్టి, అవసరంలో నున్న మనిషికి వాటిని దక్కకుండా చేస్తున్నాడు. పేదరికానికి మనిషిలోనున్న ఈ తృష్ణే, ఈ సంగ్రహమనే నీచబుద్ధే అధికంగా కారణ మవుతున్నది. పేదతనం నిర్మూలింపబడాలంటే, మనిషిలోని ఈ సంకుచిత, స్వార్థ, నీచ సంగ్రహాత్మక బుద్ధి నశించాలి. తనకున్న దాంట్లో అవసరమున్న వారికి ఎంతో కొంత తప్పకుండా త్యజించాలి. ఈ త్యాగబుద్ధి ఏర్పడాలి. పేదరికానికి కారణం మనిషే, ఆ పేదరికాన్ని నిర్మూలించగల్గే శక్తి కూడ మనిషికే ఉంది. దీన్ని శంకరులవారు ఒకానొక సంఘటన ద్వార తెలియజేస్తున్నారు.

గురుకులంలో ఉంటున్న రోజుల్లో బ్రహ్మచారి శంకరులు భిక్షకోసం ఒక యింటికి వెళ్లాడు. కాని, పాపం ఆ గృహస్థులవద్ద భిక్ష వేయటానికి ఏమీ లేకపోయింది. ఆ ఇంటి ఇల్లాలు వెదికి వెదికి ఒక ఉసిరికాయను తెచ్చి, శంకరునికిచ్చి 'ఈ మాత్రం ఆహారంతో తృప్తిపడమని' కోరింది. వారి పేదరికానికి శంకరుడు కరిగి పోయాడు. అక్కడే అప్పుడే 'కనకధారా స్తోత్రం' ద్వార లక్ష్మీదేవిని స్తుతించి, దాన గుణశీలురు త్యాగధనులు, అయిన వారి యింటిని బంగారు ఉసిరి కాయలతో నింపే శాడు.

ఇది శంకరునికి వీలయిన మార్గం. ఏ మార్గంలో భిక్షమిచ్చాడన్నది కాదు, పేదవారి పైన ఎంతి కరుణాహృదయం అతనికేర్పడిందో అన్నది గమనించాలి. తనవద్ద అధిక ధనం ఉంటే, లేనివారిని ఆదుకోవటమే ఆ మనిషి యొక్క కర్తవ్యమని మన సమాజానికి శంకరు డందిస్తున్న సందేశం.

౭. లోక సంరక్షణ :-

తనకు శక్తి యున్నంతవరకు, తన శక్తి యుక్తుల నన్నింటిని ఉపయోగించి ఆపదలో నున్న తోటి జీవుల్ని సంరక్షించటము ప్రతి మనిషి కర్తవ్యం. ఆపత్ సమయంలో సహాయం చేయటమటుంచి, దోచుకునే మనస్తత్వం గల నేటి మనిషి గుర్తించవలసిన పరమ సత్యమిది. యుద్ధ సమయంలో వ్యాపారస్థులు, ఆర్థిక సంక్షోభ సమయంలో పారిశ్రామికవేత్తలు ఈ విషయాన్ని గుర్తించి, తోటి మనిషికి అలాంటి సమయంలోనే సహాయ సహకారా లందించాలన్న సత్యాన్ని గ్రహించాలి. వరద వొచ్చినప్పుడు, అగ్ని ప్రమాదాలు సంభవించి నప్పుడు, అదే మంచి అవకాశము మించిన దొరకదన్నట్లుగాక, సాధ్యమైనంత చేయూత నివ్వాలి. ధన రూపేణ, వస్తురూపేణ, మరే విధంగానైనా సహాయం అందించాలి. అదే మనిషి అన్వించుకొనే అవకాశం మరి! ఈ

విషయం శంకరుని ఒకానొక సంఘటన ద్వార మనం తెలుసుకోవచ్చు.

శ్రీ గోవింద భగవత్పాదుల ఆశ్రమంలో ఉంటుండగా ఒకనాడు నర్మదానది పొంగి పరిసర ప్రాంతాలను, నివాస స్థానాలను ముంచటానికి సిద్ధమయింది. ఆ దైవీకృత ఆపత్తును ఎలా తప్పించాలో ఎవరికీ తెలియలేదు. కరుణాహృదయులైన శంకరులవారు వెంటనే 'జలాకర్షణ మంత్రం' ద్వార ఆ నర్మదాజలాన్ని తన కమండలంలోకి ఇమిడ్చివేశాడు. ఎంత అద్భుతమైన చర్య! అయినా, ఎంత ఉన్నతమైన ఉద్దేశము! సకల జీవాళి ప్రాణ, మాన, ధనాదులను కాపాడాడు కదా! లోకుల హితం కోసమే తన సర్వశక్తులు, తన సర్వ సంపత్తులు మానవుడు ఉపయోగించ గల్గినప్పుడే ధన్యుడౌతాడని శంకరుని పరమ సందేశమిందులో వ్యక్తమవుతున్నది.

### 3. చండాల దర్శనం : అస్పృశ్యతా భావం అర్థ రహితం :-

వారణాశిలో ఉండగా, శిష్యులతో కలిసి గంగవైపు వెళుతున్న శంకరునికి దారిలో నాలుగు కుక్కలతోనున్న చండాలుడొకడు అడ్డు వచ్చాడు. శంకరుడు అతణ్ని దూరంగా తప్పుకోమన్నాడు. 'ఎవరు తప్పుకోవాలి' అని ఆ చండాలుడు తర్కించాడు. 'మనీషాపంచకం' ఈ వృత్తాంతాన్నే తెలియజేస్తుంది. శిష్యుల కోసం, లోకుల కోసం శంకరుడు కల్పించిన ద్విపాత్రాభినయన పూర్వక నాటకమే యిది. చండాలరూపం, సన్యాసిరూపం రెండూ పరమేశ్వరుడే! తోటి మనిషిని పట్టుకొని చండాలుడని అంటరానివాడని; మీరు బ్రాహ్మణులని, పవిత్రులని నిర్ణయించటం వొట్టి మూఢత్వం తప్ప మరేమీ లేదు. శరీర రీత్యా, అందరి శరీరాలు రక్తమాంసమయాలే. ఆత్మరీత్యా అంతటా ఉన్నది కేవల చైతన్యమొక్కటే. ఇక భేదమెక్కడుంది? అంతగా భేదమే పాటించవలసి వస్తే, మనిషి మనిషికి తేడా చూపవలసి వస్తుంది. తండ్రి ముక్కు చెవుల్లా కుమారునికుండవు. తల్లి ముక్కు కన్నుల్లా భార్యకుండవు. గురువు కాళ్లూ చేతుల్లా శిష్యునికి ఉండవు. ఏ విధంగా చూసినా ఈ అంటరానితనం అర్థంలేనిది. కర్మలబట్టి అంటారా? అగ్రకులమని భావించే బ్రాహ్మణులలోనే ఒక మనిషి గుణకర్మలు మరో మనిషికుండవు. మరి అక్కడ తేడా ఎందుకు పాటించకూడదు? ఏ ఒక జాతి గొప్పదీకాదూ, ఏ ఒక జాతి నీచమూకాదు. పైగా బ్రాహ్మణజాతి కర్తవ్యము, తమంత వారినిగా మిగతావారినందర్నీ మార్చటం. అందుకే శంకరులవారు చండాల రూపంలో పరమేశ్వరుణ్ని సాక్షాత్కరింపజేశారు. కుక్కల రూపంలో వేదాలను దర్శింపజేశారు. దిగువ మెట్టులో నున్నవారు పరమేశ్వరునంతటి జ్ఞానులుగా మారటానికి, మొరిగే కుక్కలు సైతం పరమ సత్యవాక్కులుచ్చరించటానికి సహాయపడటం సర్వమూ నెరిగిన వారి కర్తవ్యం. అంతేగాని వారిని తృణీకరించటం, ఛీసరి కొట్టటం, చీదరించుకోటం కాదు. అవకాశం కల్పించాలేగానీ, హరిజనులు అంబేద్కరులు ఎందుక్కాలేరూ? చండాలుడు పరమేశ్వరుడెందుక్కాలేడూ? ఈ శంకరుని సందేశాన్ని లోకులు వివేకంతో గ్రహింతురుగాక!

### 4. సరసవాణిని తన అనుయాయిగా స్వీకరించుట : స్త్రీ స్వేచ్ఛ :

జ్ఞాన సంపాదన విషయంలో 'స్త్రీ-పురుష' భేదం లేదు. అయితే వ్యవహారానికి, జ్ఞానానికి ముడిపెట్టరాదు. వ్యవహారం వ్యవహారమే

జ్ఞానం జ్ఞానమే. వ్యవహారంలో ఎవరి పనులు వారు చేసుకోవాలి. ధర్మవ్యాధుడు మాంసం అమ్మేవాడు. జనకుడు రాజ్యపాలన చేసేవాడు. వారిద్దరూ పరమజ్ఞానులు. జ్ఞానంలో అందరికీ సమానాధికారాలున్నాయి. ఎవరెంత జ్ఞానం గ్రహించగలరో అంతా గ్రహించవచ్చు కాని జ్ఞానాన్ని, వ్యవహారానికి అడ్డురానివ్వరాదు. స్త్రీపురుషులు, భార్యాభర్తలు ఎవరైనా సరే జ్ఞానం సమానంగా గ్రహించవచ్చు, కాని వ్యావహారిక జీవితంలో, శారీరకరీత్యా జరుపవలసిన క్రియల్లో స్త్రీ తన పాత్రను, పురుషుడు తన పాత్రను సక్రమంగా నిర్వహించుకోవాలి. భర్తపనిని భార్య, భార్యపనిని భర్త, స్త్రీ పనిని పురుషుడు, పురుషుని పనిని స్త్రీ, సన్యాసి పనిని గృహస్థు, గృహస్థుపనిని సన్యాసి నిర్వహిస్తే, ఆ సమాజం కలగాపులగమై పోతుంది. నేటి మన సమాజస్థితి కూడ అలాగే తయారయింది. ఎవరు ఏ పనులు చేయాలో తెలియక, అన్నిపనులు అందరూ చేయటానికి పోటీలు పడుతూ, ఎవరూ ఏపనినీ సక్రమంగా చేయక సమాజ అభివృద్ధిని కుంటుపరుస్తున్నారు.

మండనమిశ్రునితో శంకరుడు వాదనకు పూనుకున్నాడు. అతని ధర్మచారిణి సరసవాణి (శారద, భారతి, సరస్వతి అని కూడ అంటుంటారు) వారికి న్యాయనిర్ణేత. ఆమె గృహకృత్యాలు నిర్వహిస్తూనే, భర్త కర్మకలాపాలకు సహాయకారిణిగా ఉంటున్నది. వేదాది శాస్త్రాల్లో భర్త ఎంతజ్ఞానియో, ఆమె కూడ అంతటి జ్ఞానవంతురాలే. అయినా తమ తమ వ్యావహార కృత్యాల్లో దాన్ని అడ్డురానివ్వలేదు. ఆమెను న్యాయనిర్ణేతగా శంకరుడొప్పుకోవటంలోనే, ఆమె ఎంత జ్ఞానవంతురాలో మనం ఊహించవచ్చు. అంటే ఆరోజుల్లో స్త్రీ విద్యకు, జ్ఞానార్జనకు ఎట్టి అడ్డంకి లేదని, పైగా అట్టి స్త్రీకి ఆదరణ, పూజ్యత కూడ కుటుంబంలో, సంఘంలో కూడ ఉండేదని తెలుస్తుంది కదా! అది నేడు కూడ సంపూర్ణంగా కనబడ్డం లేదు. నేడు స్త్రీ ఎంత విద్యావంతురాలైనా, పురుషుడామెను దిగువ స్థాయిలో నుంచాలనే చూస్తున్నాడు. తానెంత విద్యాధికురాలైనా స్త్రీ, భర్తకు యితరులకు ఇవ్వవలసిన ఆదరణను, గౌరవాన్ని, చూపవలసిన వినయాన్ని, సద్గుణాన్ని, తన విద్యామదంలో మరిచిపోతున్నది. సరసవాణి ఎంత జ్ఞానియో, అంత వినయం గలది. వినయం బానిసత్వం కాదు. తన్ను తాను నియమించుకోటం. పురుషునికి, స్త్రీ విద్యయందు ఆదరణ భావం లేదు. విద్యావంతురాలైన స్త్రీకి శ్రమయందు, శారీరక క్రియలందు శ్రద్ధ లేదు. తాను విద్యావంతురాలు కాబట్టి దేహాన్ని శ్రమపెట్టే గృహకృత్యాలు చేయటం సిగ్గుచేటని భ్రమిస్తున్నది. ఇంటిపనులు చేసుకోటం పల్లీయుల, నిరక్షరాస్యుల, అనాగరికుల లక్షణమని; నాగరికుల, చదవనేర్చినవారి లక్షణం కాదని భ్రాంతిపడుతున్నది. అహా! నేటి చదువు, శ్రమలోని ఔన్నత్యాన్ని గుర్తించటం పోయి, మనిషిని మానసికంగ ఎదగటానికి తోడ్పడటం పోయి, ఎంత దిగువకు దిగజారుస్తున్నది! చదువు, శ్రమను మరింత నైపుణ్యంగా, నిశితంగా, రమణీయంగ చేయటానికే గాని, దాన్ని తిరస్కరించటానికి కాదన్న సత్యం సరసవాణి ద్వార మనం గ్రహించవలసి యుంది. సరసవాణి న్యాయనిర్ణేతగా అయినప్పటికీ, తన బాధ్యతను మరిచిపోలేదు. గృహకృత్యాలు మామూలుగా నిర్వహిస్తూనే ఉంది. మండనమిశ్రుడు భార్య నిర్ణేతగా అయితే సంతోషించాడు, పైగా ఆమె తనను ఓడినట్లు నిర్ణయిం

చగా, దానికి కట్టుబడ్డాడు నూర్జారా! ఎంతటి ఉన్నత భావాలో వారివి. విద్యావంతుల లక్షణాలు ఇలాగే ఉండాలి. కుటుంబ ఘర్షణాలు, అనైక్యము చదువుకారణంగా, విద్యావంతుల కాపురంలో సంభవించరాదు. భర్తలు మండనమిశ్రుని ఉన్నతి భావాలతో, భార్యలు సరసవాణి ఉదాత్త, నిగర్వత్వాల యాన్ని కల్గియుండాలి. [illegible] స్త్రీ శంకరుల జీవిత ఘట్టాలు తెలియజేస్తున్నాయి. పురుషునికి మాత్రమే వేదాంతం దత్తమై యుండలేదు; వేదాంత ప్రచారం ఒక పురుషుని బాధ్యత [illegible]; సన్యాసం ఒక్క పురుషునికే నని కాదు; వీటన్నింటిలో స్త్రీకి కూడ గౌరవనీయమైన స్థానమున్నది. అది చెప్పటానికే సరసవాణిని, తన అనుయాయిగా శంకరుడు స్వీకరించాడు. శంకరాచార్యులు ఉన్నతుడో కదా!

ఇలా శంకరుల జీవితం నుంచి కావలసిన మార్గాలెన్నో గ్రహించగల్గటానికి ఎన్నెన్నో ఉన్నవి వాటి గ్రహించి మన సమాజాన్ని బాగుపరచుకుందాము గాక!

వివేక విద్యుత్తరంగాలు —౮

## నైతికత: దాని సాపేక్ష స్వభావం

ఒకే నైతిక నియమావళి అందరికీ బోధింప బడజాలదు. అన్ని మత శాఖలూ మానవులంతా సమానమని అంగీకరించాయి. విజ్ఞానశాస్త్రం దీన్ని సమర్థించ లేదు. మనిషి మనిషికీ శరీరాలలో కంటె మనసులలో ఎక్కువ వ్యత్యాసం ఉన్నది...

ప్రతి దేశంలో, ప్రతికాలంలో, ప్రతివ్యక్తి ప్రత్యేక పరిస్థితులకు లోబడి జీవిస్తాడు. పరిస్థితులు మారినట్లైతే, ఆలోచనలు కూడా మారాలి. మాంసాహారము ఒకప్పుడు భోజనము. అప్పుడు ఆహారధాన్యాలు అంతగా తెలియదు. వాతావరణం అతి శీతలంగా ఉండేది. అందుబాటులోని ఆహారం మాంసం. అందుచేత ఆ సమయంలో, ఆ ప్రదేశంలో ఒక విధంగా మాంసాహారం తప్పనిసరి అయింది. ప్రస్తుతం మాంసాహారం అనైతికం.

మానవ సమాజం వర్గీకృత వ్యవస్థ. నైతికతను గురించి, విధి నిర్వహణ గురించి మన కందరికీ తెలుసు. అయితే వివిధ దేశాలలో నైతికత ప్రాధాన్యం బహు విధాలుగా ఉంటుంది. ఒక దేశంలో నైతికంగా గౌరవింపబడేది మరొక దేశంలో పరమ అనైతికంగా పరిగణింపబడవచ్చు. ఉదాహరణకు ఒక దేశంలో తోబుట్టువుల సంతానంలో పెండ్లిండ్లు జరుగవచ్చు; మరొక దేశంలో అది మిక్కిలి అనైతికంగా భావిస్తారు. ఒక దేశంలో మరదలును వివాహమాడవచ్చు; ఇంకొక దేశంలో అది అనైతికం. ఒక దేశంలో ఒక్కసారి మాత్రమే పెండ్లి; వేరొక దేశంలో పెక్కుమార్లు అయినా పరవాలేదు. ఇలా ఎన్నో ఇదే విధంగా నైతికతకు సంబంధించిన వివిధ విషయాలలో ప్రమాణం బాగా మారుతుండు. అయినప్పటి! మనం నైతికతకు విశ్వజనీనమైన ప్రమాణం ఉండాలని భావిస్తాము.

విధి నిర్వహణ విషయం కూడా అంతే. వివిధ జాతులలో స్వధర్మ భావనలో చాల వ్యత్యాసం ఉంటుంది. ఒక దేశంలో వ్యక్తి కొన్ని ధర్మాలు నిర్వర్తించకపోతే ప్రజలు అతడిని 'అపమార్గం పట్టాడు' అంటారు. అదే ఇంకొక దేశంలో వ్యక్తి అవే ధర్మాలన

నిర్వర్తించినా ప్రజలు, అతడు సక్రమంగా వ్యవహరించ లేదంటారు. అయినా మనం విధి నిర్వహణపట్ల విశ్వజనీనమైన భావన ఉండాలని అనుకొంటాము. అదే విధంగా సమాజంలోని ఒక తెగ కొన్ని కార్యాలు తమ విధి నిర్వహణలో భాగమని భావిస్తుంది. కాని, మరొక తెగ అందుకు విరుద్ధంగా భావిస్తుంది, అవే కర్మలు ఆచరించడానికి నిరాకరిస్తుంది.

మనకు రెండు మార్గాలున్నాయి: మొదటిది సత్యానికి ఒక్కటే మార్గము, తక్కినవన్నీ అపమార్గాలు అనే అజ్ఞాని భావన. మన మానసిక పరిపక్వస్థితి లేదా మనం జీవించే వివిధ స్థాయిలను బట్టి ధర్మము, నైతికత మారుతుంటాయని అంగీకరించే వివేక మార్గం రెండవది. ముఖ్యంగా గమనించవలసిందేమిటంటే ధర్మానికీ నైతికతకు అంతరాలతో కూడిన వరుసక్రమం ఉన్నది. కొన్ని పరిస్థితులలో ఒకానొక జీవదశలో ధర్మమైనది, మరొక సందర్భంలో జీవదశలో ధర్మం కాబోదు, కాలేదు.

ప్రతివ్యక్తి తనదైన ఆశయ సాధనకు పాటుపడాలి. ఎన్నిటికీ సాధించలేని యితరుల ఆశయాలను స్వీకరించేవానికంటె యిది అభ్యుదయానికి అసలైన మార్గము. ఒక శిశువును ఒక్కసారిగా 20 మైళ్ళు నడవమన్నామా ఆ పసిబిడ్డ అసువులు బాస్తుంది లేదా వేయిమంది శిశువులలో ఒక శిశువు అలసి, సొలసి కొన ఊపిరితో చివరిదాకా ప్రాకుతుంది. ప్రపంచంలో మన ధోరణి కూడా అలానే ఉంటుంది. ఏ సమాజంలోనూ స్త్రీ పురుషులందరిలో కార్యనిర్వహణాశక్తి, సామర్థ్యము, భావన ఒకే విధంగా ఉండవు. వారికి విభిన్న ఆదర్శాలుండాలి. ఏ ఆదర్శాన్ని నిరసించే హక్కు లేదు. ప్రతిఒక్కరు స్వీయ ఆశయ సిద్ధి కోసం శాయశక్తులా కృషిచేయుదురు గాక! మీ ప్రమాణంతో నన్ను, నా ప్రమాణంతో మిమ్ములను పరీక్షించటం యుక్తం కాదు కదా. యాపిల్ చెట్టును సింధూరపు వృక్ష ప్రమాణంతో పరీక్షించకూడదు. అలాగే సింధూరపు చెట్టు విషయంలో సీమరేగి చెట్టు ప్రమాణాన్ని కొలబద్దగా పరిగణింపకూడదు. సీమరేగి చెట్టును పరీక్షించేటప్పుడు సీమరేగి వృక్ష ప్రమాణాన్ని. అలాగే సిందూరపు వృక్షం కోసం దాని ప్రమాణాన్నే స్వీకరించాలి.

భిన్నత్వంలో ఏకత్వం సృష్టిలోని వైచిత్ర్యం. స్త్రీ పురుషులలో వ్యక్తిగతంగా ఎంత వైవిధ్యం ఉన్నా, ఆంతరికంగా సామ్యం ఉన్నది. స్త్రీ పురుషులలో వివిధ పాత్రలు, విభిన్న పరిగణనలు సృష్టిలో సహజమైన వైవిధ్యంగా భాసిస్తున్నాయి. అందుచేత వారందరిని ఒకే ప్రమాణంలో మదింపు చేయలేము, వారందరికీ ఒకే ఆదర్శం చూపలేము. అటువంటి పరిస్థితి విపరీతమైన సంఘర్షణను సృష్టిస్తుంది. ఫలితంగా మానవుడు ఆత్మవిద్వేషి అవుతాడు, మతానికీ, సౌజన్యానికీ దూరమవుతాడు. తమ ఆశయానికి అనుగుణంగా జీవించాలనే పోరాటంలో ప్రతిఒక్కరినీ ప్రోత్సాహించటమే మన కర్తవ్యం. దానితో పాటు ఆశయాన్ని సాధ్యమైనంతవరకు సత్యానికి సన్నిహితం చేయటానికి కృషిచేయాలి.

హిందూ ధర్మశాస్త్ర ప్రకారం మన పూర్వులు ప్రాచీనకాలం నుంచే ఈ వాస్తవం గుర్తించినట్లు మనకు కనిపిస్తుంది. వేదాలలో నీతిశాస్త్ర గ్రంథాలలో గృహస్థులు, పరివ్రాజకులు, విద్యార్థులు మొదలైన వివిధ తరగతుల ప్రజలకు తగిన వివిధ ధర్మాలు ప్రవచింపబడి ఉన్నాయి.

పై సంచికలో: "నైతికత-దాని కేవలప్రమాణము."

## వివరణము: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(క్రిందటి సంచిక తరువాయి)

### 17. "భూతం భవిష్యచ్చ భవత్స్వకాలే
### తద్వర్తమానస్య విహాయ తత్త్వం
### హాస్యా న కింస్యాద్గతభావివర్చా
### వినైకసంఖ్యాం గణనేవ లోకే

ఆంధ్రానువాదం: భూతం కొంతకాలం క్రింద వున్నది. భవిష్యత్తు ముందుకాలంలో ఉంటుంది. వాటివాటి 'సమయం' సమయంలో అవి వర్తమానంగానే చలామణి అయినవి. కాబట్టి వర్తమానం యొక్క నిజస్థితి తెలియకుండా, భూత కాలాన్ని గురించి, భవిష్యత్తు గురించి చర్చించడం తెలివి తక్కువ కదూ? ఒకటంటే ఏమిటో తెలియకుండా గణితం నేర్చుకోవడం వలె హాస్యాస్పదం కదూ?

వివరణము: అసలు కాలం అంటే ఏమిటి? భూత, భవిష్యత్, వర్తమానాలే కదా! భూతం అంటే ఏమిటి? ఒకప్పుడు జరిగిన సంఘటన యొక్క స్మృతి కదా! అదీ ఒక వర్తమానంలాగే చలామణీ అయింది ఆ సమయంలో! మనం బాల్యంలో జరిగినవి ఎన్నో జ్ఞాపకం చేసుకొంటాం. అవి ఇప్పుడు జ్ఞాపకాలు మాత్రమే. కాని జరిగినవన్నీ అప్పటి వర్తమానంలో సత్యంగానే అనిపించాయి. కాని అవి ఇప్పుడు స్మృతులు మాత్రం. మనస్సులో చిన్న కెరటాలు. వాటి సంఘటనలు మాత్రం భూతకాలంలోకి అంతరించిపోయినవి. ఇక భవిష్యత్తును గురించి, ఇది కూడా ముందు జరుగుతాయని ఊహించే మనోవృత్తులు. ఇవి జరుగవచ్చు, జరగకపోవచ్చు. కాబట్టి ఇవి సత్యములనీ, నిజమయినవి అని ఎలా చెపుతాము? కాబట్టి ఇవి కూడా మనస్సులో కలిగే కెరటాలవంటివే! ఆ భవిష్యత్తు వచ్చినపుడు దానిని భవిష్యత్తుగా కాక వర్తమానంగానే మనం అనుభవిస్తాం. ఇట్టి పరిస్థితులలో జరిగిపోయినవాటిని గురించి చర్చలు, జరుగబోయేవాటిని గురించి కలలూ, వర్తమానంయొక్క నిజస్థితి తెలియకుండా చేసే తెలివితక్కువ పనే కదూ? మొదటిసంఖ్య అయిన ఒకటిని తెలియక చేసే లెక్కలవంటిది. వర్తమానం ఒకటే సత్యం. దాన్ని గట్టిగా పరీక్షిస్తే అది అక్కడ ఉండదు!!

వర్తమానం- ఇది కూడ ఒక చిత్తవృత్తే. ఆ క్షణమందు బాహ్యప్రపంచము నీయందు నీ మనస్సునందు కదిలించే ఒక కెరటం. దీన్ని ఇదివరకే చర్చించాం. ఇవీ చిత్తవృత్తులే అని ఇదివరకు నిర్ణయించాం. ఇవి ఎక్కడ నుంచి బయటపడుతున్నాయో, దీనికి మూలం ఏదో వెతుక్కుంటూపోతే మనస్సు, అహంకారం దాటిపోయి ఆత్మలో మునగుతాం. కాబట్టి భూతభవిష్యద్వర్తమాన సత్యం ఆత్మలో ఉన్నది. నిన్న, నేడు, రేపులకు అందనిదది. కాబట్టి కాలం నీకో ఉన్నది కాని, నీవు కాలంలో లేవు. కాలం ఒక చిత్తవృత్తి. ఒక ఆత్మ స్ఫురణ. అది నిత్య వస్తువు కాదు, నిరపేక్షము కాదు. బాహ్యప్రపంచంలోది కాదు. మన మనస్సులోనిది. ఈ సంగతి గుర్తించకుండా జరిగినదాన్ని మరచిపోయి, జరగబోయేదాన్ని గురించి మధన పడకూడదు. కాని జరిగినదానివలన గుణపాఠం నేర్చుకొని, దానివలన ప్రస్తుతవ్యవహారం చక్కదిద్దుకోవచ్చు. అంతేకాని, జరుగబోయేవాన్ని గురించి కలలు కంటుంటే ఏం ప్రయోజనం? ఇప్పటి సంఘటనలను సమర్థతతో ఎదుర్కొనకుండా సందిగ్ధములైన రేపటి సమస్యలు ఎలా పరిష్కరించగలం? ఇప్పటి చిక్కులు విడదీయాలంటే ఒక్కటే మార్గం? నీ పుట్టుకకు మూలం ఏదో దాన్ని సాధించడమే. అది ఆత్మ కదా! ఇంకొక ఏమార్గమయినా అది దొంక తిరుగుడు! సూటైనది కాదు. కాబట్టి నీవు కాలానికి అధికారివి. దాసుడవు కావు. మనలో చాలామందికి మన పూర్వ నాగరికతను, గొప్పను గూర్చి పొగడుకోడం, మనం ముందుముందు చేసే ఘనకార్యాలను గురించి ఊహాగానాలు చేయడం పరిపాటయింది. జరిగిన దాని స్మృతులు, జరగబోయేవాటి కలలూ మనకు ప్రయోజనం లేదు. గుర్తించండి - చేయవలసింది ఇప్పుడు మనం ఎదుర్కొనే చిక్కులు, సమస్యలు ధైర్యసాహసాలతో పరిష్కరించటం! కాకపోతే పతనం తప్పదు. జాగ్రత్త. శివపురి బాబా అనే ఒక నేపాలు జ్ఞాని ప్రసిద్ధ ఆంగ్లేయ నాటకరచయిత బెర్నార్డుషాను కలుసుకొని మాటాడుతుంటే ఆ రచయిత 'మీ భారతీయులకు కాలం యొక్క విలువ తెలియదు' అని మాటల సందర్భంలో అన్నాట్ట. శివపురి బాబా 'నిజమే కాలం విషయమై మన దృక్పథాలు వేరు. మీరు కాలానికి బానిసలు, మేము దానికి స్వాములము. అంతే తేడా'- అన్నాట్ట.

### 18. క్వ భాతి దిక్కాలకథా వినాఽస్మాన్
### దిక్కాలలీలేహ వపుర్వయం చేత్

న క్వాపి భామో న కదాపి భామో
వయం తు సర్వత్ర సదా చ భామః

ఆంధ్రానువాదం: ఆత్మయే లేకపోతే కాలంగాని దేశం గాని మనకు గోచరమవుతుందా? శరీరమే నీవయితే నీవు పుట్టుట, పెరుగుట, దేశకాలాల్లోనే; కాని మన ఉనికి ఒక దేశానికి కాని కాలానికి కాని కట్టుబడి ఉండదు. మనం అన్ని కాలములయందు దేశములయందు ఉన్నాం. మనం నిత్యులం.

వివరణ: మహర్షివారు శ్లోకంలో మానవుడు దేశ కాలాలకు బానిసగా జీవిస్తాడనే అపోహ ధ్వంసం చేస్తున్నారు. నీవు ఎంతవరకు శరీరాభిమానంతో శరీరమే నేననే భ్రమతో ఉన్నావో అంతవరకూ నీవు దేశకాలాలకు బానిసవే; దేశకాలాలవల్ల పుట్టిన శరీరం దేశ కాలాల స్వాధీనంలో ఉంటుంది. కాని నీవు ఆత్మవే. నీమీద దేశకాలాలకు ఏం అధికారం ఉంటుంది? ఆత్మ సాక్షి కాని, దేశం గాని కాలంగాని దాన్ని అంటుతుందా? నీవు లేకపోతే అవీ లేవు. నీవు బాగా నిద్రిస్తున్నప్పుడు దేశకాల స్ఫురణ ఉంటుందా? అసలు ఏ ఆలోచనలు లేనప్పుడు వీటి ఆలోచన ఎలా సాధ్యం? నీవు నిద్రనుంచి లేవగానే మొదటి స్ఫురణ నేను. దానితోపాటు మనస్సు, బుద్ధి, వీటియందు దేశము, కాలము మొదలైన ప్రపంచవ్యవహారం అంతా పుట్టుకువస్తది. మనం ఈ జగత్తులో ఫలానాచోట ఫలానా కాలమందు ఉన్నది అని ఏ వస్తువైనా నిర్దేశిస్తాము. "పెద్ద పులి రాత్రి 11 గంటలకు తోటలోకి వచ్చింది" అంటాం. ఊరికే పెద్దపులి వచ్చిందంటే ఏం అర్థమవుతుంది? ఎక్కడకు వచ్చిందో, ఎప్పుడు వచ్చిందో చెప్పకపోతే; కాబట్టి మన మనస్సు, జగత్తును గుర్తించుట కొరకు వాడుకొనే కొలతబద్దలు, కాలం దేశమునూ; సమాధి, నిద్రవంటి అవస్థల్లో మనస్సు పని చేయకపోతే ఇవి లేవు. మనస్సు పనిచేసే కలలోనూ, జాగ్రత్తలోనూ ఇవి కావాలి. కాబట్టి కాలం, దేశం నిజానికి లేనివే కాబట్టి వీటివల్ల పుట్టే అన్ని వస్తువులూ కూడా నిజమైనవి కావు. మనస్సులో ఊహలు మాత్రమే. కాబట్టి మనం ఈ శరీరమే అనుకొన్నంత వరకూ ఈ శరీరం, దేశకాలాల అధీనంలో ఉండే ఈ జగత్తులో ఒక వస్తువు కాబట్టి ఈ రెండు సంకెళ్ళనుంచి బయటపడలేము. ప్రపంచంలో చాలామంది తాము ఈ శరీరమే అనుకొంటారు కాబట్టి ఈ చిక్కుస్థితి తప్పదు. ప్రతివాడు "నేను ఆ ఊళ్లో పుట్టాను. నా పుట్టినరోజు అది, నేను సన్నంగా ఉంటాను. లేక లావుగా ఉంటాను. నేను రోగిని, ఆరోగ్యవంతుణ్ణి, నేను చిరంజీవి కావాలి, పెద్ద ఇల్లు, కుటుంబం, ధనం కావాలి, దీనికోసం అన్ని విధాలా ప్రయత్నిస్తాను" ఈవిధంగా మనస్సులో ఒక ఖయిదు కల్పించుకొని, అందులో చిక్కుపడి ఉంటాడు. కాని మన నిజస్థితి ఏమిటి? మనం ఆత్మస్వరూపులం. దేశమునకు కాలమునకు అతీతులం. వాటిని మనం సృష్టించాముగాని, అవి మనలని పుట్టించలేదు. మనం పుట్టింది ఎక్కడా లేదు చచ్చేది ఎక్కడా ఉండదు. మనకు ఎప్పుడూ పుట్టుక లేదు, ఎప్పుడూ చావు లేదు. మనం ఎప్పుడూ ఎక్కడా వ్యవహరించడం లేదు. మనం ఒకప్పుడు ఉండడం, ఇంకొకప్పుడు లేకపోవటం లేదు. మనం అంతటా వ్యాపించి నిత్యంగా, దేశకాలాలకు, అవతల ఉంటాం. ఆత్మసాక్షాత్కారం కలిగితే ఈ దేశకాలాల చిక్కులన్నీ విడిపోతవి. నీవు ఆత్మను తెలుసుకోకపోతే, అవి ఎప్పటికీ వదలవు. మనం అనుకునే జీవితం స్వల్పమే కాని, అమూల్యం. దానిని సద్వినియోగం చేసి ఆత్మలాభం పొంది, దేశకాలాల్ని అతిక్రమించుదాం. దేశకాలాలతోగాని, మట్టితోగాని, కార్యకారణముతోగాని, సంబంధంలేని ఆ శుద్ధచైతన్యంలోకి పోదాం. "ఇహచేద వేదీదథసత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః" ఈ జన్మలోనే ఇప్పుడే ఇక్కడే ఆత్మలాభం పొందితే, నీలాభం ఆత్యంతికం. దానికోసం నీవు కృషి చేయకపోతే నీ నష్టం కూడా అపారమే.

(తరువాయి పైసంచికలో)

---

సత్యస్య వచనం శ్రేయస్సత్యాదపి హితం వదేత్।
యద్భూతహితమత్యంతమేతత్సత్యం మతం మమ॥

నిజమాడుట ప్రశస్తము. సత్యముకంటె సర్వభూతహితమైన మాటలాడుట ప్రశస్తమైనది. ఏలయన: దేనివలన సర్వభూతములకు అత్యంత హితమగునో అదియే సత్యమని నా అభిప్రాయము.

సనత్కుమార

శ్రీ యోగ వాసిష్ఠ కథలు-6

[నిర్వాణ ప్రకరణము - పూర్వార్ధము]

ఓం ప్రకాశ్

# అసలు వాడెవడూ?

(మిథ్యాపురుషుని కథ)

ఇల్లు కుప్పలా కూలిపోయింది. పాపం వాడెంతో కష్టపడి ఆ ఇల్లు కట్టుకున్నాడు. ఆ యింట్లో వానికెంతో ఇష్టమైన వస్తువును భద్రపరచుకోవాలని ఆశించాడు. వాని ఆశలన్నీ మట్టిపాలయ్యాయి. వానిల్లు కూలిపోయింది.

ఆకాశమంటే వానికెంతో మక్కువ. దాన్నలా ఊరికే వదలిపెడితే ఎప్పటికైనా నశించిపోతుందేమోనన్న భయం వాన్ని పట్టుకుంది. వాడు దివారాత్రాలు ఒకే ధాటిగా ఆలోచించాడు; బాగా ఆలోచించాడు; మరింత లోతుగా ఆలోచించాడు. చివరికి వానికో ఉపాయం తట్టింది. ఎగిరి గంతేశాడు.

"మంచిల్లొకటి కట్టి అందులో ఈ ఆకాశాన్ని పెడితే పోలా!?"

వాని ముఖం వికసించింది. ఇల్లుకు కావలసిన సరంజామంతా సమకూర్చుకున్నాడు. మంచి ముహూర్తం చూసుకొని ఇల్లు కట్టటం ఆరంభించాడు. వాడనుకున్నట్లే ఆ యిల్లు త్వరలో పూర్తయింది. అందులో ఆకాశం నిండిపోయింది.

"హమ్మయ్య. అనుకున్న పని అయింది. ఆకాశాన్నింట్లో పెట్టేశాను. ఇక నాకే బెంగా లేదు. నా ఈ ఆకాశాన్ని చక్కగా కాపాడుకుంటాను."

వానికి ఆకాశం గూర్చిన చింత తప్పిపోయింది. వాడు యింట్లోనే ఉంటూ, ఆకాశాన్ని రక్షిస్తూ కాలం గడిపేస్తున్నాడు. కాని వాని సంతోషం మూన్నాళ్ళ ముచ్చటే అయింది. వానిల్లు ఒక రోజు ఫెళ్లుమంటూ కూలిపోయింది. వాడు లబలబమంటూ గుండెలు బాదుకున్నాడు. 'అయ్యో, నా ఆకాశం' అంటు కంటికీమంటికీ ఏకధారగా ఏడ్చాడు.

"అయ్యో, ఆకాశమా! నువ్వెంత చక్కని దానివో కదా! ఒక్కక్షణంలోనే ఎక్కడికి పోయావు? అయ్యో, ఇలా ముక్కలు ముక్కలయిపోయావేమిటీ?" అని గుండెలు కరిగేలా విలపించాడు.

పాపం! వాడొట్టి అమాయకుడు. చంటి పిల్లవానిలా వానిదంతా అల్పబుద్ధి, పైగా మూఢుడు. వివేకం లేనివాడు. అజ్ఞాని. ఎక్కడ పుట్టాడో ఎవరికీ తెలియదు. ఒక నిర్జన ప్రాంతంలో పుట్టి పెరిగాడు. వానికి తోడూ, నీడా ఎవరూ లేరు. ఒంటరివాడు. జనులెవ్వరూ లేని ఆ శూన్యప్రదేశంలోనే జీవితం గడుపుతున్నాడు.

ఎన్నో రోజులుగా వాడు గమనిస్తున్నాడు. ఈ ఆకాశం తన వద్దే ఉంటున్నది. దీనికి తనంటే ఎంతో ఇష్టంలా ఉన్నది. ఎక్కడికెళ్ళినా, ఎక్కడ తిరిగినా, ఇది తననంటిపెట్టుకొనే ఉంటున్నది. ఈ ఆకాశం ఎంత మంచిదీ! దీనికి తోడూ-నీడా ఎవరూ లేనట్లుంది. దీనికేమైనా అయితే తనకు తోడుగా ఎవరుంటారూ? వాడిలా విచారించి, ఆకాశంపైన మమత పెంచుకున్నాడు. దాన్ని శాశ్వతంగా కాపాడాలనుకున్నాడు.

అందుకే ఆ ఇల్లు కట్టి దాన్నందులో ఉంచాడు. కానీ, పాపం! ఆ ఇల్లే కూలి

పోయింది. "అయ్యో నా గ దీన్నెలా కాపాడాలి?" అని తల్లడిల్లి పోయాడు. ఎన్నో రోజులు చింతామగ్ను డయ్యాడు. వానికేదో చేయాలనిపించింది. ఏలాగైనా ఆకాశాన్ని రక్షించాలనుకున్నాడు. ఈసారి మరింత గంభీరంగ వాడావిషయమై మననం చేశాడు. ఒక నిశ్చయానికి వచ్చాడు.

"ఒక కూపాన్ని నిర్మించి దాన్నందులో పెట్టేస్తాను." (కూపం=బావి. గుంట,గొయ్యి)

వాడు వెంటనే నిర్మాణ కార్యక్రమం చేబట్టాడు. అతి త్వరలోనే కూపాన్ని నిర్మించాడు. ఆ కూపంలో ఆకాశాన్ని పెట్టేశానని సంతృప్తి పడ్డాడు. ఆ కూపాకాశాన్ని కాపాడ సాగాడు. అయితే విధి వాని సృజనాత్మక చర్యల్ని చూసి హర్షించలేకపోయింది. ఓ రోజు ఆ కూపాన్ని కూడ నష్టం చేసివేసింది. ఆకాశం మళ్ళీ ప్రమాదంలో పడిపోయింది.

"హతవిధీ, హతవిధీ. నా ఆకాశం; నా ఆకాశం!" అంటూ వాడు లబలబలాడుతున్నాడు. నెత్తీ నోరూ బాదుకున్నాడు. అయినా లాభం లేకపోయింది. కూపాకాశం ప్రమాదంలో చిక్కుకుపోయింది. వాడు ఘోరమైన శోక సముద్రంలో మునిగిపోయాడు. "అయ్యో నా ఆకాశమా? నా కూపమా? నువ్వెంత అందంగా ఉండేదానివి! ఇంతలోనే ఇంత ప్రమాదానికి గురవతావని అనుకోలేదు. నిన్ను రక్షించుకోవాలని ఎంత కష్టపడ్డాను. అయినా నువ్వు నశించిపోయావు. కూపాకాశమా! అయ్యో!" అంటూ వాడు రేయింపగలూ ఒకే ధారగ దుఃఖించాడు. వానికి దుఃఖించ టానికిక కళ్ళలో నీళ్ళయిపోయాయి. చేసేది లేక దుఃఖాన్ని మానివేశాడు. 'ఏమైనా చేయాలి!' అనుకున్నాడు. 'ఈసారి ఆకాశాన్ని దృఢంగా రక్షించుకోవాలని' నిశ్చయించుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. ఆలోచించి, ఆలోచించి వాడు లేచి ఒక్క పరుగున ఎక్కడికో వెళ్ళాడు. కొంతసేపటికి మళ్ళీ అదే పరుగుతో తిరిగి వచ్చాడు. ఈసారి వాని చేతిలో ఒక ఘటమున్నది.

"ఇల్లూ, కూపం ఇవి పెద్దవి. అందుకే నశించాయి. ఈ ఘటమయితే పర్లేదు. ఇది నష్టం కాదు. ఆకాశం సుఖంగా, వెచ్చగా దీన్లో నిర్భయంగా ఉండవచ్చు"

వాడిలా నిశ్చయించి, ఆ ఘటాన్ని తెచ్చి డాపులో పెట్టుకున్నాడు. ఘటంలో ఆకాశం ఉందని భావించి, దానిపై మూత పెట్టి, ఘటాకాశాన్ని చూసి సంతోషించాడు.

"ఆహా! ఇప్పటికి చక్కని చోటు దొరికింది. నా ఆకాశానికి ఎలాంటి ప్రమాదం లేదిక" అనుకొని వాడు కాలమంతా ఆ ఘటాకాశ రక్షణలోనే గడిపేయసాగాడు.

కాలం మహాక్రూరమయింది. వాడొట్టి వెఱ్ఱిబాగులవాడని అనైనా చూడకుండా అది వానిపై దాడి చేసింది. ఘటాకాశాన్ని పగుల గొట్టింది. "హా!" అంటూ వాడు దిగ్భ్రాంతుడయ్యాడు. బొమ్మలా అలాగే నిలబడి పోయాడు.

"హా! దైవమా! నువ్వెంత క్రూరురాలివి. నా ఘటాకాశం నీకేం ద్రోహం చేసిందని దాన్నలా పొట్టన పెట్టుకున్నావు? నా ఘటాకాశమా! నా ప్రియమైన ఘటాకాశమా!" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా వాడేడ్చాడు. ఏడ్చీ, ఏడ్చీ అలసిపోయాడు. సొలసిపోయాడు.

దరిద్రుడు బంగారాన్ని ముట్టినా అది మట్టయిపోతుంది. దైవోపహతునికి అడుగడుగునా

విపత్తులే. పాపం వాడెన్నిమార్లో ఆకాశాన్ని పదిలంగా పెట్టుకోవాలని చూశాడు. అన్ని వ్యర్థమైపోతున్నాయి. వానికి దుఃఖం ఉబికి ఉబికి వచ్చింది.

ఆ శోకావస్థ కొంతకాలానికి ముగిసింది. మళ్ళీ ఆకాశరక్షణకై నడుం కట్టాడు. ఒక యజ్ఞకుణ్డాన్ని నిర్మించాడు. (కుణ్డః = అగ్ని కుండము, పెద్దమూతిగల పాత్ర, హోమ కుండము). అందులో ఆకాశాన్ని భావించి, సంతృప్తినొందాడు.

"ఇప్పుడీ కుణ్డాకాశానికి ఏమీ భయం లేద" ని సంతోషించాడు. విధికి వీని చేష్టలు వినోదం కల్గించాయి. పిల్లికి చెలగాటం, ఎలుక్కు ప్రాణ సంకటమన్నట్లు విధికి వీని ఏడ్పులు వినోద ప్రాయమయ్యాయి. అది మళ్ళీ దాడి చేసింది. కాంతి ప్రసరణతో చీకటి పటాపంచలయినట్లు, ఆ యజ్ఞకుణ్డము కూడ నష్టమైపోయింది. అది చూసి వాడు మూర్ఛపోయినంత పని చేశాడు. పొర్లి పొర్లి ఏడ్చాడు. 'ఇదేమిటీ? ఇదేమిటీ?' అని గుండెలు బాదుకున్నాడు. వేదనతోబాటు విధిపై తీవ్రమైన కోపం వచ్చింది.

"రాని, ఈసారి విధి పనిచెబుతాను. నా ఆకాశాన్ని ఎలా పాడుచేస్తుందో చూస్తాను." అనుకొన్నాడు.

వాడు ఈసారి గట్టి బందోబస్తు చేశాడు. చతుశ్శాలాభవనం నిర్మించాడు. నాల్గువైపులా నాల్గుగదులు. మధ్యలో ఒక పెద్దగది. ఆ గది లోనే ఆకాశాన్ని భద్రపరిచానని తలచాడు. హాయిగా నిట్టూర్పు విడిచాడు.

ఈసారి విధి అంత త్వరగా రాలేదు. 'హమ్మయ్య, ప్రమాదం తప్పింద'ని సంతోషించాడు. వాడెంతో ఆనందంగా గడప సాగాడు. ఆకాశం చాలా హాయిగా, సురక్షితంగా ఉందని పొంగిపోసాగాడు.

లక్షల కొలది ప్రాణుల్ని, వస్తు సమూహాల్ని సమస్త జడచేతన పదార్థాల్ని దిగమ్రింగే కాలానికి, ఈ చతుశ్శాల ఒక లెక్కాడొక్కా! అనొకరోజు ఆ చతుశ్శాలను నిలువునా కూల్చి వేసింది. ఆకాశం మునుపటిలాగే మళ్ళీ ప్రమోదభూయిష్ఠమైంది.

"హా హా." అంటూ వాడు నిశ్చేష్టితుడయ్యాడు. హఠాత్తుగా వాని ఆనందం శోకం లోకి పరిణమించింది. "ఎలా, ఎలా, ఎలా ఈ ఆకాశాన్ని రక్షించేది?" వాని హృదయం కకావికలైంది.

ఆ శోకం నుండి చాలా కాలానికి గాని వాడు తేరుకోలేక పోయాడు. దుఃఖం శమించిం తర్వాత బాగా ఆలోచించి వాడొక మేఘాకార కుసూలాన్ని నిర్మించాడు. (కుసూలః = గిడ్డంగి; ధాన్యం దాచిపెట్టే మట్టి పాత్ర). అందులో ఆకాశాన్ని పెట్టి, అది సురక్షితంగా ఉందని తలచి ప్రమోదంతో ఉండసాగాడు.

కొంతకాలం గడిచింది. వాని ఆనందానికి మళ్ళీ ఆటంకమేర్పడింది. విధి, నిర్దాక్షిణ్యంగ ఆ కుసూలాన్ని ధ్వంసం చేసివేసింది. వాడు హతాశుడయ్యాడు. కుప్పలా పడిపోయాడు.

పాపం! వాడెంతగానో కష్టపడుతున్నాడు. ఆకాశాన్ని రక్షిద్దామని ఎన్నెన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా అన్నీ వమ్మయిపోతున్నాయి. ఇలా సంతోషం కల్గుతున్నది. అలా దుఃఖం ముంచేస్తున్నది.

ఇల్లు కట్టాడు కూలిపోయింది. కూపం పై ఆశ పెంచుకున్నాడు, అదీ నశించింది, ఘటంతో

మోహాం చేశాడు. అది కూడా నాశనమైంది. చతుశ్శాల భవనంపై వ్యామోహం పెంచుకున్నాడు. ఎండుపుల్లలా, ఆ ఆశకూడ ధ్వంసమయింది. ఏ ఆశ వాణ్ని సంతృప్తుణ్ని చేయలేక పోయింది. ఆకాశాన్ని ఎన్నివిధాల పరిమితం చేద్దామని ప్రయత్నించినా, ప్రతిసారీ అది అనంతంలో లీనమై వాణ్ని దుఃఖితుణ్ని చేస్తున్నది. నిరంతరం వాణ్ని శోకంలో ముంచెత్తుతున్నది.

భగవాన్ ! ఏమిటిది ? అంటూ వాడు వాపోతున్నాడు. వాడిలా దుఃఖాల పరంపరకు పశుడౌతూనే యున్నాడు. ఒక దుఃఖాన్ని మించి, దుస్భరమైన మరో దుఃఖం వాణ్ని కబలిస్తూనే యున్నది.

మూఢ బుద్ధిచేత ఆకాశాన్ని దేన్లోనైనా పెట్టి రక్షించుకోవాలనుకుంటున్నాడు పునః పునః విఫల మనోరథుడౌతున్నాడు. దుఃఖితుడౌతున్నాడు. వానిలో వివేకం మాత్రం జనించటం లేదు, నీటిని మూట కట్టటం, వాయువును పిడికిట బంధించటం ఎంత అసంభావ్యమైన, అవివేకమైన చర్యయో, ఆకాశాన్ని పరిమితం చేయటం కూడ అంతే మరి! కాని ఈ సంగతి వాడికి తెలిసిచ స్తేకదా! వాడింకా, ఆ కాశ రక్షణకై వివిధోపాయాల నిర్మాణ కార్య క్రమంలోనే మునిగిపోయి ఉన్నాడు. కొంత కాలం దుఃఖిస్తాడు, ఆ వెంటనే ప్రవృత్తి పరుడౌతాడు. మరికొంతకాలం సుఖిస్తాడు. ఆ వెంటనే మరల ఏదో విషాదంలో మునిగిపోతాడు. ఒకప్పుడు తీపి పండ్లు తింటాడు. ఆహా ఏమి మృతమని పొంగిపోతాడు. మరొకప్పుడు చేదుపండ్లు తింటాడు, ఛ! పాడుచెట్టు అని క్రుంగిపోతాడు.

వాడు ఎవడో కాదు, వాడొక మిథ్యాపురుషుడు. ఒక మాయా యంత్రమయ పురుషుడు. ఆకాశంలో కేశసమూహం కనబడుతుంది. అది దృష్టిదోషం. ఎండమావుల్లో జలం కనబడుతుంది. అది కూడా దృష్టిదోషమే. వాడు సైతం అలాంటి దృగ్దోషజనిత పురుషుడే; భ్రాంతి మూలంగా జనించిన పురుషుడే! వాడు కేవలం మిథ్యాపురుషుడు!

## కథా వివేచనము

మిథ్యాపురుషునికి సంబంధించిన ఈ కథ శ్రీ యోగ వాసిష్ఠంలోని నిర్వాణప్రకరణమందు కనబడుతుంది. 1 వ సర్గ మొదలు 113 సర్గవరకు ఇది విస్తరించి యున్నది. 'సుందరమైన హాస్యప్రద ఆఖ్యాయిక' అని ఇది పేర్కొనబడింది.

ఈ కథను శ్రీ యోగవాసిష్ఠమే వివేచన చేసింది. ఈ కథలో వచ్చే మాయాయంత్రమయ మిథ్యాపురుషుడు మరేమిటో కాదు; అది సర్వజీవాళిని ఆవరించియున్న, సర్వ దృశ్య ప్రపంచానికి హేతుభూతమైన, సర్వ ద్వంద్వ వాసనలకు నిలయమైన అహంకారమే. అది శూన్యాకాశంలో మాయచేత ఉత్పన్నమయింది. మాయామయ ఆకాశంలో ఓ మూల ఈ జగత్తున్నది. సృష్ట్యాదిలో కూడ ఈ జగత్తు అసీమమై, అనంతమై, శూన్యరూపంలోనే ఉంటుంది. ప్రాణులకత్యంత అగమ్యమైన పరబ్రహ్మ పరమాత్మ ఆ మాయాకాశమందు విరాజమానుడై ఉంటాడు. ఆ బ్రహ్మరూప మాయాకాశంనుండి ఆరంభంలో ఈ అహంకారం ఉదయిస్తుంది. ఆకాశంనుండి శబ్దంలా, వాయువునుండి స్పందనలా ఈ అహంకారం వెలికి వొస్తుంది. ఈ అహంకారమే మన మిథ్యాపురుషుడు, మాయాపురుషుడు. మాయనుండి ఉత్పన్నమైన కారణంగ, ఈ అహంకారం కేవలం అసత్తయి, మిథ్యారూపమై యున్నది.

'కూపాన్ని, కుణ్డాన్ని, చతుశ్శాలను, ఘటాన్ని యిలాంటి అనేకశరీరాలు నిర్మించి, వాటి స్వరూపాలను రక్షించాలని' ఈ అహంకారం, ఆకాశమందు సంకల్పిస్తుంది. జగదాకారరూప విభ్రమాల చేత ఈ అహంకారం జీవాత్మను మోహింపజేస్తుంది. వ్యాపకము, శూన్యము, భూతాకాశరూప పరబ్రహ్మలో నిశ్చయంగానే ఈ జగత్తు మిథ్యారూపంలో భాసిస్తున్నది. ఆ మిథ్యాజగత్తులోనే, అహంకారరూప పురుషుడు సుఖదుఃఖాలను మిథ్యావస్థలోనే అనుభవిస్తూ స్థితుడై యున్నాడు.

ఆకాశంలో ఆకాశాన్ని రక్షిస్తూ వాడు (మిథ్యాపురుషుడు) ఘటాదులను నిర్మించాడు. ఆ ఘటాది ఆకాశాలను

కాపాడటంలో అనేకరకాల క్లేశాలను అనుభవించాడు! ఆహా! ఎంతమోహం! జలాశయం లేదు. జలమూ లేదు. కాని 'అయ్యో, చేపలు దొరకటం లేదే!' అని బెస్తవాడొకడు బాధ పడిపోయాట్ట. అలా వున్నాయి అహంకార యుత ఈ జీవుల తాపత్రయ క్లేశాలు! క్లేశాలూ లేవూ. చట్టుబండలూ లేవు. కాని ఈ అహంకార కల్పనల్లో పడి జీవి పాపం, ఎన్ని లేనిపోని బాధలకు గురవుతున్నాడూ!

ఆత్మ ఉన్నది. అది ఆకాశంకంటే అధికమై ఉన్నది. పరమశుద్ధమై యున్నది. అత్యంత సూక్ష్మమై యున్నది. పరమకళ్యాణరూపమై, శుభమై వెలుగొందుచున్నది ఆ ఆత్మను ఎవరు గ్రహిస్తారూ? గ్రహించి దాన్నెవరు వదిలేస్తారూ? ఘటాదులు వినష్టమైపోతాయి. కాని పెద్దలు ఆకాశాలు పూర్వంలాగే మామూలుగానే ఉంటాయి. అలాగే దేహాలూ నష్టమైపోతాయి. కాని నిర్లేప ఆత్మ ఎప్పుడూ వినాశనం చెందదు.

మననం చేసే మానవుల్లారా! ఒక సత్యం గ్రహించండి. త్వరపడి నిర్ణయాలు గైకొనకండి. నిదానంగ ఆలోచించండి. అహంకారాలను వదిలి, దేహాత్మభావనను విసర్జించి, శోధించి చూడండి. ఆ సత్యాన్ని కనుగొనండి. అది మరేమిటో కాదు. ఆత్మయే. ఈ ఆత్మ శుద్ధతత్వం గలది. ఈ ఆత్మ చిన్మయస్వరూపం గలది. ఈ ఆత్మ ఆకాశంకన్నా, అణువుకన్నా అత్యంత సూక్ష్మత్వం గలది. ఈ ఆత్మ అహంకారరహితమైనది. ఈ ఆత్మ నిత్యమైనది; స్వప్రకాశరూప చేతనమే ఇది. కనుక ఆకాశంమాదిరి ఈ ఆత్మ నశింపదు. (ఆకాశంమాదిరి అనటంలో ఆకాశం నశించే స్వభావం గలదన్న అభిప్రాయం వ్యక్తమవుతున్నది. దృశ్యప్రపంచరీత్యా ఆకాశం నశించదు. కాని ఆత్మరీత్యా అదికూడ నష్టప్రాయమైనట్టిదే. ఎందుకంటే ఆత్మ, దేశకాలస్థితికి అతీతమయినట్టిది. ఆకాశ అభిప్రాయం మనస్సులో నున్నంతవరకు, ఆ మనసు ఇంకా అమనస్కత్వాన్ని పొందలేదనే చెప్పవలసియుంటుంది. ఆకాశం కూడ పంచభూతాల్లో ఒకటి కదా! పంచభూతాలు సంకల్పజనితాలు. అవి నశించక తప్పదు. ఆత్మ సర్వవికారాలకు అతీతమై, సర్వవికారాలకు ఆధారమైయున్నట్టి చిన్మయతత్వం. కనుక ఆకాశం నశించే స్వభావం గలదని. మహర్షి వసిష్ఠులవారు ఆత్మను దృష్టిలో పెట్టుకొని చెప్పిన మాటని జిజ్ఞాసు సోదరులు గ్రహించగలరు.)

వాస్తవాన్ని విచారించి చూస్తే, ఏసమయంలో కూడ, ఏమీ ఉత్పన్నం కాలేదు. కాబో కూడదు. ఇక మృత్యువు ప్రశ్నే లేదు. ఉత్పన్నమే పతనం చెందుతుంది కదా! కనుక మరణించేది కూడ ఏదీ లేదు.

కేవలం బ్రహ్మమాత్రమే జగద్రూపంలో ప్రకాశిస్తున్నాడు. అతను ఆది లేనివాడు. ఆ బ్రహ్మము అంతము లేనిది. ఆ ఆత్మ మధ్యావస్థరహితమైనది. బ్రహ్మ, ఉత్పత్తి వినాశరహితమైన పరమతత్త్వము. బ్రహ్మ ఏకము; బ్రహ్మ అద్వితీయము; బ్రహ్మ సత్యము; బ్రహ్మ పరమపదస్వరూపము. పరమాత్మ, పరబ్రహ్మ శాంతిమయము. పరమ శాంతిమయము.

(పై సంచికలో ఏది నిజం? ఏది మాయ?)

ముహింత్రై

## సోపాన కందుకం

సోమయ్య చంద్రయ్యలు మిత్రులు. ఇద్దరూ పుస్తకప్రియులు. సోమయ్య అదీ ఇదీ అనే పట్టింపు లేకుండ చేతికందినదంతా చదివేవాడు. మెత్తని మనిషి. చంద్రయ్య అలా కాదు. ఉడుకు రక్తం. "మార్క్స్ - ఏంగెల్స్ లెనిన్" సాహిత్యం అంటే పడి చచ్చేవాడు. కుళ్లు సమాజ వ్యవస్థను పడగొట్టి నవ సమాజాన్ని నిర్మించాలని ఆవేశంగా మాట్లాడే ధోరణి కలవాడు. ఇద్దరూ డిగ్రీలు పూర్తి చేశారు. సోమయ్య పై చదువుకు లైబ్రరీసైన్సును ఎన్నుకున్నాడు. అతని ఉద్దేశం: లైబ్రరీపనిలో పుస్తకాలు పత్రికలు తెగ చదివే అవకాశం ఉంటుందని. చంద్రయ్య టీచర్ ట్రయినింగ్ కోర్సులో చేరాడు. అతని ఉద్దేశం: పాఠాలు చెప్తూ చెప్తూ బడిపిల్లల హృదయాల్లో విప్లవ బీజాలు నాటాలని. కోర్సులు పూర్తయ్యాక వాళ్ళకు ఆయా ఉద్యోగాలు వెంటనే దొరికాయి. (ఈ వాక్యంలో మీకు నమ్మకం లేకపోతే కథాకాలాన్ని ఇరవై ఏండ్లు వెనక్కి నెట్టండి). వాళ్ళిద్దరి ఉద్యోగస్థలాలు దగ్గర దగ్గరే. తరచు కలుస్తుంటారు. ముఖ్యంగా లైబ్రరీలోనే. చంద్రయ్య అక్కడ మెంబరుగా

కూడ చేరాడు. కాని వాళ్లు ఉద్దేశించిన ఆశయాలు నెఱవేఱలేదు. వాళ్ళిద్దరిలో ఎన్ని లోపాలున్నా పనిలో శ్రద్ధ, నిజాయితీ ఉన్న వాళ్లు. నెలనెలా జీతాలు మాత్రం తీసుకుంటూ పనులకు ఎగనామం పెట్టేరకం కారు. కాబట్టి సోమయ్యకు లైబ్రరీలో లైబ్రరీపని తప్ప స్వంతానికి చదవడం వ్రాయడం కబుర్లాడడం లాంటివి కుదిరేది కాదు. చంద్రయ్యకు సిలబస్ పిల్లలకు అర్థం అయేటట్లు పూర్తి చేయడంతోనే సరిపోతున్నది. విప్లవ బీజాలు నాటే అవకాశం అంతగా లేదు. ఒకవేళ ప్రయత్నించినా నాటించుకునే స్థాయిలో పిల్లలు లేరు. వాళ్ళలో ప్రయోజకులనదగిన కొందరు తమ దృష్టిని, హృదయాన్ని - సమస్తాన్నీ మార్కుల మీదనే ఉంచినవాళ్ళుగా ఉన్నారు. క్లాసుకు ఫస్టు రావాలని, ఊరికి ఫస్టు రావాలని, తాలూకాకు ఫస్టురావాలని, జిల్లాకు ఫస్టు రావాలని - ఇలాంటి అల్పాశయాలతో "అప్రయోజకుల" హృదయాలు ముకుళించి ఉన్నందున విప్లవ బీజాలు వాటిలో పడడానికి సందు లేదు. ఇంతేగాక చంద్రయ్యకు వివాహం కూడ అయ్యింది. వేడి వేడి ఆశయాలు మెల్ల మెల్లగా చల్లారి పోసాగాయి. అతడొకనాడు లైబ్రరీనుంచి వివేకానంద పుస్తకం తీసుకుపోతున్నాడు. సోమయ్యకు ఆశ్చర్యం వేసింది. "వివాహమయి సంవత్సరం కూడ కాలేదు. ఇంత తొందరగా ఆధ్యాత్మికం వైపు మళ్లుతున్నావే! ఆ షెల్ఫులో ఇంకా చాల ఆధ్యాత్మిక పుస్తకాలున్నాయి. ఇంకేదైనా కూడ సెలెక్టు చేసుకో" అన్నాడు. "అవన్నీ ఎవడికి కావాలి? వయస్సు మళ్ళిన సోమరులు చదివే పుస్తకాలు. ఇదొకటిప్పు చాలు" అన్నాడు చంద్రయ్య. తరువాత కొన్ని నెలలు అతడు లైబ్రరీవైపు రానేలేదు. వృత్తి ధర్మం ప్రకారం లైబ్రరీ పుస్తకం రాబట్టడానికి సోమయ్య అతనికి రిమైండర్ కార్డు పంపాడు.

య్యకు ఆ పుస్తకం జ్ఞాపకం వచ్చింది. లైబ్రరీ నుండి తెచ్చాడేగాని ఆ పుస్తకం ఒక పేజీకూడ ఇంతవరకు చదువలేదు. ఎన్నో అవాంతరాలలో దాని సంగతి మఱచాడు. ఇప్పుడు తాను ఒక పాపకు తండ్రి కూడాను. సంతోషమే అయినా సంసారపు వత్తిడి మెల్ల మెల్లగా అనుభవానికి వస్తున్నది. చేతికి నోటికి ఇన్నాళ్ళు సరిపోయిన జీతం ఇప్పుడు సరిపోవడం లేదు. కాబట్టి ట్యూషన్లు చెప్పడం మొదలుపెట్టాడు. అటూ ఇటూ కదిలే ఓపిక లేదు. తీరిక ఉన్నప్పుడల్లా తన పాపని చూస్తూ మురిసిపోతుండడమే ఇప్పుడతనికి చాల ఇష్టంగా ఉన్నది. అయినా ఆ రిమైండర్ కార్డు చూసిన తరువాత ఎలాగో ముక్కుబట్టి ఆ పుస్తకాన్ని చదివి "చదివినాను" అని తృప్తిపడి లైబ్రరీకి ఇచ్చివేయడానికి స్వయంగానే వెళ్ళాడు. సోమయ్య ఇతణ్ని చూడగానే "ఏమయ్యా ఇన్నాళ్లు దాన్ని కంఠతా పెట్టావా?" అన్నాడు. "ఈ పుస్తకం మనకు సరిపడదయ్యా! పేజిపేజికి 'ఇది చెయ్ అది చెయ్, ఇది త్యజించు అది త్యజించు, ఇది సాధించు అది సాధించు' అని చెప్పే పుస్తకాలవల్ల సంసారులమైన మనకి ఏం లాభం? ఇప్పుడు నాకొక పాపాయి! రామకృష్ణ పుస్తకం ఒకటి ఏదైనా నీవే సెలెక్టు చేసివ్వు. చిన్నప్పుడవి చదివినట్లు జ్ఞాపకం. అటువంటి పుస్తకాలే మనకు అనుకూలం" అన్నాడు. ఈ మాటలు వింటూంటే సోమయ్యకు నవ్వు ఆగలేదు. "వివాహమయి సంవత్సరం అయిందో లేదో ఇంత వేగంగా క్రిందికి దిగి వచ్చేస్తావని నేను కలలో కూడ అనుకోలేదు. ఏమయింది నీకు? ఆ వేడి అంతా ఎక్కడికి పోయింది? నీవు క్రిందికి దిగివచ్చే వేగం చూస్తుంటే ఇంకొన్నాళ్ళలో నీకు భాగవతపురాణంఅవసరం ఎంతైనా ఉంటుందని గట్టిగా నమ్ముతున్నాను. నా దగ్గరొక సెట్టు చదవక మూలపడి ఉన్నది. నీకు ప్రెసెంట్ చేస్తా

# గీతాగేయాలు (18 వ అధ్యాయము)

## మోక్ష సన్యాస యోగము

అర్జున ఉవాచ:-
మహాబాహో !! - హృషీకేశా !!
త్యాగ, సన్యాస - ముల నిజరూప
మరయగోరెద - వేరు వేరుగ
వాటి వివరము - చెప్పు కేశవ !!

శ్రీభగవానువాచ:-
కామ్యకర్మల - వదలి మనుటయె
సన్యాసమని - కొందరందురు
సర్వ కర్మల - ఫలము వదులుటె
త్యాగమందురు - కొందరర్జున !!
దోషయుతములు - కర్మలెల్లను
వీడవలెనని - విజ్ఞు లందురు
యజ్ఞ దాన - తపో కర్మల
వీడరాదని - కొందరందురు

అట్టి కర్మ త్యాగ, విషయమై
నా నిశ్చయము - వినుము పార్థా !!
చెప్పితిని మును - మూడు విధముల
త్యాగ విషయము - వీను అర్జున !!
యజ్ఞ దాన - తపో కర్మల
విడువకూడదు - చేయదగునవి
యజ్ఞ దాన - తపోకర్మలు
పవిత్రుల జేయు - పండితులను
వీడి ఫలమును - విడిచి సంగము
చేయదగునవి - కర్మలెల్లను
తెలియు మిద్యది - ఉత్తమంబగు
నిశ్చయంబిది - నాదు మతముగ
వేదములచే - నియమితంబగు
ఎల్ల కర్మల - విడువగూడదు
అజ్ఞానముచె - విడిచిపెట్టిన
అట్టి త్యాగము - 'తామసంబగు'.
కాయకష్టపు - భయము చేతను
దుఃఖ మొదవును - అన్న దిగులుతో
నియతకర్మల - వదలు త్యాగము
'రాజసంబగు' - ఫలము జెందరు.
చేయదగియెడి - నియత కర్మల
చేయబడియెడి - ఫల, సంగముల
త్యాగమేదో - దాని 'సాత్విక'
త్యాగ మంచును - నిశ్చయించి రర్జున!

సత్యశాలియు - పండితుండును
త్యాగశీలియు - నిస్సంశయుడు
అశుభ కర్మల - ద్వేషమందడు
శుభకర్మలను - రక్తిజెందడు.

'కర్మ పూర్తిగ - వదల సాధ్యము
కాదు, దేహ - ధారుల, కర్జున!!
ఎవడు కర్మల - ఫలము విడుచునో
పిలుతు రాతని - 'త్యాగి' యంచును.

సుఖము, దుఃఖము - మిశ్రమములన
మూడు విధముల - కర్మఫలముల
నొందుచుందురు - దేహమిడిచియు
ఫలాసక్తులు; - ఫల త్యాగులు
కర్మఫలముల - పొందరెపుడు.

సర్వ కర్మలు - సఫలతగాంచ
సాంఖ్యమందున - హేతువులైదు
చెప్పబడియెడు - వాని వివరము
వినుము వీరుడ!! - తెలియ జెప్పెద.

"తనువు, రక్తము - ఇంద్రియంబులు
వేరు వేరగు - వాని క్రియలును.
దైవ మైదవ - కారణంబుగ
కర్మాచరణ - మందు చెపుదురు."

త్రికరణంబుల చేత మనుజుడు
చేయుచుండెడి - న్యాయాన్యాయ
కర్మలకెల్ల - ఈ ఐదును
కారణములుగ - తెలియు మర్జున!!

కర్మ కారణ - మిట్టు లుండగ
'తాను మాత్రమె - కర్తయంచని'
తలచు మూఢుడు - ఆత్మ; కర్మల
అసలు రూపము - తెలియ జాలడు.

తాను కర్తగ - తలప డెవ్వడు
తాక దెవ్వని - బుద్ధి కర్మల
సర్వ ప్రాణుల - నతడు చంపియు
కర్త గాడతడు - వాస్తవమునకు
కర్మ బంధము - అందడాతడు.

'తెలివి', 'తెలియ దగియెడు వస్తువు'
'తెలియువాడన' - కర్మ హేతువు
మూడు విధములు-'సాధన', 'క్రియ'
'కర్త'లన; కర్మ - కాధారము
చెప్పబడియెడి - మూడు విధములుగ.

సాంఖ్యమందును - గుణభేదముచె
జ్ఞాన, కర్త - కర్మలెల్లను
చెప్పుచుందురు - మూడు విధముల
వినుము చెప్పెద - వాని రీతుల

సర్వభూతము - లందు వెలిగెడి
ఆత్మ వస్తువు - నాశరహితము
అవిభాజ్యము - ఏకమంచును
ఎరుగు జ్ఞానము - 'సాత్వికంబగు'.
సర్వ ప్రాణుల - వేరు వేరుగ
గల్గు జీవుల - వేరు వేరుగ
నెరుగు నెవ్వడు - అట్టి జ్ఞానము
తెలియ బడియెడి - 'రాజసంబని.'
హేతు వెంచక - తత్వ మెరుగక
ఎవడు చూచునొ - ఒక్కదాననె
సర్వమదియని - అల్పఫలమిడు
అట్టి జ్ఞానమె - 'తామసంబగు'.
వీడి సంగము - విడిచి ఫలమును
రాగద్వేషా - దులను, వదలుచు
చేయు శాస్త్ర - బోధిత కర్మయె
చెప్పబడియెడి - 'సాత్వికంబని'
ఫలము గోరుచు - అహము విడువక
అధిక శ్రమతో - స్వార్థమునకై
ఆచరించెడి - వాని కర్మయె
'రాజస కర్మగ' - చెప్పబడియెడి

కర్మచేతను - కలుగు దుఃఖము,
నాశ, హింసలు - తనదు శక్తియు
తలపక, మోహ - వశమున చేయు
కర్మ, తామస - కర్మగ తెలియు
వీడి సంగము - విడిచి అహమును
ధైర్యోత్సాహ - ములను, విడువక
జయాపజయము - ల లెక్కగొనక
కర్మనెవ్వడు - చేయుచుండునో
వాని 'సాత్విక - కర్త' యందురు.

రాగయుతుడై - ఫలము గోరుచు
శుచియు గాకను - హింస, లోభము
హర్ష, శోకము - లందు నెవ్వడు
'వాని రాజస - కర్త' యందురు

బుద్ధి నిలకడ - లేనివానిని
వినయ వివేక - శూన్యుని; మోస

కారిని, దుఃఖి - సోమరి, దీర్ఘ
సూత్రుని, క్రూరు - దైనవానిని
తామస కర్త - యంచు చెపుదురు.

మూడు గుణముల - ననుసరించియు
బుద్ధి, ధృతులవి - యొప్పచుండును
మూడు విధముల - తెలియు మర్జున॥
మడివెదను, విను - వాని పూర్తిగ.

కర్మమార్గము - జ్ఞానమార్గము
చేయదగినది - చేయదగనిది
భయాభయముల - బంధ, ముక్తుల
తెలియు బుద్ధియె - 'సాత్వికంబగు'.

ధర్మా ధర్మ - కార్యా కార్యము
లెవని బుద్ధి - గాంచు భ్రాంతిచె
నొందు విధముగ - తెలియు మాతని
బుద్ధి 'రాజసం' - బనుచు పార్థా॥

తమస్సుచేత - కప్పబడుచును
తలచు నెవ్వని - బుద్ధి, ధర్మమె
అధర్మముగను - విషయమునెల్ల
విపరీతముగ - వాని బుద్ధియె
తెలియు పార్థా॥ - 'తామసంబగు'.

ఎట్టి ధృతిచే - మనసు, ప్రాణేం
ద్రియ క్రియలను - విషయముల దరి
జేర నీయక - యోగధారణ
నిలుపు, ఆ ధృతి - 'సాత్విక
మగును' - పార్థా॥

ఎట్టి ధృతిచే - ఫలము గోరుచు
ధర్మార్థ కామ - ము లాసక్తితో
గాంచు చుండునో - వాని ధృతియె
'రాజసంబని' - వచింపబడునుపార్థా॥

ఎట్టి ధృతిచే - చెడ్డమనుజుడు
నిద్ర, భయమును - దిగులు, తాపము
మదము విడువక - యుండు నెప్పుడు
అట్టి ధృతియె - 'తామసమగును'-
పార్థా॥

అభ్యాసముచె - ఎట్టి సుఖమున
మనుజు, డానంద - మగ్నుడగుచును
దుఃఖ శాంతిని - లెస్స పొందునో
అట్టి సుఖమది - మూడు విధములు
వాని తెలిపెద - వినుము. అర్జున॥

ఆరంభమున - విషము బోలుచు
గడువకాలము - అమృతంబగు
నిర్మల బుద్ధి - గల్గు సుఖమది
చెప్పబడియెడి - 'సాత్వికంబని'.

విషయేంద్రియ - సంయోగమున
జెందు సుఖమది - ఆరంభమున
అమృతముబోలి - గడువ కాలము
విషముబోలెడి - అట్టి సుఖమది
చెప్పబడియెడు - 'రాజసంబని'.

నిద్ర, ప్రమత్తత - అలసత్వమున
జెందు సుఖమది - మొదలు చివరల
మోహ భ్రాంతుల - కలుగచేయుచు
చెప్పబడియెడు - 'తామసంబని'.

ప్రకృతి గల్గు - మూడు గుణములు
పొందియుండని - వస్తువేదియు
దివిని, భువిని - దేవతలలో
ఎచటనైనను - ఉండబోవదు.

బ్రాహ్మణ, క్షత్రియ-వైశ్య,శూద్రుల
కర్మలెల్లను - వారి వారి
స్వభావమునను - పుట్టు గుణముల
వేరు వేరుగ-విభజింపబడె.పరంతప॥

శమము, దమమును-తపము, శౌచము
శాంతి, త్రికరణ - శుద్ధి గల్గుట
జ్ఞాన, విజ్ఞాన - ఆస్తిక్యములు
సహజ కర్మలు - బ్రాహ్మణులకును.

యశము, శూరత-ధృతియు, శక్తియు
సమరమందున - స్థిరతనుండుట
దానము, ప్రజల - నేలు నేర్పును
సహజ కర్మలు - క్షత్రియులకును.

కృషియు, గోర - క్షణ, వర్తకము
సహజ కర్మలు - వైశ్యులకును
సేవారూప - సకల చర్యలు
సహజకర్మలు - శూద్రులకును

సహజ కర్మల - శ్రద్ధ చేసెడి
మనుజు డుండును - జ్ఞానయోగ్యత
స్వధర్మ నిరతి - అట్టి యోగ్యత
అందుకెట్లో - వినుము చెప్పెద.

సర్వ ప్రాణులు - ఎవని చేతను
ప్రభవమందునో - విశ్వమెవనిచె

వ్యాప్తిగాంచునో - ఆ పరమాత్మ
స్వకీయ కర్మ - సర్చ చేయుచు
జ్ఞాన సిద్ధిని - పొందు మనుజుడు.

తనదు ధర్మము - తక్కువైనను
బాగ చేసెకి - పరధర్మమును
మించు శ్రేష్ఠత - తన స్వధర్మము
చేయు నాతడు - పాపమందడు.

దోషమున్నను - సహజకర్మల
తొలగియుండుట - కాదు యుక్తము
అగ్ని పొగచే - కప్పబడినటు
అన్ని కర్మలు - దోషయుతములు.

సర్వ విషయముల - విడిచి సక్తత
మనసు గెలుచుచు - వీడి కోర్కెల
సంగముడుగుచు - ఉత్తమంబగు
నైష్కర్మ్యసిద్ధి - పొందు మనుజుడు.

కర్మసిద్ధిని - పొందు నాతడు
బ్రహ్మమేగతి - గాంచగల్గునో
జ్ఞాన నిష్ఠకు - ఏది పరమో
సంగ్రహంబుగ - చెప్పు దర్జున॥

పరిశుద్ధమగు - బుద్ధి గల్గియు
సాత్విక ధృతి - మనసు నిలుపుచు
వదిలి యింద్రియ - విషయసుఖముల
రాగద్వేషముల - విడుచువాడును-

ఏకాంతమున, - వాసముండుచు
మితాహారము - తీసికొంచును
త్రికరణములను - నిగ్రహించుచు
నిత్యముండుచు - ధ్యాన యోగము
లెస్స వైరాగ్య - మూనువాడును.

అహము,దంభము,-బలము,కోర్కెలు
వస్తు సంగ్రహణ-క్రోధ; మిడచియు
వదలి మమతను - శాంతి పొందెడి
వాడు, బ్రహ్మము - నొంద నర్హుడు

బ్రహ్మభూతుడు - నిర్మలంబగు
మనసు గల్గియు - దుఃఖ మందక
దేని కోరక - సర్వ ప్రాణుల-
సమత గాంచుచు - నా యందలి
పరమ భక్తిని - పొందు చుండును.

భక్తివలనను - నాదు శక్తిని
నాదు తత్వము - నిశ్చయంబుగ

తెలియు మనజుడు - తెలిసి బాగుగ
చివర కాతడు - నన్నె జేరును.

సర్వ కర్మలు - సదా చేసియు
'నన్నె శరణని' - నాదు కరుణచె
నాశరహితము - శాశ్వతంబగు
అవ్యయపదము - అందు నాతడు.

సర్వ కర్మల - ఫలము నాకై
సద్బుద్ధిచే - సమర్పించుము,
నాదు నెలవును - జేరుకొఱకై
ధ్యానయోగము - చేత సర్వద
నాయందుననె - నిలుపు చిత్తము.

మనసు నాయెడ - జేర్చితేనియు
నాదు కరుణను - దాట గల్గుదు
సంసార దుఃఖ: - మట్లు సేయక
అహము చేతను - నాదు మాటలు
వినని యెడలను - నాశమందుదు.

అహము పేరక - "చేయనివనే
సమరమనినను" - నీదు యత్నము
వ్యర్థ మయ్యెడి - నీ స్వభావమే
వియోగించెడి - యుద్ధమున నిను.

నీ స్వభావము - చేత గలిగిన
నీదు కర్మచె - బద్ధుడవగుదు
దేని చేయగ - మోహవశమున
నిచ్ఛగించవొ - దాని చేసెదు
కర్మాధీనుడ - వగుచు నర్జున!!

ఈశ్వరుండదె - సర్వ ప్రాణుల
హృదయసీమల - నిలిచి అర్జున!!
యంత్ర మెక్కిన - వాని బోలెను
తనదు మాయచె - త్రిప్పుచుండును.

అన్నివిధముల - ఆ ఈశ్వరునె
శరణు పొందుము - అతని కరుణచె
పరమ శాంతిని - శాశ్వతంబగు
పరమ పదవిని - పడయుదర్జున!!

ఈ విధంబుగ - అతిరహస్యపు
జ్ఞాన మంతయు - తెలియజెప్పితి
నీకు పార్థా!! - తెలిసి, బాగుగ
విమర్శించియు - ఆచరింపుము
నీదు యిష్టము - అనుసరించియు.

అతిరహస్యము - శ్రేష్ఠమయ్యెడి
నాదు పలుకులు - వినుము మరలను
నాకు ఇష్టుడ - వగుట అర్జున!,
మరల చెప్పుదు - హితము గోరుచు.

నాపై మనసు - నిలుపు మర్జున!!
నాకె భక్తుడ - వగుము పార్థా!!
నన్ను గూర్చియె - అర్చసేయుము
నాకె వందన - మిడుము కిరీటి!!

నన్నె పొందుదు - నీవు తప్పక
నా కిష్టుడవు - ప్రతిన జేసియు
సత్యమాడెద - నమ్ము విజయా!!

సర్వ ధర్మము - విడిచియైనను
శరణు పొందుము - నన్నె పార్థా!!
పాప పుంజము - నీడి మోక్షము
బడసె దర్జున!! - దుఃఖ మెందుకు

నీకు చెప్పిన - ఈ, గీతా
శాస్త్ర మియ్యది - "తపసి, భక్తుడు
గాని వానికి - నన్ను నిందను
జేయువానికి - వినుట కిష్టము
లేనివానికి - జెప్పకెప్పుడు."

అతి గోప్యమగు - ఈ గీతా
శాస్త్రమంతయు - నాదు భక్తుల
కెవడు చెప్పునో - నాకు ఉత్తమ
భక్తుడగుచును - సందియమిడచి
అతడు నన్నే - పొందగల్గును

మనుజు లందున - అతనికంటెను
నాకు ప్రియమును - చేయదెవ్వడు
కలుగ బోవడు - ఇష్ట దెవ్వడు
కంటెను - ఈ లోకమున

ధర్మయుతమగు - మన సంవాద
మధ్యయనము - చేయు నెవ్వడు
అట్టి వానినె - జ్ఞానయజ్ఞము
చేత బాగుగ - నే నర్చన
చేయబడిన - వాడనగుదునని
తెలియు; మియ్యది - నా నిశ్చయము.

వీడి అసూయ - శ్రద్ధతోడను
ఎవడు వినునో - ఈ గీతను
విడిచి పాపము - పొందు నాతడు
పుణ్య కార్యము - చేయువారల
పుణ్యలోకము - నిశ్చయంబుగ.

నాదు బోధను - ఏకాగ్రతతో
నీ వింటివా? - చెప్పు మర్జున!!
అజ్ఞానముచె - కలుగు మోహము
దాన పూర్తిగ - నాశమందెన?

అర్జున ఉవాచ:—

వీడె మోహము - కలిగె జ్ఞానము
నీదు కరుణను - నాకు అచ్యుత!!
నాకు గల్గిన - సందియంబులు
నాశమయ్యెను - నీదు ఆజ్ఞను
అనుసరించుదు - నడచుకొందును.

సంజయ ఉవాచ:-

ఈ విధంబుగ - కృష్ణార్జునుల
మధ్య నడచిన - అబ్బురంబగు
పులకలెత్తెడి - సంవాదమును
వింటి బాగుగ - అంబికేయుడ!!

వ్యాసమునీంద్రు - కరుణ చేతను
అతిగోప్యమును - ఉత్తమంబగు
యోగ శాస్త్రము - అర్జునకై
బోధ చేసెడి - యోగికృష్ణుని
వలన వింటిని - నే స్వయంబుగ.

కౌరవేశ్వర!! - ఆశ్చర్యమును
పావనంబగు - కృష్ణార్జునుల
సంవాదమును - తలచి తలచియు
మాటి మాటికి - బాగుగానే
ఆనందమును - పొందుచుందును.

శ్రీ కృష్ణుని - అద్భుతంబగు
విశ్వరూపము - తలచి తలచియు
విస్మయానందముల నందెద
మాటిమాటికి - కౌరవేశ్వర!!

ఎచటనుండునో - యోగికృష్ణుడు
ఎచటనుండునో - ధన్విపార్థుడు
అచట లక్ష్మియు-జయము, ధైర్య:
ఐశ్వర్య, నీతులు - నిలకడ నంది
యుండు నటంచు - నే దలంతును.

(గీతాగేయాలు సమాప్తం)

గేయ

చీమకుర్తి వేంకటేశ్వర్లు

ముందుమాట : క్రింది వాక్యాలు వ్రాసినతను ఆధ్యాత్మిక వికాసం కావాలనుకొనే వ్యక్తి. ఆధ్యాత్మిక వికాసానికి ద్వేషం అనే గుణం అడ్డుపడేట్లు మరింకేదీ అడ్డుపడదనే అభిప్రాయం కలవాడు. కాబట్టి క్రింది మాటలు ఏ వర్గం మీద ద్వేషంతో వ్రాసినవి కావని మనవి. కేవలవిషయదృష్టితో (Objectively) మాత్రమే వ్రాసినవి.

ఈనాడు భారతదేశం హిమాలయం నుండి కన్యాకుమారి పర్యంతం ఒక దేశంగా ఉన్నది. ఈ విధంగా దేశం మొత్తం ఒక ప్రభుత్వ వ్యవస్థ క్రింద ఉండడం మన అదృష్టం. ఇది ఎలా సాధ్యమైంది? దేశంలో హిందువులు అధిక సంఖ్యలో ఉండడం వల్ల సాధ్యమైంది. మహమ్మదీయులు అధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాలు దేశం నుండి విడిపోయిన సంగతి ఒకటి చాలు, పైన మనం చేసిన సిద్ధాంతాన్ని నిరూపించుకోడానికి. క్రైస్తవులు అధిక సంఖ్యలో ఉన్న నాగాలాండ్ మిజోరామ్ మొ॥ ప్రాంతాల్లో విడిపోవాలనే ధోరణి బలంగా ఉన్న సంగతి కూడ మన సిద్ధాంతాన్ని నిరూపించే విధంగానే ఉన్నది. కాశ్మీరులో ముస్లిములు అధిక సంఖ్యలో ఉన్నా గత్యంతరం లేక దేశంలో భాగంగా ఉన్నారు. అయినా ఆ రాష్ట్రం దేశానికి ఒక విడని సమస్యగానే ఉంటున్నది. ఇదంతా చూసినప్పుడు రాజకీయదృష్ట్యా ఆలోచించినా ఈ దేశానికి హిందూమతం ఎంత అవసరమో స్పష్టం. దేశంలో ఎంతవరకు హిందువులు అధిక సంఖ్యాబలాన్ని కోల్పోకుండా ఉంటారో అంతవరకే ఇక్కడ సెక్యులరిజమ్, డెమోక్రసీ, సోషలిసమ్ అనే పెద్ద పెద్ద పదాలు మాట్లాడే అవకాశం ఉంటుంది రాజకీయనాయకులకి. తరువాత నోరు తెరవడానికి వీలుండదు. కాబట్టి అన్ని రాజకీయపక్షాలు స్వార్థదృష్టితోనైనా ఈ విషయంలో జాగ్రత్త వహించవలసిన అవసరం ఉంది. ప్రతి రాజకీయపక్షానికి దేశం ఒకటిగా ఉండాలని, ప్రజాస్వామ్యం ఉండాలని, సెక్యులరిజమ్ ఉండాలని కాంక్ష ఉన్నది కదా! కాబట్టి వారికున్న కాంక్షలకు ఆఘాతం కలిగే పరిస్థితులు రాకుండ జాగరూకత వహించాల్సిన బాధ్యత కూడ ఉంది. అన్ని రాజకీయపక్షాలను త్వరలో మ్రింగే అపాయాన్ని గుర్తించి అందరికి వర్తించే ఆ అపాయాన్ని ఎదుర్కోవడానికి వాళ్ళు సంసిద్ధపడాలి. ఈ సామాన్య అపాయ విషయంలో, అన్ని విభేదాలు మరిచి కలసికట్టుగా పనిచేయాలి. దేశంలో హిందూమతం అధిక సంఖ్యను కోల్పోయే అపాయం రెండు విధాలుగా కనబడుతున్నది. (1) హిందువులకు మాత్రమే వర్తిస్తున్న కుటుంబ నియంత్రణ వల్ల, (2) హిందువులను మతం మార్పు చేసే ప్రయత్నాల వల్ల. అపాయం ముంచుకు వచ్చేంత దగ్గరలో లేదనుకోండి! అయినా అలానే వదలిపెత్తే ఎప్పుడో ఒకరోజు అపాయం రానే వస్తుంది. హిందువులు అధిక సంఖ్య కోల్పోనవసరం లేకుండానే కూడ అపాయం మరో విధంగా వస్తుంది. ఇప్పుడు మైనారిటీగా ఉన్న సెమిటిక్ మతస్థులు రానురాను సంఖ్యాబలం కూర్చుకుంటూ నలబై శాతం అవుతారనుకోండి అప్పుడు దేశంలో నిశ్చయంగా అంతఃకలహాలు పెచ్చు పెరుగుతాయి. సుఖశాంతులు లోపిస్తాయి. (ఉదా॥ ఇప్పటి అస్సామును చూడండి.) హిందూమతానికి భూమి మీద ఈ ఒక దేశమే కాబట్టి ముంచుకువస్తున్న అపాయాన్ని చూస్తూ హిందువులు ఊరక కూర్చోరు. ఊరికి ఒక పరశురాముడు తలెత్తినా ఆశ్చర్యపడవలసిన అవసరం ఉండదు! కాని అటువంటి దారుణ పరిస్థితులు రాకుండ దేశంలో అన్ని

వర్గాలు సుఖశాంతులతో వర్ధిల్లాలంటే రాజకీయ నాయకులు ఇప్పటికుండే గట్టి చర్యలు భయపడకుండ తీసుకోవాలి. కుటుంబ నియంత్రణ అన్ని మతస్థులకు వర్తింపచేయాలి. ఈ విషయంగా రాజ్యాంగ చట్టాన్ని మార్చాలి. విధిగా అందరూ కుటుంబ నియంత్రణ పాటించేట్లు చూడాలి. ఒక హిందువులు మాత్రమే దాన్ని పాటిస్తూ తక్కిన వారు మాతం పేరుతో తప్పించుకొనే అవకాశం ఇవ్వరాదు. వివాహాది విషయాల్లో కూడ అందరికి ఒకే చట్టమే ఉండాలి. "భారత దేశ పౌరులుగా ఉన్నవాళ్ళందరూ రాజ్యాంగ చట్టానికి లొంగి తీరవలసిందే. ఇష్టంలేని వాళ్ళు మరో దేశం వెతుక్కోవచ్చు" అని ఖచ్చితంగా చెప్పగలగాలి.



## మానవాతీత శ

నామసేన చక్రవర్తి హరికృష్ణ

తన వయస్సు 14 సంవత్సరాలని చెప్పుకున్న పిల్లవాని రచన యిది. అతణ్ని సంతోషపఅచే ఉద్దేశంతో దీనిని ముద్రిస్తున్నాము. రచన బాగానే ఉన్నది. కాని కట్టువాడు కనీసం హైస్కూలు చదువు తీరేంతవఅకైనా కొంత ఓపికపట్టితే మంచిది. దీన్ని ముద్రించడం చూసి తక్కిన బాల రచయితలు కూడ రచనలు పంపుతారేమో అనే సంకోచం లేకపోలేదు. కాబట్టి అట్టి బాల రచయితలకు ఒక చిన్న మాట. చాక్లెట్లిచ్చి మిమ్మల్ని సంతోషపఅస్తాంగాని రచనలు ముద్రించి సంతోషపఅచడం సాధ్యం కాదేమో!

మానవులకు అతీతమైన శక్తులు చాలా ఉంటాయి. హిప్నాటిజమ్, టెలిపతి...ఇంకా ఎన్నో వివిధ రకాలయిన అతీత శక్తులు మానవునిలో గుప్తంగా దాయబడి ఉండి, కొద్ది మందిలో అవి ప్రకటితమవుతుంటాయి.

మానవాతీత శక్తుల సంఖ్యా పెరుగుతోందేమో తెలియదు. కాని ఇటీవల మానవాతీత శక్తుల జాబితాలో ఒకసంఖ్య పెరిగినట్టుగా విశదమవుతోంది.

ఆ శక్తి, నిన్నమొన్నటివరకు దాదాపు అందరి దగ్గిరా ఉండేది. కాని ప్రస్తుతం అది దాని యొక్క పవిత్రతను చాలా భాగం పోగొట్టుకొని, మానవాతీత శక్తుల జాబితాలో చేర్చబడింది!

ఇలా క్రొత్తగా చేర్చబడిన మానవాతీత శక్తి...'ఆలోచన'......!

అంటే 'ఆలోచనాశక్తి' మానవాతీతమైనదన్న మాట!

ఇలా అంటే ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోగలరు!

'ఆలోచన' అనే శక్తి సామాన్యం, సాధారణం అని అందరి ఉద్దేశ్యం.

ఎందుచేతనంటే "మానవుడు ఆలోచించే శక్తిగల గొప్ప జంతువు" అని ఏనాడో పెద్దలు స్థిరీకరించారు.

మరి అలాంటి 'ఆలోచన', మానవాతీత శక్తి జాబితాలోనికి ఎలా త్రోయబడింది?

"ఒక శక్తి, పవిత్రమైన సంబంధాన్ని కోల్పోతే దాని స్థానం దిగజారి పోతుంది. ఆ 'శక్తి' పవిత్రంగా ఉన్నంతవరకే దాని స్థానం...

లేకుంటే లేదు." ప్రస్తుతం సంఘంలో 'ఆలోచన అనే శక్తికి' ఉన్న పవిత్రతను నశింప జేస్తున్నారు. ఎలా? ఏమి చేస్తున్నారో మనకు తెలుస్తూనే ఉంది. వారికి ఉన్న 'ఆలోచన' అన్న శక్తిని ఎన్నోరకాల దుష్టకార్యాలను నెరవేర్చే ఉద్దేశ్యాలకు వాడుకుంటున్నారు. తమకు 'లాభం' కావాలని వ్యాపారస్థులు చాలామంది ఇతరుల ప్రాణాలకు, ఆరోగ్యానికి ఏమి ముప్పు వస్తుందోనని కూడా చూడక 'కల్తీలు' వగైరా చేస్తారు కొందరు దోచుకో వాలనుకుంటారు. వారికి ఆ అవసరం లేకున్నా మరెందుకో వాళ్ళు తమ 'ఆలోచనా శక్తిని' ఆ మార్గాల్లో మళ్ళిస్తారు.

అలా కొన్ని దుష్టకార్యాలను నెరవేర్చా లన్న మార్గంలో 'ఆలోచనాశక్తి'ని వారు ప్రవేశపెట్టడం వల్ల, వారికి ఆత్మసంతృప్తి సంకోచిస్తుంది. అడుగడుగునా 'భయమే' చోటు చేస్కుంటుంది. వారికి ఆనందదాయక మైన సంఘటనలు అంటే ఆనందింపవలసిన సంఘటనలు పొరపాటున సంభవించినా వారు దానిని ఆనందంగా గడపలేని నిస్సహాయతను కలిగి ఉంటారు.

సమాజంలో 'అందరూ ఇలాంటి వారే'నని నేను చెప్పను. ఎందుచేతనంటే అందరూ ఇలాగే ఉంటే దేశం మొత్తం... ఇలాంటి భావాలే కల్గి ఉన్నట్టుగా...నవ్వు లేని మొహంతో—ఓరకంగా 'మోడు వారిన చెట్టులా'...ఉంటుంది.

కాని ఇలాంటి భావాలు చిన్నచిన్నగా అభి వృద్ధి చెందడానికి 'ప్రయత్నం మాత్రం' చేస్తున్నాయి.

ఇలాంటి భావాలు సమాజంలో దృఢంగా నాటుకోకముందే వాటిని ఆ భావాలనుండి వేరు చేయాలి. ఒకసారి ఒక వ్యక్తి తన 'ఆలోచన'ను ఒక మార్గంలో ప్రవేశపెడ్తే ఆవ్యక్తి ఆ భావాలనుండి వేరుపడటం అసాధ్యం కొన్ని సమయాల్లో, వ్యక్తుల ఆత్మ నిగ్రహాము ననుసరించి మాత్రం సాధ్యపడుతూ ఉంటుంది

"శిశువు పెరిగి పెద్దదవుతున్నకొద్దీ, అతని పరిసరాలలో ఇలాంటి భావాలు మచ్చుకైనా లేకుండా, ఉన్నా ఆ ప్రభావం ఆ శిశువు మీద పడకుండా రక్షించాలి.

అంటే అలా చేస్తే, శిశువు తన 'ఆలోచనా శక్తిని' అపవిత్రం పాలు చేసుకోనకుండా, పవి త్రంగా ఉంచుకొనడానికి కావలసిన చేయూతను ఇచ్చినవారమౌతాము.

'దోపిడీ' చేయాల్సిన అవసరం లేకున్నా కొందరు చేయాలనుకుంటారు అన్నదానికి ఈ మధ్యనే బ్యాంకును దోపిడీ చేయ ప్రయత్నించి, చేసి, పట్టుబడ్డ సుశీల్ సందీప్...ఉదాహరణ.

ఓ చక్కని ఉదాహరణకు సుశీల్ సందీప్ యొక్క ఇరవై రెండేళ్ళ జీవిత చరిత్రలో కొంత భాగం మాత్రమే చాలు!

నిజానికి, 'మానవుడు' అన్న వాడికి 'ఆలోచనా శక్తి' తప్పకుండా ఉంటుంది. కాని ప్రస్తుత సమాజంలో చాలమంది నామమాత్రానికి మాత్రం 'మానవునిగా' వ్యవహరించడం 'విధి' లేక మానవులు వారిని మానవ జాబితాలోనే చేర్చుకోవడం జరుగుతోంది!

'ఆలోచన' పవిత్రస్థానాన్ని పోగొట్టుకోవడం చేత అది అలాంటి 'మానవులకు' దూరమైంది. అంటే 'పవిత్రమైన ఆలోచనాశక్తి' 'మానవా తీత శక్తిగా పరిణామము' చెందింది.

కనుక ప్రస్తుతకాలంలో మానవాతీతశక్తి ఏది...పవిత్ర ఆలోచన! పరిశుద్ధ ఆలోచన!...

'ఆలోచనకు పవిత్రత నివ్వాలి! అప్పుడు ఆత్మసంతృప్తితోపాటు అతీతశక్తియైనపవిత్ర ఆలోచనకు ఓ ఉన్నతస్థానం దక్కుతుంది"
— "నా అభిప్రాయాలతో ఏకీభవించగలరా!

# జాతీయాభివృద్ధికి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నూతన కార్యక్రమం

ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో నూతన 20 అంశాల కార్యక్రమాన్ని దీక్షతో, సమధికోత్సాహంతో అమలు జరిపేందుకు ఆంధ్రప్రదేశ్ పునరంకితమవుతున్నది.

## 20 అంశాల కార్యక్రమ వారోత్సవాలు 1982 ఫిబ్రవరి 1 నుంచి 7 వరకు

**పంచాయతిరాజ్ దినోత్సవం: ఫిబ్రవరి 1 1982.**

• నీటిపారుదల సదుపాయాలు అధికం చేయడం. • జాతీయ గ్రామీణ ఉపాధి కల్పన కార్యక్రమం అమలు. • నీటి ఎద్దడి గ్రామాలన్నిటికీ మంచినీటి సరఫరా.

**వ్యవసాయ దినోత్సవం: ఫిబ్రవరి 2, 1982.**

• మెట్ట వ్యవసాయాన్ని అభివృద్ధి పర్చడం. • పప్పుదినుసులు, నూనెగింజల అధికోత్పత్తి. • సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాల అమలు. • అడవుల పెంపకం, సామాజిక అటవీ పథకం, వ్యవసాయ అటవీ పథకాలను ముమ్మరం చేయడం. • నిత్యావసర వస్తువుల పంపిణీ విధానాన్ని పటిష్ఠం చేయడం.

**సాంఘిక సేవల దినోత్సవం: ఫిబ్రవరి 3, 1982.**

• కుటుంబ నియంత్రణను ప్రోత్సహించడం. • ప్రాథమిక ఆరోగ్య సౌకర్యాలు విస్తృత పర్చడం. • కుష్ఠు, క్షయ, అంధత్వం నివారణ. • బాలికల విద్యపట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తూ. అందరికీ ప్రాథమిక విద్యా సౌకర్యాలు విస్తరింపచేయడం. • వయోజన విద్యావ్యాప్తి. • విద్యార్థులకు పాఠ్యపుస్తకాలు, నోటుపుస్తకాలు సరఫరా.

**పరిశ్రమల దినోత్సవం: ఫిబ్రవరి 4, 1982.**

• ప్రత్యామ్నాయ ఇంధన వనరులు, బయోగ్యాస్ అభివృద్ధి. • పరిశ్రమలలో పెట్టుబడి పద్ధతులను సరళం చేయడం. • పారిశ్రామిక విధానాలను క్రమబద్ధం చేయడం. • చేతివృత్తులు, చేనేత, చిన్నతరహా గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి. • ప్రభుత్వ రంగ సంస్థల పనితీరును మెరుగు పర్చడం.

**బలహీనవర్గాల దినోత్సవం: ఫిబ్రవరి 5, 1982.**

• వెట్టిచాకిరి నుండి విముక్తి పొందిన వారి పునరావాసం. • షెడ్యూలు కులాలు, తెగల అభివృద్ధి పథకాలను ముమ్మరం చేయడం. • ఇళ్లు లేని గ్రామీణ పేదలకు ఇళ్ళ స్థలాల పంపిణీ. • గ్రామీణ పేదలకు గృహ నిర్మాణ సహాయం విస్తృతం చేయడం. • మురికివాడలలో పరిసరాల పారిశుద్ధ్య కార్యక్రమం అమలు. • ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారికి గృహనిర్మాణ పథకాలు అమలు. • వ్యవసాయ కూలీలకు కనీసవేతనాల అమలు. • స్త్రీ, శిశు సంక్షేమానికి మరిన్ని పథకాల అమలు • పౌష్టికాహార పథకాలు ముమ్మరం చేయడం.

**భూముల పంపిణీ దినోత్సవం: ఫిబ్రవరి 6, 1982.**

• వ్యవసాయ భూ పరిమితిని అమలు చేయడం. • భూమి రికార్డుల తయారు. • భూముల ధర విపరీతంగా పెరగకుండా అరికట్టడం.

**నీటిపారుదల విద్యుచ్ఛక్తి దినోత్సవం: ఫిబ్రవరి 7, 1982.**

• నీటిపారుదల వనరుల అభివృద్ధి. • విద్యుదుత్పాదన గరిష్ఠ స్థాయి సాధించడం. • విద్యుచ్ఛక్తి మండలి పనితీరును మెరుగు పర్చడం. • గ్రామాలన్నిటికీ విద్యుత్సరఫరా.

"సత్యమేవ జయతే" అనేది మన జాతీయ సూక్తి. మన దైనందిన జీవితంలో 'శ్రమయేవ జయతే' అను మరో సూక్తి అనుసరించాలి. అవిరళకృషి, సత్యాన్వేషణకు అంకితం కావడం ద్వారానే గౌరవం, ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం."

శ్రీమతి ఇందిరాగాంధి,
ప్రధాన మంత్రి.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# శ్రీ రామకృష్ణ ప్రభ

విషయ సూచిక



## శ్రీ రామకృష్ణప్రభకు

చందాదారులుగా చేరండి - చందాదారులను చేర్పించండి.

ధన్యవాదాలు: తెనాలినుండి ఆళ్ళ గోపీరెడ్డి, నూజివీడునుండి ఎస్. ఎస్. రామచంద్రమూర్తి ఇప్పటివరకు చెరి నూటికి పైగా రామకృష్ణప్రభకు చందాదారులను చేర్పించినారు. పత్రికాముఖంగా వారికి మా ధన్యవాదాలు తెలుపుకొంటున్నాము.

## బేలూరు రామకృష్ణమఠము-మిషన్ పల్లిమంగళ్ కార్యక్రమము

రామకృష్ణమఠము - మిషన్ స్థాపించిననాటినుండియే సేవాకార్యక్రమములను చేపట్టి చేయుచున్ననూ 1980 లో గ్రామీణ సర్వతోముఖాభివృద్ధి నుద్దేశించి "పల్లిమంగళ్" అను నూతన కార్యక్రమమును చేపట్టినది. జయరాంబాటి, కమార్పుకూరు మరియు 15 గ్రామములలో ప్రథమముగా ఈ నూతన కార్యక్రమము ప్రవేశపెట్టబడినది. వ్యవసాయం, చేపలపెంపకం, పాడిపశువులపెంపకం, కోళ్ళపెంపకం, చేనేత, టోకువ్యాపారం, కుటీరపరిశ్రమలు, A. I. కేంద్రం-ఇత్యాదులతో 392 కుటుంబాలకు ఈ కార్యక్రమము ఇప్పటివరకు విస్తరించియున్నది. మొబైల్ మెడికల్ సర్వీస్ ద్వారా 35,000 మందికి వైద్యచికిత్సకూడ ఈ కార్యక్రమం క్రింద జరిగినది. పశువైద్య సదుపాయంకూడ కల్పించబడినది. రాత్రి పాఠశాలలు కూడ నడుపబడుచున్నవి. మార్చి 16 వ తేదీన పల్లిమంగళ్‌కి సంబంధించిన బాకరీని (Bakery) జయరాంబాటిలో స్వామి అభయానందజీ ప్రారంభించారు. సెక్షన్ 35 CCA ఆదాయపుపన్ను శాసనం పరిధికి చెందిన విరాళముల ద్వారా ఈ పల్లిమంగళ్ కార్యక్రమము నడచుచున్నది. మార్చి 1982 నాటికి సుమారు 6 లక్షలరూపాయలు ఈ కార్యక్రమము క్రింద వినియోగింపబడినది.

శ్రీః

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవబంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహా విష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర స్థలము సముద్రమట్టానికి మూడువేల అడుగుల ఎత్తున, ఆంధ్రప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణముతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పుచుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలుస్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ నుండి తిరుపతికి బస్సులుకూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధరాత్రివరకు బస్సులు రెండు కొండ దారుల మీదుగా మిమ్ములను తిరుపతినుండి తిరుమలకు తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొనవచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన అన్ని సౌకర్యములతోకూడివున్న దేవాలయపు ధర్మసత్రములు, అద్దె వసతిగృహాములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వర స్వామివార్ల దేవాలయాలను, తిరుచానూరులోనున్న శ్రీ పద్మావతీ అమ్మవారి దేవాలయమును యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని వేంకటేశ్వరస్వామివారి ఆలయము, నారాయణవనములోని కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయము, నాగలాపురంలోని వేదనారాయణ స్వామివారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవకార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన తక్కిన వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి




ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ

సంపుటము 39 1982 - మే సంచిక 5

# ప్రార్థన

దయామయా! సుఖవంతుణ్ణి కావటానికి నేనేది చేయలేదనీ? వివాహం చేసుకున్నాను. బిడ్డల్ని కన్నాను. ధనం సంపాదించాను. యశస్సు కోసం, కీర్తిప్రతిష్ఠల కోసం తంటాలు పడ్డాను. పదిమందిలో 'మంచివాడు' అని అనిపించుకోవటానికి తంటాలు పడ్డాను. కాని స్వామీ, నిజం చెప్పాలంటే, సుఖం కోసం ఎంత ఎక్కువ ప్రయత్నించానో, పరిణామంలో అంతకు మించి దుఃఖం, కష్టం అనుభవించాను. మనస్సు నెక్కడ పంపినా, అక్కడెల్లా మోసపోయాను. ఆశ ఎక్కడా ఫలించలేదు. చింత, భయం, నిరాశ, విషాదము - అన్నీ పెరిగాయి. ఎక్కడా దారి కన్పించలేదు. మార్గాలన్నీ మూతబడిపోయాయి.

నీవు కరుణించావు. నీ అనుగ్రహం వల్ల, నీ చరణములను ఆశ్రయించటంలోనే తప్ప మరెక్కడ వాస్తవసుఖం లేదన్న సంగతి విదితమయింది. నీ పాదముల నాశ్రయించటానికి కొంత ప్రయత్నించాను కూడ. ఇప్పుడుకూడా కొద్దో గొప్పో అట్టి యత్నం చేస్తుంటాను. అందువల్లే సుఖము, శాంతి, విశ్రాంతి లభిస్తున్నాయి. కాని దేవా! పూర్వాభ్యాస కారణంగ ఈ మనసు మరల మరల విషయములందే చిక్కుకొంటున్నది. అణచటానికి యత్నిస్తాను. అణగారిపోతుంది కూడ. కాని ఆ అలవాటు మాత్రం ఈ మనసు మరిచిపోలేకున్నది. నీ చరణకమలములందు తప్ప సర్వత్రా భయమే, భయం నిండియున్నది. దుఃఖాల కడలియే ఘోషిస్తున్నది. ఇవంతా తెలిసి, అర్థం చేసుకొని, గ్రహించి కూడ మనస్సు నిన్ను తప్ప. మరోవైపు వెళ్ళటం మానకున్నది. కరుణాహృదయ! ఇంతకంటె నా మనసు యొక్క నైచ్యం ఉంటుందా?

నీవు కృపాసాగరుడవు. నన్ను గమనించకుండానే, నీ కృపావీక్షణములతో దుష్టమైన ఈ మనసును నీవైపు ఆకర్షించుకో! దీన్ని పట్టి గట్టిగా బంధించు; మరెక్కడికీ వెళ్ళకుండా కట్టివేసేయి. స్వామీ! ఇలా ఎప్పుడు జరుగుతుంది? నీ చరణకమల దర్శనమందు నా మనసు ఎప్పుడు లీనమైపోతుంది? మనోహరమైన నీ రూపదర్శనంలో చూసి చూసి ఎప్పుడు కృతార్థత నొందుతుంది.

దయామయా! ఇక ఆలసించకు. జీవనసంధ్య సమీపమందే ఉన్నది. దీనికి మునుముందుగానే నీ దివ్యజ్యోతిచేత నా జీవితాన్ని ప్రకాశింపజేయుము. సముజ్జ్వలం చేసి నీ మందిరంలోకి గొనిపొమ్ము. సదా అక్కడే నిలచియుండేలాగున వరమిమ్ము. అనుగ్రహించుము.

[గీతాప్రెస్ వారి "ప్రార్థన" అనే చిన్నపుస్తకం నుండి]

# సంపాదకీయం - 8

"ఆధ్యాత్మికత అంటే ఏమిటి?" అనే విషయాన్ని స్వతంత్రంగా చెప్పడానికంటే ఉపనిషత్తు వాక్యాల వివరణరూపంలో చెబుదామని ఉంది. కాని ఆ వివరణలు చెప్పేటప్పుడు సాధ్యమైనంత వరకు భావస్వాతంత్ర్యం వహించి చెబుదామని ఉంది. గొర్రెదాటు పద్ధతిగా లేకుండ - పుస్తకాల్లో ఉన్న విషయాలనే ఒప్పజెప్పే ధోరణిగా లేకుండ ప్రసంగించాలని ఉంది. అతను అలా అన్నాడు ఇతను ఇలా అన్నాడు ఈ పుస్తకంలో ఇలా ఉంది ఆ పుస్తకంలో అలా ఉంది అని మాటిమాటికి ఇతరులు చెప్పిన వాక్యాలను ఉదాహరిస్తూ ప్రసంగం సాగించడం స్వతంత్ర ఆలోచనా రాహిత్యాన్ని సూచిస్తుంది. స్వతంత్ర భావాలతో ఐదు నిమిషాలు ప్రసంగించినా చాలు ఎంతో మేలు - ఎరవు తెచ్చుకొన్న భావాలతో గంటలకొలది ప్రసంగించడానికన్నా. ఈ రోజుల్లో ఆ పని మనం ఎందుకు చెయ్యాలి? టేప్స్, గ్రామఫోన్ రికార్డులున్నాయిగదా! పుస్తకాలవల్ల మనకు కలిగే మేలు చాల చాల తక్కువ. జీవితం నేర్పే పాఠాలే- ఆ పాఠాలు నేర్చుకోగలిగితే - మనకు చాల లాభం. పుస్తకాల వల్ల అందులోనూ మత గ్రంథాల వల్ల పరిణామం కలిగేటట్లుంటే ఎన్నడో ఈ భూలోకం స్వర్గధామం అయి ఉండాలి. మతగ్రంథాలు చదవనివాడు, విననివాడెవడు? అయినా ఈ లోకం ఎందుకు ఇట్లా నరకసదృశంగా ఉంది? ఆ మతగ్రంథాలు లేకపోతే ఇంకా అధోగతిగా ఉండేదనే మాట చెల్లదు. మతం పేరుతో జరిగిన అన్యాయాలు, దౌర్జన్యాలు, వంచనలు, రక్తపాతం- ఇంకే ఉద్యమం వల్ల జరగలేదు. అవి లేకపోయియుంటే లోకం కొంత మెరుగ్గానే ఉండేదనే మాట సత్యం. "తాను ఫలానా మతానికి చెందినవాణ్ణి" అనే ఒక గర్వభావం ఉంది చూడు అది ఒకటి చాలు సత్యానికి దూరమైపోవడానికి. ఈ భావాన్ని అంటిపెట్టుకున్నవాడెవడూ ఆత్మజ్ఞాని కాలేడు - ఆత్మజ్ఞాని కాకపోవడం అనే మాట ఎందుకు లౌకికరీత్యా సజ్జనుడుగా కూడ కాలేడు. ఆ ఒక భావం వలన తామరతంపరగా హృదయంలో అనేక అసుర గుణాలు అల్లుకుంటాయి. దానివల్ల ఏ దేవుడికీ (ఆయా మతాలకు వేరువేరుగా ఒక్కొక్క దేవుడున్నాడని ఆ అజ్ఞానులనుకున్నట్లు మనం కూడ అనుకొని ఏ దేవుడికీ అని చెప్పుకున్నాం) ప్రీతి కలుగదు. మన హృదయవికాసానికి కావలసినవి ఏవి? కరుణ, నిస్వార్థత, తృష్ణారాహిత్యం, నిర్భీతి ఇత్యాదులు. మతాలు, మతగ్రంథాలు, వాటి దేవుళ్ళు దెయ్యాలు మనకెందుకు? మతాలన్నీ ఒకే సత్యానికి వేరువేరు దారులని ఒక ఫేషన్ మాట లోకంలో ఉంది. మతాలన్నీ అసత్యానికి దారులని మారిస్తే ఆ ఫేషన్ మాటకు ప్రయోజనం ఉంటుంది. అన్నిమతాలు ఒకే సత్యానికి బాటలు అని అనుకోవలసిన అవసరం ఎందుకొచ్చింది? తన మతం గొప్ప తక్కినవి నాసిరకం అనే భావం హృదయంలో ఉన్నందున అటువంటి భావం సరికాదనే తెలివి కూడ ప్రక్కనే ఉన్నందున - ఈ విరుద్ధభావాలను సమన్వయం చేసుకొనే విధంగా అన్ని మతాలు ఒకే సత్యానికి చేర్చే బాటలు అని సిద్ధాంతం చేసుకుంటాడు. పరమత సహనం అలవర్చుకోవాలని భావిస్తుంటాడు. స్వమతాభిమానం ఉన్నంతవరకు ఎవడికీ పరమతసహనం అబ్బదు. పైకి ఉన్నట్లు నటించినా హృదయంలో అది లేకపోవడం ఎవడికి వాడికే తెలుసు. పరమత సహనాన్ని సంపాదించుకోడానికి ఇతర మత గ్రంథాలు పఠించడానికి కూడ పూనుకుంటాడు.

ఇంతకన్నా తెలివి తక్కువ పని మరొకటి లేదు. క్రైస్తవులను, మహమ్మదీయులను గౌరవించదలచుకున్నవాళ్లు బైబిలు ఖురానులను చదవకుండా ఉండడమే మంచిది! నేనింతవరకు వాటిని ఒక పేజీ కూడ చదవలేదు. అన్ని మత గ్రంథాలు అసత్యాలనే భావం నాలో ఎప్పుడు ప్రవేశించిందో గాని అప్పటినుండి ఆ భావం నాకెంతో ఉపకరిస్తున్నది. మతాలను సమర్థించే పుస్తకాలు చదవడానికి ఆసక్తి పోయింది. దానివల్ల ప్రయోజనకరాలైన తక్కిన పుస్తకాలను చదివే అవకాశం బాగా ఏర్పడింది. క్రైస్తవుడని, మహమ్మదీయుడని, హిందువని—ఈ విధంగా మానవులను మనోచట్రాల్లో బిగించి చూచే సంకుచితదృష్టి పోయి మానవులను మానవులుగా మాత్రమే చూచే దృక్పథం కలిగింది. మత గ్రంథాలు చదువుతూ కాలయాపన చేయడానికన్నా కళ్ళు తెరచి చుట్టూ చూస్తూ ఎన్నో విషయాలు నేర్చుకోవడం మంచిది. మన కళ్ళముందట గనిమ మీద ఒకడు నడుస్తూ జారిపడ్డాడనుకో, మనకేం తెలుస్తుంది? ఆ స్థలం జారుడుగా ఉంది, జాగ్రత్తగా నడవకపోతే ప్రమాదం అని తెలుస్తుంది. ఆ తెలియడం వల్ల అడుగులు జాగ్రత్తగా వేస్తాం. ఈ విధంగా లోకంలో జరిగే మంచిచెడ్డలను చక్కగా గమనిస్తూ ఉంటే మనలో మనకు తెలియకనే మంచి మార్పులు జరుగుతూ ఉంటాయి. ఏ ప్రయత్నం లేకనే మంచి మార్పులు మనలో కలుగుతూ ఉంటాయి. పూర్వాశ్రమంలో నేనొక తెలివితక్కువ పని చేశాను. పన్నెండువేల రూపాయలు ఖర్చుపెట్టి 6 ఏండ్లు కాలేజీల్లో కాలాన్ని పాడుచేశాను. ఆ సమయంలోనే ఒకసారి ఒక స్నేహితుడితో తిరుపతికి పోయాను. అజ్ఞానంవల్ల కొండమీదికి పోయేటప్పుడు దిగేటప్పుడు కూడ బస్సుల్లోనే ప్రయాణం చేశాము. నిదానంగా మెట్లమీద నడుస్తూ చుట్టూ కనిపిస్తున్న ప్రకృతి రామణీయకతను ఆస్వాదించకుండ అలా బస్సులో రయ్ మని పోవడం తలుచుకుంటే ఇప్పటికీ సిగ్గేస్తున్నది. సరే తిరుగు ప్రయాణంగా రేణిగుంట స్టేషన్‌లో రైలెక్కాము. రైలు కదలంగానే సంచినుండి ఒక ప్రసాదంలడ్డు పైకి తీసి సగం తుంచి నా మిత్రుడికిచ్చి సగం నేను తినడానికి ప్రారంభించాను. అతను ఆ సగాన్ని ఆ కంపార్టుమెంటులో చుట్టూ ఉన్నవాళ్ళందరికి పంచిపెట్టి తనూ కొంత నోట్లో వేసుకున్నాడు. ఇదంతా చూస్తున్న నాకు నేను తింటున్న లడ్డు చాల చేదనిపించింది. నేను చేసిన తప్పిదం కొట్టవచ్చినట్లుగా తెలియవచ్చింది. అదొక మరచిపోని గుణపాఠం. అప్పటినుంచి నా చేతికి వచ్చిన తినుబండారాన్ని—చిన్నదిగా ఉన్నా సరే—మొత్తాన్ని నేనే ఆరగించక దాన్ని తక్కినవాళ్ళకు కూడ పంచిపెట్టే గుణం స్వభావమై పోయింది. అంతకు ముందు మహాభారతంలో చదివాను: "మధుర భక్ష్యాలను తానే భక్షించకుండ ఇతరులతో పంచుకొని తినవలెను"—అని. కాని అది వట్టి చదువు. దానివల్ల నా ప్రవృత్తిలో మార్పు రాలేదు. నా మిత్రుని ప్రవర్తన అనే అద్దంలో నా ప్రవర్తనయొక్క లోపం స్పష్టంగా ప్రతిఫలించి నాకు అవగతం అయిన క్షణమే నాలో మార్పు తీసుకవచ్చిన క్షణం. మన జీవితం, మన జీవితసంబంధాలు, మన సంఘం, మన నడత, ఇతరుల నడత—ఇవన్నీ మన ప్రవర్తనా స్వరూపాన్ని ఉన్నదున్నట్లుగా చూచి తెలుసుకొనేదానికి అద్దాలుగా పనికివస్తాయి. అద్దంలో ముఖం చూస్తున్నప్పుడు ముఖం మీద ఏదైనా మరక కనబడితే వెంటనే అప్రయత్నంగా

దానిని తొలగిస్తాము. అదే విధంగానే మన ప్రవర్తనలో, ఆలోచనలో, మాటలో, నడవడిలో లోపాలు చక్కగా మనం చూడగలిగితే చాలు అవి అంతరించిపోతాయి. ఇక్కడ మనం చూసుకోవలసిన అద్దం, మన నిత్యసాంఘిక జీవనం - మన చుట్టూవున్న ఈ ప్రపంచం-అందులో మనం వ్యవహరించే తీరు-ఇవీ మన అద్దాలు. తెలివితక్కువగా కాలాన్ని వెళ్ళబుచ్చిన ఆ కాలేజి రోజుల్లో రెండేండ్లు ఒక ప్రైవేట్ హాస్టల్లో గడిపాను. ఆ హాస్టల్ నిర్వాహకులు పైకి చెప్పకపోయినా, ఆ హాస్టల్లో ప్రవేశాన్ని హిందువులకు మాత్రమే పరిమితం చేసేవాళ్ళు. అంటే అక్కడున్న 200 మంది అందరూ హిందూ కుఱ్ఱవాళ్ళే అన్నమాట. నేనున్న ఆ రెండేండ్లలో ఒక పిల్లవాడు ఆ 200 మందిలోనూ చాల మంచివాడనే పేరు సంపాయించుకొన్నాడు. అతను చాల మంచివాడు అని నేను కూడ ఒప్పుకొంటూ దాన్ని పదిమందికి చెప్పానేగాని ఆ మంచితనానికి మూలకారణం అయిన అతని నిత్యజీవిత నడత ఎలా ఉందో గమనించనేలేదు. అంత వివేకం ఉంటే కాలేజీలో ఎందుకు చదువుతాను? ఇన్నేండ్ల తరువాత వెనక్కి తిరిగిచూసి ఆలోచించి మాత్రం ఏం లాభం? కాని ఒక సంగతి మాత్రం పట్టుబడింది. అవసరం వచ్చినప్పుడు విద్యార్థులు పది ఇరవై ఒకరినుండి ఒకరు చేబదులు తీసుకుంటుంటారు. సాధారణంగా విద్యార్థుల్లో జరిగేదేమిటంటే: ఉంటే చేబదులు ఇస్తారు, లేవంటే లేదని చెప్తారు. కాని అతనిది మాత్రం ఈ విషయంలో విలక్షణమైన ధోరణి. జేబులోనో పెట్టెలోనో ఉంటే వెంటనే తీసి ఇచ్చేవాడు. లేకపోతే కొంతసేపు ఆగమని చెప్పి తాను మరెక్కడ్నుంచో ఆ మొత్తాన్ని చేబదులుగా తెచ్చి ఇచ్చేవాడు. ఇది చాల చిన్న విషయంగా నీకు కనబడవచ్చు. చిన్నచిన్న విషయాల్లో కూడ మనిషి యొక్క స్వభావం ప్రకటమౌతుంటుంది. ఇతరుల ఎడ మన ప్రవర్తన ఎలా ఉంటుందో గమనించి చూచుకుంటే చాల మంచిది. సాధారణంగా లోకులకు తూకం వేసే బుద్ధి ఉంటుంది. అధికారం, హోదా, పలుకుబడి, ధనం, కీర్తిప్రతిష్ఠలు మొదలైనవి ఉన్న వ్యక్తి ఎడ లోకులు చాల వినయంగా గౌరవంగా మర్యాదగా మాట్లాడటం, వ్యవహరించడం చూస్తుంటాము. కాని అదే లోకులు పనివారి ఎడ బీదవారి ఎడ మాట్లాడే తీరు, వ్యవహరించే తీరు మరో విధంగా ఉంటుంది. సాధారణ ప్రజలలోనే కాదు ఆదర్శనీయంగా ఉండాల్సిన చాలమంది సన్యాసులలో కూడ ఈ తక్కువ ప్రవర్తన కనబడుతుంది. ఈ తూకం వేసే బుద్ధి మంచిది కాదు. మనిషిని మనిషిగానే చూడడం ఉండాలి. ధనికుల ఎడ దురభిప్రాయం కలిగి ఉండి వారిని అలక్ష్యంగా చూసేవాళ్లు కూడ ఉన్నారు. అదికూడ మంచిదికాదు. ఒక రైతునాయకుడు భారత దేశీయాంగ మంత్రిగా ఉన్న రోజుల్లో అతన్ని చూడడానికి ఒక పేరుమోసిన కోటీశ్వరుడైన పారిశ్రామికవేత్త వచ్చాడు. దేశీయాంగమంత్రిగా ఉన్న ఆ రైతునాయకుడు అతణ్ణి చాల అలక్ష్యంగా చూస్తూ "బాగున్నారా? వ్యవహారాలు ఎలా జరుగుతున్నాయి" అని పొడిమాటలు నాలుగు మాట్లాడి తరువాత P. A. ని కేకవేసి "యు. పి. నుండి వచ్చిన ఆ రైతుల్ని లోపలికి పంపు" అని ఆ కోటీశ్వరణ్ణి "వచ్చినపని ఏమి" అని అడక్కుండానే బైట పంపివేశాడు. ఇలాంటి ప్రవర్తనకూడ మంచిది కాదు. నేనింతవరకు చూచినవాళ్ళలో ఒక ఒకే సన్యాసి ప్రవర్తనే నాకు చాల ఆదర్శప్రాయంగా కనబడుతుంది. భారత దేశీయులు వలసపోయి స్థిరపడిన ఒక

దేశంలో ఉన్న ఒక కేంద్రానికి ఆయన అధిపతి. పేరుకు సన్యాసేగాని ఆయన ఒక రైతు నాయకుడు, కార్మిక నాయకుడుగా కూడ చాల కాలం అనధికారంగా వ్యవహరించి అక్కడున్న భారతీయుల ఆర్థిక వికాసానికి, స్వాతంత్ర్యానికి ఎనలేని కృషిచేసిన వ్యక్తి. ఆయన ఒకసారి నేనున్న ఆశ్రమానికి వచ్చారు. ఆయన్ను చూడడానికి నానావర్గాలవాళ్లు వచ్చేవాళ్ళు. గుడిసెల్లోని పేదవారినుండి కోటీశ్వరులదాక అనేకవర్గాలు చూడడానికి వచ్చేవారు. ఆ సమయంలో నేను చాల జాగ్రత్తగా ఆయన వ్యవహరించే తీరును గమనించాను. బీదవాడైనా కోటీశ్వరుడైనా ఒకే వ్యవహార ధోరణి. చిరునవ్వుతో ఆప్యాయంగా పలకరించడం అందరి ఎడ ఒకేవిధంగా ఉండేవి. ఇటువంటిదే ఆదర్శనీయమైన ప్రవర్తన. ఈ ఆదర్శనీయమైన ప్రవర్తన అనే అద్దంలో, మనం ప్రవర్తించే తీరును చూసి తెలుసుకొని ఆ తీరులోని తూకపు అవకతవకలు సరిదిద్దుకోవడానికి వీలుంటుంది. పుస్తకాలు చదివి కాదు

ఆశ్రమాలల్లో ఉండే సన్యాసులకు ఆ ఆశ్రమాలకు వచ్చే భక్తులు కొందరు పాదప్రణామం చేసుంటారు. నా ఉద్దేశంలో ఇది సరికాదు. ఇక్కడ కూడ తూకం బుద్ధి ఉందనే నా అభిప్రాయం. ఈ తూకం బుద్ధులను మాన్పడానికి ప్రయత్నించాలేగాని వాటిని కొనసాగనివ్వడం ఆశ్రమాలు చేయకూడదు. కొందరికి ఈ పాద నమస్కారాలు గ్రహించడం ఇష్టమే ఉండదు. కాని ఏం చేస్తారు! ఆ నమస్కారాలు వద్దు అని నిరాకరిస్తే భక్తుల మనస్సుకు కష్టం వేస్తుందేమో అని వాటిని గ్రహిస్తానేఉంటారు. ఒక ఆశ్రమంలో ఒక చిత్రమైన సన్యాసిని చూశాను. ఎప్పుడూ చేతిలో గొడుగుండేది. ఎండవానల రక్షణకు కాదు ఆ గొడుగు. పాద నమస్కారాలను దరిచేరనీయకుండా అడ్డుకునేందుకే ఆ గొడుగును ఉపయోగించేవాడు. ఎవరైనా నమస్కారం చేయడానికి పూనుకుంటే వెంటనే ఆ గొడుగును తన పాదాలకు ఒక అర అడుగు ముందర నిలబెట్టేవాడు. వాళ్లు ఆ గొడుకుకొట్టుకు నమస్కారం చేస్తే చాలని అర్థం! ఇదియొక వింత ప్రవర్తన. కాని ఈ విషయంలో నేను చూసిన ఆదర్శనీయమైన ప్రవర్తన గురించి చెబుతాను. ఆయన ఒక ఆత్మజ్ఞాని. కాని బాహ్యావేషాలేమీ లేనందువల్ల, తల్లిదండ్రులు పెట్టిన పేరుకూడ మార్చుకోనందువల్ల చాలమంది ఆయనను సాధారణ వ్యక్తిగా భావించి మోసపోతుంటారు. ఆయన ఉపన్యాసాలు ఆంగ్లంలోనే ఉంటాయి. మాతృభాష తెలుగే అయినా పరిస్థితుల కారణంగా ఆ భాష పూర్తిగా మరచిపోయారు. ఉపన్యాసాలకు వేలమంది గుమికూడుతారు. ఉపన్యాసానంతరం వేదిక దిగి ఆయన తన నివాసానికి వెళ్తుంటే కొందరు పాదనమస్కారాలు చేయడానికి ప్రయత్నిస్తారు. ఎవరైనా పాదనమస్కారం చేస్తే వెంటనే ఆయన కూడ నేలకు మోకాళ్ళు ఆనించి ఆ పాదనమస్కారం చేసిన అతనికో ఆమెకో ప్రతి నమస్కారం చేసేవారు. ఆయన ఒంటరిగా ఉన్నప్పుడు ఎవరైనా పోయి పాదనమస్కారం చేయడానికి పోతే చాల వినయంగా వద్దని చెప్తూ చేతులు పట్టుకుంటారు. ఈ ప్రవర్తన నాకెంతో నచ్చింది. అందరి ఎడ సమదృష్టి మనకు అలవడాలి. తూకపుబుద్ధి జనితమైన ఏ ఆచరణ మంచిదికాదనే నా అభిప్రాయం. ఈ రోజు ప్రసంగం ఇడియారబ్బరులాగా సాగిపోయింది. ఇక ఆపుతాను. రేపు ఆధ్యాత్మికతను గురించి వివరించడానికి ప్రయత్నిస్తాను.

# ...కా విరహం

కుమారి పి. రాజ్యలక్ష్మి

మధురకు వెళ్ళిన కృష్ణుడు, తిరిగి వస్తాడని ఆశ పెట్టుకున్న గోపికలకు నిరాశే ఎదురయింది. మనసా - వాచా - కర్మణా అతనినే నమ్ముకున్న గోపికలకు, శ్యామసుందరుడు తమపట్ల యింతటి నిరాదరణ చూపటం, వారు భరించలేక పోయారు. కృష్ణునితోటి అనంతమైన ఆనందాన్ని - సుఖాన్ని అనుభవించిన వారికి, విరహాన్ని అనుభవించటం కష్టసాధ్యమైంది. ప్రియుని చూడకుండా, జీవితాన్ని గడపటమనేది మాటలలో వర్ణింపలేనిది. 'ప్రియుడు వెళ్ళిపోతాడు' అనే సమాచారం వినగానే మనసు వికలమవుతుంది. ధైర్యం నశిస్తుంది. అధీరత్వం వృద్ధిచెందుతుంది. ఏమీ తోచదు. హృదయం బద్ధలైనట్లుగా, జగత్తు శూన్యంగాను అనిపిస్తుంది. తినాలనిగానీ, నిద్రపోవాలనే కోరికగానీ వుండదు. ఇది భవిష్యత్తులో కలిగే విరహానికే యిలాటి అధీరత్వం, వికలత్వం వుంటే వర్తమాన విరహంలో, విరహిణులకు ఎలాటి స్థితి వుంటుందో వర్ణించటానికిగానీ, వినటానికిగానీ సాధ్యం కాదు. అది అనుభవ విషయం. భావి విరహంలో ఆశ వుంటుంది. భూతకాల విరహమున, కొంత ధైర్యాన్ని వహించి వుండవచ్చు. కానీ వర్తమాన విరహం చాలా దుఃఖప్రదమైనది. జీవమునకు జీవమయినవాడు, ప్రాణమునకు ప్రాణమైనవాడు, వజ్రహృదయుడై ప్రియురాలి కన్నుల ముందుగానే వెడలిపోతుంటే, ఆ సమయంలో ప్రేయసికి ఎలాటి స్థితి కలుగుతుందో అది అనుభవించినవారికి గానీ తెలియదు.

కృష్ణుడు మధురకు వెళుతుంటే, గోపికలు నిశ్చేష్టులై నిలుచుండిపోయారేగానీ, 'కృష్ణా! మమ్మల్లను విడచి వెళకు' అని అనలేక పోయారు. కృష్ణుడు, తమను విడచి వెళ్ళిపోతాడని వారు కలనైనా వూహించలేదు. కాబట్టి, వారికి ఈ విచిత్రమైన మనోదశ కలిగింది. మాధవుడు వెళ్ళగానే వారికి, తాము ఎంతటి తప్పిదం చేసారో తెలియలేదు. వారికి మోహం నశించి, తమను మోసం చేసి మధురకు వెళ్ళాడని కోపం, దుఃఖం కలిగాయి.

ప్రీతి కరి దీన్హీ గరై ఛురీ।
జైసే బధిక చుగాయి కపట - కన, పాఛై కరత బురీ॥

"సఖీ! కృష్ణుడు ఎంతటి నిర్దయుడు. ప్రేమను చవి చూపి, విరహమనే బాకును, గుండెలలో దింపి వెళ్ళాడు. ఏవిధంగానైతే వేటకాడు కపటమైన ప్రేమను చూపి పక్షులను పట్టుకొంటాడో, అలాగే శ్యామసుందరుడు కూడ మధురమైన మురళీనాదాన్ని వినిపించి, మనలను వివశులను చేసి, కపట ప్రేమను చూపి వెడలిపోయాడు. మనం ఆ వేణునాదానికి పిచ్చివారమై అతనిచుట్టు తిరిగి చివరకు, రెక్కలు తెగిన పక్షుల్లాగా అయ్యాము. అయినా అతను మన దుస్థితిని చూసి జాలిపడక, మనమేమవుతామో కూడ ఆలోచించకుండా, మధురకు వెడలిపోయాడు. సఖీ! మనపాలిట కల్పతరువైన మాధవుని, విడచి మనమెలా జీవించి వుండగలుగుతాము."

మాధవుడు, మధురాపురికి వెడలిపోయాక, గోపికలు క్షణమొక యుగంలా గడపసాగారు. సృష్టిలోని ప్రతి అణువణువు వారికి చాలా భయంకరంగా కనపడసాగింది. ప్రకృతి సైతం తమకు శత్రువై తమను పీడిస్తున్నట్టుగా అనిపించసాగింది.

అబవై బాతై వులటీ గయీ।
జిని బాతని లాగత సుఖ అలీ, తేవూ దుసహ భయీ॥

"సఖీ! ఏ వస్తువులైతే మనకు అందంగా, ఆహ్లాదకరంగా కనబడేవో, యిప్పుడవి చాలా

భయంకరంగాను, అసహ్యంగాను కనబడుతున్నవి. ప్రకృతి కూడ విరుద్ధంగా అగుపించటానికి కారణం మాధవుడే కదూ. వర్ష ధారలు మనకు ప్రేమజల్లుల్లాగా కనపడేవి. ఆ వర్షపు ధారలలో, శ్యామసుందరునితో కలిసి తనివి తీరా జలకాలాడేవారం. యిప్పుడా వర్షపు ధారలను చూస్తుంటే భయంతో శరీరం కంపిస్తున్నది. యిదివరకు నెమలి పురివిప్పి ఆడినా కోకిల మృదుమధురంగా కూసినా, తుమ్మెద ఝంకారాలు విన్నా పరవశించిపోయేవారం. కానీ యిప్పుడు వాటి స్వరాలు, కప్పల బెక-బెకలను తలపింపచేస్తున్నాయి. అంతేకాదు. చంద్రుని చల్లని కిరణాలు సైతం దావాగ్నిలా మనలను దహించివేసేలా వున్నాయి. యమునను, మధువనాన్ని దర్శించాలంటే భయంగా వుంటోంది. అందమైన వెన్నెలరాత్రులు, విరహాన్ని అధికం చేస్తున్నాయి. సఖీ! యింతటి బాధను అనుభవించేకన్నా మరణించటం మేలు కదా!"

గోపికలు నిరంతరం కృష్ణ విరహంలో తమ దుర్భరమైన జీవనాన్ని గడుపుతూ, ఒక్కసారి తమకు దర్శనమివ్వమని శ్యామసుందరుని వేడుకోసాగారు.

బారక లాయి యో బిలి మాధే।
కో లాపై తన ఛూటి జాయి యో, సూర రహై జయ సాధో॥

"కృష్ణా! ఒక్కసారి నీ దర్శనభాగ్యాన్ని కలుగచేయి. నీ విరహంలో కృంగి-కృశించిన ఈ శరీరం ఎప్పుడు రాలిపోతుందో తెలియదు. మనసు నీ పొందును కోరుతున్నది. బృందావనంలో వుండటం నీకు యిష్టం లేకపోతే, నందుని అతిథిగానైనా ఒక్కసారి వస్తే నిన్ను తనివితీరా చూసుకొని ఆనందపడతాము. మన ఆనందాన్ని చూడలేని విధాత మనలను దూరం చేసి వినోదం చూస్తున్నాడు. మాధవా! మాపై జాలి చూపలేవా!"

కాహై పీతీ దయీ హరి మోసో।
తుమ హీ పీతి భావతే దీహో. కౌర కహా కహి కోసో॥

"గోపీజనవల్లభా! నీవు మా పట్ల యింతటి విముఖతను చూపటం నీకు న్యాయమేనా! నీ అంతట నీవే మమ్ములను విడచి వెళ్ళావు. యిక నా కోపాన్ని ఎవరి మీద చూపమంటావు! సఖీ! సంయోగానంతరం, వియోగంలో ఎంతటి బాధ దాగివుంటుందో అది సీతా-రాములే తెలుసుకోగలిగారు. విరహంలో దాగిన వ్యథను అనుభవించినవారికి తప్ప, ఎవరికీ తెలియదు. దశరథుడు, శ్రీరాముని విడచివుండలేకనే కదా, ప్రాణాలు విడిచాడు. వృక్షమునుంచి క్రిందపడ్డ ఆకు, మరల సజీవం కాగలుగుతుందా? వీణానాదాన్ని వదిలి లేడి, నీటిని విడచి చేప, దీపాన్ని వదలి పతంగం వుండలేవు. కానీ మనం మటుకు, మన ప్రాణప్రదమైన కృష్ణుని వదలి, జీవించి వుండగలుగుతున్నాము. ! మనమెంతటి వజ్రహృదయులం."

మోహనుడు వెళ్ళిననాటినుండి రాధ స్థితి, అత్యంత దయనీయమయింది. అనుక్షణం కృష్ణుని వెంట తిరిగే రాధకు అతనిని చూడకుండా వుండగలగటం సాధ్యం కాలేదు. తాను అనుభవించే వేదనను తన ప్రియసఖి అయిన లలితకు తెలుపుతూ—

నిసి దిన బరసత నైన హమారే।
సదా రహత పావస రితు హమ పర, జబ తై శ్యామ సిధారే॥

"సఖీ! నేత్రాలు రాత్రి-పగలు అని లేకుండా అవిరామంగా వర్షిస్తున్నాయి. మాధవుడు మధురకు వెళ్ళిననాటినుండి, వర్ష ఋతువు స్థిరంగా వుండిపోయింది. కన్నీటి కారణంగా కంటికి పెట్టుకొన్న కాటుక కరిగి ముఖ

మంతా అలుముకొన్నది. నిరంతరం కన్నీరు కారటంతో పురమున కన్నీరు కాలువ కట్టింది. శరీరమంతా అశ్రుమయం అయింది. సఖీ! కన్నీటి సముద్రంలో మునిగిన నన్ను చేయూతనిచ్చి రక్షించే నా నాథుడు ఎందు కింత కఠినంగా మారినాడో కదా!''

రాధ మాటలు వినేసరికి లలిత కన్నుల వెంట నీరు తిరిగింది. ఆమె రాధను సాంత్వన పరుస్తూ—

ప్రీతి కరి కాహు సుఖన లహ్యో।
ప్రీతి పతంగ కరీ పావక సౌ, ఆప ప్రాన దహ్యో॥

"సఖీ! ఈ సృష్టిలో ప్రేమించినవారెవరూ సుఖ-సంతోషాలను నోచుకోలేదు. దీపం పురుగు దీపాన్ని ప్రేమిస్తుంది, కానీ ఆ ప్రేమ కారణం గానే కదా దీపానికి తనను తాను ఆహుతి చేసుకుంటుంది. తుమ్మెద, కమలాన్ని ప్రేమించబట్టే కమలానికి తనను తాను అర్పించుకోవటానికి కూడ వెనుకాడదు. లేడి వీణానాదాన్ని ప్రేమిస్తుంది కావుననే వేట గాని బాణానికి గురికావలసివస్తుంది. మనం కృష్ణుని మన ప్రాణాలకన్నా మిన్నగా ప్రేమించాము. కానీ అతను మనలను వీడి మధురకు వెళుతుంటే, నిశ్చేష్టులమై నిలిచామేగానీ, 'మీరా' మాటాడలేక పోయాము. కృష్ణుని చూడకుండా మనం విరహబాధను అనుభవిస్తున్నామే కానీ, దీపం పురుగులా, లేడిలా మనం విరహజ్వాలలకు ఆహుతి చేసుకోలేక పోయాము. అది మన దురదృష్టం.''

నూనెంటురాయిని చూడగానే యినుప ముక్క దానిని అంటుకొనటానికి ప్రయత్నించి నట్టు, చంద్రుని చూసి చంద్రకాంతమణి కరిగి నట్లు, ప్రియతమునికి సంబంధించిన వస్తువు కన బడినప్పుడు ప్రియుని స్మృతి కలుగుతుంది. అంతేకాదు తన ప్రియునిలా ఎవరి రూపం చూసినా, నడక, వైఖరి, సంభాషణ, స్వభావం మొదలైనవాటిని చూసినా అతని స్మృతి కలుగుతుంది. కృష్ణుడు నీలమేఘశ్యాముడు కదా! ఆకాశంలో నల్లని మేఘాన్ని చూసినా, అతను వేణువును వాయిస్తాడు కాబట్టి వేణువు ధ్వని విన్నా, అతనికి ప్రియమైన తులసి కన బడినా, ప్రియునికి సంబంధించిన ఏ వస్తువు కన బడినా సరే భావమునకు ఉద్దీపనం కలుగ చేస్తుంది.

ఆజు ఘన శ్యామ కీ అను హరీ।
ఆయె వునయి సాంవరే సజనీ, దేఖి రూప కీ ఆరి॥

"'సఖీ! ఈ మేఘం శ్యామసుందరుని తల పింపచేస్తున్నది కదూ. అంతేకాదు ఈ నీలాకాశమంతటా నాకు కృష్ణరూపమే గోచరిస్తున్నది. ఇంద్రధనుస్సు కృష్ణుని పీతాంబరాన్ని, ఆ మెరుపు మోహనుని అందమైన పలువరుసను గుర్తుకు తెస్తున్నాయి. ఆకాశంలో ఎగురుతున్న హంసల బారును చూస్తూ వుంటే, కృష్ణుడు తన వక్షస్థలముపై ధరించే ముత్యాల సరాలను జ్ఞప్తికి తెస్తున్నవి. మేఘ గర్జన వింటుంటే గోవిందుడు నాతో ప్రియసంభాషణ చేస్తున్నట్టుగా వున్నది' రాధ మాటలు వింటున్న గోపికలకు రాధపై జాలి, మాధవునిపై కోపం కలిగాయి.''

కాహే కై పియ-పియ హి రటతి హౌ,
పియకే ప్రేమ తేరో ప్రాన హరై గా।

"సఖీ! రాధా! 'ప్రియా- ప్రియా' అంటూ వ్యర్థంగా ఎందుకు దుఃఖిస్తావు? ప్రియుని ప్రేమ నీ ప్రాణాలను హరించేలా వున్నది. నిరంతరం కన్నులవెంట నీరు కార్చటం వలన, నీ హృదయవేదన అధికం అవుతుందే కానీ తరగదు. నిట్టూర్పులు విడుచుట వలన, విరహమనే దావాగ్ని మరింత ప్రజ్వరిల్లుతుంది. కృష్ణుని తలుస్తూ అతనికి ప్రియమైన పుష్పా

లను హృదయానికి హత్తుకోవటం వలన నీలో తాపం అధికం అవుతుంది. రాధా! యమునా నదీ తీరానికి వెళ్ళటం, వెన్నెలరాత్రులలో ఒంటరిగా చంద్రుని చూస్తూ గడపటం మాని వేయి."

శ్రీ కృష్ణునికి గోపికలకు గల సంబంధం సాధారణ మానవునికి, స్త్రీకి మధ్య గల ప్రేమ లాటిది కాదు. కారణం ఒక స్త్రీ ఒక పురుషుని ప్రేమించినప్పుడు, వేరొక స్త్రీ కూడ ఆ పురుషునే ప్రేమిస్తే, మొదటి స్త్రీకి, రెండవ స్త్రీ పట్ల యీర్ష్య వుద్భవించటం స్వాభావికం. గోపికలలో అలాటి యీర్ష్యా స్వభావం మనకు కనిపించదు. వారి వుద్దేశంలో కృష్ణుడు అఖండ ఆనందము యొక్క స్వరూపమని, అలాటి ఆనందాన్ని వారంతా కలసి అనుభవించాలని కోరుకున్నారు. వారు కోరుకున్న అఖండ ఆనందం, వారి నుండి దూరం అయినప్పుడు, వారెంతటి విరహ వేదనను అనుభవించారో మాటల కందనిది.

—పై సంచికలో భ్రమర గీతాలు.

# గృహస్థు కథ, సన్యాసి కథ

ముహింక్రి

ఇది కథ కాదు. నిజంగా జరిగిన విషయం. ఒక ఆదర్శ సన్యాసి, ఒక ఆదర్శ గృహస్థు నడుచుకొన్న విధమే చెప్పబోతున్నా. వాళ్ళ జీవితమంతా కాదు. ఒక సంఘటన మాత్రమే. ఒక మెతుకు పట్టి చూసే చాలదా? కుండ లోని అన్ని మెతుకులు పట్టిచూసే తెలివి తక్కువపని మనకెందుకు? కాలయాపకులకు ఆ పని వదలిపెట్టి మన పని చూసుకుందాం. అపరిగ్రహం అనేదాన్ని ఎట్లా ఒక సన్యాసి ఆచరణలో చూపాడు, అస్తేయం అనేదాన్ని ఒక గృహస్థు ఎట్లా ఆచరణలో చూపాడు అనే సంగతే మనం చూడబోతున్నాం. ఎవరిని ముందు తీసుకుందాం? గృహస్థునా? సన్యాసినా? ఎవరికి అగ్రతాంబూలం ఇస్తాం అనే మీమాంసకు దిగకుండ మరో విధంగా ఈ సమస్యను - అంటే ఎవరి ప్రస్తావన ముందు చేయాలి అనే సమస్యను పరిష్కరించుకొందాం. ఈ వ్రాతను చదివేవాళ్ళలో నిశ్చయంగా గృహస్థులే ఎక్కువ కాబట్టి ముందు గృహస్థు ప్రస్తావనే తీసుకుందాం. చప్పున విషయంలోకి దిగకుండ ఈ నాన్చే ధోరణి ఎందుకు అని మీరడక్కండి. రెండు పేజీలైనా వచ్చేట్లుగా వ్రాయాలనే నా తాపత్రయం మీకు తెలీదు. తాపత్రయం సంగతి ఇంత బట్టబయలుగా చెప్పడం సమంజసం కాదేమో! ఇక రెండు పేజీలు పూరించడం అంత కష్టం కాదు కాబట్టి నెంబరువన్ గృహస్థు సంగతి: ఆ గృహస్థు ఒక సివిల్ ఇంజనీరు. దేశ విభజన జరిగినప్పుడు సర్వాన్ని కోల్పోయి ప్రాణాలను అఱచేత పట్టుకుని ఎట్లాగో కట్టుగుడ్డలతో భారత దేశం చేరుకొన్న లక్షలాది హిందువులలో అతడొకడు. అతనికి తల్లిదండ్రులున్నారు, భార్యా పిల్లలున్నారు. భారత దేశం వచ్చి చేరిన క్రొత్తలో ఇంత సంసారాన్ని నెట్టుకరావడం ఎంత కష్టమో చూడండి. పుట్టినప్పటినుండి దర్జాగా బ్రతికినవాడు విషమపరిస్థితులకు బలియైపోయి గుడిసెవాసుల జీవనస్థితికి దిగిరావడం అంటే ఎంత బాధాకరమో ఊహించండి! అర్హత ఉన్నవాడు గనుక వెంటనే అతనికి పెద్ద ఉద్యోగమే దొరికింది. భారత ప్రభుత్వం పెద్ద ఎత్తున చేపట్టిన పునరావాస కార్యక్రమ రంగంలో అతనికి ఒక కీలకమైన ఉద్యోగస్థానమే లభించింది. దారిద్ర్యం నుండి మెల్లమెల్లగా తన కుటుంబం బైట పడుతున్నది.

ఇంతకు పూర్వం తనకున్న మేడలు, కార్లు, నౌకర్లు - అవన్నీ కరిగిపోయిన కలలుగా ఇప్పుడు కనబడుతున్నా తిండిబట్టలకు మాత్రం లోపం లేకుండ జరిగిపోతున్నది. ఒకనాడు అతని ఆఫీసుకి ఒక పెద్ద కాంట్రాక్టరు వచ్చి సంచినుండి ఒక లక్షరూపాయల నోట్ల కట్టలు తీసి చూపిస్తూ "వీటిని ఈ క్షణంలో మీ స్వాధీనం చేసేస్తాను. నా పేపరు మీద సంతకం పెట్టండి చాలు" అన్నాడు. ఇంజనీరుకు నిజంగా దిగ్భ్రమ కలిగింది. డబ్బుయొక్క ఆవశ్యకత సంసారానికి ఎంత అవసరమో మొట్టమొదటిసారిగా బాగా చవిచూస్తున్నాడు. ఒక సెకండు మనస్సు టపటపలాడింది- ఆ డబ్బును అందుకోవాలని. కాని మరుక్షణమే తన్నుతాను సంభాళించుకొన్నాడు. ఆ కాంట్రాక్టర్‌ను చూసి సౌమ్యంగానే ఇలా అన్నాడు. "నేనలా సంతకంపెట్టను." "మీకు ఇది తక్కువనిపిస్తే ఇంకో పదివేలు తీసుకోండి దయచేసి సంతకంపెట్టం..." కాంట్రాక్టర్ వాక్యం పూర్తి చేయలేకపోయాడు. కారణం "గెటవుట్" అనే ఇంజనీరు గర్జన అతడి నోటిని కట్టివేసింది. లక్ష రూపాయల బాగ్ మోసుకొని గాడిదలా బైట పడ్డాడు. మనకు దీనివల్ల ఏం తెలుస్తున్నది? ఇంజనీరు సంసారి. అతని మీద ఆధారపడిన ఐదారు జీవాలుగల కుటుంబం అతనికున్నది. కుటుంబపాలన కోసం అతను ఉద్యోగం చేస్తున్నాడు. జీతంగా వచ్చేదాన్ని పరిగ్రహిస్తున్నాడు. అది తన ధర్మం. కాని స్తేయం అంటే దొంగతనం ఏ పరిస్థితుల్లోనూ తనకు తగదు. ఆ లక్షరూపాయలు తీసుకొని ఉంటే తానొక దొంగ అయియుండేవాడు. ఎట్లంటే ఆ లక్షరూపాయల లంచం ఇచ్చేవాడికి ఆ పని వల్ల కనీసం పదిలక్షల అన్యాయార్జితం ఉంటుంది లేకుంటే అంతడబ్బు లంచంగా పోయడు. అన్యాయార్జితమంతా దొంగసొమ్ము. ఆ దొంగసొమ్ములో పాలుపంచుకొనే వాళ్ళందరూ దొంగలు. దొంగబుద్ధిలేని ఆత్మౌన్నత్యం ఆ ఇంజనీరుకు ఉన్నందువల్ల ఆ పాపపు ఎరకి చిక్కలేదు. మనం ఇక్కడింత వివేచన చేశాంగాని అతను నిరాకరించినప్పుడు ఇంత వివేచన చేసినవాడు కాదు. అస్తేయం అనే దొడ్డగుణం ఉన్నవాడు కాబట్టి రెప్పలల్లార్చినంత సహజ ధోరణిలో నిరాకరించాడు. ఇక సన్న్యాసి కథ ఆయన ఒక గొప్ప సాధువు. హిమాలయాల్లో గంగాతీరంలో ఒక చిన్న కుటీరంలో నివసించిన సాధువు. ఒకనాడు ఒక మార్వాడీ ఆయన దగ్గరకు వచ్చి పాదకానుకగా ఒక లక్షరూపాయలు అర్పిస్తానన్నాడు. "నాకా కానుక వద్దు" అన్నాడు సాధువు. ఇక్కడ మార్వాడీ భక్తితో ఇస్తానంటున్నాడు కాబట్టి ఆ సాధువు తీసుకుంటే వచ్చే దోషం ఏముంది? అని మనకనిపించవచ్చు. కాని సూక్ష్మంగా చూస్తే మన అభిప్రాయం మార్చుకొంటాం. సాధువుకు అపరిగ్రహం అనేది ధర్మం. వ్యక్తిగత కనీస అవసరాలకు మించి - అంటే అంత అన్నం, అంత గుడ్డకు మించి ఏది తీసుకొన్నా ఏ రూపంలో తీసుకొన్నా పరిగ్రహం అనే దోషం తగులుతుంది. సన్న్యాసి సంసారి స్థాయికి దిగినట్లవుతుంది. కనీస అవసరాలకు మించిన పరిగ్రహం సుఖలాలసతను, యోగక్షేమలాలసతను (desire for physical security) సూచిస్తుంది. ఆ లాలసతలు ఉన్నవాడు సన్న్యాసి ఎందుకు కావాలి! కాబట్టి సన్న్యాసి అయినవాడి ప్రధాన ధర్మం అపరిగ్రహం. ఆ సాధువులో మనకది కనబడుతుంది. లక్ష రూపాయల నిరాకరణ ఉదంతాలు రెండూ జరిగినట్టివే. కట్టుకథలు కావు. కాకపోతే చెప్ప

(మిగతా 177-వ పేజీలో)

# శ్రీ రామానుజాచార్యులు

దానప్ప

గురువుల నెదిరించే శిష్యులను నేడు విరివిగా విద్యాభవనల్లో (ఆలయాలనటానికి మనస్సొప్పటం లేదు.) చూస్తూనే ఉంటాం. వానికి వ్యక్తిగతమైన కారణాలెన్నో ఉంటాయి. ముఖ్యంగా స్వార్థప్రయోజనాల నశించే దృక్పథం ఆ ఎదిరింపుల్లో కనబడుతుంది. కాని, లోకహితం కోసం, తమ ప్రాణాలను సైతం గణించక గురువుల నెదిరించిన శిష్యులు చాలా అరుదుగా కనబడతారు. అలాంటి వారిలో అతి సాహసి, జనావళియందు దయార్ద్ర హృదయుడైన శ్రీ రామానుజులొకరు.

రామానుజుల ఎదిరింపు బుద్ధిగతమైనది; జ్ఞానవిషయ సంబంధమైనది. ఈర్ష్యా ద్వేషాది సామాన్యభావాలకతీతమైనది కేవలం సిద్ధాంత విషయంలో తన స్వేచ్ఛాభిప్రాయాలను వెల్లడించాడే తప్ప, గురువును కించపరచాలని, హింసించాలని కాదు. అలాంటి తీక్ష్ణబుద్ధిగల విద్యార్థులను గురువులు సహర్షంగా స్వీకరించాల్సింది పోయి, యాదవప్రకాశుడనే అతని గురువు, రామానుజుని స్వచ్ఛంద చింతనను 'ఎదిరింపు చర్యగా' అపార్థం చేసుకున్నారు. ఇలాంటి మూఢత్వంతో, సంకుచితత్వంతో విలసిల్లే గురువులవల్లనే విద్యార్థుల మనోవికాసం, నైతికవికాసం, బుద్ధిగతవికాసం ఆగిపోతుంది. మన దురదృష్టంకొద్దీ, నేటి ఆధునిక విద్యాకర్మాగారాల్లో (కారాగారాలనాలేమో!) అలాంటి అధ్యాపకుల సంఖ్యే ఎక్కువగా ఉంది. వీరిలో చాలామందికి, తమ విషయం గూర్చిన అవగాహన కూడ పూర్తిగా ఉండదు. కేవలం ఉద్యోగాన్ని దృష్టిలో పెట్టుకొని క్రిందామీదా పడి ఎట్లో మెట్లెక్కి పైకి వస్తారు. ఇక వచ్చింతర్వాత దిగువ మెట్ల గూర్చిన జ్ఞానం ఉండదు. ఇంకా పైకిపోదామన్న జిజ్ఞాస అసలే ఉండదు. అక్కడ వారికిష్టమున్నా లేకున్నా, ఏదో ఉద్యోగంలో చొరబడతారు. ఈ అధ్యాపకవృత్తి కూడ వారికి జీవనోపాధి కేగాని, జ్ఞానార్జనకు, జ్ఞాన విస్తరణకు కాదు. మరొక్క ఉద్యోగం దొరక్క, అక్కడే స్థిరపడిపోతారు. ఆ వృత్తిలో లభించే జీతంకన్నా, అధిక జీతం మరెక్కడయిన లభించే పక్షంలో వెంటనే ఆ అధ్యాపకవృత్తికి ఉద్వాసన చెప్పేసి, అటవైపు పరిగెడతారు. ఏదో పొట్టపోసుకునేందుకు గత్యంతరం లేక అధ్యాపకులుగా చేరే ఇలాంటి గురువులు, విద్యార్థుల మానసిక, వైజ్ఞానిక అభ్యుదయానికి ఎలా మార్గదర్శకులౌతారు? ఎంతోమంది అధ్యాపకులు డిగ్రీలు పొందేవరకు ఎంతో ఆసక్తిగా చూసిన పుస్తకాలను, జీవనభృతి దొరకగానే మూలపడేస్తారు. విద్యార్థులకు ఏదో చెబుతారు. విద్యార్థులదొక కాలక్షేపంగా ఏదో వింటారు. విద్యార్థులకు విషయం ఎంతవరకు బుర్రలో దిగింది అన్న ఆలోచన ఉపాధ్యాయులకుండదు. తమ ఉపాధ్యాయులు చెప్పేదాంట్లో నిజమెంత ఉందోనన్న ఆసక్తి విద్యార్థులకుండదు. అది అలా ఒకరోజు వారి యాంత్రిక చర్యగా గడిచిపోతుంది నెలలు గడుస్తాయి. పంతుళ్లు తమ జీతాలు ఒక్క పైసా తక్కువ లేకుండ పుచ్చుకుంటారుగాని, ఆ జీతానికి సరిపడ్డ, యోగ్యమయిన అధ్యాపకత్వం నిర్వహించామా లేదా అన్న ఆత్మ విమర్శన చేసుకోరు. కేవలం డబ్బునే దృష్టిలో పెట్టుకునేవారు సరైన గురుత్వం ఎలా వహిస్తారు? విద్యార్థులకీ చదువులు కేవలం విలాసప్రాయాలే అయిపోయాయి. అది వారికి జీవి

తంలో ఒక ఆటవిడుపులాంటిది. జ్ఞానార్జన వాళ్ళకు తలనొప్పిలాంటి వ్యవహారం. ఫేమస్ల గూర్చి స్టడీ చేయటం వారికక్కడ సరదా. వారు ముచ్చటించుకునే విషయాలు తమ విద్యాసంబంధమైనవి ఒక్కటీ ఉండవు. వినోద, విలాస సంబంధమైనవే ఉంటాయి. సినిమాలు, క్లబ్బులు, పార్టీలు, విందులు, వినోదాలు, రాజకీయాలు, స్త్రీ పురుషుల వ్యక్తిగత విషయాలు-ఇలా మానసికంగా, నైతికంగా, దిగజార్చే విలువలగూర్చే చర్చిస్తారు. విద్యార్థికి అవి ప్రప్రథమ లక్షణాలుగా భావిస్తారు. వారికి చదువూ సంధ్యా బి.సి. నాటి వ్యవహారంలా కన్పిస్తాయి. డిగ్రీల ప్రదానం చేయటమేగాని, విద్యార్థిలో బుద్ధివికాసం, నైతికవికాసం, మానసికవికాసం జరగాయా లేదా అన్న సంగతి, అతనిలో సృజనాత్మకచింతన, ధీశక్తి విస్తృతమయ్యాయా లేదా అన్న సంగతి నేటి విద్యావిధానం ఉద్దేశం కాదన్న సత్యం వారికి తెలుసు. చదువుకొన్న వారికీ, చదువుకొనని వారికి భేదం కేవలం 'డిగ్రీ' తప్ప మరొకటి కాదన్న సంగతి వారెరుగుదురు. ఎడ్యుకేషన్ కు, లైఫ్ కు ఏవిధమైన కనెక్షన్ లేదన్నది వారికి విదితమే! ఎందుకంటే లోకంలో చదువుకొన్న పట్టధారులు, చదువుకొననివారు ఒకేలా జీవిస్తున్నారు. వారి ఆశలు, లక్ష్యాలు, వీరివి కూడ ఒకటిగానే ఉంటున్నాయి. ధనాన్ని సంపాదించటం, సంఘంలో ఐశ్వర్యయుతమైన, విలాసవంతమైన జీవితం గడపటం. ఈ లక్ష్య సాధనకు చదువుతో అవసరం లేదని వారికి బాగా తెలుసు. ఎందుకంటే, చదువుకొనని వారు సైతం ఆ లక్ష్యాలను సాధిస్తున్నారు. సాధించటానికి యత్నిస్తున్నారు. పోతే వారు దానికై ఉపయోగించే ఉపకరణాలు, మార్గాలు వేరు; ఈ 'డిగ్రీ'హోల్డర్లు ఉపయోగించే ఉపకరణం వేరు; వీరి ఉపకరణం 'డిగ్రీ' పేరిట నున్న "ఎడ్యుకేషన్."

కేవలం 'ఉపకరణం' మాత్రమైన ఈ 'డిగ్రీ'ని సంపాదించటం కోసం తమ బుర్రలెన్నెందుకు బద్దలు కొట్టుకోవాలన్నది వారి సదభిప్రాయం. అందుకే విద్యార్థులు అంతటి సాహసానికి పూనుకోరు. 'డిగ్రీ' సంపాదించటానికి రాచమార్గం 'పరీక్షలు' సేవక మార్గాలు కూడ ఉన్నాయనుకోండి! కాని రాచమార్గానికున్నంత విలువ వాటికి లేదు కదా! అందుకని, ఎందుకైనా మంచిదని, విద్యార్థులు ఈ రాచమార్గాన్నే అనుసరిస్తారు. జ్ఞానం ఆర్జించాలన్న నిబంధనగాని, తప్పనిసరి నేర్చుకోవాలన్న నియమముగాని పరీక్షలు పట్టించుకోవు. వాటికి కావల్సింది "ప్రశ్నలకు తగిన జవాబులు". అంతే. అందుకే విద్యార్థులు కూడ గైడ్ల సహాయంగానో, మరేతర సహకార మార్గాలద్వారానో, ఎక్కడోవున్న, తమతో ఏ మాత్రం సంపర్కం లేని, యూనివర్సిటీ మేధావులు తయారు చేసిన పత్రాల్లోని ప్రశ్నలకు తగిన జవాబులే వ్రాసేస్తారు. ఇంకా నమ్మకం లేకపోతే, కుమార్గాలన్నీ అవలంబించి, ఎలాగో పాస్ డనో, లేదా క్వాలీఫైడనో, అన్న బిరుదునుసంపాదిస్తారు. అంతటితో'హమ్మయ్యా' అని నిట్టూర్చి, అంతవరకున్న కాలేజీలైఫ్ కు గుడ్ బై కొట్టి, జామ్మంటు సంపాదన వేటలో బడతారు. ఆ వేటలో కొందరికిలాంటి అధ్యాపక వృత్తులు తారసపడతాయి. వెంటనే వాటిని కబళిస్తారు. వారి చేతుల్లో పడిన విద్యార్థులను తమంతటివారినిగా చేయాలన్న పట్టుదలతో ఆ గురువులు విద్యార్థులకు పాఠాలు వల్లె వేస్తారు. ఆ విద్యార్థులు సైతం గురువుగారి అడుగుజాడల్లో పయనించి, వారిఅంతటివారే ఔతారు. ఏ ఒకరో ఇద్దరో, అప్పుడప్పుడు

దారితప్పి, సి. వి. రామన్‌లా, గణితజ్ఞుడైన రామానుజన్‌లా, జగదీశ్ చంద్రబోస్‌లా బయటపడి పురోగమిస్తారు. అలా బయటపడిన విద్యార్థుల్లో మన శ్రీ రామానుజాచార్యులొకరు.

మన రామానుజుని గురువుగారు పూర్తిగా ఇలాంటివారు కారు. తన విషయమైన అద్వైత సిద్ధాంతమందు పూర్ణ అవగాహన కల్గియున్నారు. పోతే, అది ప్రజలకెంత వరకు ప్రయోజనకారిగా ఉన్నదీ అన్న ఆత్మ విమర్శన మాత్రం అతనికి కొరవడియున్నది. రామానుజులు మాత్రం, అది జనులకెంతవరకు ప్రయోజనకారి అన్న దృష్టితో చూసి, ఆ సిద్ధాంతాన్ని విశ్లేషించటం మొదలుపెట్టాడు. నిజంగా విద్యార్థి అంటే ఇతనిలాంటివారే సుమా! వినే విషయం ఎంత సత్యమైనదైనప్పటికీ, తాను స్వయంగా వివేకించి, విమర్శించి, తర్కించి తెలుసుకొన్నప్పుడే, విద్యార్జనము అర్థవంతమౌతుంది. నిజమైన గురువులు ఇలాంటి బుద్ధికుశలురను సర్వదా, సర్వత్రా ప్రోత్సహిస్తారు. తమ చేత కానప్పుడు చేతనైన ఇతర గురువుల చేత ఆ శిష్యుని వికాసానికి తోడ్పడతారు. కాని శ్రీ యాదవప్రకాశగురువలా చేయలేదు. పైగా శిష్యుని అమిత ధీశక్తి చూసి భయపడి తమ అద్వైత సంప్రదాయానికెక్కడ భంగం కలిగిస్తాడోనన్న సంశయంతో, రామానుజుని తుదముట్టించే నైచ్యకార్యానికి కూడ సంసిద్ధుడయ్యాడు! ఆహా! మతమౌఢ్యం మనిషినెంత దిగజారుస్తుంది? మనిషి సుఖకర మనుగడకు పుట్టిన మతాలే, మనిషి మనుగడకు హానికారకాలైతే, ఆ మతాలుండేమి, లేకేమి!

అద్వైతమతం ప్రకారం, బ్రహ్మ (భగవంతుడు) నిర్గుణుడు, నిరాకారుడు. ఈ కన్పించే ప్రపంచం బ్రహ్మయందు భాసిస్తుందే తప్ప, నిజంగా లేదు. అంటే లేనిది ఉన్నట్లు కనబడుతుంది. కనుక అది మిథ్య. సత్యం ఒకటే, అదే బ్రహ్మ. ఈ బ్రహ్మ అద్వితీయం. ఈ బ్రహ్మోపాసన చేయాలంటే నిర్గుణ, నిరాకార చైతన్యాన్ని ధ్యానించాలి. అలా ధ్యానించినప్పుడు, క్రమంగా అనంతమైన బ్రహ్మానందం, సర్వదుఃఖాలకతీతమైన అపరోక్షానుభూతి అనుభవంలోకి వస్తుంది. 'అహం బ్రహ్మాస్మి' అన్న సత్యం అనుభూతమౌతుంది.

ఇదంతా వినటానికెంత ఇంపుగా ఉన్నా, ఆచరణలోకి రాగానే ద్వంద్వయుతుడైన, త్రిగుణ పరివేష్టితుడైన మనిషిని గందరగోళపరుస్తుంది. శ్రీ రామానుజులీ విషయం గమనించాడు. చాలామంది 'అహం బ్రహ్మాస్మి' అంటూ కూడా రాగద్వేషాదులకు, దేహాధ్యాసకు, ఇంద్రియలోలత్వానికి అతీతులుగా ఉండకపోవటం కన్పించింది. తాను బ్రహ్మ అని అనుకొంటున్నాడే తప్ప, బ్రహ్మయొక్క బహిరంతర సర్వవ్యాపకత్వాన్ని సాధకులు గ్రహించటం లేదు. పైగా ప్రపంచం 'మిథ్య' అంటూ సంఘంనుండి తమ అవసరాలన్నీ గ్రహిస్తూ, ఆ సంఘం యెడల తమ విధులను బాధ్యతలను మరిచి, నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈ సాధన ఫలితం, సాధకునిలో మౌఢ్యాన్ని, అహంభావాన్ని మరింత విజృంభింపజేస్తున్నాయే తప్ప, అతని మనసును స్వేచ్ఛాయుతంగా, అమనస్కంగా, సంకల్ప వికల్ప రహితంగా మార్చటం లేదు. కనుక ఈ సిద్ధాంతాన్ని మార్చవలసి ఉంది. ప్రజలను అత్యున్నతమైన మానసిక స్థితులకు ఆరోహింపజేయవలసిఉంది. బ్రహ్మను సర్వులకు అందుబాటులోకి తేవలసిన అవసరముంది.

దానికై రామానుజులు అద్వైత సిద్ధాంతాన్ని కొద్దిగా సవరించాడు. 'బ్రహ్మ సత్యమే;

నిరాకార నిర్గుణ చైతన్యమే. అంతేకాదు బ్రహ్మ సగుణుడు, సాకారుడు కూడ. సాధకుల (భక్తుల)కు నామరూపగుణాలతో దర్శనమిస్తాడు. మాట్లాడతాడు. వారి కష్టాలను, బాధలను కరుణాహృదయంతో వింటాడు. ఓదారుస్తాడు. ఆనందమార్గం వైపు దారి చూపిస్తాడు. అవసరమైతే తానే తోడూ-నీడయై సాధకున్ని నడిపిస్తాడు'—అంటూ బ్రహ్మను ఈశ్వరునిగా రూపొందించి, జనులకత్యంత చేరువగా చేశాడు. తల్లి-దండ్రి ఆత్మీయులకన్నా ఆత్మీయుడైన బంధువు, సఖుడు, ప్రియతముడు, భర్త, మాతాపితలు అన్నీ ఆ భగవంతుడేనని, నిరాశ, నిస్పృహలతో దిక్కుతోచని చింతలతో కలవరపడేవారికి తెలియజేసి, వారిలో తిరిగి జీవచైతన్యాన్ని కల్గించాడు. అనాథులమంటూ బాధపడకండి, భగవంతుడే నాథుడు. దిక్కులేని వారమంటూ బాధపడకండి ఆ భగవంతుడే మీకు దిక్కు. దరిద్రులమని వ్యథ చెందకండి, ఆ లక్ష్మీనారాయణుడే మీ పోషకుడంటూ, సామాన్యుల జీవితంలో ఆశలను చిగురింపజేసాడు. అడుగడుగునా దాపరిల్లే అనేక కష్టాలకు - దుఃఖాలకు నివారకునిగా భగవంతుని చూపించి, జనులకు ఆత్మీయమైన బలధైర్యాలను ప్రసాదించాడు. బ్రహ్మను సగుణ సాకార ఈశ్వరునిగా సాక్షాత్కరింప జేయటంతో రామానుజుడు సంతృప్తి పడలేదు. ఏ ప్రపంచంలో జనులు తమ బతుకులు వెళ్ళదీస్తున్నారో, ఆ ప్రపంచం మిథ్యారూపమైనది కాదని కూడ చెప్పవలసి వచ్చింది. తామున్న ప్రపంచం మిథ్య అయితే ఇక తమ బతుకుల కర్థమేమిటి? ఈ మిథ్యా ప్రపంచం కోసం, ఈ మిథ్యా భార్యా పుత్రాది కుటుంబ పోషణ కోసం తామెందుకు వృథాగా కృషి చేయాలి? ఈ లేనిదాని కోసం తామెందుకు శ్రమించాలి! హాయిగా, ఉన్న సత్యమైన ఆ బ్రహ్మను ధ్యానిస్తే సరిపోదా?—అన్న నిస్తేజత, పలాయనతత్త్వం, పిరికితనం, సోమరితనం ఈ ప్రపంచ మిథ్యా భావం వల్ల జనుల్లో ఏర్పడటం చూశాడు. 'అహం బ్రహ్మాస్మి' అంటే 'ఈ ప్రపంచ మండలి సర్వజడ చేతన పదార్థాల్లో ఉన్న బ్రహ్మను నేనే' అన్న అభిప్రాయం కలగజేసుకోటానికి బదులుగా, 'నేను బహ్మను, తదితరులంతా మూర్ఖులు; నేను మాత్రమే సత్యం ఇతరమైనదంతా, ఇతరమైన కార్య కలాపాలన్నీ మిథ్య' అన్న దేహగతమైన మూఢాభిప్రాయంలో అటు బ్రహ్మకూ గాక, ఇటు ప్రపంచానికీ కాక, రెంటికీ చెడిన రేవడిలా ఎందుకూ కొరగాకుండాపోతున్నారు. ఇలాంటి మూఢత్వాన్ని చూసి, రామానుజునకు అపారమైన దయ కల్గింది. అతను అత్యంత సాహసంతో లేచి, అద్వైత ప్రతిపాదితమైన ప్రపంచ మిథ్యాత్వాన్ని ఖండించాడు. "జనులారా! ఈ సత్యం వినండి. ఈ ప్రపంచం మిథ్య కాదు; సత్యం. ఈ ప్రపంచం ఆభాసమాత్రం కాదు; అది భగవంతుని నుండి పరిణమించినట్టిదే. మీ కోసమే, మీ ముక్తికోసమే భగవంతుడీ ప్రపంచాన్ని తన నుండి సృజించాడు. ఈ ప్రపంచం మాయాభూతం కాదు. రండు. ఈ సత్య ప్రపంచం ద్వార ఆ సత్యస్య సత్యాత్మను చేరుకొండు" అంటూ ఘోషించి పల్కాడు.

"బ్రహ్మ సగుణం. ప్రపంచం భగవంతుని లీలకోసం అతనినుండి పరిణమించినట్టిది. జీవులు ఈ ప్రపంచం ద్వార భగవంతుని సేవిస్తూ, ఆ భగవంతుని రూపులైపోతారు. ఆ భగవద్రూపులు కావటమే మానవుల యొక్క కర్తవ్యం. దానికొకటే మార్గం, శరణాగతి. అదే ప్రపత్తిమార్గం. భగవంతుని

మనోవాక్కాయాల చేత సంపూర్ణంగా శరణు పొంది, ఆ భగవంతుని నిష్కాసంగ సేవించండి. భగవంతుని ధామంలో భగవద్రూపులై భగవంతునిలా అతిశయానందాన్ని అనుభవించండి. ఈ దేహాన్ని విడిచి ముక్తి పొందండి''—అంటూ రామానుజులు అద్వైత సిద్ధాంతాన్ని, సామాన్య జనులకత్యంత చేరువలోకి తెచ్చి, వారి జీవితంలో జీర్ణమై పోయేలా చేశాడు. ఇదే తర్వాత విశిష్టాద్వైతంగా పేర్కొనబడి ది సగుణత్వం, సాకారత్వం, ప్రపంచ సత్యత్వం ఇందులో విశిష్టంగా వచ్చాయి.

ఈ విశిష్టాద్వైతభావం, సంప్రదాయం రామానుజుడు కొత్తగా తెచ్చింది కాదు. అది పూర్వకాలం నుండి వస్తున్నదే. రామానుజునికి పూర్వం ఆళ్వారులు ఈ వైష్ణవసంప్రదాయాన్ని అనుసరించిన వారే. వారి ప్రభావం శ్రీరామానుజాచార్యులపై ఎంతైనా ఉంది. పోతే, మరుగున పడి, కనీ కనపడక ఉన్న ఆ సంప్రదాయాన్ని ఆచార్యులు పైకి తీసి, దానికి స్పష్టమైన రూపం, స్థానం కల్పించాడు రామానుజుని తర్వాత అనేకమంది వైష్ణవాచార్యులు దీన్ని పరిపుష్టం చేశారు భక్తిమార్గాన్ని సువిశాలం, విశాలతరం చేశారు. కుల మత జాత్యాది భావాల కన్నింటికీ అతీతంగా అందరికీ సన్నిహితంగా తీర్చి దిద్దారు.

బ్రహ్మాను సాకార భగవంతునిగా చూపెట్టిన శ్రీరామానుజాచార్యులు క్రీ. శ. 1017 వ సంవత్సరంలో శ్రీపెరు బూదూరు నందు గొప్పపండితుడు, భక్తుడైన శ్రీ ఆసూరి కేశవాచార్యులకు, వివేకవంతురాలు, వైష్ణవ సంప్రదాయాన్ని బాగా ఎరిగిన అధ్యాత్మిక చింతనగల కాంతిమతి అను వారి ధర్మపత్ని యందు జన్మించాడు.

రామానుజులకు ప్రథమ గురువులు తల్లిదండ్రులే. ముఖ్యంగా తల్లియే రామానుజుల అభ్యుదయానికి కారణమైంది. నిజానికి ప్రతి బిడ్డకు తల్లియే ప్రథమ గురువు. గురువులోని సామర్థ్యాన్ని బట్టి ఆ పిల్లల అభివృద్ధులు ఆధారపడి యుంటాయి. జీజాబాయి పెంపకంలో ఛత్రపతిశివాజీ నాటి మొగలులను గడగడ లాడించి హైందవ సంస్కృతిని రక్షించారు. తల్లిలోనే సంస్కారం, సామర్థ్యం కొరవడియుంటే సామాన్యంగా బిడ్డలు కూడ ఉన్నత సంస్కారవంతులు కాలేరు. ఈ విషయం మనం చరిత్రలో అనేకమంది మహనీయుల విషయంలో చూస్తుంటాం. అందుకే మన భారతీయ సంస్కృతి స్త్రీకి అత్యంత ప్రాముఖ్యమిచ్చింది. ఆమెను శ్రీమాతా అని కీర్తించింది. నేటి తల్లులెంతమంది ఇలాంటి ఉన్నత సంస్కారాలను కల్గియుండి, తమబిడ్డల అభ్యుదయానికి కారకులౌతున్నారో, అది ప్రతితల్లీ ఆలోచించుకోవలసిన విషయం. తల్లి ప్రథమ గురువు కదా అని, పిల్లవాణ్ని శాసించట ఆరంభించకూడదు. ముందుగా తానా గురుత్వ యోగ్యతను సామర్థ్యాన్ని సంపాదించుకోవాలనే, ఈ వాక్యంలోని సామర్థ్యం లేకుండా 'తల్లి ప్రథమ గురువ'ని శాస్త్రం చెప్పింది కనుక నేను చెప్పినట్లు చేయాలి అని శాసిస్తే, అది నియంతృత్వం అవుతుంది గాని గురుత్వం కాదు.

కాంతిమతి అలా నియంతగా వ్యవహరించ లేదు. రామానుజుని విద్వాంసునిగా, భక్తునిగా తీర్చిదిద్దాలని యత్నించింది. ఆమె స్వయంగా పండితురాలు. పైగా సంస్కరణ భావాలు గలది. మూఢాచారాలు, మూఢ

సమ్మోహాలకతీతమైనది. ఇలాంటి తల్లి పెంపకంలో రామానుజులు బాల్యవిద్య నభ్యసించి వైష్ణవ భక్తితత్త్వాన్ని జీర్ణించుకోసాగారు 16 వ ఏటి వరకు అందరిలా విద్య నభ్యసించాడు.

పదహారవ సంవత్సరంలో రామానుజునికి వివాహమయింది. కాని దురదృష్టంకొద్దీ అతని తండ్రి ఆ తర్వాత కొంత కాలానికే పరమపదించారు. శోకంలోనున్న తల్లియే శ్రీరామానుజుని బాధ్యతనంతా వహించవలసివచ్చింది. ఆమె, కుమారుని విద్యకోసం కాంచీపురానికి తరలిపోయే యత్నంలో ఉండగా, తిరుకచ్చినంబి అనబడు కాంచీపూర్ణుడనే వైష్ణవ భక్తుని కలయిక సంభవించింది. ఈ భక్తుడు రామానుజునికి గురువై ఆళ్వారుల చరిత్రలను, ఆధ్యాత్మిక విద్యను బోధించాడు. ఆ తర్వాత కాంచీనగరానికి మకాం మార్చి, అక్కడున్న అద్వైతగురువు శ్రీయాదవప్రకాశునికి రామానుజుడు శిష్యుడుగా కుదిరాడు. కొద్ది కాలంలోనే అపారపాండిత్యాన్ని సంపాదించాడు. కాని అద్వైతపరమైన గురువులబోధ అతనికి సంతృప్తి కల్గించలేదు. గురువులతో భేదించాడు. తర్కించసాగాడు. గురువులనుండి అనేకమయిన వివరణలు కోరసాగాడు రామానుజుల బుద్ధి తీవ్రతను ఆ గురువు క్షమించలేకపోయాడు. శిష్యుని అపార తెలివితేటలు చూసి, కోపంతో, భయంతో అతణ్ని చంపివేయటానికి ప్రయత్నించాడు. కాశీయాత్ర నెపం మీద అతణ్ని తనతోపాటు తీసికెళ్ళి, మధ్యలోని అడవుల్లో హత్యచేయాలని అనుకున్నాడు. కాని రామానుజులెట్లో అది గ్రహించి, ఆ గండాన్నుండి తప్పించుకొని, తల్లిని చేరుకున్నాడు.

శ్రీరంగంలోని వైష్ణవమఠాధిపతైన ఆళవందర్, రామానుజుని ముత్తాత. రామానుజుని ధీశక్తి ఎరిగిన అతను, తన తర్వాత మఠాధిపతిని చేయటానికి రామానుజుల నెన్నుకొన్నారు. రామానుజులను తీసుకరావటానికి పెరియనంబి అనే శిష్యుని పంపారు. పెరియనంబితో పాటు శ్రీరంగం చేరేసరికే ఆళవందర్ పరమపదించియున్నారు. శ్రీరామానుజుడు ముత్తాత ఆశయం నెరవేర్చటానికి సంసిద్ధులయ్యారు. పెరియనంబి వద్ద ఉపదేశం పొందాడు. అయితే తనభార్య ప్రవర్తనవల్ల పెరియనంబికి దూరం కావలసివచ్చింది. భార్య ప్రవర్తన తనకు ఆటంకంగా ఉండటం చూసి, ఆమె ఒకమారు పుట్టింటికి వెళ్ళగా, రామానుజులు సన్యాసం స్వీకరించాడు. ఆ తర్వాత శ్రీరంగ వైష్ణవ పీఠాధిపతియై, ముత్తాత ఆశయాలు తీర్చాడు. ''వేదాంతసారం, వేదాంత సంగ్రహం, వేదాంత దీపం'' అనే గ్రంథాలను వ్రాశాడు. బ్రహ్మసూత్రానికి భగవద్గీతకు భాష్యాలు రచించాడు. తన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని బహుళ ప్రచారంలోకి తెచ్చి, సామాన్యుల ఆదరాభిమానాలు కూడ చూరగొన్నాడు. అద్వైత ప్రకాండుల మీద అనేక విజయాలు సాధించి, అనేక తీర్థయాత్రలు చేసి, తన తరువాత ప్రచారనిమిత్తం 74 శిష్యులను నియమించి 1137 వ సంవత్సరంలో పరమపదించాడు. శ్రీరామానుజులలా 120 సంవత్సరాలు జీవించి పండిత పామరులకు సైతం వేదాంతతత్త్వాన్ని చేరువకు చేసి చిరస్మరణీయుడు, వందనీయుడై నేడుకూడ వెలుగులను విరజిమ్ముతున్నాడు.

శ్రీరామానుజుడు భక్తిమార్గంలో, ప్రపత్తిసాధన చేయటానికి "సాధక సప్తక" మని ఏడు భక్తి మెట్లను పేర్కొన్నాడు. అవి వరుసగా— 1. వివేకము 2. విమోహము 3. అభ్యాసము 4. క్రియ 5. కళ్యాణము 6. అనవసాదము 7. అనుద్ధర్షము.

వీటి గూర్చి విపుల చర్చ కిది స్థానంకాదు. సూక్ష్మంగా వీటిని ఒకమారు స్పర్శించి చూద్దాము.

భౌతిక మానసిక శౌచ్యము, ఆహారశుద్ధి, పవిత్ర జీవనము వివేకము. కోరికలను త్యజించుట విమోహము. మనసులో భగవంతుని రూపాన్ని నిరంతరం దర్శించే సాధన లేదా భగవద్ధ్యానము అభ్యాసము. తన స్వధర్మ సంబంధమైన తన బాధ్యతలోనున్న క్రియలను కర్మలను నిర్వహించటం క్రియ. సత్యము, ఆర్జవము, దయ, దానములను ఆచరించటం కళ్యాణము. నిరాశ, నిస్పృహ, విషాదాది చింతలనుండి స్వేచ్ఛగానుండటం అనవసాదము. అహంభావము, మానిత్వం, గర్వం ఇలాంటి దేహగత భావాలనుండి స్వతంత్రుడై యుండటం అనుద్ధర్షము.

ఈ ఏడు సాధనలద్వార భక్తి వృద్ధవుతుంది. భక్తి ద్వార క్రమంగా భగవంతుని ప్రేమ లభిస్తాయి. భగవంతుడు చివరికి ఆ భక్తుని అనుగ్రహించి, ఈ సంసార సుఖ దుఃఖాది వలయాన్నుండి, తన దగ్గరికి రప్పించుకొంటాడు. అంటే మోక్షం ప్రసాదించి, తన ధామంలో స్థానం కల్పిస్తాడు. ఆ పరంధాముని పరమధామంలోకి వెళ్ళటానికి మనమంతా చిత్తశుద్ధితో ఈ ఏడు సాధనలద్వార అవశ్య భక్తిని సంపాదించి, భగవంతుని అనుగ్రహానికి పాత్రులమయ్యేందుకు యత్నింతముగాక!

# మానవతావాది - ఫ్రామ్

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

నీ ప్రమేయం లేకనే నీవు పుడుతున్నావు; అంతకంటె నీ ప్రమేయం లేకనే నీవు గిడుతున్నావు. ఎప్పుడు ఎవరికి ఎక్కడ పుడుతున్నావో నీకు ఎరుక లేదు. నిన్ను ప్రేమించే వాళ్ళకంటె ముందే నీవు గతిస్తున్నావు. నీకు తెలివితేటలున్నాయి. తెలివితేటలున్నాయన్న సంగతి గూడ నీకు తెలుసు. ప్రకృతి శక్తుల ముందు నీవు అల్పుడవని నీవెరుగుదువు. అయినా వాటిని జయించాలని నీవు వాటితో తలపడ్డావు. ఫలితంగా నాగరకత ఆవిర్భవించింది. అది నీకు ప్రకృతికి మధ్య అడ్డుగోడ నిలిచింది. దానితో నీవు ప్రకృతికి దూరమయ్యావు. సిమెంటు ఉక్కు కట్టడాలలో ఏ. సి. గదులలో, సింథెటిక్ దుస్తులలో, నేమ్ ప్లేట్లు, డోర్ నంబర్ల ప్రపంచంలో (నేమ్ప్లేట్ పై ఉన్న పేరు, డిగ్రీ, హోదాలకు ఉన్న గౌరవం అసలు వ్యక్తికి లేదు. అతని హోదాను డిగ్రీని గౌరవిస్తాముగాని, అతనిని గౌరవించము, గుర్తించము) ఏకకుటుంబాలలో (ఉమ్మడి కుటుంబాలు పోయి, భార్యభర్త పిల్లల వరకే పరిమితమైన కుటుంబాలు వచ్చాయి), కృత్రిమ వాతావరణంలో నీవు నివసిస్తూ

సహజత్వాన్ని కోల్పోయావు. మనసొకటి చెబితే మరొకటి చేస్తున్నావు. నీ ప్రవృత్తికి నీవే దూరమయ్యావు. ఫలితంగా ఒంటరివాడవైనావు; ఏకాకివైనావు. నీకు ఇప్పుడు 'నా' అనేవాళ్ళు లేరు. ఈ ఒంటరితనం దుర్భరం; ఎలాగో దీనినుంచి బయటపడాలి. బాహ్య ప్రపంచంతో, ఇతరులతో సంలీనం చెందాలి. లేకపోతే పిచ్చివాడివై పోతావు. మరి ఇతరులతో సంలీనం చెందడం ఎలా? అందుకే ఈ రోజు మత్తుద్రవ్యాల సేవనం అధికమైంది; త్రాగి తందనాలాడడం ఎక్కువైంది. L. S. D; మార్జువానాల సేవనం మితిమీరింది. జాతర్లలోలాగ తాండవం చేసి పూనకం తెచ్చుకొనే మార్గాలు ఈనాడు కాబెరా నృత్యాలలో లభిస్తున్నాయి. వీటి ద్వారా కొంచెంసేపైన నిన్ను నీవు మరిచి అనంతవిశ్వంతో సంలీనం చెందవచ్చు. మత్తు దిగిన తరవాత కథ మామూలే. పరిష్కారం ఇది కాదు, ప్రేమ. అసలు ఈ ఒంటరితనం, ఏకాకితనం నీకు ఎలా వచ్చాయి?

ఒకప్పుడు నీవు ఆటవికుడవు. అప్పుడు ప్రకృతి ఒడిలో పరవశించావు. స్వర్గాన్ని చూచావు. ప్రకృతి నీవు వేరుకారు. అక్కడ అనిశ్చితతకు (uncertainity) చోటులేదు. ప్రకృతిలో ఉంటూనే దానిని అధిగమించ నారంభించావు. నాగరకత పెరిగింది. దానితో నిశ్చితతలోనుంచి అనిశ్చితతలోకి విసరబడ్డావు. నీవు నిర్మించుకొన్న నాగరక ప్రపంచంలో ప్రతిదీ అనిశ్చితమే. అనిశ్చితత భయానికి దారితీస్తుంది; వ్యాకులతకు దారితీస్తుంది. నీవు కొంత దూరం ఈ దిశలో పయనించావు; అంటే ప్రకృతికి దూరంగా నడిచావు. ఒకసారి పుట్టిన తరవాత నీవు మాతృగర్భాన్ని తిరిగి ప్రవేశించలేవు. మళ్ళీ ప్రకృతి ఒడిని తిరిగి పొందలేవు. నిన్ను వెనుదిరిగి రానీయకుండ దేవతలు జ్వలిస్తున్న కృపాణాలతో కాపలాకాస్తుంటారు, నీ దారి ముందుకే, వెనుదిరిగే ప్రసక్తే లేదు. నీవు మరొక క్రొత్త స్వర్గాన్ని వెదుక్కోవాలి. ప్రకృతిలో నీవు పోగొట్టుకొన్న ఐక్యతను, నిశ్చితత్వాన్ని, నీ స్వర్గధామాన్ని పునః సృష్టి చేయాలి. ఈ ప్రయత్నంలో నీ మేధాసంపత్తిని పెంపొందించుకోవాలి. ఈ పునఃసృష్టి మానవతా ప్రాతిపదికపైన జరగాలి. అత్యంత నిశ్చిత స్థితిలో నుంచి అనిశ్చితస్థితిలోకి విసరబడ్డ నీకు రెండే రెండు విషయాలు స్పష్టంగా తెలుసు. ఒకటి గతం గురించి. రెండవది అనాగతంలో మరణం ధ్రువమని. ప్రకృతిలోనే ఉంటూ, దానినే అధిగమిస్తూ, ఒంటరితనంతో, అనిశ్చితతతో, వ్యాకులతతో వేగిపోతున్న ఈ మానవుని 'అస్తిత్వ' సమస్యకు పరిష్కారమేమిటి? ఈ మానవ సంసారానికి పరమార్థం ఏమిటి? అసలు విషయం ఏమిటంటే, తన అస్తిత్వమే తనకు సమస్య అయినది మానవునికొక్కడికే. ఇది గుర్తించినదీ మానవుడొక్కడే. మనిషి ఎప్పుడు పుట్టినట్లు? తల్లిగర్భంలోనుంచి బొడ్డు కోసుకొని భూమిమీద పడినప్పుడా? కాదు. మానవజాతి సమస్య జనన రహస్యాన్ని ఛేదించడం. తల్లి గర్భంలోనుంచి బయట పడగానే జననం పూర్తికాలేదు. జనన ప్రక్రియ సాతత్య ప్రక్రియ. ఎడతెగనిది. మనిషి జ్ఞానాన్ని సంపాదించుకొంటూ ముందుకు పోతున్నంతకాలం, తనలోని "తన"ను ఎరగడానికి ప్రయత్నించినంతకాలం, అతడు పుడుతూనే ఉంటాడు. "ఆత్మానం విద్ధి" తనను గురించి ఏ కొంత తనకు తెలిసినా అది జనన ప్రక్రియలో ఒక అడుగు ముందుకే. జ్ఞానం సంపాదించడమంటే తనను తాను ఎరగడమే. తనను తాను ఎరగడమంటే అంతకు ముందర తెలియని "నిన్నును" నీవు తెలుసుకొనడమే.

అంతకు ముందర తెలియని "నిన్ను"ను నీవు పుట్టించడమే. ఈ విధంగా జనన ప్రక్రియ అలా సాగిపోతూ ఉండవలసిందే మనిషి చనిపోయే లోపల పుట్టాలి. పుట్టడమంటే నిన్ను నీవు తెలుసుకోవడమే. కాని మనలో చాలమందిమి పుట్టకముందే గిడుతున్నాము.

ఈ ప్రశ్నలు మానవ సంసారానికి (Human existance) సంబంధించిన సమస్యలు. వీటికి పరిష్కారం ఏమిటి? ఈ సమస్యలను ఈ నూతనార్థంలో లేవనెత్తి పరిష్కరింప ప్రయత్నించినవాడు ఎరిక్ ఫ్రామ్.

మనోవిశ్లేషణ ప్రక్రియలో విశేషజ్ఞానాన్ని ఆర్జించిన ఫ్రామ్, 1980 మార్చి 18 వ తేదీన స్విట్జర్లాండ్‌లో గుండెపోటుతో మరణించాడు. 23 మార్చి 1900 లలో ఫ్రాంక్‌ఫర్ట్-యామ్-మేన్ (Frankfurt-am-Main) - అంటే జర్మనీ మధ్యంలోని ముఖ్యనదిపై ఉన్న నగరంలో జన్మించాడు. హైడిల్‌బర్గ్, ఫ్రాంక్‌ఫర్ట్, మ్యూనిక్ విశ్వవిద్యాలయాలలో సామాజిక శాస్త్రం, మనోవిజ్ఞానశాస్త్రాలను అభ్యసించాడు. మనోవిశ్లేషణంలో బెర్లిన్‌లో తర్ఫీదు పొందాడు. హిట్లర్ యూదు ద్వేషం అతనిని 1932 లో అమెరికాకు ప్రవాసం పంపింది. అక్కడ అనేక విశ్వవిద్యాలయాల్లో అతడు ఉపన్యసించాడు. కొలంబియా, యేల్, బెనింగ్‌టన్, మిచిగాన్ విశ్వవిద్యాలయాల్లో పాఠాలు చెప్పాడు. నేషనల్ ఎడ్యుకేషనల్ మెడికల్ స్కూలులో ఆచార్యపదవి నలంకరించాడు. విలియమ్ అలాన్‌సన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఉపన్యాసకుడుగ పనిచేశాడు. 1960 దశాబ్ది చివర నుంచి, స్విట్జర్లాండ్‌లోని మురాల్టోలో శేష జీవితాన్ని గడిపాడు.

ఇతడు ఇరవై పైచిలుకు గ్రంథాలను రచించాడు: "Escape from Freedom", "The Art of Loving", "Same Society", "Man for Himself. "The Forgotten Language", "Psychoanalysis and Religion" లు అతని ప్రసిద్ధ గ్రంథాలలో కొన్ని. అతడు ఎన్ని గ్రంథాలు వ్రాసినా, ఎన్ని ఉపన్యాసాలు చేసినా అతనిలో అంతర్వాహినిగ ప్రవహిస్తున్న లక్ష్యం ఒకటే: "మనిషిని మానవునిగ, మానవుని మానవీయునిగ పరివర్తించడమెలా? మనిషిలోని మానవతను వికసింపజేయడానికి అనుగుణ పరిస్థితులను కల్పించడమెలా?"

ఈ లక్ష్యానికి అనుగుణంగానే అతడు, ఇంతకుముందు పేర్కొన్న మానవ అస్తిత్వ సమస్యకు సమాధానం "ప్రేమ" అని చెప్తాడు. మానవ సంసారానికి ప్రేమ ఒక్కటే పరమార్థం అంటాడు. "Love", says Dr. Fromm, "is the only satisfactory answer to the Problem of Human existance.." ప్రేమ ద్వారా మనిషి ప్రకృతితో పోగొట్టుకొన్న ఐక్యాన్ని, స్వర్గాన్ని మానవాళిలో దర్శిస్తాడు. ఒంటరితనం, ఏకాకితనాలతో నిష్పన్నమైన వ్యాకులత అదృశ్యమవుతుంది.

అయితే అతడు మాట్లాడేది గర్భస్థ శిశువుకు తల్లికి మధ్య ప్రేమ గురించి కాదు. కాదు కాముక ప్రేమ, లేదు వ్యక్తిక ప్రేమ, అబ్బాయి అమ్మాయి ప్రేమ కాదు. మానవ అస్తిత్వ సమస్యకు పరిష్కారం కాదగిన పరిణత ప్రేమ, బుద్ధ ప్రేమ, సార్వజనీనక ప్రేమ, ఆత్మావగాహం మీద ఆధారపడిన ప్రేమ, ధైర్యసాహసాలతో కూడిన ప్రేమ. పరిణత ప్రేమ అంటే వ్యక్తిసమగ్రతను, వ్యక్తిత్వాన్ని పరిరక్షిస్తూనే సంలీనం చేసే ప్రేమ మనిషిలో క్రియాశీలక శక్తిగా మారిన ప్రేమ. తోటి మానవులకు తనకు మధ్య ఉన్న అడ్డుగోడలను కూల్చి

వేయగలిగిన ప్రేమ. ఈ ప్రేమ మానవునికి స్వర్గాన్ని తిరిగి ఇస్తుంది. 'God is love' అన్నప్పుడు దైవభావనలోని ప్రేమ ఇదే.

మనలో అధికజనానికి ఇటువంటి ప్రేమను పెంపొందించుకొనే శక్తే లేదు. ఈ శక్తిని పెంపొందించుకోవడానికి, ఇతర కళలలోవలె ఏకాగ్రత, అభ్యాసాలు కావాలంటాడు ఫ్రామ్ అంతేగాక, ఇతర కళలకంటె కూడ దీనిలో అవగాహన, అంతర్దృష్టి కావాలన్నాడు.

దేవుడు చనిపోయాడా? ఈ ప్రశ్నకు అతడు రచించిన "you Shall be as gods" లో సమాధానం లభిస్తుంది. ముందు కొంచెంగా దైవభావనను గురించి వివరించాలి. అసలు దేవుడు అనేక మార్పులకు గురయ్యాడు. మానవ పరిణామంతోపాటే దైవభావనలోను మార్పులు వచ్చాయి. ప్రకృతితో పెనవేసుకొని ఉన్నప్పుడు మనిషి చెట్లను, పుట్లను పూజించాడు. తరవాత జంతుపూజ, బహుదేవతారాధన వచ్చింది. దేవుడు మానవాకృతిలో మలచబడ్డాడు. తరవాత ఏకదేవతారాధన వచ్చింది. ఈ దేవునికి మనిషి భయపడతాడు. ఈ దేవుని వరాలిమ్మంటాడు, పూజిస్తాడు. అయితే పరిణామం ఇక్కడితో ఆగిపోలేదు. నిజమైన మతావలంబి, బుద్ధునికివలె దేవుని ఏమీ అడగడు దేవుని గురించి తనకేమీ తెలియదంటాడు. దేవుడు ఏ భావనకు ప్రతీకో, ఆ భావన వెనుక ఏఏ అనుభవాలున్నవో వాటియందే తనకు విశ్వాసమంటాడు. ప్రేమ, ధర్మం, సత్యం, న్యాయాలకు దేవుడు ప్రతీక. అయితే- మనిషిలాంటి దేవుడు కాకపోతే- నేను వాటినే ప్రేమిస్తాను. అంటే ప్రేమను ప్రేమిస్తున్నానని అర్థం. ధర్మాన్ని పూజిస్తున్నానని అర్థము.

ను, ఫ్రామ్, ఇలా అడగమంటాడు: "దేవుడు ఏఏ అంతిమ విలువలకు ప్రతీక అవుతుందో – ఆ అంతిమ విలువలు, దైవభావన ఏఏ అనుభవాలను రేకెత్తిస్తుందో ఆ అనుభవాలు చచ్చిపోయాయా ?" లేక 'దేవుడు మరణించాడా!' అని అడిగేదానికంటె 'మానవుడు మరణించాడా" లేక 'మానవత మరణించిందా?' అని నేటి ప్రపంచాన్ని అడగడం సముంజసంగా ఉంటుందంటాడు ఫ్రామ్. 'you shall be as gods' లో ఫ్రామ్, చెప్పిన దైవభావనలోని పరిణామం – అసూయా పరుడైన భగవానుడు రాజు ఎలా అయిందీ, చివరికతడు నామరహితుడైన దేవుడెలా అయింది, ఈ నామరహితుడు మనిషిని తీర్చిదిద్దే సూత్రాలకు ప్రతీక ఎలా అయిందీ, (దీనికి విపర్యయంగా మానవుడు, 'దేవునికి, మీ విధేయుడైన సేవకుని'నుంచి తన చరిత్రకు తాను కర్తకాగల స్థితికి ఎలా చేరింది)–వివరించాడు.

ఫ్రామ్‌ను అత్యంతంగా ప్రభావితం చేసిన వారిలో బుద్ధుడు, క్రీస్తు, మార్క్స్, ఫ్రాయిడ్‌లు ముఖ్యులు. ఫ్రాయిడ్ సహజాతమానవుని (related man) బుద్ధ క్రీస్తుల పరిణత కరుణ ప్రేమలను రంగరించి నూతన మానవీయమానవుని ఆవిష్కరింపజేశాడు.

ఫ్రాయిడ్ మనోవిశ్లేషణం ఎందుకు సంకట స్థితి (crisis) లో పడిందీ వివరిస్తూ, ఫ్రాయిడ్ అనుయాయులు అతనిలోని సమూల పరివర్తన (radical change) లక్షణాన్ని గుర్తించకుండా తప్పుదారిలో అనువృత్తి (conformist) లక్షణాన్ని మాత్రమే గ్రహించారు. ఫ్రాయిడ్ అహేతుకశాస్త్రాన్ని (Science of the irrational) ప్రవచించి కోపర్నికస్ విప్లవాన్ని తీసుకొచ్చాడు. అచేతనం (Unconscious) రచనలలో, కలలలో, రోగలక్షణాలలో, నిత్యజీవితలలో దొర్లే పొరపాట్లలో ఎలా బహిర్గత

మయ్యేది వివరించాడు. మనిషి ప్రవర్తనపై అచేతనం ప్రభావాన్ని వివరించాడు. ఇంత వరకు ఫ్రాయిడ్‌తో ఫ్రామ్ ఏకీభవిస్తాడు. విక్టోరియా యుగంలో లైంగికతను అణచి వేయడం ఆరోగ్యమని భావించిన సమాజాన్ని విమర్శించి ఫ్రాయిడ్ తన సిద్ధాంతానికి లైంగికతను కేంద్రంగా చేసుకొంటే, ఆ లైంగికతను పట్టుకొని ఇప్పుడు వేళ్ళాడడం కుదరదంటాడు ఫ్రామ్. ఎందుకంటే విక్టోరియాసమాజం ఇప్పుడు లేదు లైంగికత అణచివేత లేదు. అదొక వినిమయవస్తువు (Commodity) అయిపోయింది. వెలకు దొరుకుతోంది. ఇప్పటి సమాజంలో కొత్త సమస్యలు వచ్చాయి. రాజకీయాలు నిర్వీర్యమయ్యాయి. వ్యవస్థామానవుడు (Organisation man) ఆవిర్భవించాడు. మధ్యతరగతి భద్రత ఎగిరిపోయింది. ఇది వ్యాకుల కాలయుగమైంది (Age of anxiety). వైమనస్యం (alienation), ఒంటరితనం(loneliness), వేర్పాటు (Separation) ఈ యుగలక్షణాలు. తను సృజించిన యంత్రానికి మానవుడు బానిస అయ్యాడు. యంత్రంలో భాగమయ్యాడు. అతడొక వినిమయవస్తువు (Commodity) అయ్యాడు. మార్కెట్టులో ఏ లక్షణాలకు రేటు పలుకుతుందో ఆ లక్షణాలనే పెంపొందించుకొంటున్నాడు. మానవసంబంధాలను 'అంగడినీతి' (rules of the market) ఏలుతోంది. తల్లి-బిడ్డ సంబంధాలను ఆర్థికవిలువలు నిర్ణయిస్తున్నాయి. మార్పులేని మనోవిశ్లేషణం (Psychoanalysis) మారిన ఇటువంటి ప్రపంచానికి ఏమి చేయగలదు. అందుకని మనోవిశ్లేషణం ఈ మార్పులకనుగుణంగా మారాలంటాడు ఫ్రామ్. లైంగికతకు మారు వైమనస్యం, ఒంటరితనం మనోవిశ్లేషణకు కేంద్రాలు కావాలనాడు.

నూతనమానవుని, వినిమయవస్తువుగా కాక, మనిషిని మనిషిగా ప్రతిష్ఠించే ప్రయత్నంలో జెర్న్‌ఫీల్డ్, విల్‌హెల్మ్‌రీక్‌లకు వలె ఇతడు అనేకాటుపోట్లకు గురికావలసి వచ్చింది [?] చేశాడు. ఫ్రాయిడ్ అచేతనసిద్ధాంతాన్ని గతితార్కిక పద్ధతిపై సామాజిక ఆరోగ్యదృష్టి (health of the society) తో కాకుండ, మానవతారోగ్య (health of the humane దృష్ట్యా-అంటే నిండుజీవితాన్ని నిర్భయంగా గడపడానికి - సవరించాలన్నాడు ఫ్రామ్.

భవిష్యత్తులో అధికజనం బూజుపట్టిన అవిసిపోయిన ఆలోచనా మూసలకు, విషయాలకు అంటుకుపోయి, తాము అనుకొన్న దే సరైనదనే భ్రాంతిలో పడే ప్రమాదముంది. తమకున్న వ్యవహారజ్ఞానాన్ని (Common-sense), అందులోని కాల్పనికభాగాన్ని (fictitious element) పట్టించుకోకుండ, వివేచన (reason) అని భావించే ప్రమాదంలో పడతారు. ఈ హెచ్చరికను గుర్తుపెట్టుకొని 'గానుగెద్దు' ఆలోచనల నుంచి బయట పడమని, రోకంటిపాట పాడవద్దని, పరుల భావాలను చూచి అవి తనలో ఎప్పటినుంచో ఉన్నాయని, అవి అసలు తనవే ననే అలసత, గాడిలో పడవద్దని కోరతాడు.

(166 వ పేజీ తరువాయి)

డంలో నా ఇష్టం వచ్చినట్లు చెప్పాను. లంచాలు ఇచ్చిపుచ్చుకొనే ధోరణులు ఎలా ఉంటవో నాకు తెలియదు కాబట్టి నేను పైన వ్రాసిన ఆ విషయం మాత్రం అసహజంగా వాస్తవ దూరంగా తోచవచ్చు. కాని అది పొట్టు విషయం. దాన్ని మీరు తోసివేయండి- నాకు బాధ లేదు. గింజ విషయం సత్యం కాబట్టి దాన్ని మాత్రం గ్రహించండి.

# సద్దర్శనము

వివరణము డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

19. దేహాత్మభావే జ్ఞజడౌ సమానా
వేకస్య దేహే హృది దీప్త ఆత్మా
ఆక్రమ్య దేహాంశ్చ జగచ్చ పూర్ణః
పరస్య మేయం తనుమాత్రమాత్మా

ఆంధ్రానువాదం:- శారీరకసంబంధమైన భావాలు, జ్ఞానికి అజ్ఞానికి సమానములే. జ్ఞాని తనలోనే సాక్షాత్కరించే ఆత్మను, తన చైతన్యస్థానము వద్దకు చేర్చుకుంటాడు. ఈ ప్రక్రియలో తన దేహాభిమానమును, ప్రపంచాభిమానములు దాటి అంతటా వ్యాపించిపోతాడు. అజ్ఞాని. తన శరీరమే ఆత్మ అనుకొని, అందు ఖయిదీ అయిపోతాడు.

వివరణము:- జ్ఞానికి శరీరస్పృహ ఉండదని. అది ఉన్నదనే జ్ఞానమే ఉండదని, చాలామందికి అపోహ ఉంటుంది. అది తప్పు జ్ఞానికి కూడా ఇతరులకు వలె శరీరము ఒక వస్తువే; జ్ఞానికి కూడా దాని కష్టసుఖాలు నొప్పులు మొదలైనవి మార్పులు, అనుభూతి ఉంటుంది. జ్ఞానికి, అజ్ఞానికి, ప్రబుద్ధునికి. బుద్ధిహీనునికి తేడా ఎక్కడంటే - శరీర స్పృహయందు కాదు. వారి వారి శరీరములకు వారిచ్చే విలువ, వారి భావములు.

'నీవు ఎవరవు?' అని ఎవరైనా అడిగితే ఆ ప్రశ్నకు జవాబు నీలో 'నేను' 'నేను' అని గంతులు వేసే అల్లరి పిల్లవాని దగ్గరకైనా పోగలిగితే, కొంతవరకూ మంచిదే. ఆ 'నేనే' నీ మనస్సుగా, బుద్ధిగా, ప్రాణంగా, శరీరంగా బయటపడుతుంది. కాబట్టి చాలామంది తమ స్వరూపం అహంకారంతో మొదలెట్టి శరీరందాకా ఉండేదని తలుస్తారు. దీనికే శరీరాభిమానమని అంటారు. ఇక్కడ శరీరం అంటే, స్థూలశరీరం. మనస్సు. బుద్ధి. అహంకారం కూడా ఉంటాయి. జ్ఞానికి ఆత్మసాక్షాత్కారం పొందే వరకూ, ఈ శరీరాభిమానం ఉంటుంది. కాని ఆ తరువాత, ఈ శరీరమే తాననుకొనే పొరబాటు ఉండదు. నిజస్థితి తెలుసుకొంటాడు. తన శరీరం, బుద్ధి, అహంకారాన్ని కూడా దాటి తన నిజస్వరూపమైన శుద్ధచైతన్యంతో లీనమైపోతాడు. అనంతమైన ఆ సచ్చిదానందంతో ఏకమైపోతాడు. దేశకాలాలకు అతీతమైన, నిత్యమైన, అంతటా వ్యాపించిన తన నిజస్వరూపం సాక్షాత్కరిస్తుంది. అట్టి సమాధిస్థితినుండి తిరిగి జ్ఞాని జాగ్రత్తలోకి వస్తే ఈ శరీరం, మనస్సు, బుద్ధి, అహంకారం, ఈ సర్వప్రపంచం ఆ శుద్ధచైతన్యమైన ఆత్మ విలాసమే కాని మరేమీ కాదని గ్రహిస్తాడు. అప్పుడు తన శరీరానికి, ప్రపంచానికి తేడా ఏమీ గుర్తించలేడు. ఇతరులు, తాను తన శరీరమే అని భ్రమపడి ఇదరాభిమానాలు చూపిస్తారేమో కాని. జ్ఞాని అభిమానం తన శరీరంతో ఆగక లోకమంతటా వ్యాపించిపోతుంది. లోకమంతా అతని శరీరమే; అది పరిపూర్ణస్థితి.

తన సంకుచితమైన దృష్టి పోయి అనంతమైన, పూర్ణమైన సమ్యక్‌దృష్టి వస్తుంది. ఇది సముద్రములో పుట్టిన బుడగ పగిలి సముద్రపు నీటిలో కలిసిపోవటం వంటిది. తిరిగి ఆ నీరు బుడగగా ఉంటే సముద్రం వేరు, నేను వేరు, నేను బుడగగా పుట్టాను, బుడగగా ఉన్నాను, బుడగగా చస్తాను అని అనుకుంటుందా?- ఒకసారి తను సముద్రమేనని అనుభూతి కలిగాక. నేను ఈ సముద్రమునే; ఈ బుడగలు మొదలైనవి నా విలాసములు. ఈవేళ ఉండి రేపు పోయేవి;

జ్ఞాని స్థితికూడా ఇట్టిదే; ఈ జగత్తం తానే తన శరీరమనే గుర్తిస్తాడు. కాని అజ్ఞాని మాత్రం నేను ఈ శరీరమును. ఫలానా పేరు నాది, ఫలానావారి కొడుకుని. ఫలానా ఊర్లో ఫలానా తేదీన పుట్టాను అని అనుకుంటాడు. తాను ఈ శరీరముతో కూడుకొని ఉన్న మనస్సు. బుద్ధి మొదలైనవే అని సంకుచితభావంతో ఉంటాడు. జ్ఞానిమాత్రం పూర్ణదృష్టితో లోకం అంతా తానేనని పూర్ణపురుషుడుగా ఉంటాడు.

ఇద్దరు బాల్యంలో సన్యసించి, ఆత్మజ్ఞానం పొందారు. తరువాత కొంతకాలమునకు వాళ్ళు కల్సుకొన్నప్పుడు ఒకడంటాడు 'నేను లేను, ఉన్నదంతా సర్వేశ్వరుడే.' రెండవవాడు-'అంతా నేనే, నాకన్న ఇతరం ఏమీ లేదిక్కడ' అంటాడు. వారిద్దరి భావం ఒకటే కాబట్టి వాళ్లు పోట్లాడరు. అదీ, నేను అనే అహంకారం పోయిన తరువాత కలిగే సాక్షాత్కారం. అప్పుడు ఉండేది ఒక్క పరబ్రహ్మమొక్కటే.

20. అజ్ఞస్య విజ్ఞస్య చ విశ్వమస్తి
పూర్వస్య దృశ్యం జగదేవ సత్యం
పరస్య జగదాశ్రయభూతమేకం
సత్యం ప్రపూర్ణం ప్రభావిభాంత్యరూపం

ఆంధ్రానువాదం:-జ్ఞానికి, అజ్ఞానికి జగత్తు ఉన్నది. మొదటివానికి కనపడే జగత్తే సత్యం. రెండవవానికి నామ రూపాలు లేనట్టి, ఈ జగత్తుగా ప్రకాశిస్తూ కనపడుతూ దానికి ఆధారభూతమైన, అంతటా వ్యాపించినదే పరమ సత్యం.

వివరణం:-కాబట్టి తేడనదేమంటే జ్ఞాని, అజ్ఞాని జగత్తుతో నిజమనే వ్యవహరిస్తుంటారు. తేడా ఎక్కడంటే, జగత్తంటే వారివారి తెలివి, దానికిచ్చే విలువలు.

అజ్ఞాని కనపడేదంతా నిజమని కొంటాడు. అంతకు మించి అతని దృష్టి పోదు. దూరదృష్టి గల జ్ఞాని అట్లు కాదు. ఈ కనపడే జగత్తును గురించి బాగా విచారించి ఇలా నిత్యమూ మారిపోయేది, ఇది సత్యమెంది ఎలా అవుతుందని పరీక్షిస్తాడు. బయట కనపడే ఈ జగత్తు సత్యం కాజాలదని తేల్చుకుంటాడు. తర్వాత ఈ జగత్తు ఎలా పుట్టిందో వెదకడం సాగిస్తాడు. ఈ జగత్తు మనస్సు పనిచేస్తున్నపుడే ఉన్నదని, మనస్సూరుకుంటే ఈ జగత్తు లేదని కనిపెడతాడు. ఈ మనస్సు ఎక్కడనుండి పుట్టినదో కనిపెట్టే ప్రయత్నంలో, తనలో తాను లీనం అయిపోతాడు. అదే సమాధి; అక్కడ మనస్సు తన జన్మస్థానంలో లీనం అయిపోతుంది. ఆ స్థితిలో ఈ ప్రపంచస్ఫురణ ఉండదు. అందులోంచి బయటకు రాగానే, మనస్సూ దానితో ప్రపంచం వస్తాయి. కాని ఈ ప్రపంచం, శుద్ధ చైతన్యవిలాసమేనని గుర్తిస్తాడు. తరువాత, ప్రపంచం అంతా, ఆఖరికి ఒక గడ్డిపరక కూడా తానేననే భావనలో ఉంటాడు.

జ్ఞానియొక్క ఈ స్థితిని విశ్వాత్మభావం అంటారు. తనను అన్నిటియందును, అన్నిటిని తనయందేను గుర్తించుట; ప్రపంచం అతనికి ఇతరులకు కనపడునట్లు కనపడదు. ఇతని దృష్టి, దృక్పథము దివ్యముగా పరిణమించింది. ఈ నామరూపాలతో నిండిపోయిన జగత్తులో, నామ రూపాలు లేకుండా సర్వవ్యాపి అయిన సత్యం, సచ్చిదానందమే అతనికి గోచరిస్తుంది. ఎన్నటికి నాశనము లేని పరబ్రహ్మముయొక్క స్ఫురణలో ఒక స్థాయిలో ఈ చిత్రవిచిత్ర జగత్తు కనిపించి, కొంతకాలముండి నశించి పోతూంటుంది. అజ్ఞాని యొక్క దృష్టి, చిన్నపిల్లవాడు సినిమా చూడటం వంటిది. చిన్నపిల్లవానికి సినిమాలో అందరు నిజంగా జీవించి ఉన్న మనుష్యులు, జంతువులూను; కాని జ్ఞాని దృష్టిలో పెద్దలు సినిమా చూచుట వంటిది, పెద్దవాళ్ళు ఎవరూ సినిమా నిజమనుకోరు. అది తెరమీద శబ్దము, వెలుతురూ, సినిమా ఫిల్ము, అదే బొమ్మల్లాటని తెలుసుకొంటారు.

21. విధేః ప్రయత్నస్య చ కోఽపి వాదః
తయోర్ద్వయోర్మూలమజానతాం స్యాత్
విధేః ప్రయత్నస్య చ మూలవస్తు
సంజానతాం నైవ విధిర్న యత్నః

ఆంధ్రానువాదం:-ప్రారబ్ధమా? పురుషప్రయత్నమా కారణం? అని వాదించే వాదాలు, ఆ రెంటికి మూలం ఏదో తెలియకుండా చేసే వాదాలు. ఈ ప్రారబ్ధానికి పురుషప్రయత్నానికి మూలమైన సత్యం సాక్షాత్కారమైతే ఈ రెండు కూడా ఉండవు.

వివరణము:-ఈ శ్లోకంలో మహర్షివారు, కర్మబంధానికి, ఇచ్ఛాపూర్వకమైన పురుషకారానికి గల స్థానాన్ని గురించిన వాదాలు నిష్ప్రయోజనాలని గర్హిస్తారు. మన పూర్వులు జరిగేదేదో జరుగుతుందని ప్రారబ్ధం అని పురుషప్రయత్నం మానేవారు కారు. పురుషకారానికే ప్రాధాన్యం ఇచ్చేవారు. ఇప్పటివారే విదేశపరిపాలనతో నిర్వీర్యులై, మన కర్మవల్ల జరిగేదేదో జరుగుతుందని, సాకు చెప్పుకోడం మొదలుపెట్టి మనకు వచ్చే కష్టాలకు నష్టాలకు 'దాసోహం' అంటున్నారు. నిజానికి ప్రారబ్ధం అంటే మన పూర్వకర్మల ఫలశేషం. ఇప్పుడు ఫలించకుండా మిగిలినది. ఆ ఫలాలు ఇప్పుడు మనము అనుభవిస్తున్నాము. కొంతవరకు ఇప్పుడు జరిగేవి గతంలో జరిగినదాని ఫలమే నని చెప్పాలి. కానీ ఈ పూర్వకర్మఫలాలను చాలవరకు మనం ఇపుడు ప్రతిఘటించవచ్చు. మనం ప్రారబ్ధంయొక్క కీలుబొమ్మలం కాము. గట్టి సంకల్పబలంతో, పౌరుషంతో పూర్వకర్మఫలాలను సరిదిద్ది దాటగలం. అసలు పారమార్థికదృష్ట్యా చూస్తే ఈ సుఖదుఃఖాలన్నీ మనస్సులో కదలికలే కదా; సమాధానం వలన సమాధి వలన వీటిని దాటవచ్చు. మన చేతిలో వున్న జీవితాన్ని జడములైన గ్రహాలు, కర్మలు మార్చలేవు. మనం అనంతశక్తివంతమైన ఆత్మస్వరూపులం. మనం చేయలేనిది ఏదీ లేదు. ఈ విషయాన్ని ఇంకో విధంగా పరిశీలిద్దాం. కర్మబలానికి భయపడి, ఏదో దురదృష్టం చేతిలో పడిపోయామని, మనకూ గతి, మోక్షం లేదని నిస్పృహ చెందడం భయానికి, దుఃఖానికి కారణం. అదిగాక మనం అన్నివిధాల అదృష్టవంతులమని అన్నీ కల్పివస్తున్నాయనే ధైర్యం సుఖ కారణం.

ఈ రెండు సుఖదుఃఖాలు స్వప్న జాగ్రదవస్థల్లోనే ఉంటాయి. ఇవి మనస్సుయొక్క చలనాలు వికారాలు కదా. ఇవి నిద్రలో ఉండవు. అంటే ప్రారబ్ధం నిద్రలో పని చేయ

దన్నమాటేకదా! భాగ్యవంతునికీ, దరిద్రునికీ, యువకునికీ, వృద్ధునకూ నిద్ర సమానమైన స్థితే - చింతా చీకూ లేనిది కదా! ఇవన్నీ జాగ్రత్తలోనూ స్వప్నంలోనూ ఉండేవి కదా! కాబట్టి ప్రారబ్ధం, కర్మ అనేది మనస్సూ, దాని విలాసం ఉన్నంతకాలం ఉండేది। కాబట్టి నిద్ర పోతున్న వాడ్ని కర్మ బాధించదు. ఇంక ఇచ్ఛాపూర్వకమైన పురుష ప్రయత్నం ఆలోచిద్దాం. ఇక్కడ మనుష్యుని ఆలోచనలు, 'నేను ఇది చేశాను - ఇది చేయగలను - నేనంతవాణ్ణి - ఇంతవాణ్ణి - నేను స్వయంకృషి వల్లనే ఇంత పైకి వచ్చాను - కర్మ నన్నేం చేస్తుంది?' ఇవికూడా ఆ మనస్సు యొక్క చలనాలే, మనస్సు ఆ పరమాత్మ స్ఫురణయే. ఈ రెండింటికి అట్టే తేడా లేదు. కొంత స్థాయిభేదం ఉండవచ్చునేమో. ఇట్టి స్థితిలో నిజానికి ప్రారబ్ధానికి, పురుషేచ్ఛకూ వైరుధ్యమున్నదని ఎలా చెబుతాము? వీటి రెంటికీ మూలం ఒక్కటే కదా. ఇట్టిస్థితిలో వీటి మంచి చెడ్డలను గురించి అంతా తెలిసినట్లు వాదించడంలో పసలు ఏముంది? ఒకసారి వీటి నిజస్థితి గుర్తించాక అవి ఆత్మయొక్క రెండు విధములైన విలాసాలుగా అనుకుంటాడుగానీ అవి విరుద్ధములైనవని అనుకోడు. కాబట్టి ప్రారబ్ధం, పురుషప్రయత్నం మనస్సు స్థాయిలోనివి. ఆత్మ సాక్షాత్కారం కలిగినవానిని ఇవి బాధించవు. సుఖ దుఃఖాలు మంచిచెడుగులు దాటిన జ్ఞానిని ప్రారబ్ధం ఏం చేస్తుంది? అట్టి ఉత్తమస్థితిలో 'నేను' అనే అహంకారం అడుగంటినపుడు - ఎవడి ప్రారబ్ధం? ఎవడి స్వతంత్రేచ్ఛా? 'నేను స్వతంత్రుణ్ణి' అనుకునే నేనే చచ్చాక ఇవి ఎక్కడ నుంచి వస్తాయి? అందుకే మహర్షి వీటిని గురించి శుష్కవాదాలు చేయకు. సమత్వం సాధించి ఈ ప్రారబ్ధం వల్ల వచ్చే సుఖదుఃఖాలను దాటివెళ్లు. 'సోహం' భావన చేస్తే ఆత్మ సాక్షాత్కారం కలిగి నా ప్రారబ్ధం అని విస్పృహ చెందేది, అన్నీ నేనే చేశానని విర్రవీగే 'నేను' సచ్చిదానందమై ఆత్మలో లీనం అయిపోతుంది అంటారు.

22. యదీశితుర్వీక్షణమీక్షితారం
అవీక్ష్య తన్మానసికేక్షణం స్యాత్
న ద్రష్టురన్యః పరమో హి తస్య
వీక్షా స్వమూలే ప్రవిలీయ నిష్ఠా

ఆంధ్రానువాదం:- సర్వ ద్రష్ట అయిన ఆత్మసాక్షాత్కారం లేకుండా, ఎవరైనా నే దేవుణ్ణి చూచానంటే అది వాని మనోవికారమే - సర్వద్రష్ట సాక్షికాక దేవుడు వేరే లేడు. నిజమైన దేవతాదర్శనం అంటే తన మూలకారణమైన ఆత్మలో మునిగిపోవుటే.

వివరణం:- భక్తులకు దేవతాదర్శనం కలిగినదని మనం వింటూంటాం. చదువుతూంటాం. ఇవి ఎంతమటుకు నిజం? దేవుడు, దేవతా అంటే ఏమిటి? అన్నిటికీ కారణం అయి మనస్సుకు అవతలనుండే పరతత్త్వం! అక్కడ మన ఇంద్రియాలేవీ పనిచేయ్యవు। ఆలోచనలుండవు. అహంకారం ఎందులోంచి వచ్చిందో, ఆ శుద్ధచైతన్యంలో లీనం ఐపోతుంది. ఆ పరమసత్యమే సర్వేశ్వరుడు. మన మనస్సు, ప్రపంచం, ఆ మూలకారణం యొక్క విలాసములు అతడే మన అందరిలోనూ దృక్కు - చూచేవాడుగా ఉండే ఆత్మ - నేను. 'తత్త్వమసి' - కాబట్టి అతనికంటె ఇతరమును నీవు ఎలా చూడగలవు? కాబట్టి నీవు ఏ దేవుడినైనా చూడాలంటే, దాని మూలమైన దృక్కులో మునిగిపోవాలి. ఆ దృక్కూ నీవు ఒకటే అని గుర్తించాలి. దేవుణ్ణి ఎవడు చూడాలంటున్నాడో వాడు ఆ చూచేవాణ్ణి గుర్తించకుండా అనేది అర్థం లేని మాట. కాబట్టి నీకు దేవత ప్రత్యక్షమైనదంటే అది మనస్సు యొక్క ఆలోచనా విశేషం - దీనిని ఉన్మనీ అని కూడా అంటారు. అయితే ఈ భక్తుల గాథలన్నీ అబద్ధములా? వారికి దేవతా దర్శనం లేదా? అని అడగవచ్చు. ఒక భక్తుడు తన ఇష్ట దేవతను గురించి ఎల్లపుడూ ఆలోచిస్తూంటే అతని మనస్సు ఆ ఆలోచనతో నిండిపోతుంది. ఆ స్థితిలో ఒకప్పుడు 'నాకు దేవత దర్శనం ఇచ్చింది' అనుకుంటాడు. నిజంగా అతని మనస్సే ఆ విధంగా వికసించింది. దానివల్ల ఎంతో సుఖం అనుభవిస్తాడు. అట్టి అనుభూతులు ఇంద్రియార్థములు కావు కానీ వాటికంటే సూక్ష్మమైనవి, పరిశుద్ధమైనవి. అయినప్పటికీ ఆ దర్శనం ఇచ్చింది ఆత్మవస్తువు ఎలా అవుతుంది? ఆత్మ దృగ్గోచరం కాదు కదా, కానీ గాఢమైన భక్తితోనూ అవ్యాజమైన ప్రేమతోనూ మనస్సు నిరంతర భగవత్పరంగా ఉంటే - నిజమైన భక్తుడు సత్త్వగుణ ప్రధానుడై పోతాడు. అతని మనస్సు సూక్ష్మము, పరిశుద్ధము అగుట వల్ల తన ఇష్టదేవతను అంతటా పిపీలికాది బ్రహ్మపర్యంతం - చూడగలుగుతాడు. అతనికి సమ్యక్‌దృష్టి కలిగి తనకూ, దేవునకూ, ఇతరమునకూ భేదము చూడలేడు - ఇట్లు కొంతకాలం జరిగాక మనస్సును దాటి దృక్కైన ఆత్మతో ఏకం అయిపోతాడు. అదీ ఇతనికి నిజమైన దేవతాదర్శనం. అంతటా దృక్కుగా ప్రకాశించే ఆత్మ తప్ప దేవుడు వేరే లేడు. ఆ పరమాత్మ నీలో వుండే సాక్షి. నీ ఆత్మకంటే వేరుకాడు కానీ అతడు నీ మనస్సుకూ ఇంద్రియాలకూ అందనివాడు.

(తరువాయి పై పంచికలో

# వందేమాతరం

ఆరిపాకం సూరిబాబు

భారతదేశంలో అనాది నుంచి ఎవరు ఏ కార్యం తలపెట్టినా విఘ్నేశ్వరుని పూజించి తర్వాత పనులు మొదలుపెట్టడం జరుగుతుంది ఇప్పటివరకు! ఆదివేల్పుని ప్రార్థిస్తే కాని కార్యాలు జయప్రదం కావని ఒక దృఢ విశ్వాసం హిందూమత సాంప్రదాయంతో పెన వేసుకొని వుంది. ఇదేవిధంగా ప్రతిదేశంలోను ప్రార్థనాగీతంతోపాటు, జాతీయగీతం కూడా ప్రముఖస్థానం వహిస్తుంది. ఈ జాతీయగీతాలలో దేశభక్తితోపాటు, జాతిని, మతాన్ని సమైక్యతా భావాల్ని పెంపొందింపజేసే ఉత్తమ సాహిత్యం పొదగబడి వుంటుంది. అందరినీ అలరించే విధంగా ఉన్నవే జాతీయగీతాలు.

మన భారతదేశంలో జాతీయగీతంగా 'వందేమాతరం' మకుటంతో వున్న గీతం పరిగణింపబడుతుంది. ప్రభాతసమయం నుంచి రేడియో కార్యక్రమాల్లోను, రాజకీయసమావేశాల్లో, వివిధ సాంఘిక కార్యకలాపాల్లోను విఘ్నేశ్వరుని స్తోత్రం వలె ఇది ప్రారంభం కాబడుతుంది. ఈ వందేమాతరం గీతం తెలియనివాడు, పాడనివాడు చాలా అరుదు! అందరికీ తెలిసిన ఈ గీతం పుట్టుక, దాని వెనుకనున్న భావార్థాలు మనం తెలుసుకుందాం!

'వందేమాతరం' అంటే తేలికైన మాటల్లో చెప్పాలంటే 'తల్లీ నీకు నమస్కరిస్తున్నాను' అని. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అని భారతీయులు తల్లిని, తండ్రిని, గురువును అన్నికాలాల్లోను పూజిస్తున్నారు; గౌరవిస్తున్నారు. వారిని కీర్తించే గీతాలు అనేకం వున్నాయి.

ఈ వందేమాతరం గీతాన్ని స్వర్గీయ బంకిమ్‌చంద్రచటర్జీ వ్రాశారు. ఇలాంటి దేశభక్తి గీతాలు ఎందరో మహాకవులు వ్రాశారు. అప్పటి పరిస్థితుల్లో జాతిని సమైక్యత చెయ్యవలసిన అవసరం కల్గింది. ఆ అవసరమేమంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల బారినుంచి విముక్తి సాధించడానికి బెంగాలు దేశంలో పోరాటాలు, విప్లవాలు ఉధృతం కాసాగాయి. మాతృదేశంపై ప్రేమాభిమానాలతో వ్రాసిన గీతాలు బహిరంగంగా బృందాలుగా పాడుకోసాగారు. ఇలా దేశాభిమానాన్ని గీతాలుగా ఆలపించిన వార్ని లాటీచార్జీ చేయడం, జైల్లో పడవేయడం చేసేవారు. దీంతో ప్రజల్లో అలజడి, అశాంతి పెచ్చుపెరిగిపోయింది. బంగాళాదేశపు సమరవీరుల ఒత్తిడి తట్టుకోలేక బ్రిటిష్ ప్రభుత్వం బెదరసాగింది. అంతవరకు కలకత్తా రాజధానిగా వుండేది. ఇక్కడ వుండడం శ్రేయస్కరం కాదని న్యూఢిల్లీకి మార్చడం జరిగింది రాజధానిని. వందేమాతరం గీతంతో పాటు రవీంద్రనాథ్‌టాగోర్ వ్రాసిన "జనగణమన"గీతమూ, 'ఝండా ఊంచర హేహమారా' ఇక్బాల్ గీతమూ ఎంతో ప్రాచుర్యం పొందాయి. ఇవిగాక వందలాది దేశభక్తి గీతాలు ఊపిరి పోసుకుని కూనిరాగాల కూత వినిపించసాగింది దేశం నలుమూలలా. అప్పుడు ప్రతి కవి హృదయం దేశాభిమానంతో నిండి వుండేదనడానికి ఆనాడు వెలువడిన వందలాది గీతాలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు వగైరా మనకు నిదర్శనంగా నిలిచాయి!

బంకిమ్‌చంద్రచటర్జీ "ఆనంద్‌మఠ్" అనే నవల బెంగాలి భాషలో అప్పుడు వ్రాశాడు. ఈ నవల ఇతివృత్తం:- ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా ఏర్పాటైన ప్రభుత్వాన్ని పతనం చెయ్యాలనేది. ఆంగ్లేయుల పరిపాలన ఎంతో నికృష్టంగా వుందని బాధపడతారు. ఆఖరుకి సన్యాసులుకూడా వాళ్ళ పరిపాలను గర్హిస్తారు. ఆ సన్యాసులందరూ కలసి తమ మాతృదేశంపై బృందగానాన్ని ఆలపిస్తారు. ఆ పాటే ఈ వందే

మాతరం అన్నది. (ఇది సినిమాగా హిందీ, బెంగాలి భాషల్లో విడుదల అయింది). నవల ప్రాచుర్యం పొందింది. అయితే ప్రత్యేకంగా ఆ నవల్లో ఇమడ్చబడ్డ వందేమాతరం గీతం భారతదేశం అన్ని మూలలా వ్యాప్తి చెందింది.

అప్పుడు బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా విభజిస్తే రెండు మతాలవారి మధ్య కలహాలు రేకెత్తి ప్రభుత్వంపై తిరుగుబాటు తగ్గుతుందని కర్జన్ దొర బెంగాల్ విభజన చేయటానికి సిద్ధమయ్యాడు. ఈ దురాలోచన ప్రజలు పసిగట్టి హిందూ, మహమ్మదీయులు అనే భేద భావం లేశమైనా లేకుండా అందరూ కలిసి ముక్తకంఠంతో 'వందేమాతరం' అంటూ సమైక్యత చాటుతూ, బెంగాల్ విభజనను తీవ్రంగా వ్యతిరేకించారు. కర్జన్ దొర ఏమీ చెయ్యలేకపోయాడు. ప్రజలంతా ఏకం కావడంతో తన ఎత్తు పారలేదని బాధపడ్డాడు.

ఈ సంఘటనతో వందేమాతరం గీతం మరీ బలవత్తరంగా పని చేసింది. గీతం అంతా ఆలపించకపోయినా 'వందేమాతరం' అన్న వాక్యం ఒక్కటే ఆయుధంలా పని చేసింది. ప్రతి సమావేశంలోనూ, బహిరంగఉపన్యాసాల్లోనూ దేశ మాతకు నమస్కరిస్తూ గౌరవాభిమానాలతో వందేమాతరం గీతం ఆలపించాలని, దీన్ని జాతీయగీతంగా పరిగణించాలని ఆ రోజుల్లోనే నిర్ణయం జరిగింది! బెంగాల్ సరిహద్దులు దాటి యావద్భారతంలోనూ ఈ గీతం నిత్యమూ గానం చేయబడుతుండేది. మన తెలుగు ప్రాంతంలో కూడా 'వందేమాతరం' ధ్వనించింది; అల్లూరి, టంగుటూరి, గాడిచర్ల, రామచంద్రరావు, వీరభద్రరావు వంటి నాయకులు 'వందేమాతరం' అంటూ ముందుకు సాగారు...

ఇప్పుడు వందేమాతరం గీతాన్ని, దాని తాత్పర్యాన్ని వివరిస్తాను :—

వందేమాతరం సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం ॥ వందే ॥
శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీం
పుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥ వందే ॥

త్రింశత్కోటికంఠ కలకలనినాదకరాళే
ద్వి త్రింశత్కోటి భుజైర్ధృత ఖరకరవాళే
కథయంతి జనస్త్వాం కథం మాతకమబలాం
బహుబల ధారిణీం రిపుదళవారిణీం
నమామి తారుణీం మాతరం ॥ వందే ॥

తాత్పర్యము :- దేశమాతకు నమస్కారము. మంచి నదీనదములు గలిగినట్టియు మంచి ఫలములు గలిగినట్టియు, మలయమారుతములు గలట్టియు, పచ్చని పంటలు గలదియు అయిన తల్లికి నమస్కారము. పరిశుభ్రమైన వెన్నలచే పులకరింపజేయు రాత్రులు కలదియు, వికసించిన పుష్పములతోడను శోభిల్లునట్టియు, మంచి మందహాసము గలట్టియు, మంచి మధురభాషణములు గలట్టియు, సుఖమును వరములను ఒసంగునట్టియు తల్లికి నమస్కారము. ముప్పదికోట్ల కంఠములనుంచి వెడలు కలకల నినాదములచే భయంకరమైనట్టియు, అరువది కోట్ల చేతులచే పైకి లేచిన చేతులలో పదును గల ఖడ్గములు గలట్టియు, తల్లీ! ఎవరు నిన్ను అబలవని చెప్పగలరు? ఎక్కువ సైన్యములు గలట్టియు, విరోధులను జయింపగలట్టియు, నమస్కరించు వారిని రక్షించునట్టియు తల్లీ! నీకు నమస్కారము.

విద్యార్థులు, బాలలూ! అంతా భక్తిశ్రద్ధలతో పై గీతాన్ని కంఠస్థం చెయ్యండి. మరో జాతీయగీతం 'జనగణమన' గురించి మరోసారి తెలుసుకుందాం!

ఓం ప్రకాశ్

# ఏది నిజం? ఏది మాయ

అది రాజద్వారం.

సాయంకాలం వేళ. నీరెండగా పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. ఇండ్లకు తిరుగుముఖం పట్టిన గోవుల ధూళి బాటలను కప్పి పవిత్రం చేస్తున్నది. పడమటి ఆకాశంలో సూర్యుడు వివిధరంగులను వెదజల్లుతూ, అద్భుత చిత్రకళా ఖండాలను ప్రదర్శిస్తున్నాడు.

కిల-కిలా రావాలు విన్పించాయి. వీణానాదాలకన్నా మధురంగా ఉన్నాయి. వేణువు ధ్వనులకన్నా కోమలంగా మనోహరంగా ఉన్నాయి.

ఆ మనిషి కన్నులు ఆకాశం నుండి రాజాంతఃపురపు వాతాయనముల వైపు మళ్లాయి. సుందరీమణులు, నవయౌవనాంగులు, మనోహర గాత్రులు ఆ అంతఃపుర రాచస్త్రీల ఆకారాలు, స్వరాలు అతన్ని కొన్ని క్షణాలలాగే నిలబెట్టాయి. వారి ఎఱ్ఱని పెదవులపైని మెత్తని ముసి ముసి నవ్వులు అతని దృష్టిని మళ్ళించాయి. ఆపాదమస్తకం తనను పరిశీలనగా చూసుకున్నాడు. నీరెండకిరణాలకు, అతని శ్యామలవర్ణం వింత సోయగాలను వెదజల్లుతున్నది. పుష్టిగల అతని శరీరం నుండి వెలువడే నీలపు కాంతులను చూసే ఆ కాంతామణులు ఒకవంక లజ్జతో ముడుచుకుపోతు కూడా వచ్చే నవ్వును ఆపుకోలేకపోతున్నారు: కిలకిలా రావాలతో అతన్ని, దాగి దాగి నక్కి-నక్కి చూస్తున్నారు.

అంబరరహితుడై సిగ్గు విడిచి నిలబడ్డ అతన్ని చూసి విస్తుపోయాడా అన్నట్లుగా ఒక్కమారుగా ఎఱ్ఱబడి, పడమటి అంబరాన్ని సూర్యుడు దిగిపోయాడు. ఆ రాజ బహిః ప్రాంగణంలో ఆ మనిషి దిగంబరుడై నిలబడ్డాడు.

అంతలో దూరాన వినబడుతున్న సంగీత ధ్వని సోకిన కొనసాగింది. క్రమక్రమంగా స్పష్టంగా వినవస్తుంది. ఆ స్వరమాధుర్యం, ఆ [illegible]లం విని ఏమిటాని అటువైపు చూశారు అందరు. అంతఃపురస్త్రీల దృక్కులు కుతూహలంతో అటువైపు పరిగెత్తాయి. ఆ మనిషి చూపులు ఆ వింతేమిటో చూడదలచి అన్వేషించాయి.

అదొక గుంపు. అది చాలా పెద్దది. అందులో కొందరు ఇంతింత పైకి ఎగురుతున్నారు. కొందరు తప్పెట్లు వాయిస్తున్నారు. కొందరు బూరలు ఊదుతున్నారు. కొందరు తమ చేతుల్లో నున్న వాటినే వాయిస్తున్నారు. కొందరి చేతుల్లో ఏమీ లేవు. నల్గురితోపాటు నారాయణ అన్నట్లుగా తామూ ఏదో శబ్దం చేయాలనుకున్నారో ఏమో, తమ అరచేతుల నుపయోగించి చప్పట్లు కొడుతున్నారు.

ఇలాంటి వింతలను మనస్ఫూర్తిగా అనుభవించటంలో మగువలనే ముందుగా పేర్కొనాలి. అంతఃపురస్త్రీలు గవాక్షాల కెగబడి, ఎగబడి కన్నులు ఎత్తి ఎత్తి ఆ సంచార సంగీత నృత్యగాన మండలిని వీక్షిస్తున్నారు. వారి కన్నులు, వారి పాట, మాట, చేష్టలనే కాదు, వారి ఆకార సొబగులను కూడా పరిశీలిస్తున్నాయి. పడతులకు సూక్ష్మావలోకనం ప్రకృతి సిద్ధం కదా!

దాదాపుగ అందరూ కాస్త పొడుగరులు

గానే యున్నారు. మబ్బువంటి నీలవర్ణంతో చూపరులను ఆకర్షిస్తున్నారు. వారి చేష్టల్లో మొరటుదనం కానవస్తున్నది. వారి ముఖాల్లో కరుకుదనం దృశ్యమానమౌతున్నది.

అంతఃపురాంగనలు వారి నాపాదమస్తకం పరిశీలించారు. వారి శరీరపు కఠినత్వాన్ని వారి సంగీత మాధుర్యంలో పడి ఆ మగువలు మరిచి పోయారు.

"ఆహా! ఎంత చక్కగా పాడుతున్నారు. వీనులకింపుగా నున్నది వారి గానం."

"వసంతంలో కోకిల పాటలా మధురంగా ఉన్నది."

"వారి ం చూడవే చెలీ, ఎంత కనసొంపుగా ఉందో!"

ఆ ముదితలు వారి ఆటపాటలకు ముగ్ధులై పోయారు. వారు మరింత చేరువకు వచ్చారు. ఆ మనిషికి చాలా సమీపంలో నిలబడి తమ ఆటపాటలు జనానికి చూపిస్తున్నారు. ఆ మనిషి దిగంబరత్వాన్ని చూసి ముందు కాస్త జంకినా, రాజభటులు, ఇతర ప్రజలూ, ఆ పిమ్మట తన్ని గమనించటం మానేసి, ఆ సంచార సంగీత నృత్యగాన మండలి ప్రదర్శనను తిలకించ సాగారు. వారు ఆ మనిషికి మరింత చేరువయ్యారు. ఆ మనిషి వారిని చూసి, గుర్తించి, గతుక్కుమన్నాడు. ఆ గుంపు ఈ మనిషిని చూసి స్తంభించిపోయింది. క్షణకాలం గడిచింది. ఆ మనిషి గుండెలు గుబగుబలాడసాగాయి. అతని కాళ్లు నెమ్మదిగా వెనక్కి, వెనక్కి అడుగులు వేయసాగాయి. గుంపులో ఉప్పెనలా చలనం ఉప్పొంగింది.

"కటంజా!" అంటూ ఉత్సాహంగా అరిచారు. "కటంజా! నువ్విక్కడున్నావా? భలే వాడివే! మాకు చెప్పాపెట్టకుండ గుట్టుగా ఇక్కడికొచ్చి మకాం వేశావా?"

ఆ గుంపు అతన్ని ముట్టడించింది. ఆ మనిషి రాజద్వారం దాటి లోలోనికి వెళ్ళసాగాడు.

"ఆగు కటంజా!" ఒక వృద్ధుడు ముందుకు వచ్చి, అతని చేయి పట్టుకున్నాడు, "మమ్మ చూసి అలా బెదిరిపోతున్నావేం? మమ్మప్పుడే మరిచిపోయావా? ఔన్లే, అందలం ఎక్కిం తర్వాత మా బోటి చుట్టాలు పక్కాలు నీకెక్కడ కనబడతారూ?"

ఆ మనిషి కంగారుగా అటూ ఇటూ చూశాడు. "వెళ్ళిపొండి, వెళ్ళిపొండి" అంటు సైగ చేశాడు. ఆందోళనగా అతని కన్నులు కాంతామణులవైపు ప్రసరించాయి. వారి ముద్దుగొల్పే ముఖాలు అప్పటికే వాడిపోయాయి. ఆ మనిషి బిత్తరపోయి చేతులు రెండూ జోడించాడు.

"దయచేసి వెంటనే వెళ్ళిపొండి."

ఆ వృద్ధునికి ఆశ్చర్యం వేసింది. చుట్టూ వున్న జనులకు, రాజోద్యోగులకంతా అయోమయంగా ఉంది.

"కటంజా! కరువు బాధ పడలేక మేమిలా దేశం మీద పడ్డాం. అదృష్టవశాత్తు నీవు కనబడ్డావు. రాజ ప్రసాదంలో ఉన్నావు కదా! మంచిపనిలోనే ఉండియుంటావు. రాజులకు, రాచస్త్రీలకు సంగీతమంటే మహా ఇష్టమట గదా! నీ గాత్ర మాధుర్యంతో వారిని మెప్పిస్తున్నావా? వారు నిన్ను బాగా చూసుకుంటున్నారా? బట్టలూ, సొమ్ములవీ బాగా యిస్తున్నారా? మంచి తిండే దొరుకుతుందిలే! ఇది రాజ ప్రాసాదం కదా! నిన్ను చూడగానే పోతున్న ప్రాణాలు లేచి వచ్చాయనుకో! అయినా అలా బెదిరిపోతావేం? పైగా వెళ్ళిపొండి, వెళ్ళిపొండి అని అదేం గోల!— మాకూ ఇక్కడేదైన పని చూపిస్తావేమోనని కొండంత ఆశతో ఉంటే, పొమ్మని విసరికొడ

తావా? కటంజా, మాకు వేరే గతిలేదు. ఏలాగైనా నువ్వే మా ప్రాణాలు కాపాడాలి!''

ఆ వృద్ధుడు ప్రలిమిలాడుతున్నకొద్దీ, ఆ మనిషి మరింత గాభరాపడిపోతున్నాడు. అదే క్షణంలో, ''హా దైవమా!'' అంటూ పెద్ద పెట్టున అంతఃపుర పాలతుల రోదన విన్పించింది. చండాలునితో మాకు సంపర్కం కల్గించావా? అయ్యో...'' అంటూ ఆ కలకంఠులు హృదయవిదారకంగ విలపించారు.

ఆ గుంపులో నున్నవారు చండాలురు. వారంతా ఆ మనిషి బంధువులు. ఆ మనిషి, ఆ నగ్న శరీరి, ఆ నీల మేఘశ్యామవర్ణ పురుషుడు మరెవ్వరో కాదు. ఆ క్రాంత దేశపురాజు, 'గావలుడు'.

''హే భగవాన్! ఎంతపని చేశావయ్యా! మాకు చండాలుని రాజుగా ప్రసాదించావా?''

జనమంతా గుండెలు బాదుకున్నారు. పాపం! వారికేం తెలుసు, అతను చండాలుడని. వారికి తెలియదు సరె. అతనైనా చెప్పవద్దా? చెప్పలేదు. ఎందుకు చెబుతాడూ? ఆకలితో కడుపు నకనకలాడిపోతున్న క్షణంలో రాజపదవే లభించినప్పుడు దాన్ని వదులుకునే మూర్ఖుడెవడైనా ఉంటాడా? ఎంత చండాలుడైతే మాత్రం, అతనికి ఆశలూ, కోర్కెలూ ఉండవా?

ఆ దేశ ఆచారం ఏమిటోగానీ, రాజును ప్రజలెన్నుకోరు; ఒక ఏనుగు, రాజాస్థానపు ఒకఏనుగు ఎన్నుకొంటుంది. దాని తొండాని కొక దండ నిస్తారు. ప్రజల్లోకి తీసికెళ్తారు. అది ఎవరి మెడలో దండవేసి, ఎత్తి, తనమీద కూర్చుండబెట్టుకుంటుందో, ఆ వ్యక్తే, ఇక ఆ క్షణాన్నుండి రాజు. ఆ క్రాంత దేశానికి ఏలిక. ఆ దేశప్రజల కర్మకాలి వారి రాజు స్వర్గస్థుడయ్యాడు. క్రొత్తరాజును ఎన్నుకునే కార్యక్రమం జరుగుతున్నది. అంతా కోలాహలంగ ఉంది. ప్రజల్లో త్రోక్కిసలాట ఎక్కువైంది. అందరికీ తామె రాజు కావాలనే ఆశ! ఆ ఆశతో ఏనుగు వస్తున్న దారికి ఎదురుగ్గా, పడుతూ లేస్తూ పరిగెత్తుకు వస్తున్నారు. ఆ ఏనుగు నింపాదిగా గురువితంబ సుందరీ గమనం చేస్తూ వస్తున్నది. తన సూక్ష్మనయనాలతో ఆ మహాజనసందోహాన్ని గమనిస్తున్నది. దాని ముందు హఠాత్తుగా ఒకవ్యక్తి వచ్చిపడ్డాడు. అది చూసింది—ఒంటిపై బట్టలేదు. జుట్టు దుమ్ముకొట్టుకొని యున్నది. కారుమబ్బువంటి నల్లని శరీరం—ఆ ఏనుగు తొండం ఎత్తింది. ''నేనే నలుపనుకుంటే, నాకన్న నలుపుగా వుంటాడా? వీని పని చెబుతాను. వీన్ని రాజును చేసి వీని మదమణస్తాను.'' అని అనుకుందో ఏమో, పూదండ వాని మెడలో వేసి, విజయ గర్వంతో తల విదిల్చింది.

అంతే! జయజయ కారాలు మిన్నుముట్టాయి.

''క్రాంత దేశ మహారాజుకు జయ, జయ. గావల మహారాజుకు జయ, జయ.''

ఆ చండాలుడు రాజయ్యాడు. క్రాంత దేశానికి పాలకుడయ్యాడు.

క్రితం క్షణం వరకు పూటకొక్క మెతుకైనా గతిలేని పరమచండాలుడతను. ఆ భుక్తిని వెదుక్కుంటూ అతనిలా దేశమంతా కలయతిరుగుతున్నాడు. అతను ఏకాకి. మృత్యువాతని ప్రియభార్యను, ప్రియపుత్రులనందరినీ అపహరించింది. అతను విషాద చిత్తంలో, క్షుద్బాధతో ఒంటరిగానే భ్రమిస్తున్నాడు. అలా తిరుగుతూ ఈ క్రాంత దేశం వచ్చాడు. తనకు అనుకోకుండా పట్టిన మహా అదృష్టానికి మొదట విసుబోయాడు. వెంటనే తమాయిం

చుకొని, గుట్టుచప్పుడు కాకుండ రాజ్యసింహాసనం అధిష్ఠించాడు, పట్టాభిషిక్తుడయ్యాడు.

రాజకీయ విషయాలన్నీ మంత్రులతనికి క్షుణ్ణంగా నేర్పారు. అతనిలో క్రమంగా చండాల భావం, స్వభావం నశించాయి. రాజస గుణాలు, దయాదాక్షిణ్యాది ఆర్యవృత్తులు అతన్ని ఆశ్రయించాయి. తాను చండాలుడనన్న సంగతి అతను పూర్తిగా విస్మరించాడు. వందిమాగధుల స్తోత్రపాఠాలతో, అందమైన తరుణీమణుల సేవలతో రాజభోగాలనుభవించసాగాడు. అసమాన సౌందర్యదీప్తులైన రాచస్త్రీలతన్ని ఆదరించారు. ఆ చిగురుబోడుల నడుమ, ఆ భోగభాగ్యాల మధ్య, ఆ రాజపదవిలో చండాలుడు తనను తాను మరిచి, గావలుడుగానే తలచసాగాడు. ప్రజలను కన్నబిడ్డలవలే పాలించసాగాడు. కాలం సుఖంగా సాగిపోతున్నది.

ఆ తరుణంలో ఆ రోజు ఏమి తోచిందో, గావలుడు ఆభరణాలన్నీ తొలగించుకొన్నాడు. అమూల్యవస్త్రాలను విడిచిపెట్టాడు. దిగంబరుడై రాజబహిఃప్రాంగణంలోకి పోయి నిలబడ్డాడు. తమ రాజు నగ్నవేషంలో ఉండటం జనుల కాశ్చర్యం గొల్పినా, వారు కిక్కురుమనలేదు. తమ ప్రియుడు, తమ యజమాని, తమ కాంతుడు, తమ భర్త, ఇలా శూన్యావస్థలో ఉండటం రాచస్త్రీలకు లజ్జా కారణమైంది. అయినా వారు దాన్ని లోలోనే అణచుకొని, ఆ దృశ్యానికి కూడ ఆనందించారు. సమ్మతమవ్వాలిగాని, సుదతులెట్టి దశలోనైనా ఆనందించగలరు, ఆనందం పంచిపెట్టగలరు. సమ్మతము కాదా, స్వర్గంలోఉన్నా అశాంతచిత్తులై, సర్వత్రా అశాంతిని నెలకొల్పగలరు. ఆ ముద్దుగుమ్మలు కూడ ఆనందపరవశంలో ఆ నగ్నసౌందర్యాన్ని కూడా ఆనందించారు.

కాని హఠాత్తుగా వారి తలలపై పిడుగు పడింది. తాము ఎవర్ని ముట్టి స్పర్శించి, చుంబించారో, అతను, అతను ఒక పరమచండాలుడన్న సంగతి బయటపడింది. తాము బిగియార ఎవర్ని కౌగలించుకొన్నారో, అతను శునకమాంస భక్షకుడైన చండాలుడని తెలిసింది. తాము ఎవరికైతే తమ సర్వస్వం అర్పించారో, అతను స్మశానాల్లో వసించే, భస్మాం రాసుకునే చండాలుడని స్పష్టమయింది.

ఆ స్త్రీలకిది భరించరాని దుర్ఘటనే అయింది. ఆ కులాంగనలకు తమ శరీరాలు అపవిత్రమై పోయాయని అన్పించింది. ఆ శరీరాలను త్యజించాలని నిశ్చయించుకొన్నారు. ఒక్కుమ్మడిగా పెద్ద చితుల పేర్చుకున్నారు. ఆ మంటల్లోపడి దగ్ధమైపోయారు. అంతఃపురమంతా పొగలు వ్యాపించింది.

ప్రజల్లో సైతం గగ్గోలు పుట్టింది. ఎనిమిది సంవత్సరాలు చండాలుని అన్నం తిన్న తమ శరీరాలు అపవిత్రమైపోయాయనుకున్నారు. వారు కూడ పెద్దపెట్టున చితులు పేర్చుకొని కాలిపోసాగారు.

చండాలునికి రాజ్యమంతా వల్లకాడులా కన్పించింది. ప్రజలంతా ఇలా భస్మీభూతులు కావటం అతన్నెంతో విచలితున్ని చేసింది.

"నా మూలంగ ఇంతమంది ప్రాణాలు బలి కావటమా? ఈ శరీరం వల్లనే కదా, ఈ చండాల శరీరం వల్లనే కదా ఇంత అనర్థం జరిగింది! ఇంత లోకనింది పొందింతర్వాత, ఇక బ్రతికి ఏం బావుకోనూ? ఈ జీవితం వ్యర్థం. ఈ ఈ చండాల శరీరం పరమ అనర్థదాయకం. తక్షణమే త్యజిస్తాను."

గావలుడు కాదు కటంజుడనే ఆ చండాలుడు, స్మశానం ప్రవేశించాడు. చితి పేర్చుకున్నాడు. మంటలు భగ్గున పైకి లేచాయి.

"రావయ్యా, చండాలోత్తమా! నీ మూలంగ ఎంత అనర్థం జరిగిందో చూడు. నీ విక బతకటానికి యోగ్యుడవుకావు. ఇంతమందిని పొట్టన పెట్టుకుని ఇంకా ఏమిటీ ఆలోచిస్తున్నావ్? రా వెంటనే ప్రవేశించు" అని ఆ అగ్నిజ్వాలలు కూడ తనను నిందిస్తున్నట్లు చండాలునికి తోచింది. చితి దగ్గరికి నడిచాడు. నీలవర్ణ శరీరాన్ని, సువర్ణవర్ణ జ్వాలలకు అప్పగించబోతున్నాడు.

ఈ శరీరపు అందానికి కన్నతల్లి ఎంత మురిసిపోయేదీ! పుట్టిననాడిగా తానెంతో అందగాడని ఆ చండాలవాటికలో అందరూ చెప్పుకొనేవారు. ఈ శరీరాన్ని తాను చక్కగా పోషించాడు. అనేకమైన మృగాలను వేటాడి వాటి మాంసంతో పుష్టివంతం చేశాడు. పదునారు ఏండ్ల ప్రాయమయ్యేసరికి ఈ శరీరం సౌష్ఠవంగా మేఘశ్యామసుందరంగ తయారైపోయింది. అట్టి ఈ శరీరం నేడు దహనం కాబోతుంది.

కటంజుడు ఒక్కొక్క అడుగే వేస్తూ గతాన్నంతా తలచుకుంటున్నాడు.

తన శరీరపు అందాన్ని చూసే, అందమైన నీలమణివలె తమాలశ్యామచ్ఛాయగల తన భార్య కోరి కోరి మరీ తనను పెండ్లాడింది. తన ఈ శరీరాన్ని, పూబంతులవంటి సుందరములు వట్రువులైన బిగి వక్షోజాలతో తనశరీరాన్ని పెనవేసి అలాగే ఉండిపోయేది. తన భార్యను నాడు సుఖపెట్టిన ఈ శరీరం నేడు అగ్నిదేవుని ఉష్ణపు హస్తాల్లో చిక్కి కరిగిపోబోతుంది.

హే భగవాన్! ఏమిటిదంతా! ఏమిటీ నీ మాయ! క్షణంలో సుఖం కల్పిస్తావు. మరు క్షణంలో దుఃఖాన్ని సృష్టిస్తావు. నీ మాయాజాలాన్ని ఎవరు తెలుసుకుంటారు? ఈ మాయాచక్ర పరిభ్రమణం నుండి ఎవరికైనా, ఎప్పటికైనా విడుదల లభిస్తుందా?

కటంజకుడికి దుఃఖమాగలేదు. అతను పరిగెత్తికెళ్ళి చితిలో దూకేశాడు.

* * *

"మంటలు – మంటలు" అంటూ పైకి లేచాడు గాధి.

అతనొక బ్రాహ్మణుడు. ధీమంతుడు. గుణశాలి. ధర్మమూర్తి. కోసలదేశంలో నివసిస్తున్నాడు. వైరాగ్యప్రవృత్తిగల్గి జీవనం కొనసాగిస్తున్నాడు. ఒకరోజు అతనికి ఏమి తోచిందో ఏమో, ఇల్లూ వాకిలీ అన్నీ వదిలిపెట్టి ఒక అరణ్యంలోకి ప్రవేశించాడు. అక్కడొక సరోవరం కన్పించింది. అందులో దిగి కంఠం వరకు మునిగాడు. విష్ణుధ్యానంలో లీనమయ్యాడు. ఆ తపస్సు ఎనిమిది నెలలు కొనసాగింది. భగవంతుడనుగ్రహించి ప్రత్యక్షమయ్యాడు. అభీష్టవరం

"భగవన్, నీ మాయ మహా ఆశ్చర్యకరమైనదంటారు. ఆ మాయను చూడాలని ఉంది. చూపించవా?"

"నా మాయని చూడాలని వుందా! సరే అలాగే చూస్తావు. చూసి బయటపడతావు కూడ. ఇక తపస్సు చాలించు" అని చెప్పి భగవంతుడదృశ్యుడయ్యాడు. గాధి విష్ణుమాయను ఎప్పుడెప్పుడు చూస్తాం అన్న ఆశతో దినాలు గడిపాడు. కాని ఎంతకాలానికీ మాయ కన్పించలేదు. మరల ఆ సరోవరంలో మునిగాడు. అఘమర్షణ మంత్రం జపించసాగాడు. అంతలో అతనికేదో మత్తు కమ్మినట్లయింది. అతనికేమో అయినట్లనిపించింది.

ఆతను శరీరం నుండి విడిపోయాడు. గాధి శరీరం మృతప్రాయమై ఇంటిముంగిట పడిపోయింది. బంధువులంతా చుట్టూ మూగి నెత్తినోరూ బాదుకుంటు ఏడుస్తున్నారు. మూర్ఛపోతున్నారు. శరీరంపై పడి పొగు

తున్నారు. పొర్లి పొర్లి దుఃఖిస్తున్నారు. ఆ శరీరం క్రమంగా తేజోవిహీనమయింది. అసహ్యమయింది. పసుపువన్నెగా మారింది. దాన్నుండి భరించలేని వాసనలు రాసాగాయి. ఈగలు దానిపై దాడిచేస్తున్నాయి. చీమలు క్రిములు దాన్ని తొలచటానికి మూగుతున్నాయి. అంతవరకు ఎంతో ఉత్కృష్టమైన ఆ బ్రాహ్మణ శరీరం, నేడు కుక్కకన్నా హీనంగా నేలను అంటిపెట్టుకొని పోయింది. ఏ శరీరాన్ని చూసి తను అగ్రకులంవాడనని విర్రవీగాడో, ఆ శరీరం నేడు చండాలుడుసైతం ముట్టలేని దశలో పడిపోయింది. అపవిత్రమైపోయింది. ఆ అపవిత్ర శరీరాన్ని తీసికెళ్ళి స్వబాంధవులంతా నిర్దాక్షిణ్యంగ పవిత్రమైన అగ్నిలో వేసి బూడిద చేశారు. బంధుమిత్ర పరివారాల ప్రేమకు, పొగడ్తలకు, కారణం కావాలని ఏ శరీరాన్ని నమ్ముకున్నాడో, ఆ బాంధవులే నేడు దాన్ని కాల్చివేశారు. ఏ శరీరాన్ని నమ్ముకొని అహంకరించాడో, గురుజనులతో గర్వంగా వర్తించాడో, ఇపుడా శరీరం ఏమయింది! కాలి బూడిదై పోయింది.

గాధి లింగశరీరం కర్మచోదనంతో ఒక చండాలి గర్భాన్ని ఆశ్రయించింది. సకాలంలో చండాలుడుగా పుట్టాడు. పెరిగాడు. పెండ్లి చేసుకున్నాడు. పిల్లల్ని కన్నాడు. భార్యాపుత్రులను పోగొట్టుకున్నాడు. ఏకాకియై, దుర్భిక్షబాధ కోర్వలేక దేశ దేశాలు పరిభ్రమించాడు. విధివశాత్తు క్రాంత దేశం చేరాడు. ఆ దేశానికి రాజయ్యాడు. ఎనిమిది సంవత్సరాలు సుఖంగా రాజ్యం చేశాడు. దురదృష్టం అతన్ని కాలదన్నింది. తాను చండాలుడన్న నిజం బయటపడింది. ప్రజలంతా ఆత్మాహుతి చేసుకున్నారు. వారి మరణహోమం చూడలేక తానూ మంటల్లో దూకాడు. ఆ మంటలు తనను చుట్టుముట్టాయి. కాల్చివేస్తున్నాయి. అబ్బా! భరించరాని వేడిమి ఆ వేడికి తట్టుకోలేక పోయాడు.

"మంటలూ-మంటలూ" అంటూ పైకి లేచాడు. లేచి చూస్తే ఏముంది? మంటలూ లేవు. చితీ లేదు. తాను సరోవరంలో ఉన్నాడు. అఘమర్షణమంత్రం జపిస్తూ దాన్ని విస్మరించాడు. అంతే!

అయితే ఇదంతా ఏమిటి! స్వప్నమా? రెండు ఘడియలయినా కాలేదు, ఇంత సుదీర్ఘకాలం ఎలా అనుభూతమయింది?— గాధి ఆశ్చర్యపోయాడు. ఛ. స్వప్నం కాదు. ఏదో మాయ. ఔను. ఇది వైష్ణవమాయయే. భగవానుడు తన మాయను నేడు చూపించాడు. గాధి సందేహనివృత్తుడై సరోవరం నుండి బయటకొచ్చాడు.

కాలచక్రపరిభ్రమణంలో దినాలు గడిచిపోతున్నాయి. ఒకరోజు దుర్వాసమహర్షి గాధి చెంతకు వచ్చాడు. అతని దేహం కృశించిపోయింది. గాధి దానికి కారణమేమిటని అడిగాడు.

"ఒక చండాలుని దేశంలో కొంతకాలం తెలియకుండా వసించాను. ఆ దోష నివారణార్థం, వ్రతాలు ఆచరిస్తున్నాను. అందుకే దేహం కృశించిపోయింది. నీవద్ద ఆ వ్రతాలను పరిసమాప్తి చేశాను" అంటూ దుర్వాసమహర్షి తాను వెళ్ళిన క్రాంత దేశం గూర్చి సవివరంగా చెప్పాడు. గాధి కత్యంత ఆశ్చర్యం వేసింది. తాను రెండు ఘడియల కాలంలో స్వప్నం మాదిరి అనుభవించింది, నిజమెలా అయింది? పైగా ఈ మహర్షి చూసి మరీ వస్తున్నాడు. ఆ దేశకాల పరిస్థితులు వాస్తవమెలా అయ్యాయి! గాధికేమీ అంతు చిక్క-

లేదు. మహర్షి చెప్పిన గుర్తులను బట్టి, గాధి ఆ దేశం వెళ్ళి విచారించాడు. పరిశీలించాడు. అక్కడి ప్రజలను అడిగి తెలుసుకున్నాడు. అంతా విని విస్మితుడయ్యాడు. తన భ్రాంతి యథార్థంగా దర్శనమిస్తున్నది. ఇదెలా సంభవం?! కేవలం రెండు ఘడియల్లో భ్రమాత్మకంగా జరించిన మాయ, నిజమెలా అయింది?

గాధి అదేదో తెలుసుకొందామనుకొని విష్ణుభగవానుని ధ్యానించాడు. భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు.

"భగవాన్! నీమాయ ప్రబలమైంది. కాని ఒక్కటి మాత్రం అర్థం కావటంలేదు. రెండు ఘడియల్లో నేననుభవించిన ఆ సుదీర్ఘ కాలం, ఆ దేశాదులు ఎలా నిజమయ్యాయి?

భగవంతుడు చిన్నగా నవ్వాడు.

"బ్రాహ్మణుడా! ఇది కూడ నీ చిత్త భ్రమయే. నీవు చూసిన, చూస్తున్న, చూడబోతున్న జగత్తంతా నీ చిత్తంలోనే ఉంది. సమస్త పాంచభౌతిక విస్తారం అంతా నీచిత్తము తప్ప మరేదికాదు. నీవు చూసిన భ్రమలన్నీ నీ చిత్తమే కల్పించింది. నీ చిత్తం వాసనామయమైంది. అందుకే ఇన్ని భ్రమలు చూస్తున్నావు. వాసనా రహిత చిత్తంలో భ్రమలుత్పన్నం కావు. కనుక చిత్తాన్ని స్థిరం చేయాలి. ఈ చిత్తమందలి ప్రదేశం సామాన్యమైనది కాదు. ఇందు కోట్లకొలది బ్రహ్మాండాలున్నాయి. అట్టిచో ఒక భ్రాంత దేశం, ఒక చండాలరూపం సంభవించటం ఆశ్చర్యమేమీ కాదు. ఆ మాత్రం దానికే గొప్ప మాయని చూసాననుకొంటున్నావు. ఆ మాయ ఎంతని! నీవు జన్మించినప్పుడెల్లా నీకు కుటుంబాలేర్పడ్డాయి. ఎక్కడెక్కడో బతికావు. ఒక జన్మలో రాజ్యం చేశావు. చితిలో పడ్డావు. మహర్షిని కలిశావు. మరల ఆ దేశాన్ని చూశావు. ఇదంతా ఏమిటనుకున్నావు? ఇందులో ఏ ఒక్కటీ నిజం కాదు. అంతా మాయయే! నీ పంచేంద్రియాలు, నీ అంతరింద్రియాలు గ్రహించేదంతా నీ చిత్తభ్రమయే తప్ప వాస్తవం కాదు. నీ చిత్తకల్పనలో, కల్లుత్రాగినవానికి కన్పించినట్లుగా, ఈ భ్రమలన్నీ కన్పించాయి. సంకల్పమే, రూపమై భాసిస్తుంది. అదీ భ్రమే. చిత్తం సంకల్పరహితం కానంతవరకు, నీవు మాయలో ఉంటు, మాయలో బతుకుతూ, మాయలో చస్తూ, మాయావశుడవయ్యే ఉంటావు. సుఖదుఃఖాలు, జగద్భ్రమలు పొందుతుంటావు. ఈ సంకల్పాలను త్యజించు. చిత్తాన్ని వాసనారహితం చేసుకో. సుస్థిరం చేసుకో. అన్ని భ్రమలు, అన్నిమాయలు తొలగిపోతాయి."

భగవంతుని మాయారహస్యవివరణం గాధి చిత్తాన్ని నిర్మలం చేయసాగింది.

"కలకంటావు. క్షణకాలంలో అనేక సంవత్సరాల జీవితం గడుపుతావు. అది కల కాబట్టి మాయ అని అంటావు. కాని ఈ జాగ్రత్తు కూడ స్వప్నమే సుమా! ఇదీ మాయే. ఎక్కడో నిద్రపోతూ ఏమేమో సంకల్పిస్తున్నావు. అవన్ని నిజమన్న భ్రాంతి ఈ జాగ్రత్తలో నీ వనుభవిస్తున్నావు. మరల ఈ జాగ్రత్తలో స్వప్నం కంటున్నావు. అందులో మరొక జీవితం. ఆ జీవితంలో మరో స్వప్నం. ఇలా స్వప్నపరంపరలే తప్ప వాస్తవమొక్కటీ లేదు. ఇదే మాయ. కాబట్టి సంకల్ప వికల్పాలను మానేసి చిత్తాన్ని సుస్థిరం చేసేయి. నీ నిజస్థితి ఏమిటో నీకే తెలుస్తుంది."

భగవంతుడు మాయా వృత్తాంతాన్ని మరింత సుగమం చేయసాగాడు.

"అసలింతకీ ఈ మాయకు కారణమేమిటో గ్రహించావా? నేను, నావి అన్న భావమే. ఈ శరీరం నేను, ఇది నాకుటుంబం, వీరంతా, ఇవన్నీ నావి అన్న భ్రమలే దీనికి కారణం. ఒక్కసారి బుద్ధిని వినియోగించి ఆత్మవిష యమై ఆలోచించి చూడు. 'అంతా నేనే' అన్న భావనలో లీనమయి చూడు ఈ అహంమమ తలు అదృశ్యమైపోతాయి. సుఖదుఃఖాదులు కరిగిపోతాయి. ఆ భ్రమల మధ్య ఉంటూ కూడ కమలపత్రం పైని నీటిబొట్టులా అంట కుండా మాయాతీతుడవై జీవిస్తావు. కేవలం ఈ ఒక్క చిత్తాన్ని జయింపజేసు చాలు మాయను జయిస్తావు. కనుక అభ్యాస తత్పరుడవు కమ్ము. ఈ చిత్తాన్ని నిరోధించ టానికి నిరంతరం అభ్యాసం చేస్తూ సాధనలో నిమగ్నుడవు కమ్ము. ఆత్మజ్ఞానం పొందుతావు."

విష్ణుభగవానుడు తన మాయను విపులీక రించుటయేగాక, దాని రహస్యాన్ని స్పష్టపరి చాడు. దాన్ని ఎలా జయించవచ్చో ఆ సంగతీ విశదపరిచాడు. గాధికి బోధచేసి పర మాత్మ అంతర్ధానుడై పోయాడు.

గాధి నిశ్చలమానసుడై ఆలోచించాడు.

"ఔను ఇదంతా నా చిత్తభ్రమయే. నేను పొందిన అవస్థలన్నీ భ్రమాత్మకములే. రూపం, ఆకారం లేని కాలం, చిత్తభ్రమ కారణంగ ఒక పదార్థంలా గోచరించింది. ఈ కాలంచేత చిత్తంలో ఎంత భ్రమైనా కల్గటానికి వీలుంది. స్వప్నంలోని అనంతంగా కన్పించే కాలం, జాగ్రత్తులో ఒక ముహూర్తం కూడ ఉండదు కదా! ఈ చిత్తంలో చూడనిది, తలంచనిది కూడ కనబడుతుంది. అనుభూతమవుతుంది. త్రికాలాలన్నీ వర్తమానంగానే భాసిస్తుం టాయి. ఈ చిత్తాన్ని లయం చేయాలి."

గాధి ప్రయత్నశీలుడై సాధనలో మునిగి పోయాడు. వివేక వైరాగ్యాలచేత నిరంతర అభ్యాసంచేత గాధీ కొన్ని సంవత్సరాలు ఆ సాధనలో లీనమయ్యాడు. అలా అభ్యాసం చేస్తూండగా క్రమంగా గాధి చిత్తం సంకల్ప రహితమై పోయింది. అది శమించింది. లయిం చింది. అతనికి ఆత్మజ్ఞానం సంప్రాప్తమయింది.

ఆ క్షణం మొదలు గాధిలో ఎట్టి భ్రమలు కల్గలేదు. అతను భయ, శోక రహితు డయ్యాడు. సమస్తభోగస్థితులందు ప్రశాం తుడై యుండసాగాడు. జీవన్ముక్తుడై స్వాత్మా నందమందు విహరించసాగాడు.

మహాభయంకరమైన మాయను, జాగ్రత్త లేని వానిని సంకటంలో పడవేయు మాయను గాధి తొలగించుకొని, పూర్ణచంద్రుని బోలు అపరిచ్ఛిన్న బ్రహ్మానందంలో విశ్రాంతి నొందాడు. ఆత్మజ్ఞుడయ్యాడు.

## కథావివేచనము

ఈ కథ శ్రీ యోగవాసిష్ఠంలోని ఉపశమన ప్రకరణ మందు కనబడుతుంది. మాయ అనేది ఎక్కడో లేదు, అది మనిషి కల్పించుకున్న చిత్తభ్రమయే సుమా అన్న సందేశాన్ని ఈ కథ తెలియజేస్తున్నది.

శరీర వ్యామోహంలో పడి, మనిషి శరీరాన్నే కేంద్రంగ పెట్టుకొని జీవితం కొనసాగించినప్పుడు, సుఖ దుఃఖాదులు, రాగద్వేషాదులు అతన్ని తరిమి తరిమి కొడ తాయి. ఆత్మను తెలుసుకొని, అహం మమతలను వదలి వ్యవహరించిననాడు మాయ అనేదే అతనికి కనబడదు. అతని జీవితం ప్రశాంతంగ గడిచిపోతుంది.

పై పంచికలో మొగుణ్ణి కాదన్న మగువ.

సాలెపడుచు వేషములో

గదాయి యితరులను నవ్వించడానికి అనేక తమాషాలు చేసేవాడు. తమ యింటి యజమాని దుర్గాదాసు లాహా మొగవాళ్లెవ్వరు తన ఆడవాళ్ళున్న లోపలి గదులలోకి పోలేరని డాబులు పలికేవాడు. ఇది విని గదాయి యిలా అన్నాడు "నేను తలుచుకుంటే అలా చేయగలను." దుర్గాదాసు "నీ తరం గాదు. చేతనైతే ప్రయత్నం చేసిచూడు" అని అన్నాడు. గదాయి 'సరే' అన్నాడు.

అది ఒకనాటి సాయంకాలము. గదాయి స్త్రీలాగా చీరకట్టాడు. ముఖాన మేలి ముసుగు వేసుకున్నాడు. చంకలో ఒక బుట్ట పట్టుకొని దుర్గాదాసు యింటి ముంగిట నిలిచాడు. ఇలా అన్నాడు. "అయ్యా! నేను సాలెపడుచును. ప్రక్క గ్రామంలో వుంటాను. నూలు అమ్మటానికి యీ గ్రామం వచ్చాను. నాతో వచ్చిన వాళ్లంతా వెళ్లిపోయారు. చీకటిలో ఒంటరిగా నేను ఎలా పొయ్యేది? రాత్రి మీ యింట్లో తలదాచుకోనిస్తారా?" దుర్గాదాసు ఆమెతో, లోనికి పోయి యింట్లో ఆడవాళ్లను కనుక్కోమన్నాడు. గదాయి లోపలికి పోయి మేలిముసుగు తొలగించి ఆడవాళ్లతో మాట్లాడాడు. కాని వాళ్లెవరు గదాయిని గుర్తుపట్టలేకపోయారు. పడుకోటానికి ఒక చోటు చూపి, తినటానికి కొన్ని మరమరాలు పెట్టారు.

రాత్రి తొమ్మిదిగంటలయింది. చంద్రాదేవి ఆదుర్దాపడ్డది. గదాయిని వెదకటానికి రామేశ్వరుని పంపింది. రామేశ్వరుడు రోడ్డుపైకి వచ్చి 'గదాయ్', 'గదాయ్' అని కేకలు పెట్టాడు. దుర్గాదాసు యింట్లో నుండి "అన్నా! యిదుగో వస్తున్నాను" అని బదులు వచ్చింది. గదాయి బయటికి వచ్చాడు. ఈ హాస్యానికి దుర్గాదాసు కడుపుబ్బ నవ్వాడు.

సాలెపడుచుగ సాయపు సందెవేళ దుర్గాదాసింట చేరెను దుఃఖరీతి
నింట నొకరైన గుర్తింప నేరరహహ! అన్న పిలుపు గదాయి తానాలకించి
బదులు పల్కుచు పర్వెత్తె బయటికపుడు.

# భక్తుని ఆవేదన

గట్టుపల్లి అంజనీమూర్తి

భక్తునికి ఆవేదన ఎందుకు కలుగుతుంది? అని ప్రశ్నించుకున్నప్పుడు అనేక రకాల సమాధానాలు వచ్చి నిలబడతాయి. ఆ భక్తుని మనస్సు మనకు తెలియకపోయినా, మనమే ఆ పరిస్థితిలో ఉంటే ఏవిధంగా ఆవేదన వ్యక్తపరుస్తాము, అని మనల్ని మనమే శోధించుకున్నప్పుడు వచ్చే సమాధానమే ఆ భక్తుని ఆవేదనగా చెప్పుకుంటాము. ఈ విధంగా ఆవేదన వ్యక్తపరచని భక్తులుండరు అని చెప్పవచ్చు. ఏదో ఒక సమయంలో వారికి భగవంతుని మీద కోపం రావటం, దాని పర్యవసానంగా భగవంతుని ముందు బిడ్డ వలె తమ తాపం వెళ్ళబోసికోవటం సహజం. భగవంతుడు పరోక్షంగానో, ప్రత్యక్షంగానో, వారిని బాధనుండి సేద తీర్చి, సంతసమగ్నుల గావించును.

ఈ విధమైన ఆవేదన శ్రీ త్యాగరాజులో నాకు కనిపించింది. ఇది ప్రత్యక్షంగా లేదు. వాగ్గేయకారుడైన త్యాగరాజు భక్తి ప్రపత్తులతో కొన్ని కృతులు వ్రాసి, పాడుకొని తన ఇష్టదైవము, ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రునికి వినిపించ నాశించెను. చక్కగా రాముని పాదముల వద్ద కూర్చొని నెమ్మదిగా పాదముల నొత్తుచూ పాడి వినిపించవలెనని వచ్చెను. కాని రాముని చూడగానే ఆయన ఆశ నిరాశ అయినది. రాముని పాదముల వద్ద హనుమ కూర్చొని యుండెను. చాల కాలము ఎప్పుడైనా సమయము దొరుకునేమోనని వేచి యుండెను. కాని ఎప్పుడు చూచినను రాముని పాదముల వద్ద హనుమ ఉండనే ఉన్నాడు. ఈ హనుమ రాముని పాదములు వదలడు. తనకు గత్యంతర మేమిటని ఆలోచించెను. భగవంతుని వాకిట గూర్ఖావలె, రాముని పాదముల వద్ద హనుమ ఉన్నాడు.

''హనుమ మాట ఎందుకు, రాముడినే ప్రార్థిస్తాను. ఎప్పటికైనా, నాకు అవకాశము ఇవ్వక పోవునా'' అని తలచెను. కాని హనుమ చూడనట్లు విననట్లు ఉండెను.

వెంటనే రాముని ఎదుట తిష్ట వేసికొని పాడటం మొదలుపెట్టాడు. సారంగ రాగంలో ''నీవాడనేగాన'' అనే కృతి పాడాడు. నీ వాడిని నేను కాదా? అని భగవంతుడ్ని ప్రశ్నించినట్లున్నది. ఒక్కొక్క జన్మకు ఒక్కొక్క తల్లి దండ్రులు ఏర్పడుతున్నారు. కాని ఎన్నటికి ''సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మా తండ్రి'' అని పాడారు. ఈ విధముగా పాడటం మొదలుపెట్టారు. ఎన్నో కృతులు రాముని గుణ గణాలు వర్ణిస్తూ పాడారు. ఆయన పాడిన పాటలను మనం అర్థం తెలిసికొని గనుక పాడుకుంటే, త్యాగరాజు వ్రాసి పాడిన పాట అని మరచిపోయి మనమే మన పరిస్థితి భగవంతునికి నివేదించుకుంటున్నట్లనిపిస్తుంది. అటువంటి కృతుల్లో ''నీదు చరణములే'' సింహేంద్ర మధ్యమం లోనిది ఒకటి చక్కని ఉదాహరణ. ఈ కృతి లోని చరణం మరీ చక్కగా ఉన్నది. ''పాప కర్మపు తనువురా యిది బాధ పడనే జాలరా, (రామ)''. ఇక్కడికి వచ్చేటప్పటికి మనం పూర్తిగా లీనమై పోయి, ''నాయనా! రామా! ఇది పాప కర్మపు శరీరం, దీనితో నేను బాధ పడలేకుండా ఉన్నాను నా కేవిధంగానైనా దీనినుండి విముక్తి కలిగించు'' అని వేడుకుంటాము. మనకు ఒక్కసారిగా మనం పడే బాధలన్నీ జ్ఞాపకానికి వస్తాయి. జరా, దుఃఖ, వ్యాధులతో బాధ పడుతూ పాప కర్మపు శరీరాన్ని మోస్తూ, అంతులేని ప్రయాణాన్ని సాగిస్తున్నామన్న మాట జ్ఞాపకానికి వచ్చి, ఈ

బాధల నుండి విముక్తి కలిగించమని మనం త్యాగరాజు స్థానంలో కూర్చొని వేడుకుంటాము. ఈ విధంగా ఆయన కృతులు మనలో సంచలనం తీసికొని వస్తాయి. భక్తితో మన హృదయవీణ మ్రోగనారంభిస్తుంది మనస్సు పాడనారంభిస్తుంది. వాల్మీకి, రామాయణాన్ని శ్లోకాల్లో వ్రాసి లోకానికందిస్తే, త్యాగరాజు మృదుమధురమైన కృతులలో వ్రాసి భక్తులకందించారు. ఈ విధముగా త్యాగరాజు కృతులు, కీర్తనలు రాముని ఎదుట గానం చేశారు. కాని హనుమ రామ పాదములు వీడలేదు. త్యాగయ్యకు చోటు దొరకలేదు. ఆయనకు బాధ ఎక్కువైనది. "ఏమిటి నేనంత తక్కువా. హనుమ నాకు రామ పాదముల వద్ద చోటివ్వక పోయినంతమాత్రాన నేను నిరాశచెంది నాప్రయత్నం మానుకోను. అతని కంటే గొప్ప చోటే నేను సంపాదించుకుంటాన"ని పట్టుపట్టినట్లు కనిపిస్తున్నది. నిత్యమూ తైలధారగా రామనామం కూడ చెయ్యడం మొదలుపెట్టాడు. ఈ విధంగా త్యాగరాజు పంతంతో మొదలుపెట్టిన సాధన చివరకు అన్నీ మరచి రాముని ధ్యానంతోటే ఇరవైనాలుగు గంటలూ గడిపే స్థితికి చేరింది. "రామభక్తి సామ్రాజ్యం" అనే కృతి వ్రాశారు. త్యాగరాజు విసుగు లేకుండా రామభక్తి సామ్రాజ్యాన్నేలి, ఏలి చిట్ట చివరకు మోక్షసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యేను. ఈ విధముగా ఆయన తన పంతాన్ని నెగ్గించుకొన్నారు. త్యాగరాజు సాదరంగా హనుమతో, "సోదరా! నీవు పాదముల వద్దనే ఉండు శాశ్వతముగా! నేను శ్రీరామచంద్రునిలో లీనమైపోతాను", అని చెప్పినట్లున్నది, నాకు. కాని ఇంత జరిగినా హనుమకేమీ తెలియదు. రామనామం చేసికొంటున్న హనుమకి రామపాదం మాత్రమే కనిపిస్తున్నది. అందువలన హనుమకా దోషం కూడ యేమీ లేదు.

ఈ విధముగా భక్తుని వేదన అంతమైనది. త్యాగయ్యను మోక్షసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుని గావించి, మనం తిరిగి వచ్చాము. అప్పుడు మన పరిస్థితి ఎట్లా ఉన్నదంటే సంతోషము, దుఃఖము సమపాళ్ళలోనుండి, కళ్ళ వెంబడి అశ్రువులు కారుతున్నాయి. అవి ఆనంద బాష్పాలా? లేక దుఃఖాశ్రువులా? ఏమని చెప్పగలం? త్యాగరాజు, త్యాగబ్రహ్మయై, శ్రీరామచంద్రునిలో లీనమయ్యాడంటే సామాన్య విషయమా! అటువంటి పదవి ఎందరికి లభిస్తుంది? అట్లా ఆలోచించినప్పుడు చాల సంతోషం కలుగుతుంది. ఆ సంతోషంలో ఆనందబాష్పాలు వస్తాయి. కాని, ఎంత గొప్ప పదవి అయినప్పటికి త్యాగయ్య మనకందరకు అందనంత, ఎన్నటికీ కనుపించని పదవి చేరాడని అనుకున్నప్పుడు దుఃఖం కలుగుట సహజం. ఆ దుఃఖభారంతో కన్నీళ్లు వస్తాయి. అందువల్ల ఏది నిజము అంటే రెండు నిజమే. ఒక కంటితో దుఃఖిస్తున్నాం, మరొక కంటితో ఆనందిస్తున్నాం. ఇది మన పరిస్థితి. అయితే అంతటితో మనం ఆగకుండా, ఆయన ఒక రాచబాట వేసి వెళ్ళేరు గనుక ఆ బాటలో ప్రయాణం చెయ్యడానికి ప్రయత్నం చేద్దాం. ఎప్పటికో ఒకప్పటికి గమ్యం చేరకపోము. అప్పుడే మనం నిజంగా త్యాగరాజు ఆవేదనను అర్థం చేసికొన్నవాళ్ల మవుతాము ఆయన్ని అభిమానించిన వాళ్ళమూ అవుతాము

# విషయసూచిక



గమనిక:—స్థలాభావముచే ఈ సంచికలో బాలల రామకృష్ణ, ఓం ప్రకాశ్ గారి యోగవాసిష్ఠ కథ ప్రచురింపబడలేదు.



# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## రండి, తిరుమలకు రండి

మానవజాతిని ఉద్ధరించడానికి, భవబంధాలనుండి విముక్తులను చేయడానికి, శ్రీ మహావిష్ణువే భూమిపైన శ్రీ వేంకటేశ్వరస్వామిగా అవతరించిన పుణ్యస్థలమే పావనమైన తిరుమల కొండలు. ఋషులచేత, మహాయోగులచేత స్తుతింపబడిన స్వామివారి యీ పవిత్ర స్థలము సముద్రమట్టానికి మూడువేల అడుగుల ఎత్తున, ఆంధ్రప్రదేశానికి చెందిన చిత్తూరు జిల్లాలో వున్నది. సంవత్సరము పొడుగునా చక్కటి వాతావరణముతో ఈ ప్రాంతము ఆహ్లాదము గొల్పుచుండును.

తిరుమలను చేరుటకు దగ్గరనున్న రైలుస్టేషను తిరుపతి. భారతదేశము నాల్గువైపుల నుండి తిరుపతికి భక్తులు రైలుమీద రావచ్చును. మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ నుండి తిరుపతికి బస్సులుకూడ కలవు.

తెల్లవారుఝామునుంచి, అర్ధరాత్రివరకు బస్సులు రెండు కొండ దారుల మీదుగా మిమ్ములను తిరుపతినుండి తిరుమలకు తీసుకువెడతాయి. భక్తులు ఉదయము 6 గంటలనించి అర్ధరాత్రి 12 గంటలవరకు శ్రీ స్వామివారి దర్శనము చేసుకొనవచ్చును.

తిరుపతిలోనూ, తిరుమల కొండపైన అన్ని సౌకర్యములతోకూడివున్న దేవాలయపు ధర్మసత్రములు, అద్దె వసతిగృహములు యాత్రికుల వసతికోసం ఏర్పాటు చేయబడి వున్నాయి.

తిరుపతిలో వున్న శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వర స్వామివార్ల దేవాలయాలను, తిరుచానూరులోనున్న శ్రీ పద్మావతీ అమ్మవారి దేవాలయమును యాత్రికులు దర్శించవచ్చును.

మంగాపురంలోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయము, నారాయణవనములోని శ్రీ కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయము, నాగలాపురంలోని శ్రీ వేదనారాయణ స్వామివారి ఆలయములు చూడదగిన ముఖ్య పవిత్ర స్థలములు.

శ్రీ స్వామివారికి మీరు చెల్లించే కానుకలు దైవకార్యాలకు, విద్యాభివృద్ధికి, సాంఘిక సంక్షేమ కార్యాలకు ఉపయోగింపబడతాయి.

మీకు కావలసిన తక్కిన వివరాలకు మాకు వ్రాయండి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ

సంపుటము 39 1982 జూన్ సంచిక 6


## ఓ జగన్నటరాజ!

నటరాజ! నటరాజ!!
ఓ జగన్నటరాజ!
నటియించి మాయెడల
ఘటియించు చిత్కళల॥ నటరాజ

నీ చరణ విన్యాస
నృత్యభంగిమలందు
గోచరించును మాకు
ఆచరణ మార్గమ్ము॥ నటరాజ

నీవు తాండవమాడ
దేవి లాస్యమొనర్ప
పారవశ్యమ్ములో
తారాడు భావాలు॥ నటరాజ

నీ ఢమరుక ధ్వనులు
గూఢ శాస్త్రార్థముల్
రూఢమ్మొనర్చెడి ప్ర
గాఢ సూత్ర ప్రతతి॥ నటరాజ

నీ ధీర గంభీర
తాండ వార్భటులచే
నా జీవ నాడీ ప
మస్తమ్ము కంపించు॥ నటరాజ

మాతృదేవీ చరణ
లాస్యాళి నాలోని
మృదు మనోహర దివ్య
భావాళి ప్రేరేచు॥ నటరాజ

నీ త్రిశూలమ్ముచే
మా లోని తామసము
మూల విచ్ఛేదమ్ము
గావింపుమో దేవ!! నటరాజ

నీ త్రినేత్రాగ్ని చ్ఛ
టా విస్ఫులింగముల
మా దుష్ట కామనము
దహియింపుమో దేవ! నటరాజ

నీ గళాలంకరణ
నాగ పూత్కారముల్
మాలోని విషయ నీ
త్కారములుగా చెలగు॥ నటరాజ

నీ పాప సరులచే
మా పాప చింతనల
నోకార్చి సుఖశాంతి
దాంతులిమ్మో దేవ॥ నటరాజ

నీ జటాజూటమున
మహొంగు గంగమ్మ
పండించు మా గుండె
లను భావ సస్యముల్॥ నటరాజ

నీ కృపా దృష్టిచే
నీ కళారాధకులు
లోకముల మేల్కొల్పి
తూర్తు రాహ్లాదమ్ము॥ నటరాజ

నవ రసమ్ముల తోడ
నవగతుల నొనగూర్చి
నవ నవోన్మేషంపు
జీవనము సమకూర్చు॥ .... నటరాజ

అందుకో మా హృదయ
భావ నీరాజనము
అందిమ్మ నీ హృదయ
సౌందర్య భాండంబు॥ .... నటరాజ

ఏడాది కొక మారు
గా కాదు శివరాత్రి
నిత్య శివరాత్రి వ్ర
తా సక్తి సమకూర్చు॥ .... నటరాజ

## శివారాత్రికపుం

జయము జయము నాట్యకళా స్థాపక!
జయము జయము త్రిభువన పరిపోషక॥
జయము జయము దుష్కృతజన శిక్షక॥
జయము జయము సాధుజగద్రక్షక॥

జయము జగజ్జన నాటక సూత్రా!
జయము పరిష్కృత భావ పవిత్రా॥
జయము నిత్య పరిశుద్ధ చరిత్రా॥
జయము సత్యశివసుందర గాత్రా॥

జటాజూటమున జాహ్నవి ఘోషము
కలువలరాయని కిరణ ప్రసారము
అ ఇ ఉణ్....హల్లితి ఢమరుక నాదము
నిశితకాంతు లెగజిమ్మ త్రిశూలము.

సర్వజ్ఞాంకిత తృతీయ నేత్రము
విరాగ సూచక కపాల దండము
జ్యోతిర్మయమగు మంగళ రూపము
ప్రళయ భయంకర తాండవ భంగిమ

నిత్యము మా హృదయమ్ముల నెలకొని
సత్యవ్రత సంసక్తుల జేయుత॥

—డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

---

## శ్రీ రామకృష్ణ 147 వ జయంతి ఉత్సవములు, కాకినాడ

స్థానిక శ్రీరామకృష్ణ సమితి ఆధ్వర్యములో కాకినాడ దివ్యజ్ఞాన సమాజ ఆవరణలో ది. 25-2-82 నుండి ది. 28-2-82 వైభవోపేతముగా జరిగినవి. మద్రాసు శ్రీరామకృష్ణ మఠ శిష్యులు శ్రీరామమూర్తిగారు బేలూరు శ్రీరామకృష్ణ మఠ విధులతో ది. 25-2-82 తారీఖు ఉదయం విశేష పూజ జరిపిరి. ఆ సాయంత్రము భజన. విశేష దీపారాధన మరియు శ్రీరామకృష్ణ జనన విశేషములు కథామృతము నుండి. శ్రీరామకృష్ణ లీలా ప్రసంగము నుండి చదివి చెప్పిరి. ది. 26-2-82 సాయంత్రం హరికథ మరియు ది 27-2-82 సాయంత్రం శ్రీరామకృష్ణ ఏకపాత్రాభినయము స్థానికులు శ్రీ వాడ్రేవు రామారావుగారు చేసిరి. ది. 28-2-82 ఉదయము అన్నసంతర్పణ అనగా దరిద్రనారాయణసేవ, సాయంత్రము బహిరంగసభ జరిగినవి. ప్రతిరోజు కార్యక్రమాంతములో భజన, ప్రసాద వినియోగము జరిగినవి. మద్రాసు నుండి వచ్చిన శ్రీరామమూర్తిగారు ఈ కార్యక్రమమునకు ముందు, వెనుక కొద్దిరోజులు, శ్రీరామకృష్ణ కథామృతము, శ్రీ బ్రహ్మానంద బోధనలు విశదీకరించిరి. మరియు జనవరి నెలలో శ్రీ వివేకానంద జయంతి సందర్భములో కూడ ఇట్టి కార్యక్రమము శ్రీరామమూర్తిగారి ఆధ్వర్యములో జరిగినవి. స్థానికముగా వున్న చాలమంది భక్తులను వారు స్వయముగా కలిసి ప్రేరణ చేసిరి.

విరాళమునకు అభ్యర్థన – కాకినాడలో శ్రీరామకృష్ణ మందిరము, గ్రంథాలయము, ఉచితహోమియో వైద్యశాల ఇతర సేవాకార్యక్రమములు జరుపుటకు ఈ సమితి ఉద్యమించినది కనుక ఉదారులు, ధారాళముగా విరాళము లిచ్చి మా ఉద్యమమును ప్రోత్సహింప గోరుచున్నాము.

—కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవా సమితి, 8-14-38, రెడ్‌క్రాస్ స్ట్రీట్, గాంధినగర్, కాకినాడ-533400.

# కట్నం కానీ కూడ వద్దు

మహీంద్ర

కొన్నేండ్ల క్రితం రాజమండ్రిలో సాయంకాలం వేళ సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఎక్కాను. నా ప్రయాణం మద్రాసుకు. నేనెక్కిన కంపార్టుమెంటులో చుట్టూ ఉన్న నలుగురు ప్రయాణీకులు విద్యార్థులు. వేషధారణకూడ ఆ సంగతే చెప్తున్నది. బెర్తుల మీద పడుకొనే సమయం దాక తెగ వాగుతూనే ఉన్నారు. ప్రొద్దున లేచి మళ్ళీ వాగుడు మొదలుపెట్టారు వాళ్ళ మాటల్లో దొర్లిన విషయాలు రాజకీయాలకు సంబంధించినవి, వ్యాపార విషయాలకు సంబంధించినవి, ఆఫీసుగొడవలకు సంబంధించినవి, పెండ్లి కట్నం వగైరాలకు సంబంధించినవి, క్యాంటీన్‌లోని భోజన విషయానికి సంబంధించినవి-ఇటువంటి విషయాలేగాని అన్ని గంటల సేపు ఒక మాటయైనా సాహిత్యపరంగా గాని కళల విషయంగా గాని వైజ్ఞానిక విషయంగా గాని తాత్త్వికవిషయంగా గాని దొర్లనేలేదు. ఆ విద్యార్థులందరూ నడివయస్సువాళ్లు. ఆ చిన్న మాటలన్నీ అప్పటికప్పుడే మఱచిపోయాను గాని ఒకటి మాత్రం మఱవలేదు. వాళ్ళలో ఒకతను అన్నమాటలు: 'గ్రాడ్యుయేట్ అయిన ఒక అమ్మాయి ఉద్యోగం కోసం నన్ను ప్రాధేయపడింది. ఎమర్జన్సీరోజులు కాబట్టి ఆఫీసర్‌గా నాకు పవర్సు ఎక్కువగానే ఉండినందువల్ల వెంటనే ఒక ఉద్యోగం ఇప్పించాను. ఇప్పుడా అమ్మాయికి ప్రమోషన్ అదీ వచ్చి 1000 రూపాయలు సంపాయిస్తున్నది. తల్లిదండ్రులకు ఒకతే కూతురు. తండ్రి చిన్న ఉద్యోగం చేసి రిటైర్డ్ అయ్యాడు. ఆస్తి ఏమీ లేదు. ఒక చిన్న ఇల్లు స్వంతం. అంత మాత్రమే ఆస్తి. ఒకరోజు మా ఆఫీస్‌లో పని చేసే ఒక యువకుడు నా దగ్గరకొచ్చి "సార్! మీరు ఆ అమ్మాయికి గార్డియన్‌లాగా ఉన్నారు కాబట్టి మీకు ఒక మాట చెప్పాలనుంది సార్! ఆ అమ్మాయి మా కులం అమ్మాయి ఒక విధంగా దూరపు బంధుత్వం కూడ ఉంది. నేను అమ్మాయిని వివాహం చేసుకుంటాను సార్! ఆ అమ్మాయికి కూడ నేనంటే ఇష్టమే. కాని అమ్మానాన్నలు ఇష్టపడితేనే చేసుకుంటానంటుంది సార్! నాకు కట్నం ఒక కానీ కూడ వద్దు! మీరు ఆమె తలిదండ్రులతో చెప్పిచూడండి సార్" అని అన్నాడు. నేను కొంత ఆశ్చర్యపోయి "అలాగే వాళ్ళ తల్లిదండ్రులను విచారించి చూస్తాను" అన్నాను. తరువాత వాళ్ళ తలిదండ్రుల దగ్గరకెళ్ళి "మా ఆఫీసులో ఒక చక్కని యువకుడు సంపాదనాపరుడు కట్నం లేకుండ మీ అమ్మాయిని చేసుకుంటానన్నాడు. ఇంతకన్నా కావలసిందేముంది? ఏమంటారు?" అని అడిగాను. వాళ్ళు ఈ మాట విని సంతోషంతో ఎగిరి గంతేస్తారని అనుకున్న నాకు చాల ఆశ్చర్యం వేసింది. వాళ్లు ఏమీ ఉత్సాహం చూపలేదు. ఏవో కుంటి సాకులు చెప్పి "ఇప్పుడిప్పుడే మా అమ్మాయికి పెండ్లి చేయదలచుకోలేదండి" అని నన్ను సాగనంపారు.' ఆ ఆఫీసరు ఇంతదాక చెప్పి తరువాత మనోవిశ్లేషణ ధోరణి అవలంబించి కట్నం లేకుండ వివాహం చేసుకోడానికి సిద్ధమైన ఆ ఆదర్శయువకుని ఆదర్శానికి వెనుక దాగి ఉన్న అసలు ఉద్దేశాన్ని ఇలా వివరించాడు: 'ఎవరిచ్చినా అతనికి కట్నం పాతిక వేలకు పైన ఇవ్వరు. ఈ అమ్మాయిని కట్నం లేకుండ చేసుకుంటే పాతిక వేలకు ఎన్నోరెట్లు వస్తుంది. సంవత్సరానికి 10 వేలకు పైగా జీతం, అలా 30 ఏండ్ల సర్వీసులో 3 లక్షలు సంపాయిస్తుంది. ఇంతకన్నా, కట్నం ఏం కావాలి? అనే ఆలోచన, దూరదృష్టి అతనిది' అని ఆ ఆఫీసర్ వివరించాడు. లోకవిరుద్ధంగా ఆ తలిదండ్రులు కూతురి పెళ్ళికి అంత ఉత్సాహం చూపక

పోవడంలోని ఉద్దేశాన్ని ఇలా విశ్లేషించారు. 'వాళ్ళ అంతర్గతంలో, అమ్మాయి పెండ్లి చేసుకోకుండా అలాగే ఉండిపోవాలనే కోరిక దాగి ఉంది. కారణం ఇప్పుడు ప్రతినెలా జీతాన్ని తీసుకొచ్చి తమ చేతుల్లో పెట్టున్నది. తమతో బాటే ఉంటున్నది. వివాహం అయితే భర్తకు అధీనం అయిపోయి తమను అలక్ష్యం చేస్తుందేమో అనే సందేహం. అందుకే వాళ్లు ఆ అమ్మాయి వివాహ విషయంలో ఏ మాత్రం సుముఖత చూపలేదు.' ఇదీ ఆ ఆఫీసర్ చేసిన మనో విశ్లేషణ.

ఈ మనోవిశ్లేషణను అవతల బెట్టి ఒక ముఖ్యమైన సంగతి ఆలోచిస్తాం. సంఘంలో ఇప్పుడున్న కట్నాల బెడద ఎలా అంతరించగలదు? అనే విషయం ఆలోచిస్తాం. జనాభాలో స్త్రీల కన్నా పురుషులే ఎక్కువ. ప్రభుత్వం సేకరించిన లెక్కల వల్ల ఇది తెలుస్తున్నది. స్త్రీల సంఖ్య తక్కువగా ఉండీ వారికి వివాహసమస్య, కట్నాల సమస్య ఎందుకు ఉత్పన్నమౌతున్నది? కారణం ఏమిటి? కట్నాలు కొన్ని దశాబ్దాలకు ముందు లేదు. ఇంగ్లీషు చదువులు చదివి ఉద్యోగాలు పొందిన యువకులు సంఘంలో తలెత్తగానే ఈ కట్నాల ఆచారం మొదలైంది. అటువంటి యువకులను అల్లుళ్లుగా చేసుకొని కూతుర్లను సుఖపెట్టాలనే తహతహతో చాల కుటుంబాలు పోటీబడినందువల్లే ఈ కట్నాలు తలెత్తాయి. ఈ పోటీ, సంఘంలో ఇంకా ఉంది కాబట్టి ఈ కట్నాల బెడద కూడ ఉంటూనే ఉన్నది. కట్నాలు తీసుకొనే యువకులను నిందించి లాభం లేదు. వాళ్ళకు కాలేజీలో కాలేజి చదువులు నేర్పారేగాని సంస్కారం నేర్పలేదు కదా! కాబట్టి వాళ్ళను తప్పుబట్టడం న్యాయం కాదు. సంపాదనాపరులు కానటువంటి పురుషులు సాధారణంగా అవివాహితులుగా ఉండిపోవడమో లేదా వివాహాన్ని 'బెండకాయముదిరినా' అన్న సామెత వర్తించేంత వరకు వాయిదా వేయడం వల్లనో ఇటువంటి వారి సంఖ్య సంఘంలో ఎప్పుడూ గణనీయమైన స్థాయిలోనే ఉండడం వల్ల జనాభాలో స్త్రీ సంఖ్య తక్కువగా ఉన్నా వివాహరంగంలోని క్యాండిడేట్స్‌లో పురుషులకన్నా స్త్రీలెక్కువగా ఉండడం సంభవిస్తున్నది. దీనివల్ల వివాహసమస్య స్త్రీలకు ఎక్కువ. వివాహరంగంలో స్త్రీ పురుషుల నిష్పత్తి సమతూకంగా రావాలంటే చాలమంది స్త్రీలు స్వచ్ఛందంగా అవివాహితలుగా ఉండిపోవాలి. ఇది సాధ్యమా? శారీరకంగాను మానసికంగానూ స్త్రీజీవితానికి పెళ్లి కావడం అవశ్యకం కదా. అవివాహితలుగా ఉండిపోయి నిరానందజీవితాన్ని ఎవరు కోరుకుంటారు, అంతేగాక స్త్రీ అవివాహితగా ఉండడం అంటే సంఘం ఒక మాదిరిగా చూస్తుంది – ఇన్ని కారణాల వల్ల స్త్రీలు అవివాహితలుగా ఉండడం సాధ్యమా అని ఒక సందేహం. విద్యాధికులైన స్త్రీలకు, ఆర్థికస్వాతంత్ర్యం ఉన్న స్త్రీలకు ఇది సాధ్యం అని నేనంటాను. వాళ్ళను కొందరిని నేనెరుగుదును. జీవితం వాళ్ళకు ఎంతో ఆనందంగానే గడుస్తున్నది. సంఘంలో వారినందరూ చాల గౌరవంగానే చూస్తున్నారు. వారు స్వయంగా తల్లులు కాలేకపోయినా, మాతృప్రేమను వర్షించడానికి లోకంలో ఎందరో వారికి ఉన్నారు. ఒక విధంగా చూస్తే వారి మాతృప్రేమలో నిస్వార్థత ఉంది. విద్య, ఆర్థికస్వాతంత్ర్యం ఉన్న స్త్రీ, ఎవరికీ భయపడవలసిన పని లేదు. ఎవరి ప్రమేయము లేక తన జీవితాన్ని తానే శాసించుకోవచ్చును. మన సంఘంలో ఇలాంటి ధీర వనితల సంఖ్య అధికాధికం అవుతూ వస్తే

(మిగతా 201 వ పేజీలో)

# సంపాదకీయం - 9

ఒక దుండగుడు దారినబోతున్న ఒక స్త్రీని, నగలూ అవీ దోచుకోవాలనే ఉద్దేశంతో అటకాయించాడు. కాని ఆ స్త్రీ పేదస్త్రీ. ఒక్క ముక్కుపుడక మాత్రమే ఉంది అయినా అతను వదిలిపెట్టలేదు. "మర్యాదగా ముక్కుపుడక తీసిచ్చేయ్. లేదంటే ముక్కు తెగగోస్తాను" అన్నాడు ఆమె వణికిపోతూ దాన్ని తీసి అతనికిచ్చేసి నిరపాయంగా బయటపడింది. కాని ఆ ముక్కుపుడక పోగొట్టుకోవడం ఆమెకు ప్రాణాంతకమైన బాధగా ఉంది. పోయి రాజుతో తన బాధను చెప్పుకుంది. రాజు వెంటనే భటులను నలుమూలల పరిగెత్తించి ఆ బందిపోటును పట్టుకొన్నాడు. శిక్షాస్మృతి మాటను తలపెట్టకుండ వెంటనే అతనికి శిక్ష విధించాడు— అతనిముక్కు తెగగోసి పంపండని. భటులు అతణ్ని ఒక చదుకానికి తీసుకవచ్చి అశేష ప్రజానీకం చూస్తుండగా అతని ముక్కు తెగగోశారు. ముక్కు తెగినవెంటనే అతను నవ్వుతూ గంతుతూ నాట్యమాడుతూ పరవశమగుతూ ఉండడం ఆ జనానికి చాల ఆశ్చర్యం వేసింది. కారణమడిగారు. అప్పుడతనన్నాడు గదా: "నా ముక్కు తెగినవెంటనే నా నయనాలకు దేవుడు కనబడినాడు. అల్లదిగో దేవుడు నా నయనపథాన్ని వదలకున్నాడు. ఆహా నా జన్మ తరించింది. నా జన్మ తరించింది. ముక్కు పోతే పోయింది. దేవుని దర్శనం నాకు కలిగింది. ముక్కుపోయినందువల్లే దేవుని దర్శనం నాకు లభించింది. ధన్యుణ్ణి ధన్యుణ్ణి దేవుడా దేవుడా దేవుడా" అతను ఆనందం ప్రకటిస్తూ చిందులు వేయసాగాడు. నిజమే కాబోలు అనుకొన్నారు జనం. ఆ మాటలు గట్టిగా విశ్వసించిన ఒక అమాయకుడు మాత్రం అతని సమీపానికి వచ్చి "నీ వెంతో అదృష్టవంతుడివి. దేవుడు కనబడ్డాడు. నాకు కూడ దేవుణ్ణి చూడాలనుంది. చూపిస్తావా!" అని ప్రార్థించాడు. "ఓహో దానికేం. చాల సులభం. నీ ముక్కు నిస్తావా ఇస్తే దేవుడు కనబడతాడు" అన్నాడు ఆ శిక్షితుడు. అమాయకుడు ఒప్పుకోలు సూచిస్తూ తల ఊచాడు. వెంటనే ఆ శిక్షితుడు అతని ముక్కు తెగగోసి చెవిలో ఇలా అన్నాడు "నీకు దేవుడు కనబడడు. నా మాటలు నమ్మి ముక్కు పోగొట్టుకున్నావు. ఇది నీకు చాల అవమానకరంగా ఉంటుంది. ఇక జనంలో తలెత్తుక తిరగలేవు. కాబట్టి నామాదిరే నువ్వున్నూ దేవుడు కనబడినట్లు నటించు వేరే మార్గం లేదు. ముక్కుపోతే ముఖానికి ఎంతో వికారం, మనస్సుకెంతో అవమానం. నలుగురిలో తలెత్తుక తిరగడం ఎట్లరా దేవుడా అని ఆలోచించి నేనీ ఎత్తు వేశాను. జనం చాలమంది విశ్వసించారు కూడ. ఇక నేను లోకంలో మహాత్ముడుగా పూజలందుకోబోవుచున్నాను. నీవున్నూ నాలాగే నటించు. నా ప్రథమ శిష్యుడుగా వర్ధిల్లు. ముక్కుపోతే పోయింది. బాధపడకు" అన్నాడు. ఆ అమాయకుడికి అంతా అర్థం అయింది. వీణుగా ముక్కుపోయింది. తన అవివేకజనిత విశ్వాసాన్ని నిందించుకొనిమాత్రం ఇంకేం లాభం అనుకొని అమాంతం "అదిగో అదిగో దేవుడు దేవుడు కనబడ్డాడు కనబడ్డాడు ధన్యుణ్ణి ధన్యుణ్ణి" అంటూ ఆనందతాండవం చేయసాగాడు. జనంలో పెద్ద కలకలం బయలుదేరింది. అక్కడున్న ఒకరిద్దరు సందేహప్రాణులకు సైతం "నిజమే కాబోలు" అని నమ్మకం కుదరసాగింది. ఆ ముక్కిడులిద్దరూ (ముక్కులేనివాడు ముక్కిడి) "దేవుడా దేవుడా" అని అరచుకుంటూ ఒక పెద్ద తోట వైపు నడవసాగారు. జనంలో కొందరు వారిని వెన్నంటుతూ "మాకూ దేవుని దర్శనం కావాలి" అని ప్రాధేయపడసాగారు. "ఇప్పుడు కాదు

రేపు రండి'' అని ఆ ముక్కిడి నాయకుడు వాళ్ళను విదిలించుకొని ముందుకు సాగి పోయాడు.

మఱునాడు దేవుని దర్శనం కావాలని వచ్చే వాళ్ళకోసం ఆ ముక్కిడులిద్దరూ ఒక క్రియా కలాపాన్ని రూపొందించుకొన్నారు. దీక్షా విధానం ఇది: గురువు కత్తి పట్టుకొని సిద్ధంగా ఉంటాడు. శిష్యుడు తట్ట పట్టుకొని సిద్ధంగా ఉంటాడు. దీక్షకోసం వచ్చేవాళ్ళ ముక్కును గురువు కోసి తట్టలో వేసి తక్షణమే చెవిలో చెప్పవలసిందంతా ఆ నూతన ముక్కిడికి చెబుతాడు. ఆ నూతన ముక్కిడి ఇక గత్యంతరం లేక ''నాకు దేవుడు కనబడ్డాడు'' అని చిందులు వేస్తాడు. ఇలా ముక్కిడుల సంఖ్య ఎక్కువైయింది. సంఖ్య ఎక్కువయేటప్పటికి ఆ గ్రూపువాళ్ళకు ముక్కిడిమతస్థులనే పేరు కూడ ఏర్పడింది. ఆ మతం చుట్టూ కొన్ని సిద్ధాంతాలు కొన్ని క్రియాకలాపాలు కొన్ని ఆచార వ్యవహారాలు ఏర్పడ్డాయి. ముక్కిడి మత గ్రంథం కూడ తయారయింది. ఇది ఒక క్రొత్త మతం కాబట్టి పాతమతాలనుండి రోజూ కొందరు అమాయకులు వచ్చి ఈ ముక్కిడిమతంలో చేరుతూనే ఉన్నారు. ఆడవాళ్ళు మాత్రం వచ్చి చేరడం లేదు. ''ఆ దేవుణ్ణే దిబ్బలో వేయండి. విరూపతను ఎవరు కొనితెచ్చుకుంటారు'' అని వాళ్ళుమాత్రం ఆ ముక్కిడి మతానికి దూరంగానే ఉన్నారు. తన దేశంలో చకచకా వ్యాప్తి చెందుతున్న ఈ ముక్కిడిమతం వార్త రాజుదాక పోయింది. రాజుకు కూడ దేవుణ్ణి చూడాలనే కోర్కె పుట్టింది. ముక్కిడిమతంలో చేరాలనుకున్నాడు. కాని సంప్రదించడానికి మంత్రి దగ్గరలో లేడు. దూరదేశం పోయిన మంత్రి రాగానే తన అభిమతాన్ని తెలియజేసి సలహా అడిగాడు. మంత్రి చాల ఆశ్చర్యపోయాడు. ''ఔరా ఎన్నో తెలివితేటలున్న ఈ రాజు సైతం మతవిషయంలో ఎంత గ్రుడ్డిగా నమ్ముతున్నాడు. ఇక అమాయకుల సంగతి చెప్పనేల!'' అని మనస్సులో అనుకొని కొంత దీర్ఘంగా ఆలోచించి రాజుతో ఇలా అన్నాడు. ''రాజా! నేను చాల దేశాలు చూశాను. ఆ దేశాల్లోని మతాలు చూశాను. ఎన్నో ఉన్నాయి. చెవ్విడిమతం తవ్విడిమతం కన్నిడి మతం ఇలా ఎన్నో ఉన్నాయి. వాటి పుట్టుపూర్వోత్తరాల గురించి కూడ తెలుసు. ఈ మతాలన్నీ భయం నుండి పుట్టాయి, భయం వల్ల వ్యాప్తి చెందాయి, భయం వల్ల నిలదొక్కుకుంటున్నాయి. ఈ ముక్కిడిమతం కూడ అలాంటిదే. 'నా ముక్కు పోయింది. ఇక నేనెలా తలెత్తుకొని నలుగురిలో తిరుగగలను' అనే భీతి నుండి ఈ ముక్కిడిమతం పుట్టింది. వ్యాప్తి చెందింది. నిలదొక్కుకుంటున్నది. ఆ ముక్కిడిమతగ్రంథం సంగతికూడ విన్నాను. లోకంలో జరిగే మంచికంతా కర్త దేవుడనీ, లోకంలో జరిగే చెడ్డకంతా కర్త దయ్యమనీ రెండు ఏజంట్లని సృష్టించుకున్నారు. మతగ్రంథంలో చెప్పినట్లు చేస్తే స్వర్గం, లేదంటే నరకం అన్నారు. ఆ స్వర్గనరకాలు కూడ వాళ్ళ స్వకపోలకల్పితమే. సుఖదుఃఖ సమ్మిళితంగా ఉండే ఈ లోకాన్నుండే వాళ్ళు తమ స్వర్గనరకాల కల్పనకు కావలసినదంతా కాపీ చేసుకున్నారు. ఈ లోకంలో వుండే సుఖాన్ని మాత్రమే మనస్సులో ఊహించి దాన్ని స్వర్గం అన్నారు. ఈ లోకంలో ఉండే దుఃఖాన్ని మాత్రమే మనస్సులో ఊహించి దాన్ని నరకం అన్నారు. ప్రజలు ఇలాంటి సరుకును ఎలా గ్రుడ్డిగా నమ్ముతారో తలచుకున్నప్పుడల్లా నాకు చాల విచారం వేస్తుంది. ప్రశ్నించే

గుణాన్ని వీళ్లెందుకు కోల్పోతున్నారో నాకర్థం కాలేదు. ప్రతిదాన్ని ధైర్యంగా ప్రశ్నించే వాడే సత్యం వైపు పయనించేవాడని నేనంటాను. అలా ప్రశ్నించేవాళ్ళు ఎక్కువైతే ఈ ముక్కిడి తిక్కిడి మతాలన్నీ లోకంలోనుండి మాయమౌతాయి. ప్రజల్లో విజ్ఞానం ఎక్కువౌతుంది. శాంతి సుహృద్భావాలతో సంఘం కలకలలాడుతుంది. 'యథా రాజా తథా ప్రజా' అన్నారు. ముందు నీవు నీ మతమౌఢ్యాన్ని వదలిపెట్టు. తరువాత ఈ ముక్కిడి తిక్కిడి మతాలు నీ దేశంలోనుండి మాయమయేలా నీ ప్రజల్లో విజ్ఞానవ్యాప్తి పథకాల్ని ప్రవేశపెట్టు. ఎందుకు ముక్కు తెగగోసుకోవాలని వాంఛిస్తావు. అలాంటి చిత్రాలవల్ల దేవుడు కనబడడు దానికి మనశ్శమనం కావాలి. దానికి వేరే ఉపాయాలున్నాయి. మనుష్యు సృష్టించిన ఈ ముక్కిడి తిక్కిడి మతాలవల్ల మత గ్రంథాలవల్ల అది కుదరదు. నీతో మాట్లాడుతూ కూర్చుంటే అవశ్యం చేయవలసిన పనులు అలాగే ఉండిపోతాయి. ముందు ఆ ముక్కిడిమత గురువును దేశంనుండి వెళ్ళగొట్టి వస్తా'' అని మంత్రి సెలవు తీసుకున్నాడు. ఈ కథను ఈ రోజు ఎందుకు చెప్పానో నాకే అర్థం కావడం లేదు. ఇలాంటి కాలయాపన ఇక కట్టిపెట్టి రేపటినుండి ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడుకుందాము. ఆ మాటలు అర్థవంతములుగా ఉండేట్లుగా జాగ్రత్తపడతాము. ఆధ్యాత్మిక విషయాల మీద వ్రాసేవాళ్లు ప్రసంగించేవాళ్లు నూటికి తొంబదితొమ్మిది మంది అర్థరహితంగానే వ్రాస్తారు ప్రసంగిస్తారు. దానిని ప్రజలు మూర్ఖంగా ఆమోదిస్తుంటారు. కాస్త కూడ ఆలోచించరు. నా మాటల్లో మామిడిచెట్టు అంటాననుకో, ఆ పదం దేన్ని సూచిస్తుందో అది నాకు అనుభవంలో ఉంది. దాని ఆకారం, కొమ్మలు, ఆకులు, కాయలు, ఆ అనుభవం వల్ల మామిడిచెట్టు అనే ఆ పదాన్ని లేక శబ్దాన్ని ఉచ్చరించేటప్పుడు అది అర్థవంతంగా ఉంటుంది. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అనే ఒక వాక్యం ఉపనిషత్తులో ఉంది. అది ఒక ఉపనిషత్ ద్రష్ట అనుభవం. అతనికి అది అర్థవంతం. ఆ అనుభవం ఏమీ లేక ఆ వాక్యాన్ని మాత్రం నేను ఒప్పచెబితే అది అర్థరహితమవుతుంది. ఆ వాక్యం ఒక శబ్దమాత్రంగానే ఉండిపోతుంది. దాని వల్ల ఒక ప్రయోజనమూ లేదు ఆధ్యాత్మికంగా ఎవరికి వారు అనుభూతి పొందాలే గాని ఇతరుల అనుభవాలను వల్లె వేసుకుంటూ కూర్చోవడం అవివేకం అవుతుంది. అదృష్టవశాత్తు నీవూ పండితుడవు కాదు నేనూ పండితుడను కాను కాబట్టి మన ప్రసంగాన్ని సాధ్యమైనంత వఱకు అర్థవంతంగానే నడిపిస్తాము.

* * *

మఱునాడు వాద్దరి సమావేశం జరుగలేదు. అంతకుముందు పదిరోజులుగా జరిగిన సమావేశం తరువాత కొనసాగలేదు. ఎక్కువరోజులు ఒక చోటనే ఉండడం సమ్మతం కానందువల్ల ఆ పరివ్రాజకుడు ఆ కోటు బీకులను అతికష్టంమీద ఒప్పించి వారినుండి సెలవు తీసుకొని తనదారిన వెళ్ళిపోయాడు.

వ పేజీ తరువాయి)

కొన్నేండ్లకు కట్నాల బెడద అంతరించిపోతుంది. అంతే కాదు "పిల్లనిస్తే చాలండీ ఖర్చులన్నీ మేం పెట్టుకుంటాం'' అనే దైన్యానికి వరుల వైపు వాళ్ళు దిగివచ్చే స్థితి కూడ రావచ్చు! ఎక్కడో ఒక కథ చదివాను. అది కొన్నేండ్ల తరువాత జరగబోయే విషయాన్ని ముందుగా ఊహించి వ్రాసిన తమాషా కథ. కుటుంబనియంత్రణ వల్ల స్త్రీల జనసంఖ్య బాగా పడిపోయి ఆ సంఘంలోని పురుషుల దురవస్థను చిత్రించే కథ అది. కుటుంబనియంత్రణ వల్ల అలాంటి పరిణా

# భ్రమర గీతాలు

కుమారి పి. రాజ్యలక్ష్మి

విరహము, ప్రేమ యొక్క ఉత్కృష్టమైన రూపము. విరహాన్ని అనుభవించేవారు నిజమైన ప్రేమికులు. కారణం విరహము, ప్రేమయొక్క సాత్త్విక రూపము. సంయోగము ప్రేమయొక్క రాజసరూపం. సంయోగావస్థలో ప్రేమికులు తీవ్రమైన కోరికలు గలవారై వుంటారు. అదీ కాక సంయోగములో, ప్రేమయొక్క నిజ స్వరూపాన్ని తెలుసుకోవటం చాలా కష్టం. కాని విరహములో ప్రేమికులు, కోరికలకతీతమైన ఆధ్యాత్మిక స్థితిని చేరుకుంటారు. ప్రేమికుల హృదయాలలో ఒకరిపట్ల యింకొకరికి ఎంతటి ఆతురత – తీవ్రత వున్నదో, ఎంతటి దృఢత్వం, ఆదరం వున్నవో విరహావస్థలోనే తెలుస్తుంది. అంతేకాదు విరహము, ప్రియురాలికి, ప్రియునిపట్లగల వేగిరపాటును, తీవ్రమైన ఆకాంక్షను తెలుపుతుంది. ఈ కారణము చేతనే విరహకావ్యం సంవేదనాత్మకమైనదని, హృదయ ద్రావకమైనదని పేరు పొందినది.

సూరదాసు, కృష్ణుని యవ్వనావస్థను ఎంత సుందరంగా వర్ణించారో, విరహజీవితాన్ని కూడ అత్యంత మార్మికముగా చిత్రించారు. శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళాక, బృందావన వాసుల పరిస్థితి వూహించనంతగా మారిపోయింది. రాజనీతిలో మునిగిన కృష్ణునికి, తిరిగి బృందావనం రావటానికి వీలుకాలేదు. తమ కంటి వెలుగుగా భావించిన వేణుధరుడు, తమను వీడి వెళ్ళిపోవటంతో బృందావనవాసులు, జీవచ్ఛవాలలాగా అయ్యారు. మాధవుడు కూడ మధురకు వెళ్ళాడేకానీ, అతని మనస్సంతా తనకై తపించే గోపికల మీద, తన చిన్ననాటి చెలుల మీదనే వుంది. కృష్ణునికి ప్రతి క్షణం బృందావనంలో తన చెలులతో కూడి తాను గడిపిన మధుర క్షణాలు జ్ఞప్తికి వచ్చేవి. అంతే కాదు, మధురవాసులు తనమీద చూపే ప్రేమానురాగాలు, కృత్రిమంగా అనిపించేవి. దానికి తోడుగ ఉద్ధవుని వైరాగ్యోపన్యాసాలు అతనిని మరింత బాధకు గురిచేసేవి.

ఉద్ధవుడు, కృష్ణుని ప్రియసఖుడు. ప్రేమ – అనురాగం అనేవి మిథ్య అని, కేవలం నిర్గుణ బ్రహ్మే సత్యస్వరూపమని భావించే అతనికి తాను గొప్ప జ్ఞానిననే అహం వుంది. ఉద్ధవుడిలోని ఈ అజ్ఞానాన్ని దూరం చేయటం కోసమని కృష్ణుడు, ఉద్ధవుని పిలిచి అజ్ఞానులై, విరహమనే నదిలో నిరంతరం కొట్టుమిట్టాడే గోపికలకు, జ్ఞానోపదేశాన్ని కావించి, వారిని రక్షింపమని కోరుతాడు. కృష్ణుని ఈ మాటలతో, ఉద్ధవుడి గర్వం మరికాస్త ఎక్కువైంది. తాను గోపికల మనసు మార్చి, వారిని గొప్ప జ్ఞానవంతులను చేస్తానని కృష్ణునికి మాట యిచ్చాడు.

ఉద్ధవుడు, గోపికలకు జ్ఞానోపదేశం చేయడానికి బృందావనం వెళ్ళాడు. కృష్ణుడు తనకై ప్రేమ సందేశాన్ని పంపాడనుకున్న గోపికలకు, ఉద్ధవుడి మాటలు నిరాశను కలిగించాయి. ఉద్ధవుడి వైరాగ్యోపన్యాసాలు వారికి నచ్చలేదు. అలాగని వృద్ధుడైన ఉద్ధవునితో తమ అయిష్టతను తెలుపలేరు. ఏం చేయాలో తెలియక అయోమయావస్థలో పడిన గోపికల ముందునుండి, భ్రమరం ఒకటి కదలిపోతూ వుంటే, దాన్ని అడ్డుపెట్టుకొని, గోపికలు తమకు నిర్గుణోపాసనయందున్న అయిష్టతను వెల్లడి చేసుకున్నారు. ఈ విధంగా భ్రమరాన్ని అడ్డుపెట్టుకొని గోపికలు తమ మనసులోని మాటను వెల్లడి చేయటంతో, ఈ పదాలకు 'భ్రమర గీతాలు' అనే పేరు వచ్చింది. భ్రమరగీతా

లలో దాగిన గోపికల వ్యంగ్య. వివశతల ద్వారా. ప్రేమ - భక్తి అనేవి లేకుండా మానవుడు భగవంతుని చేరడం కష్టమని నిరూపిస్తాయి.

[మధుప తుమ] కహాఁ కహా తై ఆయె హౌ।
జానతి హౌ అనుమాన అపనై, తుమ జదునాథ పఠాయె హౌ॥

"ఓ భ్రమరమా! నీవు ఎక్కడనుండి వచ్చావు? నిన్ను మాధవుడు పంపాడని మేము భావిస్తున్నాము. కారణం నీవు కృష్ణునిలాగానే నల్లని శరీరాకృతితోను, అతను ధరించే ఆభూషణాలనే ధరించి వున్నావు. మాధవుడు మా సర్వస్వాన్ని తన స్వంతం చేసుకొని, మమ్మల్ని నిర్దాక్షిణ్యంగా వదలి వెళ్ళాడు. యిక మా వద్ద ఏం మిగిలిందని, నిన్ను పంపాడు? మాకున్న ఒక్క హృదయాన్ని కృష్ణుడు, తన వెంట తీసుకొని వెళ్ళాడు. యిక నీవు చేసే ఉపదేశాలను వినటానికి మాకు ఓపిక, ఓర్పు రెండూ లేవు."

ఉద్ధవుడు వారి మాటలను వినిపించుకోకుండా, వారితో

మనో గోపి హరికే సందేశ।
కరి సమాధి అంతరగతి ధ్యావహు, యహ వునకౌ వుపదేశ॥

"'గోపికలారా! కృష్ణుడు పంపిన సందేశాన్ని వినండి. ప్రేమానురాగాలను వదలుకొని, మీలో వున్న పరబ్రహ్మను సదా ధ్యానించండి బ్రహ్మతత్త్వాన్ని మించిన జ్ఞానము లేదని వేదాలు, పురాణాలు తెలుపుతున్నాయి. మీ మనసులలో వున్న సగుణరూపాన్ని తుడిచిపెట్టి నిర్గుణబ్రహ్మను ఏకాగ్రతతో ధ్యానించండి.' కృష్ణుని ఈ సందేశాన్ని విన్న గోపికలకు దుఃఖం ఆగలేదు."

కృష్ణునికై దుఃఖిస్తున్న గోపికలను సాంత్వన పరుస్తూ ఉద్ధవుడు వారికి వైరాగ్యోపన్యాసాలు యివ్వసాగాడు.

జాని కరి బావరీ జాని హోహు
తత్వ హిజై వైసీ హ్వై జైహౌ పారస పరసౌ లోహు॥

"'గోపికలారా! మీరెందుకు యింత అజ్ఞానంలో పడుతున్నారు? ఏవిధంగానైతే రసవేది స్పర్శతో ఇనుము, బంగారంగా మారుతుందో, అదే విధంగా పరబ్రహ్మయొక్క ధ్యానంతో మీలోని అజ్ఞానమంతా దూరం అయి, మీ మనసులు స్వచ్ఛంగా అవుతాయి. నా మాటలు విని మీరీ మమతా-మోహాలను విడనాడి నిర్గుణబ్రహ్మను సత్యస్వరూపంగా ఎంచి ధ్యానించండి.' ఉద్ధవుని మాటలు విని గోపికలు కోపం పట్టలేక, 'ఓ భ్రమరమా! యిలాంటి కఠినమైన మాటలు చెప్పటానికి నీ మనసెలా ఒప్పింది? భగవంతుని చేరే చక్కని రాజమార్గము వుండగా, యోగాన్ని అవలంబించే అవసరం మాకు లేదు'"

భ్రమరగీతాలను సూరదాసు, కఠినహృదయాలను సైతం కరిగించేటంత మనోహరంగా వర్ణించారు. గోపికలు, కృష్ణవిరహంలో ఎంతటి బాధను అనుభవించారో, అది మాటలలో వర్ణించి చెప్పలేనిది. అంతేకాదు మనసా - వాచా-కర్మణా తననే నమ్ముకొన్న గోపికలను, గోపాలుడు ఎంతటి మోసం చేసాడా అనిపిస్తుంది భ్రమరగీతాలను చదువుతుంటే. కృష్ణుడు లేకుండా, అతని సుందరరూపాన్ని చూడకుండా బ్రతకటం గోపికలకు కష్టసాధ్యమైపోయింది. అందుకే వారు తమ వేదనను ఉద్ధవుడితో ఈ విధంగా వెల్లడి చేసుకున్నారు.

ఊధో। జో హరి హితు హమారే।
తో తుమ కహియో జాయి కృపా కరియే దుఃఖ నసై హమారే॥

"ఉద్ధవా! శ్రీకృష్ణుడు నిజంగా మా కోరేవాడే అయితే. నీవు అతని వద్దకు వెళ్ళి, మేము అనుభవించే ఈ బాధను వివరంగా తెలియచెప్పు."

"మా శరీరమనే ఈ వృక్షాన్ని, విరహమనే కాలాలో నిరంతరం దహింపబడుతోంది. మా హృదయాలలో నలరేగే నిట్టూర్పులు ఈ విరహ జ్వాలలను మరింత వృద్ధి చేస్తున్నాయి. ఈ విరహజ్వాలలు చల్లారే మార్గం కనబడటం లేదు సరికదా, నెమ్మది - నెమ్మదిగా మా శరీరాన్ని నాశనం చేస్తున్నాయి. కృష్ణుని పట్ల వున్న ప్రేమానురాగాలు ఒక ప్రక్క- ఈ విరహాగ్నిపై చల్లని జల్లులను కురిపించి చల్లార్చటానికి ప్రయత్నిస్తున్నా కూడా లాభం లేకపోతున్నది. మా ఈ విరహాగ్నిని చల్లార్చటానికి వేరొక మార్గాన్ని అన్వేషించాలేమో! [ఆ మార్గం కృష్ణుడు వచ్చి వారితో కలవటమేనని వారి ఉద్దేశ్యం.]

"ఈ విరహం ఒక వేటగాని వలె, కోయిల, చిలుక, చాతకపక్షి, పావురాలవంటి మా మనస్సులను వధించటానికి పొంచి వుంది. ఓ ఉద్ధవా! నీవు కృష్ణుని వద్దకు వెళ్ళి ఈ సంగతి చెప్పు, ఇక ఈ దీనావస్థలో మేము ఎంతకాలం జీవనం గడపాలో మా మాటగా అడుగు".

ఈ విధంగా గోపికలు, తాము అనుభవించే విరహ వేదనను ఉద్ధవునికి తెలుపుతూ, "ఉద్ధవా! మాధవుడు నిజంగా గోపికానందనుడు అయితే మమ్మల్ని రక్షించటానికి రాడా! మాయందరికి ప్రేమ లేదు. కాబట్టే నీతో యిలా సందేశాన్ని పంపి మా బాధను, మరింత అధికం చేస్తున్నాడు.

మధుబన లోగని కో పతియాయి।
ముఖ ఐర్ అంతరగతి ఐరే, పతియా లిఖి
పఠవతు జా భనాయి।

"ఉద్ధవా! మధువనంలో నివసించేవారిని ఎన్నడు విశ్వసించకూడదని, మాకు ఈనాడు బాగా అర్థం అయింది. కారణం వాళ్ళ హృదయాలలో వుండేదొకటి, నోటితో చెప్పేదొకటిగా వుంటుంది. నల్లనివారిని అసలు నమ్మరాదు. కోయిలను, తన బిడ్డగా ఎంచి, కాకి దాన్ని ఎంతో ప్రేమగా పెంచుతుంది. కానీ వసంతఋతువు రాగానే 'కుహూ' అంటూ తన జాతివారితో కలిసిపోతుంది. భ్రమరమూ అంతే. కమలంలోని మధువును తృప్తితీరా సేవించి, తిరిగి దానివైపు కన్నెత్తి అయినా చూడదు. నల్లనివానిని ప్రేమించటం వలన వేదన తప్ప ఏదీ మిగలదు."

గోపిక మాటలకు ఉద్ధవుడు నవ్వి, "గోపికలారా! సగుణరూపాన్ని ధ్యానించటం వల్లనే కదా మీరీనాడు, యింతటి బాధను అనుభవిస్తున్నారు. అదే మీరు ఆ పరబ్రహ్మను నమ్ముకొని వుంటే ఎంత హాయిగా జీవించే వారు. కనీసం యిప్పటికైనా నా మాటను వినండి."

జ్ఞాన బినా కహూఁవై సుఖ నాహీ।
ఘట-ఘట వ్యాపక దారు అగిని జ్యోం, సదా బసై
పుర మాహీ ॥

"గోపికలారా! జ్ఞానాన్ని మించిన సుఖం ఈ సృష్టిలో ఎక్కడా లేదు. నివురు కప్పిన నిప్పులాగా, ఆ పరబ్రహ్మ మన హృదయాలలో నిండివున్నాడు. అలాంటి నిర్గుణబ్రహ్మను వదలి సగుణం వైపు పరుగెత్తడం దేనికి? నీడలా మనను వెన్నంటి వచ్చే ఆ బ్రహ్మను వుపాసించండి. మీకు మంచి కలుగుతుంది. సగుణరూపాన్ని వుపాసించటం వలన మీరు పొందినదేమిటో నాకు అర్థం కావటం లేదు."

ఉద్ధవుని మాటలు విన్న గోపికలు అతనితో_

ఊధో కహీసు ఫేరిన కహియె।
జౌతుమ - హమై జిచాయో చాహత, అనబోలే
హ్వై రహియే॥

"ఉద్ధవా! యిప్పటి వరకు నీవు చేసిన ఉపదేశం చాలు. యింకేమీ చెప్పొద్దు. మమ్మల్ని బాధ పెట్టకుండా వుండాలంటే దయచేసి మాట్లాడకుండా వూరుకో. మేము అనుభవించే బాధ నీకు పరిహాసంగా వుంది కాబోలు నీ ఈ మాటలు వినేకన్నా ప్రాణత్యాగం చేయటం వుత్తమం. అసలు నిన్నని లాభం ఏమిటి? ప్రేమను మరచి, మమ్మల్ని బాధపెట్టడం కోసం, నిన్ను యిక్కడికి పంపిన కృష్ణుని అనాలి. విరహమనే జ్వాలలో మేం ఏనాడో భస్మం అయ్యాము. యిక నీ వుపదేశాలు, ఈ మృతకళేబరాలముందు ఏం పని చేస్తాయి? మమ్మల్ని తిరిగి బ్రతికించాలని నీవు అనుకుంటే, కృష్ణుని బృందావనానికి తీసుకొనిరా. అంతే కాని యిలా వ్యర్థంగా మా ముందు ఉపదేశాలు యివ్వటం మానివేయి.

"ఉద్ధవా! నీవు కృష్ణుని ప్రియమిత్రుడివి. అలాంటి నీవు కృష్ణుని మధురమైన కథలను వినిపించి, మాకు వుపశమనం కలిగించాల్సింది పోయి ఈ విధంగా మాట్లాడటం నీకు న్యాయమేనా? మాధవుని చిరునవ్వు కోసం, ప్రేమపూరితమైన అతని చూపు కోసం, మా ఈ నేత్రాలు తపించిపోతున్నాయి."

అఖియా హరి దరశన కీ ప్యాసీ।
దేఖే చాహతి కమలనైన కో, నిశదిన రహతి వుదాసీ॥

"ఉద్ధవా! మా కన్నులు, కృష్ణదర్శనం కోసము తపించిపోతున్నాయి. అప్పుడే విచ్చిన కమలాలవంటి నేత్రాలుగల కృష్ణునికై, రాత్రి-పగలు ఎదురు చూసి - చూసి, ఈ నేత్రాలు అలసి, వుదాసీనం అయ్యాయి. ఉద్ధవా! నుదుట కస్తూరి తిలకాన్ని, అందమైన ముత్యాల సరాలను ధరించిన కృష్ణుడు, బృందావనానికి వచ్చి కపట ప్రేమను చవిచూపి, విరహమనే వృక్షాన్ని పెంచి తన దారిన తాను వెడలిపోయాడు. కానీ మేము అనుభవించే బాధ ఏపాటివారికి. ఎగతాళిగా తయారైంది మా వేదనను వివరంగా వెల్లడి చేస్తే, నీవు మమ్మల్ని అర్థం చేసుకుంటావు?"

"గోపికలారా! నేను మిమ్మల్ని అర్థం చేసుకున్నాను కాబట్టి, మీ బాధను హరించే నిర్గుణ బ్రహ్మను ధ్యానించమని చెపుతున్నాను అని చెబుతున్న ఉద్ధవుడిని చూసి గోపికలు.

నిరుగున కౌన దేశ కౌ వాసీ।
మధుకర కహి సముఝాయి సౌంహ దై బూఝతి
సాంచిన హాంసీ॥

"ఉద్ధవా! నిర్గుణబ్రహ్మ ఎవరు ఏ దేశంలో నివసిస్తాడు నిన్ను ఎగతాళి చేయటానికి ఈ ప్రశ్నలు వేయటం లేదు మేము నీవు చెప్పే నిర్గుణ బ్రహ్మయొక్క తల్లి-తండ్రి ఎవరు? అతని భార్య ఎవరు? అతని ప్రియురాలెవరు? అతని రూపురేఖలు ఎలా వుంటాయి? అతను ఏరంగులో వుంటాడు? యివన్నీ మాకు వివరంగా చెప్పు. అమాయకులు, ఏది చెప్పినా నమ్ముతారు, అనుకున్నావంటే దానికి తగ్గ ఫలితాన్ని అనుభవిస్తావు' శరపరంపర వంటి ఈ ప్రశ్నలు వినేసరికి, ఉద్ధవునికి ఏం చెప్పాలో తెలియక మౌనంగా వుండిపోయాడు."

ఉద్ధవుని మౌనాన్ని చూసి గోపికలు—
ఊదో హమహిన జోగ శిఖాయో।
జిహి వుపదేశ మిలై హరి హమకో, సో వ్రత నేమ
బతైయె॥

"ఉద్ధవా! దయచేసి మాకు యోగము గురించి చెప్పొద్దు. ఏ వ్రతాన్ని ఆచరిస్తే మాధవుడు మాకు లభిస్తాడో ఆ వ్రత నియమ

మాన్ని గురించి మాకు తెలుపు. మాకు కావలసింది వేణుధరుడు కానీ, ముక్తి-మోక్షం కాదు. నిర్గుణోపాసన గురించి విని – విని మా ప్రాణాలు విసిగెత్తిపోయాయి. యింతకాలం పుష్పాలతో అలంకరించుకున్న మా అందమైన కేశాలకు భస్మాన్ని, రకరకాలైన భూషణాలను ధరించిన మా అంగాలను తులసీ మాలలతోను, పట్టువస్త్రాలను ధరించిన మా దేహాలను కాషాయవస్త్రాలతోను ఎలా అలంకరించుకోమంటావు? మాకు అష్టసిద్ధులు అవసరం లేదు మాధవుని చూడగలిగితే చాలు.

వియోగంలో ఎంతటి బాధవున్నదో, అనుభవించినవారికి తప్ప ఎవరికీ తెలియదు. ఉద్ధవుడు ఎంతసేపు తానో జ్ఞానిననే అహంభావంతో వున్నాడే కానీ, గోపికల ఆవేదనను, ఆక్రోశాన్ని అర్థం చేసుకోలేని అజ్ఞానంలో పడ్డాడు.

ఊధో మన నాహీ హాత హమార హై।
రథ చఢాయి హరి సంగ గయె లై,
మథురా జబహి సిధారే॥

"ఉద్ధవా! మా మనస్సు మా అధీనంలో లేదు. మాధవుడు, మథురకు వెళుతూ, తనతో పాటు మా మనసులను కూడ తన వెంట తీసుకొని వెళ్ళాడు. మా మనసే గనక మా అధీనంలో వుండివుంటే, హాయిగా మేము కూడ, నీవు చెప్పే వుపదేశాలను విని, ఒక ప్రక్క ముక్కు మూసుకొని కూర్చునివుండేవాళ్ళం కదా! మాధవుడు, మమ్మల్ని అన్యాయం చేసి వెళ్ళాడని, అతని మీద మేము కోపంగా వుంటే, అగ్నిలో ఆజ్యం పోసినట్లుగా నీ చేత ఇలాటి సందేశాన్ని పంపాడు. ఎంత నిర్దయుడు గోపాలుడు! నీమాట వినాలి అని, నీవు అనుకునేటట్లైతే దానికి ఒకటే మార్గం వుంది. అది మా మనస్సును, మా వద్దకు వచ్చేటట్లు చేయటమే, [కృష్ణుని, తమవద్దకు చేర్చమని వారి ఉద్దేశం]"

గోపీ సునహు హరి సందేశ।
కహ్యో పూరన బ్రహ్మ ధ్యావహు, త్రిగున మిథ్యా
మేష॥

"గోపికలారా! కృష్ణ సందేశాన్ని ఆలకించి, పూర్ణబ్రహ్మను ధ్యానించండి. త్రిగుణాత్మకమైన ఈ సృష్టి మిథ్యాపరమైనది. నేను చెప్పేది సత్యంగా ఎంచి, సగుణాన్ని వదలివేయండి. జీవుడు పంచతత్త్వాలతో నిర్మితమైనాడు. జ్ఞానమనేది లేకపోతే, మానవుడు విషయయుక్తమైన ఈ సంసారసాగరం నుండి బయటపడలేడు. కాబట్టి మీరు, ఈ సృష్టిలోని అణువణువులోను నిండిన ఆ పరబ్రహ్మను ధ్యానించి ముక్తిని పొందండి."

ఐసీ బాత కహౌ జని ఊధో।
కమలనైన కీ కాని కరత హై, ఆవత వచన న సూధే॥

"ఉద్ధవా మా ముందెన్నడు నీవు యిలాటి మాటలు మాట్లాడకు. కృష్ణుని యందుగల గౌరవంతో నిన్ను ఏమీ అనకుండా వదలివేస్తున్నాము. కారణం నీకులాగా ఎదుటివారిని, మాటలతో బాధపెట్టడం మాకు చేతకాదు. మనసా-వాచా-కర్మణా మేము కృష్ణుని నమ్ముకున్నాము. అతనిని మించిన దైవం ఈ ముల్లోకాలలో మాకు లేదు. మాయందు నీకు దయ అనేది వుంటే, మా ఈ దుఃఖాన్ని దూరం చేయి. అంతే కానీ నీమాటలతో మమ్మల్ని మరింత దుఃఖితులను చేయవద్దు."

ఉద్ధవుడు చేసే నిర్గుణబ్రహ్మ యొక్క ఉపదేశాలను వినలేని గోపికలు, ఉద్ధవునితో తమ అయిష్టతను యిలా తెలిపారు:—

ఊధో మన న భయె దసబీన।
ఏక హుతో సో గయె శ్యామ సంగ, కో అవరాధై
యీష॥

"ఉద్ధవా! నీవు మమ్ములను నిర్గుణోపాసన యందు, మనస్సు లగ్నం చేయమని అన్నావు. కానీ మాకున్నది ఒకటే మనసు. అది కాస్తా కృష్ణుడు తన వెంట తీసుకొని వెళ్ళాడు. యిక నీవు చెప్పే నిర్గుణోపాసనను స్వీకరించటానికి మావద్ద పది మనసులు లేవు. మాధవుడు వెళ్ళిన నాటినుండి మా ఇంద్రియాలు శిథిలమై పోయాయి. మాకు దేనిమీద ఆసక్తి అనేది లేకుండా పోయింది. గోపాలుని చూడలేని ఈ జీవితం మాకు వ్యర్థంగాను, నిర్జీవంగాను అని పిస్తోంది. ఎన్నటికైనా మా ప్రియతముని చూడలేక పోతామా అన్న ఆశే మమ్ములను జీవించకలిగేలా చేస్తున్నది. ఈ ఆశతో మేము ఎన్నియుగాలైనా జీవించగలుగు తాము. ఉద్ధవా! నీవు సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుని మిత్రుడివి. యిక మేము అతని మహిమ గురించి ఏమి చెప్పగలము!"

గోపికలు యిలా ఎంతగా తమ వ్యథను తెలుపుకున్నా, ఉద్ధవుడు వాళ్ళమాటలు వినక, తన జ్ఞానోపదేశాన్ని వారికి అర్థం అయ్యేలా చెప్పాలని ఎంతిగానో ప్రయత్నించాడు. ఉద్ధవుని జ్ఞానోపదేశంతో విసిగిన గోపికలు అతనితో

ఊధో న హమ బిరహిన న తుమ దాస।
కహత సునత ఘట ప్రాన రహత హై. హరి తజి
భజహూ ఆకాస॥

"ఉద్ధవా! మేము నిజమైన విరహిణులము కాము, నీవు కృష్ణుని సేవకునివి అంతకన్నా కాదు. కారణం నిజంగా విరహాన్ని అనుభవి చేవారు, తమ ప్రియతముని ఎడబాసి వుండలేరు. ఆ విధంగానే నీలో సేవకునికి వుండవలసిన గుణాలు మాకు ఎక్కడా కనిపించటం లేదు. ఎందుచేతనంటే సేవకుని కర్తవ్యం తమ యజమానిపట్ల విశ్వాసాన్ని చూపటం. కానీ నీవు యిందుకు విరుద్ధంగా నిర్గుణోపాసనను మాకు బోధించి కృష్ణుని నుండి మా మనస్సులను వేరు చేయటానికి ప్రయత్నిస్తున్నావు. నీవు ఎంత ప్రయత్నించినా, నీ వుద్దేశ్యాన్ని మా విషయంలో నిజం చేసుకోలేవు. కృష్ణుని ఆరాధించకుండా మేము జీవించగలమని నీవు ఎలా భావించావు? అసలు ఈ సృష్టిలో జీవి తాను ప్రేమించిన ప్రియుని ఎడబాసి జీవించ లేదు.

"చేప, తన ప్రియమైన నీరు వదలి ఒక్క ఘడియ కూడ జీవించి వుండ లేదు. తన ప్రియుడైన నీరుపట్ల దానికి గల ప్రగాఢమైన ప్రేమ, దీనికి కారణం. అదే విధంగా చకోరపక్షి, తన ప్రాణాలనైనా త్యజిస్తుంది, కానీ స్వాతిబిందువును తప్ప మరే యితర జలాన్ని స్వీకరించటానికి ఒప్పుకోదు. సూర్యుని ప్రచండ కిరణాల పట్ల తన ప్రేమను వ్యక్తపరచే కమలం, చంద్రోదయం అవుతూనే ముకుళించుకుని పోతుంది. సూర్యునిపట్ల దానికిగల ప్రేమాను రాగాలే యిందుకు కారణం."

ఈ విధంగా గోపికలు, అనేక వుదాహరణలను తెల్పి, నిర్గుణోపాసనందు తమకుగల అయిష్టతను స్పష్టంగా తెలియచేస్తారు.

గోపికలయొక్క హద్దులేని విరహం, సూరదాసు రాసిన ఈ పదంలో మనకు స్పష్టంగా కనబడుతుంది.

సఖీ రీ శ్యామ సబై యిక సార।
మీఠే వచన సుహాయె బోలత, అంతర జారవహార॥

'సఖీ! ఒకరిని నిందించి లాభం ఏమిటి? నల్లనివారంతా ఒకే రకమైన మనస్తత్వాన్ని కలిగివుంటారు. పైకి చాలా తీయగా మాట్లాడి, ఎదుటివారి హృదయాలను హరిస్తారు. అంతే కాదు, తమను ప్రేమించినవారిని వియోగానికి గురిచేయుటలో వారికి వారే సాటి. మేఘము, కోయిల, తుమ్మెద మొదలైనవన్నీ కపట ప్రేమకు ప్రతీకలు కావా! నల్లని మేఘాన్ని

చూసి చకోరపక్షి తనను తాను మరచిపోతుంది. వర్షం కురిసి ఆ నీరంతా నదులు, చెరువులవరకే పరిమితం అవుతుంది కానీ, చాతక పక్షి దాహాన్ని మటుకు తీర్చదు. ఇది కపట ప్రేమ కాదా? కృష్ణుడూ అంతే. సఖీ! ఒకరిని అని లాభం లేదు. మన భాగ్యం ఎలా వుంటే అలా జరుగుతుంది.''

కృష్ణవియోగం, ఒక్క గోపికలనే కాదు నంద-యశోదలు, గోపబాలురపైన కూడ తన అధికారాన్ని చూపింది. అంతేకాదు బృందావనంలోని పశుపక్ష్యాదులు, ప్రకృతిసైతం క్రుంగి కృశించిపోయాయి. ఈ విషయాన్నే గోపికలు, ఉద్ధవునికి తెలుపుతూ—

**మధుకర యితనీ కహి యహ జాయె।**
**అతి కృశగాత భయో తుమబిన పరమ దుఃఖారీ॥**

''ఓ ఉద్ధవా! నీవు మధురకు వెళ్ళి, కృష్ణునితో మా మాట ఈవిధంగా చెప్పు.

'నీవు లేకపోయేసరికి గోకులములోని గోవులు చిక్కి శల్యాం అయినాయి. వాటి కన్నులనుండి ఎల్ల వేళలా అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. నీ పేరు తలిస్తేనే చాలు, అవి హుూంకరిస్తున్నాయి. నీవు తిరగాడిన ప్రదేశాలలో నీకోసం అవి పిచ్చిగా వెదుకుతున్నాయి. నీవు అక్కడ కనిపించక పోయేసరికి, అవి క్రింద పడి దుఃఖిస్తాయి. నీటినుండి బయటపడి కొట్టుకునే చేపల్లాగా, నీకోసం తపిస్తున్న వాటిని చూస్తుంటే, మా హృదయాలు బాధతో తల్లడిల్లి పోతున్నాయి.' ''

పశువులే ఈ విధంగా కృష్ణవియోగంలో, యింతటి బాధను అనుభవిస్తే, మరి గోపికల సంగతి వేరుగా చెప్పనవసరం లేదేమో! శ్యామసుందరుని వారు తమ సర్వస్వంగా భావించి లోకనిందలను కూడ అనుభవించటానికి వెనుకాడలేదు. మరి అలాటి గోపికలకు కృష్ణుని వదలి జీవించి వుండగలగటం సాధ్యమైన విషయం కాదు కదా! మొదట గోపికలు, మధురనుండి ఉద్ధవుడు వచ్చాడన్న వార్తను విని చాలా సంతోషించారు. కానీ వారి సంతోషాన్ని వమ్ముచేస్తూ ఉద్ధవుడు వారికి వైరాగ్యసన్యాసాలు యివ్వసాగాడు. ఇది వారికి చాలా కష్టం కలిగించింది. అంతేకాదు, ఉద్ధవుడు వారి పాలిట శత్రువుగా కనిపించసాగాడు.

ఊధో హమారీ సౌ తుమ జాహు।
యహ గోకుల పూనో కొ చందా తుమహ్వై ఆయె రాహు॥

''ఉద్ధవా! నీవు బృందావనాన్ని వదలి, ఎంత త్వరగా వెళితే అంతగా సంతోషిస్తాము మేము. పూర్ణచంద్రుని వంటి మా గోకులానికి, నీవు రాహువులా పట్టి పీడిస్తున్నావు. చంద్రుడిని, రాహువు వదులుతాడేమో కాని, నీవు మటుకు మమ్మల్ని వదిలేలా లేవు. ఎంతకాలం మేమిలా ఈ గ్రహణంలో గడపాలో కదా! కృష్ణుడు హాయిగా తనదారిన తాను మధురకు వెళ్ళి, నిన్ను మా మీదకు వదిలాడు. నీ యోగాన్ని ఎక్కడన్నా అమ్ముకొని, బియ్యం కొనుక్కుంటే నాటితో పనికివస్తుంది. నీవు వెళితే గానీ మా హృదయతాపం చల్లారదు.''

గోపికలు యింత నిష్కర్షగా మాట్లాడేసరికి, పాపం ఉద్ధవుడికి ఏం చేయాలో తెలియక మౌనంగా వుండిపోయాడు. ఉద్ధవుని మౌనాన్ని చూసి గోపికలు అతనితో—

ఊధో తుమ వ్రజ కీ దశా బిచారో।
తా పాఛై యహ సిద్ధ ఆపనీ, జోగ కథా బిస్తారో॥

''ఉద్ధవా! మొదట నీవు బృందావనములోని వారి దైన్యపరిస్థితుల గురించి ఆలోచించి ఆపైని వైరాగ్యసన్యాసాల గురించి మాటా

నిత్యం మాధవుని నామం జపించే

నీమనసుతో ఒక్కసారి ఆలోచించు, నిజంగా విరహం యొక్క పరమార్థాన్ని గ్రహించగలిగావా అని. ఎంతసేపు నిన్ను నీవు గొప్ప పండితుడవని, జ్ఞానవేత్తవని భావించటంతోనే సమయం గడిచిపోతున్నది. అంతేకాదు మేము ఈ సంసారసాగర అగాధంలో పడిపోతుంటే, నీవు మమ్మల్ని రక్షించేవాడిలా కబుర్లు చెప్తావు. నీవు బోధించే ఈ నిర్గుణోపాసన మాకెందుకు వ్యర్థమే. కారణం భగవంతుడైన ఆ శ్రీకృష్ణుని మధురమైన చిరునవ్వు, మనోహరమైన ఆ రూపు, మా హృదయాలలో నిండిపోయింది. ఆ సుందరరూపాన్ని మా హృదయాలనుండి ఎలా తుడిచివేయమంటావు? మానవజన్మ ఎత్తినవారు జపం-యోగం అనేవి లేకుండా ముక్తిని పొందటం కష్టసాధ్యమని నీవు అంటావు. కానీ మాకు ఆ మురళీధరుని మురళీరావం ముందు నీవు చెప్పే మాటలు వ్యర్థంగా గోచరిస్తున్నాయి. అంతేకాదు మొదటినుండి మా హృదయాలలో ఆ నీలమేఘశ్యాముని రూపం నిండిపోయింది. మరి యిక నీవు చెప్పే నిర్గుణబ్రహ్మకు మా మనస్సులో స్థానం ఎక్కడ వుందో నీవే చెప్పు? నీవు ఎన్ని బోధలు చేసినా మేము కృష్ణుని ఆరాధించటం మానివేయము.''

గోపికల మాటలకు ఉద్ధవుడు, ఏమీ సమాధానం యివ్వక తలవంచుకొని నిలుచుండిపోయాడు. అంతేకాదు తన అణువణువున నిండిన అహంకారాన్ని వదిలించటానికే కృష్ణుడు, తనను బృందావనానికి పంపాడని తెలుసుకున్నాడు. మహాజ్ఞానవంతులైన గోపికల ముందు తాను, తన జ్ఞానం ఎందుకు పనికిరావని ఆలస్యంగా తెలుసుకున్నందుకు చింతించసాగాడు. తన అజ్ఞానాన్ని మన్నించమంటూ ఉద్ధవుడు వారితో యిలా అన్నాడు—

మై వ్రజవాసిన కీ బలిహారీ ।
జినకే సంగ సదా క్రీడత హై. శ్రీ గోవరధన ధారీ ॥

"గోవర్ధనధారియైన కృష్ణునితోటి ఆటపాటలలో గడిపిన ఈ బృందావనవాసులను నేను నమస్కారం చేస్తున్నాను. కృష్ణుని మధుర నామాన్ని జపించిన బృందావనంలోని పశు పక్షుల- జడ- చేతనాల అదృష్టానికి నేనెంతో మురిసిపోతున్నాను. ఎదురునుండి పుట్టినా, మళ్ళీ అంతటి అదృష్టవంతులు ఈ ముల్లోకాలలో ఎక్కడా వుండరేమో! తన తియ్యటి గానంతో ఈ సృష్టిని వశీభూతురాలిని చేసుకున్న మురళి; నిత్యము కృష్ణుని గాఢ పరిష్వంగములో మునిగి, నల్లనయ్య రూపాన్ని పొందిన యమున; చిన్నికృష్ణుని కోమలమైన పాదస్పర్శతో పునీతమైన, ఈ బృందావన భూమికి నన్ను నేను అర్పించుకొంటున్నాను''

ఉద్ధవుని ఈ మాటలు గోపికలను ఆశ్చర్యానందాలలో ముంచెత్తాయి. అంతేకాదు వృద్ధుడైన ఉద్ధవుని తమ మాటలతో బాధపెట్టినందుకు సిగ్గుపడుతూ, "ఉద్ధవా! మమ్మల్ని క్షమించి, మా పట్ల స్నేహభావాన్ని కలిగివుండు. ఓ స్నేహితుడా! మా యీ వేదనను కృష్ణునికి తెలియచెప్పు.

యితనీ బాత అలీ కహియో హరి సో ।
కబ లగి యహ మన దుఃఖమే గారే ॥

"ఉద్ధవా! మేమెంతో కాలం యిలా విరహాన్ని అనుభవించాలో మాధవుని, మా మాటగా అడుగు కృష్ణునికై ఎదురు చూసి - చూసి మా దేహాలు కాంతి విహీనమైనాయి. 'ప్రియా- ప్రియా' అని విలపించే మమ్ములను నిద్రాదేవి కరుణించటం లేదు. కృష్ణుడు మమ్మల్ని వీడి వెళ్ళిననాటి నుండి, దుఃఖం మా నుండి దూరం కానంటుంది. కృష్ణ దర్శనముతో కానీ మా

వేదన తగ్గదని, ఒక్కసారి మాధవుని బృందావనానికి రమ్మని తెలుపు.''

గోపికల మాటలు వింటుంటే ఉద్ధవుని కన్నులు అశ్రుపూరితాలైనాయి. ఎవరి మధురమైన మందహాసము, హృదయంలో మాధుర్యము కలిగించిందో; ఎవని మనోహరమగు రూపకాంతి ఉన్మత్తులను కావించి నేలపై పడి పొర్లింప చేసిందో; ఎవని మధురాధరమున ధరించిన మురళీగానరవమునకు వ్రజబాలలు వివశులై గృహకార్యములను సైతం వదలి పరుగున వచ్చారో, అట్టి మోహన మాధుర్యముకై తపిస్తున్న గోపికలను చూసి ఉద్ధవుడు, తన జన్మ సార్థకమైనదని సంతసించాడు. అంతే కాదు, ప్రేమ-భక్తి అనేవి లేకుండా మానవుడు భగవంతుని చేరడం కష్టమన్న సత్యాన్ని తెలుసుకోగలిగాడు ఉద్ధవుడు. అందుకనే తాను కూడ సగుణభక్తిని తన స్వంతం చేసుకొని మధురకు మరలి వెళ్లాడు.

[పై సంచికలో కృష్ణ - ఉద్ధవ సంవాదం]

వివేక విద్యుత్తరంగాలు-9

## నైతికత: దాని కేవల ప్రమాణము

సవివరంగా పరిశీలిస్తే, విషయం మరీ అంత సరళం అనిపించదు. ఉదాహరణకు నేను యింతకుముందే చెప్పినట్లు పరిసరాల వాతావరణం తరచు వివరాలను ప్రభావితం చేస్తుంది. ఒకే చర్య ఒకరకమైన పరిస్థితులలో నిస్వార్థపరము మరొకరకమైన పరిస్థితులలో పూర్తిగా స్వార్థపూరితమూ కావచ్చు. అందుచేత మనం నైతికతకు ఒక సాధారణ నిర్వచనం యిచ్చి దేశకాల పరిస్థితులనుబట్టి వివరాలు రూపొందించుకొనేందుకు అవకాశం విడుస్తాము. ఒక విధమైన ప్రవర్తన నైతికము; మరొక దేశంలో అదే ప్రవర్తన అనైతికము. ఎందుచేతనంటే పరిస్థితులు మారుతాయి. సర్వప్రకృతికి లక్ష్యము స్వేచ్ఛ; సంపూర్ణ స్వార్థరాహిత్యం ద్వారానే విముక్తిసాధ్యము. స్వార్థరహితమైన ప్రతి తలపు, పలుకు, పని మనలను లక్ష్యం వైపుకు కొనిపోతుంది, అందుచేతనే అది నైతికము.

ఆ నిర్వచనము ప్రతి మతంలోనూ, ప్రతి నైతిక సంప్రదాయంలోనూ ఆమోదయోగ్యమే. కొన్ని యోచనా విధానాలలో భగవంతుడు-అనే ఉత్కృష్ట వ్యక్తినుండి నైతికతను గ్రహిస్తారు. మనిషి ఈ పనిమాత్రమే ఎందుకు చేయాలి, మరొకటి ఎందుకు చేయకూడదు అని మీరు అడగవచ్చును. అందుకు 'అది భగవదాజ్ఞ కాబట్టి' అనేది వారి సమాధానం. ఏ స్రోతస్సునుండి గ్రహించినప్పటికీ వారి నైతిక నియమావళికి కూడా స్వార్థత్యాగమే కేంద్రభావన. ఇంత ఉన్నతమైన నైతికాశయం ఉన్నప్పటికీ కొందరు వ్యక్తులు తమ స్వల్ప వ్యక్తిత్వాలను విడనాడాలనేటప్పటికి భయపడుతారు. సంపూర్ణమైన నిస్వార్థతను సాధించి, తనకోసం ఆలోచనలేని, తనకోసం పనిచేయని, తనకోసం మాటాడని వ్యక్తిని గూర్చి ఆలోచించమని స్వల్పవ్యక్తిత్వ భావనను అంటిపెట్టుకొని ఉండే వ్యక్తిని కోరండి. అతని 'తాను' ఎక్కడ ఉన్నది? అతడు తనకోసం యోచిస్తూ, పని చేస్తూ, మాటాడుతూ ఉన్నంతకాలం ఆ 'తాను' అనే భావన మెదులుతుంటుంది. అతనికి పరచింతన, విశ్వజనీనమైన చైతన్యము, సార్వత్రికదృష్టి మాత్రమే కలిగినప్పుడు ఈ 'తాను' ఏమైనట్లు? అది శాశ్వతంగా దూరమైంది.

(పై సంచికలో 'నైతికత, నీతిశాస్త్రాల ప్రయోజనము.

# ఆస్తిత్వవాదం

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

మునుపు రామకృష్ణప్రభ రాగానే 10 లేక 15 నిముషాలలో చూడడం (అంటే చదవటం అన్నమాట) పూర్తిచేసేవాడు. ఇటీవల శ్రీ వెంకటేశ్వరరెడ్డిగారి మనస్తత్వ వ్యాసాల ప్రచురణ వలన దాదాపు గంటసేపు చదువుచున్నారు. ఇది నేను స్వయంగా గమనించిన విషయం'' అని నెల్లూరునుండి ఒక పత్రికాభిమాని 27-4-82 వ తేదీన లేఖ వ్రాశారు. శ్రీ వెంకటేశ్వరరెడ్డి రచనా వైశిష్ట్యం పాఠకులు గుర్తించారన్నమాట. చాల సంతోషం. ఈ సంచికలో రెడ్డిగారి మరొక పెద్ద వ్యాసాన్ని పాఠకుల ముందుంచుచున్నాము. కాబట్టి ఒకగంట కాదు కనీసం రెండు గంటలు పట్టుతుంది ఈ నెల సంచిక చదవడానికని ఆశిస్తున్నాము.

''అసలు నన్ను కనమని మిమ్మల్ని ఎవరు ఏడ్చారు? మీ ఇంటిలో పుట్టడమే నా కిష్టం లేదు. నా ప్రమేయం ఏమీ లేకుండానే మీకు పుట్టాను'' అన్నది పందొమ్మిది సంవత్సరాల యువతి తన తలిదండ్రులు తన ప్రణయ కలాపానికి అడ్డుపడుతున్నారన్న కోపంతో.

''అవును. నిన్ను కనాలని మేము కనలేదు. మా ఇష్టంతో పని లేకుండానే నీవు మాకు పుట్టావు'' అన్నాడు కోపోద్రిక్తుడైన ఆ యువతి తండ్రి.

ఇద్దరి వాదనలలోను ఎంతో సత్యం ఉంది. అయితే ఈ సత్యంతో అస్తిత్వ సత్యానికి ఏమీ సంబంధం లేదు. ''ఆవిడ అవునన్నా, కాదన్నా, కావాలనుకొన్నా, అక్కరలేదనుకొన్నా ఆమె ఈ ప్రపంచంలోకి విసిరివేయబడింది. ఆమెకు ఆమె బాధ్యత వహించవలసిందే. ఆమె 'అలా' ఉండడానికి సమాధానం ఆమె చెప్పుకోవలసిందే. తాను ఎటువంటి వ్యక్తిగ రూపొందనున్నదో, ఎటువంటి అర్థవంతమైన జీవితాన్ని నెరపనున్నదో అటువంటి మనిషిగ అటువంటి జీవితాన్ని రూపొందించుకోవడంలో, మలచుకోవడంలో, దిద్దుకోవడంలో పూర్తి బాధ్యత ఆమెదే. ఆమెకు పూర్తిస్వేచ్ఛ ఉంది'' అంటాడు అస్తిత్వవాది.

## అస్తిత్వవాద నేపథ్యం :

అస్తిత్వవాదం అనే పదాన్ని ఆంగ్లంలోని ఎగ్జిస్టెన్షియలిజమ్ (existentilism) అనే పదానికి సమానార్థకంలో వాడతాము. దీనిని 'సత్తా'వాదమని గూడ అంటారు. అసలు ఆంగ్లంలోగూడ ఎగ్జిస్టెన్షియలిజమ్ అనే పదాన్ని నవ్యకాంటేయవాది (Neo-kantian) అయిన యఫ్ హైనెమన్ అనే ఆయన 1929 లో ప్రవేశపెట్టాడు. ఈ పదానికి మనం అస్తిత్వం, సత్త, ఉండడం, భవం లాంటి శబ్దాలను సమానార్థకాలుగ ఉపయోగిస్తాము.

ప్రపంచంలో ఏ సిద్ధాంతమూ ఎప్పుడూ ఏ ఆకాశం నుంచో శూన్యంనుంచో ఊడిపడదు. గెలీలియో లేక న్యూటన్ లేడు. న్యూటన్ లేక ఐన్‌స్టయిన్ లేడు. ఏ కాలంలో అయినా ఒక సిద్ధాంతం ఆవిర్భవించిందంటే, ఆనాటి 'బౌద్ధికవాతావరణం' (Climate of opinion) దానికి దోహదం చేసేదిగా ఉండితీరుతుంది. అలాగే అస్తిత్వవాదం రావడానికి కొన్ని 'పండిన పరిస్థితులు' దోహదం చేశాయి. ఆ పరిస్థితులు ఏమిటి? దేనిని ఖండనమండనాలు గావించడానికి ఈ అస్తిత్వ సిద్ధాంతం అవతరించింది?

అస్తిత్వవాదం పూర్తిగ పాశ్చాత్యం. ఇది సోక్రటీజ్‌ల ప్లేటోల కాలంనుంచి ఉన్నాగాని, ఒక ప్రత్యేక ఆధునిక సిద్ధాంతంగా రూపొందింది. ప్రాముఖ్యం పొందింది ఈ శతాబ్ది మొదట్లో. అయితే కీర్కెగార్డ్, నీచే, దాస్టవిస్కీలాంటి కొందరు 'ఏకాంతప్రవక్తలు' (lonely prophets) పందొమ్మిదవ శతాబ్దిలోనే మానవుని దురవస్థను గురించి (Human Predicament) ఆక్రోశించకపోలేదు. మనిషి సుఖప్రదమైన జీవితాన్ని గడపవలసిన ఈ ప్రపంచంలో పరాయి ఇంటిలో ఉంటున్నట్లు ఉంటున్నాడన్న విషయాన్ని వీరు ఎలుగెత్తి చాటారు.

అస్తిత్వవాదులు సనాతన పాశ్చాత్య సంప్రదాయ సిద్ధాంతాలైన ప్రకృతివాదం (Naturalism), భావవాదం (Idealisam), హేతువాదం (Rationalism) మొదలైనవి వ్యక్తిని మింగివేయడంతో, అనన్య, అద్వితీయ

వ్యక్తికి (ప్రతివాడు అనన్యుడే, అద్వితీయుడే. ఎందుకంటె ఒకరిపోలిన వాడు మరొకడు ఉండడు) స్థానం కల్పించక పోవడంతో – అంటే అతని అనన్యతను, అద్వితీయతను అవిలుప్తం చేయడంతో, 'సామాజిక ప్రగతి అనివార్యం' (Social progress is inevitable) అని ఇంతకుముందు ఎంతగానో నమ్మిన భావన భ్రమ అని తేలిపోవడంతో, ఎదురు తిరిగారు. అంటె ప్రకృతివాద భావవాదులకు ప్రతిచర్యగ అస్తిత్వవాదం వెలిసింది. ప్రకృతివాద, భావవాదులు వ్యక్తి 'అనన్యతను' ఏవిధంగా లుప్తం చేసిందీ తెలుసుకొంటేనేగాని అస్తిత్వవాదం ప్రాముఖ్యం అర్థం కాదు.

ప్రకృతివాదం ప్రకారం ఈ భౌతికప్రపంచం సత్యము. ఈ ప్రపంచం కార్యకారణ నియమాలలాంటి యాంత్రిక సూత్రాలతో నడుస్తుంది. ఈ ప్రపంచంలోని ప్రతి సంఘటనను ఏదో ఒక సాధారణ నియమానికి లేదా సామాన్య సూత్రానికి ఉదాహరణగ చూపిస్తే ప్రపంచాన్ని అర్థం చేసుకొన్నట్లే పదార్థం. ప్రాణం, మనస్సుల మధ్య తేడా ఉన్నమాట నిజమే. కాని, ఈ తేడాలన్నీ పదార్థజనితాలు. ఈ విశ్వం అంతా ఒక యంత్రం; మనిషి అందులో ఒక భాగం; అందువల్ల అతని చలనాలన్నీ పూర్వనిర్దేశితాలు. అందువల్ల అతడు స్వేచ్ఛ అని భావించేది నిజమైన స్వేచ్ఛ కాదు. ఒట్టి భ్రాంతిజన్య స్వేచ్ఛ మాత్రమే. మనిషి ఒగ్గుతాగేది. శాశ్వతంగా నిదురించేది విశాలమైన ఈ భౌతిక ప్రపంచం – ప్రకృతిమాత – ఒడిలోనే. అటువంటి బృహత్తర భౌతిక సత్యం ముందు వ్యక్తిమూర్తిమత్వం (Personality) ఏపాటి?

తరువాత ప్రకృతివాదం 'లోకజ్ఞానం' (Common-sense) గ మారిపోయింది దాదాపుగ ఇది భౌతికప్రగతి (Material progress) తో జతపరచబడింది. శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాభివృద్ధితో బాహ్యజీవితం సుకరమై, అంతరంగజీవితంలో శూన్యం, తపన, వినగటలు విపరీతమయ్యాయి. ఫలితంగా వ్యక్తి ఈ అసంఖ్యాక వస్తుసంచయంలో 'ఒక వస్తువు' అయ్యాడు. అతనికి స్వేచ్ఛ లేదు. సూత్రం ప్రకారం ఈ ప్రపంచంలో ప్రతిదీ తెలియబడగినది (Knowable).

భావవాదం ఈ ప్రపంచానికి మూలం భావం లేదా చైతన్యం అంటుంది భావమే (చైతన్యమే) యథార్థం. ఈ ప్రపంచం భావానికి ఆభాస. ఈ భావం చైతన్యం వాస్తవికం (Factual) కాకపోయినా, వైయక్తికం (Individual) కాకపోయినా, మనిషిలో అది అభివ్యక్తమవుతుంది మనిషి ఈ విధంగా సత్యంలో కేంద్రస్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. నిజమే. మరి వ్యక్తికిమానవుడు (Individual man) అతని స్వేచ్ఛ మాట ఏమిటి? అతడు కేవలం చైతన్యం. హేతువుల అభివ్యక్తికి రంగస్థలం మాత్రమే అతిదౌక శరీరం మాత్రమే. అతనికి నిజమైన స్వేచ్ఛ లేదు ఆదర్శం యొక్క ఆవశ్యకతను (Necessity of the ideal) గుర్తించడమే స్వేచ్ఛ అయితే నిజమైన స్వేచ్ఛ ఎక్కడ? భావవాదంలో చేతనం (Consciousness) ప్రపంచానికి మూలం గనుక, సూత్రం ప్రకారం ప్రతిదీ 'తెలియబడగలిగినదై' (Knowable) ఉంటుంది.

ఈ విధంగా ప్రకృతి భావవాదాలు రెండూ వ్యక్తిని విస్మరించాయి స్వేచ్ఛకు, మార్మికత (Mysticism) కు చోటు లేకుండ చేశాయి. పైగా భావవాదం మనిషిని ఆదర్శంతో ఐక్యం చేసి, ఆదర్శాలకు (భావాలకు) చావు లేదు గనుక, మనిషికి మరణం లేదనే భ్రాంతిని కలుగజేసింది. కాని మనం మృత్యువును తప్పించుకోలేని దుర్విధిగా గుర్తిస్తాము. ఈ విధంగా మానవ అస్తిత్వాన్ని 'ఆభాసం' చేసిన ప్రకృతి భావ వాదాలకు వ్యతిరేకంగా అస్తిత్వవాదం విప్లవ శంఖాన్ని ఊదింది.

ఇకపోతే, హేతువాదాన్ని తీసుకుంటే, మానవ ప్రవర్తనలోని ప్రతి అంశాన్ని హేతువు ద్వారా వివరించలేము. ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతున్న ఒకడు ఆకస్మికంగా జేబులో ఉన్న పిస్తలును తీసి రెండవవానిని కాలుస్తాడు. ఆ క్షణం వరకు అతని మనస్సులో అటువంటి ఆలోచనే లేదు. మరి ఆ క్షణంలో అతడు ఆ పని ఎందుకు చేసినట్లు? హేతువు వివరించలేదు. అంటే మానవ జీవితం తర్కానికి అందదు. తర్కంలో సూత్రాలలో ఇమడదు. తర్కంలో అలా ఇమడని అంశాలు మానవునిలో ఏమి ఉన్నాయి? (1) వ్యక్తికి వ్యక్తికి తేడాలుంటాయి. వీటిని విశేషాలంటారు. (2) అలాగే జీవితంలో కొన్ని సంఘటనలు జరగవచ్చుననుకొంటాము. కాని అవి నిశ్చితంగా జరుగతాయని చెప్పలేము. వీటిని సందిగ్ధాలు (స్వాద్విషయాలు) (Contingent) అంటాము. (3) అలాగే అధిభౌతిక (Metaphysical) విషయాలుంటాయి. ఈ మూడు అంశాలను గురించి హేతువు ఏమీ చెప్పలేదు గనుక, అది మూర్తిని (Person) లేదా అనన్య మానవుని గురించి, అతని స్వేచ్ఛను గురించి, అతని అంతరంగ చోదనలు, విధుల గురించి ఏమీ చెప్పలేదు. కనుక ఈ ప్రపంచంలో ఎంతో అహేతుకత (Irrational) ఉంది. ఈ అహేతుకత 'ఇప్పుడు-ఇక్కడ' (Here and now) – అంటే

కాలదేశాలలో, పదర్థంలో ఆచ్ఛాదితమై ఉంటుంది. ఆది యథాతథ యథార్థ అనుభవిత అస్తిత్వం (Actual empirical existance). ఆ అనుభవమే (అర్థం చేసుకొన్న రీతిలో కాక అనుభవించిన రీతిలో) సత్యమంటుంది అస్తిత్వవాదం.

హేతువాదం, మనిషితో సహా, సత్యాన్ని 'వస్తువు'గ (Object) - అంటే 'సారం' (Substance)గ పరిగణిస్తుంది. ఈ సత్యం వ్యక్తికి వెలుపల ఉంది. అస్తిత్వవాదం ఏమంటుందంటే: నిజమైన తత్త్వశాస్త్రం ఆత్మ-వస్తు లేక కర్త - కర్మ (Subject-Object) సంయోగంలో నుంచి ప్రారంభం కావాలి. ఈ కర్త - కర్మల సంయోగం అస్తిత్వంలో ఉంది; అంటే ఒక అహేతుక సత్యం (Irrational reality)లో ఉంది.

ఇక 'ప్రగతి అనివార్యం' అనే నినాదాన్ని తీసుకుంటే, రెండు ప్రపంచ మహాసంగ్రామాలకు ముందు, ప్రపంచం పురోగమిస్తుందని ప్రగతి అనివార్యమని, దీనినెవరు ఆపలేరని ప్రతిఒక్కరూ విశ్వసించారు. ఈ ప్రపంచం 'అర్థవంత' మని, సుస్పష్టమైన విలువలతో, ఆదర్శాలతో నడుస్తుందని భావించారు. రెండు యుద్ధాలు ఇదంతా వట్టి భ్రమ అని ఋజువు చేశాయి. 'మరుభూమి అనుభూతి' (Waste land feeling) ప్రపంచాన్ని ఆవహించింది. ఈ భ్రమ విచ్చిపోవడం, మరుభూమి అనుభూతి కలగడం - ఈ రెండింటితో అస్తిత్వవాదం మోసుకెత్తింది. వ్యక్తి తనలో తాను నూతనార్థాన్ని వెదకోవాలి. సామాజిక ఆదర్శాలను వేడుకొంటే, వాటికి మొక్కితే ఐంద్రజాలిక పరిష్కారాలు లభించవు.

ఇంతకుముందు చెప్పిన వాదాలకే కాక, అస్తిత్వవాదం అన్నిరకాల దర్శనాలకు, విశ్వాసాలకు వ్యతిరేకము. ఇది గ్రీకుహేతువాదాన్ని, ప్లేటో, హెగెల్‌ల భావవాదాలను నిరాకరించింది. ఎందుకంటే ప్లేటో హెగెల్‌ల దర్శనాలలో, వ్యక్తి అతీంద్రియప్రపంచంలో, భావప్రపంచంలో, అమూర్త సార్వత్రిక సూత్రాల (Universals) లో లుప్తమై పోతున్నాడు. 'ఏరకమైన సంప్రదాయ దర్శనాలకు చెందకపోవడం, ఏవిశ్వాసాలు జీవితాన్ని వివరించడానికి సరిపోవని భావించడం, ముఖ్యంగా సనాతన తత్త్వం పైపై విషయాలను తప్ప అసలు లోతులను తడమక ఒట్టి పుస్తకాలకే పరిమితం కాని జీవితానికి అనుప్రయుక్తం కాదని చెప్పడం' ఇది అస్తిత్వవాద హృదయం అన్నాడు 'కిఫ్‌మన్ ఎగ్జిస్టెన్షియలిజమ్ ఫ్రమ్ దాస్టవిస్కీ టు సార్త్రే' (Existentialism from Dostovsky to Sartre) అనే గ్రంథంలో.

అంతేకాదు. ఇది ఆధునిక యాంత్రిక సాంకేతిక యుగ మానవుని అవ్యక్తిక (Impersonal) స్వభావాన్ని, ఈనాటి మూకుమ్మడి ఉద్యమాలను (Mass Movements) శాస్త్రీయ విజ్ఞానాన్ని, సాకారాత్మక జ్ఞానాన్ని (Positivism) తీవ్రంగా అధిక్షేపించింది. ఎందుకంటే అస్తిత్వవాదుల దృష్టిలో, పారిశ్రామిక సమాజం వ్యక్తిని యంత్రానికి బానిసగా చేస్తుంది. అందుకని వ్యక్తి పరికరంగా మారే ప్రమాదం ఉంది. శాస్త్రీయ జ్ఞానం సాకారాత్మకజ్ఞానం, మనిషి బాహ్య విషయాలను మాత్రమే స్పృశించి, అతని భౌతిక ప్రక్రియలలో అంతర్భాగం చేస్తాయి. నియంతృత్వ వ్యవస్థలు - అవి కమ్యూనిజం (నాజీ) అయినా, ఫాసిజం కోవకు చెందినవైనా - వ్యక్తిని మానవరాశి (Mass Society)లో పూడ్చిపెడతాయి.

## అస్తిత్వవాద సిద్ధాంతం :

ఈ విధంగా సనాతన సిద్ధాంతాలకు ఆచార వ్యవహారాలకు ఆలోచనా విధానాలకు వ్యతిరేకంగా, ప్రతిచర్యగా, ఆవిర్భవించిన ఈ అస్తిత్వవాదం ఏమిటి? ఈ అస్తిత్వవాదం అనే టోపీని ఎంతో మంది తమ తలలకు తగిలించుకొన్నారు. అందుకని దాని ఆకృతి చెదిరిపోయి, మారిపోయి దానికి ఒక నిర్దుష్ట, నిర్దిష్ట రూపం అంటూ లేకుండా పోయింది. దానికి అర్థం ఎవరికి తోచినట్లు వారు చెప్పారు. అందుకే సార్త్రే అంటాడు: "'అస్తిత్వవాది' అనే పదానికి ఏ అర్థాన్ని చెప్పడానికి వీలు లేనంత విశృంఖలంగా ఎన్నో విషయాలకు అన్వయిస్తున్నారు."

అస్తిత్వవాదం మానవ అస్తిత్వానికి సంబంధించిన ఒక వైఖరి, ఒక దృక్పథము. మానవ అస్తిత్వం అంటే మనిషి అమూర్తస్వభావం కాక వ్యక్తిగ మనిషికి ఉన్న విశేషగుణాలు, లక్షణాలు. అస్తిత్వవాదం 'మానవ దురవస్థ'ను (Human predicament) వర్ణించి వివరించే దర్శనము. 'మానవుడు తన అస్తిత్వాన్ని, దాని సంఘర్షణలను, వాటి మూలాన్ని, వాటి అధిగమనాశంసలను అభివర్ణించే ప్రయత్నమే అస్తిత్వవాదం' అని పాల్‌టిలిచ్ 'ఎగ్జిస్టెన్షియలిస్ట్ ఇన్ మాడరన్ ఆర్ట్' అనే గ్రంథంలో చెప్పాడు.

అస్తిత్వవాదం ఒక వ్యవస్థీకృతమైన సిద్ధాంతం కాదు. దీనిని ప్రతిపాదించినవారు ఎందరో కావడంతో, వారి మధ్య సైద్ధాంతిక భేదాలుండడంతో, దీనిని సువ్యవస్థితమైన దర్శనం అనలేము. ఒక విధంగా చెప్పాలంటే ఎంత మంది అస్తిత్వవాదులున్నారో అన్ని అస్తిత్వసిద్ధాంతాలున్నాయనవచ్చు. అయినా వారందరూ దాదాపుగ ఏకీభవించిన కొన్ని

మౌలికాంశాలున్నాయి. వాటిని మనం అస్తిత్వవాదంగా పరిగణించవచ్చు.

సర్వజీవరాసులలో తన 'ఉనికే' తనకు సమస్య అయింది ఒక్క మానవుని విషయంలోనే. అతడు బాధ తోను విముక్తినా దృక్పథంతోను తన అస్తిత్వాన్ని (Existance) నాస్తిత్వాన్ని (Non-existance) (మరణాన్ని) గుర్తించాడు. అతడు అనువంశిక - పరిసరాల ఫలితం కాదు. ప్రతివ్యక్తి తన జీవితగమనాన్ని తానే నిర్దేశించుకొంటాడు. సృజనాత్మకంగా తన జీవితాన్ని తానే మలచుకొంటాడు. తనేమిటో తను మలచుకొన్నదాని ఫలితము విస్తృతార్థంలో తన జీవితం తన సృష్టే - ఈ సమస్యలకు సంబంధించిందే అస్తిత్వవాదం క్లుప్తంగా.

అస్తిత్వవాదులంతా ఏకీభవించిన ఒక విషయం. 'అస్తిత్వం' 'సారం' కంటె ప్రాథమికము. (Existance preceeds essence). దీనిని అర్థం చేసుకోవడానికి ముందుగ మనం 'అస్తిత్వం', 'సారం' అనే పదాలకు అర్థం తెలుసుకోవాలి. ఒక వస్తువును మనం దేనిని బట్టి ఆ వస్తువుగ గుర్తిస్తామో అది 'సారం'. ఉదాహరణకు మనం కుర్చీని దేనిబట్టి కుర్చీ అని చెప్పగలుగుతున్నాము? కుర్చీ లక్షణాలనుబట్టి అంటే 'కుర్చీ' అనే పేరుతో పిలవబడే అన్ని వస్తువుల మధ్య ఏ సదృశ(సామాన్య)లక్షణాలున్నాయో ఆ లక్షణాలను బట్టి దానిని కుర్చీ అంటున్నాము. ప్రతి కుర్చీకి నాలుగు కాళ్లు ఉండడం, కూర్చొనే సీటు ఉండడం, ఆనుకోవడానికి వీపు ఉండడం సామాన్య లక్షణాలు. ఇవి ఉన్నది కుర్చీ. లేనిది కుర్చీ కాదు. అంటే ఈ లక్షణాలు కుర్చీ 'సారం' అన్నమాట. ఈ 'సారం' వల్ల కుర్చీని ఇతర వస్తువులనుంచి వేరుగ గుర్తించడానికి వీలవుతున్నది. ఇదే చర్చను మనిషికి అన్వయిస్తే మానవ లక్షణాలు మనిషి 'సారం' అని ఆ లక్షణాలున్నవాడు మనిషి అని తెలుస్తుంది.

ఇక్కడ మరొక సమస్య ఉత్పన్నమవుతున్నది. మానవలక్షణాలున్నవానిని మనిషి అంటున్నాము. కాని, 'మనిషి' అనేవాడు ఎక్కడ లేడు. అంటే మనిషికి అస్తిత్వం లేదు. మరి ప్రపంచంలో ఉన్నవారంతా ఎవరు? వారంతా సుబ్బయ్య, రామయ్య, పుల్లయ్య, ఎల్లయ్యల లాంటి వ్యక్తులు. మరి వీరిని దాటి, వీరికంటె భిన్నంగా, వేరుగా 'మనిషి' అనేవాడు ఎక్కడ ఉన్నాడు? పుల్లయ్య తెల్లగా ఉంటే ఎల్లయ్య ఎర్రగా ఉన్నాడు. రామయ్య ఆరడుగుల ఆజానుబాహువు అయితే, సుబ్బయ్య ఐదడుగుల పొట్టివాడు. ఒకడు జుత్తు నెరసినవాడైతే మరొకడు సుడులు తిరిగిన కురులవాడు. మరి మనం 'మనిషి' అన్నప్పుడు అతని లక్షణాల (సారం)లో ఎత్తు లద్దు పొడుపు లావులాంటి లక్షణాలు లేవు. ఎందుకంటే? ఎత్తు, రంగు, లావులు విశేషలక్షణాలు. సారం సామాన్యలక్షణాల క్రోడీకరణము. అందుకని ఎల్లయ్యలాంటి ప్రత్యేకవ్యక్తులు వేరు. మనిషి వేరు. 'మనిషికి 'ఉనికి' లేదు. అతడు ఎక్కడ ఉండడు. రామయ్య పుల్లయ్యలాంటివారిలో 'సారం'గా మాత్రమే ఉంటాడు. వ్యక్తి మాత్రమే ఉంటాడు. 'వ్యక్తి'కి చరిత్ర ఉంటుంది. అంటే గాంధీకి తలిదండ్రులున్నారు. ఒక ఊరిలో (దేశంలో), ఒక సమయం (కాలం)లో పుట్టాడు. అంటే గాంధీకి కాలదేశాలు (Time and space) ఉన్నాయి. కాబట్టి గాంధీకి 'అస్తిత్వం' ఉంది. మరి మనిషికి చరిత్ర లేదు. ఒక ఊరు లేదు. పేరు లేదు తలిదండ్రులు లేరు. అందుకని అతనికి ఉనికే లేదు 'అస్తిత్వం' లేదు. కాని 'సారం' ఉంది. ఒక ఉదాహరణ. ఒక తరగతిలో నలుగురు విద్యార్థులున్నారు. వారికి 7, 10, 11, 28 మార్కులు వచ్చాయి. వారి సగటు మార్కు 14. చూడండి ఆ తరగతిలో 14 మార్కులు వచ్చిన విద్యార్థే లేడు. అలాగే మనిషీ లేడు. మనిషి వ్యక్తుల సగటు.

ఈ విధంగా మనం ఒక వస్తువు 'సారాన్ని' దాని 'అస్తిత్వం' నుంచి వేరు చేసి చూపుతున్నాము. ఒక వస్తువు ఏమిటో అది దానిసారమైతే, అది కాలదేశాలలో ఉండడం దాని 'అస్తిత్వం'.

ప్లేటోలాంటి తత్త్వవేత్తలకు భావన (సారం=Concept) యథార్థము. వ్యక్తులు (రామయ్య, సుబ్బయ్యలు) అసత్యము. సుబ్బయ్య, రామయ్యలు మృత్యువు వాత బడుతారుగాని, మనిషి(భావన)కి మరణం లేదు. వ్యక్తి యథాతథంగా (అలా) ఉండడానికి కారణం 'మనుష్యత్వం' (మానవసారం) అని ఆయన చెప్పాడు (ప్లేటో ఆదర్శరాజ్యం చూడు).

ఈ విధమైన ప్లేటో దృక్పథాన్ని త్రోసిరాజని, అస్తిత్వవాది, "భావాల (ఆలోచనా) రూపంలోకి అనువదించ వీలు లేని విషయం ఒకటి ఉంది; అది వ్యక్తిక అస్తిత్వచర్య (Personal act of existing)", అంటాడు. అంటే వ్యక్తుల విశేషగుణాలు (ఎత్తు, రంగులాంటివి) భావన (Concept=సారం)లోకి రావు. వ్యక్తిక అస్తిత్వాన్ని యథార్థంగా తెలుసుకోవాలంటే దానిని అనుభవించవలసిందే. దానిని జీవించవలసిందే. ఈ అను
లోకి మార్చడానికి వీలు లేదు. వాక్యాలలో చెప్పలేము. భాష (ఆలోచన భావాలు) ఎప్పుడూ సామాన్యాలతో

(సారంతో) కూడి ఉంటుంది కనుక, అనుభవాన్ని భాషలోకి మారిస్తే, ఆ అనుభవానికి ఉన్న ప్రత్యేకతల్లో విశేషాలు (ఇప్పుడు-ఇక్కడని అంటే కాలదేశాలు) అదృశ్యమైపోయి ఒట్టి సామాన్యానుభవంగా మారుతుంది. అందుకని అస్తిత్వవాది కాలదేశాలకతీతమైన, అనుభవాతీతమైన 'సారం'కంటె అస్తిత్వానికి ప్రాధాన్యాన్ని ఇస్తాడు. అందుకే "'అస్తిత్వం' 'సారం' కంటె పూర్వం" అనేది అస్తిత్వవాదులకు మౌలికాంశమైంది.

'సారం' కంటె అస్తిత్వం ముందు అనే విషయాన్ని మరొకవైపునుంచి చెప్పవచ్చు. అయితే తాత్త్వికంగా ఇది ఇంతకుముందు చెప్పినదానికంటె భిన్నం కాదు. దీనిని ఒక ఉదాహరణతో ప్రారంభిద్దాము. ఒక కుర్చీ ఉంది. ఈ కుర్చీకి ఒక ఉపయోగం ఉంది. దీనికి ఒక నిర్మాణపద్ధతి ఉంది. లక్షణాలున్నాయి. దీనిని తయారు చేసిన కర్త (వడ్రంగి) ఉన్నాడు. కుర్చీని తయారు చేయకముందు, కుర్చీసారం (దాని నిర్మాణపద్ధతి, ఉపయోగం, లక్షణాలు) వడ్రంగి బుర్రలో ఉంది. కనుక కుర్చీ 'సారం' దాని 'అస్తిత్వం' కంటె ముందే ఉన్నది.

దేవుడు ఈ ప్రపంచాన్ని, మనుష్యులను సృష్టించాడని అనుకుంటూ ఉంటాము. వడ్రంగి బుర్రలో కుర్చీసారం ఎలా ఉందో, దేవుని బుర్రలోగూడ మనిషి పుట్టకముందు మనిషి 'సారం' ఉండి ఉండాలి. అంటే దేవుని మదిలో 'మనిషి స్వభావం' (Human nature) ముందుగా ఉన్నది. అయితే పద్దెనిమిదవ శతాబ్ది నాస్తికవాదం దేవుణ్ణి అణచివేసింది. కాని 'మనిషిస్వభావం (సారం) మనిషి అస్తిత్వంకంటె ముందు' అనే భావాన్ని దేవునితోపాటు పెకలించి వేయలేకపోయింది. కాంట్‌తో సహా అనేకమంది మనిషికంటె ముందు మనిషి స్వభావం ఉందని ఆ మనిషి స్వభావాన్ని (Concept of man) ప్రతిఒక్కడూ పుణికిపుచ్చుకొంటాడని చెప్పారు. అందుకని ప్రతివ్యక్తి మనిషి భావనకు ఉదాహరణ (ప్రతీక) అవుతున్నాడు. అందుకనే అటవికుడైనా, నాగరకుడైనా, బూర్జువా అయినా అందరూ మనుష్యులే దేవుడు లేకపోయినాగాని ఇక్కడ కూడ సారమే అస్తిత్వంకంటె ముందు.

ఇప్పుడు దేవుడు లేడనుకొంటే ఏమి జరుగుతుంది? మనిషి తయారు కాకముందు మనుష్యస్వభావం ఉండడానికి వీలు లేదు. మనిషిని అతని స్వభావంతో నిర్వచించడానికి ముందే అతనికి 'అస్తిత్వం' ఉన్నదన్నమాట. మనిషి సారంకంటె మనిషి అస్తిత్వం ముందు అనడంలో అర్థం ఏమిటి? మనిషి ముందర ఉన్నాడు. ఉన్నతరవాత తనను తాను అభిగమిస్తాడు; ఈ ప్రపంచంలో ఉద్గమిస్తాడు; ముందు తెరపై కనిపిస్తాడు. ఆ తరవాత తనను నిర్వచించుకొంటాడు; తనకు తాను అర్థం చెప్పుకొంటాడు. అప్పుడతనికి 'అర్థం' ఏర్పడుతుంది. అంతకుముందు అతనికి అర్థం లేదు.

మొదట్లో అతడు ఏమీ కాడు అందుకనే అతనిని నిర్వచించలేము. ఆ తరవాతగాని అతడు ఏమైన గాడు. అతడు తనను తాను ఏమి చేసుకొంటే అదే అవుతాడు. తనను తాను చేసుకొన్నదానికంటె మనిషి ఇతరంగా ఏమీ కాడు ఈ విధంగా, దేవుడు లేడు గనుక, మానవ స్వభావాన్ని ముందుగా ఊహించేవారు ఎవరూ లేరు కనుక, మనిషి ముందు ఉంటాడు. ఆ తరవాతనే మానవస్వభావాన్ని సృష్టించుకొంటాడు మానవుడు ఉన్నాడు - ఈ ప్రపంచంలోకి ఉద్గమించాడు - దూకాడు - అంతే. ఆ తరవాత అతడు తానూహించినట్లెల్ల తయారయ్యాడని అర్థం కాదు. ఊహించడమంటే మనస్సులో ఏదో భావిలక్ష్యాన్ని ఉంచుకొని, దానిని చేరడానికి ఉద్దేశించడమవుతుంది. అస్తిత్వవాదంలో భవిష్యత్తు ఒక అచుంబితకన్య. అనావిద్ధమౌని. దీనిని ఆంగ్లంలో (Virgin future) అంటారు. అలాంటప్పుడు ముందుగా ఊహించడమనే ప్రశ్నే లేదు. అందుకని ముందుగా ఒక లక్ష్యాన్ని పెట్టుకోవడమన్న ప్రశ్న ఉత్పన్నం కాదు. ముందుగా ఊహించడమే జరిగితే - ఊహించేదంతా భావనలే కనుక, భావనలంటే సారం కనుక - సారం అస్తిత్వం కంటె ముందు అవుతుంది. అందుకని మనం ఊహించడ (Conceive) మనే పదం వాడకుండ, సంకల్పించడం (Will) అనే పదం ఉపయోగించి, మానవుడు ఉద్గమించిన తరవాత, అస్తిత్వం తరవాత, తనను తాను 'సంకల్పించు' కొంటాడు అని చెబుదాము. సంకల్పించుకొన్న రీతిలో అతడు తయారవుతాడు. అంటే తనను తాను సృష్టించుకొంటాడు. (ఒక పద్యాన్నిగాని, చిత్రాన్నిగాని రచించేటప్పుడు - సృష్టించేటప్పుడు, రచయితకు చిత్రకారునికి ఎటువంటి మెరుపు దూకిపడనున్నదో ముందుగా తెలియదు సృష్టి అంటే అది. ఆలోచించి వ్రాసేదంతా సృష్టికాదు). అందుకని మనిషి తనను తాను సృజించుకొన్న (Make) దానికంటె, భిన్నం కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే అస్తిత్వం దత్తాంశం (Given). దానితో ఆడుకొంటాడో పాడుకొంటాడో, దానిని ఏమి చేసుకొంటాడనేది అతని పని, అతని చేతాళము.

## అస్తిత్వ సత్యం:

అస్తిత్వవాదం అంతరంగ జీవితానికి అధిక ప్రాముఖ్యాన్నిస్తుంది. ఎంత ప్రాముఖ్యాన్నిస్తుందంటే దాదాపుగ

వస్తుగత ప్రపంచాన్ని (Objective world) పూర్తిగా విస్మరిస్తుంది వ్యతిరేకిస్తుంది. అస్తిత్వవాదం అభిమానించే అంతరంగ ప్రపంచాన్ని మనం ఆత్మిక ప్రపంచం (Subjective world) అనవచ్చు ఆత్మిక ప్రపంచానికి సంబంధించిన అనుభవాలు చిత్తవృత్తులు, వ్యాకులతలు, నిర్ణయాలు, అవ్యవహిత అనుభూతులు. ఆత్మీయ జాగృతి (Subjective awareness)మీద దృష్టిని కేంద్రీకరిస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం ఆత్మికజ్ఞానం తప్ప మరొక జ్ఞానం ఉండడానికి వీలు లేదు. మానవ జీవితానికి సంబంధించినంత వరకు అన్నిరకాల వస్తుగత జ్ఞానాన్ని (Objective knowledge, అన్యక్తికతను (Impersonality) వ్యతిరేకిస్తుంది. ఎందుకంటె, ఆధునిక పారిశ్రామిక, శాస్త్రీయ ప్రపంచం, అందలి దార్శనికులు, శాస్త్రవేత్తలు వ్యక్తిని దిగువమెట్టుకు నెట్టివేశారు. అంటె ఆ ప్రపంచం వ్యక్తిని వస్తువు క్రింద జమ కట్టింది. వస్తువులకు అన్వయించిన సూత్రాలనే వ్యక్తులకు అన్వయించారు వస్తువుకు అర్థం చెప్పినట్లే వ్యక్తికీ అర్థం చెప్పారు. యంత్రంలో తయారైన వస్తువులన్నీ ఒకే విధంగా ఉంటాయి. వాటి అన్నింటికీ ఒకే సూత్రం వర్తిస్తుంది. అలాగే జీవ, భౌతిక మనోవిజ్ఞాన శాస్త్రాలు మనుష్యులందరికీ వర్తించే సూత్రాలు తయారు చేశాయి. ప్రతి వ్యక్తి ఇతరులకంటె భిన్నమనే సంగతిని మరిచిపోయాయి అందువల్ల వస్తుప్రపంచం కంటె తనకు ఉన్న భిన్నత్వాన్ని మానవుడు కోల్పోయాడు. అందుకని అస్తిత్వవాదం అస్తిత్వం యొక్క 'అనన్యత'కు, 'ప్రాథమికత'కు ప్రాధాన్యమిస్తుంది ఈ 'అనన్యత' (Uniqueness) ఆత్మజాగృతిలో, అవ్యవహిత అనుభవం (Immediate experience) లో అంటే ఆలోచనా రూపం పొందని ముందటిస్థితి అయిన అనుభవంలో ఉంటుంది.

అస్తిత్వవాదులకు 'సత్యం' ఆత్మికానుభవం (Subjective experience) లో ఉంటుంది. అంటే ఈ సత్యం అనుభవించడం ద్వారా తప్ప, అనుభవించే వానికి తప్ప వేరే తెలియడానికి వీలులేదు. ఈ అనుభవం అనన్యము ఏ రెండు అనుభవాలు ఒకే విధంగా ఉండవు. అనుభవం అనుభవించేటప్పుడు - అంటే భవిష్యత్తు వర్తమానంగా మారే కూడలిసమయంలో - అనుభవించేవాడికే ఇదమిత్థమని తెలియదు. ఆ తెలిసీ తెలియని అనుభవమే సత్యము. అనుభవించిన తరవాత ఆ అనుభవాన్ని వ్యక్తీకరించ ప్రయత్నించేటప్పుడు, లేదా తనకు తానే ఆ అనుభవం ఏమిటో తెలుసుకోడానికి ప్రయత్నించినప్పుడు, దానిని భాషారూపమైన ఆలోచనలలోకి అనువదించడం జరుగుతుంది. ఇలా ఎప్పుడైతే అనుభవం, అనుభవస్థితినుంచి ఆలోచనాస్థితికి మారుతుందో దాని అనన్యత (వైలక్షణ్యం, విశేషాలు) పోయి, సామాన్యలక్షణాన్ని (General character) సంతరించుకొంటుంది. అందుకని అనుభవాన్ని యథాతథ అనుభవరూపంలో అనుభవించడం తప్పదే తప్ప తెలిసికోలేము. ఎందుకంటె అనుభవంలోని అస్తిత్వం పోయి 'సారం' మిగులుతుంది

అస్తిత్వం దత్తాంశము. ఈ అస్తిత్వం ఒక్క 'అహం' (I) విషయంలోనే అనుభవంలోకి వస్తుంది. మిగతా వస్తుజాలానికి ఏదో ఒక అర్థంలో అస్తిత్వం ఉంటుంది. నేను (I) నా అస్తిత్వాన్ని అనుభవించిన అర్థంలో నాకంటె భిన్నమైనవి (పశులు, చెట్లు, పక్షులు) తమ అస్తిత్వాన్ని అనుభవించవు. ఎలాగంటే: 'నేనేమిటి?' అనే ప్రశ్న అర్థవంతమైనదంటాము గాని, 'నేను ఉన్నానా?' అనే ప్రశ్న బుద్ధితక్కువ ప్రశ్న అంటాము. నేను వేరు నా అస్తిత్వం వేరు కావు. అస్తిత్వం ఉన్న ఏదో ఒక వస్తువును అనుభవించినట్లు నన్ను నేను అనుభవించను. నన్ను నేను అనుభవించడమంటే నా అస్తిత్వాన్ని అనుభవించడమే. ఒక వస్తువు దాని రంగు రుచిలాంటి గుణసముదాయము. ఆ వస్తువునుంచి దాని గుణాలు తీసివేస్తే అక్కడ ఏమి మిగులుతుంది? అక్కడ 'దాని-లో-అది' (Thing-in-itself) ఉంటుందని భావిస్తాము. 'దాని-లో-అది' అంటే ఖాళీ అయిన భావరూపము. అంటే ద్రవ్య, గుణ, రహిత వస్తురూపము. అయితే ఈ విషయం 'నేను' (I) కు వర్తించదు. నాలోనుంచి నా గుణాలను తీసివేసినా నేను మాత్రం ఖాళీ భావరూపాన్ని పొందను. ఎందుకంటే 'నేను'కు (అహంకు) వస్తువులకు మాదిరి లక్షణాలు లేవు. 'నేను'కు ఉన్నది ఒక్క అస్తిత్వం తప్ప మరి ఏ ఇతర లక్షణం లేదు. అసలు అస్తిత్వమే నేను.

చేతనాన్ని అర్థం చేసుకోవడానికి రెండురకాల అస్తిత్వం మధ్య తేడా తెలుసుకోవాలి. దాని-లో-అది (being in-itself = en Soi), 'దాని-కై-అది' being-for-itself) అని రెండు అస్తిత్వాల మధ్య తేడా చెబుతాడు సార్త్రే. 'దాని-లో-అది' కేవల అస్తిత్వము. అది తనతో తాను ఒకటైనది. అది తనకంటె భిన్నం కాదు. అగ్రాహ్యమైనది. అపారదర్శకము. నిరపేక్షము. (No reference). ఈ అస్తిత్వం మామూలుగ వస్తువులకుండే అస్తిత్వము. ఇది జ్ఞానేంద్రియాలకు అందుతుంది. అంటే కనిపిస్తుంది, వినిపిస్తుంది. దీనికి భిన్నంగా రెండవరకం అస్తిత్వం-అంటే 'దాని-కై-అది' ఉంది. దీనిని మనం మామూలుగా చేతనం అని పిలుస్తాము. ఇది కనిపించనిది.

వివరించవీది. 'దాని-లో-అది' అచేతనము. 'దాని-కై-అది' చేతనము. దాని-లో-అది వెలితిలేని; రాశీభూతము; దీని పరిధులను, పరిమితులను 'దాని-కై-అది' నిర్ణయిస్తుంది. 'దాని-కై-అది' తనకు తాను బాహ్యంగా, మిథ్యంగా ఉంటుంది. తనకు తాను దూరమైనప్పుడే, తననుంచి తాను వెలుపలికి జరిగినప్పుడే, తనని శూన్యం వి[illegible]తుంది. తనలో తాను ఉన్నంతసేపు తనని శూన్యం నిర్వచించలేదు. అసలు 'దాని-కై-అది'-అంటే చేతనం-ప్రతిషేధం ద్వారా వ్యక్తమవుతుంది. [అంటే ప్రతిషేధమంతా ఆవశ్యకమే (All determination is negation అనే హెగెల్ సిద్ధాంతం (నేతి నేతి సిద్ధాంతం) ద్వారా అర్థం చేసుకోవాలి.] మనం సచేతనులమయ్యేటప్పుడు అస్తిత్వం వెలుపలికి, బాహ్యంగా లంఘిస్తాము. అలా లంఘించడం వల్ల ఏమీ కాకుండా పోతాము అంటే శూన్యమవుతాము. ఈ శూన్యంనుంచి చేతనాన్ని కోల్పోవకుండ తప్పించుకోవడానికి, ముక్తిని బడయడానికి, 'దాని-లో-దాని-కై-అది' (Pour-soi-en soi) సాధించడానికై ఆశిస్తాము.

'దాని-కై-అది' జ్ఞానసంబంధమైనది. ఎరగడమంటే నిష్పన్నమే అదే అస్తిత్వం. మానవుని చేతనం ప్రపంచాన్ని సృష్టించదు. ప్రపంచాన్ని తెలియజేస్తుంది. మనిషిని ప్రపంచంలోని ఇతరవస్తువులనుంచి వేరుపరిచేది ఈ చేతనమే. చేతనం వస్తువు గాదు. వస్తువును ఎరగడము. చేతనం ఉన్నదీ అంటే అది ఏదో ఒకవస్తువుకు సంబంధించిన చేతనమే అయిఉంటుంది. అంటే అది బాహ్య ప్రపంచం మీద తన ఉనికి కోసం ఆధారపడి ఉంటుంది. వస్తువులేక చేతనం లేదు. అంటే నిర్విషయక చేతనం ఉండదు. అయితే చేతనం తనకు తనను ఎరుకపరుచుకో లేదు. అంటే తనకు తాను కర్మ (Object) కాలేదు. దేనినో ఒక దానిని గురించి ఆలోచిస్తున్న అనుభవం మనిషికి ఉంటుంది. తన స్వంత అనుభవానికి సంబంధించిన చేతనం ఉంటుంది కాని 'నేను అనే అనుభవం' (Experience as I)-అదేమిటి? అది శరీరం కాదు. జ్ఞానేంద్రియాలు కాదు. మరి వేర్పాటు ఎందువల్ల వచ్చింది? 'శూన్యం వల్ల', అంటాడు సార్త్రె.

మనిషి ఒట్టి ఆలోచించే గొట్టం మాత్రమే కాదు. ఆలోచనాచైతన్యానికి అడుగున ఆలోచనాత్పూర్వచేతనం ఉంది. మానవుని 'అహం' అవిమర్శక చేతనంనుంచి ఉద్భవిస్తుంది. ఆ స్థితిలో 'నేను' గాని మరొకటిగాని ఉండదు. అది అవ్యక్తిక భూమిక లేక ఆశ్రయము. 'సారం' ఎప్పుడూ మారనిది, కాని మానవుడు ఎప్పుడూ మారుతూ ఉంటాడు. ఇప్పుడున్నట్లు అతడు ఎప్పుడూ లేడు. ఉండడు. అతనికి శాశ్వతత్వంతో సంబంధం లేదు. అందుకని అతడెప్పుడూ తనను తాను స్రవంతినుంచి ప్రతిషేధం (Negation) ద్వారా పరిచ్ఛిన్నం గావించుకొంటూ ఉంటాడు. ఈ విధంగా 'సారం' లేదు. అస్తిత్వం మాత్రమే ఉంది. అస్తిత్వం అంటే పరివర్తనము.

### స్వేచ్ఛ, బాధ్యత, విలువలు:

స్వేచ్ఛాబాధ్యతలు అస్తిత్వవాదంలో చాల కీలకపాత్రను వహిస్తాయి. ఇంతవరకు చెప్పినట్లు, అస్తిత్వవాదం వ్యక్తి అస్తిత్వానికి, ఆత్మీయతకు ప్రాధాన్యాన్ని ఇవ్వడంతో, స్వేచ్ఛాబాధ్యతలు ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తాయి. అస్తిత్వవాదానికి మానవుని విజయాలన్నా, అతని సంస్థలు (Institutions) న్నా, అవ్యక్తి ప్రాకృతిక ప్రపంచమన్నా ఆసక్తి లేదు. వ్యక్తి తనకు తానుగా తీసుకొనే నిర్ణయాలు (Decisions, చేసే ఎంపికలు (Choices), కల్పించుకొనే విలువల యెడ మాత్రమే దీనికి ఆసక్తి ఉంది.

స్వేచ్ఛ అనేది అర్థం చేసుకొని తెలుసుకొనేది కాదు. అనుభవించి తెలుసుకొనే సత్యం మాత్రమే. దానిని అనుభవించగలిగితే అతనికి అనంతస్వేచ్ఛ ఉంది. మానవుని అంతర్గత స్వభావ, ఆవశ్యకతలను, అవసరాలను తీర్చడమే స్వేచ్ఛ. నిజమైన ఆత్మాభివ్యక్తీకరణమే స్వేచ్ఛ. అది లభ్యమయ్యే అనేకానేక అవకాశాలలో కొన్నింటిని ఎంపిక చేసుకోవడంలో, నిర్ణయాలు తీసుకోవడంలో, ఆ నిర్ణయాలకు బాధ్యత వహించడంలో నిజమైన స్వేచ్ఛ ఉంది.

ఆధునికసమాజంలో పరివర్తన విపరీతవేగంతో జరుగుతున్నది. విలువలు, ప్రమాణాలు, విశ్వాసాలు అయోమయ స్థితిలో పడ్డాయి. 'మనం ఎటువంటి మానవులుగ తయారు కావాలి?' ఏ విలువలను ఎంచుకోవాలో, ఎటువంటి జీవితాన్ని దిద్దుకోవాలో తెలియని స్థితిలో, అంతరంగమంతా అల్లకల్లోలమైన స్థితిలో, 'ఎంపిక' (Choice), నిర్ణయం (Decision) చేయడం అంత తేలికైన పని కాదు.

ఈ డోలాయమాన గందరగోళ పరిస్థితినుంచి రెండు మార్గాల బయటపడవచ్చు. ఒకటి అన్వేషణ మానివేసి గుడ్డిగా ఆచారవ్యవహారాలు అంధవిశ్వాసాలలో కూరుకుపోయి, మానవసమూహంలో మునిగిపోయి అంటే పదిమందిలో తనూ ఒకడు కావడం లేదా గొర్రె మందలో ఒకగొర్రె కావడం. రెండవది, మన వ్యక్తిత అస్తిత్వ సత్యంలో ఆత్మకు నూతన అర్థాలను కల్పించడం. అంటే పదిమందిలో ఒకడు కాక అద్వితీయుడుగా ఉండడము.

అస్తిత్వవాదులు మొదటి మార్గాన్ని అయథార్థమని, అది నిరాశకు (Dispair), వ్యాకులతకు దారి తీస్తుందని అంటారు.

మనిషి ఈ ప్రపంచంలోకి విసరబడిన తరవాత 'సారం' ఏర్పడుతుందనుకొన్నాము. అదెలా ఏర్పడుతుంది? ఎంపిక వల్ల. ఎన్నో అవకాశాలలో కొన్నింటినే ఎంపిక చేసుకొంటున్నాము. కొన్నింటిని వదలివేస్తున్నాము. దీనిని బట్టి ఏమిటి అర్థమవుతున్నది? ఎంపికలో స్వేచ్ఛ ఉన్నదని. ఒకడు అసలు దేనిని ఎంపిక చేసుకోకపోవచ్చు. దేనిని ఎంపిక చేసుకోకపోవడం గూడ ఒక ఎంపికే. స్వేచ్ఛ అనేది వస్తుప్రపంచానికి చేతనానికి మధ్య ఖాళీని పూరించే సాధనము.

ఎంపికలో ఒక దానిని కాదని రెండవ దానిని వరించడం జరుగుతుంది ఒక దానిని కాదని రెండవ దానిని ఎందుకు ఎంపిక చేసుకొన్నట్లు? అలా చేయడానికి ఆధారం, ప్రాతిపదిక ఏమిటి? విలువ. కనుక ఈ విధంగా ఎంపికలో 'విలువ' అంతర్గతంగా ఏర్పడుతుంది. అంటే మానవుడు ఎంపికలో విలువను సృష్టించుకొంటున్నాడు. ఈ విధంగా మనిషి జీవితానికి 'విలువ', 'అర్థం' ఏర్పడతాయి. వ్యక్తి తన జీవితానికి తాను శిల్పి అవుతున్నాడు. తను శిల్పించుకొన్నదానికంటె మనిషి ఇతరం కాడు, కాలేడు. తాను తన సృష్టిఫలితము.

మనిషి యథాతథంగా ఎందుకు ఉన్నాడు? తనను తాను ఆ విధంగా శిల్పించుకొన్నాడు. మరి అలాంటప్పుడు తాను అలా ఉండడానికి ఎవరు బాధ్యత వహించాలి? బాధ్యత వహించడానికి దేవుడు లేడు. మనలను శిల్పించింది దేవుడు కాడు. ముందుగా నిశ్చితమైన ఒక వ్యవస్థ లేదు ఈ రెండూ లేవు కనుక అతనికి ముందు 'సారం' లేదు అందుకని వ్యక్తి తన యథాతథస్థితికి బాధ్యత తానే వహించాలి. తనకు తానే కాక ఇతరులకు గూడ బాధ్యత వహించాలంటుంది అస్తిత్వవాదము.

పై చర్చనుబట్టి తేలేదేమిటంటే: ఎంపిక చేసే కర్తను నేనే; ఎంపిక లేకుండ ఉండలేనివాడిని నా జీవితాన్ని తీర్చి దిద్దుకొనే స్వేచ్ఛగల కర్తను. నా జీవితలక్ష్యాలను ఎంపిక చేసుకోవడంలో నేనే కర్తను. నా స్వేచ్ఛాయుత ఎంపికకు బాధ్యత నాదే. అందుకే సార్త్రి మానవునికి స్వేచ్ఛనుంచి విముక్తి లేదు (Man is condemned to be free) అన్నాడు.

ఎంపిక, బాధ్యత వహించడం అంత తేలికైనవి కావు. వీటిని నిర్వర్తించడంలో వేదన ఉంది. వేదన ఎందుకుంటుందంటే, సంతృప్తినిచ్చే 'విలువ' లభించడం దుర్లభము. అందుకనే దీనికెంతో ధైర్యం కావాలి. అవసరమైతే పదిమందిలో ఒకడు కాకుండ. గత విధానాలను, నమూనాలను వదలివేసి తన స్వంతం మీద నిలబడాలి. యథార్థంగా తన 'సారా'న్ని తను చేసుకొనే స్వేచ్ఛే తన జీవితానికి తను అర్థం కల్పించుకొనే స్వేచ్ఛే అతని వేదన, అతని వైభవం - రెండూ అదే.

ఆత్మసిద్ధి (Self fullfilment) కి అవసరమైన నూతనావకాశాలను అందించే క్రొత్త పుంతలను త్రొక్కే ధైర్యం ఎంతిమందికి ఉంటుంది? చాలమంది తమ జీవితాలను తాము మలచుకోరు. ఆ పనిని ఇతరులకు వదలివేస్తారు. అంటే తమ జీవితాలకు సంబంధించిన నిర్ణయాలను ఇతరుల చేతిలో పెడతారు. తాము ఎవరిపై విశ్వాసం ఉంచాలి? ఎవరిని నమ్మాలి? ఎలా ప్రవర్తించాలి? అనే నిర్ణయాలను మనం ఎక్కువగా మతానికీ సంఘంలో పెద్దలకూ వదలివేస్తూ ఉంటాము. ఈ విధంగా వ్యక్తి పదిమందిలో ఒకడై, అంధుడై, ఇతరుల నిర్ణయాలను శిరసావహిస్తూ పోతే అస్తిత్వం సంబంధమైన క్రొత్త అవకాశాలను పోగొట్టుకొంటాడు. వ్యర్థజీవితం గడుపుతాడు. అలాంటప్పుడు ఫలితాలను తప్పించుకోలేడు. ఎవరిని నిందించలేడు. ఈ విధంగా తనకున్న 'స్వేచ్ఛ'ను 'బాధ్యత'లను కాలదన్ని, పదిమందిలో ఒకడై, పరాశ్రయుడై, పరవశుడై గడిపే జీవితాన్ని 'అయథార్థజీవితం' (Unauthenetic life) అంటుంది అస్తిత్వవాదము. అది నైరాశ్యం (Despair) లో జీవించడమే, అంధవిశ్వాసంలో జీవించడమే.

ఎంపికతో విలువ అంతర్గతంగా ఉంటుంది. విలువ జీవితాన్ని అర్థవంతం చేస్తుంది - అంటే సారాన్ని ఇస్తుంది. ఇది వ్యక్తిని సంతృప్తి పరచాలి. అయితే అన్ని విలువలు అందరిని సంతృప్తి పరుస్తాయా? ఇది వ్యక్తిగత సమస్య. ఒకవ్యక్తికి సంతృప్తినిచ్చిన విలువలు రెండవవానికి అదే సంతృప్తిని కలిగిస్తాయని చెప్పలేము. కనుక మనలో ప్రతిఒక్కరం ఎవరికి సంతృప్తినిచ్చే విలువలను వారు వెతుక్కోవలసి వస్తుంది. మరి ఇది 'నైతిక శూన్యత'కు దారి తీయదా? తీయదని సమాధానము. ఎలా? అసలు మానవాళిలో ఒక అంతర్గత ప్రాథమిక ఐక్యత ఉంది. అందుకని ప్రతిఒక్కరు, తమతో తాము, ఇతరులతో తాము నిర్మాణాత్మకంగా ఎలా ప్రవర్తించాలనే సమస్యను ఎదుర్కొంటారు. అందువలన యథార్థంగా జీవించాలని ప్రయత్నించే వివిధవ్యక్తులు ఎన్నుకొనే విలువలు కమ్మూ

నాలలో అంతర్గతసాతత్యం ఉంటుంది. ఈ విధంగా ప్రొటాగరస్ * విలువలరాహిత్యంనుంచి బయటపడతాము.

అంతేగాక, అస్తిత్వవాదం ఒకరియెడ ఒకరికి ఉన్న కర్తవ్యాలను, విధులను నొక్కిచెబుతుంది. ముఖ్యంగా ఇందులో గమనించవలసింది జీవితాన్నుంచి నీవు ఏమి పొందావని కాక, జీవితానికి నీవేమి ఇచ్చావని ఆలోచించాలి. సామాజికంగా నిర్మాణాత్మకమైన విలువలను మనం పండించుకొన్నప్పుడే మన జీవితాలు సార్థకమవుతాయంటుంది అస్తిత్వవాదము.

తమతో తాము, తాము ఇతరులతో నిర్మాణాత్మకంగా, సృజనాత్మకంగా ప్రవర్తించకపోతే సామాజికసంబంధాలు రుగ్మతలకు గురవుతాయి. రుగ్మతాసంబంధాలు వ్యక్తులను రోగులుగా మారుస్తాయి దీని మీద విశేషంగా కృషి చేసిన బ్రిటీషు మానసికరోగనిపుణుడు R. D. లేయాంగ్ ఏమి చెబుతాడో చూదాము: 'మనలో ఎవరమూ వేరు వేరు, పృథక్కృత, సంబంధం లేని వస్తువులము కాము. సంస్కృతిలోని భాగస్వాములము. లేదా సమూహాలలో సభ్యులము. కుటుంబసభ్యులము. ఈ విధంగా మనం మనకు 'అర్థవంత' మైన, 'సాకూత' మైన ఇతరుల చేత ప్రభావితులమవుతాము, వారిని ప్రభావితం చేస్తాము; మలచబడతాము, మలుస్తాము. ఇది ఒక అనంత ప్రక్రియ.'

అతని దృష్టిలో ఈ 'పరస్పరచర్య' మనుషులు ధరించే కొన్ని 'ఆచ్ఛాదనల' (ముసుగుల) మీద, ఆడే 'నటనల' (Games) మీద ఆధారపడుతుంది. ఈ 'ముసుగులు', 'నాటకాలు' కారణంగా వ్యక్తులు తమ అసలు రంగును, అసలు అంతరంగాన్ని, అన్వేషించడానికి ప్రోత్సాహం లభించదు. ఎప్పుడు ఇతరులు ఏమనుకొంటారోనని. ఇతరుల అభిమానానికి పాత్రుడవడమెలాగా అని, ఇతరులు మననుంచి ఏమి ఆశిస్తున్నారో దానికనుగుణంగా మెలగాలని నటిస్తూ ఉంటాము ఇలా ఇతరులకోసం ఆడే నాటకం, ముసుగుల అంతిమ ఫలంగా ఒక విస్తృతమైన సర్వతోభద్రమయిన రక్షణ కవచం (Defense mechanism) ఏర్పడుతుంది. అసలు వ్యక్తి వేరు, ఈ కవచం వేరు. ఈ రెండింటి మధ్య ఖాళీ ఏర్పడుతుంది. అంటే వ్యక్తి నిలువున రెండుగ చీలిపోతాడు. చీలిన ఈ రెండు భాగాలలో ఒక దానికి రెండవ దానితో సంబంధం ఉండదు. అందుకే మనమంతా అయోమయ, గందరగోళస్థితిలో పడ్డ బీటలు వారిన జీవులంగా అయిపోయాము. మనకు మనమే కొత్తవారము. నన్ను నేను ఎరుగను. నాలోని ఒకముక్క రెండవముక్కను ఎరుగదు. నిన్ను నీవు ఎరుగవు. అంటే నీలోని ఒక ఖండం రెండవఖండాన్ని ఎరుగదు. మనం ఇతరులకు, ప్రపంచానికి, దేవునికి కొత్తవాళ్ళము. అంటె వారిని మనం ఎరగము. వారు మనను ఎరగరు. ఈ రకమైన అగాధం, చీలిక, వేర్పాటు రావడానికి కారణం గందరగోళమైన విలువలు, బోధనలు, సాంఘిక అవసరాలు, జీవన సన్నివేశాలు. ఈ చీలిక, వేర్పాటు భరించరానంతగా పెరిగినప్పుడు వ్యక్తి ముక్కలు చెక్కలవుతాడు. అదే ఉన్మాదము ఈ ఉన్మాదంలో వ్యక్తి తను పోగొట్టుకొన్న సమగ్రతను, పరిపూర్ణతను, ఏకతను, అపరిచ్ఛిన్నతను అభేద్యతను తిరిగి పొంద ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నమే ఉన్మాదము.

అసలు మానవునిది 'దుస్థితి' అని చెప్పుకొన్నాము. దానికి మరొక అవ్యవహితమైన, బాధాకరమైన దుస్థితిని కలుపుతున్నాము. అది నాస్తిత్వము (Non-existance) లేదా శూన్యము (Nothingness). దీని అంతిమరూపమే మృత్యువు Death). ఇది ఏ మానవుడూ తప్పించుకోలేని కర్మ (Destiny). ఈ శూన్యాన్ని ఎదుర్కోవడం మానవునికి అనన్యమైన విషయము. (Unique). జీవరాసులన్నింటిలోకి మానవుడొక్కడే దానికి సంబంధించిన నిరంతర స్పృహతో జీవిస్తాడు. ప్రతిక్షణం గూడ మనం 'మనకు ఎప్పుడో ఒకప్పుడు మరణం తప్పదు,' అనే భావన అంచు మీద నడుస్తూ ఉంటాము. ఈ భావన నుంచి బయట పడలేము 'అస్తిత్వం' పూర్తిగ బోధపడాలంటె ఈ రకమైన స్పృహ అవసరము కాని ఇది మన అవ్యవహిత అనుభవానికి, అస్తిత్వానికి నూతనార్థాన్ని సంతరించి పెడుతుంది ఈ అనివార్య మృత్యువుకు సంబంధించిన స్పృహ, జీవితంలో దీని పరిణామాలు మనలను అస్తిత్వ వ్యాకులత (Existential anxiety)కు దారితీస్తాయి. అస్తిత్వ వ్యాకులత అంటె, 'మనం అర్థవంతమైన, సాకూతమైన, సంతృప్తమైన, ప్రగాఢమైన జీవితాన్ని గడుపుతున్నామా?' అనే సమస్యకు సంబంధించిన లోతైన చింత. సార్థకమైన జీవితాన్ని గడపడం ద్వారా ఈ అస్తిత్వ వ్యాకులత, మృత్యువులను జయించవచ్చు. చావడం తప్పనిసరైతే, 'ఈ మృత్యువు, ఈ శూన్యం, నా పాలిట దుర్విధి అయింది,' అంటూ విరోధిస్తూ చనిపోదాము.

* ప్రొటాగరస్ 'అన్నింటికి మానవుడే కొలబద్ద' (Man is the measure of all things) అంటాడు. దీనికి అర్థం: నేను ఏది మంచిదనుకొంటే నాకు అదే మంచిది. నీవు ఏది మంచిదనుకొంటే నీకు అదే మంచిది.

అస్తిత్వవాదులు ఆధునిక మానవుని సామాజికస్థితిని తీవ్రంగా తీసుకొన్నారు. సనాతన విలువలు పడిపోయాయి. విశ్వాసం సంకటస్థితిలో పడింది. బ్యూరోక్రటిక్ రాశీ సమాజం (Mass society)లో మానవుడు విమానవు (Dehuman)డయ్యాడు. మానవ అస్తిత్వంలో 'అర్థం' లుప్తమైంది. నేటిమానవుడు విమనస్కుడు (Alienation) అయ్యాడు. తనను తానే గుర్తించలేకపోతున్నాడు. దేవుణ్ణి ఎరగలేకపోతున్నాడు. ఏకాకి అవుతున్నాడు. ప్రస్తుత ఆధునిక జీవితవిధానం, మన జీవితం 'అర్థరహితం' అనే విషయాన్ని కళ్ళకు కట్టినట్లు చెబుతున్నది. ఇదే అస్తిత్వ వ్యాకులతకు, మానసిక రుగ్మతలకు కారణమవుతున్నది. దీనినుంచి బయట పడడానికి, వ్యక్తి విలువలను నిర్వచించుకొని ఈ ప్రపంచంలో అర్థవంతంగా 'ఉండ'డానికి ప్రయత్నించాలి.

## అస్తిత్వవాదులలో కొందరు ప్రముఖులు

ఇంతవరకు అస్తిత్వ వాదాన్ని గురించి సామాన్యచర్చ జరిపాము. అస్తిత్వవాదం ఒకవాదం కాదని. అనేకవాదాలని, అస్తిత్వవాదులు ఎంతమంది ఉన్నారో అన్నిరకాల అస్తిత్వవాదాలున్నాయని చెప్పుకొన్నాము. ఆ కారణాన కొందరు అస్తిత్వవాదుల దర్శనాలను విడివిడిగా పరిశీలిం తాము.

### కీర్కెగార్డ్ (Kierkegard)

కీర్కెగార్డ్ ఆధునిక అస్తిత్వవాదానికి మూలపురుషుడు. డెన్మార్క్‌కు చెందిన ఇతడి రచనలు తరవాతి అస్తిత్వవాదులకు ఆధారాలయ్యాయి. ఇతడి ఆలోచనలు ఒక పద్ధతిలో ఉండవు. అందుకని ఇతడి సిద్ధాంతాలను ఒక సమగ్ర దర్శనంగా భావించడానికి వీలు లేదు. అన్ని విషయాలను విరోధాభాసల (Paradoxes)లో చెబుతాడు. అందుకని అతనిని అర్థం చేసుకోవడం గూడ కష్టమే.

కీర్కెగార్డ్‌కు ఎదురైన ముఖ్యప్రశ్న 'క్రైస్తవుడుగా ఉండడం', ఆ తరవాత 'సమగ్రమానవుడు కావడం'అనేవి అతనికి సామాన్య అస్తిత్వంతో పని లేదు. అతనికి కావలసింది మానవ అస్తిత్వము. అతడు మనుష్యులను, అస్తిత్వంలోని ముఖ్యాంశాలను, అమర్త్య ఆత్మలను, వాటి కర్మను. దేవుని యాథార్థ్యాన్ని అర్థం చేసుకోమంటాడు.

మామూలుగా నిత్యం గుడికి వెళ్ళివచ్చే క్రైస్తవుడంటే అతనికి సానుభూతి లేదు. ఎందుకంటె అతడు తాను గుడికి వెళ్తున్నానని, మంచి పనులు చేస్తున్నానని, మంచి పౌరుడనని అనుకొంటాడు. కాని ఈ వివేచనారహిత క్రైస్తవుని మతం విమానవ (Dehumanised) మతము. అతనికి నిజంగా క్రైస్తవుడు కావడమంటే ఏమిటో తెలియదు.

కీర్కెగార్డ్ కాలంలో హెగెల్ ప్రభావం విపరీతంగా ఉండేది దానికితడు ఎదురు తిరిగాడు. హెగెల్ ఆత్మను, సత్యాన్ని వస్తుగతం (Objective spirit) చేస్తే కీర్కెగార్డ్ ఆత్మికతయే సత్యం (Subjectivity is truth) లేదా ఆత్మికతలో సత్యం ఉంది (Truth lies in subjectivity) అంటాడు. దీనిని మనం అర్థం చేసుకోవాలంటె కీర్కెగార్డ్ ఆస్తికుడని, క్రైస్తవం 'దేవుడే సత్యం' అంటుందనీ జ్ఞాపకం ఉంచుకోవాలి. అతనికి దేవుడు కర్మ (Object) కాదు; అనంతమైన ఆత్మికత. కనుక ఆత్మికతయే అతని సత్యము.

హెగెల్ దర్శనం ప్రపంచానికి సంబంధించి, అనంతమైన దేవుణ్ణి గురించి ఎంతో జ్ఞానాన్ని ప్రసాదించిందని భావించేవారు. దీనిని కీర్కెగార్డ్ ఆమోదించలేదు. సొంత మూర్తిమత్వాన్ని (Personality) గురించి చెప్పలేని హెగెల్ దర్శనం అనంతమూర్తిని గురించి ఏమి చెప్పగలుగుతుందని అతడు నిరసిస్తాడు. తలుపులు మూసుకొన్న దర్శనాలంటె అతనికి అసహ్యము. అలాంటప్పుడు మూసిన తలుపులగదిలో విషయాలు ఊపిరి ఆడక ఉక్కిరిబిక్కిరి అయిపోతాయి. అలాంటిదే హెగెల్ దర్శనము. అందుకనే అది వ్యక్తిని విశ్వంలో ఒక అనామక వస్తువును చేసింది; అతనికి ఏమీ స్వేచ్ఛ లేకుండ చేసింది. దీనిమీద అతడు ధ్వజమెత్తాడు కాని కీర్కెగార్డ్ దృష్టిలో వ్యక్తి అనన్యుడు. అతనిని మామూలు పదాలతో, సామాన్యధర్మాలతో అర్థం చేసుకోలేము అంతేకాదు, కీర్కెగార్డ్ దృష్టిలో వ్యక్తి పూర్తి అయిన వస్తువు కాదు. నిత్య పరిణామి. నిత్యం తనను తాను మలుచుకొనేవాడు. అది సాతత్యయత్నము. స్వేచ్ఛయెడ అతనికున్న అంతర్గత తృష్ణనుంచి ఆ ప్రయత్నం బయల్వెడలుతుంది.

కీర్కెగార్డ్ మతంలో వ్యక్తి ఎప్పుడూ ఎంపికలు, నిర్ణయాలు చేస్తూ ఉంటాడు. తానున్న ఈ ప్రపంచం అంతా అనిశ్చితం (Uncertain) కనుక నిర్ణయాలు చేస్తుంటాడు. నిర్ణయాలు చేయడంలో రిస్కు ఉంటుంది. అయినా చేస్తుంటాడు. నా నిర్ణయాలు నావి. భగవంతుడు గాని, మరెవరు గాని నా నిర్ణయాలు చేయరు. నా స్వంత బాధ్యత మీద నేనే చేస్తాను. నాకు నిజమైన స్వేచ్ఛ ఉంది. హెగెల్ ప్రకారం 'కేవలభావం' (Absolute idea) ఒక హేతుబద్ధ ఆవశ్యకతతోడి వివృతమవుతుంది. హేతుబద్ధ ఆవశ్యకతయే

స్వేచ్ఛ. కీర్‌కెగార్డ్ చెప్పే స్వేచ్ఛ ఇది కాదు. వ్యక్తికి నిజమైన అవకాశాలున్నాయి. వాటిలో ఏవో అతడు ఎన్నుకొని నిర్ణయించుకొని, ఎన్నుకొన్నవాటిని యథార్థీకరణం చేస్తాడు.

కీర్‌కెగార్డ్ క్రైస్తవ ఆస్తికుడు. అతడు అస్తిత్వాన్ని గురించి అలాగే ఆలోచిస్తాడు. అస్తిత్వం అంటె అతనికి దేవుని సన్నిధిలో ఉండడము. దేవుని సన్నిధిలో అనుభూతి చెందడమంటె పాపి కావడమే. కనుక 'ఉండడ' మంటే పాపిగా ఉండడమే. అయితే అతడు ఈ 'ఉండడాని'కి అత్యంత విలువను ఆపాదించాడు ఈ స్పృహతో మతంలో ప్రవేశిస్తాము. ఒకసారి ప్రవేశించిన తరవాత హేతువునుంచి విశ్వాసంలోనికి పయనిస్తాము. 'ఉండడ' మంటే నాకంటే భిన్నమైన దానితో సంస్పర్శ (Contact)లో ఉండడమే. నాకంటె 'భిన్నమైన'దంటె కీర్‌కెగార్డ్ మతంలో దేవుడు. దేవుడు అనంతకరుణామయుడే అయినా పూర్తిగ వైధర్మ్యం కలిగినవాడు.

దేవునికి మనిషికి, దేవునికి ప్రపంచానికి, అధిప్రకృతికి ప్రకృతికి, సృష్టికర్తకు జీవికి, మధ్య పూడ్చరాని ఖాళీ ఉంది. దేవుడు సామాజిక నైతిక ప్రమాణాలకు అతీతంగా ఉంటాడు. 'మనిషి ఈ అగాధాన్ని దాటడం ఎలా?' అనే సందేహంలో పడడంతో మనిషి అస్తిత్వ వ్యాకులతను పొందుతాడు ఈ నైరాశ్యంలోని 'చేదు'ను చవి చూడని వానికి జీవితంలో 'అర్థం' లభించనట్లే - అతని జీవితం ఎంత సుఖసంతోషాలతో నిండి ఉన్నా సరే. మనిషి వేదనాభరితుడైనప్పుడు హేతువుని వదిలి విశ్వాసాన్ని కౌగలించుకొంటాడు ఈ బాధాతప్త 'విశ్వాసలంఘనం' (Leap of faith)తో మనిషి అర్థరాహిత్యాన్ని, విరోధాభాసాన్ని కౌగిలించుకొంటాడు క్రైస్తవం ఇక్కడే ఒక పెద్ద అంగ వేస్తుంది. ఆ అంగ సరాసరి వెళ్ళి అర్థరాహిత్యంలో పడుతుంది - అసలు క్రైస్తవం అక్కడ ప్రారంభమవుతుంది. కీర్‌కెగార్డ్‌కు విశ్వాసమే అన్నీ. దేవునికి ఎదురైనా తిరగాలి, లేదా వినమ్రుడై అయినా ఉండాలి. మనిషి క్రీస్తుకు వ్యతిరేకం లేదా అనుకూలము; సత్యానికి వ్యతిరేకం లేదా అనుకూలము అంటాడు. 'మన యుగానికి లేనిది వివేచన కాదు, రాగం' అంటాడితడు.

## కారల్ యాస్పర్స్ (Karl Jaspers)

కారల్ యాస్పర్స్ మానసికరోగ చికిత్సకుడు. రోగులకు చికిత్స చేయడంలో, అందులో మనోవ్యాధిగ్రస్తులకు చికిత్స చేయడంలో అతనికి కొన్ని వినూతన అనుభవాలు ఎదురయ్యాయి; కొంతమంది రోగులను పరీక్షించినప్పుడు మనోవైద్యగ్రంథాలలో చెప్పిన సూత్రాలను యథాతథంగా వారికి అనుప్రయుక్తం చేయడానికి వీలులేదని తోచింది. ఎందుకంటె వారు ఆ సూత్రాలలో ఇమిడేట్టుగా లేరు. వాటికంటె భిన్నంగా కనిపించారు. వారు ఆ సూత్రాలకు ఉదాహరణలు కారు. అందుకని వారితో ఏదో వ్యక్తిక సంబంధం పెట్టుకోవలసి వచ్చింది. ఈ వ్యక్తిక సంబంధంలో శాస్త్రీయ వస్తుగత దృక్పథం విడనాడబడింది. అప్పుడు శాస్త్రీయ వస్తుగతదృష్టితో వివరించ వీలులేని ఒక క్రొత్త సత్యం, ఒక నూతనార్థం గోచరించింది.

ఇతని దృష్టిలో 'అహం' (I)ను ఇతర వస్తువులకు వలె చూడ వీలులేదు. ఎలాగంటె మిగతా అన్ని వస్తువులు 'నేను' అనే కర్తకు 'కర్మ'లు (Objects) అవుతాయి. 'నేను'కు 'నేను' కర్మ కాలేదు. ఎందుకంటె 'నేను' అనేది లక్షణ, గుణరహితము. మనం మనశ్శాస్త్రంలో 'అహం'ను కర్మగా (Object)గా, వస్తువుగా పరిగణించి విశ్లేషిస్తున్నామంటే అర్థం చేతనవిషయాల (Contents of consciousness)ను అధ్యయనం చేస్తున్నాము. 'నేను ఉన్నాను' అని చెప్పినప్పుడు 'నేను' అనేది చేతన విషయాలకంటె భిన్నమై, వాటికి కర్త (Subject)గా నిలబడుతుంది.

నేను ఉన్నాను అంటే నాకు అస్తిత్వం ఉంది. నాకు అస్తిత్వం ఉన్నదని ఎలా తెలుస్తుంది? నేను చెట్టును చూచి అది చెట్టు అని తెలుసుకొన్నాను. అంటే ఆ చెట్టుకు నేను కర్తను, ఆ చెట్టు నాకు కర్మ అవుతుంది. ఈ అర్థంలో అస్తిత్వాన్ని (అస్తిత్వాన్ని కర్మగా) తెలుసుకోలేను. మరి ఎలా తెలుసుకొంటాను? తెలుసుకోవడం అనే పదాన్ని ఉపయోగించినంతకాలం ఈ చిక్కు తప్పదు. అస్తిత్వాన్ని ఎలాగో తెలుసుకొంటాను. ప్రతీకాత్మకంగా తెలుసుకొంటాను 'దర్శనం' ద్వారా తెలుసుకొంటాను. దర్శనంలో తెలుసుకొనేది తెలుసుకొనబడేది (జ్ఞాతజ్ఞేయాలు) - రెండు వేరువేరుగా లేవు రెండూ ఒకటే. అంటే నేను, అస్తిత్వం - రెండూ ఒకటే. అయితే ఈ అస్తిత్వం ప్రతీకలు నాకు ఎలాగో సంకల్ప వికల్పాలలోను, వాంఛలలోను, చేతనచర్యల (Conscious acts)లోను గోచరిస్తాయి. నా సంకల్ప చేతన చర్యాదులు నాలోనుంచి 'స్వేచ్ఛ'గా మౌలికంగా (ఇంక దేనితోను ప్రమేయం లేకుండ) పుట్టినట్లుగా అనుభవిస్తాను. అయితే ఈ అనుభవాన్ని మనం వస్తుగతదృష్టితో పరికించి మనశ్శాస్త్రంలో విశ్లేషించవచ్చు. అలా జరిగితే ఈ 'నేను', 'స్వేచ్ఛ' భ్రమలే అవుతాయి. ఎందుకని? అలాంటప్పుడు 'నేను'గూడ ఈ వస్తుమయ ప్రపంచంలో ఒక వస్తువునై శృంఖలాబద్ధుడనవుతాను.

అప్పుడు 'నేను' లేను. 'స్వేచ్ఛ' లేదు. వస్తుగతదృష్టితో చూచినంతకాలం 'నేను' (ఆత్మ=Self) 'స్వేచ్ఛ'లను భ్రాంతికావని నిరూపించనూ లేము. వస్తుగత ప్రపంచం కంటె అనన్యమైనది లేదనే నిర్ణయానికి వస్తాము.

'నేను' లేక 'ఆత్మ' అనుభవప్రపంచం కంటె భిన్నమైన అధిభౌతికసత్యాన్ని ప్రతిపాదిస్తుందనుకొంటే మనం పప్పులో కాలు వేసినట్లే. రెండు ప్రపంచాలు లేవు. ఉన్నది ఒక్కటే. ఈ ఒకటే భౌతికప్రపంచమే కానవసరం లేదు. అస్తిత్వావిష్కారం (Existential revelation) సూచనమేరకు ఈ ప్రపంచాన్ని 'ఆత్మభాస' ప్రపంచంగా ఊహించవచ్చు. ఈ అవిష్కారాన్ని మనశ్శాస్త్రపరిధిలోకి తీసుకువెళ్ళరాదు ఇది వస్తుగత ప్రపంచం కంటె పరిచ్ఛేద్యమైనదేగాని అధిభౌతిక సత్యానికి మాత్రం దారి తీయదు. ఇక్కడ అధిభౌతికతకు విశేషార్థాన్ని చెప్పుకోవాలి. ఔద్దేశికంగా వస్తుగతప్రపంచానికి లక్ష్యీకృతమై, వస్తువులకు సచెతనమై ప్రపంచంలోనే ఉండడము.

యాస్పర్స్ ప్రకారం సంకల్పం (Will), ఆత్మ (Self) నుంచి పుట్టాడు. రెండూ ఒకటే. సంకల్పం తనను తానే సృష్టించుకొంటుంది. తనకు తానే చేతనమైన ఆత్మను సృష్టిస్తుంది. ఆత్మ, అస్తిత్వం, సంకల్పం - మూడు ఒకటే. కార్యోత్పాదనంలోనే అస్తిత్వం కలిగి ఉంటుంది. కార్యోత్పాదనమే (Operation) చేతనానికి సాక్ష్యము. అస్తిత్వాత్మ (Existential self)కు ఈవిధంగా చైతన్యంతో, ప్రపంచంతో సంబంధం ఏర్పడుతుంది. ఆ కారణంగా దానికి 'ఇప్పుడు-ఇక్కడ'లు ఏర్పడతాయి. అంటె చారిత్రక సన్నివేశంతో ఒక స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇతర అస్తిత్వాలతో అది సంబంధం పెట్టుకొంటుంది. ఈ సన్నివేశం స్వీయసృష్టి (Self creation)కి దారితీస్తుంది.

'నేను ఉన్నాను', సందేహం లేదు. 'నేను చేయబోయే పనులమీద నా ప్రభావం ఉంది',-సందేహం లేదు. అయితే నాకు ఇంకొక విషయం గూడ స్పష్టమవుతున్నది. నేను పూర్తిగా, నా అంతట నేను, ఎవరి ప్రమేయం, సంబంధం లేకుండ చేస్తున్నాననుకోవడం లేదు. అనిబద్ధ, పరమ (Unconditional and obsolute) అస్తిత్వంతో నాకు అనివార్యసంబంధం ఏర్పడుతున్నది. పరమంతోడి సంబంధం యాస్పర్స్ చెప్పిన 'పరిమితిస్తున్న సన్నివేశాలు' (Limiting situations)ను స్పష్టం చేస్తున్నది. ఈ సన్నివేశాల ద్వారా, ఆనుషంగిక పోరాటం, అపరాధం, మరణాల స్పృహలో అస్తిత్వాత్మ పరిమితులను గ్రహిస్తాము. అయితే 'పరమా'న్ని 'కేవలా'న్ని పురాణాలలో [illegible]వటుగా వాచికంగా తీసుకోవడానికి వీలు లేదు. 'పరిమితిస్తున్న సన్నివేశా'లలో ఈ భావాలను (పరమ, కేవల) గూఢాక్షరాలుగ, ప్రతీకలుగ మాత్రమే అనుభవిస్తాము సరిగా చెప్పాలంటె పరమాన్ని తెలుసుకోవడానికే వీలులేదు. ఈ ప్రతీకాత్మకానుభవం ఈ ప్రపంచంలోని మన జీవితానికి లోతును, అర్థాన్ని ప్రసాదిస్తుంది.

## జీన్‌పాల్ సార్త్రె (Jean paul sartre)

అస్తిత్వవాదంలో విభిన్న ధోరణులున్నాయని చెప్పుకొన్నాము. అందులో రెండు ధోరణులు ముఖ్యమైనవి. ఒకటి ఆస్తిక అస్తిత్వవాదము; రెండు నాస్తిక అస్తిత్వవాదము. మొదటికోవకు చెందినవారు కీర్‌కెగార్డ్, కారల్ యాస్పర్స్, గేబ్రిల్ మార్సెల్, యునామ్యునోలు. రెండవ వర్గానికి చెందినవారు: హైడగెర్, సార్త్రె ఇంకా ఇతర ఫ్రెంచ్ అస్తిత్వవాదులు. ఇందులో ఏ ఒక్కరికంటెగూడ అస్తిత్వవాదం బహుళప్రచారంలోకి వచ్చింది సార్త్రె మూలానే.

అసలు అస్తిత్వవాదం బహు జటిలమైన సాంకేతిక దర్శనము. దీని సాంకేతికనిపుణులు, దార్శనికులు తప్ప అన్యులు అర్థం చేసుకోలేరంటాడు సార్త్రె. వివిధ అస్తిత్వవాదులు తమతమ సాంకేతిక పారిభాషిక పదజాలంతోనే తమతమ సిద్ధాంతాలను వివరించారు. ఈ బాటలోనే సార్త్రె తన వాదాన్ని (Existentialism and Humanism), ఇంకా (Being and Nothingness) అనే గ్రంథాలలో వివరించాడు. అయినా మరొక బాటలో - అంటె కాల్పనిక సాహిత్యం ద్వారా- ఎక్కువగ ప్రచారం చేశాడు. ముఖ్యంగా ఇతని (Nausea) అనే నవల అస్తిత్వవాద ప్రతిపాదకము. ఈ నవలత్రయ (The Age of Re son), Iron in the soul, The reprive (ఇవి నవలాత్రయం. చదవదలచుకొన్నవారు ఈ మూడింటిని ఈ వరుసలోనే చదవాలి). ఈ నవలాత్రికంలో, ''మనలను 'ఆనువంశికత' (Heridity) 'పరిసరాలు' (Environmenr) నియతం చేయడం లేదు; యాంత్రిక నియమాలతో జీవితాన్ని అర్థం చేసుకోలేము; మన జీవితార్థాన్ని, విధిని, కర్మను ఎన్నుకొనే, సాధించే పూర్తిస్వేచ్ఛ మనకు ఉంది, అని ప్రతిపాదించాడు. ఇతని నాటకాలు 'The flies' 'No exit and flies', 'The shadows', 'The chips are down', 'The devil and the good lord' మొదలైనవి అతనికి విస్తృతంగా పేరు తెచ్చిపెట్టాయి. ఇంకా ఈ దారిలోనే నడిచినవారు ఆల్బర్ట్ కామె (Albert camus), ఫ్రాంట్జ్ కాఫ్కా (Frantz kafka)లు అనే నవలాకారులు. ఆల్బర్ కామె రచనలు The outsider,

The plague, The fall, The rat లు. కాఫ్కా రచనలలో అస్తిత్వ ప్రతిపాదకాలు 'The trial', 'The castle' అనే నవలలు. ఈ ముగ్గురు నవలల ద్వారా అస్తిత్వవాదాన్ని ప్రతిపాదిస్తే, ఆడెన్ (Auden), ఇలియట్‌లు పద్యం ద్వారా, సెజానే, వాన్‌గాగ్, పికాసో, షాగల్, డిషిరియోలు చిత్రలేఖనం ద్వారా అస్తిత్వవాదాన్ని ప్రతిబింబించారు.

వీరి సమస్య అస్తిత్వమూలకాలైన వ్యక్తిక అంతరంగానుభవ అనన్యత, మానవదురవస్థ (Human predicament), 'అస్తిత్వవేదన' (Existential anxiety) లను అభివ్యక్తం చేయడం ఎలా? మామూలు మాటలు, భాష పనికిరావు. ఎందుకంటె మాటలు భాషల్లో 'బుద్ధిపాలు' ఎక్కువ అందుకనే భాషద్వారా హేతుబద్ధ విషయాలను, సూత్రాలను మాత్రమే అర్థం చేసుకోగలుగుతాము. మరి వీరు చెప్పదలచుకొన్న విషయాలు అనన్యమైనవి, అసాధారణమైనవి, సూత్రాలకు, హేతువుకు చిక్కనివి, భాషకు అందనివి. అందుకని అత్యంత సృజనాత్మకాలైన అంతర్బుద్ధి (Insight) ప్లావితాలైన కళాసాహిత్యరూపాల ద్వారా ఆ 'అనన్యత'ను అభివ్యక్తం చేయవచ్చునని భావించారు. ఫలితమే వారి కాల్పనిక సాహిత్యం, కళాఖండాలు. అందుకే అస్తిత్వవాదం వ్యక్తిగతలేఖలకు, డైరీలకు, స్వీయచరిత్రలకు, నవలలకు, నాటకాలకు, చిత్రలేఖనానికి ప్రాముఖ్యత ఇచ్చింది. దీనిలో ముఖ్య ఉద్దేశం, వ్యక్తి పొందిన అనుభవాన్ని, చెక్కుచెదరకుండ ఏ మార్పుకు లోనుకాకుండ, యథాతథంగా, ఉన్నది ఉన్నట్లుగా, శ్రోత ద్రష్టల అంతరంగానుభవంగా ప్రతిష్ఠించాలి. మామూలుగ అయితే మనం ఎప్పుడూ ఎదుటివాని అనుభవాన్ని ఏ మార్పు లేకుండ, దాని అనన్యతతో సహా, అర్థం చేసుకోలేము. అందుకే వీరు బౌద్ధిక విశ్లేషణను విశ్వసించక బెర్గ్‌సన్, ఓచేలలా అంతర్దృష్టి (Insight)కి ప్రాముఖ్యత నిస్తారు. వివేచన (Reason) ద్వారా జీవితం అభివ్యక్తం కాదని అస్తిత్వ విశ్లేషణం (Existential analysis) ద్వారా మాత్రమే వ్యక్తమవుతుందని వీరి భావన.

అస్తిత్వవాదం నైతికశూన్యతకు దారి తీస్తుందని విమర్శ బయలుదేరింది. ఎందుకంటె సనాతన నీతివాదులను సార్త్రె తన నవలలో అపసామాన్యవ్యక్తులుగా చిత్రిస్తాడు. Age of reason అనే నవలలో నాయకుడు ఒక కళాశాలలో ఆచార్యుడు. అతని ఆదర్శం పూర్తి స్వేచ్ఛ అతడు తన రాత్రి జీవితాన్ని ఎక్కువగ నైట్ క్లబ్‌లలో గడుపుతాడు. అతని కొక కడుపుతో ఉన్న ఉంపుడుగత్తె ఉంటుంది. మరి ఆమెను పెళ్ళి చేసుకోవడానికి మాత్రం అతడు ముందుకు రాడు. అంటే అతడు స్వేచ్ఛ పేరుతో బాధ్యతలు స్వీకరించని సనాతనుడు ఇతని నవల్లోనూ పీడనకామం (Sadism), స్వపీడనకామం (Masochism), సజాతిలైంగికత (Homosexuality)ల వర్ణన విపులంగా ఉంటుంది. సదాచారాలను, సుగుణాలను ఉన్నతంగా భావించే సనాతన నీతివాదుల కంటె భిన్నదృక్పథాన్ని అవలంబిస్తాడు.

సార్త్రె సృష్టిలో మానవునికి వెలుపల విలువలు లేవు. విలువలను మనిషి సృష్టించాడు. వాటికి విషయగతమైన శాశ్వత ప్రాతిపదిక ఏమీ లేదు. తనను తన విలువలను సృష్టించుకొనే స్వేచ్ఛ మనిషికి ఉంది. మరి ఈ అర్థంలో మనిషి ఏపని చేసినా తప్పు లేదు. మనిషి నిజంగా మంచి చెడులకు బాహ్యుడు. అయితే దీనితో అతని బాధ్యత పెద్దదవుతుంది. అస్తిత్వం సారం కంటె ముందు కనుక, మనిషి తనను తాను సృష్టించుకొంటున్నాడు గనుక, తనను తాను ప్రక్షేపించుకొంటున్నాడు గనుక, తన 'విధికి' తన 'కర్మ'కు బ్రహ్మ కాక తనే 'కర్త' అవుతున్నాడు కనుక, అతని ప్రతి చేష్టకు, పనికి అతనిదే పూర్తి బాధ్యత అవుతుంది. తనకు తాను బాధ్యత వహించవలసి ఉంటుంది. ఇక్కడ మనం గమనించవలసింది తనకు తాను బాధ్యత వహించడమంటే అందరికీ బాధ్యత వహించడము. అతడు తనను తాను సృష్టించుకొంటున్నాడంటె, ప్రతి ఒక్కరు తమను తాము ఎంపిక చేసుకొంటున్నారు. దీనిని బట్టి అతని కోసం అతడు ఎంపిక చేసుకొంటున్నాడంటే అతడు అందరి కోసం ఎంపిక చేసుకొంటున్నాడన్నమాట దీనినో దానినో ఎంపిక చేసుకొంటున్నాడంటె ఎంపిక చేసుకొన్నదానికి విలువ అబ్బింది. అతనికి విలువైనది, మంచిది అందరికీ విలువైనది, మంచిది అవుతుంది. అస్తిత్వం సారంకంటె ముందు కనుక నన్ను నేను సృష్టించుకొంటూపోతే-అంటే నా ప్రతిమను నేను మలచుకొంటూపోతే, నేను మలిచిన ప్రతిమ అందరికీ ప్రామాణికమవుతుంది. ఈ విధంగా నా బాధ్యత నావరకేకాక మానవాళికి మొత్తానికి సంబంధించినదవుతుంది. నాకు పెళ్ళి చేసుకొని పిల్లల్ని కనాలని ఉంది. అంటే నేను ఏకపత్నీవ్రతాన్ని ఎంపిక చేసుకొన్నాను. నేను ఈ వ్రతానికి బద్ధుడనవుతున్నానంటె నా అంతర్గత ఉద్దేశం అందరూ ఏకపత్నీవ్రతులు కావాలనే. అలా వారంతా ఏకపత్నీవ్రతం అవలంబించకపోతే నా ఏకపత్నీవ్రతం ఏమవుతుంది? అలాగే నేను దొంగతనం చేయరాదనే నిర్ణయం తీసుకొన్నానంటే నేను అందరి తరపున ఆ నిర్ణయం తీసుకొన్నాను. అలాగే నేను కమ్యూనిస్టు పార్టీలో చేరానంటె, నా ఉద్దేశం అది అందరికీ మ

అందరూ అందులో చేరాలని. నాకోసం నేను నిర్ణయం తీసుకోవడంలో ఆ నిర్ణయం ప్రాథమికంగా అందరికోసం తీసుకొంటున్నాను. ఈ విధంగా నా బాధ్యత బృహత్తరమైనది. నాకు నేను బాధ్యుడను; అంతే కాదు. మానవునికే బాధ్యుడను. నేను ఒకరకం మానవప్రతిమను. నేను 'ఉండవలసి'నట్లు నన్ను నేను మలుచుకొంటున్నాను. నన్ను నేను మలచుకోవడంలో మనిషినే మలుస్తున్నాను.

ఇది అస్తిత్వవాదులు వాడిన 'వేదన' (Anguish), 'విసర్జన' (Abandonment), 'నిరాశ' (Despair) లాంటి పదాలను అర్థం చేసుకోవడానికి పనికి వస్తుంది. అస్తిత్వవాదం ప్రకారం మనిషి 'వేదన'లో ఉంటాడు. 'వేదన' అంటే ఏమిటి? మనిషి ఏదైన ఒక నిర్ణయాన్ని తీసుకొన్నప్పుడు - ఆ నిర్ణయం చేయడం ద్వారా, తనను తాను మలచుకోవడంతోపాటు మానవాళికే శాసనకర్త అయ్యానని గుర్తించినప్పుడు - పరమ, సంపూర్ణ బాధ్యతలనుంచి తప్పించుకోలేడు. అంతటి ప్రగాఢబాధ్యతతో బరువు ఎక్కువై 'వ్యాకులత' (Anxiety) లేదా 'వేదన' పొందుతాడు. కొంతమంది మాకు అలాంటిదేమీ లేదంటారు. కాని అది శుద్ధ అబద్ధము. కాకపోతే వారు ఆ వేదనను కప్పి పుచ్చుకొంటారు. వారు, మాకోసం మేము నిర్ణయాలు తీసుకొంటున్నాము. కాని ఇతరులకోసం కాదు,' అని అంటున్నారు. 'అందరూ అలాగే అనుకుంటె ఏమవుతుంది?' అని వారిని అడిగితే 'అందరూ అలా చేయరుగా?' అంటారు వారు. ఎలాగంటె వెనకటికి ఒక రాజుగారు ఒక ఊరిలోని వారందరిని సంతర్పణ కోసం పాలు తెమ్మంటె, 'నేను ఒక్కడినే కదా నీళ్ళు పోసేది, అందరూ పాలే పోస్తారు', అని భావించినట్లు ఉంటుంది. అందరూ నీళ్లు తెస్తే ఏమవుతుందని అతనిని అడిగితే, 'అందరు అలా ఎందుకు చేస్తారు?' అని అతడంటాడు. అంటె అతని ఉద్దేశం మిగతా అందరూ పాలు తేవాలనే. అంటె అందరి తరఫున అతడు నిర్ణయం తీసుకొన్నాడు. 'నా కోసమే నేను నిర్ణయం తీసుకొంటున్నాను, ఇతరుల కోసం తీసుకోవడం లేదు'-అనే కల్పిత పెట్టె ఆలోచన నుంచి తనను తాను మోసగించుకొంటే తప్ప తప్పించుకోలేడు. ఏ ముసుగు ద్వారా తప్పించుకోవాలనుకొంటున్నాడో, ఏ అబద్ధం ద్వారా తప్పించుకోవాలనుకొంటున్నాడో, ఆ ముసుగు ఆ అబద్ధం అతని వేదనను బయలు పెడతాయి. ఎందుకంటె అసలు మిథ్యాభాషణం దేనిని నిరాకరిస్తుందో ఆ సార్వత్రిక విలువ అంతర్గతంగా అందులోనే ఉంది.

నేను మానవాళి తరఫున నిర్ణయాలు తీసుకొంటున్నాను. నేను నిర్ణయాలు తీసుకోవడానికి తగిన వ్యక్తిననడానికి ఋజువు ఏముంది? ఒకవేళ ఏదైన దేవి చెప్పిందందామా, అది దేవి చెప్పిందో లేదో గూడ నిర్ణయించవలసింది నేనేనాయె. ఒకపని మంచిదన్నానంటె, 'ఆ పని మంచిది, చెడ్డది కాదు,' అని నిర్ణయించింది నేను. అయినా ప్రతిక్షణమూ ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉండే పనులనే నేను చేయవలసి ఉంది. ఈ ప్రపంచంలో ఎవడు ఏది చేసినా, మానవాళి అంతా తన ప్రవర్తన మీద ఆధారపడి నడుస్తుందన్నట్లు భావించి చేస్తాడు. కనుక ప్రతివాడు ప్రశ్నించుకోవాలి; మానవాళి అంతా నా ప్రవర్తన మీద ఆధారపడి దిద్దుకొనేవిధంగా ప్రవర్తించే హక్కు నాకు ఉన్నదా? ఈ ప్రశ్న వేసుకోనివాడు 'వేదన'ను కప్పిపుచ్చుతున్నాడు. ఒక పనిని చేయడానికి అనేక అవకాశాలుంటాయి. అందులో ఒక అవకాశాన్ని ఎంపిక చేసుకొన్నామంటే, ఎంపిక చేసుకోవడంవల్లనే ఆ అవకాశానికి విలువ వచ్చింది. ఈ నిర్ణయాలు తీసుకోవడంలోనే ప్రతివానికి వేదన ఉంది. ఈ వేదనలోనే ఇతరులయెడ తనకున్న 'బాధ్యత' అభివ్యక్తమవుతుంది.

అస్తిత్వవాది వాడే మరొక పదం 'విసర్జన' (Abandonment). ఇక్కడ 'విసర్జన' అంటే దేవునికి అస్తిత్వం లేదనడము. అతడి అభావం ఆధారంగా ఫలితాలను చివరివరకు తీసుకొనిపోవటము. 'దేవుడు లేనట్లయితే ప్రతిదీ అనుమతించబడుతుంద'న్నాడు డాస్టోవిస్కీ. ఇది అస్తిత్వవాదానికి ఆరంభము. దేవుడు లేకపోతే మనిషి 'అనాథ' అవుతాడు. ఎందుకంటె అతనికి బయట, లోపల గూడ ఆధారపడడానికి ఏమీ లేదు. ఆలంబనమే లేదు. వెంటనే అతనికి తను కారణం లేకుండ ఉన్నట్లు అర్థం అవుతుంది. 'అర్థం' (సారం) కంటె, అస్తిత్వం ముందు కనుక మనిషి చర్యలను వివరించడానికి మానవ స్వభావ, ప్రమాణాదులేమీ లేవు. అంటే పూర్వ నిశ్చితమైనదేదీ లేదు. అంటె మనిషికి 'స్వేచ్ఛ' ఉంది. అసలు మనిషే స్వేచ్ఛ. దేవుడు లేడు గనుక, మానవప్రవర్తనను నిర్దేశించే చోదనలు, విలువలు, ప్రమాణాలు ఏమీ లేవు. కనుక మనకు 'ముందు, వెనుకలు' గూడ లేవు. ఏ అర్థమూ విలువ లేవు. ఏ కారణం లేకుండ మనం ఇక్కడ 'ఏకాకులు'గ వదలివేయబడ్డాము. ఇదే సార్త్రె మనిషికి స్వేచ్ఛ నుంచి విముక్తి లేదు.' (Man is condemned to be free) అనడంలో అర్థము. విముక్తి లేదు. ఎందుకంటె అతడు తనను తాను సృష్టించుకోలేడు. అతడు త్రోయబడ్డాడు. అప్పుడతడు స్వేచ్ఛలో ఉన్నాడు. ఆ క్షణంనుంచి అతడు చేసిన ప్రతిదానికి అతడే బాధ్యత వహిస్తున్నాడు. కనుక అస్తిత్వవాది చెప్పేదేమంటే ప్రతి మనిషి ఏ ఆధారం

లేకుండ. ఏ సహాయం లేకుండ ప్రతి క్షణము తనను తాను మలుచుకోవడం, సృజించుకోవడం తప్ప గత్యంతరం లేదు. అందుకని మనిషే మనిషి భవిష్యత్తు (Man is the future of man). రెండింటిలో ఏకో ఒకటి - మహా చక్రవర్తి, మహాజ్ఞాని - కావలసిన సిద్ధార్థుడు ప్రపంచంలో కొన్ని సంకేతాలను - వృద్ధాప్యం, శవం, రోగం-చూసి ప్రపంచం దుఃఖమయమని, దుఃఖాన్ని తొలగించాలని బుద్ధుడయ్యాడు. బుద్ధుడు కావడానికి ఆ సంకేతాలకు 'అలా' అర్థం చెప్పుకొన్నదెవరు? సిద్ధార్థుడే. ఆ నిర్ణయానికి కర్తృత్వం అతడిది కాదని ఎవరూ అనలేరు. ఆ సంకేతాలకు 'అలా' అర్థం చెప్పుకోవడంలో పూర్తి బాధ్యత అతడిదే. 'విసర్జన'లో ఉన్న అంతరార్థం ఇదే - మన బ్రతుకును మనమే నిర్ణయించుకొంటాము.

ఇకపోతే 'నిరాశ' (Dispair). దీనికి అర్థం ఏమిటంటే, మనం మన సంకల్పాలలో ఏముందో అవి మేరకే మనలను మనం పరిమితం చేసుకొంటాము - అంటే చేయదలచుకొన్న పనిని సాధ్యం చేసే 'సంభావ్యతల' (Possibilities) వరకే పరిమితులమవుతాము మనం ఏపని చేయాలన్నా ఈ 'సంభావ్యతా' మూలకమనేది తప్పనిసరిగా ఉంటుంది. నేను ఇంటినుంచి కళాశాలకు బయలుదేరేటప్పుడు, కళాశాల అక్కడే ఉంటుందని, దారిలో నా సైకిలు పంక్చరు పడదని, ప్రమాదానికి గురికానని ముందుగా నాలో ఆ భావనలు దత్తాంశాలుగ ఉంటాయి. ఈ పూర్వకల్పనలు (Presuppositions) నాకు ఆధారభూతాలు. ఈ నా సంకల్పానికి, పనికి సంబంధించని సంభావ్యతలు ఈ ప్రపంచంలో అనేకం ఉండవచ్చు. అమెరికాలో పెనుగాలి వీచింది. నా కాలేజీకి వెళ్ళడానికి దానికి సంబంధం లేదు. నేను కళాశాలకు వెళ్ళడం వెళ్ళకపోవడం దాని మీద ఆధారపడి లేదు. ఎందుకంటె ఈ ప్రపంచంలోని ఏ ఇతర సంభావ్యతలను నా సంకల్పంతో (కళాశాలకు వెళ్ళడంతో) ముడిపెట్టడానికిగాని, నా సంకల్పానుగుణంగా మార్చడానికిగాని ఏ భగవంతుడుగాని, పూర్వనిర్దిష్ట ప్రణాళికగాని లేవు. 'ప్రపంచాన్ని కాదు, నిన్ను నీవు జయించుకో' అనడంలో దేకార్తు (Descartes) అసలు ఉద్దేశం ఇదే - 'మనం ఆశ లేకుండ పని చేయాలి.'

సార్త్రి ప్రకారం మానవజీవితాన్ని ఒక్క అస్తిత్వవాదమే సాధ్యం చేస్తుంది. మనకు నిజంగా తెలిసేది ఒక్క అస్తిత్వమే. మన అనుభవంలోకి వచ్చే ఈ బాహ్య ప్రపంచం వెనుక నిజంగా 'సారం' పారమార్థిక సత్యం, (బ్రహ్మపదార్థం) ఏదీ లేదు. అందరికీ కాకపోయినా సార్త్రికు 'సారం కంటె అస్తిత్వం ముందు.'

వెలుపల దూరంగా ఉన్న దేనిమీదో (దేవుడు) మనిషి ఆధారపడ్డాడంటే అతడంగీకరించడు. మనిషి ఉన్నాడు; అంతే మనిషి ఆరంభంలో పూర్వసిద్ధం (Readymade) కాదు ఆ తరవాత అతడు తనను సృజించుకోవాలి ఏ పరిస్థితులలో బ్రతకాలో ఎంపిక చేసుకోవాలి. మానవస్వభావం అంటూ ముందుగా ఒకటి లేదు. ఎందుకంటె ఆ భావనను ఊహించగల దేవుడు లేడు. 'అస్తిత్వలంఘనం' (Existential leap) చేసిన తరవాత మానవుడు తనను తాను సంకల్పించుకొంటాడు. తదనుగుణంగానే అతడు తయారవుతాడు. అతడు తన అంతర్గత 'వనరుల'మీద ఆధారపడవలసిందే. ఈ ప్రపంచంలో అతడు తన స్వేచ్ఛాస్థితిలో సంకల్పించుకొన్న సృష్టించుకొన్న 'అర్థం'కంటె మరో అర్థం ఉద్దేశాలు లేవు. మానవుని అస్తిత్వం యాదృచ్ఛికం. అదృష్టము. ఈ సత్యాన్ని కాదనడానికి దేవుణ్ణి ప్రతిపాదించి ఉపయోగం లేదు.

కొన్నిసార్లు సార్త్రి జీవితాన్ని విషాదమయంగా చూస్తాడు. మానవుడు తన ఏకాంతంలో వేదన భీతులను అనుభవిస్తాడు. అతని ముందున్న శూన్యాన్ని-మరణాన్ని-చూసి భయపడతాడు. జీవితం విరోధ, ద్వేషాలతో ప్రభావితమవుతుంది. 'ఇతరుడు' (The other) అనేవాడు నిన్ను గురించి పట్టించుకోని 'కొత్తవాడు', లేదా నీపై ఆధిపత్యం చెలాయించాలనుకొనే శత్రువు'. కొంతమంది ఈ (మానుష) 'బరువు'ను వదిలించుకోవడానికి బాధ్యతను దేవునిమీ కి, అనువంశికత (Heredity) మీదికి, పరిసరం (Environment) మీదికి, పదిమంది మీదికి త్రోసివేస్తారు. ఈ రకంగా ముక్తి సంపాదించడం - బాధ్యత వదిలించుకోవడం - విఫలం కాక తప్పదు. మానవుడు తనను తాను ముక్కలు ముక్కలుగ, పరస్పర వైరుద్ధ్యాలతో అనుభవించినా, అతనికి 'అవశ్యస్వేచ్ఛ' ఉంది. అందుకని అతని చేతలకు, నిర్ణయాలకు బాధ్యత అతనిదే. ఈ రకమైన స్వేచ్ఛ మనిషిని కర్తను చేసి అతని ప్రతిష్ఠను, గౌరవాన్ని ఇనుమడింప జేస్తుందని సార్త్రి విశ్వాసము.

## గేబ్రియల్ మార్సెల్ (Grabriel Marcel)

మార్సెల్ ఫ్రాన్సుకు చెందిన దార్శనికుడు. ఇతని తత్త్వం సార్త్రి, హైడెగర్‌ల తత్త్వంకంటె భిన్నమైనది. ఒకవిధంగా ఇతడు కీర్‌కెగార్డ్, యాస్పర్‌లకు దగ్గరవాడు. 'నేను కీర్‌కెగార్డ్, ఇంక ఇతర అస్తిత్వవాదుల దర్శనాలు చదివాను. కాని వాటిని చదవేనాటికే నా దార్శనిక సరళి రూపురేఖలు దిద్దుకొంది,' అని చెప్పుకొన్నాడు. అప్పటప్పుడు చాలమంది ఆయన తత్త్వాన్ని 'క్రైస్తవ అస్తిత్వ

వాదం' అంటారు. కాని 'నా వాదం క్రైస్తవేతరులకూ నచ్చుతుంది' అంటాడు. అతనికి మతమంటె విశ్వాసము. అయితే ఆ విశ్వాసం సనాతనం, అంధం కాదు. ఉదారమైంది. అయినా అతని దృక్పథం మాత్రం తాత్త్వికము. అతని ఆసక్తి చూరగొన్న విషయాలు దర్శనాలు, సంగీతం, నాటకాలు వ్రాయడము.

అసలు దర్శనశాస్త్రం 'మానవ దురవస్థ' (Human Predicament)ను గురించి అధ్యయనం చేయాలంటాడు మార్సెల్. అతడు అతి ముఖ్యమైన రెండు ప్రశ్నలు వేసుకొని, వాటికి సమాధానం చెప్పుకొనే ప్రయత్నం చేస్తాడు. 'నే నెవరిని ?' 'అస్తిత్వం లేదా భవం అంటె ఏమిటి ?' (Who am I? and what is being?) అనేవి ఆ రెండు ప్రశ్నలు. అయితే ఈ ప్రశ్నలకు సమాధానం అతడు ఎక్కడ ఒక క్రమపద్ధతిలో చెప్పడు. అతని డైరీలలో, నాటకాలలో, పత్రికలలో అతని భావాలు కనిపిస్తాయి. అతడు క్రమపద్ధతిలో చెప్పింది ల్లా అతడు వ్రాసిన 'అస్తిత్వమర్మం' (The mystery of being) అనే రెండు సంపుటాల గ్రంథంలోనే.

మార్సెల్‌కు దర్శనమంటె 'ఒక అసాధారణ అవ్యవహిత ఆవశ్యకత', 'ఒక అంతరంగ కల్లోలితార్థం'. దార్శనికుడు, విజ్ఞానశాస్త్రవేత్తవలె వస్తుగతంగా ప్రపంచాన్ని దర్శించలేడు. ఎందుకంటె అతడు తను జీవించే సత్యంతో నిరత సజీవసంస్పర్శను పెట్టుకోవాలి.

మానవుని సమగ్రతను, సంపూర్ణతను కాదని ఏకశాఖీయంగా అర్థం చెప్పే ఏ దర్శనాన్ని అతడు అంగీకరించలేడు. 'మీరు నా తత్త్వాన్ని సరిగా అర్థం చేసుకొంటే, దాని అంతా గూడ అపరివర్తనీయ, అంధ, నిరత అమూర్తీకరణ స్వభావం మీద అని గ్రహిస్తారు'. ఈ విధంగా అతడు హేతువును జీవితం కంటె, అనుభవంకంటె పైన ఉంచే హేతువాదాన్ని తిరస్కరించాడు. అలాగే 'మనిషి అంటె ఇంద్రియానుభవం తప్ప మరేమీ కాదు,' అనే అనుభవవాదాన్ని నిరసించాడు. అతడంటాడు, 'ఈరోజు మనం ఒక విచిత్రమైన ప్రపంచంలో, సమాజంలో నివసిస్తున్నాము. ఈ ప్రపంచంలో నిజమైన ఐక్యత (Real unity) లేదు. ఒట్టి పృథక్కృత ఖండప్రపంచము. అంటే ఒక దానితో ఒకటి పొంతన లేని ముక్కల ముక్కల ప్రపంచము. అదీకాక మన సమాజం 'రాశిసమాజము' (Mass society). ఈ సమాజం మనిషిని 'నిమూర్తీకరిస్తుంది. (Depersonalise); నిమానవు (Dehumanise)ని చేస్తుంది. మనిషి ప్రత్యేకతలను, సౌభ్రాతృత్వాన్ని, సృజనాత్మకతను లుప్తం చేస్తుంది.'

అధిభౌతికశాస్త్రానికి సంబంధించిన సమస్య 'నే నెవరిని ?' అనేది. ఈ సంసారానికి అర్థం తెలుసుకోవడం, 'నే నెవరినో' తెలుసుకోవడం అంత తేలికైన విషయం కాదు. ఎందుకంటె అవి 'ప్రజ్ఞ' (Intellect)కు అందేవి కావు. అందుకే అతడు మామూలుగా ప్రపంచాన్ని 'తెలుసుకోవడానికీ, 'దర్శించడాని' (Revelation)కి తేడా చెబుతాడు. అంటే దీనిని అర్థం చేసుకోవడానికి 'సమస్య' (Problem)కు, 'మార్మికత' (Mysticism)కు మధ్య తేడాను తెలుసుకోవాలి. అతని దృష్టిలో సమస్య అనేది 'విషయనిష్ఠ' మైనది.

వస్తుగతవిషయాలన్నింటిని 'ప్రజ్ఞ' పరిష్కరిస్తుంది. మరి మార్మికత అలా కాదు. దీనికి అలాంటి పరిష్కారం ఏదీ ఉండడానికి వీలు లేదు. కారణం ఏమిటంటే దీని పరిధిలోనే 'కర్త' (Subject) గూడ ఉంటుంది. అందువలన దీనిని పూర్తిగ వస్తుగతంగా చూడలేము. అస్తిత్వంలో, ఉదాహరణకు, సమస్యను పరిష్కరించవలసిన 'నేను' గూడ ఉన్నాను 'నేను'తో కలిసి ఉన్న అస్తిత్వాన్ని. నా పరిశీలనకు. నా ధ్యానానికి 'కర్మ' (Object)గా ఎలా చేయగలను ? ఈ విధంగా అస్తిత్వం ఒక మర్మం అవుతుందేగాని సమస్య గాదు. దీనిని సమస్యవలె పరిష్కరించలేనిమాట నిజమే కాని అది అవ్యవహిత (Immediate) సంస్పర్శ ద్వారా, సహఅనుభవం (Participation) ద్వారా ఆవిష్కరించబడవచ్చు.

ఈ రకమైన అవ్యవహిత సంస్పర్శ మనకు మానసిక జీవితం అట్టడుగున కనిపిస్తుంది. ఒక వస్తువును చూచి, దానిని ఆ వస్తువుగా గ్రహిస్తున్నప్పుడు, అంటే వస్తువులను మన సంవేదనల (Sensation) ద్వారా తెలిపికొంటున్నప్పుడు, సంవేదనలో 'నేను', 'ఆ వస్తువు' ఒకటే అవుతున్నాము. 'నేను' 'అది' వేరు వేరు కాదు. ఆ సమయంలో 'జ్ఞాతృజ్ఞేయాలు' 'కర్త-కర్మ'లు అనే ద్వంద్వం లేక అవ్యవహిత సహ-అనుభవం' (Immediate participation) ఉంటున్నది. ఇలాంటి సంబంధమే నేను నా శరీరాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడంలో ఉన్నది. నా శరీరం నాకు పరికరంగాని, వస్తువు (Object)గాని కాదు. నేను నా శరీరం తాదాత్మ్యలు. అయినా అది 'కర్త' (Subject) కాదు. అలాగని నా శరీరం నాకు చొక్కాలాంటిది కాదు. అలాగని నేనే శరీరం అని (కర్తలా) చెప్పలేను. నా శరీరం నా కర్తృ ఆత్మకంటె భిన్నమైనదే కాని, అది నాకు దూరమైనది కాదు. నేను దేహధారణం (అవతారం) చేస్తున్నాను. ఈ విధంగా నేను మరొకదానితో అవ్యవహిత సహ-అనుభవాన్ని పొందుతున్నాను. అస్తి

త్వం అంటె అటువంటి 'ఆకారం', అటువంటి 'సహ అనుభవము.'

అందుకే అతడు 'కలిగిఉండడం' (Having)కు 'అస్తిత్వం' (Existance)ల మధ్య విభజనను చేయు తాడు. 'కలిగిఉండడం'లో నాకు నాకంటె వెలుపలి మరొక వస్తువుతో సంబంధం ఏర్పడుతున్నది ఉదాహరణకు 'నాకు కలం ఉన్నది' లో వలె. అస్తిత్వం అంటె 'నాకు ఏమి ఉన్నదో అది కాక', 'నేను ఏమిటో అది', అందుకని అస్తిత్వం నా స్వభావానికి సంబంధించినది. అందులో సహ అనుభవం ఉంటుంది. మామూలు భౌతిక అస్తిత్వం కంటె కొంత అధిగమించిన అస్తిత్వం ఉంటుంది. బ్రతికి ఉన్నవాడు ఎవడు 'కలిగిఉండట'ను పూర్తిగ పరిహ రించలేడు. అది అంత వాంఛనీయం గూడ కాదు. కాని ప్రమాదం ఎప్పుడు వస్తుందంటె మన అనుభవంలో 'కలిగి ఉండు' అంశానికి ప్రాధాన్యమిస్తాము. కనుక 'కలిగి ఉండు' అనుభవంనుంచి అస్తిత్వానుభవానికి చేసే పయనంలో పూర్తిగ 'కర్త' (Self)కే అంటిపెట్టుకొని ఉండడం కాని లేదా 'కర్మ' (Object)కే అంటిపెట్టుకొని ఉండడం కాని కూడదు.

అసలు మార్సెల్ తత్త్వంలో మౌలికభావనలు, 'సహ అనుభవం', అధిగమనము (Transcendance), అస్తిత్వం అనేవి. ఈ పృథక్కృత ప్రపంచంలో అర్థరహితస్థితినుంచి పర్యాలోచనాపరుడైన మానవుడు అర్థసహితస్థితికి అధిగ మిస్తాడు. ఈ పయనంలో అతడు మొదటగ తాను ఒక మూర్త సన్నివేశానికి బంధితుడనయ్యానని – అంటే తాను ఒక శరీరానికి కట్టివేయబడ్డానని, పదార్థంలో కూరుకు పోయానని, ఒక చారిత్రక సన్నివేశానికి బందీనయ్యానని (పుట్టిన ప్రతివాడు ఎక్కడో ఒకచోట – ఒక ప్రదేశంలో – ఎప్పుడో ఒకప్పుడు – ఒకతేదీన – పుట్టాలి. అంటె అతనికి చారిత్రక కాలదేశాలుంటాయి) గుర్తించాలి. ఈ శరీరం నాకు వెలుపల లేదు. దీనికంటె నేను వేరే స్వతంత్రంగా లేను అయినా నేను కేవలం ఈ శరీరాన్ని మాత్రమే కాదు ఈ దేహం ద్వారా చుట్టూ ఉన్న ఈ ప్రపంచంతో వ్యాపారం చేస్తున్నాను. అంటె పరిసరంతో నిరంతరానుభూతిని (ఇంద్రియానుభూతిని) పొందుతున్నాను. ఈ విధంగా అతడు ప్రపంచంతో నాకు ఉన్న సంబంధాన్ని వ్యక్తం చేయ డానికి 'అవతారం' (నేను ఈ శరీరంలో అవతరించాను) అనే పదాన్ని ఉపయోగిస్తాడు. నేను ఈ శరీరంలో అభి వ్యక్తం కావడం ద్వారా ప్రకృతి, ప్రపంచం నా ద్వారా అభివ్యక్తమయింది. మనిషి వస్తుగతస్వభావాని (Objection nature)కి సంబంధించినవాడే అయినా అంతకంటె భిన్నుడు. అతనికి జాగ్రుతి ఉంది. జీవితాన్ని, తాను చేసిన కర్మల ఫలాఫలాలను బేరీజు వేసుకోగలడు.

మనస్సు-శరీరం, ప్రకృతి-పురుష, దేహం-ప్రాణం. కర్త-కర్మలాంటి ద్వైతాన్ని మార్సెల్ అంగీకరించడు. అసలు ఈ ద్వైతాన్ని సనాతనులు ప్రతిపాదించారు. వాస్త వానికి అతని దృష్టిలో 'సత్యం' ద్వంద్వాలకు – 'కర్త-కర్మ'లకు అతీతమైంది. సహభోగిగా మానవుడు ప్రేక్షకు నిగా మానవునికంటె భిన్నుడు. ప్రేక్షకుడు నిష్క్రియా త్మకంగా ఉంటాడు. సన్నివేశానికి వివృతమై ఉంటాడు. మరి సహభోగి అలా కాదు. తను ఎదుర్కొనే సన్నివేశం లోకి వివృతమై దానితో నంలీనం చెందడానికి అనువై ఉంటాడు. ఆ ఏకానుభూతిలో కర్త-కర్మల భేదభావం ఉండదు. అనుభూతి, ధ్యానంద్వారా ఈ సహ అనుభవం జరుగుతుంది. ఒక దివక మనం వస్తుమయప్రపంచంతో పరిస్పందర్య నెరపుతూ ఉంటాము. మరో దివక 'కర్మ' ను అధిగమించి ప్రార్థన, ధ్యానం ఏకాగ్రతలద్వారా అధి భౌతిక వాస్తవిక సత్యాన్ని చేరుతాము. ఇక్కడ సంలీనం అనేది తన అస్తిత్వాన్ని కోల్పోకుండానే లోపలికి చొచ్చుకు పోవడము 'సహభోగం' అనేకస్థాయిలలో ఉంటుంది. ఉన్నతస్థాయిలో 'కేవలత్వమ్' (Absolute thow) లేదా దేవునితో సంబంధాన్ని పెట్టుకొంటుంది. దేవుణ్ణి తిరస్క రించడం అస్తిత్వాన్ని తిరస్కరించడమే.

మార్సెల్ దృష్టిలో, మానవుడు నిజమైన స్వేచ్ఛను తనకున్న సుసంపన్న అంతర్దృష్టి, ఆవిష్కృతికి అవకాశా లను గుర్తించినప్పుడే పొందుతాడు. మానవుడు ఆశా విశ్వాసాలను, ప్రేమను వివృతమైనప్పుడు నిజమైన స్వేచ్ఛను పొందుతున్నాడు. స్వేచ్ఛ తనకంటె అవలిదానిని సూచిస్తుందని-అంటే అధిభౌతిక వాస్తవికతను సూచిస్తుం దని అతడు అర్థం చేసుకొన్నప్పుడు నిజమైన స్వేచ్ఛను అనుభవిస్తాడు. ప్రేమ ప్రజ్ఞలు స్వేచ్ఛను సంబంధించినవే.

## అస్తిత్వవాదం – ఒక పర్యాలోచన :

ఇంతవరకు మనం అస్తిత్వవాదంపై జరిపిన పరిశీల నాన్ని బట్టి అది ఒక క్రమబద్ధమైన దర్శనం కాదని గ్రహి స్తాము అస్తిత్వవాదం ఒకటి కాదు, అనేకం అనవచ్చు. ఎందుకంటె వివిధ దార్శనికులు తమతమ దృక్పథాలనుంచి సిద్ధాంత ప్రతిపాదనం చేశారు. అందుకే అది వివిధ దృక్ప థాలను వైవిధ్యాన్ని ప్రతిబింబిస్తుంది. అయినా వారు అందరూ ఏకీభవించిన కొన్ని అంశాలు లేకపోలేదు. అందులో ఒకటి వీరంతా నేటి ప్రపంచంలోని పృథక్కర ణాన్ని, అనైక్యతను, వైవిధ్యాన్ని దర్శించారు. ఈ నాడు

మానవుడు ఎలా ఏకాంతాన్ని, వైమనస్యాన్ని (Alienation) అనుభవిస్తున్నదీ ఎత్తిచూపారు. తన అంతరంగానికి (ఆత్మకు) తాను ఎలా దూరం అవుతున్నాడో, తోటి వారికి ఎలా కొత్తవాడు అవుతున్నాడో, అసలు ప్రపంచానికే ఎలా దూరమవుతున్నాడో కళ్ళకు కట్టినట్లు వివరించారు.

వీరు కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు వేశారు. 'మనిషి ఏమిటి?' అస్తిత్వానికి (సంసారానికి) అర్థం ఏమిటి? మానవుని అంతిమ విధి (Destiny) ఏమిటి? ఈ ప్రపంచంలో మానవుడు పరిపూర్ణత ఎలా పొందుతాడు? వ్యక్తి (Individual) మూర్తి (Person) గావడంలో అర్థం ఏమిటి? (వ్యక్తి సమాజంతో ప్రతిస్పందిస్తాడు. ఆ ప్రతిస్పందనతో కొన్ని అనుభూతులు పొందుతాడు. ఈ అనుభూతులతో, అనుభవాలతో అతనికొక విశిష్ట 'మూర్తిమత్వం' రూపొందుతుంది. వ్యక్తి అంటె పట్టి ఖాళీ మనిషి మూర్తిమత్వం రూపొందిన తరవాతనే వ్యక్తి మూర్తి అవుతాడు. (Individual becomes a person.)

వీరంతా సనాతనదర్శనాలను వ్యతిరేకించారు. పూర్వీకులు ఊహాసంబంధమైనవేవో కొన్ని ప్రశ్నలు వేసుకొని, వాటికి సమాధానాలు చెప్పుకొంటూ, దర్శననిర్మాణం సాగించడంలో అత్యంత ముఖ్యమైన మానవ అస్తిత్వ సమస్యలను విస్మరించారు. ఫలితంగా దర్శనాలు సూత్రాలు ఏవీ ఆచరణాత్మక జీవితానికి ఉపయోగపడకుండా పోయాయి. ఆచరణలో ఏ రెండు సమస్యలూ మున్ముమ్మూర్తులా ఒకటిగా ఉండవు గనుక, సూత్రాలు దర్శనాలు అన్నీ సామాన్యలక్షణాలకు అన్వయయుక్తంగానే ఉంటాయి. కనుక, ఒక ముఖ్యమైన నిర్ణయం తీసుకొనేటప్పుడు శాస్త్ర, దర్శనాల సహాయం అల్పము. జీవితంలో ముఖ్యమైన నిర్ణయాలు కుర్రవాడిని ఇంకా చదివించాలా లేక పెళ్ళి చేసి ఉద్యోగానికి పంపాలా అని ఆలోచించే తండ్రికి శాస్త్రం దర్శనం ఏవిధంగాను సహాయపడవు. అతడు ఒక సంకట స్థితిని ఎదుర్కొంటున్నాడు. ఎప్పుడైనా నిర్ణయించవచ్చు. కాని ఎటు నిర్ణయించాలో తోచదు. తోచనప్పుడు ఏమి జరుగుతుంది? ఆత్మ అటో యిటో 'పిల్లి మొగ్గ (మిణయం) వేస్తుంది. అంతే విషయం నిర్ధారణ అయిపోతుంది. ఇక్కడ అతనికి సహకరించినవి శాస్త్రం, దర్శనాలు కావు.

వీరంతా, ఆధునిక ప్రపంచంలో కొన్ని సమకాలీన మానవ అనుభవిక సమస్యలపై వ్యగ్రత కనపరిచారు. వాటిపై అందరి దృష్టి పడేట్టు కృషి చేశారు. ఆలోచనకు ఆచరణకు కొంత వ్యత్యాసం ఉంటుందన్న విషయానికి ప్రాముఖ్యాన్నిచ్చారు. ఇంతకు ముందరి మేధావులంతా కేవలం ప్రేక్షకులుగా ఉండి విషయాలను వర్ణించడంతోను, వివరించడంతోను సరిపెట్టుకొనారు. వాస్తవంలో వారు అలా నిమిత్తమాత్రులుగ, ప్రేక్షకులుగ మాస్తుండవలసింది కాదు. చరిత్ర ఏది మలచవలసి ఉంది. కాని ఆ పని వారు చేయలేదు. జనన మరణాల త్రాజు రెండు పిబ్బెలలో వసంగా తూగుతున్నప్పుడు, ఏదో ఒక విస్పష్ట నిర్దుష్ట దృక్పథాన్ని అవలంబించవలసిందని వారిని అస్తిత్వవాదులు కోరుతున్నారు.

అస్తిత్వవాదం ఒక వ్యతిరేక విప్లవం, ఉద్యమము. హెగెల్, మార్క్స్, ఎంగిల్స్, ఆధునాతన శాస్త్రజ్ఞులు సూచించిన పరిష్కారాలపై వీరు ధ్వజమెత్తారు. వారు చెప్పిన పరిష్కారాలు ఆధునిక మానవుని సమస్యలను పరిష్కరించడంలో విఫలమయ్యాయన్నారు. గత వంద సంవత్సరాలలో 'వైమనస్యత' అధికమైంది. పారిశ్రామిక విప్లవం, మహానగరాలను నిర్మించిన సాంకేతికశాస్త్రం, మూరుమ్మడి ఉద్యమాలు, శాస్త్రాలలో విశిష్టీకరణం Specialisation in sciences) జీవితాన్ని 'గదులు'గ విభజించడం - అన్నీ గూడ మానవుడు విమానవుడు (Depersonalisation) గావడానికి తోడ్పడ్డాయేగాని, అతనిని సమగ్రమానవునిగ తీర్చి దిద్దడానికి తోడ్పడలేదు. మానవవినాశం, మానవత్వనాశం, విమానవీకరణం, విలువల పతనం - వీటివల్ల ఈ గడ్డపై మానవుని ఉనికి తర్జితమైంది కనుక, మానవ అస్తిత్వం ఒక సమస్య అయింది.

వస్తుగతవాదం మానవునికి ఉన్న ప్రత్యేక గుణాలన్నింటిని విస్మరిస్తుంది. అందుకని దీనిని అస్తిత్వవాదులు పూర్తిగ వ్యతిరేకించి, అతికి పోయి అసలు 'వస్తుగతత్వ' (Objectivity)మే లేదన్నారు. తదనుగుణంగానే వారు శాస్త్రీయ విజ్ఞానాన్ని, ప్రకృతిని, బాహ్యప్రపంచాన్ని, హేతువులను కించపరిచారు. హేతువు ఒక్కటే అస్తిత్వవాద కేంద్రక సమస్యను పరిష్కరించజాలనట్లయితే, హేతువ్యతిరేకమైన వికారం (Passion) లేదా 'అంతర్దృష్టి' మాత్రం దానిని పరిష్కరించగలదన్న నమ్మకం ఏమిటి? కర్తను (Suject) - కాదన్నారు. అదీగాక అస్తిత్వవాదులు మానవానుభవాన్ని పూర్తిగ వివరించలేకపోయారు. అనుభవాన్ని అధ్యయనం చేసేటప్పుడు 'మనం దేనిని అనుభవిస్తున్నాము?' అనే ప్రశ్న వేసుకొని వస్తుగత ప్రపంచాన్ని కూడ అధ్యయనం చేయవలసి ఉంటుంది.

మరి హేతువులు, ప్రమాణాలు, విషయనిష్ఠత లేకపోతే మంచి చెడులకు తారతమ్యం తెలుసుకోవడం ఎలా? అని మనం వారిని ప్రశ్నించవచ్చు.

## అస్తిత్వవాదం

హేతువాదం ద్వారా అన్నీ పరిష్కరించవచ్చు నను
కొన్న ఒక కాలం ఉంది. 'ప్రగతి అనివార్యం' అనుకొన్న
కాలం ఉంది. ముందు ముందు అంతా మంచే జరుగుతుం
దని భావించబడింది. కాని కాలం గడిచే కొంది, రెండు
ప్రపంచ సంగ్రామాలు ప్రగతిని భ్రమ అని తేల్చడంతో
లోలకం పూర్తిగ రెండవ కొసకు పోయింది. ఫలితమే
అస్తిత్వవాద ఆవిర్భావము.

జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ఏ ఒక పక్షాన్నో వాదా
న్నో అర్థం చేసుకొంటే సరిపోదు. అదే చాలనుకొంటే
ప్రమాదకరము. ఇదే వేదాంతికైన, హేతువాదికైన,
అస్తిత్వవాదికైన వర్తిస్తుంది.

సంపాదకుని మాట: ఈ వేసవిరోజుల్లో ఈ
రచనను మీకు అందించడం జరిగినందులకు
కొంత చింతిస్తున్నాను. నా యీ వాక్యంలో
ఏదో గూఢార్థం దాగి ఉంది అని ఆలోచించి
మెదడును మరింత వేడి చేసికొనకండి. ఈ
వేసవి దినాల్లో కాలేజీలకు సెలవులు కనుక
వాటిని తెరువడానికి కనీసం ఇంకో 20 రోజు
లయినా అవుతుంది గనుక ఆ తరువాతనే
మీరు ఈ రచన మీద మీకు కలిగిన సందే
హాలను క్రింది అడ్రసుకు వ్రాసి నివృత్తి చేసు
కోవచ్చును. అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి,
లెక్చరర్, వి.ఎస్. ఆర్. & ఎన్. వి. ఆర్.
కాలేజి, తెనాలి-522 201

# సద్దర్శనము

### వివరణము: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

23. ఆత్మా సమీక్షేత పరం ప్రపశ్యే
దిత్యాగమోక్తేః సులభో న భావః
నాత్మైవ దృశ్యో యది కా కథేశే
స్వయం తదన్నీభవనం తదీక్షా

ఆంధ్రానువాదం: మొదట ఆత్మజ్ఞానం పొందిన తరు
వాత సర్వేశ్వరుని చూడు అని వేదాలు ఘోషిస్తున్నాయి.
దీనియొక్క గూఢార్థం చాలామందికి గోచరించదు.
ఆత్మయే కనబడనప్పుడు సర్వేశ్వరుని ఎలా గుర్తిస్తావు?
ఆత్మదర్శనం, నీ మనస్సును ఆత్మకు బలి ఇస్తేనే కలుగు
తుంది।

వివరణం: శాస్త్రాలు ఆత్మను చూచి తరువాత ఈశ్వ
రుని చూడు అని చాటే వాక్యం అంత సులభంగా అర్థం
కాదు. చూచేవాడు, చూడబడేది, చూపు అనే త్రిపుటివల్ల
ఆత్మదర్శనం కలగదు. ఈ త్రిపుటి నీకంటె ఇతరములనే
చూడగలదు. ఆత్మ చూచేదే అయినపుడు అది చూడబడేది
ఎలా అవుతుంది? ఈ సందర్భంలో ఆత్మను చూడు
ఈశ్వరుని చూడు అనే వాక్యార్థం ఎలా కుదురుతుంది?
ఆత్మజ్ఞానం కల్గటానికి ఏం కావాలి? ఆత్మదర్శనం కోరే
ఈ త్రిపుటే అది వుండే నీ మనస్సు, ఆ ఆత్మకు ఆహారం
అయిపోవాలి. ఏమీ మిగలకూడదు। ఆత్మను వెతుక్కుం
టూ అంతర్ముఖమైన మనస్సులో ఆలోచనలు ఆగిపోయి
మనస్సు, అహంకారం, శుద్ధ చైతన్యంలో లీనమైపోతా
యి. కాబట్టి ఆత్మజ్ఞానం కలగాలంటె ఆత్మ, మనస్సును
మింగేయాలి. నీ ఆత్మలో, నీ మనస్సు జీర్ణమైపోతే నీ
ఒక్కడివే సమాధిలో ఆత్మలో మిగులుతావు ఆ పార
మార్థిక స్థితినే ఆత్మదర్శనం అన్నారు. ఈ ఈశ్వర సంద
ర్శనం అన్నా ఆ స్వయంగా ప్రకాశించే ఆత్మనే అని అర్థం।
నీకు ఆత్మలాభం కలిగాక చూడ్డానికి ఇంకా సర్వేశ్వరుడు
లేడు. ఆ ఆత్మే సర్వేశ్వరుడు - అదే వేదం చెప్పేది.
బయట సర్వేశ్వరుని కోసం, వెతక్కు. నీలో వున్న ఆత్మ
దర్శనం కలిగితే సర్వేశ్వరుని చూచినట్లే। ఆత్మకు మన
స్సును ఆహారం చెయ్యి అనే భావనే అనేకవిధాలుగా
పెద్దలు చెప్పారు. యోగవాసిష్ఠం దానినే ప్రతిప్రసవం
అని చెబుతుంది. అంటే ఎక్కడనుంచి పుట్టిందో దాని
లోకి పోవుటే।

24. ధియే ప్రకాశం పరమో వితీర్య
స్వయం ధియోఽంత ప్రవిభాతి గుప్తః
ధియం పరావర్త్య ధియోంతరేఽత్ర
సంయోజనాన్నేశ్వరదృష్టిరన్యా

ఆంధ్రానువాదం: ఆత్మ నీ చైతన్యాని

జాన్ని ప్రకాశింపచేస్తూ, వాటివెనుక కనపడకుండా వెలుగుతూంది ! తన్ను తాను దాటి మనస్సు ఆ శుద్ధచైతన్యంతో ఏకమవడమే ఈ ఆత్మ లాభానికి మార్గం ! ఇంకోటి లేదు. అంతఃకరణం అనగానే అహంకారం, నీ తెలివినీ ! ఇవన్నీ ఆత్మ విలాసములే ! ఇదే అంతఃకరణము యొక్క విశేషం. ఈ అంతఃకరణం ఆలోచించగలదు. తెల్సుకోగలదు. కానీ ఈ ప్రజ్ఞ అంతఃకరణానిది కాదు. అది, అసలు జడం! మొద్దు !! పై ప్రజ్ఞ దానికి ఆత్మ వల్ల సంక్రమించింది. ఈ ప్రజ్ఞ ఇచ్చిన ఆత్మమాత్రం ఎవరికి కనబడకుండా వెలగుతూ ఈ ప్రజ్ఞ ఇస్తుంది! సూర్యుణ్ణి చూడండి. ఆతని సూర్యకిరణాలు, ప్రపంచాన్నంతనూ ప్రకాశింపచేస్తుంది. కాని అవే మనను సూర్యబింబం కనబడకుండా అడ్డు వస్తవి - మేఘం కప్పినట్లు. అదేవిధంగా ఆత్మనుంచి బయటపడిన ఒక కిరణంవంటి అంతఃకరణం తనకు ఆధారమైన ఆత్మను కప్పేస్తుంది - కనబడకుండా ! నిజంగా ఆలోచిస్తే అనంతమైన ఆత్మ చైతన్యంలో అంతఃకరణం ఒక అణువు వంటిది. అయినప్పటికి ఈ సూక్ష్మమైన అంతఃకరణ చైతన్యం అనంతచైతన్యాన్ని కప్పివేయగలదు. ఆత్మ కనపడకుండా ఈ కప్పే అంతఃకరణాన్ని తప్పించడం ఎలా ? సూర్యుణ్ణి ఏదో ఒకసారి చూస్తే బింబం కనబడదు కాని, కొంతసేపు తదేకదృష్టితో చూస్తే గోచరిస్తుంది. ఇదేవిధంగా అంతర్ముఖమైన మనస్సుతో లోపలను దీక్షగా వెదకగల్గితే, ఆత్మస్ఫురణ కొద్దో గొప్పో కల్గుతుంది. నిదిధ్యాసనీ; జ్ఞాననిష్ఠనీ ఈ అంతర్ముఖత్వాన్ని అంటారు. ఈ విధంగా మనస్సును దాటి దాన్ని ఆత్మలో లీనం చేయడం, ఈశ్వర దర్శనం. దేవతా సాక్షాత్కారం ఇంకే విధంగానూ కలగదు. పూజన్నా, నామజపం అన్నా, నామసంకీర్తనం అన్నా మానసిక వ్యాపారం ఆలోచనలుగానో, అనుభవాలుగానో, మనస్సు మనస్సుగా ప్రపంచంగా, వ్యాపిస్తోంది. ఇదంతా మనస్సు ఆలోచనల స్థాయిలో జరిగే తతంగం. ఇదంతా చైతన్యంలో, సముద్రంలో బుడగలు మునిగినట్టు మాయం అయితేనే ఆత్మదర్శనం! అంతఃకరణం అలా ఆత్మలో మునిగిపోవడమే అలా ఉండడమే ఆత్మలాభం. పూజా మొదలయినవి కొంతసేపు శాంతి, సుఖం కలుగచేస్తాయి గాని, శాశ్వతములు కావు - నిజస్థితి, గుర్తింపబడలేదు కాబట్టి ఆత్యంతిక సౌఖ్యం సిద్ధించదు.

25. న వక్తి దేహోఽహమితి ప్రసుప్తౌ
న కోఽపి నాభూవమితి ప్రవక్తి
యస్మోదితే సర్వముదేతి తస్య
ధియాఽహమః శోధయ జన్మదేశం

ఆంధ్రానువాదం: "నేను శరీరం, మనస్సు, బుద్ధితో గూడినవాడను అని ఎవడూ గాఢనిద్రలో చెప్పలేడు. మేల్కొన్న తరువాత వాడు "నేను నిద్రించుచున్నప్పుడు లేకపోలేదు. ఉన్నాను" అంటాడు. నిద్రలో కనపడకుండా లేచాక పుట్టిన ఆ 'నేను' అనే అహంకారము ఎక్కడ నుంచి పుట్టుతోందో గుర్తించు ! అక్కడనుంచే సర్వం ఉదయిస్తోంది.

వివరణం: బుద్ధితో గూడిన స్థూల, సూక్ష్మ శరీరాలు ప్రపంచంలో మన జీవితం అంటే, మన శరీరంతో, మనస్సుతో, బుద్ధితో ఆ ప్రపంచాన్ని అనుభవించడమే. నీకు నిద్రలో ఈ స్థూల సూక్ష్మ దేహాలు లేవు కాబట్టి ప్రపంచం కూడా లేదు. అసలికి నీ శరీరము నీకు తెలియదు - లేదు ! 'నేను జీవించి వున్నాను-ఈ శరీరం, మనస్సు నాది' అనే జ్ఞానమే లేదు. ఈ జీవితం, ఉనికి - ఈ శరీరాలు పని చేయుట అని నిర్వచనం చేస్తే - నీవు జీవించిన వాళ్ళలో లెక్క కాదు నిద్రలో ! కాని మెలకువ రాగానే ఈ శరీరాలు పనిచేయడం సాగిస్తాయి - కాని ఎవడైనా నిద్రలో నేను జీవితంతో లేను అనుకుంటాడా ? నాకు మామూలుగా ఉండే వ్యక్తిత్వసూచనలు లేవేమోకాని బతికే ఉన్నానను కుంటాడు - అందుకు ఎంతమాత్రం సందేహం వుండదు. నిద్రలో నీ వ్యక్తిత్వం గోచరించక మామూలుగా మెలకువలో వ్యవహరించినట్టు, అది స్ఫురించలేదేమో కాని, నీ వ్యక్తిత్వం అదృశ్యం అయిందేమో కాని నీవు మాత్రం ఉన్నావు. నీవు స్పష్టంగా మాటల్లో చెప్పలేని ఏదో తత్త్వంగా ఉంటూనే ఉన్నావు. తత్త్వంలోకూడా ఉండే ఆ వస్తువు ఏమిటి ? నీలో ఉండే నేను నేను అని స్ఫురించే, అహంకారము - ఇదివరకు చెప్పినట్లుగా ఆ 'నేను' 'నేను' అనేది ప్రథమ స్ఫురణ. స్పందనం. అది రెండు విధాలుగా పని చేస్తుంది. మొదటిది ఆత్మను గోచరించకుండా కప్పి వేయుట, రెండవది శరీరం, బుద్ధి, మనస్సు మొదలైన

ఆత్మకాని వస్తువులుగా గోచరించుట. మెలకువతో ఉన్నప్పుడు, కలలోనూ ఈ రెండు పనులూ చేస్తూనే ఉంటుంది గాఢనిద్రలో మాత్రం, మొదటిది కప్పివేయడం ఉంటుంది. రెండవది అనగా, శరీరం మొదలైన వాటిగా స్ఫురణ. గోచరించడం ఉండదు - అందుచేతనే నిద్రలో ఏ ఆలోచనలు లేనప్పటికి ఆత్మమాత్రం గోచరించదు. నిద్రలోనుంచి మెలకువ రాగానే, ముందు 'నేను' దాంతో పాటు, దాని శరీరం ప్రపంచం, మొదలైన స్ఫురణలు అన్నీ వస్తాయి. కాబట్టి ఈ సృష్టి మొత్తానికి మూలం అయిన ఆత్మ కావాలంటే 'నేను' పుట్టిన ఈ స్థలం పట్టుకోవాల - అది ఎలాగ? దానికి మనస్సే ఉపయోగిస్తుంది. బాహ్య ప్రపంచం అంతా మనం మనస్సుతోనే గ్రహిస్తున్నాం. ఆ మనస్సును మనం జాగ్రత్తగా అభ్యాసం చేస్తే దాని లోపలి చూపుతో అవి పుట్టినచోటికి పోయి ఆత్మను చూడగలదు.

(తరువాయి వచ్చే సంచికలో)

గ్రంథసమీక్ష :

# సాధన గ్రంథమండలివారి "జగద్గురు బోధలు" పది భాగములు

సాధన గ్రంథమండలి వ్యవస్థాపకులు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు 38 సంవత్సరాలుగా ఈ సంస్థను ఒక్క చేతిమీదుగా నడిపిస్తున్నారు. స్వంత గృహక్షేత్రములు గల శ్రీమంతులు కారు వీరు. తెనాలిలో ఒక అద్దె గృహములో ఉంటున్న రిటైర్డు టీచరు. ఈయనకు ఆర్థిక సంపద తగినంత లేదు. సేవా:వర్గం లేదు. గ్రంథ విక్రయ కొట్టును లేదు. వారి అద్దె ఇల్లే సాధన గ్రంథమండలి. బజారునుండి కాగితం, పుటకొనం, పోస్టుస్టాంపులు స్వయంగా తెచ్చుకొనుట, ప్యాకట్టు కట్టుట, అడ్రసులు వ్రాయుట, ప్రెస్సు ప్రూపులు అంతయు పంటవిగా స్వయంగా చూచికొనట - ఇంతపనీ ఈయన ఒకరే చూసికొంటున్నారు. గుమాస్తాలు, ఏజెంట్లు, బ్రాంచీలు ఏమియు లేవు. అయినను ఈయన నేతృత్వం క్రింద సాధన గ్రంథమండలి ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాలను వ్యాసాశ్రమ శుకబ్రహ్మాశ్రమములవంటి పెద్ద సంస్థలకు దీటుగా తెలుగులో ప్రచురిస్తూనే ఉన్నది. ఈ కృషికి ఆంధ్రప్రజలు ఈయనకు ఎంతో కృతజ్ఞతాభావము ప్రకటించుకోవలసియుంది. ఈ సాధన గ్రంథమండలివారు "జగద్గురు బోధలు" అనే పేరుతో శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వామివారు లోకానుగ్రహబుద్ధితో చేసిన ప్రవచనములను "విశాఖ"గారి సరళ సుందరమైన తెనిగింపుతో పది సంపుటాలుగా వెలువరించి యున్నారు. "జగద్గురు బోధలు" పదవ సంపుటము మున్నుడిలో శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు చెప్పిన వాక్యములను కొన్ని ఇక్కడ ఉటంకించుట ఆవశ్యకము

"శ్రీ శంకర భగవత్పాదులవారు ఎన్నో గ్రంథాలు రచించేరు. వానికి మూలానువాదాలతో "శంకర గ్రంథ రత్నావళి" అను పేరుతో మండలిలో ప్రకటిస్తున్నాం. ఆ శంకర వాఙ్మయసారమే ఈ బోధలు. శంకర వాఙ్మయం పండితులకు మాత్రమే తలుపులు తెరిచేదిగా ఉంటే జగద్గురుబోధలు సర్వజన సమాదరణీయములై ఉన్నాయి...."

ఈ సంపుటాలను సమీక్షిస్తూ ఆంధ్రప్రభ అన్నమాటలు:

ఈ సంపుటాలు ఆంధ్ర సరస్వతికి అమూల్య అభరణాలని చెప్పాలి నిత్యపారాయణం చేయదగ్గ గ్రంథాలు .. తియ్యటి తేట తెనుగు భాష, మూడు క్లాసులు చదివినవాళ్ళైనా ముచ్చటగా చదువుకోదగిన గ్రంథాలు. తెలిసికోదగిన అంశాలు. జీవిత పరమార్థాన్ని అర్థించే ప్రతివ్యక్తి హస్తభూషణం చేసికోదగిన గ్రంథాలివి. వేదధర్మస్వరూపం యిందులో వజ్రకాంతులతో నయనపర్వం చేస్తుంది."

శాఖోపశాఖలతో విరాజమానమగుచున్న హిందూమత విరాట్ స్వరూపమును చక్కగా అవగాహన చేసికొనుటకు ఈ గ్రంథములు చాల ఉపకరించునని ఈ సమీక్షకుని అభిప్రాయము. ఇంతవరకు వీటిని చదువనివారు తక్షణం తెప్పించుకుని చదువవలసినవిగా కూడ సమీక్షకుని విజ్ఞప్తి. ప్రతులకు: సాధన గ్రంథమండలి, తెనాలి-522 201. వెల: 1, 2, 3, 4, 8, 9 భాగములు రు. 6-00; 5, 6 భాగములు రు. 8-00; 7 వ భాగము రు. 4-00; 10 వ భాగము రు. 8-00. మొత్తము పది భాగములు వెల: రు. 64-00.

# సురఘువు - పరిఘుడు

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మ

హిమాలయ శిఖరపంక్తులు అను ముత్యాల దండకు, నాయకమణి వంటిది కైలాసశిఖరము. దానిక్రింద హేమజటము అను పేరుగల కిరాత దేశములు కలవు. వానిని ఉదారచిత్తుడు, మహా సమర్థుడునగు, సురఘువను ప్రభువు పాలించుచుండెను. అతడు పరాక్రమముచే రాక్షసుల జయించి దేవతలకు కూడా సాయము చేయువాడు. ఆ రాజు దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు న్యాయబుద్ధితో రాజ్యమును పాలించుచుండును. కాని దుష్టశిక్షణచే దుఃఖమును, శిష్టరక్షణచే ఆనందమును పొందుచుండును. ఈ ద్వంద్వావస్థచే వాని మనస్సు శాంతిని గోల్పోయి వ్యాకులత చెందుచుండెను. ఒకనాడిట్లాలోచించెను. ''ఆహా! ఎంతకష్టము! దేశరక్షణ కొఱకు కొందరిని నిగ్రహించుచున్నాను. కొందరిని అనుగ్రహించుచున్నాను ఇందు నా తప్పేమి? నిగ్రహానుగ్రహములు పాలనా ధర్మములు కదా. నా మనస్సు వలయందు బంధింపబడ్డ పక్షివలె నయ్యెను.'' ఇట్లు కాలము గడుచుచుండెను. ఒకనాడు ఉక్కల సంచరించుచు, మాండవ్యమహర్షి యా రాజు వద్దకువచ్చెను. సురఘువాయనను అర్ఘ్యపాద్యాదులతో పూజించి ఆసనమిచ్చి సత్కరించెను. కూర్చున్న తర్వాత రాజు ''భగవంతుడా! మీ రాకచే ధన్యుడను. ఈ ప్రజాపాలనలో దండనానుగ్రహములచే కొందరు దుఃఖము కొందరు సుఖము పొందుచున్నారు. వారి కష్టసుఖములు నావిగనే తలచి నేనూ బాధపడుచున్నాను. ఈ విషమదృష్టి తొలగి శాంతి కలుగుమార్గ ముపదేశింపుడు అని ప్రార్థించెను.

మాండవ్యుడు ''రాజా! ఈ శాంతికి సాధన నీలోనే యున్నది - అది ఆత్మవిచారణ. ఈ విషమదృష్టికి కారణము నీ మనస్సే. ఆ మనస్సు చేతనే అంతరంగమున విచారింపుము, నేననగా ఎవ్వడను? ఈ ప్రపంచ మెట్లు వచ్చినది? అన్నదే ఆత్మవిచారణ! ఈ విచారణచే నీకు మహత్వము కలిగి స్వస్వరూపము తెలియవచ్చును. ఈ కనబడుచున్న దృశ్యమంతయు నశించునది అని బుద్ధిచే తెలుసుకొని త్యజించినచో మిగిలినది ఆత్మవస్తువే. అదే నీవు.'' ఇట్లు బోధించి మాండవ్యమహాముని తన ఆశ్రమమునకు పోయెను.

తర్వాత సురఘువు ఒక వివిక్త ప్రదేశమున నిశ్చలముగ కూర్చుండి ఇట్లు విచారణసల్పెను. ''నేనెవ్వడను? ఈ జగత్తేమి? దీనికీ నాకు సంబంధమేమి? ఈ జగత్తు నశించునది. నేను నశింపను అందుచే దీనికీ, నాకూ సంబంధము లేదు. అట్లే ఈ కిరాతమండలమును, నేను కాను. ఇది నాదియు కాదు. సర్వజన సమ్మతముగా దీనికి రాజుగా కల్పింపబడితిని. నేను ఈ రాజ్యమును కాను. ఇది నాదియు కాదు. అయితే ఈశరీర మే నేనా? 'నేనున్నాను - నేను చూచుచున్నాను - నేను యోచించుచున్నాను' అందును. కొంచెము యోచింపగా ఈ శరీరములో నేనున్నాను. ఇది నాకు సాధనము మాత్రమే. నేను చైతన్యరూపుడను. నేనీ శరీరమంతటా వ్యాపించుటచే దీనికి 'నేనను' వ్యవహారము కలిగినది, కాని ఈ రక్తమాంస భూయిష్ఠమైన దేహమును నేను కాదు. ఈ ఇంద్రియ మనో బుద్ధులు నాకు సాధనములు. నేను బుద్ధితో తాదాత్మ్యము బొంది జీవసంజ్ఞను పొందితిని. ఆ జీవుడే 'నేను నేనని' వ్యవహరించుచు పాపపుణ్యము లాచరించుచు వాని ఫలితమైన కష్టసుఖముల ననుభవించుచు వేలవేల జన్మల నెత్తుచున్నది. నేను నిర్వికల్పుడను. నిరాకారుడను. ఆకాశమువలె సర్వవ్యాపిని. అగ్నియందు విస్ఫులింగములవలె నాయందే ఈ విశ్వమంతయు పుట్టి నా యందే అణగిపోవుచున్నది.

నేను ఆ చైతన్యమే. ఆత్మ అదే. అదే నేను. ఆహా! ఇప్పుడు సర్వము బోధపడినది. ఆ బోధ స్వరూపుడనే నేను. సర్వము నాయందే వ్యాపించినది. ఈ జగత్తు మిథ్య. సుఖమేమి? దుఃఖమేమి? సమ్యక్ జ్ఞానరూపమైన ఆత్మకు నమస్కారము.''

ఇట్లు సురఘువు ఆత్మనెరిగి సమదృష్టితో జనకచక్రవర్తివలె రాజ్యపాలనము చేయుచుండెను. జగత్తంతయు చైతన్యరూపమేయని ఎరిగిన ఆ జ్ఞానమూర్తి కూర్చున్నను, నిద్రించుచున్నను రాజకార్యము లాచరించుచున్నను ఆత్మయందే నిలిచి నిస్తరంగ సముద్రమువలె గంభీరుడై యుండెను.

పారశీక దేశమును పరిఘుడను రాజు పాలించుచుండెను. అతడు పరిఘాయుధమును ధరించి శత్రువిధ్వంసము చేసి ప్రజలను పాలించుటచే వానికి పరిఘుడను పేరు కలిగెను. అతడు సురఘువునకు బాల్యమిత్రుడు. అతడు మిక్కిలి దయార్ద్రహృదయుడు. సర్వ సమ్మతముగా ప్రజాపాలనము చేయుచుండెను. ఇట్లుండగా ఒకప్పుడా దేశమునకు మహా కఱవు సంభవించెను. ఈ కఱవుచే ప్రజలు అన్నపానీయములు లేక అల్లాడిపోవుచు అనేక వేలమంది మరణించిరి.

ప్రజానాశనము చూడలేకయు, అది తొలగించుటకు సామర్థ్యము లేకయు, దయాశాలి యగు నా రాజు దుఃఖముతో విరక్తచిత్తుడై బహుదూరమున నున్న అరణ్యమునకు పోయి నారచీరలు ధరించి ఎండిన ఆకులే ఆహారముగా గొనుచు తీవ్ర తపస్సు చేయసాగెను. ఆకులే తినుటచే వానికి పర్ణాదుడను నామాంతరము కలిగెను. ఇట్లు వెయ్యేండ్లు గడచెను. తీవ్ర తపస్సుచేతను, సదాభ్యాసము చేతను శాంతచిత్తుడై, ద్వంద్వరహితుడై యున్న వాని శుద్ధాంతఃకరణమున ఆత్మ ప్రతిబింబించెను. (ఆత్మ సాక్షాత్కారము పొందెను). తపస్సుచే సాధింపరానివి లేవు కదా. ఆ రాజర్షి సుఖదుఃఖములకు లోబడక సర్వ స్వతంత్రుడై సిద్ధసాధ్యులతో కూడి ముల్లోకములు సంచరించుచుండెను.

ఒకనాడాయన సురఘువు పాలించు దేశమునకు వచ్చెను. జీవన్ముక్తులు బాల్యస్నేహితులు నగు వారిద్దరు కౌగలించుకొని మహానందము ననుభవించి ఇష్టాగోష్ఠి సలుపుకొనిరి. అంత పర్ణాదుడు సురఘువును చూచి "మిత్రమా! నీవు మాండవ్య మహాముని కృపచే ఆత్మజ్ఞానమును పొందితివి. నేను తీవ్ర తపస్సుచేతను ఈశ్వరానుగ్రహముచేతను జ్ఞానమును పొందితిని. సమాధి ననుభవించుచు శాంతచిత్తుడనైతిని. నీవు దుఃఖరహితుడవై సమాధి సుఖము ననుభవించుచున్నావా? ఈప్రపంచమున ఏయే కర్మలు చేయబడునో అవి అన్నియు సమాధిచిత్తునకే సుఖములగును. ఇతరులకు కావు. సంకల్పరహితమై పరమ విశ్రాంతిస్థానమై, సంసార సుఖముల కన్న ఎన్నియోరెట్లు శ్రేష్ఠమైన సమాధిని నీవనుభవించుచున్నావా?'' అని ప్రశ్నించెను. అంత సురఘువు "మిత్రమా! సంకల్పరహితమైన సమాధి ననుభవించుట అనగా నేమి? జ్ఞానియగువాడు కూర్చున్నను మౌనముగానున్నను వ్యవహారము లాచరించుచున్నను సమాధిచిత్తుడే కదా! ఆత్మయందే స్థితిగల్గియున్నవారు జ్ఞానులు - వారు జగత్క్రియల నాచరించుచున్నను ఉత్తమ సమాధిలో నున్నవారే. సమాధి అనగా స్వస్వరూపస్థితియే. జ్ఞానులకు సమాధిస్థితి సహజముగనే యుండును. పద్మాసనమునందు కూర్చుండినను ఆత్మయందు విశ్రాంతి పొందని చిత్తము గలవానికి సమాధి యెట్లు కలుగును? జ్ఞానికి సమాధి లేని కాలమే యుండదు సమాధి నా ఆత్మస్వరూపము.

# శరీరపోషణ - సాత్త్వికాహారము

డాక్టర్ కమలజయరావు

జనాదరణ పొందిన ఒక గేయములో శ్రీగురజాడ అప్పారావుగారు ఈ విధముగ వ్రాసారు: "తిండి కలిగితే కండ కలదోయ్, కండ కలవాడేను మనిషోయ్". మానవత్వానికి కేవలము కండబలమే లక్షణమా! మనము మొదటినుండి వింటున్న వేదాంత సూత్రాలన్నిటికీ విరుద్ధముగ లేదా! నీవు ఈ శరీరమని భ్రమసిపోకు. నీవు అవయవము కాదు, ఇంద్రియము కాదు, మనస్సు కాదు. ఆ సచ్చిద్రూపియగు ఆత్మవు నీవు అని ఘోషిస్తున్నాయి వేదాంతశాస్త్రములన్నీ. కాని గురజాడవారి వాక్యాలను కూడ అంత తేలికగ తీసివేయడానికి వీలులేదు. తెలుగు ప్రజానీకము గౌరవాభిమానములతో వారికి మహాకవి యను బిరుదు నిచ్చింది. 'కవిః ద్రష్టః' అన్నారు పెద్దలు.

అన్ని జన్మలందు మానవజన్మ సర్వోత్కృష్టమైనదన్నారు. అన్నది మానవులే ఐనను దానికి విశేష కారణము లేకపోలేదు. ప్రతి జంతువు యొక్క జీవితచర్యలన్నీ దాని ప్రకృతినైజము (instinct) యొక్క అధీనములో నుంటాయి. శరీరపోషణ, శరీర రక్షణకు మించి వేరేమి ధ్యాస ఉండదు. మానవుని మేధస్సు జంతువులన్నింటి మేధస్సుల కంటె పరిణతి చెందింది. తత్కారణంగ మానవునకు విచక్షణ జ్ఞానము కలిగినది. దీనివలన ఏ పని చెయ్యవచ్చు, చేయకూడదు; ఎప్పుడు చెయ్యవచ్చు, ఎప్పుడు కూడదు ఆదిగ మానవుడు ప్రతిచర్యను వివేకముతో యోచించి చేస్తాడు. ఈ వివేకము ద్వారా, నశ్వరమైన శరీరము కంటె ముఖ్యమైనది, శాశ్వతమైన ఆత్మయని తెలుసుకున్నాడు. శ్రీరామకృష్ణపరమహంస చెప్పినట్లు శరీరము దిండు తొడుగు మాత్రమే. కాని దిండు బాగా నున్నాలంటే, దిండు తొడుగును ఎప్పటికప్పుడు శుభ్రపరచి, చినుగులు కుట్టి జాగ్రత్తగ చూసుకోవాలి.

ఆత్మప్రకాశము చెందవలెనంటే ఈ పాంచభౌతిక దేహమును జాగ్రత్తగ చూసుకోవాలి. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనానాం" అన్నారు పెద్దలు నేను శరీరమును అను మోహము, వ్యామోహము లేకుండ, ఈ శరీరము మోక్షసాధనకు అవసరమైన పరికరమని ఎరిగి దానిని పోషించవలెను. ఆహారము సరిగా లేక నీరసించిన వ్యక్తికి ధర్మసాధనలు సరిగ్గా కుదరవు. అట్లే మితిమీరి భుజించినవానికి కూడా యివి అందుబాటులో నుండవు:

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః"

అనునది గీతావాక్యము (భ.గీ. 6 : 16)

తగినంత ఆహారము లేనిచో, మనస్సు ఆకలిమీదనే కేంద్రీకృతమవును. క్షీణించిన దేహములోని ప్రక్రియలు క్రమముగ జరుగనేరవు. బుద్ధిమాంద్యము కలుగును. విచక్షణ జ్ఞానము క్షీణించును. అందుకే స్వామీ వివేకానందులు ఈ విధముగ చెప్పారు— "ఆకలితో నలమటించుచున్న వ్యక్తులకు ఆధ్యాత్మిక బోధనలు చేయవలదు. ఆకలిగొన్నవానికి భగవంతుడు అన్నరూపములోనే ప్రత్యక్షమగును."

కనుక ధర్మసాధనలు చేయువారు శ్రద్ధతో ఆహార నియమములను పాటించవలెను. శరీరముపై వ్యామోహము కలవారు కేవలము మనస్సును సంతుష్టి పఱచుటకు భుజింతురు. ధర్మసాధన చేయువారు స్వాత్మానందముకై శరీరపోషణ చేయుదురు. ఆహార నియమములు ముఖ్యముగ మూడు విధములు : తగిన పరిమాణములో ఆహారము భుజించుట, సరైన

ఆహారము భుజించుట, వేళక్రమము తప్పక భుజించుట.

ఆహారపరిమాణము ఎంత ఉండవలెనన్నది వ్యక్తి వయస్సు, వృత్తి శరీరపు ఎత్తు బరువుల మీద ఆధారపడి యుంటుంది. కాయకష్టము చేసే రైతుకు, రిక్షాలాగువానికి, రాళ్లు మోసే వానికి—ఆఫీసులో ఫైళ్ళమీద సంతకములు పెట్టువానికంటే ఎక్కువ ఆహారము అవసరము. గర్భిణిస్త్రీలు, చంటిపిల్లల తల్లులు—తమ శరీర పోషణకే గాక తమ శిశువుల శరీరము యొక్క పెరుగుదలకు కూడా బాధ్యులు గనుక వారికి కూడా ఆహారము ఎక్కువ పరిమాణములోనే అవసరము. అన్నిటికన్న ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే చిన్నపిల్లలకు పెద్దలకన్న ఎక్కువ ఆహారము కావలసి యుండును. ఆహారము యొక్క కొలత తక్కువైనను, శిశువు యొక్క శరీరములోని ప్రతి కిలోగ్రాము బరువునకు, వయోజనుల కంటె ఎక్కువ ఆహారము కావలసియుండును. సరైన కొలతలో ఆహారమిస్తేనే శిశువులు, పిల్లలు కూడా సక్రమముగ పెరిగి, ఉత్సాహముతో జీవించగలుగుతారు.

ఆహారము యొక్క పరిమాణమే గాక, ఆహారము యొక్క గుణ విశేషములు(quality) కూడా సరిగ్గా నుండాలి. వ్యక్తి గుణమును బట్టి ఆహారగుణము కూడా మారుననె భగవద్గీతలో చెప్పబడి యున్నది. సాత్త్వికులు భుజించు ఆహారమే, రజస్తమో గుణాన్వితులు భుజించు దానికంటే శ్రేష్ఠమైనది. మనము ఈ త్రిగుణముల అధీనములో నున్నంతకాలము సాత్త్విక ఆహారమే తినుటకు ప్రయత్నించాలి.

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః
గీత 17-8.

మనము తిను ఆహారము ఆయుష్షు పెంపచేయవలెను కాని క్షీణింప చేయకూడదు. దీర్ఘాయువు ఉన్నను అది రోగములతో తీరిపోకూడదు. బలము, శుద్ధత్వము, ఆరోగ్యము కలుగ జేసేదిగ నుండాలి. బలారోగ్యములు కలిగినవనే ధర్మసాధనలు సాధ్యము. తగినంత ఆయువు యున్ననే ధర్మసాధనలచే ప్రారబ్ధ కర్మలను పూరించుటకు వీలగును. అంతేగాక, ధర్మసాధనలు చేయువారు ఎల్లప్పుడు సంతోషముగ నుండాలి. ఇందుకు తగిన ఆహారము తినుట ఆవశ్యకము-ఆ ఆహారము రసవంతము, స్నిగ్ధము, ఆహ్లాదకరమునై యుండవలెను.

పైన పేర్కొన్న గీతావాక్యమునకు, నేటి ఆధునిక పోషకాహార విజ్ఞాన శాస్త్రమునకు (nutrition science) ఎటువంటి భేదము లేదు. ఆయువునకు కావలసినది శక్తి. శక్తి తగినంత ఆహారము తినుటచే లభించును. అవసరమైన దానికంటే తక్కువ తిన్నను, ఎక్కువ తిన్నను ఆయువు క్షీణించును. నేడు భారత దేశములోని అధిక ప్రజానీకము దారిద్ర్యముచే బాధితులగుటచే, వారి సంతానమునకు తగినంత ఆహారము లభించుట లేదు. తత్కారణముగ శిశు మరణ సంఖ్య, బాలల మరణ సంఖ్య చాలా హెచ్చుగ నున్నది. శిశు బాల మరణ సంఖ్యలు హెచ్చుగా నున్న దేశములు త్వరిత పురోగతిని సాధించ లేవు. బలము సత్త్వము కొరకు మాంసకృత్తులు (proteins)యున్న ఆహారము అవసరము. ఇవి పప్పులు, పాలు, పెరుగు మొదలగు ఆహారములందుండును. స్నిగ్ధమనగా నూనెవలె నుండునది. ఆహారములో, ముఖ్యముగ పిల్లల ఆహారములో నెయ్యి, వెన్న, నూనె, మీగడ వంటి స్నిగ్ధపదార్థములెంతో అవసరము. ఈ జిడ్డుపదార్థములలో (Oils and fats), యితర పోషక పదార్థములలోకన్న

కొద్దిపాటిగ నెయ్యి, నూనెలను వాడినను శక్తి ఎక్కువగ లభించును. చిన్నారిపాప కడుపు కడు చిన్నది. కాబట్టి, ఆహారములో ఈ జిడ్డు పదార్థములున్నచో, తక్కువ కొలమానములో నెక్కువ శక్తి లభించును. పండ్లు, కూరగాయలు ఆకుకూరలు రస్యములు. వీటిద్వారా విటమిన్లు, ఖనిజములు లభించును. ఇవి శరీరములోని వివిధ ప్రక్రియలకు, కండ, ఎముక మొదలగు స్థూలశరీర నిర్మాణమునకు తోడ్పడును.

జీవి గర్భస్థుడైనది మొదలు పుట్టుక తర్వాత 20, 22 సంవత్సరములు పెరుగుతు, ఎదుగుతు నుంటాడు. ఒక వయస్సులో ఈ పెరుగదల శీఘ్రగతిని జరుగుతుంది; మరొక దశలో కొద్దిగా మందముగ జరుగుతుంది. గర్భములో క్రమముగ పెరిగిన శిశువు అవయవ లోపములు లేకుండా, తగినంత బరువు కల్గి జన్మిస్తాడు. అటుపై పాలు, ఆహారము - ఏ వయస్సుకు తగినట్లు ఆ వయసులో లభియిస్తే ఉత్సాహముతో నాడుచు, పాడుచు పెరుగుతాడు. తన చుట్టును యున్న వాతావరణము, ప్రకృతులందున్న విషయములను కౌతూహలముతో గ్రహించి, పరిశీలిస్తాడు. శ్రద్ధతో పాఠాలాలకించి చదువుతాడు. ఈ విధముగ బాల్యములో శరీరవృద్ధి, మనోవికాసము కలుగుతాయి. వీరు బలిష్ఠులు, మేధావులైన యువకులుగా పరిణతి జెందుతారు. కండబలము, మేధాశక్తిసమృద్ధిగ నున్నచో అలసట, నీరసము ఉండదు. అటువంటి యువత దేశములోని ప్రగతి కార్యక్రమములన్నీ చక్కగా నిర్వహించ కలుగుతుంది. అంతేగాక యోగసాధనలు, ధ్యానము, ఆధ్యాత్మికచింతన కూడా చేయకలుగుతారు. అనగా వివేకానందులవారు మన యెదట నుంచిన "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ యందు సఫలీకృతులవుతారు. తగిన పాళ్ళల్లో, తగిన గుణ విశేషములు కల్గిన ఆహారము లేని వ్యక్తిలో అలసట, నీరసము, నిరుత్సాహము కలుగుతవి. వారు ఇటు ధర్మసాధనలు చేయలేరు, అటు సంఘ కార్యక్రమములు సరిగా నిర్వహించ లేరు. అందుకే గురజాడవారు యిట్లన్నారు :

ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయి!

"నేడు మనకు కావలసినది ఇనుప కండరములు, ఉక్కునరములు, ఏ శక్తి కూడా నిరోధించలేని మనోదార్ఢ్యము" అన్నారు స్వామీ వివేకానందులు. అనగా ఆరోగ్యవంతము బలిష్ఠమైన కాయము, వికసించిన మేధాశక్తి—ఈ రెండు కలిగిననాడే దేశము ఆర్థికముగాను, రాజకీయముగను పటిష్ఠమై, ఇటు సామాజిక పురోవృద్ధిని, అటు ఆధ్యాత్మిక ప్రగతిని సాధించ కలదు. ఈ రెంటికీ కూడా ఆనాటి ఋషులు, ఈనాటి శాస్త్రజ్ఞులు నుడివిన సాత్త్వికాహారము, తగినంత పాళ్ళల్లో క్రమమనుసరించి భుజించుట అత్యావశ్యకము. ఇంకొకసారి ఎప్పుడైనా భగవద్గీతలో చెప్పిన రాజసిక తామసిక ఆహారములను కూడా నేటి విజ్ఞాన శాస్త్రదృష్ట్యా పరిశీలిద్దాము.

(233 వ పేజీ తరువాయి)

సమాధి నాకు నిరంతరము కలదు. ఇంతయేల? ఏ స్థితిలో మనస్సు రాగద్వేష వర్జితమై విక్షేప శూన్యమై ఆత్మయందే ప్రీతి నొంది యుండునో అదే సమాధి. ఆ దృష్టి యొక్కటే అత్యంత సుఖము" అనెను. ప్రహ్లాదుడు వాని వాక్యములు శ్రద్ధతో విని తన నిశ్చయము మార్చుకొనెను. ఆత్మవిచారణచే, పరిశుద్ధమైన మనస్సున ఆత్మ ప్రతిఫలించును. తీవ్ర తపస్సుచే పరిశుద్ధమైన మనస్సునను ఆత్మ

పోగవాసిష్ఠమునుండి)

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము

- తిరుమలకు భగవంతుని దర్శనార్థము వచ్చే భక్తులలో పేదలైనవారికి ప్రసాదదానము చేయుటకు మీరు వాంఛింతు రున్నారా ?

- జీవులకు అన్నదాన ప్రాశస్త్యమును హిందూమతగ్రంథములు అనేక విధములుగా శ్లాఘించినవి. తిరుమలవంటి పుణ్యస్థలములలో గావించు అన్నదానము మరింత విశిష్టమైనది. అన్నదానమువలెనే ప్రసాదదానముకూడ దాతలకు శుభదాయకమైయుండును.

- కావున తిరుమల తిరుపతి దేవస్థానములు, "శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము" అను పేరున ఒక నూతన విధానమును ప్రవేశపెట్టినవి. ఈ పథకముక్రింద మీకు అన్నప్రసాద పొట్లములు. లడ్డులు, వడలు పేద యాత్రికులకు పంచిపెట్టవచ్చును.

- ఈ కార్యక్రమములో పాల్గొనదలచినవారు రు. 500/- శాశ్వతనిధి ఏర్పాటు చేసినచో దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో, 20 లడ్డులుగాని, 15 వడలుగాని, 20 అన్నప్రసాద పొట్లములుగాని మీరు నిర్ణయించిన దినమున క్యూ వరుసలోని పేద యాత్రికులకు పంచిపెట్టబడును.

- మీ జన్మదినముగాని, వివాహదినముగాని, మీ పిల్లల జన్మదినములుగాని, మీ జననీజనకుల శ్రాద్ధదినములుగాని, మీకు స్మరణీయమైన మరియే దినమునుగాని - మీరు నిర్ణయించితే ఆ దినమున ఉదయము స్వామివారి కొలువులో మీ నామధేయము, గోత్రము, మీ పేర ప్రసాదదానము జరుగబోవునట్లు విన్నవించబడును.

- రు. 500/- చొప్పున మీరు ఎన్ని నిధులైనను ఏర్పాటు చేయవచ్చును. ఒక్కొక్క నిధికి ఒక్కొక్క నిర్ణీత దినమునుగూడ మీరు సూచించవచ్చును. కనీసము 20 నిధులు (రు 10 000/-) ఏర్పాటు చేసినవారు, నిర్ణీతదినమున కుటుంబ సభ్యులు ఐదుగురితోసహా శ్రీవారి ప్రత్యేక దర్శనముకూడ పొందవచ్చును.

- ఈ ప్రసాదదాన కార్యక్రమము 1980 ఉగాదినుండి ప్రారంభమైనది. ఇందులో పాల్గొనదలచిన నిధి దాతలకు ఆదాయపు పన్ను మినహాయింపు గలదు. విరాళములు ఆంధ్రాబ్యాంక్ అన్ని బ్రాంచీలద్వారా మీరు పంపవచ్చును. దక్కిన ఏ బ్యాంక్ డి. డి. ద్వారా అయినను కూడ పంపవచ్చును. విరాళములను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానము పేరున, మేనేజర్, ఆంధ్రా బ్యాంక్, గాంధిరోడ్, తిరుపతి-517501 అను విలాసమునకు పంపవలెను. నామధేయము. గోత్రము, పూర్తి విలాసము, పంపకమునకు ఎన్నుకున్న ప్రసాదము పేరు, నిర్ణీత దినము, ఈ వివరములనుకూడ నిధి ఏర్పాటువారలు తెలియజేయగలరు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఓ కనకదుర్గా!!

కనికరింపుము తల్లి
ఓ కనక దుర్గా!
ప్రణతు లర్పింతునో
భక్తాపవర్గా!! ॥కనికరింపుము॥

కన్నతల్లివి నీవె
మిన్నకుండుట తగునె?
నన్ను బ్రోచే సుప్ర
సన్నమతులెవరమ్మ?॥ కనికరింపుము॥

నిన్ను సందర్శించు
కన్నులిమ్మా యమ్మ
నీ పూజలందే ప్ర
మోదమ్ము చేకూర్పు ॥కనికరింపుము॥

పూర్వ జన్మమునందు
సుకృతలేశము చేత
నరజన్మమెత్తితిని
ఒడిగట్ట నే సుకృతి ॥కనికరింపుము॥

వ్యాధులెన్నో పట్టి
బాధించు దేహమ్ము
ఆధు లెన్నో చేరి
వేధించు నా మనసు ॥కనికరింపుము॥

నిను నమ్మి నీపైనే
భారమంతయు మోప;
నాకు నేనై నిర్వ
హింప నీ బ్రదుకంత ॥కనికరింపుము॥

పాదమొక్కటి పడవ
ఒడ్డుపై నొక యడుగు
అటు నిటూ కదలలే
కల్లాడుచున్నాడ ॥కనికరింపుము॥

నీ యొడిని నను జేర్చి
ఓదార్పుమో జననీ!
ఎంత పొడుగెదిగినా
పసిబిడ్డనే నీకు ॥కనికరింపుము॥

నీ దివ్య దుగ్ధమ్ము
త్రాగి కుత్తుకబంటి
జరమృతుల నిర్జించి
అమృత పుత్రుడ నౌదు ॥కనికరింపుము॥

శాంతి దాంతులతోడ
నిన్ను నే సేవించి
జీవించు భాగ్యము
చేకూర్పుమో జనని ॥కనికరింపుము॥

నీ సేవచే గదా!
అల గదాధరుడు తా
రామకృష్ణుండౌచు
ప్రేమామృతము పంచె ॥కనికరింపుము॥

—డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

---

**యదన్యేషాం హితం న స్యాత్ ఆత్మనః కర్మ పౌరుషమ్**
**అపత్రపేత వా యేన న తత్కుర్యాత్ కథంచన.**

—మహాభారతం

మనము సేయు నే కర్మ లోకులకు హితముగాదో లేక దాని విషయమై మనలో మనమెప్పుడు లజ్జపడవలసియుండునో యూ కర్మ నెప్పుడును చేయ రాదు.

# నైతికత: నీతిశాస్త్రాల ప్రయోజనము

ఈ రోజులలో ప్రతివస్తువునూ దాని ప్రయోజనాన్ని బట్టి మదింపు చేస్తాము— దానివలన రూపాయలు, పైసల ప్రయోజనం కలుగుతుందనేది ప్రధానం. సత్యాన్ని ప్రయోజన ప్రమాణంతోనో, ధనప్రమాణంతోనో నిర్ధారించాలని కోరడానికి వ్యక్తికి ఏమి అధికారమున్నది? ఒకవేళ ప్రయోజనం లేదనుకుందాం, అది సత్యం కాకపోతుందా? ప్రయోజనం సత్యానికి గీటురాయి కాదు అయినప్పటికి సత్యం వలన అత్యధిక ప్రయోజనం ఉన్నది. ఆనందం - ప్రతిఒక్కరు దాని కోసమే ప్రయత్నిస్తున్నారని మనకు తెలుసు. అయితే అత్యధిక సంఖ్యాకులు అశాశ్వతము, అవాస్తవికము అయిన విషయాలనుండి ఆనందం పొందాలని ప్రయత్నిస్తున్నారు. ఇంద్రియాలలో ఏనాడూ సుఖం కనిపించలేదు. ఇంద్రియాలలోను, ఇంద్రియానుభవంలోనూ శాశ్వత ఆనందం పొందిన వ్యక్తి యింతవరకు లేదు. ఆనందం ఆత్మయందు మాత్రమే లభిస్తుంది. కాబట్టి ఆత్మానందాన్ని అనుభవించటమే మానవజాతికి పరమ ప్రయోజనము. సర్వ దుఃఖానికి అజ్ఞానమే మహామాతృక. అఖండ శక్తి దుఃఖిస్తుంది, రోదిస్తుంది; మనం అల్ప బుద్ధులము, అల్ప దేహులము అని భావించడం ప్రాథమికమైన అజ్ఞానము. ఎప్పుడైతే నేనొక స్వల్పశరీరము అని భావిస్తానో అప్పుడు దాన్ని జాగ్రత్తపరచుకోవాలని, రక్షించుకోవాలని, యితరుల దేహాలేమైపోయినా, నా దేహం మాత్రం నాజూకుగా ఉంచుకోవాలని అనుకొంటాను. అప్పుడు మీరు, నేను వేరవుతాము. ఎప్పుడైతే ఈ వేర్పాటుభావన తల ఎత్తుతుందో అది అన్నివిధాలైన దుర్మార్గానికి బాటవేస్తుంది. అనంతమైన దుఃఖానికి దారితీస్తుంది.

నేటి మానవజాతిలోని బహుకొద్దిమంది గనుక స్వార్థపరత్వాన్ని, సంకుచితత్వాన్ని, అల్పత్వాన్ని వీడగలిగినట్లైతే దాని ప్రయోజనం— ఈ భూతలం రేపు స్వర్గధామమవుతుంది. అంతేగాని కేవలం యంత్రాల సాయంతో పదార్థవిజ్ఞానప్రగతితో మాత్రమే అది ఎన్నటికీ జరగదు. నిప్పులో నూనె పోస్తే మంటలు పైకెగసినట్లు అవి కేవలం దుఃఖాన్ని పెంచుతాయి. ఆత్మజ్ఞానం లేని పదార్థ విజ్ఞానమంటే కేవలం అగ్నిలో ఆజ్యం పోయటమే. మరోమాటలో చెప్పాలంటే పరుల సొత్తును అపహరించే స్వార్థపరునికి, ఇతరుల కోసం తన జీవితాన్ని అర్పించకపోగా వారి జీవితాలతో చెలగాటమాడటానికి సాయంగా యింకొక ఆయుధం అందజేయటమే.

ఈ ప్రపంచం సుఖదుఃఖాల, శుభాశుభాల మిశ్రమం. ఈ రెండింటిలో ఒకటి పెంపొందించాలంటే అవశ్యం రెండవదీ వర్ధిల్లవలసిందే. సంపూర్ణమైన మంచి ప్రపంచంగాని, దుష్ట ప్రపంచంగాని ఎన్నడూ ఉండబోదు. ఎందుకంటే ఆ భావనే విరుద్ధమైన పదజాలంతో కూడి ఉన్నది. ఈ విశ్లేషణద్వారా వెల్లడైన మహారహస్యమేమంటే మంచి, చెడులు అనేవి కోసి ఎండవేసిన రెండు విడిభాగాలు కావు. ఈ ప్రపంచంలో యిది మంచిది, పూర్తిగా మంచిది; అనిగాని యిది చెడ్డది పూర్తిగా చెడ్డది అనిగాని దేనికీ ముద్ర వేయజాలము. ఇప్పుడు మంచిదిగా కనుపించే విషయమే రేపు చెడ్డదిగా కనుపించవచ్చు. ఒకడికి దుఃఖదాయిని అయింది మరొకడికి ఆనందప్రదం

కావచ్చు. శిశువు చేయి కాల్చుకునే నిప్పు ఆకలికడుపు కోసం మృష్టాన్నం సిద్ధం చేయడానికి కూడా ఉపయోగిస్తుంది. అయితే, అలాంటప్పుడు సత్కార్యాలు ఆచరించటం వలన ప్రయోజనమేమిటి అనే ప్రశ్న మదిలో ఉదయిసుంది.

కీడు చేయకుండా మేలు చేయడం సాధ్యపడదు అనే విషయం నిజమైతే, సంతోషాన్ని సృష్టించటానికి మీరు ఎప్పుడు ప్రయత్నించినా దుఃఖం సర్వదా తిష్ట వేసుకొని ఉన్నప్పుడు "మంచిచేయడం వలన ప్రయోజనం ఏమిటి?" అని ప్రజలు ప్రశ్నిస్తారు. దుఃఖాన్ని తగ్గించేందుకు కృషి చేయాలి కాబట్టి సదాచారం అవసరం అనేది మొట్టమొదటి సమాధానం. ఎందుకు కృషి చేయాలంటే మనవరకు మనం సంతోషంగా ఉండటానికి అదొక్కటే మార్గం. మనలో ప్రతిఒక్కరూ వెనకా ముందుగా జీవితంలో ఆ సంతోషాన్ని పొందుతారు. ఉత్సాహవంతులు కొంత ముందుగా, మందబుద్ధులు కొంత ఆలస్యంగా ఆనందం పొందుతారు. అందుకు మందబుద్ధులు ప్రియమైన ధర చెల్లిస్తారు. ఉల్లాసవంతులు తక్కువ ప్రియమైన వెల చెల్లిస్తారు. మనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించి తీరాలి కనుక మంచి చేయాలి అనేది రెండవ సమాధానం; ఎందుచేతనంటే ఈ పరస్పర విరుద్ధ జీవితం నుంచి తరించటానికి అదొక్కటే మార్గం. మనం కలలనుంచి తేరుకొని ఈ ఐహిక భవనాన్ని వీడేదాకా శుభాశుభ శక్తులు రెండు మనకోసం ఈ జగత్తును సజీవంగా నిలుపుతాయి. ఈ పాఠం మనం గ్రహించవలసి ఉన్నది; అందుకు సుదీర్ఘ కాలం పడుతుంది.

(పై సంచికలో: "నైతికత: సాధన విధానము")

## తీర్థయాత్రలు చేసి వచ్చిన దోసకాయ:

తీర్థయాత్రలు చేయవలెనని కొందరు భక్తులు నిర్ణయించుకొని పరమభక్తుడైన సంత్ తుకారాం వద్దకు వచ్చి ఆయనను వారితో రమ్మని ప్రాధేయపడతారు. ఆర్థికంగా పేదవాడైన తుకారాం తాను రాలేనని చెప్పి వారి ప్రేమను తృణీకరించకుండ, ఒక చేదు దోసకాయను వారికి ఇచ్చి, వారు పుణ్యనదులలో స్నానమాచరించునపుడు ఆ దోసకాయను కూడ ముంచి తీసుకరమ్మని ప్రార్థిస్తాడు. యాత్ర వెళ్తున్న భక్తులు ఆ దోసకాయను వెంట తీసుక వెళ్ళి, వారు స్నానమాచరించిన పుణ్యనదులలో ఆ కాయను ముంచి తీసుకొని వచ్చి తుకారామ్‌కి ఇస్తారు. తీర్థయాత్ర ముగించి వచ్చిన భక్తులందరిని తన ఇంటిలో ఆతిథ్యం స్వీకరించవలయునని తుకారాం ఆహ్వానిస్తాడు. అందరూ విచ్చేస్తారు. రుచికరమైన పదార్థాలు వడ్డిస్తాడు. వాటితోబాటు పుణ్యతీర్థాలలో మునకవేసివచ్చిన దోసకాయను పులుసు చేసి వడ్డించి ఆరగించమని ప్రార్థిస్తాడు. ఆ కూర తినగానే చేదుగా వుంటుంది. భక్తులందరూ ఏక కంఠంతో "ఇదేమిటి? ఈ చేదుకూర" అంటారు. తుకారాంజీ భక్తులకు నమస్కరిస్తూ "మహాత్ములారా! క్షమించండి. ఆ కూర చేదుగా వుందా? మీతోబాటు అన్ని పుణ్యతీర్థాలలో స్నానమాచరించినా ఆ చేదుదోసకాయలోని చేదు పోలేదా? నేను మీకు ఇచ్చినప్పుడు అది చేదుగానే ఉంది. కాని తీర్థయాత్రలు చేసివచ్చినా దాని చేదు నశించలేదా" అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడు. భక్తులందరూ దానిని గుణపాఠంగా గ్రహిస్తారు. కావలసింది బాహ్య ప్రదర్శనలు కాదు. ఆంతరంగిక పరిణామం, సదాచారం అలవరచుకోవాలి. సర్వాత్మభావాన్ని పెంపొందించుకోవాలి.

—బ్రహ్మచారి సుందరరాజన్

# ఓ నాణెమా!

"ఓ నాణెమా? నీ కథ ఏమిటి? ఎవరో మహాపురుషుడు నీ స్పర్శ తగలగానే కరెంట్ షాక్ తిన్నట్లు విలవిలలాడిపోయేవాడట? నీలో ఇంత పాపం దాగి ఉందా! పైకి తళతళ మెఱుస్తున్నావే!"

"అయ్యా! నే నేపాపం చేయలేదు. నా దేహం లోహమయం. ఇందులో నా తప్పేముంది? నా తమ్ముళ్ళు చెల్లెళ్లు కూడ నాలాగే లోహమయులే. నా పెద్దన్నలు పెద్దక్కలు - వారి దేహాలు మాత్రం కాగితమయాలు. లోహమయాలు కానీండి కాగితమయాలు కానీండి మా తప్పేమీ లేదు. మేమేమీ పాపం చేసుకోలేదు. కాని మానవ సమాజంలో జరిగే సకల అన్యాయాలకు, అక్రమాలకు, దోపిడీ విధానాలకు, వంచనలకు, పాపాలకు మా కుటుంబీకులందరం ఉపకరణాలయి పోయాము. దీనివల్లే మా స్పర్శ ఆ మహాత్ముడికి భరింపరాని వేదన కలుగజేసింది. కేవలం లోహస్పర్శ వల్ల ఆ బాధ కలిగేటట్లుంటే ఆయన ఏ పూజాపాత్ర భోజనపాత్ర ముట్టుకో డానికి శక్యం అయ్యేది కాదు."

"ఓ నాణెమా! నీవు చెప్పేది నాకేమీ అర్థం కావడం లేదు. కొంత వివరంగా చెబితే నీకు వచ్చే నష్టం ఏముంది?"

"వివరించి చెప్పడానికి నేను ఆర్థిక శాస్త్రంలో (Economics) పట్టా పుచ్చుకో లేదు. ఒకవేళ పట్టాపుచ్చుకున్నవాడు వివరంగా చెప్పినా వినే ఓపిక నీకు ఉండదు. కాబట్టి నా నాలుగు మాటలు ఆలకించు. శ్రమకు తగిన ఫలం - ఇదీ ఉత్తమ మానవ సమాజలక్షణం. "శ్రమకు తగిన ఫలం" అనే ధర్మం ఏ సమాజంలో లోపిస్తుందో ఆ సమాజం అధర్మ మైన సమాజం. పూర్వం అంటే మేము పుట్టకముందు మానవ సమాజంలో "ఇందమ్మా పుల్లగూర అంటే ఇందమ్మ తియ్య గూర" అనే బార్టర్ విధానం ఉండేది. వస్తువులనిచ్చి వస్తువులను తీసుకొనేవారు. ఎంత బుద్ధి చాకచక్యం ఉన్నా శరీర శ్రమ లేక వస్తువుల ఉత్పత్తి సాధ్యంకాదు కాబట్టి ప్రతి ఒక్కరూ శ్రమజీవనం సాగించేవారు. కొందరు ధాన్యం పండించేవాళ్ళు, మరికొందరు బట్టలు నేసేవాళ్లు, మరికొందరు కుండలు చేసేవాళ్ళు, మరికొందరు పశువులు మేపేవాళ్ళు, మరికొందరు వ్యవసాయం ఇత్యాది పనులు చేసేవాళ్ళు. పరస్పరవస్తు మారకం చేసుకుంటూ అందరూ సమాన ఆర్థిక స్థాయిలో జీవనం సాగించేవారు. వాళ్ళలో శ్రమైక జీవనానికి ఇష్టపడని పాపపురుషులు కొందరు దోపిడీ వృత్తికి దిగి దోచుకోవడమే తమ జీవనంగా చేసుకొన్నారు. ఆ దోపిడీగాళ్ళ పోరు పడలేక ప్రజలు ఆ దోపిడీగాళ్ళలో ఒకరిని తమ రక్షకుడుగా ఉండమని అతనికి కావలసిన అవసరాలన్నీ తీరుస్తామనీ చెప్పారు. దానికి ఒప్పుకొన్న మొదటి దోపిడీగాడే రాజ్యవ్యవస్థకు మూలపురుషుడు. వాడి రాజ్యవ్యవస్థ నడవడానికి చాల సిబ్బంది అవసరం కదా! వాళ్ళంతా ప్రభుత్వోద్యోగులు, సైనికులు, తదితరులూ. వాళ్ళ పోషణ భారమంతా శ్రమైకజీవుల మీద పడింది. రాజ్యవ్యవస్థ పెరగను పెరగనూ శ్రమైకజీవుల భారం కూడ పెరిగింది. వారి శ్రమలో అధిక భాగం జీతగాళ్ళకు పోసాగింది. అదీ చాలకపోతే ఆ దోపిడీదారు, ప్రక్క భూములను కూడ కైవసం చేసుకోవడం జరిగింది. ఇలా రాజ్యాలు తయారయ్యాయి. వాటితోబాటు నగరాలు, నాగరికతలు, వ్యాపారాలు తలెత్తాయి. అదే సమయంలోనే ఒక ఆర్థికనిపుణుడు మమ్మల్ని తయారు చేసి రంగంలో ప్రవేశపెట్టాడు. అప్పటినుండి పరిస్థి

కాకుండా, యోగమనశ్శారీరక శాస్త్రరీత్యా-మానవ దేహంలో నిలువుగా పనిచేసే ఇళ, పింగళ అనే రెండు శక్తిక్షేత్రాలు (నాడులు) ఉన్నాయి. ఇవి-ఆరోగ్యం, వ్యాధి, అతీంద్రియ సాధనలు మొదలైనవాటి విషయంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. అనేక ముఖాలుగల మెదడు వంటి సహస్రారచక్రానికి ఆ కింద ఉండే వెన్నెముకకూ సంబంధించిన పోలికను మినహాయిస్తే—ఋషులకు శరీరంలోని నాడీమండలం గురించిన భౌతిక రూపం గురించిన అవగాహన ఉన్నట్టు కనిపించదు. నిజానికి మానసికశక్తి క్షేత్రాల గురించిన జ్ఞానాన్ని అనుభవాన్నీ సంపూర్ణంగా గ్రహించడమూ, సాధన చెయ్యడమూ జరిగినా—మెదడు గురించీ నాడీమండలం గురించీ ప్రాచీనులు వివరంగా తెలుసుకోలేదు. యోగానికీ, ఆయుర్వేదానికీ సంబంధించిన సాహిత్యంలో మెదడు, వెన్నెముక, నరాలు మొదలైనవాటి గురించిన ప్రస్తావనలు కనిపిస్తాయి. మన ప్రాచీన ఋషులూ, యోగులూ మానసికశ__ త్రాల విషయంలో చూపించిన ఆసక్తిని శరీరధర్మశాస్త్ర రీత్యా నాడీమండలం గురించి తెలుసుకోవడంలో అంతగా చూపించలేదు.

## మానవమేధ—వైవిధ్యంగల వ్యవస్థ

తెలుసుకున్నకొద్దీ ఆసక్తి కలిగించే మానవ మేధ (మనిషి మెదడు) గురించి సరైన వివరాలు తెలియడం మనకు గడచిన 200 సంవత్సరాలనుంచి మాత్రమే. ఈ 200 సంవత్సరాలలో ఈ మహాద్భుత పరికరం పనిచేసే విధానం గురించీ, దాని రూపురేఖల గురించీ ఎంతో పరిజ్ఞానాన్ని గడించాము. భౌతిక రసాయన శాస్త్రాలూ, గణిత సాంకేతిక శాస్త్రాలూ అంచెలంచెలుగా అభివృద్ధి సాధించడంతో మెదడు పనిచేసే విధానం గురించి కొత్త విషయాలు తెలుసుకోవడంలోనూ అభివృద్ధి సాధించాయి. అయితే మెదడు గురించిన రహస్యాలన్నీ ఇంకా వెలుగు చూడలేదు.

మనిషి మెదడులో దాదాపు నూరుకోట్ల కణాలకంటే ఎక్కువ ఉండవచ్చునని అంచనా. ఈ కణాలను 'న్యూరాన్'లు (Neurons) అంటారు. ఈ న్యూరాన్లు ఎన్ని ఉంటే అన్ని సహాయక కణాలు ఉంటాయి. ఈ సహాయక కణాలను గ్లయల్ కణాలు(glial cells) అంటారు. ప్రతి న్యూరాన్‌కూ అనుబంధంగా ఒక పొడవైన వాహిక ఉంటుంది. ఈ వాహికకు ఆక్సాన్ (axon) అని పేరు. ఆ ఆక్సాన్ ద్వారా న్యూరాన్ శరీరకణాలకు సందేశాలు పంపుతుంది. ప్రతి న్యూరాన్‌కూ సంబంధించి డెండ్రాన్స్ అనే కొన్ని చిన్న అమరికలు పొడుచుకొని వచ్చి ఉంటాయి. వీటిద్వారా న్యూరాన్ తక్కిన కణాలనుంచి సందేశాలను అందుకొంటుంటుంది. వివిధకణాల మధ్య ఇటువంటి సంబంధాలు (connections) పదినుండి యాభై దాకా ఉండవచ్చు. మొత్తం నూరు కోట్ల కన్నా ఎక్కువ ఖండాలు (units ఉన్న ఒక వ్యవస్థలో శక్తి మార్పిడి ఎట్లా జరుగుతుందో ఆలోచిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది. అందులోనూ — ప్రతి ఖండానికీ పదినుంచి యాభై సంబంధాలు ఉంటాయంటే శక్తి మార్పిడి ఎన్ని రకాలుగా సాగవచ్చునో లెక్కపెట్టదలచుకుంటే - ఆ లెక్క అనంతంగా ఉంటుంది.

## విద్యుద్రసాయన ప్రాతిపదిక

ఇప్పటిదాకా మనకు తెలిసిన విషయాలను బట్టి మెదడులో శక్తి ఉత్పత్తి-విద్యుద్రసాయన వ్యవస్థ ఒకదాని ద్వారా జరుగుతుంది. కణాల

లోపలా బయటా సోడియం పొటాసియం అయాన్ల (Ions) పరివర్తనవల్ల విద్యుత్ పాటవం (electrical potential) ఆక్సాన్‌ల ద్వారా ప్రయాణం చేసి ఇంకొక న్యూరాన్‌లోగానీ, కండరాలు గ్రంథులు వంటి తక్కిన శరీర భాగాలలోగానీ చలనాన్ని కలిగిస్తుంది. ఒక నాడి చివర (Nerve ending) భాగానికీ తక్కిన శరీరభాగానికీ గాని నాడీకణాలకు గానీ మధ్య ఉండే ప్రదేశానికి సినాప్స్ (synapse) అని పేరు. ఈ సినాప్స్‌లను న్యూరో ట్రాన్స్‌మిటర్‌లు (Neuro transmitter) అనే రసాయన నియామకాలు (chemical regulators) అదుపులో పెడుతూ ఉంటాయి. సినాప్స్‌ల లోపలా, వాటి చుట్టుపక్కలా రసాయనస్థితిని మార్చడం వల్ల ఒక కణంనుంచి ఇంకొక కణానికి సందేశాలు పంపించడాన్ని పెద్దఎత్తున మార్చవచ్చును. న్యూరోట్రాన్స్‌మిటర్ల వైవిధ్యాన్ని గురించీ, అవి పని చేసే ప్రత్యేక ప్రదేశాల గురించీ కొత్త వివరణలు తెలియవస్తున్నాయి. ఆ విధంగా—ఉన్నత స్థితులలో మెదడు పని చేసే విధానం గురించిన మన పరిజ్ఞానమూ నానాటికీ పెరుగుతూ ఉన్నది.

మనకు అంత స్పష్టంగా తెలియని మధ్యస్థ విధానాల పరంపరలవల్ల మెదడులోని న్యూరాన్‌ల విద్యుద్రసాయన వ్యవస్థ—ఊపిరి పీల్చడం, నడవడం, తినడం వంటి మామూలు పనులను చేయించడంతో బాటు జ్ఞాపకశక్తి, భావోద్రేకాలు, మేధాశక్తి మొదలైనవాటికి కూడా ఆధారంగా పనిచేస్తున్నది.

## స్థాన నిర్ధారణ

వివిధ ప్రయోగాల వల్లా, మానవ పరిశీలనలవల్లా—వినడం, చూడడం, జ్ఞాపకశక్తి, మేధస్సు, విచక్షణాజ్ఞానం మొదలయిన వివిధ కార్యకలాపాలు నిర్వహించడానికి మెదడులోని ఏయే భాగాలు బాధ్యత వహిస్తాయో తెలియవచ్చింది. మెదడు ఎడమభాగం—మాట్లాడడానికి సంబంధించి ప్రాముఖ్యం వహిస్తుంది. మెదడు కుడిభాగం—మాటల ద్వారా తెలియని సంకేతాలనో, అభిప్రాయాలనో అర్థం చేసుకోవడానికి సాయపడుతుంది. మెదడులోని ఈ కుడి ఎడమ భాగాలు రెండూ—వాటిని కలిపి ముడివేసిన బంధాల ద్వారా ఒకదానికొకటి పూరకాలుగా ఉండి సమన్వయంతో పనిచేస్తాయి. ముందు భాగాన ఉండే లంబికలు (Frontal Lobes) తెలివికీ, విచక్షణకూ సంబంధించినవి; పార్శ్వాన ఉండే లంబికలు జ్ఞాపకశక్తికి సంబంధించినది. మెదడు వెనుకభాగం దృష్టికి సాయపడుతుంది. మెదడులోని ప్రతి భాగానికీ నిశ్చితమైన పని ఉన్నా, అన్ని భాగాల మధ్యా ఉన్న సూక్ష్మమైన సంబంధాల వల్ల మెదడులోని భాగాలన్నీ కలిసి ఒక్క అంగంగానే పనిచేస్తాయి.

మనిషి మెదడులో బాగా పైభాగంగా ఉండే మస్తిష్క వల్కలం (Cerebral cortex) అనే భాగం ఎంతగానో వ్యాప్తి చెందింది. తక్కిన జంతువులలో ఈ వ్యాప్తి కనిపించదు. మనిషికి పోలికలో దగ్గరగా ఉండే వానరాలలో కనిపించే దానికన్నా—మనుషుల మస్తిష్క వల్కలాలలో న్యూరాన్‌లు, సినాప్స్‌లూ ఎక్కువ. మస్తిష్క వల్కలం ఇంతగా పెరిగినా మనిషి శక్తికీ, ఉత్సాహానికీ మూలాధారం మెదడులోని ఉద్రేక వ్యవస్థాభాగంలో ఉంది. అది—మెదడు మధ్యభాగంలో ఉండే హైపోథాలమస్ (Hypothalamus) అనే చిన్న ప్రదేశంలో ఉంటుంది. ఈ ప్రదేశమే—ప్రేమ, పగ, భయం, కోపం మొదలైన ఉద్రే

కాకుండా, యోగమనశ్శారీరక శాస్త్రరీత్యా- మానవ దేహంలో నిలువుగా పనిచేసే ఇళ, పింగళ అనే రెండు శక్తిక్షేత్రాలు (నాడులు) ఉన్నాయి. ఇవి-ఆరోగ్యం, వ్యాధి. అతీంద్రియ సాధనలు మొదలైనవాటి విషయంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. అనేక ముఖాలుగల మెదడు వంటి సహస్రారచక్రానికీ ఆ కింద ఉండే వెన్నెముకకూ సంబంధించిన పోలికను మినహాయిస్తే—ఋషులకు శరీరంలోని నాడీమండలం గురించిన భౌతిక రూపం గురించిన అవగాహన ఉన్నట్టు కనిపించదు. నిజానికి మానసికశక్తిక్షేత్రాల గురించిన జ్ఞానాన్ని అనుభవాన్నీ సంపూర్ణంగా గ్రహించడమూ, సాధన చెయ్యడమూ జరిగినా—మెదడు గురించీ నాడీమండలం గురించీ ప్రాచీనులు వివరంగా తెలుసుకోలేదు. యోగానికీ, ఆయుర్వేదానికీ సంబంధించిన సాహిత్యంలో మెదడు, వెన్నెముక, నరాలు మొదలైనవాటి గురించిన ప్రస్తావనలు కనిపిస్తాయి. మన ప్రాచీన ఋషులూ, యోగులూ మానసికశక్తిక్షేత్రాల విషయంలో చూపించిన ఆసక్తి శరీరధర్మశాస్త్రరీత్యా నాడీమండలం గురించి తెలుసుకోవడంలో అంతగా చూపించలేదు.

## మానవమేధ—వైవిధ్యంగల వ్యవస్థ

తెలుసుకున్నకొద్దీ ఆసక్తి కలిగించే మానవమేధ (మనిషి మెదడు) గురించి సరైన వివరాలు తెలియడం మనకు గడచిన 200 సంవత్సరాలనుంచి మాత్రమే. ఈ 200 సంవత్సరాలలో ఈ మహాద్భుత పరికరం పనిచేసే విధానం గురించీ, దాని రూపురేఖల గురించీ ఎంతో పరిజ్ఞానాన్ని గడించాము. భౌతిక రసాయన శాస్త్రాలూ, గణిత సాంకేతిక శాస్త్రాలూ ఇంచుమించుగా అభివృద్ధి సాధించడంతో మెదడు పనిచేసే విధానం గురించి కొత్త విషయాలు తెలుసుకోవడంలోనూ అభివృద్ధి సాధించాయి. అయితే మెదడు గురించిన రహస్యాలన్నీ ఇంకా వెలుగు చూడలేదు.

మనిషి మెదడులో దాదాపు నూరుకోట్ల కణాలకంటే ఎక్కువ ఉండవచ్చునని అంచనా. ఈ కణాలను 'న్యూరాన్'లు (Neurons) అంటారు. ఈ న్యూరాన్లు ఎన్ని ఉంటే అన్ని సహాయక కణాలు ఉంటాయి. ఈ సహాయక కణాలను గ్లయల్ కణాలు(glial cells) అంటారు. ప్రతి న్యూరాన్‌కూ అనుబంధంగా ఒక పొడవైన వాహిక ఉంటుంది. ఈ వాహికకు ఆక్సాన్ (axon) అని పేరు. ఆ ఆక్సాన్ ద్వారా న్యూరాన్ శరీరకణాలకు సందేశాలు పంపుతుంది. ప్రతి న్యూరాన్‌కూ సంబంధించి డెండ్రాన్స్ అనే కొన్ని చిన్న అమరికలు పొడుచుకొని వచ్చి ఉంటాయి. వీటిద్వారా న్యూరాన్ తక్కిన కణాలనుంచి సందేశాలను అందుకొంటుంటుంది. వివిధకణాల మధ్య ఇటువంటి సంబంధాలు (connections) పదినుండి యాభై దాకా ఉండవచ్చు. మొత్తం నూరు కోట్ల కన్నా ఎక్కువ ఖండాలు (units ఉన్న ఒక వ్యవస్థలో శక్తి మార్పిడి ఎట్లా జరుగుతుందో ఆలోచిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది. అందులోనూ — ప్రతి ఖండానికీ పదినుంచి యాభై సంబంధాలు ఉంటాయంటే శక్తి మార్పిడి ఎన్ని రకాలుగా సాగవచ్చునో లెక్క పెట్టదలచుకుంటే - ఆ లెక్క అనంతంగా ఉంటుంది.

## విద్యుద్రసాయన ప్రాతిపదిక

ఇప్పటిదాకా మనకు తెలిసిన విషయాలను బట్టి మెదడులో శక్తి ఉత్పత్తి-విద్యుద్రసాయన వ్యవస్థ ఒకదాని ద్వారా జరుగుతుంది. కణాల

యోగం—శరీరంలోని తక్కిన భాగాల కార్యకలాపాలలో మేలైన మార్పులు తెస్తుందన్న విషయం కూడా ప్రయోగాల వల్లా పరిశీలనల వల్లా ఋజువయింది. గాఢంగా ధ్యానం చేస్తున్నప్పుడు నాడీమండలంలోని న్యూరోట్రాన్స్‌మిటర్ లలో పరివర్తన వస్తుంది. యోగాభ్యాసాలు చేస్తున్నప్పుడు నాడీమండలంలోని కార్యకలాపాల అనుక్రమంలో కూడా మార్పు వస్తుంది. అంతవరకు స్వయంప్రపత్తి (autonomy) కలిగి స్వేచ్ఛావ్యాపారాలుగా కనిపించిన కార్యకలాపాలు వల్కలం (cortex) లేదా సంకల్పం (will) అదుపులోకి వస్తాయి. ప్రాణాయామ సాధనను ఉదాహరణగా తీసుకుంటే—యోగి శ్వాసక్రియను పూర్తిగా తన అదుపులో పెట్టుకోవచ్చును. సాధారణంగా శ్వాసక్రియ అసంకల్పితంగా స్వేచ్ఛగా సాగిపోతుంటుంది. ఎప్పుడయినా కావాలంటే కొంచెం సేపు శ్వాసక్రియను ఆపుచేయవచ్చు. శ్వాసక్రియను మజ్జ (medulla oblongata), స్వయంచోదిత నాడులు (autonomic nerves), శరీరంలో ప్రసరిస్తూ ఉండే రసాయనాలూ అదుపు చేస్తూ ఉంటాయి. ప్రాణాయామం చేస్తే శ్వాసక్రియ కింది అదుపులనుండి విడిపోయి యోగి సంకల్పానికి కట్టుబడి ఉంటుంది.

మెదడు నిర్మాణం గురించీ, దాని కార్యకలాపాల గురించి నేడు మనకు తెలుస్తున్న విషయాల వల్ల - సాధారణ మానవుడు తనకు లభించిన అపూర్వ సాధనమైన మెదడులో నిక్షిప్తమై ఉన్న గుప్తశక్తిని సంపూర్ణంగా వినియోగించుకోలేక కొద్దిగానే ఉపయోగిస్తున్నాడన్న సత్యం తెలుస్తుంది. ఆ గుప్తశక్తిని ఇంకా కొంచెం ఎక్కువగా ఉపయోగించుకోగలిగినా మానవ జీవితం మరింత సార్థకమూ, ఆనందభరితమూ అవుతుంది. యోగసాధన సరిగ్గా ఈ పనినే చేస్తుంది; మనలో ఉన్న శక్తిని సద్వినియోగం చేసుకోడానికి యోగసాధన సాయపడుతుందన్నది మన అచంచల విశ్వాసం.

సాటివారిని బాధించడంలోనూ తమ చుట్టూ ఉన్న ప్రకృతినీ తమ జాతివారినీ మారణాయుధాలతో నాశనం చేయడంలోనూ ఈనాటి మానవులు ఆసక్తి చూపిస్తున్నారు. ఈ విధ్వంసక ధోరణిని అరికట్టడానికీ మానవజాతి భవిష్యత్తు బాగుండడానికీ సరయిన పద్ధతిలో మేధాశక్తిని పెంపొందించుకోవడం ఒక్కటే పరిష్కార మార్గం. ఇది సాధ్యం కావాలంటే మన ప్రాచీనులు ప్రతిపాదించిన వివిధ యోగ విధానాలనూ అనుసరించాలి. అదొక్కటే—మానవజాతికి విముక్తిని ప్రసాదించగలదు.

---

## శ్రీరామకృష్ణ మఠం, మద్రాసు-4. జూలై నెల విశేషకార్యక్రమం

| | |
|---|---|
| 6 వ తేది మంగళవారం | గురు పూర్ణిమ |
| 19 వ తేది సోమవారం | స్వామి రామకృష్ణానంద జయంతి |
| 2 వ తేది శుక్రవారం<br>17 వ తేది శనివారం<br>31 వ తేది శనివారం | ఏకాదశి దినములు |

# ఉద్ధవ-కృష్ణ సంవాదము

కుమారి పి. రాజ్యలక్ష్మి

ఉద్ధవుడు, బృందావనమునుండి వచ్చాడనే వార్త తెలియగానే కృష్ణుని ఆనందానికి హద్దు లేక పోయింది. అతడు ఉద్ధవునికి ఎదురేగి బృందావనవాసుల గురించి ఆసక్తిగా, ఆతృతగా ఎన్నో ప్రశ్నలు వేశాడు. కృష్ణుని ప్రశ్నలకు జవాబుగా ఉద్ధవుడు గోపికల గురించి ఈ విధంగా తెలిపాడు —

"కృష్ణా! నేను నీ సందేశాన్ని తీసుకొని ఆ బృందావన విరహిణుల వద్దకు పోయినప్పుడు వారికి నీపట్ల గల అనురాగాన్ని ప్రత్యక్షంగా తిలకించాను. నీ ఎడల వారికి ఎంతటి స్నేహం! ఎంతటి ఆసక్తి! ఎంతటి అనురక్తి! దాన్ని చూచి నేను ఆశ్చర్యచకితుడనయ్యాను. గోప గోపాంగనలు చెప్పిన ప్రేమ విషయాలను, వారు చెప్పిన పురాతన కథలను విని నేను నిర్ఘాంత పోయాను. ఒక్కరోజు మాత్రమే వుండాలని వెళ్ళిన నేను ఆ రససాగరంలో మునిగి నెలల పర్యంతం అక్కడే వుండి వారు చెప్పే విషయాలను వింటూ వుండిపోయాను. బృందావనములోని అణువణువు నీకై తపించటం నేను కనులారా చూశాను. నీ పేరు విని సజీవ మానవులలాగ ప్రేమాశ్రువులను రాల్చే వృక్షాలను చూస్తే నాకు ఆశ్చర్యంతోపాటు అనంతమైన ఆనందం కలిగింది. నీ రూపాన్ని తలంచుకొని వ్రజాంగనలు శరీరములను సైతం మరచి అన్యమనస్కులై, వెఱ్ఱివారివలె దారియు - డొంకను తెలియని వారిలాగా ప్రేమోన్మత్తులై వున్నారు. అంతటి ప్రేమ మూర్తులను విడచి నీవు ఏ విధంగా మధురకు రాగలిగావు మాధవా?

తబ తైఁ యిన సబహిని సచు పాయో।
జబతైఁ హరి సందేస తుమ్హారో, సునత తాంవరా ఆయో॥

కృష్ణా! నేను నీ వద్దనుండి తెచ్చానని తెలియగానే గోపికల ఆనందానికి హద్దులేక పోయింది. నీ ప్రేమ సందేశాన్ని వినగానే సంతోషం పట్టలేక రాధ మూర్ఛితురాలు అయింది. ప్రకృతి సైతం పులకించి పోయింది. నీవు లేక, నిన్ను చూడక వివశులుగా పడి వున్న పశువులు నీ పేరు విని ఆనందంతో గంతులు వేశాయి. కోకిల తన పరివార సమేతంగా పంచమ స్వరంలో మంగళ గీతాలను ఆలాపించింది. సింహాలు సైతం గుహలనుండి బయటకు వచ్చి సంతోషంతో తమ తోకలను నేలకు వేసి కొట్టసాగాయి. మాధవా! నీ వద్దనుండి వచ్చిన సందేశాన్ని వినే, వారింతగా ఆనందంతో పిచ్చివారు అయినారు. యిక నిన్ను చూస్తే వారు ఎంతటి సౌఖ్యాన్ని అనుభవిస్తారో కదా గోవిందా! యిక నివు ఏమాత్రము ఉపేక్షింపక నీకై తపించే బృందావనవాసులను కలుసుకొని వారికి సంతోషాన్ని కలుగచేయి. నీవు త్వరపడకపోతే విరహోత్కంఠిత అయిన రాధను నీవు రక్షించుకోలేవు.

వ్రజకే విరహీ లోగ దుఖారే।
బిను గోపాల ఠగేసే ఠాడే అతి దుర్బల తన కారే॥

"కృష్ణా! వ్రజములోని విరహిణుల గురించి ఏమని వివరించను. నీకొరకు వారు నిరంతరం దుఃఖిస్తున్నారు. గోపాలుడు లేకపోయేసరికి వారు చిత్రకారుడు గీసిన చిత్రాల్లాగా, కృశించి పోయిన శరీరాలతో అతి దుర్బలంగానూ వున్నారు. నంద-యశోదలు రాత్రి-పగలు అని లేకుండా నీ రాకకై పిచ్చివారిలా ఎదురు చూస్తున్నారు. బృందావనములో ఎటు చూసినా 'కన్నయ్యా-కన్నయ్యా' అన్న వారి

పిలుపులతో ప్రతిధ్వనిస్తోంది. గోపికలు, గోపాలురు, గోవులు అతి దీనంగా జాలి గొలిపేలా వున్నాయి. చంద్రుడు లేని తారల్లాగా వెలవెలపోతున్న వారి దుస్థితిని తలుచుకుంటే నా హృదయం బరువెక్కిపోతున్నది.

సునహు శ్యామ వై సబ్ వ్రజ - బనితా,
బిరహ తృష్ణా రై భయీ బావరీ।

"శ్యామసుందరా! నీ కారణముగా వ్రజవనితలు నిరంతరము విరహములో కొట్టుమిట్టాడుతున్నారు. నీ కథలు తప్ప యితర విషయాలు వారికి రుచించటం లేదు. వెన్న దొంగ లేని ఈ గ్రామములో ఎవరుంటారని కొందరనుకుంటే, కన్నయ్యను పట్టుకోండి, అతడు మధురకు పారిపోకుండా రోటికి కడదాం, అంటూ పిచ్చిగా నీకోసం నలువైపులా పరుగెత్తే వారిని చూస్తే నా హృదయం ద్రవించిపోయింది. నీవు గోవులను కాచటానికి వనానికి వెళ్లావనుకొని, తిరిగి వచ్చే నీకోసమై యమునా నదీతీరాన చకోరపక్షులలాగా కూర్చుని వున్న గోపికల స్థితిని ఏమని వర్ణించను? నిన్ను చూడక ఒక్క క్షణమైనా నిలువ లేని రాధ నీ విరహములో నల్లరాతి శిల్పంగా మారింది. నిర్గుణోపాసకుడనైన నేనే వారి స్థితిని చూసి ద్రవీభూతుడనయ్యానే, నీవు ఆ అభాగ్యులపట్ల కొద్దిగానైనా జాలి - దయ చూపలేవా మాధవా?"

బిన దస ఘోష బలహు గోపాల।
గాయని కీ అవసేరి మిటావహు, మిలహు అపనే గ్వాల॥

"గోపాలా! పది రోజులైనా మాతో గడపటానికి మా గ్రామానికి రావా? నీకై తపించే గోవుల అశాంతిని దూరం చేసి, నీ మిత్రులైన గోపాలురతో కలసి, వారిని సంతోషపరచు. నీవు వెళ్ళిన నాటినుండి నెమళ్ళు నృత్యం చేయటం మానివేసాయి అంతేకాదు వర్షఋతువు కోసమై అవి ఆత్రుతగా ఎదురు చూడటం లేదు. పచ్చగా కళకళలాడే బృందావనం నీవు లేక కాంతివిహీనమైపోయింది. నిరంతరం నీకై తపించే యశోద నీవు లేక అనాథ అయింది. ఆమెపై జాలితోనైనా నీవు బృందావనానికి రావా మాధవా?

ఫిరి వ్రజ బసో నందకుమార।
హరి తిహారే బిరహ రాధా, భయీ తన జరి ఛార॥

"నందకుమారా! నీవు బృందావనానికి వచ్చి మాకు ఆనందాన్ని కలిగించవా? కృష్ణా! రాధ నీ విరహమనే జ్వాలలో పడి దహించుకొని పోతున్నది. ఆభూషణాలు లేక, కాంతివిహీనమైన దేహంతో నిరంతరం 'ప్రియా - ప్రియా' అంటూ నీకై తపిస్తున్నది. యమునా నదీ ప్రవాహంలా అశ్రుధారలతో నిండిన ఆమె నేత్రాలు చూస్తూవుంటే మా హృదయాలు తల్లడిల్లిపోతున్నవి. రాధామనోహరా! ఈ నిర్భాగ్యులపై నీ ప్రేమరసాన్ని కురిపించి పునర్జీవితులను చేయవా?"

గోపికలు పంపిన ఈ సందేశాన్ని విన్న కృష్ణుని నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. దుఃఖిస్తున్న మాధవుని చూసి ఉద్ధవుడు, "కృష్ణా! నీవు గోపికల సందేశాలను వినే యింతగా ఖేదపడుతున్నావు. నిజంగా నీవు వారిని తిలకిస్తే వారి పట్ల నీవు ఎంత నిర్దయగా ప్రవర్తించావో అర్థం అవుతుంది. నీవు, వారికి జ్ఞానోపదేశం చేయమని నన్ను పంపావు. కాని వారిముందు నేనెందుకు కొరగానివానిలా, అసమర్థునిలా నాకు గోచరించింది.

కహి బే మైన ధుసక రాఖీ।
బుద్ధి బివేక అనుమాన అపనై, ముఖ ఆయీ సో భాషీ।

"కృష్ణా! నా బుద్ధి - వివేకానుసారంగా వారికి నేను జ్ఞానబోధ చేసాను. వారికి వైరాగ్యోపన్యాసాలు చేయటంలో నేను ఏమాత్రం లోపం చేయలేదు. కానీ వారు నేను చెప్పదలచుకున్న విషయాన్ని ఒక్క-క్షణంలో చెప్పి, నేనెంత మూర్ఖుడినో నా అంతట నేను అర్థం చేసుకొనేలా ప్రవర్తించేవారు. వారి ముందు ఓడిపోయి. సిగ్గుతో తలవంచుకొని మధురకు రావలసి వచ్చింది. అజ్ఞాని-మూర్ఖుని అయిన నన్ను, నీవు బృందావనానికి వ్యర్థంగా పంపావు. ఒక్కరినైతే ఏదో విధంగా సమాధానపరచవచ్చు. కానీ ఓ సమూహంలా వచ్చి మీదపడేవారిని సమాధాన పరచటం ఎంతకష్టమో నీవే ఆలోచించు.

వాకై సునహు తౌ శ్యామ సునావూ।
ఉఁటిని సౌ కహి కథా జోగ కీ, క్యోం న యిటౌ
దుఃఖపావూ॥

"కృష్ణా! మాట వినేవారుంటే ఏవిధంగానైనా నచ్చచెప్పవచ్చు. కానీ బృందావనంలో ఎక్కడా నామాటను వినేవారే కనిపించలేదు. అసలు వారికి నీ మధురనామము తప్ప ఏదీ రుచించదు. అలాటివారికి యోగ వైరాగ్యాల గురించి చెప్పి, వారిని దుఃఖపరచటం దోసకనిపించింది. నిర్గుణోపాసన గురించి చెప్తే చాలు, అందులోనుండి బయటపడే మార్గం ఎలాగో నాకు అర్థం అయ్యేది కాదు. గోపికలు, సముద్రతరంగాలలాగా మీదపడి ప్రశ్నల పరంపరతో నన్ను వేధిస్తూ వుంటే, వారి ముందు ఆగలేక వెనుకకు తిరిగి మధురకు పరుగెత్తుకొని రావలసిన అగత్యం ఏర్పడింది. నా అవస్థను ఏమని చెప్పమంటావు గోపాలా! అసలు వారికి నా వేషభాషలే హాస్యాస్పదం అయినాయి. యిక వారికి నేను ఏ విధంగా వైరాగ్యోపన్యాసాలు చేయగలుగుతాను? పండితులకు గుణింతాలు నేర్పటం ఎంత హాస్యాస్పదమో, గోపికలకు నేను వైరాగ్యోపన్యాసాలు యివ్వడం కూడ అలానే వుంది.

వ్రజ మై ఏక ధరమ రహ్యో।
శ్రుతి సుమృతి ఐర వేద పురానని, సబై గోవింద
కహ్యో॥

"మాధవా! వ్రజములో ఒకే ధర్మము వ్యాప్తమై ఉన్నది. శ్రుతి, స్మృతి, వేదాలు, పురాణాలు గోవిందనామమే సత్యమని తెలుపుతున్నాయి. బాలురు, వృద్ధులు, తరుణులు అంతా నిన్నే నమ్ముకొని నీరాకకై వేయికనులతో ఎదురుచూస్తున్నారు. బృందావనవాసులు జీవించేది కృష్ణప్రేమ అనే మధురనామంతో అని నేను తెలుసుకొన్నాను. శ్యామసుందరా! వారి కన్నీటి అభ్యర్థన నిన్ను కరిగించటం లేదా?"

ఉద్ధవుని మాటలు విని కృష్ణుడు, "మిత్రమా! నేను బృందావనవాసులను మరవటం అనేది కలలో కూడ జరుగనిది. ఇక్కడ నాకు జరిగే రాజభోగాలకేమీ కొదువ లేదు. అయినా నా మనసెప్పుడు బృందావనము పైనే వుంటుంది. నేను వారిని అనంతమైన విరహానికి గురి చేసినప్పటికీ, వారు నాపై ప్రేమానురాగాలను చూపుతున్నారు. ప్రేమింపబడటంలో ఎంతటి ఆనందం-సుఖం వున్నాయో స్వయంగా అనుభవించి తెలుసుకొన్నాను.

ఊధో మోహి వ్రజ బిసరత నాహీ।
వృందావన గోకుల వన-వుపవన, సఘన కుంజ కీ
ఛాహీ॥

"ఉద్ధవా! నేను బృందావనాన్ని మరవటం అన్నది జరుగనిది. బృందావనములో, గోకులములో, వనాలలో నేను గడిపిన మధురమైన ఘడియలను నేను మరవగలనని ఎలా అనుకున్నావు? గోవులను కాచి అలసి యింటి

వచ్చిన నాకు, నంద-యశోదలను చూడగానే ఎంతటి ఆనందం లభించేదో వర్ణించి చెప్ప లేనిది. నా తల్లి యశోద ఎంత ప్రేమగా-ఆప్యాయతగా వెన్న-మీగడలను తినిపించేది! అంతటి ప్రేమ తిరిగి నాకు ఎక్కడా లభించ లేదు. గోపికలతోటి, గోపబాలురతోటి ఆట పాటలతో నవ్వుతూ - త్రుళ్ళుతూ రోజులను క్షణాలలాగా గడిపివేసాను. అలాటి మధుర మైన రోజులు జీవితంలో తిరిగి రావేమో అనిపిస్తుంది నాకు.

ఊధొ మోహి వ్రజ బిసరత నాహి।
హంప సుతా కీ సుందర కగరీ, అరు కుంజని కీ
ఛాంహీ॥

"మిత్రమా! ఉద్ధవా! బృందావనాన్ని మర వటం నా తరమా? యమునా నదీ తీరాన వున్న సుందర ప్రదేశాలు, ఆ పూపొదరిళ్ళు వీటిని నేను ఎన్నడు మరువలేను. గోపబాలు రతో కలసి నేను చేసిన దుడుకు చేష్టలు వీటిని తలుచుకొన్నప్పుడల్లా నా హృదయం ఆనం దంలో పరవళ్ళు తొక్కుతుంది. ఈ మధురా నగరం వెండి-బంగారాలతో నిర్మితమైనది. ఇక్కడ అంతా కృత్రిమమైన ప్రేమ తప్ప ఏదీ లభించదు. ప్రేమ స్వరూపమైన బృందావనం జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా మనసు అధీనం తప్పు తుంది. నా దుడుకు చేష్టలను, నా అల్లరిని ఆ నంద-యశోదలు తప్ప ఎవరూ భరించ లేరేమో!

జో జన ఊధే మోహి న బిసరత,
తిహిన బిసరౌ ఏక ఘరీ।

"ఉద్ధవా! ఎవరైతే నన్ను నిరంతరం ధ్యానిస్తారో వారిని వదలి నేను ఒక్క క్షణం కూడ వుండను. వారి జన్మ-జన్మల సంకటా లను దూరం చేసి వారికి ఆనందాన్ని, సుఖ సంతోషాలను అందిస్తాను. అంతేకాదు నా రూపాన్ని, నా నామాన్ని జపించే వారిని నేను సదా రక్షిస్తూ వుంటాను. నా భక్తులకు ఎల్లప్పుడు నేను సహాయకారిగా వుంటాను. నా ఈ మాటలు సత్యం - సత్యం."

(పై సంచికలో సూరసాగరం శీర్షికలోని చివరి యంశం)
కురుక్షేత్రముల యందు రాధాకృష్ణుల కలయిక.

# హెమ్‌లాక్

ముహింత్రె

సిరోస్ అనే దీవిలోనూ, మాసిలోనా అనే దేశంలోనూ పూర్వం మాజిస్ట్రేట్ దగ్గరకు ఎవరైనా వచ్చి తాను ఆత్మహత్య చేసుకో దలచానని దానికి తగిన కారణాలు చెప్పితే చాలు వెంటనే హెమ్‌లాక్ (Hemlock) అనే విషపానీయం ఉన్న కప్పు అతని చేతికి అందించే వారట. దాన్ని త్రాగి హాయిగా పడుకొని అట్లే పోవచ్చునట! కోర్టుమూలంగా ఆత్మ హత్యకు ఇంత అవకాశం లభించడం మనకు చాల విడ్డూరంగా కనబడవచ్చు. ఇప్పుడు మనకున్న చట్టాలు ఆత్మహత్యను ఒక నేరంగా పరిగణిస్తున్నాయి. కాని ఆత్మహత్యలో కృత కృత్యులైనవాని ఆ చట్టాలు ఏ విధంగా శిక్షిస్తాయో మరి! ఆ ప్రయత్నంలో కృత కృత్యుడు కాలేక చట్టానికి చిక్కినవానికే ఆ శిక్ష అని మనం అనుకోవాలి.

కొన్ని మతాలు ఆత్మహత్యను పెద్ద పాపంగా, నేరంగా, పిరికితనంగా నిందిస్తాయిగాని హేతు బద్ధంగా ఏమీ చెప్పవు. తీవ్రబాధలకు గురైై ఇక జీవితాన్ని భరించలేని స్థితికి వచ్చిన

అ స్వచ్ఛందంగా తన జీవితాన్ని అంతం చేసుకుంటే వీళ్ళకు వచ్చే నష్టం ఏమిటి? పెద్ద నష్టమే ఉంది. "ఆహా! చూడండి! భగవంతుని సృష్టిలో అన్నీ ఎంత బాగున్నాయో చూడండి చూడండి" అనే ప్రచారధోరణి యొక్క అబద్ధాన్ని నిరూపించేవే గదా ఆత్మహత్యలు. అందుకే వారు వీటిని వ్యతిరేకిస్తారు.

ఆత్మహత్యను సమర్థిస్తూ వ్రాసే మాటలు కావివి. దీని చుట్టూ అల్లుకొనిపోయిన మూఢనమ్మకాల నెత్తిమీద నాలుగు మొట్టికాయలు వేసే ప్రయత్నమే ఇది. ఆత్మహత్య చేసుకొన్న వాళ్లు దయ్యాలు భూతాలవుతారని ఈ దేశంలో ముఖ్యంగా గ్రామాల్లో ఒక మూఢనమ్మకం. నేను 35 ఏండ్లుగా ఈ భూమి మీద ఉన్నాను. దట్టమైన చీకటిలో కూడ ఆత్మహత్య జరిగిన స్థలాల మీదుగా ఒంటరిగా నడిచిపోవడం చాల సార్లు జరిగింది. కాని ఇంతవరకు ఎక్కడ ఒక దయ్యం కూడ కనబడలేదు ఈ దయ్యాలు భూతాలు వాడి వాడి మనస్సులో ఉన్నవే అనుకుంటాను. బలహీన మనస్కులకు వాళ్ళ మనస్సుయొక్క స్పందనలే (Mental Projections) దయ్యాలుగా భూతాలుగా కనబడతాయేమో! ఒకసారి నాకిలా కల వచ్చింది. ఆ కలలో నేనున్న రూములో ఒక ఖాళీ మంచాన్ని చూశాను. ఆ మంచం అక్కడ ఎలా వచ్చింది అని ప్రశ్న వేసుకోకనే ఊరక దాన్ని చూస్తున్నాను. ఇంతలో ఆ మంచం మీదనుండి దిండు తానుగా ఎగిరివచ్చి నా మంచం మీద పడింది. దానికి నేను ఆశ్చర్యపోయానో లేదో ఇప్పుడు జ్ఞాపకం లేదుగాని "ఇదేమి దయ్యం చేష్టనా!" అని కొంత సందేహించి ఆ దిండును మళ్ళీ ఆ మంచం మీదికే విసిరేశాను. మరి కొంతసేపులో ఎవరో ఒకే క్షణంలో శిరోభాగాన్ని దేహంలోని మరోభాగాన్ని గట్టిగా నొక్కుతున్నట్లుగా ఉంది. ఆకారం కనబడలేదు కొంత గింజుకున్నాక మెలకువ వచ్చింది. అసలే ఏమిటి ఈలాంటి కల వచ్చిందే అని ఆలోచిస్తూ మళ్ళీ నిదరపోవడం జరిగింది. స్వప్నదృశ్యానికి జాగ్రద్దృశ్యానికి తేడా తెలుసుకోలేనివాళ్లెవరికైనా ఈ భీతావహమైన కల వచ్చి ఉంటే నిశ్చయంగా దెయ్యాన్ని చూశాను అని బిత్తరపోయి ఉండేవారు ఆ బిత్తరంలో వాళ్ళకు వారి మనస్సుల్లో నిండే మరికొన్ని భయంకరాకారాలు కూడ కనబడేవేమో!

టాల్‌స్టాయ్ పేరు మీరు వినే ఉంటారు. ఆయనలాగా నవలలు వ్రాసినవాడు ప్రపంచంలో ఇంతవరకు ఎవడూ పుట్టలేదని చెప్పాలి. (సంఖ్యలో కాదు వాసిలో). ఆయన వ్రాసిన యుద్ధము - శాంతి (War and Peace) అన్నా కరెనినా అనే రెండు నవలలు జగత్ప్రసిద్ధి గాంచాయి. చాలమంది యుద్ధము - శాంతి అత్యుత్తమ నవల అంటారు. బెర్ట్రాండ్ రసెల్ అభిప్రాయంలో అన్నా కరెనినా టాల్‌స్టాయ్ యొక్క అత్యుత్తమ సృష్టి. భర్తను వదలిపెట్టి ప్రియునితో కాపురం చేస్తూ చివరకు రైలుక్రింద పడి ఆత్మహత్య చేసుకొన్న అభాగిని కథయే ఇది. ఇక్కడ ఒక వాక్యంలో చెప్పినదాన్ని టాల్‌స్టాయ్ సుమారు 800 పేజీలలో ఆ జీవి యొక్క అంతస్సంఘర్షణను కన్నులకు కట్టినట్టు చిత్రిస్తాడు. మొదటినుండి చివరిదాక పాఠకునిలో అన్నా కరెనినా మీద సానుభూతి భావమే కలుగజేస్తాడుగాని ఎక్కడా గర్హించే భావానికి అవకాశం ఇవ్వడు. ఇది నవలేకదా అని ఎంత సరిపెట్టుకోవడానికి ప్రయత్నించినా ఆ అభాగిని యొక్క అంతం (ఆత్మహత్య) వలన కలిగే శోకం మనలను వదలిపెట్టడానికి కనీసం వారం రోజులైనా పడుతుంది.

ఇంత గొప్ప నవలాసృష్టికి ప్రేరణ ఏమిటి? ఒక అందమైన కులీన ప్రౌఢ వయస్కురాలు రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకొన్న సంఘటన టాల్‌స్టాయ్ హృదయాన్ని కరుణారస ప్లావితం చేసివేసింది. ఆ రసహృదయం నుండి పుట్టినదే 'అన్నాకరెనినా'! ఆత్మహత్య ఒక పాపం, ఒక క్షమించరాని నేరం అనేది సత్యమైతే అలా జరగడానికి ఆస్కారం లేదు కదా! బిల్లారంగాల అమానుషచర్య (ఇద్దరు బడిపిల్లలైన సోదరీ సోదరులను నిష్కారణంగా చంపిన ఉదంతం) విన్నప్పుడు లోకమంతా గర్హించింది. ఏ హత్యాకాండను విన్నా ఆ హత్యాకాండను చేసినవాని మీద మనకు ఏవగింపు కలుగుతుంది. కాని ఆత్మహత్యను గురించి విన్నప్పుడు మన హృదయాలలో ఏ భావాలు కలుగుతాయి? ఏవగింపు, కోపం ఇత్యాదులు కలుగవు. సానుభూతి, అనుతాపం, శోకం, కరుణ ఇత్యాది భావాలే కలుగుతాయి. ఆ చర్య అంటే, ఆత్మహత్య ఒక పాపం, ఒక క్షమించరాని నేరం అయియుంటే మన హృదయాల్లో ఎందుకటువంటి భావాలే కలుగుతాయి? కాబట్టి ఆ చర్య మరింకేదైనా అవుతుందిగాని పాపం, క్షమించరాని నేరం మాత్రం కాదు. పిరికిదనం అంటారా? అదీ సరికాదేమో! మన పిరికితనానికి ప్రధాన కారణం ఏమిటి? ఈ దేహానికి ఏమి బాధ కలుగుతుందో అని కదా! అలాంటప్పుడు దేహానికి కలిగే బాధను తృణీకరించి ఆత్మహత్యకు పాల్పడినవాళ్ళను పిరికివాళ్ళనడం అసత్యం చెప్పడమేనేమో! మనకు తెలియకనే మన హృదయం ఆ ధైర్యాన్ని మెచ్చుకుంటుంది కూడా! సరే ఇంతదూరం చర్చించాక ప్రధాన కారణం ఏమిటో చెప్పకుండ ముగించడం మంచిది కాదు కాబట్టి ఆత్మహత్యలకు ప్రధాన కారణం ఏమిటో ఆలోచిస్తాం. దేహబాధను తృణీకరించి ఆ సాహసానికి వాళ్లు ఎలా పూనుకుంటారు? వాళ్ళకంత తెగింపు ఎలా వస్తుంది! కారణం బహుశా ఇదిగా ఉండవచ్చు. మానసిక బాధ తీవ్రం అయి ఆ తీవ్రతను, ఆ మానసికక్షోభను సహించలేని స్థితికి మనిషి వచ్చినప్పుడు ఆ బాధనుండి విముక్తి పొందాలని వాంఛిస్తాడు. దానికి తరుణోపాయం అతనికి తన శరీరాన్ని చంపడమే. ఆ చర్యలో శరీరానికి కలుగబోయే బాధ అతని మానసిక బాధతో పోల్చిచూస్తే అతనికి చాల అల్పంగా తోచవచ్చు. కాబట్టే ఆ సాహసానికి పూనుకుంటాడు. కొన్ని కొన్ని సందర్భాల్లో ఆత్మహత్య చేసుకోవచ్చని చెప్పే శాస్త్రవాక్యాలున్నాయి. ఆ సందర్భాలేమిటి అని లిస్టు ఇవ్వకుండ ఒక వాక్యం మాత్రం చెప్పి ముగిస్తాను: "దుశ్చికిత్స్యమహారోగైః పీడితో వా భవేత్తు యః" - అంటే చికిత్సకు లొంగని మహారోగములతో పీడింపబడువాడు దానికి పాల్పడవచ్చునని అర్థము. కాని పాపం అటువంటివానికి దానికి పాల్పడే శక్తి మాత్రం ఎక్కడుంటుంది? శవంలాగా బెడ్ మీద పడిఉంటాడు. అతన్ని అలా ఒక నెల రెండు నెలలపాటు ప్రాణాలతో నిలబెట్టడం డాక్టర్లకు అదొక తృప్తి. ఆ జీవి యొక్క వేదనతో వాళ్ళకు పని లేదు.

శ్రీ యోగ వాసిష్ఠ కథలు-7
(స్థితి ప్రకరణము)

ఓం ప్రకాశ్

# గెలుపెవరిది?

(దామ వ్యాళ కటుల కథ

అది అర్ధరాత్రి దాటిన సమయం. ఆకాశమంతా చిమ్మ చీకటి వ్యాపించింది. భూమండలమంతా నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆలాంటి సమయంలో పాతాళంలోని ఒక రహస్య స్థావరంలో హోమాగ్ని ప్రజ్వరిల్లుతున్నది. మంత్రాక్షరాలు భీకరంగా నినదిస్తున్నాయి. భూత, పిశాచ, అసుర, రాక్షస దానవాదులకు నియమింపబడిన ఆ భయానక సమయంలో దీక్షాపరుడై శంబరుడు మంత్రాక్షరాలనుచ్చరిస్తూ అగ్నిలో ఆజ్యం పోస్తున్నాడు. ఆ స్థావరాన్ని ఘోరమైన శక్తివంతమైన రాక్షసాధిపతులు కాపాలా కాస్తున్నారు. మాయావరితమైన ఆ స్థావరం, ఇతరులకెవ్వరికీ గోచరించటం లేదు. ఆ మంత్రాలితరులెవ్వరికీ వినపడటం లేదు.

"ఓమ్, హ్రీమ్, క్లీమ్ పట్...స్వాహా."

శంబరుడు మంత్రాలు పఠించి ఆహుతులిస్తున్నాడు. యజ్ఞ కార్యం నిర్విఘ్నంగా సాగిపోతోంది. అంతలో అగ్ని పెద్దగా ప్రజ్వరిల్లి ప్రకాశించింది. ఆ ప్రకాశం మధ్యలోనుండి ఒకటొకటిగా మూడు ఆకారాలు వచ్చి చేతులు జోడించి నిలబడ్డాయి. వాటిని చూడగానే భయంకరమైన ఆ ముఖంలో మందహాసం మెరిసింది. తన విజయానికి శంబరుడు పెద్దపెట్టున అట్టహాసం చేశాడు. ఆ అట్టహాసంలోని అర్థం గ్రహించి, ఇతర రాక్షస వీరులంతా 'జయధ్వానాలు' చేశారు. ఆ అసురేంద్రుడు మిగిలిన యజ్ఞ కార్యాన్ని పూర్తి గావించాడు.

క్రతువును సమాప్తం చేసి శంబరుడు తన మంత్రాలోచన మందిరాన్ని ప్రవేశించాడు. అతనితో పాటు కొంతమంది నమ్మకస్థులయిన రాక్షస మహావీరులతన్ని అనుసరించారు. దైత్యేంద్రుడయిన శంబరుడు ఉన్నతాసనం స్వీకరించగానే, ఆ వీరులు కూడ ఉచితాసనాలలో ఆసీనులయ్యారు. తన గంభీరమైన వదనాన్ని నెమ్మదిగా పైకెత్తి, భీకరమైన నేత్రాలతో సూటిగా చూస్తూ, "ఆ ముగ్గురిని ప్రవేశపెట్టండి" అని సేవకులను ఆజ్ఞాపించాడు. ఆ ముగ్గురూ లోనికి వచ్చి నమస్కరించి నిలబడ్డారు. శంబరుడు తన మాయాదండాన్ని వారిపై ప్రసరింపజేసి "మీకు సర్వవిధమైన ఇంద్రియ చైతన్యాన్ని ప్రసాదిస్తున్నాను" అని అన్నాడు. వెంటనే వారు "దైత్యేంద్ర, నమో నమః. మేం మీ ఆజ్ఞాబద్ధులము." అని అన్నారు.

మహాబలశాలురు, భయంకరాకృతులు, మూర్తీభవించిన కాలస్వరూపులయిన, ఆ మువ్వురిని చూసి శంబరాసురుడు మహానందం పడిపోయాడు.

"చాలా కాలంగ, దేవతలతో మాకు యుద్ధం కొనసాగుతున్నది. మేమెంతటి బలశాలురను సృష్టించి, సైన్యాధిపతులుగా దేవతలపైకి పంపినప్పటికీ, వారంతా నశించిపోయారు. చివరికి మా తపశ్శక్తిని, మా మాయాశక్తిని వినియోగించి మిమ్ములను సృష్టించాను మీరు మువ్వురూ మా మాయానిర్మితాలు. మీరు ముగ్గురు ఒక్కరొక్కరుగా మా చెంతకు వచ్చి, మా ఆశీర్వాదాన్ని స్వీకరించండి."

రాక్షసేంద్రుని ఆజ్ఞ విని ఒక్కరొక్కరుగా అతని చెంతకు వెళ్ళారు. మొదటివాడు రాగానే మాయాదండాన్ని అతని శిరస్సుపై యుంచి. "నీ పేరు దాముడు. ఇకనుండి మాకు సైన్యాధిపతుడవు" అని శాసించాడు. రెండవ వాడు వచ్చాడు. "నీపేరు వ్యాళుడు. నీవు కూడ మా సైన్యాధిపతివే." అతని తర్వాత మూడవవాడు శంబరుని సమీపానికి వచ్చాడు. శంబరుడతన్ని తిలకించి, "నీవు కూడ మా సైన్యాధిపతివే. నీ పేరు కటుడు" అని అనుశాసించాడు.

"దామ, వ్యాళ, కట వీరులారా, ఇకనుండి మీరు మా సైన్యానికంతటికి సర్వసైన్యాధిపత్యం వహించండి. మా రాక్షస ప్రముఖులందరిక్కడున్నారు. వీరి సహకారంతో, మా నిత్యశత్రువులైన ఆ దేవతలను సర్వనాశనము చేయండి. నేటినుండి మీకు సర్వాధికారాలప్పగిస్తున్నాము. వెంటనే దేవతలపై దండెత్తండి. వారిని మట్టుబెట్టండి."

"ఆజ్ఞ, దైత్యేంద్రా." అంటూ ముగ్గురు సైన్యాధిపతులు నమస్కరించారు. శంబరుడు, మంత్రాంగాన్ని విరమించాడు. దామ, వ్యాళ, కటులను రాక్షసప్రముఖులు అనుసరించారు.

* * *

తెల్లని ఐరావతాన్ని ఎక్కి దేవేంద్రుడు క్రోధోద్రిక్తుడై, వజ్రాయుధాన్ని మెరిపిస్తూ బయలు దేరాడు. నికుంజములనుండి, పర్వత గుహలనుండి, సుమేరుపర్వతమునుండి, ఇతర అనేక స్థలాలనుండి, తమ వినోద విలాస కార్యక్రమాలు చాలించుకొని, అప్సరసాంగనలను

గుంపులు

[illegible]

చాయి. వారి సింహనాదాలు, అట్టహాసాలు ప్రళయకాలమందలి భీకరసంక్షోభాన్ని తలపింప చేసాయి.

దేవసైన్యం కొంతదూరం అలా పయనించి, ఒకచోట ఆగిపోయింది. ఆ వెనువెంటనే, వ్యూహబద్ధమై, యుద్ధానికి సంసిద్ధమైంది. అదే సమయంలో, దైత్యేంద్రుని రాక్షససేన ఉప్పొంగుతూ వచ్చిపడింది. దామ, వ్యాళ, కటుల సైన్యాధిపత్యంలో దేవతలపైకి ఉరికింది. ఇరువురికీ రణం ఆరంభమయింది. ఆ యుద్ధసంరంభానికి భువనసభోంతరాలు దద్దరిల్లాయి. సంగ్రామం మహాఘోరంగా జరిగింది రక్తపుటేరులు ప్రవహించాయి. అవయవాలు చిన్నాభిన్నమై చెల్లాచెదరుగా పడిపోయాయి. దైత్యులది క్రమంగా పైచేయి అయింది. వారి ధాటికి ఆగలేక దేవసైన్యాలు వెన్ను తిప్పి పలాయనం చేసాయి. దేవేంద్రునికి ఘోరపరాజయం దాపురించింది. దైత్యేంద్రుడు విజయగర్వంతో, దామాదులను కొనియాడాడు.

పరాజితుడైన స్వర్గాధిపతి చింతామగ్నుడై, ఆలోచించాడు. ఈ విపత్సమయంలో తమను ఆదుకునేవాడు ఆ బ్రహ్మ ఒక్కడేనని ఎంచి, బ్రహ్మలోకానికి పయనం కట్టాడు. దేవతలు తనను అనుసరించగా, దేవేంద్రుడు, బ్రహ్మను సమీపించి చేతులెత్తి నమస్కరించాడు.

"పితామహా, బ్రహ్మదేవ! మీకివే మా వందనాలు, దైత్యులు మరల మాపై దండెత్తి, మమ్ము పరాజితులను చేశారు. దేవా, ఇక నీవే మాకు దిక్కు. నీవే మాకు రక్ష. పాహి మాం, పాహి మాం, పాహి."

దేవేంద్రుని దీనాలాపాలు విని బ్రహ్మ

"దేవేంద్ర, విచారించకు. శంబరునికి కాలం సమీపిస్తున్నది. అయితే ఈమారు, అతను సృష్టించిన దామవ్యాళకటులనే సైన్యాధిపతు లున్నారే, వారు బహు విచిత్రమైనవారు. వారికిదియే ప్రథమ జన్మ. వీరు శంబరుని మాయా జనితులు. గతజన్మ వాసనలు లేని ఆ సైన్యాధిపతులకు సంకల్ప వికల్పాలు లేవు. భయం, శంకా మున్నగు వికారాలేవీ లేవు. వారు చిన్మాత్ర సన్నిధానంలో నిర్వికల్పులై, దేహ భ్రాంతి లేకయున్నారు. ఇలాంటివారిని ఎవరూ జయించలేరు.

"వాసనామయులు, ఆశాపాశబద్ధులు మాత్రమే ఇతరులకు వశీభూతులవుతారు. వారు ఎంత గొప్పవారైనా సరే, ఎంతటి విద్వాంసులైనా సరే, నిర్జింపబడతారు. శరీరాదులు, ఇంద్రియాదులు నేను - అన్న భ్రాంతియే వాసనలకు మూలం. ఈ భ్రాంతి మూలకంగ, దేహాత్మ భావన కల్గి మనిషి ఎంత ప్రాజ్ఞుడైనా, దీనత్వాన్నే పొందుతాడు. తన స్వరూపము అనంతము, అపరిచ్ఛిన్నమని గ్రహించక, తాను కేవల శరీరప్రాయుడననే కల్పించుకొనేవాడు, సత్వర నాశనాన్ని పొందుతాడు. వాసనల కారణంగ, జీవికి అసత్యదృశ్యమందు సత్యభ్రమ జనిస్తుంది. ఆ భ్రమయే నిజమనుకొని, అతి జటిలమైన సంసారాన్ని సృష్టించుకొని, అందులో చిక్కుకుపోతాడు. తద్వార అనేక దుఃఖాలను కొని తెచ్చుకొని, శోకమగ్నుడౌతాడు. దేహము నశించిన, తాను నశించినట్లు భ్రాంతి చెంది పిరికితనానికి, భయానికి, దైన్యానికి వశుడైపోతాడు. తృష్ణ, ఇదొక భయంకరమైన వాసనావికారము. సమస్త ఆపదలు, భావాభావదశలు దీన్ని ఆశ్రయించియుంటాయి. దీనిద్వార విపరీత జ్ఞానం జనిస్తుంది. చిత్తం చంచలమై పోతుంది. చివరికి జీవి మృత్యువాత బడిపోతాడు.

"దేవేంద్రా, దామాదులిప్పుడు వాసనారహితులై, అహంభావ శూన్యులై, సుఖదుఃఖ వర్జితులై యున్నారు. అందుకే వారిలో అపరిమితమైన ధైర్యం, పరాక్రమం ఉన్నాయి. వారి నిప్పుడెవరూ జయించలేరు."

బ్రహ్మదేవుడిలా చెప్పేసరికి, దేవేంద్రుడు మరింత దీనవదనుడై పోయాడు.

"బ్రహ్మదేవ, ఇక మాకు దారి లేదా! రక్షణ లేదా?"

"దేవేంద్రా! అహంకారయుతులైనవారినే జయించటం సాధ్యం. ఎందుకంటే అహంకారం కారణంగా పరమార్థజ్ఞానం మరుగున పడియుంటుంది. ఆశ, తృష్ణాదులు పెరిగి, మనిషి సర్వవిధ వికారాలకు లోనౌతాడు. సంసార-బంధ కారణమైన మహా మోహపు వలలో పడిపోతాడు. ఈ అహంకారమే గొప్ప అజ్ఞానము. ఇదియే సుఖదుఃఖాలకు జయాపజయాది ద్వంద్వాలకు ఆశ్రయము. అహంకారం లేనివానికి అజ్ఞానం లేదు. అజ్ఞానం లేనివారికి సంకల్ప వికల్పాత్మకమగు మనసు లేదు. నిశ్చల మనసులను ఎవరు కూడ ఏమీ చేయలేరు. అలాంటి నిర్వికార స్థితిలో ఈ దామాదులున్నారు. వీరిని జయించాలంటే, ఒకే ఒక ఉపాయమున్నది."

"ఏమిటది చతుర్ముఖ దేవా!"

"వారిలో అహంభావ బీజాన్ని మొలకెత్తించాలి."

"అదెలా సాధ్యం పితామహా!"

"చెబుతాను. ఇటురా." అంటూ బ్రహ్మ దేవేంద్రుని తన చెంతకు పిలుచుకొని రహస్యంగా ఉపదేశించాడు. ఆ ఉపదేశం విన

గానే ఇంద్రుని ముఖంలో ఆనందం ప్రకాశించింది. అతను బ్రహ్మదేవునికి నమస్కరించి, పరివారాన్ని వెంటబెట్టుకొని వెడలిపోయాడు. పక్కనే ఉన్న సరస్వతీ దేవి, బ్రహ్మను అలవోకగా వీక్షించి, "నాథా, ఏమిటీ ఉపదేశించారు" అంది. బ్రహ్మ ఆమె వైపు ఒకసారి చూసి, చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. సరస్వతీ దేవికి ఏమీ అర్థం కాలేదు. మరలా అడుగుదామని అనుకొంది కాని అప్పటికే బ్రహ్మ, తన ఆత్మధ్యానంలో విలీనుడై పోయాడు. సరస్వతీ దేవి చేసేదిలేక, చూపులను క్రిందికి వాల్చింది.

* * *

"ఈమారు కూడ విజయం మాదే..." అంటూ సంతోషంగా కేకలు పెట్టారు రాక్షసులు. పారిపోతున్న దేవతలను చూసి దామ వ్యాళ కటాదులు మీసాలు మెలివేసుకొన్నారు. ఎందుకో వారిలో ఇంతకుపూర్వం లేని విజయపరంపరయుతమైన సంతోషం జనించింది. వారి ముఖాలు గర్వంతో అలముకున్నాయి.

బ్రహ్మదేవుని వీడిన తర్వాత దేవతలు ఎన్నోమారులు దైత్యులతో యుద్ధం చేశారు. అన్ని యుద్ధాలలో కూడ దామాదులు గర్వపడుతుండగా, పలాయనం చేశారు. ఇలా అనేకసార్లు జరిగింది. దామాదులను చూస్తూనే, భయభీతులై పారిపోయేవారు. "పిరికిపందలు!" అని దామాదులు సంతోషించారు. దైత్యులు దామాదులను మెచ్చుకోసాగారు. కొన్నిమార్లు దేవతలు సైతం దామాదులు మహాశూరులని స్తుతించారు. దామాదులలో క్రమంగా వ్యక్తిత్వభావం వ్యాపించసాగింది.

"మేము యింతటి వారమన్నమాట. ఈ జయపరంపరలన్నీ మా శక్తిసాధితములే నన్నమాట. ఈ జయాలమూలంగా గౌరవం, యశస్సు లభిస్తున్నాయో కదా! ఈ యశస్సును చిరకాలం నిలుపుకోవాలి. ఈ గౌరవాన్ని ఎప్పుడూ పొందుతుండాలి. వీటిని అనుభవించాలంటే, మేము జీవించాలి కదా! జీవించటానికి ధనాది సంపదలను సేకరించాలి కదా!"

దామ వ్యాళ కటుల్లో నేను - నాది అన్న భావం ప్రవేశించింది. దానికనుగుణంగా తృష్ణ ఉప్పళించింది. వారు సంపదలను సంగ్రహించుకొన్నారు. ఆ సంపదలెక్కడ నశిస్తాయో నన్న భీతితో తగిన రక్షణలు కల్పించుకొన్నారు. ఇలా దామాది దైత్యసైన్యాధిపతులలో మనోవికారాలు బయలుదేరాయి. తద్వార శరీర ధ్యాస ఏర్పడింది.

అంతవరకు తమ శరీరాలను రక్షించుకోవాలని, పోషించుకోవాలని అనుకొనేవారు కాదు. కాని అహంభావప్రవేశంతో శరీర రక్షణకై జాగ్రత్తలు గ్రహించసాగారు. అలా వారు అపరిమిత శక్తివంతులమన్న భావం నుండి, పరిమితశక్తులమన్న భావనలోకి దిగివచ్చారు. సర్వవ్యాపక భావం నుండి, శరీరస్థితికి దిగజారారు. ఉపకరణమాత్రమే నన్న భావం నుండి వ్యక్తిత్వభావంలోకి వచ్చేశారు. అంతే, వారు పతనానికి చేరువయ్యారు.

దేవతలు ఇలాంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్నారు. తగిన సమయం చేకూరగానే, వారు ఒక్కపెట్టున దైత్యులపై దండెత్తారు. ఘోరసంగ్రామం జరిగింది. మునుపటిలా దామాదులు నిర్భీతులై పోరాడలేకపోయారు. తమ స్వరక్షణలో వుంటూ భయస్థులై యుద్ధం చేశారు. ముందులా యంత్రప్రాయంగా దేవతలను ఛేదించలేకపోయారు.

...ఘంగాన అన్న భావాన్ని అనుసంధానం చేసుకొంటూ యుద్ధం చేశారు ఇలాంటి యుద్ధ మూలకంగా, వారి అపరిమిత శక్తి వీగిపో యింది శక్తిహీనులయిన దామాదులను దేవ తలు తరిమి కొట్టారు.

దామ వ్యాళ కటులు రణరంగాన్ని ! శరీరరక్షణ నిమిత్తం పారిపోయారు. దేవత లలో ఆనందం జయోత్సాహం పెచ్చు పెరి ... దైత్యులు భీతచిత్తులై పలాయాన మంత్రం పఠించారు.

దైత్యుల అపజయ వార్త విని శంబరుడు ఖిన్నుడయ్యాడు. దామాదులలో జనించిన అహంకారవృత్తికి క్రుద్ధుడయ్యాడు. వారిని తక్షణమే నాశనం చేయాలనుకున్నాడు. కాని దామ వ్యాళ కటులు, అప్పటికే అతని తల పెరిగి భయపడి సప్తమపాతాళంలో జొరబడి, అక్కడ రహస్యవాసం ఏర్పరచుకున్నారు. "ఈ అహంభావం ఎంత పని చేసింది! దీని కంతటికీ ఈ దేవతలే కారణం. పారిపోతున్నట్లు నటించి, వీరిలో అహంబీజాలు నాటారు కదా! నిజంగా దేవతలు కడు యుక్తిమంతులే!" అని శంబరుడు, విచారమగ్నుడై కూర్చుండి పోయాడు.

"ప్రాణప్రియా, ఇప్పుడర్థమయింది" అంది సరస్వతీదేవి, ముసిముసిగా నవ్వుతూ.

"ఏమిటర్థమయింది, వీణాపాణీ!"

"మీ యుక్తి. దేవతలకిచ్చిన మీ ఉప దేశం."

"ఓహో! ఆ సంగతా. అదుగో ఏదో కల కలం వినవస్తున్నది. దేవతలు వస్తున్నట్లు న్నారు"

"తమ విజయవార్త తెలియజేయటాని కి-"

దేవేంద్రుడు ఉత్సాహంగా వచ్చి, కమల పుష్పాలను బ్రహ్మపాదాల చెంత వుంచి వంద నం చేశాడు.

"పితామహా! మీ యుక్తిమూలకంగా, మేము తిరిగి మా స్వర్గరాజ్యాన్ని సంపాదించు కున్నాము. మీకివే మా ధన్యవాదాలు."

"దేవేంద్ర, విజయం మాట అటుండనీ, దైత్యులలో అహంభావం సూర్చిన చర్యలు నీ కర్థమయ్యాయా."

"ఏదో కొంత. ఆ వివరాలన్నీ మీరే చెప్పాలి.

"కాదు, చదువుల తల్లి, ఈ సరస్వతీదేవి చెబుతుంది" అని సరస్వతిని విలకించాడు. నాథుని ఆజ్ఞగొని, సరస్వతీదేవి కోమల కంఠం విప్పి, వీణ మీటింది.

"సంగీతయుతంగా వద్దమ్మా. దయచేసి మామూలుగానే చెప్పు. నీ కంఠంలోనే సర్వ మాధుర్యాలున్నాయి తల్లీ" అని ఇంద్రుడు, ఎక్కడ సంగీతాలాపన వినవలసివస్తుందోనని కంగారు పడిపోయాడు. అతని కంగారుకు వాణీ బ్రహ్మలిరువురు మందహాసం చేశారు, సరస్వతీదేవి వీణను పక్కకు పెట్టి, దేవతలవైపు దృష్టి సారించింది.

"అహంకారం ఎంత శక్తివంతమైనదో చూశారు కదా! అజేయులయిన ఆ దామాదు లనే పిరికిపందలుగా మార్చివేసింది. ఈ అహం కారంనుండే సర్వసంసార శాఖలు బయలుదేరి, జీవిని బద్ధునిగా మార్చివేస్తాయి. జీవి స్వేచ్ఛను హరిస్తాయి. నిజమాలోచించి చూస్తే, ఈ అహంకారమనేది లేనేలేదు. ఇది కేవలం మిథ్యాస్వరూపం. జీవులు భ్రమలో పడి, నేను,

గానే ఇంద్రుని ముఖంలో ఆనందం ప్రకాశించింది. అతను బ్రహ్మదేవునికి నమస్కరించి, పరివారాన్ని వెంటబెట్టుకొని వెడలిపోయాడు. పక్కనే ఉన్న సరస్వతీదేవి, బ్రహ్మను అలవోకగా వీక్షించి, ''నాథా, ఏమిటీ ఉపదేశించారు'' అంది. బ్రహ్మ ఆమె వైపు ఒకసారి చూసి, చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. సరస్వతీదేవికేమీ అర్థం కాలేదు. మరలా అడుగుదామని అనుకొంది కాని అప్పటికే బ్రహ్మ, తన ఆత్మధ్యానంలో విలీనుడై పోయాడు. సరస్వతీదేవి చేసేదిలేక, చూపులను క్రిందికి వాల్చింది.

* * *

''ఈమారు కూడ విజయం మాదే...'' అంటూ సంతోషంగా కేకలు పెట్టారు రాక్షసులు. పారిపోతున్న దేవతలను చూసి దానవ వ్యాళకటాదులు మీసాలు మెలివేసుకొన్నారు. ఎందుకో వారిలో ఇంతకుపూర్వం లేని విజయపరంపరయుతమైన సంతోషం జనించింది. వారి ముఖాలు గర్వంతో అలముకున్నాయి.

బ్రహ్మదేవుని వీడిన తర్వాత దేవతలు ఎన్నోమారులు దైత్యులతో యుద్ధం చేశారు. అన్ని యుద్ధాలలో కూడ దానవాదులు గర్వపడుతుండగా, పలాయనం చేశారు. ఇలా అనేకసార్లు జరిగింది. దానవాదులను చూస్తూనే, భయభీతులై పారిపోయేవారు. ''పిరికిపందలు!'' అని దానవాదులు సంతోషించారు. దైత్యులు దానవాదులను మెచ్చుకోసాగారు. కొన్నిమార్లు దేవతలు సైతం దానవాదులు మహాశూరులని స్తుతించారు. దానవాదులలో క్రమంగా వ్యక్తిత్వభావం వ్యాపించసాగింది.

''మేము యింతటి వారమన్నమాట. ఈ జయపరంపరలన్నీ మా శక్తిసాధితములేనన్నమాట. ఈ జయాలమూలంగా గౌరవం, యశస్సు లభిస్తున్నాయో కదా! ఈ యశస్సును చిరకాలం నిలుపుకోవాలి. ఈ గౌరవాన్ని ఎప్పుడూ పొందుతుండాలి. వీటిని అనుభవించాలంటే, మేము జీవించాలి కదా! జీవించటానికి ధనాది సంపదలను సేకరించాలి కదా!''

దానవ వ్యాళకటుల్లో నేను - నాది అన్న భావం ప్రవేశించింది. దానికనుగుణంగా తృష్ణ ఉవ్వెత్తున ఉప్పొంగింది. వారు సంపదలను సంగ్రహించుకొన్నారు. ఆ సంపదలెక్కడ పోతాయో అన్న భీతితో తగిన రక్షణలు కల్పించుకొన్నారు. ఇలా దానవాది దైత్యసైన్యాధిపతులలో మనోవికారాలు బయలుదేరాయి. తద్వారా శరీర ధ్యాస ఏర్పడింది.

అంతవరకు తమ శరీరాలను రక్షించుకోవాలని, పోషించుకోవాలని అనుకొనేవారు కాదు. కాని అహంభావప్రవేశంతో శరీర రక్షణకై జాగ్రత్తలు గ్రహించసాగారు. అలా వారు అపరిమిత శక్తిమంతులమన్న భావం నుండి, పరిమితశక్తులమన్న భావనలోకి దిగివచ్చారు. సర్వవ్యాపక భావం నుండి, శరీరస్థితికి దిగజారారు. ఉపకరణమాత్రమే నన్న భావం నుండి వ్యక్తిత్వభావంలోకి వచ్చేశారు. అంతే, వారు పతనానికి చేరువయ్యారు.

దేవతలు ఇలాంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్నారు. తగిన సమయం చేకూరగానే, వారు ఒక్కపెట్టున దైత్యులపై దండెత్తారు. ఘోరసంగ్రామం జరిగింది. మునుపటిలా దానవాదులు నిర్భీతులై పోరాడలేకపోయారు. తమ స్వరక్షణలో వుంటూ భయస్థులై యుద్ధం చేశారు. ముందులా యంత్రప్రాయంగా దేవతలను ఛేదించలేకపోయారు.

ఉంచి, దానికి దూరంగా తొలగటమో, చంపడమో చేస్తారు. ఇక్కడ వారి సామర్థ్యాలన్నీ క్షణంలో పీగిపోయాయి. అదే ఒక పసిబాలుని చెంతకు భయంకరమైన నాగుపాము వచ్చినా, వాడు దాన్ని అలవోకగా పట్టి బిగించి ఆడుకొంటాడు. అప్పుడా భయంకరసర్పమే భయపడి చస్తుంది గాని, ఆ పిల్లవానికీసుమంతకూడ భయభ్రాంతులు కల్గవు. పసిపిల్లవాడు భయపడకపోవటానికి, మహామహావ్యక్తులు భయపడటానికి కారణమేమిటి? ఏమీ లేదు. అహంభావమే. పిల్లవానిలో తన దేహం - దేహాభిమాన ఉన్న భావాలు లేవు. తాను తన భావనలోనే యున్నాడు. తాను శక్తిమంతుడనని, శక్తిహీనుడనని ఉన్న భావాలు వానికి లేవు. అందుకే వానిలో నిర్భయత్వం, నిశ్చలత కనిపించాయి. ఆ పిల్లవానిలో పెద్దవానిలో లేని ఒవితశక్తి గోచరించింది. ఇక పెద్దవారి విషయానికొస్తే వారు భయపడవలసిన అవసరమే లేదు. కాస్త తెలివి నుపయోగించి, ఆ పామునుండి తప్పుకోవచ్చు. పైగా పాము కాటేసినా మంత్రమో, వైద్యమో, ఆ కాటునుండి రక్షణ కల్పిస్తాయి. అయినా భయపడలేరు, కారణం వారు, తామెంతవారైనా, దేహభావనలోనే యున్నవారు కాన, సామాన్యునిలా శక్తిహీనులై పోయారు.

కేవలం భావమే మనిషిగతిని నిర్ణయిస్తుంది. భారతీయునికి క్రూరస్వరూపంలోనున్న దుర్గామాత విగ్రహం రాత్రివేళలో కనబడితే భయం పుట్టుకొస్తుంది. అదే పాశ్చాత్యుడికైతే, అదొక శిల్పవిశేషంగా తోస్తుంది. పైగా దాని ఫోటోలు కూడ తీసుకుంటాడు. ఇక్కడ వస్తువు భయకారణం కాలేదు, భావమే భయకారణమైంది. కొందరు తమ నీడను చూసుకొని తామే భయపడతారు. మరికొందరు రాత్రివేళల్లో ఒంటరిగా పడుకోటానికి భయపడతారు. మరికొందరు రాత్రివేళల్లో బాత్ రూంలోకి వెళ్ళటానికి సైతం భయపడతారు. ముఖ్యంగా సుఖ సౌఖ్యాలధికమైన నేటి సమాజంలోని మనిషికి అడుగడుగునా భయాలే అధికమౌతున్నాయి. దీనికి కేవలం తనలోనున్న దుర్బలభావమే కారణం. అహం రూపంలోనున్న ఈ దుర్బలత్వం కారణంగానే మహాశక్తిమంతులైన దానవాదులు పీచమోముల, తమోయోనుల పాలయ్యారు.

—పై సంచికలో "పర్వతంపై ప్రబోధం"

నభోమండలంలో ఖగోళాలను
పల్కరించి పరిశోధించి వద్దామని లేదు
భూమండలంలో చిల్లులున్న గుడిసెలను
దర్శించి స్పర్శించి ముచ్చటిద్దామని ఉంది
కోట్లకొద్ది రూకలు వెచ్చించి
స్పేస్ షటిల్లను స్పేస్ స్టేషన్లను నెలకొల్పాలని లేదు
ఉన్నంతలోనే ఆ ప్రజాధనాన్ని
బ్రతికియున్న ప్రతి మనిషికీ
పూట తిండి కూడ కట-కట పడే దరిద్రునికీ
దినమంతా శ్రమించి, ఫలితాన్ని పొందని జీవికీ
ఒక్క పూటైనా సమగ్రమైన తిండిని
ఉత్పత్తి చేసి పెట్టేందుకు వినియోగించాలని ఉంది
అన్వేషణకై పూనుకోవాలని లేదు
మనుష్యులై, మనుష్యుల మధ్యనే ఉంటూ
శునకాల కన్నా హీనంగా బతుకుతున్న
దీనుల గుండెల్లోకి తొంగిచూడాలని
లోతుకు వెళ్ళిన వారి కన్నుల్లోకి వంగి చూడాలని
ఆ గుండెల బరువులను తొలగించాలని
ఆ కన్నుల్లో కాంతి వెల్గించాలని ఉంది
విశ్వం భరా, విశ్వనాథా, భగవాన్ !
నా కాశక్తిని సామర్థ్యాన్ని ప్రసాదించు
మనిషి తర్వాతే ధీమంతునికి మిగతావన్నీ
అన్న సద్భావాన్ని
వైజ్ఞానికులమైన మాలో కల్గించు.

—శ్రీ [illegible] మల్లేశం గారి "[illegible]" నుండి

# సద్దర్శనము

వివరణము: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

ఇందులో నేను అనే వస్తువును వివరిస్తున్నారు.

24. దేహో న జానాతి సతో న జన్మ
దేహప్రమాణోఽన్య ఉదేతి మధ్యే
అహంకృతిగ్రంథివిబంధ సూక్ష్మ
శరీర చేతోభవ జీవనామా

ఆంధ్రానువాదం:- ఈ ప్పష్టిన శరీరానికి తెల్సుకొనే శక్తి లేదు. జడం, అచేతనం కాబట్టి 'తెలివి' అయిన ఆత్మకు పుట్టుక లేదు. ఈ రెంటికి మధ్య శరీరాన్ని ఆశ్రయించుకొని మరి ఒక వస్తువున్నది. దాన్నే అహం అని, సంసారం అని, హృదయగ్రంథి అని, బంధం అని, అంతఃకరణ అని, జీవుడని, సూక్ష్మశరీరం అని అనేక విధాలుగా పిలుస్తారు.

వివరణం:- శరీరం, మనస్సు లేకుండా తనంతతాను ఏదీ తెల్సుకోలేదు. మనస్సు, బుద్ధి ఉంటేనే పని చేస్తుంది. ఈ బుద్ధిని నేను అనే అహం పని చేయిస్తుంది. జీవితం అంటే వీటిగుండా అనుభూతి. మన చైతన్యం, జ్ఞానం, జాగరూకత అన్నీ ఈ అనుభూతిలో ఉన్నాయి. గాఢ నిద్రలో శరీరం ఉన్నప్పటికి తనను గాని, ప్రపంచాన్ని గాని - వీటిగురించి ఎరుక లేదు. ఏమంటే నిద్రలో, తెల్సుకొనే శక్తి గల పనిముట్లు లేదు. శరీరం మనస్సూ, బుద్ధీ యొక్క చేతుల్లో కీలుబొమ్మ. అవి లేకపోతే కదలదు. ఈ శరీరానికి ఇలాంటి జడత్వం కాక ఇంకా కొన్ని విశేషాలు ఉన్నాయి. ఇది పుట్టుతుంది. కొంతకాలం అయినాక నశిస్తుంది. అంటే దీనికి మొదలూ తుదీ కూడా వున్నాయి. ఇది మనకు కనపడుతుంది. లావు, సన్నం అవుతుంది. దీనికి అందం, ఆకారం వున్నాయి. రోగం, ఆరోగ్యం ఉన్నాయి. కాబట్టి శరీరంయొక్క ప్రధానగుణాలేమిటంటే: నిశ్చేతనం, జడత్వం, చావు పుట్టుకలు, బరువు మొదలైన పదార్థ ధర్మాలు, పనిచేయుట. పరమసత్యమైన ఆత్మ ధర్మాలేమిటంటే: అది (1) శుద్ధచైతన్యం. (2) దానికి జనన మరణాలు, ఎదుగు బొదుగులు మొదలైన మార్పులు లేవు. (3) అది పాంచభౌతికమైన పదార్థం కాదు. అది శుద్ధ సచ్చిదానందం. (4) అది ఏపని చేయదు. నిష్క్రియం - సాక్షి కాబట్టి చావు పుట్టుకలు కలిగిన శరీరానికి, నిత్య వస్తువైన ఆత్మకు పూర్తిగా లేదు. ఎక్కడా పోలిక లేదు. అయినప్పటికీ చిత్రం ఏమిటంటే ఈ రెంటినీ కల్పిస్తుంటూ-

యి. ఇటువంటి విరుద్ధధర్మములు గల వస్తువు సన్నిహితంగా ఉండట ఎలా కుదురుతోంది? ఈ రెంటికీ అను బంధం ఏమిటి? ఈ రెంటిని ఏకం చేసేది మూడవది - 'నేను' అనే అహంకారం. అది ఆత్మలోంచి పుట్టి ఆ సంగతి మరచిపోయి మనస్సు బుద్ధిగా శరీరంగా బయటకు వచ్చి అవి అన్నీ 'తాను' 'తనదీ' అని అనుకుంటుంది. కాని దాని ఉనికీ శక్తీ, అన్నీ ఆత్మనుంచే గ్రహిస్తుంది. ఈ విషయంమాత్రం గుర్తించక, ఇవన్నీ తన శరీరాదులనే దురభిమానంతో వ్యవహరిస్తూ వాటిని అంటి పెట్టుకొని సుఖదుఃఖాదులు అనుభవిస్తూంటుంది. ఇలా శరీరాభిమానంతో ఉన్నంతవరకు ఆత్మ గోచరించదు. ఏక్షణంలో వీటిని వదిలి లోపలిచూపు కలిగితే ఆ క్షణంలో శరీరజ్ఞానం పోతుంది ఆత్మజ్ఞానం కలుగుతుంది. 'నేను' ఆత్మలో లీనం అయినప్పుడే ఆత్మసాక్షాత్కారము సిద్ధిస్తుంది. మహర్షి వారు ఇక్కడ అహం యొక్క పర్యాయపదాలతో దానియొక్క విశేషాలను తెలియచెప్పుచున్నారు. 1. అహంకారం: ఇది ఆత్మనుంచి బయటికి వచ్చే మొదటి అవతరణ. ఈ 'నేను' తరువాతనే 'నా బుద్ధి', 'నా మనస్సు', 'నా శరీరం' మొదలైన ప్రపంచ కలాపం అంతా వస్తుంది.

2. హృదయగ్రంథి: గుండెకు సంబంధించిన 'ముడి'. దీనివల్లనే ఆవరణ అనగా ఆత్మను కప్పివేయుట, విక్షేపం మరోవిధంగా విలపించడం జరుగుతవి. ఆత్మనుంచి పుట్టిన 'నేను' ఆత్మను విస్మరించి స్ఫురింపకుండా చేస్తుంది. తరువాత ఆత్మకంటె వేరైన మనస్సుగా, బుద్ధిగా, శరీరంగా, ప్రపంచముగా నాటకం ఆడుతుంది. మేలుకున్నప్పుడూ కలలోనూ ఆవరణ విక్షేపాలు రెండూ ఉంటాయి. గాఢనిద్రలో ఆవరణ అంటే ఆత్మ కనబడకపోవడం ఒకటే ఉంటుంది. ఆవరణం అంటే చెఱువులో నీటిపైనుంచి దాన్ని కనపడకుండా చేసే నాచువంటిది. ఈ నాచు చెఱువు నీరు అడుగునుంచే పుట్టి పైకి వచ్చి ఆ నీటిని కనపడకుండా చేస్తుంది. కొంచం కొద్దిగా గాలి వీస్తే చిన్నచిన్న కెరటాలు పుట్టి అక్కడక్కడ ఆ నాచు తప్పుకుంటుంది. అపుడు మనదృష్టి కొంతవరకూ నీటిలో పోయినప్పటికీ, దాని అడుగు ఈ కెరటాల అడ్డువల్ల కనబడదు. ఆ నీటిని స్పష్టంగా మనం చూడాలంటే అపైన నాచు పోవాలి. అదే విధంగా నిద్రలో ఆత్మ తెలియబడకుండా పూర్తిగా అజ్ఞానం కప్పేస్తుంది. అజ్ఞానం అంటే తెలియకపోవ

టియే కదా! మెలకువలోనూ కలలోనూ ఈ అజ్ఞానం కొద్దో గొప్పో తొలగటంవల 'నేను' గుండా ఆత్మ చైతన్యం బయటికి వస్తుంది. కానీ 'నేను' వల్లనంచి పుట్టిన శరీరాది ప్రపంచం, దాన్ని గుర్తించకుండా చేస్తుంది. వీటి వల్ల ఆత్మను తొంగికూడా చూడలేము కాబట్టి ఆత్మ దర్శనం కావాలంటే ఆత్మను కప్పే అజ్ఞానం వంటి నాచు పోవాలి. నీటిమీద కెరటాలవంటి ఆలోచనలు ఉండకూడదు. అంటే గాఢ మెలకువతో. ఆలోచనలు లేని మనస్సుంటే ఆత్మలాభం కలుగుతుంది. అట్టి మనస్సు ఆత్మలో లీనం అయిపోతుంది.

3. బంధం:- అంటే ప్రపంచానికి కట్టుబడి అంటి పెట్టుకుని ఉండట - ఈ ప్రపంచం వల్ల, సంసారం వల్ల, సంపదలవల్ల ఏదో సుఖం పొందుతామని కదా ఈ అంటి పెట్టుకోవడం? ఇది తనలోని పూర్ణానందస్వరూపమైన, ఆత్మను గుర్తించకపోవడం, ఈ శరీరం. మానసిక భౌతిక సుఖాలకోసం వెతకడం? రాగ ద్వేష భయాలే ఈ కార్యానికి ముఖ్యకారణాలు. రాగం అంటే తనకు సుఖం ఇచ్చేవాటి యందు మక్కువ: ద్వేషం అంటే తనకు బాధను కలిగించేవాటియందు ఏహ్యత; భయం తనయొక్క ముందు గతిని గురించి ఆందోళన; మన వ్యవహారమంతా ఈ మూడింటిలో కొన్నిటి మీద ఆధారపడి ఉంటుంది, ఈ మూడింటికి ఆధారం మన ద్వైతబుద్ధి - అంటే తాను వేరు మిగిలిన ప్రపంచం అంతా వేరు అనే భేదభావం - తానొక పక్షం - తన దైవంతోపాటు కూడ, మిగతా ప్రపంచం ఒకపక్షం - అట్టి స్థితిలో తనకంటే వేరుగానుండే పక్షంలో కొంత ప్రియం, కొంత అసహ్యం. తనకు ముందు ముందు సుఖముండదేమోనని భయం - చాలా వరకూ అట్టి భయం వల్లనే మనకు దేవుడు కావాలి - ఈ భయానికి దారితెన్నూ లేదు. చావంటే, రోగం అంటే, దరిద్రం అంటే. తుదకు మార్పంటే కూడా భయం. దీని కంతకూ 'నేను' అనే అహంకారమూలం ఉన్నంతవరకు అది ఆత్మను కప్పేసి ఈ ప్రపంచం. తన శరీరం. మనస్సు బుద్ధీ తాను అనే నాటకం ఆడుతుంది. అసలు సత్యం, ఆత్మకంటే వేరే ఏ వస్తువూ లేదు - ఆత్మయే అంతకూ మూలం ఈ సత్యం దాచేసి ఈ 'నేను' ఈ ప్రపంచంగా విలసిస్తూ వాటియందు అభిమానంతో అంటిపెట్టుకుంటుంది. తన మూలమైన ఆత్మను మరచి ఈ ప్రపంచం అంతా తన మనోవికారమని గ్రహించక వాటియందు లంపటించి ఉంటుంది. దేహమే తానని ఈ ప్రపంచమంతా తనకంటే వేరని వ్యవహరిస్తుంది. అందుచే ఈ ద్వైతభావానికి మూలం 'నేను' - దానివల్లనే రాగ ద్వేష భయాదులు! అందుచే ఈ 'నేనే' బంధానికి కారణం - బంధం అని పేరు ఇందువల్లనే దీ కిచ్చారు. 'సూక్ష్మశరీరం' అది మనస్సు, బుద్ధి, నేనుతో కూడిన యంత్రాంగం - దీని చలనాలే ఆలోచనలు. ఇదే నిద్రలో కలలు కంటుంది - మెలకువలో బాహ్యప్రపంచంగా ఉంటుంది ఇది స్థూల శరీరం కాదు కానీ భావనారూపంగా ఉండే శుద్ధచైతన్య స్ఫురణ! వాసనాజాలం అంతా! జీవితం ఇదే ధరించి స్థూల శరీరభంగం అయినపుడు, ఈ వాసనలన్నింటినీ తీసుకొని వెళ్లి, మళ్ళా కొత్త శరీరంలోకి ప్రవేశించి కథ నడిపిస్తుంది చేతస్సు - అంటే మనస్సు. బుద్ధి శరీరంతో కూడుకున్న అంతఃకరణం మనలో కలిగే ఆలోచనలు, అనుభూతులు, ఆశయాలు, అన్నీ ఇందులోనే ఉన్నవి.

భవము-సంసారం. మనమూ మన ప్రపంచం, ఆలుబిడ్డలూ అన్నీ మనం వ్యవహరించే సామగ్రి అంతా. గాఢనిద్రలో సంసారం ఉండదు - మనస్సు పని చెయ్యదు కాబట్టి - లేవగానే 'నేను' దానితోపాటు మనస్సు. ఈ సంసారం అంతా అవతరిస్తాయి - ఇవన్నీ ఆ 'నేను' మీద వచ్చే కెరటాలే కదా! కాబట్టి సంసారం అంటే నేను మీద వచ్చిన చిట్టచివరి కెరటం - 'జీవుడు' - వీడు దీనిలో సుఖదుఃఖాలను అనుభవించే వ్యక్తి. చచ్చుట మొదలగు ధర్మాలు కలిగి క్రియాకలాపం చేసే వస్తువు - 'నేను' ఉన్నంతసేపే అది దాని అనుచరులైన శరీరాదులతో ఉంటుంది - దీనికి మరి ఒకపేరు - జీవుడు. ఈ 'నేనే' శుద్ధ చైతన్యమైన ఆత్మకు, శుద్ధ జడమైన శరీరానికి సంబంధం - జ్ఞాననిష్ఠతో ఈ 'నేను' నశిస్తుంది - ఆత్మజ్ఞానం కలుగుతుంది.

27. రూపోద్భవో, రూపతతిప్రతిష్ఠో
రూపాశనోధూతగృహీతరూపః
స్వయం విరూపః స్వవిచారకాలే
ధావత్యహంకారపిశాచ ఏషః

ఆంధ్రానువాదం:- ఈ నేనే అన్ని నామరూపాలకూ మూలం. వీటిని పుట్టించి వీటినే అంటిపెట్టుకొని, ఆహారం చేసుకొని ఉంటుంది - ఈ నామరూపాలను బయటపెట్టి ప్రదర్శిస్తుంటుంది. లోపలికి తిరిగి తీసుకుంటు టుంది. తన పుట్టుపూర్వోత్తరాల రహస్యం ఏమని విచారణ మొదలెడితే ఈ 'నేనే' దెయ్యమై పారిపోతుంది - మరి కనపడదు.

వివరణ:- నేను శుద్ధచైతన్యంనుంచి బయటకు వచ్చిన మొదటి మొలక. దీనివల్లనే బుద్ధి మనస్సు బయటపడతాయి. మనస్సు అవతరించగానే ఈ నామరూపాత్మకమైన జగత్తు సిద్ధం అవుతుంది - కాబట్టి ఈ నామరూపములతో కూడిన జగత్తుకు మూలం 'నేనే'. ఈ నేను, ఈ నామరూపాలు కల్గిన వస్తుజాలం సృష్టించి కొన్నిటిని కావాలని అంటపెట్టుకొని, మరికొన్నిటిని ద్వేషిస్తూ కొన్నిటివల్ల బయటపడుతూ వ్యవహారం జరుపుతూంటుంది. తన సంతానమైన పై వేషం అంతా, తన్నే కీలుబొమ్మలాగ ఆడిస్తుంది. ఈ శరీరం, మనస్సు, బుద్ధి, పుట్టించి వాటితో ఆడుకుంటుంది - కొంతసేపైనాక ఈ నామరూప ప్రపంచాన్ని లోపలికి తీసుకొని పడిపోతుంది. మళ్ళా నిద్రలోంచి లేవగానే వెనకటి అంతే! కాబట్టి ఈ నేను చేసే ఘనకార్యం ఏది? దాన్ని సృష్టించిన నామరూపాత్మక జగత్తుతో ఆట తప్ప? పోనీ ఈ 'నేను'కు ఏదో 'నామం రూపం' ఉందా? ఏదీ లేదు! ఈ నామరూపాల జగత్తును బయటపెట్టి లోపలికి తీసుకుపోయే శక్తిమాత్రమే - గట్టిగా ఈ సంసారానికంతకూ మూలమైన, ఈ 'నేను' ఎట్టిది అని విచారిస్తే మాయమైపోతుంది ఆనవాలైనా లేకుండా! అప్పుడు ఆత్మతో నీకు ఏకత్వం సిద్ధిస్తుంది.

ఇదే ఆత్మవిచారం లేక జ్ఞాననిష్ఠ! ఈ అహంకారం (నేను)ను ఎందుకు దెయ్యమని అనవలసి వచ్చిందంటే - స్థూలంగా చూస్తే ఉన్నట్లుగా కనబడుతుంది. గట్టిగా 'ఏది ఏది' అని పరిశీలిస్తే ఏమీ ఉండదు. అక్కడెక్కడో దొంగ ఉన్నాడని పిల్లలూ, తెలివితక్కువవాళ్ళూ నీడ చూస్తేనే రాత్రి భయపడతారు. తండ్రి వచ్చి ఎలక్ట్రిక్ దీపం వేసి ఏమీ లేదని చూపెడతాడు. అప్పుడు ఆ పిల్లవాని మానసిక దయ్యం వాని మనస్సులోంచి వదుల్తుంది. ఏమంటే ఆ మనస్సులో వచ్చిన దెయ్యం వీని వంటిదే కానీ నిజం వస్తువు కాదు అనే విధంగా ఈ నేను ఆత్మలోంచి వచ్చిన మొట్టమొదటి మొలక దాని ఆలోచనలు వ్యవహారాలు అన్నీ దాని పుట్టుపూర్వోత్తరాలు వివేకంతో పరీక్షిస్తే, అన్నీ ఆ 'నేను' లోకి పోతాయి. ఆ 'నేను' ఆత్మతో కలిసిపోతుంది. ఇంకోవిధంగా చెప్పాలంటే అఖండంగా విస్తరించి అనంతమైన ఆత్మ అయిపోతుంది. ఈ అహం (నేను) యొక్క పుట్టుక దాని స్వభావం, దాని నాశనం భగవాన్ ఈ శ్లోకంలో చెప్పినంత సరళంగా మనస్సుకు హత్తుకుపోయేటట్లు ఏ వేదాంతవాక్యం చెప్పలేదు. చాలామంది ఈ 'నేను' (అహంకారమే) మనలో సత్యమైన ఆత్మవస్తువని అపోహ పడతారు. ఈ అహం నిజమైన వస్తువు కాదు. ఆ సత్యవస్తువునుంచి పుట్టిన [illegible]మైన మొలక. అది మనస్సుకు మూలం. జీవుని యొక్క ప్రథమ వికాసం. సర్వజగత్తుకూ పునాది. అది తిరిగి ఆత్మలో లీనమైపోతే మిగిలేది ఆత్మప్రకాశం. కర్త పోయాక కర్మ ఏముంటుంది? అది నిజమైన జ్ఞాననిష్ఠ - దృక్కు (చూచేవాడు), చూడబడేవి ఆత్మలో అంతర్ధానం అయినాక మిగిలేది ఆత్మే కదా!

28. భావేఽహమం సర్వమిదం విభాతి
లయేఽహమో నైవ విభాతి కించిత్
తస్మాదహంరూపమిదం సమస్తం
తన్మార్గణం సర్వజయాయ మార్గః

ఆంధ్రానువాదం: నేను (అహం) అవతరించగానే ఈ ప్రపంచమంతా గోచరమవుతుంది. ఆ నేను లేకపోతే, ఏకొంచెం కూడా కనపడదు. కాబట్టి ఇదంతా సమస్తమూ ఆ 'అహం' స్వరూపమే! అందుచేత, దాని మూలాన్ని వెదకడమే, అన్నిటినీ సమకూర్చే దారి.

వివరణము:- మనము, మన చుట్టాలు, బంధువులు, స్నేహితులు, మన ఆఫీసులు, ఉద్యోగాలూ, వ్యాపారాలు, సుఖాలు, దుఃఖాలు, ఏడుపులు, పెడబొబ్బలు, చావు బతుకు, సర్వమూ బొమ్మలాటగా జరిగే ఈ జగన్నాటకం - నాటకరంగము, మనం వాస్తవమైనదని అనుకుంటుంగాని, దీనికి నిజస్థితి లేదు - ఇది 'నేను' దానితోపాటు 'అంతఃకరణ' వీటియొక్క విలాసం. గాఢనిద్రలో ఈ అంతఃకరణము అస్తమించినపుడు ఈ నాటకము లేదు - గాఢనిద్రలో ప్రపంచానుభవం కలవాడు ఎవడైనా ఉంటాడా? ఇది ఆ 'నేను' యొక్క ప్రభావం కాబట్టి ఆ 'నేను' లేకపోతే ఇదీ లేదు. దీనికి కారణం? దానికి నిజస్థితి లేకపోవుటే? అట్టి స్థితిలో దేన్నయినా గెలవాలన్నా ప్రపంచాన్ని కూడా సాధించాలన్నా కవాతు పొందిన పేద సిబ్బంది ఏనుగులు గుర్రాలు విమానాలు ఏవీ అక్కరలేదు. ఒకవేళ వీటితో కొంత గెలుపు సాధించినా అది నిజమైనదీ, శాశ్వతమైనదీ కానేరదు. ఎందుచేతంటే ఈ ప్రపంచానికి మూలమైన 'నేనును' అవి రూపుమాపలేవు. నీవు నిజంగా ఈ ప్రపంచాన్ని గెలవాలంటే నీ మనస్సును లోపలికి తిప్పి 'నేను' యొక్క లోతును కనుక్కోవాలి. నీవు ఈ అహంకారాన్ని గెలిచావంటే అది ఇదే నాటకాన్ని గెలిచావన్నమాటే! అపుడు నీవు ఎక్కడున్నావు? బ్రహ్మ అయిపోయాక - నీవు సచ్చిదానందస్వభావుడవు. అంతా నువ్వే! అట్టి పరమోత్కృష్టస్థితి ప్రపంచాధిపత్యానికన్నా కూడా గొప్పది! భగవాను వాడిన పదం చూడండి: 'సర్వ

జయాశ మార్గః' అన్నారు ఈ పద్ధతిలో గెలవలేనిపనువే లేదు। ఒక రాజు కానీ, నియంత కానీ, ఏదో ఒక దేశం కొంతకాలం స్వాధీనంలో పరిపాలించి. దానివల్ల ఏదో తాత్కాలిక సౌఖ్యాలనీ ప్రయత్నిస్తాడు. కానీ నిజంగా అంతా గెలవగలడా? గెలిచి అంతపులో ఉంచుకోగలడా? అలా చేసినా సుఖశాంతి సాధిస్తాడా? సాధించలేడు. కానీ బ్రహ్మ సాక్షాత్కారం ఉన్న ఒక జ్ఞానిని చూడండి ఈ సృష్టిలో అతని గెలవలేని స్థితి ఉందా? అతని సుఖశాంతులకు అంతూ, దరీ ఉందా?

29. సత్తా స్థితిర్నాహముదేతి యత్ర
తచ్ఛోదయస్థానగవేషణేన
వినా సత్యేద్యది తన్న నశ్యేత్
స్వాత్మైక్యరూపా కథమస్తు నిష్ఠా

ఆంధ్రానువాదం:-ఎక్కడ 'నేను' (అహం) స్థితి స్ఫురించదో అది నిజస్థితి. అది (నేను) ఎక్కడ పుట్టు తోందో విచారణ లేకపోతే అది నశించదు. అట్లు అది (నేను) నశించకపోతే ఈ సర్వం ఆత్మవిలాసమే-ఒక్కటే అయిన ఆత్మస్వరూపమే అనే జ్ఞానం ఎలా కుదురుతుంది?

వివరణం:-నీ నిజమైన వ్యక్తిస్వరూపం. జీవితస్థితి అంతా ఒక్క ఆత్మయే - ఇది గుర్తిస్తే నీవుగాక ఇక్కడ ఇతరమేముంది? నీకూ నీ నిజస్థితికి మధ్య ఉన్నది ఒక నీ 'అహం'. అది మనస్సు. బుద్ధి ప్రపంచం మొదలైన పరివారంతో, నేను వేరు. ఆత్మ వేరు అనే అపోహలో ఉంటుంది. ఆ స్థితిలో అది ఆత్మ కనపడకుండా చేసేస్తుంది. కాబట్టి ఆ 'నేను'ను పెకలిగితేనే ఆత్మ గోచరించడం-సాక్షాత్కారం। సమాధి। తరువాత మామూలు మెలకువ స్థితిలోకి వస్తే ఇంకా కొంచం ఆ నేను వాసన ఉన్నప్పటికీ లేనట్టే లెక్క. ఇట్టి సమాధి తరువాత కూడా 'నేను' కొంతకాలం ఏకొంచెమో ఉండవచ్చు. కానీ బాగా సమాధిని అభ్యసింపగా అది పూర్తిగా నశించిపోతుంది. అపుడు సమాధిలో వున్నా లేకపోయినా, నీవు ఆత్మస్థితిలోనే ఉంటావు. నీ మెలకువ కల, నిద్ర మొదలైన అన్ని అవస్థలూ. ఆత్మవిలాసాలే కానీ నీవి కావు. ఇదే జీవన్ముక్తావస్థ - ఈ 'నేను' (అహం) లేని స్థితి పొందడం ఏలా? ఆ నేను ఎలా నశిస్తుంది? దీని పుట్టుకను వెతకడమే దానికి మార్గం - అపుడే, అది ఆత్మలో లయం అయిపోతుంది.

30. కూపే యథా గాఢజలే తథాంత
ర్నిమజ్జ్య బుద్ధ్యా శితయా నితాంతం
ప్రాణం చ వాచం చ నియమ్య చిన్వన్
విందేన్నిజాంహంకృతిమూలరూపం

ఆంధ్రానువాదం:- బాగా లోతైన నూతి నీటిలో మునిగి ఎలా అడుగుకు పోతావో అలాగే నీ లోపలి అడుగు మట్టానికి నీ పదునైన బుద్ధిని ఉపయోగిస్తూ మనస్సును ప్రాణవాయువును వాక్కును నిరోధించి, తీవ్రంగా వెదకితే నీకు ఈ అహం యొక్క మూలం గోచరిస్తుంది. ఆత్మ సాక్షాత్కరిస్తుంది.

వివరణము:- ఒక లోతైన బావిలో, ఒక బంగారు నగ పడిపోయిందనుకోండి. ఆ నగను మీరు పైకితీయాలి. మీరేం చేస్తారు? అది ఎక్కడున్నదో జాడ కనిపెడుతుందేమో అని నూతిలోకి తీక్షణంగా చూస్తారు. కళ్లు బాగా తెర్చి పరీక్షిస్తారు అపుడు మీ ఇతర ఇంద్రియాలు పని చెయ్యవు. పక్కనున్న వారిని కూడా మాట్లాడవద్దంటారు. ఏకాగ్రతతో మనస్సు పనిచేస్తుంటే మీకు శబ్దం వినబడదు సరికదా. ఊపిరి కూడా ఒక్క క్షణం ఆగుతుంది. మన స్సుకు ఆ నగను కనుక్కోవటం తప్ప వేరే వ్యాపారం ఉండదు. నిజంగా నూతిలో నీకు స్వచ్ఛంగా ఉంటే ఆ నగ ఎక్కడున్నదో కనబడుతుంది ఆత్మను వెదకడం కూడా అట్లే: ఆత్మ, నూతిలో పడ్డ నగ వంటిది. మన అంతఃకరణం - ఆ నుయ్యి: ఈ నూతి నీటి మీద బుద్ధి, మనస్సు అనే కెరటాలు మొదలైనవి ఆగాలి: దానికి మన స్సును తిప్పి, ఆత్మను వెదకాలి-అదే విచారం-వివేకం। ఇది మొదలు మెట్టుగానే, ఆలోచిస్తూ, శ్వాసకూడా నిలిచి పోతుంది. కాబట్టి ధ్యానంలో, ప్రాణాయామం తనంతటదే జరుగుతుంది. మనో వ్యాపారం ఆగితే శ్వాసకూడా చాలా వరకూ నిలబడిపోతుంది - వేరే ప్రాణాయామం అక్కరలేదు. నిజమైన ప్రాణాయామం రేచకం, పూరకం కాదు. బయటనిలెనే లోపలి శ్వాస నిలుపుట-దీనిని కేవలకుంభకం అంటారు ధ్యానంలో మనోవృత్తి ఆగగానే ఇది అప్రయత్నంగా స్వాభావికంగా సిద్ధిస్తుంది. సమాధిలో ఉన్నంత సేపు ఈ కుంభకం ఉంటుంది. దీన్ని మరో విధంగా చెప్పాలంటే మనస్సును కదలకుండా చేయడానికి ప్రాణాయామం చెయ్యాలి. శ్వాసం ఎప్పుడు పనిచెయ్యదో, మనస్సు కూడా అపుడు శాంతిస్తుంది. కాబట్టి రేచకం వద్దు-పూరకం ఒద్దు. శ్వాసను ఎలా ఉంటే అలా విడు

## స్వాధ్యాయము

చాలాసేపు ఏకాగ్రత కల్గి జపము చేయుట శ్రమదాయకము. భావనా శక్తిని కొనసాగించుట కష్టము. అందువలన కొంతసేపు జపము చేసిన తరువాత స్వాధ్యాయము చేయుట అవసరము. స్వాధ్యాయము అనగా తనకు ఇష్టమగు పవిత్రగ్రంథమును (scripture) పఠించుట. అట్టి పవిత్రగ్రంథములు వేదములు, భగవద్గీత, బైబిల్, ఖొరాన్—ఏదైనను కావచ్చును. అట్టి గ్రంథపఠనము వలన మనస్సు ప్రాపంచిక విషయములనుండి మళ్ళింపబడి ఆధ్యాత్మిక విషయములతో నిండియుండును. ఏదియో సాధారణ పుస్తకమును చదివినట్లు పవిత్ర గ్రంథమును చదువుట స్వాధ్యాయమనిపించుకొనదు. చదువుట మాత్రము చాలదు. పవిత్ర గ్రంథము సత్యస్వరూపుడగు భగవంతుని గూర్చి చెప్పును గాన దానిని కంఠస్థము చేయుటకు ప్రయత్నించవలెను. ఇట్లు చేయుటవలన అందలి మాటలు వాక్యములు అర్థవంతమైనవగుటచే మన దృక్పథమును మార్చుటయేగాక మన మనస్సంతయు వానితో నిండియుండుట వలన అన్యభావములు కలుగుటకు వీలుండదు. ఈ విధముగ మన మనస్సు భగవంతునిలో లీనమగును.

సర్వత్ర వ్యాపించియుండునది సత్యస్వరూపమే కనుక అట్టి పవిత్ర గ్రంథమును పఠించుటవలన అందలి విలువలు (Values) మన శరీరములో జీర్ణమై వంటబట్టును. (They are digested and absorbed and assimilated). మన మనస్సుయొక్క స్వభావము (Content) మార్చివేయబడును. అట్టి గ్రంథములు ఏ ఒక్క మతము యొక్క గుత్తాధిపత్యము (Monopoly) కావు. తమ మతగ్రంథమందలి పవిత్ర గ్రంథములే సత్యస్వరూపమును వర్ణించునవియు, తదితర మతగ్రంథములట్టి అర్హత లేనివియు మతోన్మాదులు తప్ప ఎవ్వరు అనజాలరు. మనలోని సంకుచిత స్వభావమును పోగొట్టి విశాల హృదయమును కలిగించుటయే యోగశాస్త్రము యొక్క ఉద్దేశముగాన స్వాధ్యాయ ప్రయోజనము ఈ తీరున నెరవేరును. అందలి భావములు వంటబట్టుట వలన నీవు మెలకువగనున్నను, నిద్రించుచున్నను నీ మనస్సులో అవి సదా మెదలుచు జీవాత్మను పరమాత్మతో సంధానము చేర్చును. ఉత్సాహము, పట్టుదల అప్రమత్తత, ఏకాగ్రత, తితీక్ష క్రమ క్రమముగ అభివృద్ధి నొంది మోక్ష సాధన సుకరమగును.

మనస్సును ఉత్సాహముగనుంచవలెనన్నచో పతంజలి మహర్షి యొసగిన సలహాను ఆచరణలో పెట్టవలెను. 'The mind remains cheerful when it maintains an attitude of friendliness towards others' happiness, of compassion towards their misery, of joy at good deeds, of indifference towards wicked deeds. ఇతరులపట్ల మిత్రత్వమును ప్రదర్శించుట వలనను దీనులయెడ కరుణ చూపుట వలనను ఇతరుల సంతోషమే తన సంతోషమని భావించుట వలనను దుష్కృతముల పట్ల ఔదాసీన్యము వహించుట వలనను చిత్తప్రసాదమును సాధింపవలెను.' అట్టి ఉత్సాహమును పొందగల్గినచో ద్వంద్వములను (pairs of opposites) అతిక్రమించినట్లే యగును. బుద్ధి (Perception) బలవత్తరమై రాగభయక్రోధములు అతిక్రమింపబడి ఆత్మసాక్షాత్కారము సులభమగును.

గలట్టి యెవరిన్ దాజుపకుంటే సుఖీ!" అని చెప్పిన ధర్మవ్యాధునిది బౌద్ధధర్మమే అని చాటారు.

'అస్థిరమైన ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం గాదు. ఆత్మ మాత్రం శాశ్వతమెట్లవుతుంది? కాబట్టి ఆత్మ లేద'ని అనాత్మ వాదాన్ని సమర్థించారు. బౌద్ధమే ఆచరణకు తగిన మతమని గుర్తించి

పరము గిరమ్ము లేదికను భావన సేయఁగ: బొమ్మ పూజయు
న్స్మరణము నిప్పులమ్మలకు మర్మమెఱింగి చరింతు వింక నా
మరణము నీమ ధర్మమకో; మానవజాతి సముద్ధరింపనే
చిరముగ బాస సేసి యిదె దీక్షఁదగన్వహియింతు....

అని నిర్ణయించుకొన్నారు. 'ధర నీదు కీర్తియే వరమయి కోటికిం దనరు' నని బౌద్ధ ప్రాశస్త్యాన్ని గ్రహించారు.

వీరు బౌద్ధ దీక్షను స్వీకరించిన వారైనందువల్ల వీరి కావ్యంలో బౌద్ధసిద్ధాంతాల్ని—చతురార్యసత్య అష్టాంగమార్గాలు, కుశలా కుశలకర్మలు, అనాత్మవాదం, శూన్యవాదం, అవిద్య, క్షణికవాదం, హేతుప్రాధాన్యములు—విపులంగా విశదీకరించబడ్డాయి.

బుద్ధోపదేశం :

ఈ శతకంలో ఏకమకుట నియమం పాటించబడలేదు. బుద్ధసూక్తి వినుడి పుణ్యులార, తెలిసి మెలగుమోయి తెలుగుబిడ్డ, బుద్ధదేవుని మతమును బూనుడయ్య. అన్న మకుటాల్లో కవి బౌద్ధ ప్రాశస్త్యాన్ని, బుద్ధచరిత్రను, ఆ ధర్మసారాన్ని వివరించారు.

ఈ కావ్యం ప్రచురింపబడింది ప్రపంచ వ్యాప్తంగా బుద్ధజయంత్యుత్సవాలు జరుపబడ్డ 1956 వ సం॥ లో. సంపూర్ణ మానవత్వాన్ని సాధించిన మహాపురుషుల్లో గౌతముడగ్రగణ్యుడని కవి నమ్మకం. మహాసాంఘిక విప్లవ సంస్కర్తయైన తథాగతుని ఉపదేశాల నాధారంగా గొని జాతీయ ఛందస్సులతో నానేర్చు కొలంది సంస్కారిణాశయముల ఈ శతకమున కూర్చితిని" అని చెప్పుకొన్న వీరి మతంలో సిద్ధార్థుడు అశాంతితో సంక్షుభితమైన లోకంలో కరుణామృతాన్ని చల్లి అహింస, ప్రేమ, సత్యాలద్వారా శాంతి సందేశాన్నందించిన తత్త్వవేత్త.

"ఎల్ల భూతములను నేకరీతిగ జూచి యాదరించువాడె యఘ చరితుడ"ని ప్రారంభింపబడి ఆర్యాష్టాంగాల్లో కొన్నిటిని వివరిస్తూ బాధనొందేవారి వేదన కనుగొని వారి బాధల్ని రూపుమాపినప్పుడే మానవత్వ వికసనం జరుగగలదని సత్యాగ్రహ మార్గాన్ని వివరిస్తూ సాగిన ఈ శతకంలో బౌద్ధసిద్ధాంతాలు వివరంపబడ్డాయి. నీటి బుడగవంటి జీవితాల్ని గుర్తించిన కవి,

"వృత్తివలన జనన మెత్తిన మతములు
మారుచుండు వృత్తి మారినపుడు
మతము వేఱైన మతసౌఖ్యమను గట్టి
బుద్ధసూక్తిం.........."

స్మరించి ఈ అశాశ్వత ప్రపంచంలో మానవ నిర్మితాలైన కులమతాలు సత్యం గాదనీ, మానవులందరూ సమానమే అని వివరించారు. కులం కంటె గుణం గొప్ప. చిత్తశుద్ధి, వాక్శుద్ధి, కార్యశుద్ధి కలిగి ఉండాలి. సత్యమే స్వర్గం అని తెలిపిన కవి, తృష్ణ అనే నదిలో తేలుతూండే మనుష్యుడు ప్రవాహంలో మారిణంలా తెలిసి మెలగాలని తెలుగు బిడ్డల్ని ప్రబోధించారు. రాజ్యరమను, రమణిని, కలిమిని, బలిమిని త్యజించిన బుద్ధదేవుడన్న కవికి యభిమానం మెండు. ప్రజల భాషలో నీతిని బోధించి, మానవ నిర్మితమైన మతభేదాల్ని త్రోసిరాజని, దుఃఖితుల నాదరించడమే మానవత్వమని చాటిన బుద్ధధర్మమన్న వీరి కభిమానం ఎక్కువ.

పంచశీలములను నంచిత చతురార్య
సత్యములు ప్రచార సరణిఁదీర్చ
సర్వజీవములబ్బి స్వామ్యమ్ముగా భువి
విశ్వశాంతి గలిగి వెలయు....

అని నమ్మినవారీ కవి. వీరి యీ అభిమానం శాంతచిత్తుండు, సౌహార్ద్రమూర్తి, సత్యపాలకుడు, అమృత నిష్యందమయుడు, అనంతశక్తిమయాత్మకుండు అఘవిదూరుడునగు బుద్ధదేవుణ్ణి కొలిస్తే "ధన్యమగు మానవుని జీవితంబు" అను సంతగ ఎదిగినది.

ఇంతవరకు బౌద్ధాన్ని కీర్తించిన కవి "ధారుణికి నిండుమేలు చేకూర్చు బుద్ధదేవుని మతమును బూనుడు" అని ప్రబోధించారు. సూక్తుల్లో భూతదయ, మూర్తిలో 'ప్రేమ సత్యకరుణలు' తాండవించే బుద్ధదేవుని మతం ఆచరణీయమన్నారు. గాంధీజీ ఆదరించి విశ్వసందేశంగా మార్చిన ఈ సత్యాహింస నెహ్రూజీ ఈ మతప్రభావంతో ఉపదేశించిన పంచశీలాల్ని అనుసరించమన్నారు. జాతిమత కక్షలు పోగొట్టి, సామ్యవాదాన్ని నిలిపేందుకు తగిన సత్యశివమైన ధర్మచక్రం బౌద్ధ ధర్మచక్రమే! కనుకనే ఆ ధర్మమాచరణీయమని చెప్తూ,

బౌద్ధ సిద్ధాంతములు దిశల్ పర్వుగాత
నిత్యమై సత్యము సహింస నిల్చుగాత
జాతిమత కక్షలన్నియు సమయుగాత
ధారుణికి నిండుమేలు చేకూరుగాత

అనియు ఆశంసించారు.

ఈ పద్యాలు కవి హృదయగత బౌద్ధాభిమానాన్ని చాటుతున్నాయి. బౌద్ధధర్మం ఆచరణీయమని ఉద్ఘోషించిన కవి, సత్యప్రభావాన్ని హేతువాద ఆవశ్యకతను చెప్తూ, అహింసా సత్యధర్మాల తోడు లేక, సంసార సాగరాన్ని దేంటుట సాధ్యం కాదని స్థిరీకరించారు. దుష్టుల్తో చెలిమి అహితం. దుఃఖ స్వరూపాన్నెరిగి మానవుడు తృష్ణను విడవాలి అన్న వీరు 'విశ్వమేలాన'ని తలచినపుడే శాశ్వత సౌఖ్యమబ్బునని తలచారు. భవసాగర తరణానికి నీతి ముఖ్యమనే బుద్ధబోధను వీరు నమ్మారు. కనుకనే

బుద్ధుని శరణము నందుము
బుద్ధుని సంఘంబు శరణు బొందుము ధీవా
బుద్ధుని ధర్మము నిల సం
సిద్ధుడవై దిశలవెంయఁ జేయుము

అని త్రిశరణ మాహాత్మ్యాన్ని కీర్తిస్తూ, ఆ ధర్మాన్ని వ్యాపి చేయమని తెలుగువారిని కోరుతూ తమ బౌద్ధాభిమానాన్ని చాటుకున్నారు

త్రిశతి :

బుద్ధ, వేమ, గాంధి అనే మకుటాల్తో త్రిశతి పేర వెలిసిన శతక సంపుటంలో మొదటిది బుద్ధశతకం. ఈ శతకకర్త శ్రీ కొండవీటి వేంకటకవిగారు బౌద్ధాభిమానులు. బౌద్ధేతర యితివృత్తమైనా, వీరి ప్రతి రచన బుద్ధనుతితోనే ప్రారంభమౌతుంది.

మతము కులము మధ్య మాడిన జనమును
పేదదీర్చి చీకు చింతలుడిపి
దేశమునకు దివ్యదీప్తుల నొసఁగిన
బుద్ధు పాదపద్మముల భజింతు

నని ప్రారంభింపబడ్డ ఈ శతకంలో ఆధునిక యుగంలో మూఢ విశ్వాసాల్ని పారద్రోలి సంఘచైతన్యాన్ని దెచ్చిన రామమోహనుడు, కందుకూరి, రామసామి సుకవిరాజులు ప్రస్తుతింపబడ్డారు.

కులమతాల్ని వేర్పరచి ఒక కులంలోనే యెక్కువ తక్కువల్ని ఏర్పరచుకొని, మాత్సర్యాలు పెంచుకొని జనులు సాంఘిక కల్లోలాలకు కారకులౌతున్నారు. "శంకరాచార్యాదులు మాడ్చి బౌద్ధాన్ని నిర

సించినా, నేడు ధర్మచక్రం రాచపదవి నందినది గదా! సత్య ధర్మాలను సమయింప నెవడోపు వని ప్రశ్నించారు.

ఆధునికులందరి వలే వీరు కూడ కడుపునిండిన వాడికి మతంగాని లేనివాడికి కాదని. భుక్తి ముక్తుల్లో మానవుడు ముందు భుక్తిని కోరు తాడని, తిండిగానని నిరుపేదకు నీతిబోధవల్ల ప్రయోజనముండదని చాటారు. లంచాలను తీసుకోడం, పరుల్ని దూషించడం, ఇరుగు పొరుగుల్ని ద్వేషించడం–ఈ పాపకృత్యాల్ని చేస్తూ దేవతల్ని పూజించడంవల్ల పాపం తీరదు త్రికరణశుద్ధి నాచరించ లేనివారు విగ్రహారాధ వలనల్ల పవిత్రులు కాలేరు అని నమ్మినకవి "పాదపూజగోరి ప్రతి పట్టణములోన దామెమై తిరుగు కావి తాల్పుల" వర్ణనలో కపట సన్యాసుల నిందించినారు.

వ్యాసాదులచేత కల్పించబడ్డ వర్ణాల్ని నిరాకరించిన కవి వేషం చేత మాత్రం వైరాగ్యం రాదు, కోరికల్ని అణచి ధర్మాన్నాచరించి నపుడే శాంతిని పొందగలుగుతామని ప్రబోధించారు. 'నాసటి వ్రాలు తుడవలేమ'ని మనుట సరిగాదని పాపపుణ్యాల నెరిగి ఆచరించేవాడు జీవితాన్ని చక్కదిద్దుకోగలడని బౌద్ధులుచెప్పే కర్మసిద్ధాంతాల్ని స్మరించారు. ఔషధాన్ని సేవిస్తేనే రోగం తగ్గుతుంది గాని, ఔషధం పేరు వింటేనే రోగం నయం గాదు. మంచి నాచరిస్తేనే శాంతి కలుగుతుంది. జీవమున్నంత వరకు నైతిక శీలాచరణంతో సంఘానికి మేలు చేయుమని ప్రబోధించిన బుద్ధధర్మమే ఆచరణీయమని కవి మతం. కాబట్టే 'బుద్ధుని, ధర్మాన్ని, సంఘాన్ని శరణుజొచ్చేవారు సమాజ సేవకులు' అన్నారు.

కాలగతిలో శాశ్వతమైంది

లేదు. క్షణికత్వాన్నెరిగి కుశల కర్మల నాచరించుమ'ని ఉపదేశించిన బుద్ధధర్మం అందరికీ వెలుగు నివ్వగలదనే సత్యాన్ని స్మరించారు. సంఘ నిర్వాణానికి పాటుబడ్డ బోధిసత్త్వాల త్యాగభావానికి మురిసిపోయిన కవి, బౌద్ధంలో శీలానికి గల ప్రాధాన్యాన్ని

బ్రతుకు వఱకు శీలభంగమ్ము గావిక
మంచినెల్ల వేళ పెంచవలయు
వాదములచి నడువ వీఱగారు మరియాద
గాలిలోని దివ్వెగతిని బుద్ధ

అని స్పృశించినారు. దొరువులోని నీళ్లు చిమ్మే కొద్దీ ఊరే ట్లే మంచి పదిమందికి పంచే కొద్దీ పెరుగుతుంది. ఈ సత్యాన్ని గుర్తించి, ప్రజలు బుద్ధదేవుని వలె పరుల హితం కోసం బ్రతకాలని ఆశించారు. మాటలు చెప్పడం మాత్రమే గాదు పరుల హితం కోరే బుద్ధుని గురుతర భావౌన్నత్యాన్ని దర్శించేందుకు త్సాహం చూపారు. వీరి మతంలో నేటి ప్రజకు మంచి దారి చూపగలిగింది ఒక్క బౌద్ధమే!

ఈ ముగ్గురు శతకకర్తలు బౌద్ధ ముఖ్య సిద్ధాంతాల్ని, ఆ ధర్మప్రాశస్త్యాన్ని ప్రశంసించారు. వర్ణ, వర్గభేదాలు మితిమీరిపోతూన్న ఈ యుగానికి మాత్రమే గాదు, సర్వకాలాలకు తగిన మతం సమత, మమతల్ని బోధించే బౌద్ధమే అనేది చాలమంది ఆధునికుల వలె వీరు కూడ ఒప్పుకున్న సత్యం. మతాన్ని మత్తు మందుగా తలచిన వీరి ఉద్దేశంలో బౌద్ధం సత్ప్రవర్తనతో కూడిన ఒక జీవన విధానం.

సుమారు 2526 సం॥ ముందు విలసిల్లి ఆధునిక యుగంలో పునరుజ్జీవితమై, ప్రపంచ సాహిత్యాల్ని ప్రభావితం చేస్తూన్న బౌద్ధం ఆధునికాంధ్ర సాహిత్యంలో పెక్కు ప్రక్రియల్ని వెలువరచింది. అందులో పై మూడూ, కవుల బౌద్ధాభిమానాన్ని చాటే కవితలు.

# క్షీరసాగర మథనం

బ్రహ్మచారి సుందరరాజన్

రాతిలో ప్రతిధ్వనించే శబ్దము శిల్పము. శబ్దములో ప్రతిబింబించే శిల్పమే సంగీతము. పదకూర్పులో ప్రతిఫలించే శిల్ప సంగీతమే సాహిత్యము.

రాతిలోని మాటలు శిల్పి వినగలడు. సంగీతములోని శిల్పాన్ని గాయకుడు చూడగలడు. సాహిత్యములోని శిల్ప సంగీతాన్ని కవి పానం చేయగలడు. అన్నిటిలోని ఆంతర్య సౌందర్యాన్ని వేదాంతి జీర్ణించుకోగలడు.

శిల్పి మనసులోని శిలానైపుణ్యం, గాయకుని గళంలోని గానమాధుర్యం, కవిహృదయంలోని సాహిత్యనందనవనం, వేదాంతి నిర్మల అంతఃకరణలోని ప్రసన్న ప్రశాంత మందహాసం, కన్నీటితో నిండిన మానవ జీవన వీధులలో పన్నీటి జల్లులు కురిపించక మానవు.

సంకుచిత బాహ్యదృష్టి గలవారికి కళలలోని ఔచిత్యం అర్థం కాదు. ఆంతరంగిక సౌందర్యం గలవారికే కళలలోని కమనీయత గోచరిస్తుంది. కళాత్మక ఊహకి సాంకేతిక పరిజ్ఞానం పునాది. సర్వకళలకు నిలయమై, భావగర్భితమై, కళాతీతమై, అప్రమేయ అనూహ్య అంబారీ వీధుల్లో వెలుగు వేదాంతశాస్త్రము తత్సంబంధిత సాంకేతిక పరిజ్ఞానము లేనివారికి అవగతము కాదు. అర్థం చేసుకోలేనివారి మనస్సులలో అపార్థం తలయెత్తే అవకాశం లేకపోలేదు.

పురాణేతిహాసములలోని సన్నివేశాలు, ఉపనిషత్తులలోని కథలు, సంఘటనలు పై ఆధ్యాత్మిక అవగాహనతో నిర్మించిన సత్య శిల్పాలు. విష్ణుపురాణంలో గోచరించే క్షీరసాగర మథనం పైకోవకు చెందిన సజీవ తాత్త్విక శిల్పము. సాధకుని ఆంతర్యంలో ఆత్మ సామ్రాజ్యాన్ని చేజిక్కించుకొనుటకు చేయు ప్రయత్నమే క్షీరసాగర మథనంలోని తాత్త్విక అవగాహన.

రాక్షసుల భయంకర దాడులకు నిలువలేని ఇలు భగవానుని ఉపదేశముచే క్షీరసాగరాన్ని మథించి, అమృతాన్ని వెలికి తీయుటకు రాక్షసులతో ఒక ఒడంబడిక నేర్పరచుకొనుటకు దానవుల సహాయంతో పాలసముద్రాన్ని చిలికి, అందుత్పన్నమయ్యే అమృతాన్ని పానం చేసి దేవతలు చిరంజీవులై, తదుపరి రాక్షస సంహారముగావించుటకు పథకము నిర్మించుకొని, సంధి చేసికుంటారు.

క్షీరసాగరాన్ని మథించేందుకు మంధర పర్వతాన్ని కవ్వముగా, వాసుకి అనే సర్పాన్ని త్రాడుగా ఏర్పరచుకొని ఒకవైపు దేవతలు మరియొకవైపు రాక్షసులు లాగసాగిరి. ఇలా జరుగుతుండగా మధ్యలో ఎన్నో అద్భుతములు, ఆశ్చర్యవస్తువులు బయల్వెడలినవి అయినను వారు ఆ మహాకార్యాన్ని అంతటితో ఆపలేదు. అమృతము లభించుటమే వారికి కావాలి. వారి శ్రమకు ప్రతిఫలం లభించే సమయము ఆసన్నమయినది. మంధర పర్వతానికి త్రాడులా కట్టబడిన వాసుకి, మథనరాపిడికి అలిసిపోయి బాధతో భయంకర విషాన్ని వెళ్ళగక్కింది. ఆ విషగాలులకు భయగ్రస్తులై చెల్లాచెదురవుతున్న దేవాసుర సమూహము కైలాసనాథుడైన శంకరుని శరణుజొచ్చి రక్షణకై ప్రార్థిస్తారు. దయామయుడైన శంకరుడు భరింపశక్యముగాని ఆ విషాన్ని తన అరచేతిలో నుంచుకొని, వినాశకరమైన ఆ గరళాన్ని పారవేయడం ఇష్టంలేక తానే పానం చేస్తాడు. భక్తులను రక్షించడానికి త్యాగభావంతో శంకరుడు విషాన్ని పానం చేయగా, ఆ విషమ పరిస్థితిని గాంచిన ఉమాదేవి భయకంపితురాలై తన భర్త కంఠాన్ని నొక్కి పట్టకొంటుంది అలా మింగుడుబడని విషం కంఠములో నిలిచి కమిలి, నీలివర్ణంగా మారుతుంది. దేవతా

వులు మరలా పాలసముద్రాన్ని చిలకడం ప్రారంభిస్తారు. ఈసారి అమృతం పుడ్తుంది. అమృతపానం చేసినవారు అమరులౌతారు.

తాత్త్విక అవగాహన, భావసౌందర్యము, అలంకార శిల్పము తెలియనివారు ఈ కథలోని స్వారస్యాన్ని గ్రహించలేక మిడిమిడి జ్ఞానంతో మహర్షి వాఙ్మయము అర్థంహితమయినదని అసందర్భ, అప్రస్తుత ప్రసంగాలు చేస్తుంటారు.

పాలసముద్రమంటూ స్థూలంగా ఒకటుంటే అది ఎలా తయారయింది? సముద్రమంత క్షీరాన్ని అందించిన గేదెలు, ఆవులు ఎక్కడ? మేఘాలు జలాన్ని వర్షించునట్లు పాలను కుమ్మరించే క్షీర మేఘాలు గతంలో ఉండేవా? ఒక వేళ అలా జరిగే ఉంటే రసాయనిక ప్రక్రియ ద్వారా ఆ పాలు పెరుగుగా మారదా? ఇలా ఆలోచిస్తూ ఉంటే మనమొక పూడిక తెలియని అగాధంలో పడిపోతాము.

ప్రతి మానవునిలో చెలరేగే కల్లోలతరంగాలకు ఆలవాలమైన మనసే ఒక సముద్రము. తత్త్వచింతనగల సాత్త్విక మనసే క్షీరసాగరము. ప్రతిసాధకుడు ఆంతరంగిక శోధన చేసి అమృతత్త్వాన్ని పొందడమే క్షీరసాగరమథనంలోని అంతర్యం. క్షీరసాగరమనే మనసులో మంధరపర్వతమనే బుద్ధినుంచాలి. (మన్ + ధర = మనసును ధరించునది, నడుపునది - బుద్ధి.) మంధరపర్వతానికి అహంకారమనే వాసుకిని తాడుగా అమర్చాలి. ప్రతివ్యక్తిలోని దైవాసురగుణాలే దేవదానవులు. ఒకవైపు దైవగుణాలు, మరియొకవైపు అసురగుణాలు, అహంకారాన్ని పట్టి, చిలకడం అనే ధ్యానాన్ని కొనసాగించాలి. ప్రారంభదశలో ఎన్నో సిద్ధులు కలుగవచ్చు. శంఖారావం, ఘంటానాదం, మురళీగానం లాంటి శబ్దాలు వినిపించడం, దూరదర్శనం, దూరశ్రవణం లాంటి శక్తులు కల్గడం, అద్భుత దృశ్యాలు కనిపించడం జరుగవచ్చు. అయినా అమృతానుభవానికి వీటిని త్యజించక తప్పదు. ఇలాగే ధ్యానం కొనసాగించగా అమృతత్వం సిద్ధించేముందు అహంకారములో ఇమిడియున్న చివరి కొద్దిపాటి వాసనలు కూడ వెళ్ళగక్కడం జరుగుతుంది. అయితే ఆ వాసనా ప్రభావం మనసును, హృదయాన్ని తాకకుండా మానుకోవాలి. అహంకారము సమూలంగా నశించి, మనసులోని వాసనలు ప్రక్షాళనం కాగానే ఆత్మదర్శనం అవుతుంది. ఆత్మానందమే అమృతపానం. అమృతపానం చేసినవారు అమరులౌతారు. ప్రతిఒక్కరు అమృతసిద్ధిని పొంది అమరులగుటయే ఈ క్షీరసాగరమథనంలోని సందేశాత్మక సమన్వయ సారాంశము.

హాలాహలాన్ని పానం చేసిన శివుడు త్యాగపురుషుడు. పరులకొరకు తాను విషాన్ని పానం చేశాడు. శివుడు త్రినేత్రధారి. అతని మూడవనేత్రం తెరువబడగానే, ఎదుటనున్న వస్తువులు, వ్యక్తులు భస్మీపటలమవుతారు. మూడవనేత్రమనేది ప్రతివ్యక్తికి ఉన్నది. అదే జ్ఞాన నేత్రం. జ్ఞానచక్షువు తెరువబడగానే మనకు గోచరమయ్యే ఈ జగత్తు అదృశ్యమవుతుంది. జ్ఞాన తేజస్సులో అజ్ఞానాంధకారము పటాపంచలవుతుంది. అదృశ్యమైన నామరూపాత్మక ప్రపంచముస్థానే పరమాత్మ దివ్యదర్శనము గోచరమై, వాసుదేవస్సర్వమితి అన్న అనుభూతి కల్గుతుంది. ఆ అనుభూతిలో అజ్ఞానమేఘాలు చెదరిపోతాయి. ఆనంద జల్లులు కురుస్తాయి.

# మేఘాల్లో కూచున్న దేవుడు?

శారదాకుమార్

నీవు దైవానివి, నేను దైవాన్ని, మనిషే దైవం. మానవసంఘంగా వ్యక్తమైన యీ దైవమే అన్నీ చేస్తున్నాడు. ఇతడుగాక వేరొక దైవం పైనెక్కడో కూర్చొని వున్నాడా? Is there a different God sitting high up some where? అని సూటిగా ప్రశ్నించిన వారు వివేకానందస్వామి.

'సర్వజీవాత్మల సమష్టి అయివున్నట్టి ఒకే ఒక దైవాన్ని — నేను నమ్మే ఆ ఒక్క దైవాన్ని పూజించుటం కోసం నేను యీ లోకంలో మళ్ళామళ్ళా పుట్టి వేలకొలది కష్టాలను భరించటానికి సిద్ధంగా వున్నాను; ముఖ్యంగా, నా క్రూరనారాయణులు, నా హీన నారాయణులు, అన్ని మతాల్లో, అన్ని తెగల్లో వున్న నా దరిద్రనారాయణులను ప్రత్యేకంగా అర్చిస్తాను', అని వేదాంత విప్లవశంఖాన్ని స్వామిజీ పూరించిన తర్వాతనే పొరుగు ఏడుపులకు బధిరులై కునుకుతున్న శుష్కవేదాంతులు అయిష్టంగానైనా మేలుకున్నారు.

ముక్తకంఠంతో, 'We are the servants of that God who by the ignorant is called Man', అని ఉద్ఘోషించారాయన. స్వామిజీ మాటల్లోని మహత్తర విద్యుత్తు మన గుండెల్లోని నిద్రాణమానవతను ముట్టడించి తీరుతుంది.

నవసమాజానికి శ్రీరామరక్షగా వివేకానందుడిచ్చిన 'మానవసేవాదీక్ష' కేవలం తన గురుదేవుని భిక్ష అంటారు స్వామిజీ. ఇది తొంభై ఏళ్ళ నాటి మాట. కలకత్తాకు చేరువలో ప్రశాంతమయిన దక్షిణేశ్వర కాళికాలయంలో శ్రీరామకృష్ణుని నివాసం. అప్పటికి నరేంద్రనాథ్‌దత్తా పేరుతో నున్న స్వామిజీ ఒకనాడు గురుదేవుడయిన శ్రీరామకృష్ణుని సమీపించి ఒక కోరిక చెప్పుకున్నాడు. ఏ ఆధ్యాత్మిక సాధకుడయినా కోరుకునే సహజమయిన కోరిక అది. తను నిర్వికల్ప సమాధిని అనుభవించాలని! ఈ లోకమూ—తనూ—దైవమూ ఏకమై ఒకే ఒక ఎరుకగా అవికల్పంగా, అపరిచ్ఛిన్నంగా ప్రకాశించే ఏకత్వం అనుభూతం కావాలని. ఇది ఎవరి అనుభూతీ కాదట. అనుభవించే తానూ వుండక ఏకత్వమే భాసిస్తుందని అంటాయి శాస్త్రాలు. ఈ కోర్కె విని సంతోషించి 'ఆహా నా శిష్యుడికి కాబట్టి యింత గొప్ప కోర్కె కలిగింది, ఉత్తమ ముముక్షువు లక్షణం యిది' అని వుక్కిరి బిక్కిరి అయి శిష్యుణ్ణి కౌగిలించుకోలేదు శ్రీరామకృష్ణుడు. మరి ఏం చేశారని!

'నీవు కూడా యింత క్షుద్రమయిన కోరిక కోరుతావనుకోలేదు. ఇంతకంటె వున్నతస్థితి యింకొకటి లేదా? చరాచర ప్రపంచము నీవే పరాత్పరా అని నీవు ఎప్పుడూ పాడుతూ వుంటావే దాని అర్థం ఏమనుకుంటున్నావు?' అని నాలుగు చీవాట్లూ పెట్టారు.

ఒకే గంతులో తమస్సులో నుంచి తేజస్సులోకి దూకినట్లయింది నరేంద్రుడికి. కళ్ళు మూసుకుంటే వుండే యీశ్వరుడు కళ్ళు తెరచినా వున్నాడు. చూచేకళ్ళే కావాలి గాని కట్టెదుటే తిరుగుతున్నాడు దైవం అని అర్థం చేసుకున్నాడు నరేన్. తన మోక్షం కోసం మాత్రమే తాను ప్రయత్నిస్తూ ముక్కుమూసుక కూర్చోవటం ఎంతో క్షుద్రంగా, అల్పంగా అనిపించింది నరేంద్రుడికి. గురుదేవుని మందలింపు ఎంతో అందగించి కన్పించింది అప్పుడాయనకు. ఉలిదెబ్బలు తిన్న రాయే విగ్రహమై పూజింపబడుతున్నది. కొంగ్రొత్త భావాల రూపంలో ఎన్నో బల

పదాఘాతాలు మనసుకు తగిలిన తర్వాతనే నరేంద్రుడు వివేకానందుడయ్యాడు.

శ్రీరామకృష్ణుడు ఒకనాడు చైతన్యదేవుడు చెప్పిన వైష్ణవ ధర్మాలను వివరించి చెబుతున్నాడు. బెంగాలీభాషలో అవి నామేర్ రుచి, జీవేర్ దయ, భాగవతేర్ సేవ... (అంటే భగవన్నామమందు ప్రీతి, జీవులయందు దయ, భగవద్భక్తుల సేవ) యీ మూడు విశేషాలనూ వివరిస్తూ భావసమాధిలోకి వెళ్ళారు శ్రీరామకృష్ణుడు. కొంచెం బాహ్యస్మృతి కల్గిన వెంటనే ఆయన జీవులయందు దయ అట! ఓరి మూర్ఖుడా, నేలమీద ప్రాకే పురుగువంటివాడివి నీవా యితరులపై దయ జూపేవాడివి? ప్రతి జీవి కూడా సాక్షాత్తూ భగవత్ స్వరూపమే అని గ్రహించి నీవు చేయవలసినది జీవులసేవ. 'జీవకారుణ్యము' అన్నది ఒట్టి మూర్ఖ ప్రలాపము', అంటూ గొణుక్కోవడం నలుగురితో బాటు నరేంద్రుడూ విన్నాడు. కాని ఆ మాటలలోని గంభీరార్థం నరేంద్రుణ్ణి మాత్రమే ఆకట్టుకొన్నది.

'ప్రతి మానవుడూ భగవత్ స్వరూపుడే అని గ్రహించి ఎవడు మానవసేవ చేస్తాడో వాడికి మోక్షం కరతలామలకం. భగవదనుగ్రహం వుంటే, యీ మహత్తర సత్యాన్ని నేను బాహాటంగా ప్రపంచానికి చాటే సుదినం వచ్చితీరుతుంది' అన్నాడట అక్కడవున్న మిత్రులతో.

ఆ సుదినం నిజంగానే వచ్చింది, వివేకానందుడైన నరేంద్రుని జీవితంలో. 'మానవ సేవయే మాధవసేవ' అనే అతని అమోఘ సిద్ధాంతాన్ని లోకం రెండు చేతులూ చాచి స్వీకరించింది. సమాజశ్రేయస్సు కోసం, ముఖ్యంగా జనసామాన్యం యొక్క సంక్షేమం కోసం ఆరాటపడడం తన సన్న్యాస ఆదర్శానికి ఎంతమాత్రమూ విరుద్ధం కాదని స్వామిజీ తెలుసుకొన్నాడు. నిజానికి శ్రీరామకృష్ణ పరమహంస బోధనలోని వైశిష్ట్యం అదే అని ఆయన గుర్తించాడు. కళ్ళు మూసుకున్నప్పుడుండే యీశ్వరుడు కళ్లు తెరిచేటప్పటికి మాయమౌతాడా? ఏ రూపమూ లేని ఆ దైవం అన్ని రూపాల్లోనూ వుంటుందని స్వామిజీ గ్రహించారు.

— మారాం పెట్టకుండా మరోమాట లేకుండా మేఘాల్లోంచి సంఘంలోకి దిగి వచ్చేశాడు. "తన దివ్యత్వాన్ని మరచిన దైవమే మనిషి, తన స్వరూపస్మృతి లభించిన మనిషే దైవం," అన్న స్వామిజీ బోధ ఆనాటి యువతరాన్నీ, మేధావులనూ, ముగ్ధులను చేసింది.

సరికొత్తరూపంలో సాక్షాత్కరించటంతో ఆయనకు చేయవలసిన అర్చనల రూపం సైతం మారవలసి వచ్చింది. దైవం పట్ల చేసే అపరాధాలు సైతం కొత్తరూపుల్లో కనుపించసాగాయి. శివాపరాధమంటే సమాజానికి చేసే ద్రోహమే అని తెలివివున్న వాళ్ళందరికీ తెలియవచ్చింది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

విషయ సూచిక



ధన్యవాదాలు:—ఈ మధ్య మరో నూరుమందిని చందాదారులుగా చేర్పించిన శ్రీ ఆళ్ళ గోపిరెడ్డికి మా ధన్యవాదాలు.

## శ్రీ రామకృష్ణ ప్రభకు

చందాదారులుగా చేరండి - చందాదారులను చేర్పించండి.

దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము

- తిరుమలకు భగవంతుని దర్శనార్థము వచ్చే భక్తులలో పేదలైనవారికి ప్రసాదదానము చేయుటకు మీరు వాంఛించు చున్నారా ?

- పేదలకు అన్నదాన ప్రాశస్త్యమును హిందూమతగ్రంథములు అనేక విధములుగా ఉగ్గడించినవి. తిరుమలవంటి పుణ్యస్థలములలో గావించు అన్నదానము మఱింత విశిష్టమైనది. అన్నదానమువలెనే ప్రసాదదానముకూడ దాతలకు శుభదాయకమైయుండును.

- కావున తిరుమల తిరుపతి దేవస్థానములు, "శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము" అను పేరున ఒక నూతన విధానమును ప్రవేశపెట్టినది. ఈ పథకముక్రింద మీకు అన్నప్రసాద పొట్లములు, లడ్డులు, వడలు పేద యాత్రికులకు పంచిపెట్టవచ్చును.

- ఈ కార్యక్రమములో పాల్గొనదలచినవారు రు. 500/- శాశ్వతనిధి ఏర్పాటు చేసినచో దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో, 20 లడ్డులుగాని, 15 వడలుగాని, 20 అన్నప్రసాద పొట్లములుగాని మీరు నిర్ణయించిన దినమున క్యూ వరుసలోని పేద యాత్రికులకు పంచిపెట్టబడును.

- మీ జన్మదినముగాని, వివాహదినముగాని, మీ పిల్లల జన్మదినములుగాని, మీ జననీజనకుల శ్రాద్ధదినములుగాని, మీకు స్మరణీయమైన మఱే దినముగాని - మీరు నిర్ణయించితే ఆ దినమున ఉదయము స్వామివారి కొలువులో మీ నామధేయము, గోత్రము, మీ పేర ప్రసాదదానము జరుగబోవునట్లు విన్నవించబడును.

- రు. 500/- చొప్పున మీరు ఎన్ని నిధులైనను ఏర్పాటు చేయవచ్చును. ఒక్కొక్క నిధికి ఒక్కొక్క నిర్ణీత దినమునుగూడ మీరు సూచించవచ్చును. కనీసము 20 నిధులు (రు. 10,000/-) ఏర్పాటు చేసినవారు, నిర్ణీతదినమున కుటుంబ సభ్యులు ఐదుగురుతోసహా శ్రీవారి ప్రత్యేక దర్శనముకూడ పొందవచ్చును.

- ఈ ప్రసాదదాన కార్యక్రమము 1980 ఉగాదినుండి ప్రారంభమయినది. ఇందులో పాల్గొనదలచిన నిధి దాతలకు ఆదాయపు పన్ను మినహాయింపు గలదు. విరాళములు ఆంధ్రాబ్యాంక్ అన్ని బ్రాంచీలద్వారా మీరు పంపవచ్చును. తక్కిన ఏ బ్యాంక్ డి. డి. ద్వారా అయినను కూడ పంపవచ్చును. విరాళములను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానము పేరున, మేనేజర్, ఆంధ్రా బ్యాంక్, గాంధిరోడ్, తిరుపతి-517501 అను విలాసమునకు పంపవలెను. నామధేయము, గోత్రము, పూర్తి విలాసము, పంపకమునకు ఎన్నుకున్న ప్రసాదము పేరు, నిర్ణీత దినము. ఈ వివరములనుకూడ నిధి ఏర్పాటుదారులు తెలియజేయగలరు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



# ంత్రము

1) బుద్ధి నిలకడ - లేని మనుజుడు
పొందజాలడు - శాంతి సుఖముల
విషయ సుఖముల - వెంట పరుగిడు
వెఱ్ఱిజీవుల - కెచట శాంతిర?

2) మరకు బానిస - అయిన మనుజుడు
మనసు కలకల - మణచగలుగునె?
పొందగలుగునె - బుద్ధి నిలకడ?
చెంద గలుగునె - శాంతి సుఖముల?

3) హస్తమున, అణు - బాంబు బట్టుక
అరచు మనుజుడు - 'శాంతి శాంతని'
చంద్రు జేరగ - నరిగి గూడను
చెందజాలడు - శాంతి సుఖముల

4) మతము మతముల - మధ్య ద్వేషము
జాతి జాతుల - మధ్య జగడము
దేశ దేశములందు - రగడలు
దేనికయ్యా! - శాంతి చర్చలు?

5) వర్గ వర్గము - మధ్య వైరము
ఒకరి నొక్కరు - విశ్వసింపరు
తాము మాత్రమె - శాంతి శూరులు
తక్కువారలు - కలహకారులు.

6) ఒకరి కుత్తుక - లొకరు నరుకగ
ఉర్వి నురికెడి - మనుజు డక్కట
అంబుధిని - ఈదంగ దలచు
ఆకసంబున - కెగుర దలచును.

7) జగము లన్నియు - క్షణము లోపల
జయించ దలచు - నేటి మనుజుడు
తన్ను గలచెడు - శత్రులార్వుర
తానెరుంగడు గెలుచు మార్గము.

8) నీకు వెలుపల శాంతి సుఖముల
నేల వెదకెదు వెఱ్ఱి మనుజుడ!!
కలదు సుఖమది - అంతరంబున
కాంచు మనసును - త్రిప్పి లోపల.

9) రేపెరుంగని - రిక్త సుఖముల
వెంట దిరుగుదు - వేల భ్రాంతితో?
మార్పెరుంగని - ఆత్మయందున
మనసు లయమయి - శాంతి పొందర!!

10) అణచవలెరా! - ఇంద్రియంబుల
అందవలెరా! - ఆత్మ సుఖముల
పొందవలెరా! - బుద్ధి నిలకడ
చెందవలెరా! - శాంతి సుఖముల.

11) పరమేశ్వరు - పాదములకు
ప్రణమిల్లుచు - శరణన్నను
చిత్త శాంతి - నొదవ జేసి
చేర్చు తిరిగి - రానిచోటు.

12) ఆధ్యాత్మిక - ఆధిదైవిక
ఆధి భౌతిక - తాపములను
మనుజుల దరి - జేరకుండ
మనుచు మంత్ర - రాజమయిన,

"ఓం శాంతి, శాంతి, శాంతి" యనెడు
ఉపనిషత్తు - మంత్రంబును
సతతము స్మరియింపు మనుచు
చాటు శ్రుతులు - జగములందు.

గేయరచన: చీమకుర్తి వేంకటేశ్వర్లు

# ఒక అవ్వ - ఒక బిడ్డ

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్యస్వామి

ఒక అవ్వ ఉన్నది. ఆమె ఒకచోట కాళ్ళు జాచుకొని కదలక మెదలక ఉండే మనిషి కాదు. ఊరూరా తిరిగే మనిషి. ఆమె చూడని గ్రామం, తొక్కని గుమ్మమూ లేదు, ద్రావిడ దేశమంతా కలయ తిరిగింది. అంత ఉత్సాహవంతురాలన్నమాట.

ఒక పిల్లవాడున్నాడు - అతడు బొద్దుగా, ఏనుగు గున్నలాగా ఉంటాడు. ఈ బిడ్డ ఉన్న చోటునుంచీ కదలడు. ఉరకలతో పరుగులతో అరక్షణం కూడ ఊరక ఉండకపోవటం బిడ్డల గుణం. ఈ శిశువు అలాంటి శిశువు కాదు. విపరీతమైన శిశువు. ఈ పాపడు ఉన్నచోటు నుండి కదలడు.

విపరీతమైన అవ్వ. విచిత్రమైన శిశువు. బిడ్డవలె అవ్వ ఉన్నచోట ఉండక ఊరూర తిరుగుతుంది. అవ్వవలె బిడ్డ- కదలక మెదలక గుండ్రాయిలాగా కూర్చొని ఉంటాడు.

మరో విశేషం. ఇంతవయసైనా, ఇట్లు ఈ అవ్వ తిరగటానికి కారణం ఈ శిశువే! పల్లె, పట్టణం, జనపదం, గ్రామం, నగరం, ఒక్కచోటు ఏమి సర్వవ్యాపిలాగా తిరిగేటట్లు ఈమెను చేసిన ఘనుడు ఈ పాపడే.

ఈ శిశువెవరు ? ద్రావిడభాషలో పిళ్ళై అంటే బిడ్డ. పిళ్ళైకు శ్రేష్ఠవాచకమైన 'యార్' అనే పదం చేర్చితే - 'పిళ్ళైయార్' అనే పదం సిద్ధిస్తుంది. మర్యాదగా ఆ శిశువును పిళ్ళైయార్ అని ద్రావిడదేశంలో వ్యవహరిస్తారు. ఆయన కూర్చున్నచోటునుండి కదలడు. ఎవరన్నా ఉలకక పలకక కూరుచుని ఉంటే - అరవభాషలో నీవేమి కల్లుపిళ్ళైయారివా!' అనేది వాడుక. రాతి విగ్రహం లాగా కూర్చున్నావేమి! అని అర్థం

పార్వతీ పరమేశ్వరులకు ఈయన జ్యేష్ఠ పిళ్ళైయార్ అంటే వేరే కాదు- 'జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతిం' - అని వైదికమంత్రములో చెప్పబడిన గణపతిగారే.

ఈయన ఈశ్వరభూతగణములకు పతి - గణానాం పతిః. ఈయనను మించిన నాయకుడు వేరే లేనందున - వినాయకుడని మరొక పేరు. ఒక పదంలో 'వి' అనే విశేషణం చేరిస్తే అర్థం అతిశయమౌతుంది. కొన్నిచోట్ల విరుద్ధార్థకమవటమూ కద్దు. ఈయన చేయని పని అంటూ ఉండదు. మొక్కువారల పనుల్ చక్కజేసెడు సామి, గటికపూజల మెచ్చు గబ్బివేల్పు". పనులను చెఱచేవాడు, చక్కబెట్టేవాడూ ఈయనే. 'యం నత్వా కృతకృత్యాః స్యుః తం నమామి గజానన.' అన్ని కార్యములనూ ఆరంభించేటపుడు, అగ్రపూజ అందుకొనే పెద్దమనిషి ఈయనే.

ఈయనకు ఏనుగుముఖము. ఏనుగుకు దేహబలమధికము. ఏనుగుకు ఇంత జవసత్త్వములున్ననూ, పులి, సింహము మొదలైన జంతువులవలె ప్రాణిహింస చేయదు. బర్మామలయా మొదలైన దేశాలలో బరువైన పనులకు ఏనుగులను విస్తారంగా పూర్వం నియోగించేవారు. పిళ్ళారి కూడ శక్తిమంతుడు. శక్తి ఉన్నది కదా అని మనకు అపకారం చేయడు. ఉపకారప్రాణి. ఏనుగుకు బుద్ధి సూక్ష్మం. జ్ఞాపకశక్తి అధికం. గణపతి అనగా జ్ఞానస్వరూపమే. నిర్మల నిర్వికల్ప గుణాతీత సాంద్రానంద పరబ్రహ్మ స్వరూపమే!

ఏనుగు ఏది చేసినా అందంగా ఉంటుంది. అది ఊగులాడుతూ నడుస్తుంటే, ఆ ఠీవి, ఆ హొయలు-అది గజగమనమే మరి. ఆ తొండమును విసరటం, చెవులను హఠాత్తుగా రెపరెపలాడించటం, తినటానికి ఎవరైనా ఏదైనా ఇస్తే అమాంతంగా లాక్కొని గుటకాయ

స్వాహా చేయటం ఎంత చూసినా తృప్తి ఉండదు. దాని ముఖంలో శాంతి వెల్లివిరుస్తూ వుంటుంది. ఏనుగు వస్తేచాలు పిల్లలు దాని చుట్టూ చేరుతారు. మృగజాతిలో అంత దర్శనీయమైన మృగం వేరొకటి ఉండదు.

మనుష్యులలో బిడ్డలంటే ఒక విశేషం. పసిపిల్లల సాహచర్యంలో మనం ఎంతకాలమున్నా తనివి తీరదు. నిష్కల్మషమైన మనస్సు, బోసినవ్వులు, తొక్కుపలుకులు, క్రేళ్ళురుకులు–ఎప్పుడూ ఆనందం–ఇవీ శిశులక్షణాలు. ఇట్లా ఉండే బిడ్డలను చూస్తే ఎవరికి ఆనందం కలుగదు?

పిళ్ళారి ఏనుగుకు ఏనుగు, బిడ్డకు బిడ్డ. అందుచేత ఆయనను ఎంతసేపు చూసినా తనివి తీరదు. 'తుండము నేక దంతము తోరపు బొజ్జయు వామహస్తమున్' - ఇట్లా ఉంటుంది వెనకయ్య వేషం. శిశువువలె సారళ్యం, ఏనుగుగున్న బలం. దానివల్లనే చురుకుదనం. సుందరమైన పరమమంగళ స్వరూపం. జ్ఞానం, ఆనందం, శాంతి - ఒక్కచోట మూర్తీభవిస్తే ఆ రూపమే వినాయకుడు.

ఎన్నో పరస్పరవిరుద్ధములైన విషయములు ఒక్కచోట సామరస్యంగా ఉన్నట్లు ఈయన వద్ద ఉంటవి. ముఖం మృగవర్గానికి చెందింది. దేహం మానవవర్గానికి చెందింది. రూపమేమో శిశువు. వాస్తవానికి ఆయన మృగమూ కాదు; మనిషీ కాదు—ఆయనది దేవవర్గం. ఒక చేతిలో విరిగిన దంతం. మరొక్క చేతిలో మధురాతిమధురమైన మోదకం. పూర్ణమైన వస్తువు - అపూర్ణమైన దంతం చేతిలో ఉన్నవానికి పూర్ణత్వమెక్కడ? కాని 'పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణం' అన్న పరబ్రహ్మమే వినాయకుడు. ఈ విషయం మనకు ఎంతో మోదకరంగా లేదూ?

పిళ్ళారి బ్రహ్మచారి. కాని ఈ బ్రహ్మచారి అందరికీ పెళ్ళి చేసిపెట్టుతుంటాడు. ఏనుగు రూపంలో వచ్చి వల్లి అనే ఆటవికకన్యను సుబ్రహ్మణ్యేశ్వరునికి జతచేసి పెట్టింది ఈ మహానుభావుడే! ఈ కాలంలోనూ పెళ్ళికాని పిల్లలు తమకు మంచి వరుణ్ణి వెదకిపెట్టమని ఈయనను ప్రార్థిస్తూ వుంటారు. మరి ఆయనేమో 'ముక్కువారల పనుల్ చక్కజేసెడు సామి' అన్న బిరుదు వహించినవాడు కదా! మొదటనే మోక్షం అంటే వీళ్ళకు కాబట్టదు- వీళ్ళ ఆశలను తీర్చి తర్వాత వీళ్ళను మోక్షకాములుగా చేద్దామని ఈయన [illegible] మేమో!

తానేమో ఉన్నచోటునుండి కదలడు. భక్తులను అనుకుంటే–ఆకాశం వఱకు అమాంతంగా ఎత్తివేయగల దేవర ఈయన. దక్షిణదేశంలోని పరమభక్తురాలైన అవ్వైయార్‌ను ఆవిధంగా కైలాసం చేర్చిన ఘనత వీరికి ఉన్నట్లు ద్రావిడదేశంలో ఒక కథ ఉన్నది. ఇంకా మనకు తెలియని తత్త్వములు ఈయన వద్ద ఎన్ని ఉన్నవో?

స్వామిని ఈ విధంగా భావిస్తూ వుంటే మనకు రోమహర్షణంగా లేదూ? ద్రావిడదేశంలో ఏమూల చూచినా గణపతియే. ఆయన అనుగ్రహించిన అవ్వ అవ్వైయార్ దేశమంతా తిరిగి తత్త్వబోధ చేసింది. ఈయన ఉన్నచోటునుండి కదలలేదు. ఆమె ఒక్కచోట నిలువక ఊరూరా తిరిగింది.

ఆ అవ్వ అవ్వైయార్. ఆ బిడ్డ పిళ్ళైయార్!

—(సాధనగ్రంథమండలివారి జగద్గురు బోధలు 10వ భాగం నుండి)

# శ్రీ వరలక్ష్మి వ్రతము

డాక్టర్ టి. ఆర్. కృష్ణన్

పండుగల్లోని సరదా అంతా స్త్రీలదీ, పిల్లలదీ అని అంటే కాదనేవారుండరు. ప్రతీ వాళ్ళూ పండుగరోజు వారి వారి శక్తికొలదీ కొత్తబట్టల హడావిడితో కలకలలతో వుంటారు. ప్రతి పండగ వేరు శ్రీ వరలక్ష్మిపండుగ వేరని చెప్పవలసి యుంటుంది.

''పండుగ లేమిటి! పబ్బాలేమిటి? అనవసరపు ఖర్చు, ప్రొద్దుట లేచినప్పటినుండి ఒకటే హైరానా. ఎక్కి-తక్కి-గా చేసుకొని, భుక్తాయాసంతో బాధపడడం'' అను మనసుతో కొందరు పండుగలను సూక్ష్మంగా కొట్టేస్తారు. ఇంట్లోవాళ్ళను బెదరకొట్టడానికి మగవారు ఆ రీతిగ తేలకగ అన్నాకూడ అసలు పండగ లోని సరదా అంతా ఆ పైన చెప్పిన పిల్లలదీ, స్త్రీలదే అని మనం మరచిపోకూడదు.

పండుగలనేవి మన భారతీయులొక్కరికే కాక అందరికీ అన్ని దేశాలలో వున్నవి. ఈ ఆచారాలు మన రక్తంలో జీర్ణించుకొనిపోయి నవి. తరతరాలుగ వస్తున్న ఈ పండుగ సంబరాలు మూఢ ఆచారాలనీ, చాదస్తాలనీ కొందరు సరిపెట్టుకున్నా, అవి జన సామాన్యములో పాతుకుపోయివున్నాయి. ఉంటాయి కూడ.

ఘట్టిగా ఆలోచిస్తే, అసలు ఈ పండుగలంటూ లేకపోతే మనం పొరుగువారిని పిలచి, ఒకే ఒక్క-పూట కూడ పెట్టమేమోననిపిస్తుంది. అయిదులూ, పదులూ లెక్క- చూడకుండా, మనవాళ్లు నలుగురునూ పిలచి, పండుగల లోనూ, శుభకార్యములలోనూ తప్ప సాధారణ దినములలో ఖర్చుపెట్టేందుకు చేతులాడుతాయా? మనసు ఒప్పుతుందా?

దీపావళి, సంక్రాంతి, సంవత్సరాదీ, దశరా ఈలాటి పెద్ద పండుగలయితేనే తండ్రి తన ఆడపిల్లలను పిలుచుకొని రావడం, అన్నగార్లు చెల్లెండ్రను, బావమరదులను తీసుకొని రావడమూ, ఈలాటివి జరుగును. పండుగలు కావుననే పిలచినను వారు రావడమూ, నాలుగు రోజులు సరదాగా గడపడం కూడ జరిగేది. సాధారణ రోజుల్లో అయిన యెడల వీరు పిలవరు, వారు రానూరారు. ఒకవేళ ఏమైనా పని మీద సాధారణ రోజుల్లో వచ్చినా ఆ రావడం పండుగల్లో వచ్చునట్లుగ వుండదు.

ఒక పండుగకే అల్లుళ్ళూ కూతుళ్ళూ వచ్చారే అనుకుందాం. వాళ్లు వున్న మూనాళ్లూ వాళ్ళకి విసుగు రాకుండా, మర్యాద లోపం కాకుండా, బావా మరదలు ఇంటి అల్లుళ్ళతో హాస్యాలాడడం, అందరూ కలసి పేక ఆడుకోవడం, ఇత్యాది వాటితో మూడు రోజులూ మూడు నిముషాల్లా గడిచి పోతాయి.

ఉత్తరోజుల్లో అయితే ప్రతిమనిషీ ఆఫీసు గొడవ, సంసారతాపత్రయం, డబ్బూ, దసకం యిలాంటివాటిల్లో యిరుక్కు-ని సతమతమవుతూ వుంటాడు కదా! అదే పండుగ రోజుల్లో అయితే దైనందిన బాధలు మరచిపోయి, ఆ మూడు రోజులూ హాయిగా వుండడానికి ప్రయత్నిస్తాడు. ఈ పండుగల మీద నమ్మకం అనండి-అపేక్ష అనండి. ఏమయినా మామూలు బాధలనుండి తెప్పరిల్లి మానసికంగా విశ్రాంతి పొందుతాడు. ఈ విధమైన మానసిక విశ్రాంతి అందరికీ కావాలి. ఆ కొద్ది పాటి ఉత్సాహము కూడ లేకపోతే బ్రతుకు బరువుగా తోస్తుంది. అందుచేతనే మన యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ఈ పండుగలు నిలచి వుంటున్నాయి.

ఆడవారిని తీసుకుందాం. ఉత్తరోజున ఈ యింటికీ ఆ యింటికీ మన ఆడవాండ్రెవరూ పన్ని గట్టుకొని పెత్తనానికి వెళ్ళరు. ఏదో నూటికి

కోటికి ఒకరో యిద్దరో తప్ప, సాధారణంగా మన ఆడవాళ్ళు యిల్లు కదలరు కదా! కొందరికి యింటిపనితో మరి కొందరికి తీరికవున్నా బిడియంచేతా, ఇంకకొందరు ఆ రీతిగ వెళ్ళడం నామర్దా అనీ, ఎందుకో ఒకందుకు చాలామంది వనితలు ఏదో పెద్ద అవసరమొస్తేగాని యిల్లు కదలరు.

ఆ రీతిగ ఒకపట్టాన యిల్లు కదలని స్త్రీలే ఈ శ్రావణమాసంలో చూడండి! భోరున వర్షం కురుస్తున్నా, పేరంటాలకి బయలుదేర కుండా వుండరు. ఆనాడు పిడుగులు పడు తున్నా సరే, పేరంటం మానరు. ఎందుకని తెలుసా! అదే మనవాళ్ళకి మిగిలిన నలుగురు ఆడవాళ్ళనూ కలుసుకొని మాట్లాడే తరుణం.

ఈ పండుగలవల్ల ఒకరు మరొకరి యింటికి వెళ్ళి, కాస్త సరదాగా కబుర్లు చెప్పకొని కాలక్షేపం చేయడానికి అవకాశం కలుగు తుంది. దైనందిన కార్యక్రమంలో ఏమాత్రం మార్పులేకుండా నెలమొదటిరోజున ఏలాగుం టుందో చివరిరోజున కూడ అలాగే జరిగి పోతుంది చాలామందికి. ఎటొచ్చీ, నెల మొద టిరోజున ఇవ్వవలసిన బాకీలన్నీ తీర్చేస్తే, చివరిరోజున మళ్ళీ మరెవరెవరికి ఎంత ఇవ్వాలో—అనే లెక్కలో వుంటారు. అంతే గాని నిత్యజీవితంలో నూతనోత్సాహంగానీ, మార్పుగాని కనిపించవు.

పండుగలూ, శుభకార్యాలూ వచ్చినపుడే మార్పు అనేది కాస్త వస్తూంటుంది. పండుగ అనే ఆచారం ఒకటి వుంది కాబట్టే—భయం అనండి; భక్తి అనండి; పూజాపునస్కారం చేసో చెయ్యకో పండుగ మాత్రం జరిపించే స్తాము. అటువంటి పండుగల్లో స్త్రీలకు ముఖ్యాతిముఖ్యమైన శ్రావణమాసంలో రెండవ వారంలో వచ్చే శ్రీ వరలక్ష్మీవ్రతం పండుగ, వ్రతవిశేషము మొదలగునవి తెలుసుకుందాం!

స్త్రీలకు వ్రతమనగానే ఎక్కడలేని సంతోషం. 'వ్రతానాం ఉత్తమంవ్రతం వరలక్ష్మి వ్రతం' అన్నారు కదా! ఇక చెప్పవలసిన పనే లేదు. వనితలను వన్నెచిన్నల నలరించేది యీ వరలక్ష్మీవ్రత పండుగ.

ఈ పండుగ శ్రావణమాసంలో రెండవ శుక్రవారం రోజున జరుగుతుంది. శ్రావణ మాసంలో దక్షిణాదిగృహాలలో వ్రతాలకు, పూజలకు, నాంది పలుకుతుంది. ఆ వ్రతాలన్నిం టికి ప్రప్రథమంగ వచ్చునది యీ వరలక్ష్మి వ్రతమే.

భారత దేశమంతటికి పండగమైనను తమిళ, కర్నాటక, ఆంధ్ర దేశమునందలి గృహిణులు బహుభక్తిశ్రద్ధలతో జరుపుకొనడం ఒక విశే షము. ఈ వ్రతాన్ని కన్నెపిల్లలూ, వివాహి తలూ అందరూ చేసుకోవచ్చు. దానిని ఆచ రించడానికి వయస్సు, నిష్ఠ, కుల, మతభేదాలు అడ్డు రావు. ధనికులు ఆడంబరంగా చేసుకుంటే పేదలు వారి శక్తికి తగినట్లుగ చేసుకుంటారు. ఎవరు ఏవిధంగా చేసుకున్నా ఫలితం మాత్రం ఒక్కటే.

ఈ వ్రతంలో పూజలందుకునే దేవతామ తల్లి సిరిసంపదలకు, ఆనందసౌఖ్యాలకు అధి దేవత శ్రీవరలక్ష్మిదేవి. ప్రత్యేకంగా దక్షిణ హిందూస్త్రీలు తమ తమ భర్త ఆయురా రోగ్య అయిశ్వర్యాల అభివృద్ధి కోసరం చేస్తారు.

నూతన వివాహిత స్త్రీలచేత శ్రావణ మంగళవార నోములు నోయిస్తూ యీ వ్రతాన్ని కూడ వారిచేత చేయిస్తారు. ఈ వ్రతాన్ని చేసినవారికి ధన, కనక, వస్తు,

వాహనాలు సమృద్ధిగ లభించడమేకాక యే కొరత లేకుండ, యే కష్టాలు రాకుండ, వారి బ్రతుకులు నిత్యకల్యాణం పచ్చతోరణంగా గడిచిపోతుందని అనాదిగ ఒక నమ్మకమున్నది. అంతేగాక యీ వ్రతం చేయడానికి ఆనవాయితీలు, ఆచారాలు, సంప్రదాయపు పట్టింపులు ఏమీ అక్కర లేదు. ఎల్లరూ చేసుకొనవచ్చును. నిరుపేదనుండి ధనికులవరకు వారి వారి శక్త్యనుసారము నూతన ఉడుపులు కొని ఆ రోజు ధరిస్తారు.

హిందూస్త్రీకి భర్త శ్రేయోభివృద్ధి మిగిలిన అన్నింటికంటె అతిముఖ్యమయినది. అందువల్లనే యీ వరలక్ష్మీ వ్రతానికి యింత ప్రాముఖ్యం ఏర్పడిందని తోస్తుంది.

వరలక్ష్మీ పూజనాటి ముందురోజే అనగా గురువారమే ఇంటా బయటా బూజు దులుపుకొని శుభ్రంగా యింటిని కడిగి, యింటినిండ, అరుగులనిండా రకరకాల రంగవల్లులతో అలంకరిస్తారు. మరునాడు అనగా శుక్రవారం ఉదయంతోనే వాకిట్లో కలియంపి చల్లి ముగ్గులు తీర్చిదిద్దుతారు. పచ్చి మామిడి ఆకులతోరణాలతో ద్వారాలను అలంకరిస్తారు. గడపలకు పచ్చగ పసుపురంగు, ఎరుపు, తెలుపు, పసుపు బొట్లను ఆహ్లాదకరంగా తీర్చిదిద్దుతారు. పసుపుతోను, కుంకుమతోను రంగవల్లికలతోను పూజా పీఠానికి అలంకరణ గావిస్తారు. ఆనాడు రకరకాల వంటకాలు, పిండివంటలు చేస్తారు.

### వ్రత విధానం :

ఈ వ్రతం రోజు తెల్లవారు జామునే లేచి తలంట్లు పోసుకుంటారు. ఒక పీటకు పసుపు రాసి, బొట్లు పెట్టి తూర్పుదిక్కుగ వేదికగ నలంకరించిన చోటికి చేరుస్తారు. ఆ పీట మీద అరటిఆకు పరచి దాని మీద రాయిరప్ప లేక శుభ్రపరచిన బియ్యమును పరుస్తారు. దాని మీద ఒక కలశం వుంచుతారు. ఆ కలశం నిండా ప్రత్యేకంగ శుభ్రపరచిన బియ్యం పోస్తారు. దాని మీద పీచు శిఖలా మలచి వలిచిన కొబ్బరికాయ నొకదానిని వుంచుతారు. దానినే పూజా వేదికగ భావించి ప్రతిష్ఠ చేస్తారు.

ఆ ప్రతిష్ఠించిన కలశమును వరలక్ష్మీదేవిగ భావించి రంగురంగుల పువ్వులతో (తొమ్మిది రకముల పూలతో) ఎంత సుంది వనితలుండిన అన్ని తోరణాలతో తొమ్మిదిపోచలదారంతో పూలను చేర్చి మాలగా కట్టుకొని ఆ కలశం మీద పెట్టి మంత్రాలతో పూజ చేస్తారు. రకరకాల పండ్లు, రకరకాల పిండివంటలు ఆ వరలక్ష్మీదేవికి నైవేద్యం పెడ్తారు.

వరలక్ష్మిని సిరిసంపదల కోసం, భర్తల శుభం కోసం, ఆహ్వానిస్తూ, ప్రార్థిస్తూ పాటలు పాడుకుంటారు. యీ పూజ చాలవరకు ద్విజోత్తములచేత చేయిస్తారు. పూజానంతరం ఆమెకు నైవేద్యం పెట్టి, హారతియిచ్చి,

"లక్ష్మీ రావే మాయింటికి
క్షీరాబ్ధి పుత్రీ వరలక్ష్మీ రావే మాయింటికి"

అంటూ పాటలు పాడ్తారు.

అన్ని వ్రతాలకు వున్నట్లుగానే యీ వరలక్ష్మీవ్రతానికి కూడ స్కాందపురాణంలో ఒక కథ వుంది.

పూర్వం ఒకప్పుడు చారుమతి అనే పుణ్యశీలి భూలోకంలో అవతరించింది. భర్త శుభములకు గాను తపస్సు చేసింది. విష్ణువు ఆమెకు ప్రత్యక్షమయి లక్ష్మీదేవిని గురించి తపస్సు చేయమన్నాడు. చారుమతి లక్ష్మిని గురించి తపస్సు చేయగా ఆమె పార్వతీ సహితంగ ప్రత్యక్షమై

ఒక కలశంపైన తన ముఖచిత్రం లిఖించి, దానికి పూజ చేయవలసిందని ఉపదేశిస్తుంది. చారుమతి లక్ష్మీదేవి ఆదేశించినట్లే చేసి పర మేశ్వరుని సాన్నిధ్యం చేరుకుంటుంది. ఆ తర్వాత క్రమక్రమంగా మహిళలందరూ యీ వ్రతం ఆచరించ ప్రారంభించారు. ఇది యిందలి కథ.

వరలక్ష్మీ పూజానంతరం, పాటలు పాడిన తర్వాత కలశం మీద వుంచిన తోరణాలు తీసు కొని కుడిచేతికి కట్టుకొంటారు. తదుపరి ప్రదక్షిణ నమస్కారం చేస్తూ కొన్ని శ్లోకాలు పఠిస్తారు

తోరణంలోని పూలు వాడినా తాడు మాత్రం పచ్చగా వుంటుంది. దానిని శ్రావణ మాసం వెళ్ళిన తర్వాతనే విప్పాలి అని ఆ పురాణం చెప్తోంది.

ఈ రకంగా శ్రావణ శుక్రవారం ప్రొద్దున వరలక్ష్మీదేవి వ్రతమాచరించి, మధ్యాహ్న కాలములో భోజనాదులు ముగించి, సాయం త్రం ముత్తైదువులందరినీ పేరంటమునకు పిలు స్తారు.

అప్పుడు కొత్తబట్టలు, నగలు అందంగా శృంగారించుకొని పేరంటాండ్రకోసం ఎదురు చూస్తుంటారు. రంగురంగుల కొత్తబట్టలతో, రంగురంగుల గాజులతో, కాళ్ళకు పచ్చటి పసుపూ, నుదుట ఎర్రటి కుంకుమలతో ముత్తైదువల కిలకిలా రావాలతో, నవ్వులతో వస్తూపోతూవుంటే ఎంతో వైభవంగా చూడ ముచ్చటగా వుంటుంది.

పేరంటాండ్రు వచ్చేలోగా వరలక్ష్మీ పూజా వేదిక దీపాలతో కలకలలాడేటట్లుగా అలంకరిస్తారు. ఈ పూజల అలంకరణ వగైరా చూడడానికి పేరంటమునకు వచ్చినవారికి పసుపురాసి, బొట్టుపెట్టి, వరలక్ష్మీదేవి వ్రత ప్రసాదం, అరటిపండ్లు, కొబ్బరిముక్కలు, శన గలు, తాంబూలం యిచ్చి పంపుతారు.

ఈ విధంగా యీ వ్రతం వనితలకు మహాసర దాను, సంతోషాన్ని, సౌభాగ్యాన్నీ, సంప దను కలిగిస్తుంది. ఈ వ్రతం చేసేవారికి ఏక ఏ లోట్లూ రావు. వారి సమస్త బాధ్యతలు వరలక్ష్మీదేవి తానే స్వయంగా స్వీకరిస్తుంది అనేటటువంటి నమ్మకము స్త్రీలలో నాటు కొని పోయింది.

పేదగృహిణి అయిన చారుమతికి వరలక్ష్మీ దేవి కలలో కనిపించి యీ వ్రతవిధానమూ, చేసే రోజూ తెలిపి, అభయమిచ్చి, దీవించిం దట. ఆనాటినుండి చారుమతితో బాటు మిగిలిన స్త్రీలంతా కూడ యీ వరలక్ష్మీవ్రతం చేస్తూ వస్తున్నారని తెలుస్తోంది.

న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః
యో వై యువాఽ ప్యధీయానస్తం దేవా స్థవిరం విదుః

—మనువు 2_156.

తల నెరసినమాత్రముననే మనుజుడు పెద్దవాడు కానేరడు. తరుణవయస్కుడైనను జ్ఞాన వంతుడైనవాడే వృద్ధుడని దేవతలు తలచుచున్నారు.

## కురుక్షేత్రమందు రాధాకృష్ణుల కలయిక

కుమారి పి. రాజ్యం

ఉద్ధవుని ద్వారా గోపికల సందేశాన్ని విన్న గోపాలునికి ఏ విధముగానైనా సరే రాధను చూడాలనే తీవ్రమైన కోరిక కలిగింది. అంతే కాదు తాను తన ప్రేయసి అయిన రాధను విడిచి, ఆమెకు అనంతమైన విరహాన్ని అందించి, కఠోరహృదయుడై ఎలా వుండగలిగానా అన్న ఆశ్చర్యం కలిగింది కృష్ణునికి. తన దర్శనముతో బృందావనవాసులకు ఆనందాన్ని కలిగించాలని అనుకొని మాధవుడు సూర్యగ్రహణము రోజున తనను కురుక్షేత్రములో కలుసుకొనవలసినదిగా దూతద్వారా బృందావనవాసులకు సందేశాన్ని పంపాడు.

వాయస గహ గహాత సుని సుందరీ,
బానీ విమల పూర్వ దిస బోలీ।

" 'సుందరీ! రాధా! చూసావా! కాకి ఆనందముతో గంతులు వేస్తున్నది. తూర్పుదిశలో కూర్చుని తన మధురమైన స్వరముతో కృష్ణుని రాకను తెలియచేస్తున్నది. శ్యామా! ఈ రోజు తప్పక నీకు కృష్ణదర్శనం లభిస్తుంది. నేత్రాలు, పెదవులు, భుజములు అదరి శుభశకునాలను తెలియచేస్తున్నాయి. ఇక నీవు నీ చింతను వదలి ఆనందంగా వుండు.' తన ప్రియసఖి నోటినుండి ఈ మాటలు వినగానే రాధ ఆనందానికి హద్దు లేకపోయింది."

రాధా నైన నీర భరి ఆయె।
కబ ధౌ మిలే శ్యామసుందర సఖి, జదపి నికట హై ఆయె॥

"కృష్ణుని తాను చూడబోతున్నదనే ఆనందం రాధను వివశురాలిని చేసింది. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలు అయినాయి. 'సఖీ! నేను మాధవుని వద్దకు ఎలా వెళ్ళాలి? నాకు రెక్కలు వున్నా బావుండేది కదా! హాయిగా మేఘాన్ని చూసి నెమలి ఆనందంతో నృత్యం చేసినట్లుగా, రాధ శ్యామసుందరుని కలుసుకోబోతున్నాననే ఆనందంతో ఒకచోట నిలువలేక పోతున్నది"

అబహరి ఆయి హై జని సోచై।
సును బిధుముఖీ బారి నైనని తై, అబి తూ కాహై మోచై॥

"సఖీ! రాధా! హరి నిన్ను తప్పక కలుస్తాడు. ఇక నీ చింతలను, దుఃఖాన్ని వదలి సంతోషముగా వుండు. చంద్రముఖీ! ఇక నీ నేత్రాలు అశ్రుపూరితాలు కానీయకు. సంకోచాన్ని వదలి నీ ప్రియునికి లేఖను వ్రాయి. రాధే! విరహానంతరం లభించే సంయోగములో ఎంతటి ఆనందం వున్నదో స్వయంగా అనుభవించి తెలుసుకో."

రాధా-గోపికల ఆనందాన్ని నిజం చేస్తూ కృష్ణుడు పంపిన దూత బృందావనానికి విచ్చేసాడు.

హౌ ఇహ తేరే హి కారన ఆయౌ।
తేరి సౌ సుని జనని జసోదా, మోహి గోపాల పఠాయౌ॥

"ఓ యశోదామాతా! నేను నీ కొరకు బృందావనానికి వచ్చాను. నేను ప్రమాణపూర్తిగా చెపుతున్నాను, నన్ను గోపాలుడు పంపాడు. అమ్మా! కృష్ణుడు నీకు పంపిన సందేశాన్ని విను. 'అమ్మా! అంతా నేను దేవకీదేవి కన్నకుమారుడినని అంటారు. కానీ నిజానికి నన్ను ప్రేమాప్యాయతలతో పెంచి పెద్ద చేసింది నీవు కాదా? నేను ఎప్పటికీ యశోదా నందవర్ధనుడనేనమ్మా. ఈ ద్వారకలో నాకు దేనికీ కొదువలేదు. కానీ ఇక్కడి ప్రేమాప్యాయతలు నా మనసును హరించలేకపోతున్నవి. నీ ప్రేమ జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా,

తల్లి నుండి దూరమైన లేగదూడలాగా నేను నీ కోసమై తల్లడిల్లిపోతాను. పరుగున నీ వద్దకు వచ్చి నీ ఒడిలో వాలిపోవాలని అనిపిస్తుంది. రాజకీయాలలో మునిగిన నాకు అంతటి అదృష్టము ఎక్కడిది?' ఈ విధంగా దూత, కృష్ణుని సందేశాన్ని వినిపించి యశోదతో, 'తల్లీ! మాధవుడు సూర్యగ్రహణ కారణముగా కురుక్షేత్రానికి వచ్చి వున్నాడు. అతడు మిమ్మల్ని కురుక్షేత్రానికి రమ్మని, మీకై ఎదురు చూస్తూ వుంటానని తెలుపమన్నాడు.' కృష్ణసందేశం యశోదకు అమితమైన ఆనందం కలుగచేసింది.''

నంద జసోదా సబ వ్రజవాసీ।
అపనే - అపనే సకట సాజికే, మిలన చలే అవినాసీ॥

''నంద-యశోదలు, బృందావన వాసులు తమ తమ వాహనాలను అందంగా అలంకరించుకొని తమ కంటివెలుగు అయిన మాధవుని దర్శించటానికి కురుక్షేత్రానికి పయనమయ్యారు. మధురమైన గీతాలతో, వివిధములైన వాద్యఘోషలతో దిశలు ప్రతిధ్వనింపసాగాయి. కురుక్షేత్రానికి వచ్చి కృష్ణుని చూడగానే వారికి తాము కలకంటున్నామా అన్న అనుమానం కలగసాగింది. ప్రతివారు కృష్ణుని గాఢంగా కౌగలించుకొని, కృష్ణుని కలుసుకొనే అదృష్టం మొదట తమకే దక్కిందని సంతోషపడసాగారు. దేశదేశాలనుండి వచ్చిన రాజులు వీరి ప్రేమను తిలకించి ఆనందాశ్చర్యాలకు గురి అయ్యారు. కురుక్షేత్రంలో ప్రేమ, వెల్లువలా పొంగి ప్రవహింపసాగింది

తేరీ జీవన మూరి మిలహి కిన మాయీ।
మహారాజ జదునాథ కహావత, తబహి హుతే ఏసు కువర్ కన్హాయీ॥

'''సఖీ! నీ ప్రియపుత్రుని, నీ జీవనాధారుని కలుసుకోవటానికి ఎందుకింత సంకోచపడుతున్నావు?' [గోపనారి ప్రశ్నకు జవాబుగా యశోద] 'చెల్లీ! గోకులములో మన మధ్య తిరిగిన మాధవునికి, ఇక్కడ నా ఎదురుగా వున్న గోపాలునికి చాలా అంతరం వున్నది. కారణం గోకులంలో వున్న గోపాలుడు శిశురూపంలో కన్నయ్య. కానీ నేను ఇప్పుడు చూస్తున్నది మహారాజు అయిన శ్రీకృష్ణుని. మరి నాకు సంకోచం కలుగక ఎలా వుంటుంది?' కృష్ణుడు, ఈ విధంగా మాట్లాడుతున్న యశోద వద్దకు వచ్చి ఆమె భుజములపై చేతులు వేసాడు. యశోద ఆనందంతో తన రాజీవనేత్రుని కనులారా చూసుకొని పులకించిపోయింది. ఆమె నోటినుండి ఒక్క మాట కూడ రాలేదు. తన వైపు సంకోచముగా చూస్తున్న యశోదను చూసి కృష్ణుడు 'అమ్మా! ఎందుకింత సంకోచపడుతున్నావు? నువ్వు వెన్నముద్దలు తినిపించిన కన్నయ్యనే నేను.' పుత్రుని ఈ ప్రేమపూరిత మాటలు విని యశోద, కన్నయ్యను దగ్గరకు తీసుకొని తన ఒడిలో కూర్చోబెట్టుకొని శిరస్సును మూర్కొని, ప్రేమాశ్రువులను కారుస్తూ మాధవుని ముద్దుపెట్టుకొని యశోద తన హృదయములోని విరహాన్ని పోగొట్టుకొన్నది.''

శ్యామసుందరుడైన కృష్ణుడు తొలకరి మేఘములాగా, గోపికలు విసిరే పుష్పాలు వర్షములాగా, హరి దర్శనమున అతి హర్షముతో కలిగే శబ్దములు ఉరుములలాగా, వివిధ రంగుల పుష్పములు కల వనమాల ఇంద్రధనుస్సులా గోచరించసాగింది- అక్కడ వున్నవారికి.

ప్రేమామృతమును వర్షింపజేస్తూ, హృదయానికి ఆనందం కలిగించే కృష్ణుని చూసి రుక్మిణి——

హరి సౌ బూఝతి రుక్మినీ యనమై,
కో వృషభాను కిసోరీ।

''ప్రియా! ఇక్కడ వున్నవారిలో వృషభానుని కుమార్తె ఎవరో నేను తెలుసుకోవా

వచ్చునా? ఒక్కసారి నాకు నీ చిన్ననాటి నేస్తాన్ని చూపవా? ఏ రాధ ప్రేమతో నీవు బృందావనవీధులలో మాటు వేసి వుండేవాడివో, ఆ మెరుపు తీగను చూడాలని కుతూహల పడుతున్నాను. చిగురుటాకులతో, సుగంధ భరితమైన పుష్పాలను శయ్యగా అమర్చి ఎవరికి ఆనందం కలుగచేసేవాడివో, ఆ రాధను చూడాలని నా మనస్సు ఆరాటపడుతున్నది. ప్రియా! నీ ప్రేమను చూరగొన్న ఆ అదృష్ట వంతురాలను తిలకించి ధన్యురాలిని కావాలని వున్నది.' (రుక్మిణి మాటలకు కృష్ణుడు) 'ప్రేయసీ! అదిగో! నీలపు వస్త్రాలను ధరించిన ఆ విశాలనేత్రి రాధ. అందమైన, అమాయక మైన ఆ కన్నులు నా మనసును హరించి వేసాయి.' రాధ స్ఫురణకు రాగానే మాధవునికి దేహస్మృతి నశించింది. కన్నుల వెంట ఆనందాశ్రువులు కురియసాగాయి.''

రుక్మిణీ రాధా ఐసో భేంటీ।
జైసే బహుత దినని కీ బిఛురీ, ఏక బాప కీ బేటీ॥

''రుక్మిణి రాధను కలుసుకొన్నది. రాధ పట్ల రుక్మిణికి ఎలాంటి ఈర్ష్యకానీ, అసూయగానీ కలుగలేదు. చాలా రోజుల తరువాత కలుసుకొన్న అక్కచెల్లెళ్ళలాగా ఒకరినొకరు ఆప్యాయంగా పలుకరించుకొన్నారు. యిద్దరి స్వభావం ఒక్కటే. యిద్దరూ కృష్ణప్రియులే. ఆకారములో భిన్నత్వం తప్ప యిద్దరి మనసులు ఒకటే. వీరి ప్రేమను తిలకించిన కృష్ణునికి ఆనందం, ఆశ్చర్యం కలిగింది.''

రాధా మాధవ, భేంట భయీ।
రాధా-మాధవ, మాధవ-రాధా కీటభృంగ గతి హ్వైజు॥

''రాధా - మాధవులు ఒంటరిగా కలుసుకున్నారు. ఇన్నిరోజులు తాను అనుభవించిన విరహబాధ రాధకు కృష్ణుని చూడగానే నశించింది. రాధ - మాధవునిగా, మాధవుడు - రాధగా ఒకరిలో ఒకరు లీనం అయినారు. రాధా - మాధవుల ఆ అనంతమైన ప్రేమను వర్ణింప తరం కానిది. శ్యామసుందరుడు, రాధ కన్నులలోకి చూసి మనోహరంగా నవ్వుతూ, 'రాధా! మన యిద్దరిలో ఎలాంటి భేదభావం లేదు. నీ అణువణువున నిండివున్న నా కోసం నీవు బాధపడటం దేనికి? నా కొరకు వ్యర్థంగా దుఃఖించకు. నీ మాధవుడు కోరేది నీ ఆనందమే. నేను నీలోనే వున్నాననే సత్యాన్ని ఎన్నటికీ మరువకు.''

బృందావనవాసులను సాగనంపుతూ కృష్ణుడు వారితో—

వ్రజవాసినీ సౌ కహ్యో సబని తైం,
వ్రజహిత మేరౌ॥

'''ఓ ప్రియతములారా! నాకు బృందావనము పట్ల ప్రగాఢమైన ప్రేమ ఉన్నది. నేను మీకు దూరంగా వున్నానని ఎప్పుడూ తలచకండి. బృందావనములోని అణువణువు నా స్వరూపమే. నన్ను ఎవరెవరు ఏ భావంతో నైతే పూజిస్తారో, వారికి ఆ రూపంలో దర్శనమిస్తాను. మీ మీద ప్రమాణం చేసి చెపుతున్నాను : నేను గోకులాన్ని మరవటం అనేది ఎన్నటికీ జరుగదు.' ఈ విధంగా తన ప్రేమపూరితమైన మాటలతో ఆనందపరచి మాధవుడు వారిని బృందావనానికి సాగనంపాడు

'సూరసాగరము' ఒక రససాగరము. ఆ రససాగరములో మునిగేవారికి అనంతమైన ఆనందం, శ్రీకృష్ణకథా ప్రసంగముల పట్ల రుచి, ఆ దివ్యప్రేమను ఆస్వాదించాలనే తపన కలుగుతాయి. మధుర రసస్వరూపుడైన మాధవుని చరితమే మనకు దివ్యానుభూతిని కలిగిస్తే, ఆ మోహనుని లీలలను స్వయంగా తిలకించి, ఆనందించి, కృష్ణప్రేమలో మునిగి, అతనిలో లీనమైన సూరదాసు ఎంతటి ధన్య

జీవో కదా! శ్రీ వల్లభాచార్యులు అన్నట్లుగా కృష్ణచరితం, కృష్ణస్వరూపం, కృష్ణలీలలు అన్నీ మధురమే. మధుర స్వరూపుడైన మాధవుడు మన హృదయాలలో సదా విహరించు గాక!

వచనం మధురం చరితం మధురం।
వసనం మధురం వలితం మధురమ్॥
చలితం మధురం భ్రమితం మధురం।
మధురాధిపతే రఖిలం మధురమ్॥

సూరసాగరం సమాప్తం

---

సంపాదకునిమాట:—1981 అగస్టు సంచికలో ప్రారంభమైన సూరసాగర శీర్షిక యీ ఆగస్టు సంచికలో సమాప్తం కావడం ఒక విశేషం. ఆ ఆగస్టునెలలో శ్రీ కృష్ణజయంతిని పురస్కరించుకొని ప్రారంభింపబడిన శీర్షిక ఈ ఆగస్టునెలలో శ్రీ కృష్ణజయంతిని పురస్కరించుకొని సమాప్తం కావడం మరొక కాకతాళీయ విశేషం.

## బాలల రామకృష్ణ

### దక్షిణేశ్వర కాళికాలయము

ఇకనుండి గదాయిని శ్రీరామకృష్ణుడని పిలుద్దాము. ఆయన కలకత్తా వచ్చి మూడేళ్ళయింది. ఒక ముఖ్య విషయముపై రాణి రాసమణి రామకుమారుని అభిప్రాయమడిగింది.

రాణి రాసమణి కాశీ విశ్వేశ్వరుని, అన్నపూర్ణాదేవిని సేవించటానికి పడవ మీద కలకత్తా నుండి కాశీ బయలుదేరింది. ఆమె పోయే దారిలో దక్షిణేశ్వరమనే చోట కలలో ఆమెకు కాళికాదేవి కనిపించి యిలా చెప్పింది. "ఇక్కడ నాకు ఒక గుడికట్టి, అర్చిస్తూ, రోజూ అన్నం నివేదన చేసేట్లు చూడు. అలా చేస్తే కాశీకి పోవలసిన అవసరము లేదు." అందువల్ల రాణి వెనుకకు తిరిగి వచ్చింది. దక్షిణేశ్వరము దగ్గర గంగ ఒడ్డున భూమి కొని గుడి కట్టిచ్చింది. శాస్త్ర విధిగా గుడిలో విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవము జరుపవలసి ఉంది. కాని ఒక చిక్కు ఏర్పడింది. అమ్మవారికి నిత్యము మహా నివేదన (వండిన అన్నము) చేసి, అర్చన చేయించాలని రాణి సంకల్పము. రాణి తక్కువ కుల స్త్రీ అగుటవలన పండితులు ఆ పద్ధతిని అంగీకరించలేదు. కావున ఆమె క్రుంగిపోయి చాలా విచారపడ్డది.

ఇటువంటి స్థితిలో రామకుమారు సరియైన పద్ధతి సూచించాడు. ఆయన రాణికి యిలా వ్రాసాడు. "శాస్త్రపద్ధతి ప్రకారము దేవాలయాన్ని ఒక బ్రాహ్మణుని పేర దత్తము చేస్తే అన్న ప్రసాదము అమ్మవారికి నైవేద్యము చేయుటకు ఎట్టి అభ్యంతరము వుండదు." యిది రాణి భారాన్ని తగ్గించింది. 1855 మే 31 వ తేదీన దేవాలయమును తన కులగురువు పేర ప్రతిష్ట చేయించింది, కాని దాని యాజమాన్యము, తాను వుంచుకుంది.

రామకుమారు కర్మకలాపము జరిపించి తానే దేవాలయమున మొదటి అర్చకుడయినాడు.

కాశీకేగెడు దారిలో రాసమణికి కానుపించెను కలలోన కాళికాంబ
ఆమె చెప్పిన విధమున కనుగుణముగ దక్షిణేశ్వరు గుడికట్టె ధన్యయయ్యె.

# సద్దర్శనము

వివరణము: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి

(గతసంచిక తరువాయి)

31. మౌనేన మజ్జన్మనసా స్వమూల
చర్చైవ సత్యాత్మవిచారణం స్యాత్
ఏషోఽహమేతన్న మమ స్వరూప
మితి ప్రమా సత్యవిచారణాంగం

ఆంధ్రానువాదం:- అసలు ఈ ఆత్మ చర్చ ఏమిటంటే మనస్సు మౌనం దాల్చి, తనలోపలకు తాను మునిగి, తన జన్మకు మూలమును తాను వెదకి పట్టుకొనుటే : నేను శరీరం, మనస్సు, బుద్ధి, అహంకారం కాను. నేను ఆ ఆత్మ వస్తువునే అని చేసే భావనలన్నీ ఈ ఆత్మ చర్చకు ఏకొంచమో ఉపకరించవచ్చు.

వివరణము:- సాధారణమానవుడు తాను ఈ దేహం, మనస్సు, బుద్ధితో కూడుకున్న శరీరం మాత్రమే అని భావిస్తాడు. వేదాంత శ్రవణం వల్ల లోతుగా ఆలోచించి తాను ఈ శరీరం కావని, శుద్ధ చైతన్యవంతమైన ఆత్మనే నని గ్రహిస్తాడు. ఇంతవరకూ గ్రహించినది వినికిడి మాత్రమే కానీ, అనుభవంలోకి రాలేదు. పైన చెప్పిన రీతిగా, ఆత్మ సాక్షాత్కారం అయితే తప్ప, ఈ వినుటవల్ల వచ్చిన జ్ఞానం, ఇతరులు చెప్పగా విన్నదే కానీ, తాను చూచి అనుభవించినది కాదు.

ప్రతివారు శ్రద్ధతో నిరంతరం, రోజూ రెండుగంటలైనా అభ్యాసం చేస్తే ఆత్మ సాక్షాత్కారం పొందవచ్చు. ఈ అభ్యాసం చేశాక, మిగిలిన కాలం అంతా ఎవరిష్టం వచ్చినట్లు వారు ప్రవర్తించడం కుదరదు. ప్రతి క్షణం, ప్రతి దినం రాత్రి, ధర్మబద్ధమైన, ఆత్మీయ జీవనం-అంటే విశ్వప్రేమ, త్యాగశీలత, త్రికరణశుద్ధితో జీవించుట, ఋజు ప్రవర్తన, దానాదిగుణసంపత్తి, స్వార్థపరత్వం లేకుండుట- నీవు ప్రపంచంలో ఏవృత్తిలో జీవించినా సరే, నీ క్రియలలో మనశ్శుద్ధి ఉంటే, అది ఆధ్యాత్మిక జీవనమే అవుతుంది. నీకు అంతవరకూ ఆత్మలాభం కలుగనప్పటికీ నీ మామూలు వ్యవహారంలో, 'నేను' శరీరిని మాత్రం కాను - నేను 'ఆత్మనే' అని దృఢనమ్మకంతో ఆత్మదర్శనం అయే వరకూ జీవించాలి. ఇంద్రియాలన్నీ నిన్ను నాలుగువైపులా లాగుతున్నపుడు 'నేను ఇంద్రియాలతో వున్న శరీరిని కాను' 'సోహం' నేను ఆత్మను అని ఎల్లపుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి - దీనివల్ల నీ క్షుద్రవాంఛలు నిన్ను కట్టిపెట్టకుండా అణగిపోతాయి, ఇంద్రియాలను బలాత్కారంగా అణగద్రొక్కడం మంచిది కాదు. అపుడు అవి రెట్టింపు బలంతో మీద పడతాయి. లేకపోతే ఇంకో రూపంతో పీడిస్తవి - మొదటి స్థితికన్నా అపుడు అధమస్థితికి పోవచ్చు - కాబట్టి వాటిని విరోధించడం కంటే, వాటిని ఆత్మపరంగా దైవికములుగా చేసి సాధించవచ్చు. కానీ భగవానుడు ఈ శ్లోకంలో చెప్పినట్లు ఆత్మను అన్ని వ్యాపారములలోనూ జ్ఞాపకం ఉంచుకొని ప్రవర్తించుట కొంత ఉపయోగము మాత్రమే కానీ, ఆత్మదర్శనం ఇచ్చేది 'నేను'ను రూపుమాపే, ఇదివరకు చెప్పిన నిరంతరమైన భావనాధ్యానము ఒక్కటే ప్రక్రియ - ఈ అభ్యాసం దృఢమైనకొద్దీ నీవు ఏమి చేసినా మనస్సు ఆత్మయందే ఉంటుంది. కాబట్టి ఈ పారమార్థిక జీవనం, భావనాధ్యానం ఒకదాని కొకటి సహాయం చేసికొని బలపర్చుకుంటూ కాలానుసారంగా గమ్యస్థానానికి చేరుస్తవి.

32. గవేషణాత్ప్రాప్య హృదంతరం తత్
పతేదహంతా పరిభుగ్నశీర్షా
అథాహమన్యత్స్ఫురతి ప్రకృష్టం
నాహంకృతిస్తత్పరమేవ పూర్ణం

ఆంధ్రానువాదం:- ఆత్మను ఇలా లోపల వెదకుతూ చైతన్యగర్భం చేరాక ఈ 'అహం' 'నేను' తలబ్రద్దలై రూపుమాసిపడిపోతుంది. అపుడు ఎంతో గొప్పదైన ఇంకో అహం ఆశ్చర్యవంతంగా స్ఫురిస్తుంది - అది నీవు కాదు, నీ 'నేను' అహం కాదు - అది పూర్ణమైన అహం. సర్వవ్యాప్తమైన ఆత్మ.

వివరణం:- మొదటి సమాధి సాధించాక కూడా నీ 'అహంకారం' ఏకొంచమో ఉంటుంది. ఇది నీ 'నేను' యొక్క 'నీడ'. ఇది అభ్యాసబలం వల్ల నశించవచ్చు. ఒకవుడు రెండవసమాధి అనుభూతి చాలాకాలం వరకూ కలుగకపోవచ్చు. దీనిని గురించి ఎక్కువ విచారించవలసిన పని లేదు. మనస్సులో ఉండే వాసనలు అంటే కోరికలు, స్మృతులు మొదలైనవి ఇంకా ఉన్నవన్నమాట. నీ మనస్సును మొదట సమాధిలో కలిగిన ఆత్మానుభూతియందే ఉంచుకుంటే, ఇవన్నీ వాటంతట అవే నశించిపోతాయి. ఈ అభ్యాసాన్ని శ్రద్ధతో చేసినకొద్దీ ఏమైనా ఈ వాసనల

శేషం ఉన్నా అది కూడా పోతుంది. మొదట సమాధి తరువాత చేసిన ధ్యానాభ్యాసాలు ధ్యానం కాదు, అవంతా అభ్యాసమే: అపుడు నేనెవరను అని ప్రశ్న పుట్టును. దాని జవాబు ఇదివరకే గ్రహించావు కదా: ఇపుడు ఆ ఆత్మను మళ్లీ పొందడానికి నీ ప్రయత్నం: నీ 'నేను' 'అహంకారం' ఈపాటికి నశించిపోయి ఉంటుంది. అది మళ్ళీ తలెత్తదు. దీనితో నీస్వరూపం అంతా మారిపోతుంది. ఆ సమాధిస్థితి నీకు శాశ్వతంగా నిలిచిపోతుంది, నీవు ఆ సర్వవ్యాప్తమైన సచ్చిదానందమే: సర్వ పపంచం నీతో పాటు అంతా ప్రకాశం అయిపోతుంది. నీ హృదయంలో విశ్వప్రేమ పొంగి పొరలుతుంది. అట్టి స్థితిలో లోకానికి మంచితప్పు నీవు ఏం చేయగలవు?

33. అహంకృతిం యో లసతి గ్రసిత్వా
కిం తస్య కార్యం పరిశిష్టమస్తి
కించిద్విజానాతి స నాత్మనోఽన్యత్
తస్య స్థితిం భావయితుం క్షమః కః

ఆంధ్రానువాదం:- తన 'నేను' (అహం) మ్రింగిన ఆనందంలో మునిగినవానికి మిగిలిన చేయవలసిన పను లేముంటవి? అతను తనకంటె ఇతరం ఏమీ తెల్సుకొనవలసినది లేదు. అన్నీ అప్రయత్నంగా జరిగిపోతుంటవి - కానీ స్వరూపమిట్టిదని తెల్పిన చెప్పగలవాడు ఎవడు?

వివరణం:-అహంకారాన్ని చంపి, ఆత్మలాభం పొందినవాడు చేసేదేముంటుంది? జరిగేదంతా ఆత్మవిలాసమే? వీడూ వీడి మనస్సూ సర్వం ఆత్మే కదా: వీని వ్యక్తిత్వం పూర్తిగా ఆత్మలో కల్సిపోయింది. ఇక వీడు శుద్ధచైతన్యమే: సూర్యకాంతి అంతా సూర్యుడు ఎట్లాగో అట్లే. ఈ వ్యవహారం అంతా ఆత్మవిలాసమే: చూచేవాండ్లకు వీడు వెనుకటి మనిషివలెనే కనబడుతాడు గానీ వీడు ఆత్మగానే ఉంటాడు.

ఆత్మ అందరిలోనూ ఉండేదే కానీ, 'నేను' దానిని కప్పి కనబడనీయదు. ఆత్మలాభం పొందినవానిలో ఈ కప్పిన నేను నశించిపోతుంది కాబట్టి ఆత్మ ఒక్కటే సర్వత్రా దేదీప్యమానంగా వెలుగుతూంటుంది. వీడి శరీరము మాత్రం విశ్వప్రేమ, అనుగ్రహం ప్రకటించే ఈశ్వరుని చేతిలో పనిముట్టు. అహంకారనాశనంతోటి, వీడి మనస్సు, దానిలోని వ్యాకులతలు అన్నీ పోతాయి. ఆలోచనలన్నీ ఆ శుద్ధచైతన్యస్ఫురణలే; వీడివి కావు: ఇట్టివానికి లోకంలో చేయవలసిన పనులేముంటాయి? దానివల్ల వీడికొచ్చే లాభం ఏమిటి? 'నేను ఇది చెయ్యాలి, అది చెయ్యాలి, ఇది నా విధి' అనే కథంతా నేనూ, ఈ ప్రపంచం అన్నీ వేరుగా ఉన్నంతవరకే - ఈ ప్రపంచమంతా ఆత్మకంటె వేరుకాదు, దాని విలాసం తప్ప అని గుర్తించాక, ఈ విధుల స్పృహ ఉండదు. వాడు ఏపనైనా చెయ్యడంవల్ల లాభంకానీ, చేయకపోవడంవల్ల నష్టంకానీ లేకపోయినా అతని శరీరం ఆత్మార్పణం అయిపోయి ఏదో అప్రయత్నంగా పని చేస్తూనే ఉంటుంది. అద్వైతానుభూతి వల్ల కలిన ఆత్మానందమే అలా విలసిస్తూంటుంది. తాను ఆత్మతో ఏకమయి ఏ ఇతరమును గుర్తించడు. అట్టివాని స్థితిని లోకంలో ఎవరైనా ఊహించగలరా? జ్ఞానియొక్క శరీరం మనకు కనబడుతుంది. వాని నిజస్వరూపం అగోచరం - ఆ స్థితినే 'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని చెప్పుకుంటారు.

34. ఆహ స్ఫుటం తత్త్వమసీతి వేద
స్తథాప్యసంప్రాప్య పరాత్మనిష్ఠాం
భూయో విచారో మతిదుర్బలత్వం
తత్సర్వదా స్వాత్మతయా హి భాతి

ఆంధ్రానువాదం:—వేదం స్పష్టంగా తత్త్వమసి-అది నీవుగా వున్నావు అని చెబుతోంది. అయినప్పటికీ నీ నిజస్వభావమును గుర్తించక, ఆత్మనిష్ఠాభ్యాసం చేయకుండా మనకు ఇది సాధ్యమా? అసాధ్యమా అనే శుష్కవాదాలు చేయడం, మన మనస్సు యొక్క బలహీనతను సూచిస్తుంది. ఇట్టి వాదాలు జరుగుతున్నపుడు కూడా ఆత్మ నీ జీవాత్మగా ప్రకాశిస్తూనే ఉంది.

వివరణం:—వేదాలు ఎన్నోసార్లు, మనమంతా సచ్చిదానందస్వరూపులమేనని ఘోషిస్తున్నవి. అయినప్పటికి మనలో చాలామంది దానిని నమ్మరు. ఒకవేళ నమ్మినా ఆ ఆత్మలాభం కోసం జ్ఞాననిష్ఠతో తీవ్రసాధన చేయరు. ఊరికే వేదం ఇలా చెప్పిందా ఒకవేళ చెప్పిందే అనుకోండి, అది మనలాటివాళ్ళకు సాధ్యమా అని వితండవాదాలు చేస్తారు. ఇది మనకు సాధ్యం కాదనుకొనడం మన మనోదౌర్బల్యం కాక మరేమిటి? నీవు గుర్తించినా గుర్తించకపోయినా, ఆత్మ నిన్ను వదలదు. అది నీవే అయి ఉన్నది. దీని విషయం సందేహం, నిరాశ ఎందుకు? అట్టి కుశ్శంకలు నిరాశలు వదలిపెట్టి ఆత్మలాభం సాధించు ధైర్యంతో: అడుగు ముందుకు వేయకముందే, బలహీనతతో ఏవో సాకులు కల్పించుకొనవద్దు. ప్రయత్నం చేయక

ముందే నాచేత కాదని ఎలా అనగలవు. కాబట్టి పౌరుషంతో, ఉత్సాహంతో జ్ఞాననిష్ఠనే రాజమార్గం వేదాలు ఎలా గర్జిస్తున్నాయో విను. జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత = లెమ్మ, మేలుకో, సాక్షాత్కారం పొందు. ఇంకా విను: ఇహ చేద వేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః = నీవిక్కడనే, ఈ జన్మలోనే, ఆత్మజ్ఞానం సంపాదిస్తే నీలాభం అనంతం. దానికోసం ఇప్పుడు ప్రయత్నం చేయకపోయావా నీనష్టం కూడా అట్టిదే. వేదాలు ఏ పురుషుణ్ణి కానీ ఆత్మానుభవప్రయత్నమునకు నీకు అర్హత లేదనవు: దీనికి బి. ఏ., ఎం. ఏలు పాసవక్కర్లేదు. చదువక్కరలేదు. తెలివి తేటలు బాగా ఉన్నాయని అజ్ఞానం కూడా ఆ స్థాయినుండనవసరము లేదు. ఎంతటిదో చదువు సంధ్యలు లేనివారు ఆత్మజ్ఞానం పొందారు. ఎంతమందో విద్యాధికులు ఆ విద్యలో తన్నుకుంటారు. దీనికి కావలసినది, లౌకిక విద్య కాదు. అవగాహనాశక్తిలో లోపలి చూపులో-సామర్థ్యం. దీనివలన తానెవరో తెల్సుకొనుటకు ఈ లోపలి దృష్టి చాలా అవసరం. ఇప్పటి దురవస్థ ఏమంటే మన జ్ఞానం విద్య అంతా బాహ్యప్రపంచాన్ని గురించే। నేటి విద్యార్థులకు మనస్సును బాహ్యప్రపంచం నుంచి మళ్లించి లోపలకు చూచుటకు తగిన అవకాశం గానీ, పద్ధతిగానీ లేదు. మనస్సు నిర్మలంగా ఉండడం అంటే ఏమిటో కూడా చాలామందికి అవసరం లేదు. ఈ లోపలిచూపు చదువురాని, పరిశుద్ధమనస్సు గలవానికి, బాహ్యదృష్టి గల్గిన విద్యాధికుడైన, మలినమనస్సు గలవానికంటె ఎక్కువ సులభసాధ్యం. అన్నిటికంటె ముఖ్యం ఆత్మలాభం పొందవలెననే బలీయమైన కోరిక. కావలెనని అట్టి కోరికతో ప్రయత్నిస్తే గెలుపు తప్పదు. ఏమంటే మనం 'ఆత్మేమిటి, ఎక్కడుంది, నిజమా, అబద్ధమా, మనకు సాధ్యమా, అసాధ్యమా' అని తర్జన, భర్జన చేసినంతసేపూ ఆత్మ నీతోనే ఉంది, నీ ఆత్మగా ప్రకాశిస్తూనే ఉన్నది. నీవు వేదవాక్యాలు నమ్మినా, తిరస్కరించినా, ఆత్మ వాటితోనే ఉన్నది. వేదవాక్యాలు నమ్మడం అంటే 'ఆత్మ ఉన్నది నేనే ఆత్మ' అనే భావం. తిరస్కరించడం అంటే 'నేను వేదం చెప్పింది నమ్మను. నేను ఆత్మనైతే, నాలాంటి మామూలు మనిషి దానిని పొందగలడా?' ఇదీ కూడా పై భావం లాంటిదే. ఈ రెంటికీ ఆధారంగా ఒక శుద్ధచైతన్యం ఉండి తీరాలి. దానిని నీవు గుర్తించినా గుర్తించకపోయినా అది ఏదో నీకు తెల్సినా తెలియకపోయినా, నీవు దానిని నమ్మినా తిరస్కరించినా, అది అక్కడ ఉండనే ఉంది। దీనిని నీవు ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది. ఈ ప్రపంచంలో అనుభవించే కష్టనిష్ఠూరాలన్నీ ఇప్పుడే దాటి ఆత్మలాభం పొందగలవు.

౩౫. నవేద్మ్యహం మాముత వేద్మ్యహం మా
మితి సంవాదో మనుజస్య హాస్యః
దృగ్దృశ్యభేదాత్కిమయం ద్విధాత్మా
స్వాత్మైకతాయాం హి ధియాం న భేదాః

ఆంధ్రానువాదం:- 'నన్ను నేను తెలుసుకున్నాను' 'నన్ను నేను తెల్సుకోలేదు' అని మనం అనే కబురు మనకు నవ్వొచ్చేది. ఈ ఆత్మలు రెండున్నాయా? చూచేది ఒకటీ, చూడబడేది ఒకటీను? నీకు ఆత్మసాక్షాత్కారం కల్గినపుడు ఉన్నది ఒక ఆత్మ మాత్రమే.

వివరణం:- జనులు, ఆత్మవిషయమై ఎంతో చాకచక్యంగా మాటాడుతారు. కొందరు నన్ను నేను తెల్సుకొంటిని, లేక నేనెవరో నాకు తెలియదు అంటారు. ఈ రెండువాక్యాలు హాస్యాస్పదాలే। ఏమంటే నీ నిజస్థితి, చైతన్యమైన ఆత్మే. దానిని నీకంటే వేరు వస్తువుగా గుర్తించడం అసాధ్యం। తెలుసుకున్నాను అనీ, తెల్సుకోలేదని తెలిపేది ఒకే ఆత్మ చైతన్యమే. అది నీ 'నేను' గా భాసిస్తోంది। దానిని నీకంటె వేరుగా ఎలా గుర్తించగలవు? ఆ ప్రయత్నమే తెలివి తక్కువ. తెల్సుకొనే ఆత్మ, తెలియబడే ఆత్మ వేరువేరుగా లేవు, కర్త కర్మ తేడా అక్కడ కుదరదు. ఆత్మలాభం కలిగాక కర్త, కర్మ, క్రియా తతంగం లేదు. ఉన్నది శుద్ధచైతన్యం కదా!

౩౬. హిత్వా ప్రపశ్యన్ సద్ధామ నిజస్వరూపే
స్వభావసిద్ధేఽనుపలభ్య నిష్ఠాం
మాయావిలాసః సదసత్సరూప
విరూపనానైకముఖప్రవాదాః

ఆంధ్రానువాదం:- ఆ పరమార్థసత్యానికి ఆధారభూతమైనట్టి నిజస్వరూపమైన శుద్ధచైతన్యమును సాధించకుండా ఆత్మ సత్యమా? అసత్యమా? ఒకటా, అనేకములా! దానికి రూపం ఉందా? లేదా? అనే వితండవాదాలు అన్నీ కూడా ఆ మాయ ఆడే నాటకం.

నీ నిజమైన స్వరూపస్థితి, ఆ శుద్ధచైతన్యమగుటే. అట్టి శుద్ధచైతన్యం పరమార్థానికి మూలం. అది ఎప్పుడూ నీలో ఉండనే ఉంది దాక్కుని; దాని దగ్గరకు తీసుకుపోయే సాధన ధ్యానాభ్యాసం, విచారాభ్యాసం చెయ్యకుండా, ఆత్మ తెలుపా నలుపా' 'ఒకటా రెండా' 'ఉందా.

లేదా' అని శుష్కవాదం చేస్తూండటం తెలివిహీనమైన భ్రమ కదూ! అది తోచక చేసే కాలయాపనం! నిర్వికం! మనస్సుకు అందనిదీ, మనస్సుకు పైస్థాయిలో ఉన్న శుద్ధ చైతన్యం విషయంలో, మనస్సు పని చేయకలదా? దానిని ఇదమిద్ధం అని తెల్పగలదా? నీవు ఆ శుద్ధచైతన్యస్థానికి పోయినపుడే అదెట్టిదో గుర్తించగలవు. నీకు అధికారం ఉంది గాని, ఆ స్థానికి నీవు పోతే అక్కడ తెల్పటానికి ఏముంటుంది? వాదించటానికి, తర్కించటానికి నీ మనస్సు అక్కడ లేదే? అక్కడ సచ్చిదానందం తప్ప ఏదీ లేదు కదా? కాబట్టి సచ్చిదానందస్వరూపమైన ఆత్మ దగ్గరకు ఎగురు-ఈ కుళ్ళంకలు కట్టిపెట్టి. భగవాను రమణ, మన తత్త్వవేత్తలను వారి తత్త్వశాస్త్ర సిద్ధాంతాలను, వీటిని ప్రదర్శించే బుద్ధి చాకచక్యతను పారమార్థికదృష్ట్యా నిష్ప్రయోజనములని నిరసిస్తున్నారు.

37\. సిద్ధస్య విత్తిః సత ఏవ సిద్ధిః
స్వప్నోపమానాః ఖలు సిద్ధయోఽన్యాః
స్వప్నః ప్రబుద్ధస్య కథం ను సత్యః
సతి స్థితః కిం పునరేతి మాయాం

ఆంధ్రానువాదం:- ఆత్మ సాక్షాత్కారం కలిగిన జ్ఞాని యొక్క ఫలం, ఆ శుద్ధచైతన్యమగుటయే. అతనికి కలుగు ఇతరశక్తులు సిద్ధులూ కలలవంటివి. నిద్రలోంచి లేచిన వాడు కలలు నిజమనుకొంటాడా? అట్లే ఆత్మలాభం పొందినవాడు మళ్లీ ఈ మాయావిలాస ప్రపంచంలోకి వస్తాడా?

వివరణము:- ఈ ఆత్మనిష్ఠ చేసేవానికి. సాధన పరిపక్వ మయినకొద్దీ కొన్ని సిద్ధులు (విభూతులు), శక్తులు ఆగంతుకంగా కలుగవచ్చును. నిజమైన సాధకుడు వీటి వ్యామోహంలో పడడు. వీటిని లక్ష్యం చేయకుండా తన గమ్యం సాధించేవరకు ఏకదీక్షతో కృషి చేస్తాడు. కాని కొందరు సాధకులు ఈమధ్య వచ్చిన సిద్ధుల వ్యామోహంలో చిక్కుకొని కీర్తికోసం ప్రజలకు ప్రదర్శించి వీరి అసలు రమ్యమైన ఆత్మసిద్ధినే కోల్పోతారు. మరికొందరు, ఈ సిద్ధుల కోసమే యోగమార్గ, తంత్రమార్గ సాధనలు చేస్తారు. సిద్ధి అంటే పొందుట అని అర్థము. మానవుని మనస్థాయి పశుపక్ష్యాదులకంటే పైస్థాయిలో ఉంటుంది. మనుషులు చేసే పనులు పశువులకు అద్భుతంగా కనపడవచ్చు. మానవుడు తన బుద్ధిబలంతో పంచభూతాలను స్వాధీనం చేసుకొని వ్యవహరిస్తాడు. కాని ఈ మానవుని మనస్థాయిపైన, చైతన్యంలో ఎన్నో మెట్లున్నవి. వీటు ఆ పై మెట్లను సాధించినప్పుడు, చేసే పనులు మామూలు మనిషికి దైవికములలాగె ఆశ్చర్యం కలుగచేస్తవి. ఇవి ఎలా జరుగుతున్నాయో కూడా చెప్పలేడు. వానికేదో అమానుషమైన శక్తి, సిద్ధి కలిగినదనుకుంటాం. అసలు వానికిమాత్రం ఇది స్వాభావికము. ధ్యానమువల్లను, యోగమువల్లను, తంత్రమువల్లనూ, ఈ మెట్లుకు పోవచ్చును. ఈ సిద్ధులను సంపాదించినవారు కాని జీవన్ముక్తి కావలసినవారికి ఇవి అవరోధములు. వీటి బంధం కొంటినరకే త్రిపుటీగోళం లోనే వీటి ప్రభావం కాల దేశకాలాలతో, కార్యాకారణ సంబంధంతో. సంబంధం లేకుండా వాటికి చాలా పైది ఆత్మనిష్ఠ. ఆత్మజ్ఞానదృష్టితో చూస్తే ఈ సిద్ధులన్నీ హానుమాతుని ముందు కుప్పిగంతులు, నీచములు. నీవు మెలకువ ఏకో. నిజమైనస్థితి అనుకొంటావు. కలను అట్టి నిజస్థితి గాదియనుకొంటావు. కాబట్టి, కలలో అనుభవించిన సామాగ్రితో మెలకువలో ప్రపంచవ్యవహారం చేయవు. అదే విధంగా శుద్ధచైతన్యస్థానరీత్యా చూస్తే మన మెలకువ వ్యవహారం అంతా కలవంటిదే. సమాధిలో బ్రహ్మ సాక్షాత్కారం కలిగిన జ్ఞానికి సమాధిస్థితి తప్ప సత్యస్థితి ఏదీ లేదు. ఆయన ఈ జాగ్రత్స్థితి, అజ్ఞానం వల్లనే సత్యవస్తువుగా కినపడుతుందని అది కూడా కలవంటిదే అని గుర్తిస్తాడు. ఎవడైనా కలలో తనకు వచ్చిన కష్టాలకు మెలకువ వచ్చాక ఏడుస్తాడా? కలలో వచ్చిన సంపదనైనా దాచుకోగలడా? అదే విధంగా తురీయ స్థితిలో మేల్కొన్నవాడు తనకుగాని, ఈ ప్రపంచంలో వారికిగాని జరిగిన మంచిచెడ్డలకు లొంగిపోడు. అవి వాని స్వప్నం వంటివి. నిజము కాదు అని నిశ్చయజ్ఞాన స్థితిలో ఉంటాడు. ఈ సర్వప్రపంచము విలాసమని నమ్ముతూ, ఈ మాయలో మళ్ళీ పడతాడా? ఈ సిద్ధులు కూడా, ప్రపంచము వలెనే అసత్యములని నమ్ముతూ వాటి వలలో పడతాడా? ఆత్మజ్ఞానం లేకుండా ఈ మానసికవ్యాపారం చేసే మాంత్రికులకు ఈ సిద్ధులు లభిస్తాయేమో!

38\. సోఽహంవిచారో వపురాత్మభావే
సాహాయ్యకారీ పరిమార్గణస్య
స్వాత్మైక్యసిద్ధౌ స పునర్నిరర్థో
యథా నరత్వప్రమితిర్నరస్య

ఆంధ్రానువాదం:- దేహమే 'నేను' అనుకొనే స్థితిలో, ఆత్మలాభం కోసం 'సోహం' భావన ఉపయోగిస్తుంది. ఆత్మలాభం పొందాక దాని ప్రయోజనం లేదు. మనిషి

'నేను మనిషిని నేను మనిషి' అని జ్ఞాపకం తెచ్చుకోవడం వలె హాస్యాస్పదం.

వివరణము:-ఇప్పుడు నీకు ఈ స్థూల సూక్ష్మ శరీరములో ఉన్న మనిషినని నమ్మకం. కాని వేదాంతం వినట వల్లకాని, చదువుటవల్లకాని ఈ నమ్మకం పోయి నేను 'ఆత్మనే' అనే నమ్మకం కలిగింది, కాని అది ఇంతవరకూ శాస్త్రజ్ఞానమే కాని, అనుభూతి కాదు. కాబట్టి నీ బుద్ధికి విషయం తెలిసినప్పటికీ నీవు ఈ శరీరాభిమానంతోనే వ్యవహరిస్తావు. ఈ స్థితిలోనే నీకు ఎల్లప్పుడు నేను శరీరం కాను. నేను ఆ ఆత్మను అనే జ్ఞాపకం కావాలి, ఆవసరం. ఈ జ్ఞాపకం రెండువిధాలు. 1. అనుసంధానం. 2. నిదిధ్యాసనం. అనుసంధానం:-నీవు ప్రపంచంలో ఏపని చేసినా చేసినంతసేపు 'ఎవరు చేస్తున్నారు ఈ పని? 'నేను' కాదు. నా శరీరం. ఈ సుఖదుఃఖాలు అనుభవించే దెవరు? నేను కాదు. నా మనస్సు' అని ఎల్లప్పుడు ఈ శారీరక మానసిక వ్యాపారాల్లో తటస్థంగా వుండటం. అంటే 'నేను శరీరం కాను ఆత్మను' అంటూ చిలకపలుకుల్లాగ శుష్క జపం కాదు కావల్సింది; త్రికరణశుద్ధిగా ఉత్సాహంతో ఉత్తేజంతో, ఈ ప్రాపంచిక విలాసానికంతకూ మూలాధారం, మూలకందమైన ఆత్మను స్మరించుట. జపం చేస్తేనే మోక్షం వచ్చే మంత్రం కాదు సోహం. 'నీవు ఆత్మ' అనే అనుభూతికి గుర్తుగా ఉండి, దానినిచ్చే వాక్యం. ఇది లేచినదిమొదలు రాత్రి పడుకొనే వరకూ, 'ఏం చేసినా ఇంట్లో బయటకూడా గమనించవలసిన భావం. సుఖదుఃఖాలు, మానావమానాలు మనస్సుకు మాత్రమేనవీ, నీవి కావనీ ఎల్లప్పుడూ జ్ఞాపకం కావాలి. వాటితో ఎంతమాత్రం తగులాటం పెట్టుకోకూడదు. ఈ విధంగా నీనుంచి నీ శరీరాన్ని మనస్సునూ నిత్యం విడదీయడానికి ప్రయత్నం చేయగా చేయగా శరీరవిషయములైన స్మృతులు, వాసనలు, అనుభూతులు అన్నీ బలహీనములవుతవి. నీ చేయి, కాలు మొదలైన కర్మేంద్రియాలతో పనిచేసినంతసేపు కూడా నీవు ఆత్మను స్మరించగలవు. కాని జ్ఞానేంద్రియాలు పని చేసేటప్పుడు మనస్సు పదునుగా ఉండి, విషయాలను గ్రహించవలెను కాబట్టి ఆత్మస్మరణ కుదరదు. రెండవది నిదిధ్యాసన:- దీనికి 1, 2 గంటలు ప్రతీరోజూ తీవ్రమైన ధ్యానానికి కావాలి. ఇది కూర్చునికాని, పడుకొనిగాని, నిశ్శబ్దమై శాంతి కలిగినచోట కళ్ళు మూసుకొని అభ్యసించాలి. మానసిక 'సోహం'తో ఆత్మస్మరణ చేయాలి. మనస్సు పరిపరివిధాల లక్ష్యంనుంచి పోతూండవచ్చు. పోయినప్పుడల్లా మళ్లీ 'సోహం' భావం దగ్గరకు తీసుకువస్తూండాలి. ఇల్లా 'పోతోందే' అని విచారం వద్దు. అదికూడా లక్ష్యంనుంచి పోవుటే కదా! ఈవిధంగా అభ్యాసం చేయగా చేయగా ఈ 'సోహం' కూడా ఆగిపోయి ఒక మనశ్శాంతి మిగులుతుంది. నిశ్చలమై నిశ్శబ్దమైన మనస్థితి కొంచెం సేపు కాగానే మళ్లీ ఆలోచనలు వస్తవి. మళ్ళా వాటిని సోహంతో తరమాలి. క్రమక్రమంగా ఈ సోహం తరువాత వచ్చే నిశ్చలమానసికస్థితి వృద్ధి అవుతుంది. అప్పుడప్పుడు నిద్రకూడా రావచ్చు. దీనినే లయ లేక జడ సమాధి అంటారు. ఈ జడ సమాధికూడా సుఖానుభూతే కాని, ఇది ఆత్మసాక్షాత్కారానికి ప్రతిబంధకం. దీనిని ఎంత త్వరలో దాటుట అనేది మన మానసిక పరిశుద్ధతనుబట్టి ఉంటుంది. ఈ జడసమాధి బలీయంగా ప్రతిబంధకంగా ఉంటే వాసనాబలం అధికంగా ఉన్నదన్నమాట. వాటిని పోగొట్టాలంటే శ్రద్ధతో అనుసంధానం, నిదిధ్యాసన పొడిగించాలి' ఇవి రెండూ, రెండెద్దులవంటివి బండికి. ఈ విధంగా ఈ రెంటినీ చేయగా చేయగా ఎప్పుడో ఒకప్పుడు హటాత్తుగా మెరుపువలె సమాధి కలిగి, ఆత్మ లభిస్తుంది. అది పరిపూర్ణమైన ఆనందానుభూతి. సర్వవ్యాప్తమైన చైతన్యం. అక్కడ పొరపాటుకు అవకాశం లేదు. ఏవంటే ఆ సుఖానుభూతి అట్టిది. ఆ మొదటి సమాధి కలిగిన తరువాత మళ్లా ప్రపంచవ్యవహారంలో దిగితే మన స్వభావం పూర్తిగా మారిపోతుంది. 'నేను' 'నాదని' ఆలోచన, శరీరాభిమానం తగ్గిపోతుంది. ఏ కొంచెమైనా ఇది మిగిలినప్పటికీ, క్రమంగా సమాధి బలంవలన అది కూడా నశిస్తుంది. ఇక్కడనుంచి జరుగవలసినది సమాధి అభ్యాసమే. ఏమంటే ఇప్పటికి నీకు ఆత్మననే నిశ్చయజ్ఞానం కలిగిందిగా! సాక్షాత్కారం గలిగిందిగా! ఇక నీవు చేసే ప్రయత్నం నీవెవరివో తెలుసుకొనుటకు కాదు. ఆ తెలుసుకొన్న సమాధి స్థితిలోకి తిరిగిపోవుటకు కొంతకాలం కాగానే ఈ సమాధి స్థితి సహజమై నీకు గోచరించే సర్వం ఆత్మయేనని ఆత్మ తప్ప వేరే వస్తువు లేదనే జ్ఞానం అలవాటయిపోతుంది. ఇక 'సోహం-సోహం' అని జపం చేయడానికి నీవు ఆత్మ కాదని ఏదైనా సందేహం ఉంటేగా? నీ 'అహం' పూర్తిగా నశించిందే! ఇంకా 'సోహం' అర్థం లేదు. మనిషి, తాను మనిషి అవునో కాదో, అని సందేహం ఉండి, 'నేను మనిషిని-నేను మనిషిని అని జపం చేసినట్టుంటుంది.

39. ద్వైత విచారే పరమార్థబోధే
త్వద్వైతమిత్యేష న సాధువాదః
గవేషణాత్ ప్రాగ్గతమే వినష్టే
పశ్చాచ్చ లబ్ధే దశమత్వమేకం

ఆంధ్రానువాదం:- మనం అజ్ఞానంలో ఉన్నప్పుడు ఉన్నది ద్వైతమేనని, ఆత్మ జ్ఞానం కలిగాకనే అద్వైతం సత్యమని చేసేవాదం యుక్తియుక్తంగాదు. అసంబద్ధం. నదిలోకి వెళ్ళిన పదిమందిలో ఒకడు పోయినవాడేనని- బాగా లెక్కపెట్టి పరీక్ష చేశాక దొరికాడన్నట్లుగా ఉంటుంది. ఎప్పుడూ పదిమంది ఉన్నవాడు కదా!

వివరణము:- జ్ఞాననిష్ఠకు కావల్సిన దీక్ష పట్టుదల లేని కొందరు ఆత్మలాభం కలిగేవరకు వాళ్ళకు ద్వైతం అవసరమని సత్యమైనదని వ్యవహరించాలని వాదిస్తారు. వాళ్ల తమ దైవం తమకంటె వేరనీ ఆ దైవాన్ని పూజలతో సంతోషపరిస్తే ఆత్మ సాక్షాత్కారం కలుగుతుందని వాదిస్తారు. వారు ప్రతిపాదించేదేమంటే, ఆత్మాలాభం కలిగేవరకూ అద్వైతం సత్యం కాదని! ఈ వాదం యొక్క దౌర్బల్యాం శ్రీ భగవాను ఈ కథలో సూచిస్తారు. పదిమంది యాత్రికులు ఒక నది దాటుతుంటే ప్రవాహం వచ్చి వీళ్ళను ముంచేసింది. ఒడ్డుకు చేరి అందులో ఒక మూర్ఖుడు తన్ను లెక్కపెట్టుకోకుండా, మిగిలిన తొమ్మండ్రుగురిని లెక్కపెట్టి ఒకడు మునిగిపోయాడని ఏడ్చాడట. ఆ దారిన పోయేవాడు ఒకడు ఈ ఏడుపు చూసి ఎందుకు ఏడుపని అడిగాడు. మేం పదిమంది వస్తున్నాం, ఒకడు ఏటిలో పడిపోయాడని చెప్పాడు. ఈ తెలివితక్కువ నూహించి ఆ దారిన పోయేవాడు, ఎవడూ పోలేదని వాళ్ళ తెలివితక్కువే అలా పోయినట్టు చెప్పిందని, నిరూపించాడు. కాబట్టి ఎప్పుడూ ఆత్మ ఉన్నదే! అద్వైతం సత్యమే. అజ్ఞానం వల్ల అది స్ఫురించదు. అసత్యం అనిపిస్తుంది. అదే విధంగా పరమార్థం ఎప్పుడూ అద్వైతమే. నీవు ద్వైతం అనే సమయంలో కూడా అద్వైతమే ఉన్న నిజము. అద్వైతవస్తువును తెలియనప్పుడు, అపోహ పడినప్పుడూ ద్వైతంగా స్ఫురిస్తుంది. అప్పుడు దాన్ని ద్వైతం అని పిలుస్తాం. అట్టి ఆత్మవస్తువు శక్తివంతమై విజృంభించినప్పుడు ఈ చిత్రవిచిత్ర జగత్తుగా వికసిస్తుంది. ఇట్టి విచిత్ర విలాసాలు సంకుచితముగా వేరే వేరే చూచినప్పుడు వివిధములుగా మనకు కనపడతాయి. కాని ఈ ప్రపంచ వైవిధ్యాన్ని మొత్తము మీద చూడగలిగితే, ఇక్కడ ఒక ఆత్మవస్తువు తప్ప మరేమీ ఉండదు. సత్యము మనకు తెల్సినా తెలియకపోయిన అక్కడ ఉండనే ఉన్నది. ఆ సత్యం తెలియనప్పుడు ద్వైతమయి, తెలుసుకోగానే అద్వైతం కాలేదు. అది ఎప్పుడూ అద్వైతమే! అద్వైతం ఇప్పుడు మనం తెల్సుకొనుటవల్ల సృష్టించబడ్డది కాదు. ఎప్పుడూ ఉంటూ ఇప్పుడు గుర్తించబడ్డది.

40. కరోమి కర్మేతి నరో విజానన్
బాధ్యో భవేత్కర్మఫలం చ భోక్తుం
విచారధూతా హృది కర్తృతా చేత్
కర్మత్రయం నశ్యతి సైవ ముక్తిః

ఆంధ్రానువాదం:- నేను ఈ కర్మ చేస్తున్నాను అని చేసేవాడు కర్మఫలం అనుభవించక తప్పదు. కాని ఆత్మ విచారంవల్ల, చేసేవాడు తాను కాదనే నిశ్చయజ్ఞానం కలిగితే వానికి మూడువిధములగు కర్మ నశిస్తుంది. అదే నిజమైన ముక్తి.

వివరణము:- భగవాను ఇంతకు ముందు 21 వ శ్లోకంలో ప్రారబ్ధం, పౌరుషేచ్ఛ, పారమార్థిక దృష్ట్యా చర్చించారు. ఇప్పుడు కర్మ అనగా ఆగామి, సంచిత ప్రారబ్ధ కర్మలను వివరీకరిస్తున్నారు. 1. సంచితం అనగా చేసిన పనులయొక్క సాముదాయకఫలం, వాసనరూపంగా ఈ జన్మలో ఉండుట. 2. ప్రారబ్ధం అనగా ఈ జన్మలో గతం చేసిన పనుల ఫలం. 3. ఆగామి అనగా ఈనాడు వాసనారూపములుగా వుండి ముందు ముందు ఫలము నిచ్చేవి. ఇవన్నీ మన కోరిక, స్మృతులు మొదలైనవి. ఇవన్నీ మనమీద ఎప్పుడు పనిచేయగలవు? ఎంతకాలం మనం మన వ్యక్తిత్వంతో కూడుకొని ఈ స్థూల సూక్ష్మ శరీరములు ఈ చేసే పనులు చేస్తున్నవని భావిస్తున్నామో, అంతకాలం వాటి ఫలం అనుభవింపక తప్పుతుందా? 'నేను ఈ పనిచేస్తున్నాను' అనుకున్నంతకాలం దానిఫలం సుఖమో, దుఃఖమో అనుభవిస్తానని అనుకోడం లేమా? అట్టి భావనలన్ని వాసనారూపంగా ఉండిపోయి ముందు ముందు జన్మలందు వాటిఫలాలు ఇస్తవి. ఇప్పుడు మన జీవితమంతా అట్టి కర్తృత్వంతో చేసిన కర్మ వాసనల వల్లనే సాగుతోంది. మనలో 'నేనే' 'నేను చేస్తున్నాను' 'నేను అనుభవిస్తున్నాను' అని విర్రవీగుతుంది. ఈ అభిమానమే మనం చేసె మన శారీరక మానసిక వ్యాపారాలన్నిటికి కారణం. 'నేను చేస్తున్నాను' 'నేను అనుభవిస్తున్నాను' అనేవి చిత్తవృత్తులు. అవి 'నేనంటేనే ఉంటవి' మీరు లోపల ఈ ప్రశ్న వేసుకోండి. 'నేను చేస్తున్నాను' అనుకోవడం వల్లనే కదా, నేను అనుభవిస్తున్నాననే భావం కూడా దాపురిస్తుంది. నిజంగా నాలో చేసే కర్త ఎవడు? ఈ విచారంవల్ల నీవు నీ మనస్సు, బుద్ధి, శరీరం, 'నేను' దాటి ఆ శుద్ధ చైతన్యమైన ఆత్మలో కలిసిపోగలవు. దాంతో కర్త, కర్మ, క్రియలన్ని ఎగిరిపోతాయి. సమాధి అనుభవం కొంత బలీయం అయినాక కర్మ బలం

స్తుంది. నీ కర్తృత్వం, భోక్తృత్వం ఉన్నంతసేపే నీపై కర్మ అధికారం. పై రెండు కలిగిన 'నేను' నశించాక, అనగా కర్త, భోక్త నశించాక ఇంక ఆగామేమిటి? సంచిత మేమిటి? ప్రారబ్ధం ఏమిటి? ఎవరికి? జీవన్ముక్తి అంటే కర్తృత్వ భోక్తృత్వాలు దాటడమే. ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. జ్ఞానికి కొత్త కర్మఫలాలుండవను కోండి. జ్ఞాని కాకపూర్వం చేసిన కర్మల సంగతేమిటి? అని అతని లోకవ్యవహారం చూస్తే లోకంలో ప్రారబ్ధం వల్ల ఎన్నో పనులు చేస్తున్నట్లు ఫలాలు అనుభవిస్తున్నట్లు కనబడతాడు. ఆయనకు జబ్బు చేయవచ్చు, బాధపడవచ్చు. కాని వీటివల్ల జ్ఞానికి, మామూలు మనిషికి అంతరంగంలో కలిగే మార్పులలో తేడా ఉంటవి. మామూలు మనిషి ప్రారబ్ధం వల్ల ఈ ఫలాలు వచ్చినవే అని మనోవికారానికి లోనవుతాడు. జీవన్ముక్తుడు ఆత్మ స్థితిలో ఉండి, ప్రారబ్ధాన్ని నీ ఇష్టం వచ్చినట్టు చేసుకోమంటాడు. అతనికి ఏవిధమైన వికారం ఉండదు. ఆత్మానందంలో మునిగివుంటాడు. జరిగేదంతా ఆ పరమేశ్వర సంకల్పం అని సంతోషిస్తాడు. వాడు కర్త భోక్త కాడు కాబట్టి సుఖదుఃఖాలు లేవు. వాడు చేసే పనులు ముందు జన్మలకు దారితీయవు, వాడు అంతకూ సాక్షిమాత్రుడే. అదే జన్మబంధ విముక్తి.

**41. బద్ధత్వభావే సతి మోక్షచింతా**
**బంధస్తు కస్యేతి విచారణేన**
**సిద్ధే స్వయం స్వాత్మని నిత్యముక్తే**
**క్వ బంధచింతా క్వ చ మోక్షచింతా**

ఆంధ్రానువాదం:- 'బంధం' అనే ఆలోచన ఉన్నప్పుడే మోక్షం అనే భావం వస్తుంది. ఈ బంధం ఎవరికీ అని విచారిస్తే, ఎల్లప్పుడూ మోక్షరూపంగా నుండే ఆత్మ స్ఫురిస్తుంది. ఇంక బంధమేమిటి? మోక్షమేమిటి?

వివరణము:- 'నేను బద్ధుడ'నుకొనేవాడే, మోక్షానికి ప్రయత్నిస్తాడు. అజ్ఞాని, తాను తన స్థూల సూక్ష్మ శరీరములే అనుకొని తాను బద్ధుడని అనుకొంటాడు. దానివల్ల సుఖదుఃఖాదులను అనుభవిస్తుంటాడు. తన పారమార్థిక పరివర్తన ప్రథమదశలో తన స్థూల జీవితం దాటి, దృష్టి పొందనివాడు ఈ లోకంలోకి ఎలా వచ్చాడో, తరువాత ఎక్కడికి పోతాడో ఆలోచించడు. వాడికి బంధం ఉన్నట్టు తెలియదు. మోక్షం కావలెనని తోచదు. కాని క్రమక్రమంగా గమ్యస్థానం దగ్గరకు పోయినకొద్దీ తన్ను తన ప్రపంచాన్ని పరీక్షించ మొదలెడతాడు. తన ఇష్టం వచ్చినట్టు చేయడానికి, ఉండే కష్ట నిష్ఠూరాలు స్వేచ్ఛ లేక పోవటం గమనించి బాధపడి వీటినుంచి తప్పించుకోవడం ఎలా అనే ఆలోచన సాగిస్తాడు. 'నేనేదో చేస్తూండవలసిందేనే దానివల్ల వచ్చే కష్టసుఖాలు అనుభవించవలసిందేనే, నాకు మానసికంగా ఏవిధమైన స్వేచ్ఛా లేదే, అన్ని బాధ్యతలు నాదే అని వాపోతాడు. అప్పుడే వానికి తీవ్రమైన మోక్షం కావాలనే కోరిక పుడుతుంది. అప్పుడు వాడేం చెయ్యాలి? భగవాను చెపుతున్నారు. 'ఈ బంధం ఎవరికీ అని వెతుక్కుంటూ లోపలికి నీ మూలం దగ్గరకు పోతే అది నిత్యముక్తమైన ఆత్మే. ఈ నీ 'నేను' కే, అన్ని ఆలోచనలతోపాటు 'బంధం' మోక్షం అనే ఆలోచన కూడా; ఇవి ఆత్మకు లేవు. కాబట్టి మోక్షం సాధించే ముందర బంధం ఎవరికో తేల్చుకోవాలి. ఇది ఆత్మవిచారం. దీనితో నీ 'నేను ; పోగా, ఇక బంధం మోక్ష లెవరికి? ఆ సమాధిస్థితిలో? అప్పుడు బంధమోక్షాలను దాటినానని గుర్తిస్తావు. ఆత్మ ఎప్పుడూ ముక్తమే అక్కడ నుండి ఒకమెట్టు దిగినప్పుడు, బంధమోక్షాల మాట వస్తుంది. ఆత్మ స్థితిలో ఇవి లేవు. అది లౌకికస్థితికి పైస్థాయి.

**42. రూపిణ్యరూపిణ్యుభయాత్మికా చ**
**ముక్తిస్త్రిరూపేతి విదో వదన్తి**
**ఇదం త్రయం యా వివినక్త్యహంధీ**
**స్తస్యాః ప్రణాశః పరమార్థముక్తిః**

ఆంధ్రానువాదం:- 1. సరూపముక్తని, 2. అరూపముక్తని. 3. రెండువిధాలుగానూ ఉండే ముక్తని, మూడు విధాలుగా ఉన్నట్టు మహర్షులు చెపుతారు. ఈ మూడు కూడా 'నేను'తోపాటే ఉంటాయి. ఆ 'నేను' నశించడమే అత్యంతమైన ముక్తి. పూర్వము జైమిని అనే ఒక ఋషి ఉండేవారు. వారిమతంలో జీవుడు చనిపోయాక సూక్ష్మ శరీరంతో ఉండి భోక్తగా ఉంటాడని, అనగా స్వర్గాది లోకాల్లో అనుభవిస్తూంటాడని - ఇది సరూపముక్తి.

బాదరి అనే ఇంకో మహర్షి, జీవన్ముక్తుడు మరణించాక వ్యక్తిత్వం జీవత్వం పోయి ఆత్మతో లీనమైపోతాడని- ఇది అరూపముక్తి.

కాని బ్రహ్మసూత్రకారుడైన బాదరాయణుడు ముక్తి చెందిన జీవాత్మకు రూపం ఉండవచ్చు, ఉండకపోవచ్చునని అభిప్రాయం వెలిబుచ్చినట్టు కనబడుతుంది. ఇది ఉభయాత్మికం. శ్రీ భగవాను ఈ సందర్భంలో చెప్పేది వినండి. మనస్సుతో బుద్ధితో బాగా వివేకంతో ఆలోచించి

పై మూడువిధాల ముక్తులు చిత్తవృత్తి మాత్రమనే అని నిశ్చయించి ఎలా తద్ద్వారా, అహంకార నాశనం: నీ 'నేను'న్నప్పుడే నీకు జీవిత్వం ఉంది. ఉన్నవి.. అలో చనలు 'నేను'కే: అవి ... 'అహ్మ.....' ఉండదు. నీ ఆత్మ విచారంతో నీ 'నేను' శుద్ధచైతన్య ఆత్మలో లీనం అయ్యాక, శరీరమేది, మనస్సేది? నీ ... నీ 'నేను' ఈ ప్రపంచం ... ఆత్మ విలాసమే ... కాబట్టి జీవన్ముక్తునికి శరీరం ఉన్నా ... పోయినా ఒకటే. ఈ స్థూలశరీరం ... ఎక్కడికీ పోలేదు. ఆత్మ ... దేశ ఉందా? నీకు కూడా సమాధస్థితి సిద్ధిస్తే ... పడుతుంది. నాకు ఈ ముక్తి కావాలి ఆ ముక్తి కావాలని మూడురకాల ముక్తులను నాశనం చేసే 'అహం' నశించాలి. అదే అసలు సర్వోత్తమమయిన ముక్తి. ఈ శ్లోకంతో అసలు సద్దర్శనం పూర్తయింది. శ్రీ రమణభగవాను స్తుతి పూర్వకంగా దిగువ రెండు శ్లోకాలు లిఖించబడ్డాయి.

సద్దర్శనం ద్రవిడవాఙ్నిబద్ధం
మహర్షిణా శ్రీరమణేన శుద్ధం
ప్రబంధముత్కృష్టమమర్త్యవాణ్యా
మనూద్య వాసిష్ఠమునిర్వ్యతానీత్

ఆంధ్రానువాదం:- ఈ సద్దర్శనం అనే శుద్ధ తత్త్వ బోధ భగవాన్ శ్రీ రమణమహర్షివారిచే తమిళంతో చెప్ప బడ్డది. ఈ ఉత్కృష్టగ్రంథమును దేవభాషయగు సంస్కృ తంలోనికి వారి ఉత్తమశిష్యులైన శ్రీవాసిష్ఠమునిచే అనువ దింపబడినది. వీరి అసలు పేరు, కావ్యకంఠ గణపతిశాస్త్రి. గొప్ప కవిగా, గొప్ప సిద్ధపురుషునిగా ప్రసిద్ధికెక్కినవారు.

సత్తత్త్వసారం సరళం దధానా
ముముక్షులోకాయ ముదం దదానా
అమానుషశ్రీ రమణీయవాణీ
మయూఖభిత్తిర్మునివాగ్విభాతి

ఆంధ్రానువాదం:- శ్రీ రమణులవాక్కులు దీపకాం తులవలె, సర్వత్ర జ్ఞానకాంతిపుంజమును వెదజల్లుచున్నది. ఆత్మసాక్షాత్కారమును కాంక్షించు ముముక్షువులకు సులభ ముగా సత్యస్వరూపమును విశదపరచి ఆనందమును ఇవి కలుగచేయుచున్నవి. శ్రీ రమణుల వాక్యరూపమగు ఈ గ్రంథము నిజముగా దివ్యవాణియే.

... తో మనము ... గా అంగీక ... మహానంద స్వరూప మును ... మార్గమును ఇందులో నిర్వ చింపబడగ, ఎవరి మనస్సు దీని ... చూచినను, తరచి చూచినను, వారి స్వచ్ఛమైన ఆ... ముతో ఆత్మలాభం పొందుతారు. ... యొక్క జ్ఞానకాంతిపుంజము ... ట్టి మానవు డెంతకాలము ... కోరుచున్నాడో దానిని గురించి ఆలోచించుచున్నాడో అంతకాలం దీని ప్రకాశము శాశ్వతము. ఇది ఉపనిషత్తుల్యం. దీనిని చదువవలె, అర్థము చేసికొనవలె, ఆచరించవలె. ఇది బాగున్నదని చెప్పి పక్కన పెట్టవలసిన గ్రంథము గాదు. దీని ప్రత్యేకత, దీని ఆచరణ యోగ్యతయే.

సద్దర్శనము సమాప్తము.

## సంపాదకుని మాట:-

సద్దర్శనాన్ని 1981 మే నెల సంచికనుండి ధారావాహికగా ప్రచురిస్తూ ఈ సంచికతో పూర్తిచేశాము. రమణమహర్షుల శతజయంతి సంవత్సరములో ఈ శీర్షికను రామకృష్ణ ప్రభ లో ప్రారంభించి ఇప్పటికి సమాప్తి నొందించి నందులకు సంతసిల్లుచున్నాము. ఆంధ్రాను వాదం, వివరణం వ్రాసి ఇచ్చిన డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తిగారికి పాఠ కుల తరపున, పత్రిక తరపున కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము. డాక్టర్‌గారి అడ్రసు కోరుతూ అప్పుడప్పుడు కొందరు ఉత్తరాలు వ్రాస్తుంటారు కాబట్టి ఆయన విలాసాన్ని ఇస్తున్నాము. డాక్టర్ చాగంటి సూర్యనారా యణమూర్తి, 1-10-104, అశోక్‌నగర్, హైదరాబాదు-20.

---

# గాంధీజీ-హిందూ ధర్మం

## నేను హిందువును

మతం ముసుగులో చేయు మూఢ్యపుపనులు నాకు సహించవు. హిందూ స్వాభావికార్థమూ చెప్పెదను. హిందూ ధర్మమునకు మూలాధారములయిన వేదోపనిషత్పురాణములందు నాకు ప్రగాఢ విశ్వాసమున్నది. అవతారములను, పునర్జన్మను నేను నమ్ముదును.

వేదములు ఈశ్వర ప్రేరితములు. వేదములందలి సర్వాంశములు నాకు తెలుసునన జాలను. కాని ముఖ్యమైన సత్యజ్ఞానము, దానికి తగిన అనుభవము నాకు గలదని చాటగలను. తర్క విరుద్ధము, నీతి బాహ్యములైన విషయముల నేను విశ్వసింపను. జనులకు నేడున్న ధర్మగ్రంథ విజ్ఞానము క్రమరహితమైనది. ఎవరు సత్యము, అహింస, బ్రహ్మచర్యములు పాటింతురో వారికి మాత్రమే శాస్త్రముల మర్మమంతయు బోధపడును. నేటి పరిస్థితులలో జనులు మార్గదర్శకుడైన గురువు లేకుండగనే కొనసాగవలసియున్నది. అయినను నాకు గురుమార్గదర్శక సంప్రదాయము నందు ప్రీతియున్నది. కాని గురువు లేకున్నచో ధర్మజ్ఞానము కలుగదను నిరాశ యనవసరం. ఏలనగా హిందూధర్మ సిద్ధాంతము కాలాతీతమైనది. దానిని కొద్దిపాటి కృషితో తెలుసుకొన వీలున్నది. ఈశ్వరుడద్వితీయుడని, పునర్జన్మ మరియు ముక్తియున్నవని ప్రతి హైందవుని విశ్వాసము.

హిందూ ధర్మమున యడుగడుగునా తపో ప్రాశస్త్యమును దాని యావశ్యకతను గూర్చి చెప్పబడినది. గౌరీదేవి శంకరుని వివాహమాడదలచి తపస్సుచేసి అతని అర్ధాంగమును పొందగలిగినది. శివుడు కూడ నిరంతర ధ్యాన తపో పరతంత్రుడు. శ్రీరాముని అరణ్యవాసకాలము నందు భరతుడు యోగారూఢుడై ఘోర తపస్సు సాగించెను.

ఆత్మ, దేహములు భిన్నములు. దేహమునకు కష్టము కలిగినప్పటి స్థితి కూడ ఆత్మానందమునకడ్డు నిలువజాలదు. అన్నము శరీరమునకు జీవనాధారమైనట్లే, జ్ఞానము మరియు చింతనలాత్మకు జీవనాధారములు. శ్రద్ధ, భక్తి, వినయ రహితమైన తపస్సు ఫలితము లేని కష్టమని చెప్పవచ్చును. ఇదంతయు ఎదుటివారి మెప్పుకోలు కోసము చేయు కీర్తి కండూతి పని మాత్రమే. ఇటువంటి తపస్వికంటె హాయిగా భోజనము చేయు వ్యక్తి కోటిరెట్లు ఎక్కువ భక్తుడగును.

## వర్ణాశ్రమ ధర్మము

వర్ణాశ్రమము మీద కూడ నాకు నమ్మకమున్నది. అది వేద నిర్దేశితమైనది మాత్రమే. కాని నేడున్న తుచ్ఛమైన కులమతములు కావు. వర్ణాశ్రమ ధర్మము మానవ ప్రకృతికి సహజమైనది. ఇప్పుడున్న ఐకమత్య రహితమైన చిన్న చిన్న కులములు వర్ణధర్మముల లోనికి రావు. చతుర్వర్ణములు మానవ ప్రవృత్తి సూచకములు మాత్రమే. ఎక్కువ, తక్కువ భేదములు దీనివలన పుట్టనేరవు. బ్రాహ్మణుడు జ్ఞానము ద్వారా, క్షత్రియుడు పరాక్రమము వలన వైశ్యుడు కావలసిన సరుకుల నందుబాటులో నుంచుట చేత, మరియు శూద్రుడు శారీరక శ్రమతోడ సమాజ పరమేశ్వరునికి సేవ జేయుదురు. అనగా బ్రాహ్మణులు మాత్రమే చదువవలెనను నర్థము కాదు. జన్మతో శూద్రుడైనను, జ్ఞానసంపన్నుడైన నెడల వానిని జూచిన బ్రాహ్మణుడు నమస్కరింపవలెను. ఏ బ్రాహ్మణుడు కూడ తన జ్ఞానము ద్వారా నొనర్పవలసిన కృషిని త్యజించనంతవరకు శూద్ర సహపంక్తి భోజనము గావించినను నతని బ్రాహ్మణత్వమునకు లోటు రాదు. కాని

నేడు హిందూధర్మము వంటశాలకు మాత్రమే పరిమితమైపోవుట కడు శోచనీయము.

నేనొకనాడొక మహమ్మదీయసోదరునితో గూడి భుజించుట గాంచి యొక హిందువు చకితుడైనాడు. భోజన భాజనాదులందు ధర్మము కట్టుబడిన ప్రాణసంకటమగును. మత్స్యమాంసాదులను త్యజించుట ఆత్మోన్నతికి నొక సాధన మాత్రమే. అంతేగాని అదే ఏకైక లక్ష్యము కారాదు. ధర్మము పేరిట మాంసాశనము త్యజించి ధర్మబాహ్యములైన పనులు జేయువారంటే నాకెంతో నసహ్యము.

నేను విగ్రహారాధనకు వ్యతిరేకిని కాను. ఉపాసనకేదో నొక యాధారము కావలెను. అందుకే హిందువు విగ్రహము నెన్నుకొనెను. "ఉట్టికెగురలేనమ్మ స్వర్గానికెగురనా?" యన్నట్లు కనులముందున్న విగ్రహముపై మనస్సైకాగ్రము కానపుడు నిర్గుణుడు, నిరాకారుడు, యనంతుడు నయిన భగవంతునిపై మనస్సెలా ఏకీకృతమొనర్పగలరు? క్రైస్తవులకు చర్చిలలో నేకాగ్రమైనట్లు వేరే చోట్ల కాదెందులకు? ఇది కూడ నొకరకమైన విగ్రహారాధన కాదా? హిందువులు విగ్రహమును సాయముగనే స్వీకరింతురంతే గాని సర్వ లక్ష్యము నదియే కాదు.

## స్త్రీలు

హిందూధర్మము స్త్రీకి శ్రేష్ఠస్థాన మొసగినది. వేదకాలమున అరుంధతి స్త్రీ జాతి గౌరవమునకు చిహ్నము. ఆమెను పెళ్ళాడిన వశిష్టుడు తాను పునీతుడయినట్లు భావించెను. పౌరాణిక సాహిత్యమున నొక స్త్రీ తన ప్రాతివ్రత్య మహిమచే భర్త ప్రాణములు నిలుపగా, మరియొక మహిళ తాను వలచిన ప్రియునికి ధైర్యముగా సందేశమంపి శిశుపాలాది వీరులందరెదుట శ్రీకృష్ణుని రథ మారోహించెను. మరొక స్త్రీ సూర్యోదయము కాకుండ నాపగల్గెను. సీతా సావిత్రులు లేనిచో శ్రీరామ, సత్యవతులను లోకము గుర్తించదు.

పశుబలమే నిజమైన బలమని పరిగణించిన నది స్త్రీలలో తక్కువ. కాని నైతిక బలమును నిజమైన బలముగా భావించిన నది స్త్రీలలోనే యత్యధికము. అహింస మానవ జాతికి మూలాధారమయిన నెడల భవిష్యత్తులో మానవ గౌరవ సమస్తము స్త్రీలలోనుండును. నరజాతి హృదయముపై స్త్రీ ప్రభావమును మించునది మరొకటి లేదు. స్త్రీ పురుషులిరువురు సమాన గౌరవాదర భావములతో పరస్పర సహకారము నందించుకొనుచు ముందునకు సాగవలెను.

పెళ్ళి కూడ జన్మమువలె యొక బంధమే. దానినుండి బయటపడుటయే ముక్తి. కళ్యాణ భోజన భాజనాది నియమము లాత్మవికాసము కొరకేర్పడినవేనని గమనింపవలెను. నేటి పెళ్ళిళ్ళలో ధార్మికత్వమును తెరవెనక్కునెట్టి ఆడంబర ప్రలోభములు రంగముపైన నిలిచినవి. పెళ్ళినాడెంతగానో వృథాగా ఖర్చు చేయుదురు. వివాహము పిదప భార్యాభర్తలు నియమబద్ధ జీవితము గడపవలెను. నియమబద్ధ జీవితము గడిపే దంపతులు బ్రహ్మచర్యము పాటింపవలెనని స్మృతులలో చెప్పబడినది. మనోవికారములను జయించి మితముగా కోరికలు తీర్చుకొన్నవారు సంయములనబడుదురు. వివాహమనగా వధూవరులను వికారులను, బానిసలను చేయుటకు లైసెన్సు సంపాదించే పద్ధతి కారాదు. అందులకే వధూవరులకు వివాహోద్దేశము తెలుసుకొని అర్థము చేసు

కొను వయస్సు వచ్చిన పిదపనే వివాహము చేయవలెను. భార్యకు భర్త అధికారి కాడు, మిత్రుడు మాత్రమే. అతడామె శరీరాత్మలను పవిత్రముగా నెంచవలెను.

## అస్పృశ్యత

సామ్రాజ్యంలో డయ్యర్ పాలనాపద్ధతిని నేను సైతాన్ కృత్యమన్నాను. అట్లే హిందూ మతములోని యస్పృశ్యత కూడ సైతాన్ కృత్యమే నని జెప్పుటకు వెనుకాడను. దేశమునందలి సర్వసమస్యలను నొక బాధ్యత గలిగిన పౌరునిగా నాలోచించెదను. నా కార్యక్రమమన్నను, నే నన్నను చాలమందికి భయము. కారణము నే నస్పృశ్యతా నిర్మూలనమునకు పాటుపడుటయే కావచ్చును.

నేనొక హరిజన బాలికను పెంచినాను. మరో హరిజన కుటుంబమున కాశ్రయ మిచ్చినాను. అస్పృశ్యతా నిర్మూలన మనబడు కర్తవ్యాగ్నియందు నా దేహము దహనమై పోయినను పరవాలేదు. వారు మాలమాదిగలు కారు. నర్సీమెహతా యన్నట్లు వారిని హరిజనులని పిలుచుట యుచితము. హిందూశాస్త్రములపట్ల అచంచల విశ్వాసము గలిగిన మతానురక్తుడిని నేను. నా సత్యం నన్ను నిర్మొహమాటముగా మతమాధ్య మొనరించే దురాచారములను ఖండించమంటుంది. హిందూ ధర్మమున దొడ్డిదారిన ప్రవేశించిన ఈ కుళ్ళును సమూలముగా ఛేదించకపోయిన నది హృదయమును కుళ్ళబెట్టును. హిందూమతమును దోషవిముక్తము జేయుటకు నా రక్తములో చివరి బొట్టు నేలరాలు వరకు కృషి సల్పుదును. దీని ఫలితముగా మూఢఛాందస భావదాసుల నయన పరివేష్టితమైన ఇనుపతెర తొలగుగాక! నాకు పునర్జన్మ ఉన్నచో అంతవరకు ఈ హరిజన సమస్య యిటులనే యున్నచో నేను హరిజనుడిగా జన్మించవలెనని నా యాకాంక్ష.

## గోరక్షణ

హిందూ ధర్మమునకు మరియొక అంగము గోరక్షణ. గోవధ జేయువారజ్ఞానులు. అజ్ఞానము బోవుటకు ప్రేమ, సానుభూతులతో యత్నింపవలెను. మొత్తం ప్రపంచమున పాలిచ్చే ఆవుల సంఖ్యలో నాలుగవవంతు మన దేశమందే యున్నవి. హిందువులు గోరక్షణను గూర్చి మాట్లాడినంత రక్షణను క్రియలో చూపరు. గోరక్షణ యలౌకికాద్భుత కార్యముగా నాకగుపించుచున్నది. గోవుద్వార చరాచర ప్రకృతితో నాత్మీయతను పెంపొందించుకొనవచ్చును. భారతీయులకు గోవు నిజమైన మిత్రురాలు. అయ్యది కేవలము పాలనే యీయదు. సేద్యమునకు కావలసిన ఎడ్లను జనింపజేయును. దయాధర్మ నిలయమైన కావ్యమువలె గోవు నాకగుపించును.

గోరక్షణ యనగా గోమాంస భక్షకులను చంపి, రక్షించుట యను మాట యర్థరహితము. సనాతన హిందూధర్మము గోరక్షణకు గాను నట్టి వారిని చంపవద్దని నాకు చెప్పుచున్నది. గోరక్షణ యనగా నా దృష్టిలో సమస్త ప్రాణికోటి రక్షణ యని యర్థం. చనిపోయిన గోవులను తీసివేసి యావల పారవేతురు. [illegible]తే తప్ప చాలమంది చర్మము ధర కూడ తీసుకొనరు. దీని వలన మనము ప్రతి ఆవుకు పది రూపాయలైనా నష్టపోవుదుము. చర్మములతో వ్యాపారము చేయుట గోరక్షణకు భంగకారి కాజాలదు.

నా భార్యలో తప్పులు లేవని కాదు. అయినను నామెకు నాపయి యున్నంత ప్రభావము

మరి యే స్త్రీకి లేదు. ఆ విధముగానే నాపై హిందూ ధర్మ ముద్ర యున్నది. దానిలో నెన్ని లోపములున్నను, నాకూ హిందూ ధర్మమునకు విడదీయ లేని జన్మాంతర సంబంధ మున్నది. గీత, తులసి రామాయణముల వలన లభించినంతటి స్ఫూర్తి, ప్రేరణ మరేదాని వలనను నాకు లభించలేదు. మనసంతా అశాంతి మయమైన తరుణమున గీతాపఠనము శాంతి తొలకరి చినుకులు కురిపించును. పెద్ద పెద్ద దేవాలయములందు నెన్నియో యకృత్యములు జరుగుట నేనెరుగుదును. అయినను నాకు వాటిపై నెంతో నభిరుచి యున్నది.

దేవుని నమ్మని నాస్తికులు కూడ హిందూ ధర్మంలో నున్నారు. వారికి మన పెద్దలు "మానవసేవ మాధవసేవ" యని నిర్దేశించిరి. ఈ విశ్వాసము ననుసరించి స్వేచ్ఛగా ఆత్మాభిమానముతో బ్రతకమని హిందూధర్మం ప్రబోధిస్తుంది.

దీనిని బట్టి హిందూధర్మం సంకుచితమైన జాతి మతాల సరిహద్దుల్ని చెరిపివేసి యకుంఠితమైన మానవీయ పతాక ఎగురవేయునని తెలుచున్నది.

—సేకరణ, కూర్పు: వెలుదండ నిత్యానందరావు

గాలికి వూగిస లాడుతున్న కొమ్మలు
నిరాశసిక్త దారిద్ర్య సంచలిత
జీవులను తలంపుకు తెస్తున్నాయి
'సర్వాంతర్యామి'అని నిన్ను కీర్తొంటామే తప్ప
సర్వుల్లో నిన్ను గుర్తించం కదా!
రాతిపైని బొమ్మ పాముకు
పండ్లు పూలు పాలు పెట్టి పూజలు చేస్తాం
దారిలోని పామును పనిగట్టుకొని మరీ చంపుతాం
దారిద్ర్యంతో ప్రమగ్నే నటనను చేసే
పాత్రధారికి విందు భోజనాలు పెడతాం
మూన్నాళ్ళ ఆకలితో అలమటించే బీదవానికి
పదంటే పది మెతుకులు కూడ వేయం
పేదల దైన్యబతుకుల కథలను చదివి
కంటి నిండా నీరు కారుస్తాం

ఇంటి గడప వద్ద కొచ్చిన భిక్షగాన్ని
పురుగులా విసిరి కసరి కొడతాం
భగవాన్! నిజంగా నిన్ను పూజిస్తున్నామా?
లేక బొమ్మలను-శిల్పాలను-ప్రతీకలను
అలంకరించి, ఆటలాడి మురిసిపోతున్నామా?
నిన్ను పూజించాలంటే వేరే బొమ్మలెందుకూ?
సజీవశిల్పాలు, ఈ దరిద్రనారాయణులున్నారు
కదా!

వారి కింత తిండి పెడితే
వారి కింత కట్టబట్టనిస్తే
వారి కింత నీడ చూపితే
అది నిన్ను అర్చించినట్లు కాదా!
భగవాన్! మా బుద్ధులను ఈ దిశన
నడిపించుము

[—శ్రీ అజాతుల మల్లేశంగారి "వెలుగురేఖలు" నుండి]

ఓం ప్రకాశ్

# సర్గం 6 పై ప్ర

[జనకమహారాజు కథ]

చుట్టూ ఒకసారి చూశాను. నిర్మలమైన నీలాకాశంలో తెలతెల్లని పిల్లమబ్బులు సయ్యాటలాడుకొంటున్నాయి. ఆ మబ్బులను పట్టుకోవాలన్న తాపత్రయంతో శాకోలు పర్వత శిఖరాలు ఆకాశాన్ని తాకుతున్నాయి. ఆ శిఖరాల నాశ్రయించి పర్వతంపైన అనేక వృక్షలతాదులు పెరిగి పచ్చగా కిలకిలలాడుతున్నాయి. అక్కడక్కడ పొదరిండ్లు, లతలతో మూయబడిన గుహలు కనీ కనబడకుండా కన్పిస్తున్నాయి.

నేను రెండడుగులు ముందుకు వేశాను. చక్కని గుబురు చెట్టు కింద మహనీయుడైన ఋషిసత్తముడొకరు కన్పించారు. ఆశ్చర్య పోయాను. ఇంతకు ముందు ఇక్కడ ఈ చెట్టుగాని, ఈ మహాత్ముడుగాని లేరే అని అనుకున్నాను. బహుశ ఉండవచ్చునని సరిపెట్టుకొని ఆ మహాత్ముని సమీపించి, నమస్కరించి నిలబడ్డాను. ఆ మహాత్ముడు సిద్ధపురుషుడు శాకోలుసని నాలో నేనే అనుకున్నాను.

కొన్ని క్షణాలు గడిచాయి. ఆ సిద్ధపురుషుడు కనులు విప్పిచూశాడు. చిరు మందహాసం చేసి కూర్చోమని కనులతోనే చెప్పాడు. చెంతనే ఉన్న ఒక రాతిపై కూర్చున్నాను.

"మహాత్మా, మీరెవర్ని ఉపాసిస్తున్నారు?"

"విదేహరాజ, జనకా! నేత్రాది ఇంద్రియాల ద్వార దృశ్యమేర్పడుతుంది. ఆ దృశ్యాత్మక విషయాలతో ద్రష్టకు సంయోగం సంభవిస్తుంది. తద్వార విషయసుఖం ప్రతీతమవుతుంది.. అంతే కాదు. బుద్ధివృత్తిలో కూడ సహజానందం కల్గుతుంది. అట్టి ఆనందమే తన స్వభావంగా గల, ఆత్మతత్త్వ పరిశోధనం వలన నిరతిశయ భూమా రూపంగా ఆవిర్భూతమైన ఆ విశుద్ధ ఆత్మను, ఆ పరమాత్మను నిశ్చల సమాధిలో మేము ఉపాసిస్తాము" అని చెప్పి మరల ధ్యానమగ్నుడై పోయాడు. ఆ సిద్ధుని సమాధానాన్ని మననం చేసుకుంటూ లేచి నమస్కరించి ముందుకు నడిచాను. అలా ఆ చింతనలో పడి ఎంతదూరం అడుగులు వేశానో గమనించనే లేదు. కాని కుడికాలుకు ఒక రాయి తగులగానే ఈ ప్రపంచంలోకి వచ్చి చూశాను చూసే ఏముంది! ఎదుట ఒక చిన్న పర్ణశాల. చాలా చక్కగా, ఆకర్షణీయంగా ఉన్నది. పర్ణశాలలోనుండే శాకోలు గంభీరమైన ప్రణవనాదం వినవస్తున్నది. నెమ్మదిగా అడుగులు వేసి, పాదరక్షలు విడిచి లోన ప్రవేశించాను. ఒక దివ్యపురుషుడు తేజోమూర్తియై కనబడ్డాడు. నిర్వికల్పసమాధిలో లీనమయి మహదానందంలో ఓలలాడుతున్నాడా సిద్ధపురుషుడు. నేనతనికి వందనం చేసి, అతని పాదాలచెంత చేతులు జోడించి కూర్చున్నాను. కనులు మూసుకొని ధ్యానం చేయనుపక్రమించాను. అంతలో—

"జనకమహారాజా!" అన్న ఆత్మీయతతో కూడుకొన్న పిలుపు వినబడింది. వెంటనే నేత్రకమలాలు విప్పాను. ఆ సిద్ధపురుడు నన్నే తిలకిస్తున్నాడు.

"మిథిలాధిపతీ, నీ రాకను గుర్తించాను. నేనుండే ఈ స్థలం ఇతరుల కగోచరము. జిజ్ఞాసువైన నిన్ను చూడాలనిపించింది. అందుకే నీకు ఈ కుటీరం దృశ్యమానమైంది."

"మహాత్మా, మీ దయకు వందనాలు. నా కొక చిన్న సంశయమున్నది. మీరు సిద్ధ పురుషులు కదా, మరింకా మీరు ఎవరిని ఉపాసిస్తున్నారు?"

"విదేహరాజా! వాసనాసహితంగా ద్రష్ట-దర్శనం - దృశ్యం-ఈ త్రిపుటిని త్యజించి వేసి నపుడు విశుద్ధపరమాత్మ దర్శనమౌతుంది విశుద్ధజ్ఞానస్వరూపంలో ప్రకాశించు, ఆ విశుద్ధ ఆత్మను మేముపాసిస్తాము.'

మొదట మహాత్ముని సమాధానంలోని విశేషాన్ని ధ్యానిస్తున్న నాకు, ఈ మహాత్ముని వాక్యాలు మరింత గాంభీర చింతనకు గురి చేశాయి. ఆ రెంటిగూర్చి విశ్లేషిస్తూ, బయటికి వచ్చిన నాకు, వెంటనే ఆ పర్ణశాల అదృశ్యమానమైపోయింది. నేనిక అక్కడ నిలబడకుండ, కుడివైపుకు దారితీశాను. ఆ వైపున పర్వతాగ్రం నుండి దొర్లివస్తున్న జలధారల మధురనాదం వినబడుతున్నది. ఆ జలధార వద్దకు వెళ్ళి, అక్కడే కూర్చొని మననం చేయ సాగాను. నాకు కాస్త దూరంలోనే విశాలమైన, సమతలమైన ఒక బండరాతిపై పద్మాసనాసీనుడై ఒక మహానుభావుడు కూర్చొనియున్నాడు. అతన్ని ఆలకించగానే, నా మనో చింతనను ఆపేసి, అతన్నే చూడసాగాను. ఆ మహాత్ముడు అప్పుడే సమాధినుండి విరతుడైనట్లున్నాడు, నా చూపులను తన చూపులతో సంయోగం చేశాడు. ఆ దృక్కులతోనే చెంతకు రమ్మని ఆహ్వానించాడు. నే నతని వద్దకు వెళ్ళి నమస్కరించి నిలుచున్నాను.

"జనకరాజా! నీ మనసులో ఏముందో నే నెరుగుదును, 'ఈ మనిషి ఎవరిని ఉపాసిస్తున్నాడో కదా!' అని అనుకొంటున్నావు. ఔనా!"

"త్రికాలవేదులు, సర్వజ్ఞులు. మీకు తెలియం దేమిటి!"

"అయితే చెబుతాను విను. అస్తి, నాస్తి ఈ రెంటి మధ్య వాటి సాక్షి రూపంలో సదా విద్యమానుడై పరమాత్మ ఉంటాడు. ప్రమాస వస్తువులను తం ప్రకాశింపజేయు ఆ పరమాత్మనే మేముపాసిస్తాము."

"ధన్యుణ్ణి మహాత్మా." అని నమస్కరించాను. ఆ సిద్ధపురుషుడు ఆ వెంటనే అక్కడి నుండి అదృశ్యమయ్యాడు. ఏమిటీవింత! వింత కాదేమో, నన్ను అనుగ్రహించే నిమిత్తమే సిద్ధపురుషులు నాకు గోచరిస్తున్నారేమో! తమ దివ్యసందేశాన్ని తెలియజేస్తున్నారేమో! పరమాత్మ స్వరూపం ఇది సుమా అని తెలియజేస్తున్నారేమో! అని నాలో నేను తర్కించుకుంటూ పరమాత్మ స్వరూపాన్ని విశ్లేషించుకో సాగాను.

అప్పటికే చాలా కాలం గడించిందేమో, దాహం వేసినట్లయింది. చెంతన జలధార ఉంటే బాటసారికి వేయని దాహం కూడ వేస్తుంది. నేను ఆ జలధార వద్దకెళ్ళి ముఖం పాదాదులు కడుక్కొని, కడుపునిండ ఆ తియ్యనినీటిని త్రాగాను, అప్పటికే నా చిత్తం కాస్త చల్లబడింది. చల్లబడిన చిత్తం తెచ్చిన నూతన శక్తితో నేనుత్సాహంగ పర్వతాన్ని దిగటానికి పూనుకొని, ఆ మార్గంలో నడవ సాగాను. రాళ్ళమధ్యనుండి, చెట్లమధ్యనుండి దారిచేసుకొంటూ దిగివస్తున్న నాకు ఇరువురు బ్రహ్మచారులు నావైపే వస్తూ కన్పించారు. ఆ బ్రహ్మచారులు నావద్దకు వచ్చి నిలబడ్డారు. వారిని చూడగానే యాంత్రికంగా నమస్కరించి నిలబడ్డాను.

"మీరు జనకమహారాజులు కదా !" అన్నారు వారు.

"ఔను. ఏం కావాలి మీకు" అని అడిగాను,

''మీరు ఉపాసన సాధనయందు జిజ్ఞాసువులై అన్వేషిస్తున్నారు కదా! మా గురుదేవులు మీకీ సందేశాలను అందించమని ఆదేశించారు. స్వీకరిస్తారా?''

''మహాప్రసాదం. విన్నవించండి.''

మొదటి బ్రహ్మచారి గంభీరంగా ఇలా చెప్పాడు, ''అన్నీ దేనిలో ఉన్నాయో, అన్నింటికీ ఏది ఆధారమో, అన్నీ దేనివలన (సంభవిస్తు) ఉన్నాయో, అన్నీ దేనికోసం ఉన్నాయో, స్వయంగా అన్నీ తానుగ ఏదైఉన్నదో, ఆ పరమ సత్యాత్మను మేముపాసిస్తాము - నీవు కూడ దాన్నే ఉపాసించుము'' అని చెప్పి ఆ బ్రహ్మచారి ''ఇది మా గురువుల సందేశం'' అంటూ రెండవ బ్రహ్మచారిని తిలకించాడు.

రెండవ బ్రహ్మచారి, ''జనకమహారాజా! 'అ-కారంనుండి హ-కారం వరకు గల సమస్త వర్ణాల రూపంలో ఉండి, నిరంతరం ఉచ్చారిత మాతున్న మన ఆత్మ స్వరూపమైన ఆ పరమాత్మను మేముపాసిస్తాము. నీవు కూడ దాన్నే ఉపాసించుము' అని మా గురువుల ఆదేశము'' అంటూ మౌనం వహించాడు, ఆ సందేశాలను విని, ఆనందితుడనై తలవంచి ఆ బ్రహ్మచారులకు నమస్కరించాను. నమస్కరించి తలెత్తి చూసేసరికి ఆ బ్రహ్మచారుల దృశ్యులైపోయారు. ఓహో, వీరు బ్రహ్మచారులు గాదు; స్వయంగా సిద్ధులే సుమా అనుకొని నెమ్మదిగా మళ్ళీ దిగటం ఆరంభించాను.

కొంతదూరం వెళ్ళగానే దారిలో ఏదో మిల మిలా మెరుస్తూ కనబడింది. ఎఱ్ఱని రంగుతో కాంతిమంతంగా ప్రకాశిస్తున్న ఆ వస్తువేమిటా అన్న కుతూహలంతో దాని వద్ద కెళ్ళి వంగి తీసుకోబోయాను. అంతలో ఎవరో నన్ను పిలిచినట్లయితే పైకిలేచి చూశాను. ఎవరు కనబడలేదు. మరల వంగి ఆ వస్తువును స్పర్శించబోయాను.

''జనకమహారాజా, ఏమిటీ చేస్తున్నావ్!''

ఆ మాటలు విని ఎవరైయుంటారా అని జాగ్రత్తగా పరిశీలించాను.

''రాజా, నీ కెదురుగా శుకమున్నది. కనబడటం లేదా?'' అది విని చూస్తే, నిజంగానే ఒక చిలుక కన్పించింది. ''రాజా, నీవు చేస్తున్న పనేమిటి? హృదయగుహాలో విరాజమానుడైయున్న దీప్తిమంతుడైన ఆ పరమాత్మను వదిలి ఇలా రాళ్ళని ఆశ్రయిస్తే ఏమౌతుందో తెలుసునా? అరచేతిలోనున్న కౌస్తుభమణిని విడిచిపెట్టి, మెరిసేరాళ్ళను గ్రహించినట్లుగా ఉంటుంది. ఈ మెరిసే రాళ్ళకోసం ఎందుకు ఆసక్తి వహిస్తావు! వెల్గే నీ ఆత్మను ఎందుకు గ్రహించవు?''

ఆ శుకరూపంలోనున్న మహాత్ముని మాటలు నా చిత్తంలోకి దూసుకుపోయాయి.

''మహాత్మా, మీ వాక్కులు అమోఘం. మీకివే నా వందనాలు'' అని వందనం చేశాను. ఆ చిలుక మధురరవం చేస్తూ ఎగిరిపోయింది. నేడెంతో సుదినంగా ఉన్నది. లేకపోతే ఇంత మంది మహాత్ములు కన్పించి, తమ అమూల్య సందేశాలను నాకు విన్పిస్తారా! ఇంతమంది అనుభవించిన ఆ పరమాత్మ ప్రాప్తి నాకెలా కలుగుతుందో కదా!''

''రాజా, విచారించకు సాధన చేస్తే తప్పక సిద్ధిస్తుంది.''

ఆ మాటలు నా మనసంటున్నదా లేక మరెవరైన సిద్ధపురుషులా...అంటూ ఆలోచిస్తున్న నాకు మరల ఆ మాటలు వినబడ్డాయి.

''జనకరాజా, మేమెవరమో అని చూడకు. నీకు హితం చేయవచ్చిన వారం. శ్రద్ధగా విని సాధిస్తే, పరమాత్మ ప్రాప్తి సిద్ధిస్తుంది. అన్ని ఆశలను త్యజించినప్పుడు, హృదయ

స్థితమైన, జ్ఞానఫల స్వరూపమైన ఆ బ్రహ్మ ప్రాప్తి లభిస్తుంది. అప్పుడు, ఆ సంసార విషవల్లరియొక్క మూలపరంపరయే ఛేదమై పోతుంది. భోగపదార్థాల అస్థిర నీరసత్వాన్ని ఎరిగి కూడ, వాటియందే మరల మరల తన భావనలను బంధించి యుంచేవాడు దుర్బుద్ధిగలవాడు. వాడు వాస్తవంలో మనిషి కాదు, గాడిద. ఎగిరే పర్వతాలను ఇంద్రుడు తన వజ్రాయుధం చేత కొట్టి పడగొట్టేవాడు; అలాగే మనిషి కూడ మరల మరల ఎగిరిపడే ఈ ఇంద్రియరూప సర్పాలను వివేకమనే కత్తి చేత కొట్టి పడగొట్టాలి. ఉపశమం పొందాలి. శాంతరూప పవిత్రసుఖాన్ని పొందాలి. ఉత్తమ శమం అంటే మనోనిగ్రహంతో సంపన్నుడైన పురుషుని విశుద్ధచిత్తమే శాంతిని పొందుతుంది. చిత్తం శాంతం పొందినవానికే తన పరమానందమయ స్వరూపంలో దీర్ఘకాలిక ఉత్తమ స్థితి సంప్రాప్తమౌతుంది.''

ఆ బోధ ఆగిపోయింది. ఇంకా ఏమయినా చెబుతారేమోనని కాసేపు మౌనంగా నా చెవులు రిక్కించి అలాగే నిలబడ్డాను. కాని ఆ బోధ మళ్ళీ వినబడలేదు. అంతా నిశ్శబ్దమే నిండిపోయింది. దూరంగా పక్షుల కూతలు మాత్రం వినబడుతున్నాయి. నేను తలెత్తి చూసేసరికి ఆకాశమార్గాన పోతున్న సిద్ధపురుషులు కన్పించారు. వారికి దూరం నుండే నమస్కరించి, తిరిగి నా దిగువదారిని పట్టాను. నా మనసంతా నిర్వేదం వ్యాపించిపోయింది. ఆ సిద్ధుల ఉపదేశాలనే మననం చేసుకొంటూ పర్వతం దిగాను.

''మహారాజా, చాలా ఆలస్యం చేశారు. ప్రమాదమేమి జరగలేదు కదా!'' అంటూ మంత్రివర్యులు నా చెంతకు వచ్చారు. విహారానికి వచ్చిన వారినందరిని అక్కడే నిలిపి, నేను ఒంటరిగానే ఈ పర్వతాన్ని ఆరోహించాను. నా కోసం చూస్తూ నిరీక్షిస్తున్న వారి సంతోషంగా ఒకసారి చూసి, ''ప్రమాదమేమీ లేదు కదా'' అన్నాను. రాజప్రసాదం వైపు పోవటానికి రథాన్ని సిద్ధం చేసి తెచ్చారు. దాన్నధిరోహించగానే, సారథి అశ్వాలనదిలించాడు. రథం వేగాన్నందుకొంది.

* * *

ప్రాతఃసమయం. ఇంకా చీకటి తెరలు తొలగలేదు. నక్షత్రాలు తమ పూర్తి కాంతితో మిలమిలలాడుతున్నాయి. జాగృతున్నయిన నేను రాజభవనం పైన నిలబడి పచార్లు చేస్తున్నాను. ఆ విహారం నుండి వచ్చింతర్వాత నా మనస్సంతా విరక్తితో నిండిపోయింది. ఏమిటిదంతా, ఈ సంసారం, ఈ ప్రపంచం ఇవన్నీ ఏమిటి? అన్న ఆలోచనలే నన్ను చుట్టుముట్టసాగాయి.

''ఇదెంతైనా మహాదుఃఖపూరితము. జన్మ-జరా-రోగ-మరణాదుల కారణంగా సమస్త లోకాల్లో అత్యంత కష్టప్రదమైన చంచల దశలు సంభవిస్తున్నాయి. వాటిలో నేను బలపూర్వకంగా మునుగుతూ తేలుతూ ఉన్నాను. శోకపోకల చక్రంలో తిరుగాడుతున్నాను. కాలానికి అంతం లేదు. అనంతమైన ఈ కాల ప్రవాహంలో నా జీవితం అల్పాతి అల్పమైనది. ఈ క్షణభంగుర జీవితానికాసక్తునై నా మనస్సును బంధించుకొంటున్నాను. ఇదెంత మౌఢ్యం. ఈ జగత్తులో సత్యమైనది రమణీయమైనది, ఉదారమైనది ఏదైనా ఉందా? దేనివలన ఉత్పన్నం కానిది, నిత్యమై-నిర్వికారరూపంలో స్థితమైయున్నది ఏదైనా కలదా? విచారించి చూస్తే అలాంటిదేదీ కన్పించటం లేదు. అయితే మరి నా బుద్ధిని ఎందు లగ్నం చేయాలి? ఎక్కడ నేను శాంతిని పొందాలి?

ఆహా! నాయీ మూఢత్వం ఏమని చెప్పేది. ఇంత మూఢత్వమున్నా, నాపై నాకు దుఃఖ మొందుకు కల్గటం లేదో కదా!''

నాలో నేనే తర్క-వితర్కాలు చేసుకుంటున్న నాదృష్టి హఠాత్తుగా ఆకాశంలో మెరుస్తున్న సుదూరంగా ఉన్న చుక్కలయందు నిలబడిపోయింది. ''దూరస్థవస్తువని చెప్పబడుతున్నది కూడ వాస్తవంలో దూరంగా లేదు. అది నా మనసులోనే వర్తమానమై యున్నది కదా! కనుక ఇలాంటి నిశ్చయ జ్ఞానంతో బాహ్యవస్తువులను త్యజించవలసియుంది. ఇక లౌకిక సుఖాలంటావా? ప్రతిక్షణము, ప్రతిదినము, ప్రతిమాసము, ప్రతివర్షము కూడ ఈ సాంసారిక సుఖ దుఃఖభరితమయ్యే ఉన్నది. ఇవే మళ్ళీ మళ్ళీ సుఖభ్రమాత్మంగా ప్రాప్తిస్తాయి. వాస్తవంగా ఇవి సుఖాలు కావు దుఃఖాలే. తలమానికంగా వెల్గిపోతున్న వారే, రేపొద్దున అధఃపతనమౌతున్నారు! చూశావా చిత్రమూ! జగత్తు ఎంత భ్రమాత్మకమైనదో! ఇలాంటి దానియందు విశ్వసిస్తున్నావా? మనిషి బుద్ధియుతుడంటారు. అయినా సూర్యున్ని కప్పే నల్లని మబ్బులా ఈ మోహం ... ఆత్మ ప్రకాశాన్ని కప్పివేస్తుంది. ఆహా ఈ మోహం ఎలా ఎందుకు స్ఫురించిందో కదా! ఈ మోహానికి హేతువులైన ఈ భోగభాగ్యాలతో నాకేమిటీ సంబంధం? ఈ బంధు - బాంధవులు కూడ నా కెవ్వరు? శేషి దయ్యాన్ని చూసి భయవ్యాకులుడయ్యే బాలునిలా, నేను కూడ మమతారూప మిథ్యా సంబంధాన్ని కల్పించుకొని వీటియందాసక్తున్నయి వ్యాకులున్ని ఔతున్నాను కదా!''

చీకటి తెరలు నెమ్మది నెమ్మదిగా మసక బారుతున్నాయి, కోడికూతలు, కాకుల అరుపులు అప్పుడప్పుడు వినబడుతున్నాయి. ఉషోదయం కావటానికి ఆకాశం సిద్ధమౌతున్నది. చీకటి వీడి క్రమంగా వెలుగురేఖలు వ్యాపించబోతున్నాయి. నా చిత్తంలో ఇంకా తర్జన భర్జనలు ఆగిపోలేదు. ఇంకా చల్లారలేదు.

''భోగాలు-బంధువులు, వీటియందే మనిషి మోహావశుడౌతున్నాడు కదా! ఈ మోహం వల్ల వచ్చే దేముంది? కేవలం ఉద్వేగమే కదా! ఈ భోగభాగ్యాలు బంధు - బాంధవులు ఉంటేనేం, పోతేనేం? నాకు వీటితో పనిలేదు ఇవి కేవలం నీటిబుగ్గల్లా మిథ్యారూపాలే. పూర్వకాలంలో రాజులు, చక్రవర్తుల మహా వైభోగాలు-స్నేహితులు-బాంధవులు, నేడేమై పోయాయి? అవినేడు కేవలం స్మరణ మాత్రమై యున్నాయి. నేటి మన ఈ భోగాలు కూడ, నశించేటటువంటివే. నాశప్రాయాలైన వాటి యందు నాకెందుకు మమత! అంతెందుకు, పూర్వకల్పంలోని బ్రహ్మసృష్టి నేడేదీ? అంతటి సృష్టే నశించినప్పుడు, ఈ ధనాదులో లెక్కా! లక్షల ఇంద్రులు కాలగతిలో గతించిపోయారు. కోట్లకొలది బ్రహ్మలు నశించిపోయారు. అనేక సృష్టిపరంపరలు వచ్చాయి, పోయాయి. అసంఖ్యాక భూపాలురు, దుమ్ములా కొట్టుకుపోయారు. ఇంతటి తుచ్ఛమయిన ఈ జీవితమందు విశ్వాసముంచుతున్న నా మూర్ఖత్వం ఏమని చెప్పేది? సర్వవ్యాప్తమైన ఈ కాలాగ్నికి క్షణ క్షణమూ నష్టమైపోతున్న ఆయువును చూస్తు కూడ చూడనట్లే నటిస్తున్న నా బుద్ధి ఎంత మూఢమైనదీ? దినాలు ఎన్నెన్నో గడిచిపోతున్నాయి. అయినా ఏ ఒక్కరోజు కూడ నిత్యసత్యమైన పరమాత్మ వస్తు సాక్షాత్కారము కాలేదు. ఒకటికాదు రెండుకాదు ఎన్ని కష్టాల పాల్పడ్డాను. ఎన్నెన్నో మహాదుఃఖాలలో చిక్కాను. అయినా ఈ లోకభోగాల

నుండి విరక్తుణ్ణి కాలేకపోయాను అందమైన వస్తువుల్లో దృఢమైన మమతను చూపాను. కాని అవన్నీ నష్టమైపోతూ, నాకు దుఃఖాన్నే కల్పించాయి. నిజానికి ఈ సంసారంలో ఉత్తమ వస్తువు ఏదైనా ఉందా అంటే, అలాంటిదేదీ కన్పించదు. ఈ జగత్తులోని ఏ వస్తువుల్లో ఆసక్తుడై, విశ్వసిస్తాడో, మనిషి వాటి మూలకంగానే మరల మరల దుఃఖాలను కొని తెచ్చుకుంటాడు."

తెల్లని పక్షులగుంపు ఒకటి నాతలను స్పృశిస్తూ దూసుకుపోయింది. వాటి చల్లని స్పర్శకు నాకు దేహాస్మృతి కల్గింది. ఆహారాన్వేషణ ఆరంభమయిందన్నమాట. అంటే ఇంకా కొద్దిసేపట్లో చీకటి అంతమై వెలుగు ఆరంభమౌతుందన్నమాట. చల్లని గాలులు నా శరీరాన్ని తాకి, నూతనశక్తిని చిత్తానికి ప్రసాదించాయి.

"ఈ శరీరం నిత్యం మార్పునొందేదే కదా! దీనికెన్ని అవస్థలు. ఎన్ని విపత్తులూ! బాల్యావస్థలో అజ్ఞానం, యువావస్థలో కామం, అంతిమావస్థలో స్త్రీ పుత్రాది కుటుంబపోషణ నిమిత్తమైన చింత ఈ శరీరాభిమానిని దహిస్తాయికదా! జీవన కాలమంతా ఇలా బాధాతప్తుడయ్యే ఈ మనిషి తనను ద్ధరించుకొనే సాధన ఎప్పుడు చేస్తాడు మరి? ఉత్పత్తి-వినాశశీల, రసహీన, విషమ దుర్దశలచేత దూషితమైన, అసారమైన ఈ సంసారంలో దుర్బుద్ధి పురుషుడు సారవస్తువనే దాన్ని చూస్తాడా? కొందరు రాజసూయ - అశ్వమేధ యజ్ఞాలను ఎన్నెన్నో నిర్వహిస్తారు. వాటివల్ల వారికి లభించేదేమిటి? ఎక్కువ కెక్కువ మహాకల్ప పర్యంతము స్వర్గభోగమే కదా! అనంత కాల దృష్టిలో ఆ భోగకాలం అల్పక్షణాంశం మాత్రమే. వారికి స్వర్గాన్ని మించిన అతమైన అనంత నిత్య విజ్ఞానానందఘన బ్రహ్మప్రాప్తి మాత్రం లభించదు. ఈ ఆపత్తులు లేని స్వర్గంగాని, పాతాళంగాని, పృథ్విగాని ఎక్కడైనా ఉంటుందా? ఉండదు ఈ మానసిక వ్యథలైన ఆధులు తన చిత్తంలోనే ఉండే సర్పాలు. ఈ వ్యాధులు తన శరీరమందున్న క్షుద్ర జలాశయాలు. వీటినెలా నివారించేది?

"నేడు సత్యంగా గోచరిస్తున్న ఈ దృశ్యంపై సత్యం దాడిచేస్తున్నది. రమణీయ పదార్థాలను అరమ్యత కప్పివేస్తున్నది. సుఖాల తలలపై దుఃఖాలు నాట్యమాడుతున్నాయి. వీటిలో నేనాశ్రయించదగ్గ సత్యవస్తువేదైనా ఉందా? అజ్ఞానమోహితులైన క్షుద్రప్రాణులు పుట్టి చస్తాయి. అట్టి ప్రాణుల చేతనే ఈ పృథ్వి సందు లేకుండా నిండిపోయి యున్నది. సాధువులైన మహాపురుషులు దుర్లభులై యున్నారు. నీలి కమలం వలె మనోహరులు, భ్రమరం వలె చంచల నేత్రులైన, ఉత్కృష్ట ప్రేమచేత విభూషితులైన విలాసినీ వనితలు కూడ, క్షణభంగురులు గాన, ఉపహాసపాత్రులే అయివున్నారు, రమణీయాతి రమణీయవస్తువులు సుస్థిరపదార్థాలు ఈ లోకంలో ఉన్నా అవన్నీ అంతతోగత్వా చింతా, దుఃఖ కారణాలు మాత్రమే. కనుక వాటినీక్షించటంలో ప్రయోజనం లేదు. ఈ స్త్రీ ధన గృహాది విచిత్ర సంపత్తులు చిత్తానికి ఆదరణీయాలైతే అది కూడ బహుప్రయత్నంచేత తప్ప సాధ్యంకావు. పైగా వాటి రక్షణకై విపరీత దుఃఖాన్ని పొందవలసి వస్తుంది. నిజానికి ఇవన్నీ అవశ్యంగా నశించిపోయే తత్వం గలవే. మహా విపత్తి రూపాలే. ధన, జన, సంపత్తుల వియోగంచేత కలిగే ఆపత్తులు సాధుసాంగత్యానికి, తపస్సుకు, జ్ఞానానికి కారణాలయితే, అలా అవి కళ్యాణ ప్రదాలయితే, అవి కూడ వివేక వైరాగ్యాది

సంపత్తు లేదని భావిస్తాను. క్షణభంగురమైన, మిథ్యారూపమైన, కేవలం మనోపరిణామ స్వరూపమైన ఈ జగత్తులో 'ఇది నాది' అన్న అపూర్వ పదవాక్యరూప అక్షరమాల ఎక్కడ నుండి సంభవించిందో? దేశకాల వస్తువులచేత సీమితమై త్రివిధ తాపాలచేత సంతప్తమైన్న సుఖనామకమైన ఈ దృశ్యాల్లో ఎందుకను రక్తున్నౌతున్నానో! సుఖదుఃఖ పరివర్తన యుక్త విషయభోగరూపమైన ఈ సంసారంలో ఉండే కన్నా, రౌరవ నరకాగ్నిలో పడుకోవటం హాయిగా ఉంటుంది.''

చల్లగాలులు కాస్త వెచ్చగా మారాయి. పక్షుల కూతలు మిక్కుటమయ్యాయి. ఆకాశంలో తూర్పుదెసలో వెలుగుల దొంతరలు ప్రవహిస్తూ వస్తున్నాయి. చీకట్లు మటుమాయమైపోతున్నాయి. ఇంకొద్ది క్షణాల్లో నిర్మల ఆకాశం కాంతితో పూర్ణమవుతుంది. నా మనసులోని నిర్వేదము క్రమంగా తగ్గటంతో, నా చిత్తానికి కాస్త ప్రశాంతత లభించింది. ఏదో చెప్పలేని ఆనందానికి లోనవసాగాను.

''ఈ సమస్త దుఃఖాలకు సంసారమే కారణం. ఇందులో పడియున్న శరీరానికి సుఖమెలా ప్రాప్తిస్తుంది? వందలకొలది ఆశారూప పాశాలచేత ఓతప్రోతమై అధోగతి - ఊర్ధ్వగతులను, సంతాపాన్ని కల్గించే ఈ సంసారాన్ని ఎంతో భోగించాను. ఇక చాలు. నేనిప్పుడు ప్రబుద్ధున్నయ్యాను; ఉత్సాహపూరితున్నయ్యాను. నా పరమార్థసంపత్తును దొంగిలించే ఈ మనసుదొంగను కనుగొన్నాను. దీన్నిక దండిస్తాను. చంపేస్తాను. నన్ను చిరకాలంగా ఈ మనస్సు చంపుకుతిన్నది. నన్ను పతనానికి ఈడ్చింది. ఇక బ్రహ్మతత్త్వాన్ని చింతిస్తూ ఈ మనసును లయం చేస్తాను.''

అలా నిశ్చయించుకొని వికసిత హృదయంతో ఆకాశంలోకి దూరంగా చూశాను. అప్పటికే ఆకాశంలో సూర్యకిరణాలు తమ యాత్రను ఆరంభించాయి. నాకా సమయంలో మహాత్ములయిన సిద్ధపురుషులు జ్ఞాపకమొచ్చారు.

''ఆ సిద్ధపురుషులు నాకనేక రకాలలో బోధచేశారు. వారి బోధమూలకంగా నేనిప్పుడు పరమాత్మలో ప్రవేశింపబోతున్నాను. పరమాత్మనే ఏకాంతంలో చూస్తూ, తదితర కాంక్షలన్నింటిని శాంతపరచి సుఖపూర్వకంగా ఉంటాను. 'ఈ దేహం నేను, విస్తృతమైన ఈ ధన రాజ్యాదులు నావి'-అన్న అసత్యరూప భ్రమను యథార్థజ్ఞానం ద్వార నాశనం చేసి, అత్యంత బలశాలి అయిన మనోరూప శత్రువును ధ్యానాది అభ్యాసాలచేత నష్టపరచి నే నతిశయ శాంతి సౌఖ్యాన్ని పొందుతాను.''

ఉషోదయం అయింది. నా మనసు శాంతించింది. శాంతచిత్తంతో నేను క్రిందికి దిగసాగాను. అశాంతితో పైకి వచ్చిన నేను, శాంతంతో దిగి రావటానికి మెట్లవైపు నడిచాను.

* * *

''మహారాజ. రాచకొలువు మీ రాకకోసం ఎదురుచూస్తున్నది''అంటూ ప్రతీహారి తెలియజేశాడు. నేను అతనివైపు ఒకమారు చూసి, రాచకార్యం నా అభ్యుదయానికి విఘ్నకారియా, కాదా అని ఆలోచించసాగాను. పనిచేయటంలోను, చేయకపోవటంలోను నాకు ప్రయోజనము లేదు. సర్వత్రా సమస్థితిలో ఉన్నాను. అప్రాప్తం గూర్చి కోరను, ప్రాప్తమైన దాన్ని విడవను. కనుక ప్రాప్తమైన ఈ రాచకార్యాన్ని నిర్వహించవలసిందే.

ఇలా నిశ్చయించుకొని రాచకొలువుకు బయలుదేరాను. మధ్యలో సుందరవదనలు పుష్పాక్షతలు చల్లారు. వందిమాగధులు పొగిడారు. దారిలో ప్రజలు హర్షంతో నన్ను తిలకించారు. ఇది రోజూ జరిగే చర్య అయినా, ఈ రోజు నాకీచర్యలో నిమాత్రం ఆసక్తి - విరక్తులు గోచరించలేదు - ఈ సంసారం సుఖప్రదం కాదు శమమే శాంతిదాయకము. విషయచింతన సంసారదుఃఖాన్ని వృద్ధిచేస్తుంది. కనుక ఆ చింతను వదలాలి. ఉపశమాన్ని పొందాలి. బ్రహ్మలో స్థితుడు కావాలి. వివేక వైరాగ్యాలచేత ఆత్మానందాన్ని జాగృతం చేయాలి-అని అనుకుంటూ పోతున్నాను. చివరికి రథం గమ్యం చేరింది. నిలిచింది, నేను దిగి సభలోకి ప్రవేశించాను.

జయ జయ కారాలు మిన్నుముట్టాయి. సామంతులు తదితరులు మకుటాలు అర్పించి వందనం చేశారు. ఈ గౌరవాదులతో నా చిత్తం చలించిందా అని ఆలోచించి చూశాను. నా మనసు మోహాగ్రస్థం కాలేదు. హర్షం చేత ఉల్లాసం నొందటం లేదు. శాంతమై యున్నది అని నిశ్చయించుకొని సింహాసనాన్ని అధిష్ఠించాను. చేయవలసిన రాచకార్యాలను చకచక చక్కగా నిర్వహించాను. నాడు మొదలు నా చిత్తశాంతికి ఈ సంసారం అడ్డు రాలేదు. దాని దోవన అది కొనసాగుతున్నది. నా దోవన నేను కొనసాగుతున్నాను.

ఒకరోజు నేను శయనించబోతుండగా సిద్ధపురుషులు మరల నా ఎదుట సాక్షాత్కరించారు. వారికి నేను నమస్కరించి, ఉచిత మర్యాదలు చేసి ఆసనాలర్పించాను. వారు నన్ను ప్రేమవీక్షణాలతో తిలకిస్తూ ఇలా అన్నారు.

"రాజా, నీకిప్పుడాత్మానందం లభించింది. సమచిత్తత ఏర్పడింది. సగుణ నిర్గుణ యథార్థ రూప జ్ఞానం నీకు లభించింది. నీ విప్పుడు సమస్త ప్రాణులను సమానం చేస్తూ సర్వత్రా పరమాత్మను దర్శిస్తున్నావు. లోకులకందరికి ప్రియమై యున్నావు. హర్షశోకాదులకు అతీతుడవై, సాధనలసి పరబ్రహ్మ పరమాత్మ రూప వస్తువును పరిపూర్ణంగా పొందియున్నావు. నీవు ముక్తుడవయ్యావు. జీవన్ముక్తుడవయ్యావు. నీవు మాకు వందనం చేయుటం కాదు, మేమే నీకు వందనం చేయవచ్చాము స్వీకరించుము" అంటూ ఆ సిద్ధపురుషులు వందనం చేయబోయారు. నేను వెంటనే లేచి "మహాత్ములారా, మీరు నిశ్చయించి తెల్పిన ఈ వాక్యాలే నాకు చాలు. మీరు నా గురువులు. గురువులకు నేనే నమస్కరించాలి" అంటూ వారికి నమస్కరించాను. వారు తృప్తులై అదృశ్యులై పోయారు. నేను ప్రశాంతంగా ఒక లిప్త అలా ఆకాశంలోకి చూసి పడకవద్దకు వెళ్లాను.

## కథా వివేచనం

**జనకమహారాజు ఆత్మదర్శనానికి సంబంధించిన ఈ కథ శ్రీ యోగ వాసిష్ఠం-ఉపశమ ప్రకరణం- 6-12 సర్గలలో కనబడుతుంది.**

కర్మమా, జ్ఞానమా ఏది అనుసరణీయం? అన్న ప్రశ్న అప్పుడప్పుడే ఆధ్యాత్మికతారంగంలో కాలిడినవారిని బాధిస్తుంది. నిజానికి జ్ఞానం తప్ప మరేది లేదు. అడుగు తీసి అడుగువేయాలన్నా జ్ఞానం కావాలి. జ్ఞానం లేనిది కర్మ కొనసాగదు. కర్మకు ప్రత్యేక ప్రతిపత్తి లేదు. ఒక కాగితంపై ఏదైనా వ్రాయాలన్నా, అక్షరజ్ఞానం, భావనాజ్ఞానం కావాలి. ఒక దైవవిగ్రహాన్ని చెక్కాలన్నా శిల్పజ్ఞానం కావాలి. కేవలం ఒక మెకానిక్కు కారును రూపొందించి తయారు చేయలేడు. దానికి ఇంజనీయర్ కావల్సిందే.

అయితే ఇంజనీర్ మెకానిక్ పనిచేయకపోవచ్చు. అది వేరే విషయం. మెకానిక్ మాత్రం, ఆ మోటారుకారుకు సంబంధించిన జ్ఞానం అంతో ఇంతో అర్జించవలసిందే. ఇక్కడ జ్ఞానం, కర్మలేకపోయినా నిలచియున్నది. కాని కర్మకు మాత్రం జ్ఞానం లేనిదే ఉనికి లేకుండా పోయింది. చివరికి కర్మయే జ్ఞానంలో లీనమయింది. జ్ఞానం కర్మలో లీనం కాదు. మెకానిక్కే ఇంజనీర్ జ్ఞానాన్ని ఆశ్రయించాడు. ఇంజనీర్ తలచుకొంటే మెకానిక్ కార్యం చేయటానికేమంత కష్టం కాదు. కాని మెకానిక్ ఇంజనీర్ కావాలంటే అది చాలా కష్టసాధ్యం. కనుక ముందు జ్ఞానం ప్రాప్తించుకుంటే కర్మ మార్గం బాధించదు. ఈ సంగతే ఇక్కడ విదితమౌతున్నది. జనకమహారాజు సత్యజ్ఞానం అనుభవించాడు. ఆ మీద వ్యావహారిక కర్మకలాపాలు నిర్లేపంగా, నిర్మోహంగా, నిగర్వంగా నెరవేర్చగల్గాడు. కనుక కర్మమైన, భక్తిఅయిన, యోగమైనా జ్ఞానం ద్వార సాధించబడి, జ్ఞానంలోనే పరిసమాప్తి నొందాలి. దీన్ని వదిలితే, వాటికి ప్రత్యేక గమ్యం ఉండదు. ఈ విషయం జనకుని ఈ కథలో స్పష్టంగా మనకు తెలుస్తుంది.

—పై సంచికలో చెట్టు మీద ఒక మహాముని

వాచ్యర్థా నియతాస్సర్వే వాఙ్మూలా వాగ్వినిస్సృతాః
తాం తు యస్తేనయేద్వాచం స సర్వస్తేయకృన్నరః

—మను 4-256.

మనుష్యమాత్రుని సర్వవ్యవహారములు వాక్కుచే నడచుచున్నవి. ఒకని యూహా మతియొకనికి ఎఱుకపఱచుటకు శబ్దమువంటి ముఖ్యసాధనము ఇంకొకటి కానేరదు. సర్వవ్యవహారములకు ఆశ్రయభూతమగు ఈ వాగ్రూపమూలమును ఎవడు కొంచము అతిక్రమించునో (వాక్కును ప్రతారణ చేయువాడగునో) వాడు సమస్త వినములను ఒక్కపర్యాయమే ముచ్చిలినవాడగును.

---

## శ్రీరామకృష్ణ మఠం, మద్రాసు-4. ఆగస్టునెల విశేషకార్యక్రమం

| | |
|---|---|
| 4 వ తేది బుధవారం | స్వామి నిరంజనానంద జయంతి |
| 12 వ తేది గురువారము | శ్రీ కృష్ణజయంతి |
| 14 వ తేది శనివారము | శ్రీ కృష్ణజయంతి సమావేశము |
| 18 వ తేది బుధవారం | స్వామి అద్వైతానంద జయంతి |
| 22 వ తేది ఆదివారము | వినాయక చతుర్థి |
| 15 వ తేది ఆదివారం | ఏకాదశి దినములు |
| 30 వ తేది సోమవారం | ఏకాదశి దినములు |

## మావద్ద లభించు పుస్తకములు

అట్టవెనుక ఉన్న పట్టికలో చోటు చేసుకొనని పుస్తకములు

| | | | |
|---|---|---|---|
| ఈశ | 2.00 | ప్రశ్న | 2.50 |
| కేన | 2.00 | బాలల రామకృష్ణ | 4.00 |
| మాండూక్య | 2.00 | దేశాన్ని పునర్నిర్మించండి | 1.00 |
| ముండక | 2.50 | ఆత్మనివేదనం | 2.50 |

# కాఫ్కాకు చిల్లర లెక్కించడం రాదా?

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

విశ్వసాహిత్యంలో నవలాకారుడుగ ఘనమైన ఒక విశిష్ట స్థానాన్ని సముపార్జించుకొన్న ఫ్రాంట్స్ కాఫ్కా (Franz Kafka)కు చిల్లర లెక్క వేసుకోవడం రాదా! ర్యం! ఆయన జీవితంలో అంతకంటె కరమైన మరికొన్ని విషయాలున్నాయి. అతడు పిల్లల్ని కనలేక కథల్ని కన్నాడు. అతడు వ్రాసిన అన్ని కథలలోను, నవలలోను నాయకులంతా బ్రహ్మచారులు. స్త్రీపాత్రలలో ఎక్కువ చండశాసనులు, ధార్ష్టికం చెలాయించేవారు. బహుశ అతడు బ్రహ్మచారి కావడం దీనికి కారణమేమో. అసలు అతడు బ్రహ్మచారిగా ఉండిపోవడానికి కారణమేమిటి? క్షయరోగం ఎవరికి ప్రియమైనది కాదు. కాని అతడికి మాత్రం మధురాతిమధురమది! అందుకని అతడు క్షయను కావాలని పెంచుకొన్నాడు!

ఈ లక్షణాలు చాలు అతడెంతో విలక్షణమైనవాడని చెప్పడానికి. సామాన్యంగా, నేలబారు రచయితలను, కళాకారులను మినహాయిస్తే, ఏ సృజనాత్మక రచయిత అయినా, కళాకారుడైనా విలక్షణమైనవాడే. అసలు వారు మామూలు ప్రజానీకం కంటె ఎంతో విలక్షణంగా ఉంటారు. వారి వైలక్షణ్యమే వారి ప్రత్యేకత, విశేషము. ఒకరకంగా చెప్పాలంటే వారు ఉన్మాదానికి చాల చేరువలో ఉంటారు. అయితే వీరి ఉన్మాదం సుశిక్షితమైంది. అదుపులో ఉండేది. వీరి ఈ ప్రత్యేకతకు, వైలక్షణ్యతకు కారణము వీరు అచేతనాని (unconscious)కి దగ్గరలో ఉండడమే. ఫ్రాయిడ్ యుగారంభం తరవాత, సృజనాత్మక రచయితను మామూలు చవుకబారు రచయితనుంచి వేరు చేసి చూడడానికి ఉపయోగించే కొలబద్ద, "ఎవరు అచేతనానికి ఎంత చేరువలో ఉన్నారని." అంటే అచేతనంలోకి తేలికగా తొంగిచూడగలిగినవాడు మహారచయిత అవుతాడు. సందేహం లేదు. అయితే ఆ అచేతన సుసంపన్నమైనదై ఉండాలి.

పైన చెప్పిన కాఫ్కా 'విలక్షణత' అతని ప్రవర్తనలో కనిపించడమే కాదు, అతని రచనలలోను తొణికిసలాడుతుంది. కాఫ్కా రచనలు చదివినవారికి కొట్టవచ్చినట్లు కనిపించే విషయం ఒకటి ఉంది: "అతని రచనలు స్వప్నాలులా ఉంటాయి". ఈ విషయం నేను చెప్పడం కాదు, ప్రతిసాహితీ విమర్శకుడు ర్కొన్నాడు. రచనలు స్వప్నాలులా ఉంటాయంటే అర్థం ఏమిటి? స్వప్నాలు ఎక్కడనుంచి వస్తున్నాయో రచనలూ అక్కడనుంచే ఉప్పతిల్లుతున్నాయన్నమాట. 'స్వప్నం' అచేతనం నుంచి వస్తున్నదని మనోవిజ్ఞాన శాస్త్రం చెబుతుంది. మరి స్వప్నసదృశమైన రచన గూడ అచేతనం నుంచే వస్తున్నది. అయితే స్వప్నానికి రచనకు ముఖ్యమైన తేడా గూడ ఒకటి ఉంది. స్వప్నసృష్టి నిద్రలో జరిగితే, రచనాసృష్టి మేల్కొని ఉన్నప్పుడు జరుగుతుంది. అంటే మామూలు మనుషులు నిద్రలో కలలు గనేటప్పుడు మాత్రమే అచేతనాన్ని చేరగలిగితే, రచయిత జాగ్రద్దశలోనే అచేతనాన్ని సందర్శించగలుగుతున్నాడు.

ఐరోపాసాహిత్యాన్ని మొత్తాన్ని తిరగేస్తే కాఫ్కాకు వలె అచేతనపు లోతులు చూచిన మరొక రచయిత కానరాడు. అచేతనపు లోతులను చూడడమంటే ఏమిటి? 'ఆత్మానం విద్ధి', 'నిన్ను నీవు తెలుసుకో', 'నీలోతులను నీవు కొలుచుకో', 'know thyself' కంటె

భిన్నం కాదు. తనని తాను అర్థం చేసుకోని, అర్థం చేసుకొన్నదాన్ని అభివ్యక్తీకరించడము. కాఫ్కా ఆత్మాన్వేషణం. ఆత్మాభివ్యక్తీకరణకోసం అతడు నిరంతరం సలిపిన కృషే అతని రచనలు. అతడు తన అస్తిత్వాంతరాళాల పాతాళాన్ని కొలిచి ఆత్మశోధనం గావించుకొన్నాడు. ఈ ఆత్మప్రక్షాళనమే అతని డైరీలు, కథలు, గాథలు, నవలలు, కలలు.

అతని రచనలలో అతిముఖ్యమైన నవల 'ది ట్రయల్' (The Trial). ఇందులో ఒకడు అరెస్టు కావించబడతాడు. ఎందుకు అరెస్టు చేయబడిందీ అతనికి తెలియదు. కారణం నిర్ధారితం కాని నేరంపై అరెస్టు గావించబడిన అతడు ఆందోళిత మనస్కుడవుతాడు. అతని ఆందోళితానుభవాలు ఈనవలలో వర్ణితమవుతాయి. ఇందులో నాయకుని ప్రతి అడుగును ఏదో శక్తి నిర్ణయిస్తూనే అడ్డుకొంటుంది. అలా నిర్ణయిస్తూనే అడ్డుకొనే అంతు చిక్కని సర్వాంతర్గతమైన ఒక అజ్ఞాతశక్తితో నాయకుడు పోరాటం జరుపుతాడు. ఈ పెనగులాటను కాఫ్కా అతి భయానకంగా * చిత్రిస్తాడు. భయం ఎప్పుడు వేస్తుంది? అనిశ్చితత్వం (uncertainty) ఉన్నప్పుడు. మరి కాఫ్కా ప్రతి సన్నివేశాన్నీ విస్పష్టంగా, సునిశ్చితంగానే నిర్వచిస్తాడు. అయినా ఆ సరళ సునిశ్చిత సంఘటనా శ్రేణిలోని అహేతుకత (irrationality) నుంచి అనిశ్చయత (uncertainty) పుట్టుకొస్తూనే ఉంటుంది. మనకు గూడ ఇలాంటి అనుభవాలు జీవితంలో అనేక మారులు ఎదురవుతూ ఉంటాయి. మనం ఒక పనిచేయ తలపెట్టి, దానికి సంబంధించిన నిర్ణయాలు చేస్తాము. ఆ నిర్ణయాలను అమలుపెట్టడంలో అంతకంటె ఏదో బలవత్తరమైన శక్తి మన లోపలినుంచే (బయటినుంచి కాదు) నిష్పన్నమై నిరోధిస్తూ ఉంటుంది. మన అంతరంగంలోనే మనకు తెలియని ఇలాంటి మానసిక సంఘర్షణలు మనలను అడుగు ముందుకు వేయనీయవు. మనం చేసిన ఆలోచనలన్నీ చాల హేతుబద్ధంగానే ఉంటాయి. అయినా ఎందుకో మనం వాటిని అమలు చేయలేము. మనకై మనం పెట్టుకొన్న నియమాలను ఉల్లంఘించడంలో ఎంత ఆనందముంది. ఇదే మానవ సంసారం (Human existence) లోని విరోధాభాస (Paradox) నాటకము.

అలాగే 'ది కాసిల్' (The castle) అనే నవలలో కొండమీద ఉన్న రాజ ప్రసాదం కొండ దిగువన ఉన్న గ్రామాన్ని ఏలుతున్నట్లు కనిపిస్తుంది. ఈ గ్రామంలో ప్రవేశించిన ఒక యువకుని ద్వారా, స్వేచ్ఛ, సాధ్యతలకోసం మానవుడు పడే తపనను, ఒంటరితనంలోని దయనీయతను అభివ్యక్తం చేస్తాడు.

మెటమార్ఫసిస్ (Metamarphosis) అనే కథలో నాయకుడు ఒకనాటి ఉదయం నిద్రనుంచి మేల్కొని చూసుకొనేటప్పటికి తానొక పెద్ద 'నల్లి'గా మారి ఉంటాడు. ఈ నల్లి కుటుంబ సభ్యులతో ఎలా ప్రవర్తించేది, ఆ కుటుంబ సభ్యులు ఈ నల్లిని ఎలా చూసేది అతిభయానకంగా వర్ణిస్తాడు.

అతని ఏ రచన చదివినా అది ఎంతో లోతులనుంచి వ్రాసినట్లు అనిపిస్తుంది. అందుకే అతని గ్రంథాలు చదివినవాడు, మానవ సంసారంలోని విరోధాన్ని, విరోధాభాసని గ్రహించకపోతే అతని రచనలు చదివినట్లుకాదు. అయితే ఈ విరోధం, విరోధాభాసం కాల దేశాంతర్గతాలని భావించరాదు.

---

...ంలో సరిగ్గా నిద్ర పట్టేదికాదని కొంతమంది మిత్రులు నాతో చెప్పారు.

అతని రచనలు ఎలాగైతే విలక్షణాలో అతని ప్రవర్తనగూడ అంతేననిపిస్తుంది [illegible] కాదు. అతని రచనలు పాఠకులను [illegible] లకు తీసుకువెళ్ళి మార్చివేస్తాయో [illegible] మూర్తిమత్వం అతని మిత్రులను, [illegible] లను, ఎదుటివారిని అలాగే మార్చివేస్తుంది. ఒకసారి ఒక వ్యక్తి వేదికనెక్కి ఒక హాలులో చాలమంది శ్రోతల ఎదుట ఉపన్యాసం చేస్తున్నాడట. ఆ [illegible]్యాసం మధ్యలో కాఫ్కా ఆ హాలులో ప్రవేశించాడు. అప్పుడు ఆ ఉపన్యాసకుడు, ఒకసారి కాలరు సరిచేసుకొని తిన్నగా నిలబడి, చెయ్యి దగ్గరబెట్టుకొని మాట్లాడం మొదలుపెట్టాడట. ఆ సమయంలో "అడుగో కాఫ్కా వచ్చాడు, జాగ్రతగా మాట్లాడు" అని ఏదో అదృశ్యశక్తి అతని చెవిలో ఊదినట్లైనదట. ఉపన్యాసకుడే కాదు, శ్రోతలుగూడ మారిపోయేవారట. శ్రోతలే కాదు హాలు కొలతలే (ప్రాదేశిక ప్రమాణాలే) మారిపోయేవని ఉర్జిడిల్ అన్నాడు. "అతని మూర్తిమత్వంలో ఏదో ఇంద్రజాలం ఉంది." అని అన్నాడతడు.

మనిషిలో ఏ విశేషం ఉన్నా, ప్రత్యేకత ఉన్నా, వైచిత్రి ఉన్నా, వైలక్షణ్యం ఉన్నా, దానికి మూలకారణాన్ని మనం అతని మూర్తిమత్వంలో చూడవలసిందే. మరి ఇటువంటి విలక్షణాలున్న కాఫ్కా మూర్తిమత్వం అలా తయారు కావడానికి దోహదం చేసిన ప్రభావకాలు (Determinants) ఏవి ? ఈ ప్రశ్నకు చెప్పే సమాధానాన్ని అర్థం చేసుకోవాలంటే క్లుప్తంగా ఫ్రాయిడ్ లెబిడో (Libido) సిద్ధాంతాన్ని గురించి తెలుసుకోవాలి.

[illegible]కే సమస్యలో [illegible] సిద్ధంగా [illegible] ? [illegible]స్సును [illegible] పెరికి [illegible] [illegible]స్తాడు [illegible] [illegible]దు ? దీని [illegible] మూర్తిమత్వాల (Personalities) [illegible]న్నాలి. మరి మూర్తిమత్వాలు [illegible] ఎందుకు రూపొందుతాయి ? దీనికి [illegible] వారు పెరిగిన పరిసరాలు, వారికి లభించిన [illegible]త, ముఖ్యంగా శైశవంలో వారిపై పడిన ప్రభావము. శైశవంలో చిన్నపిల్లలపై ప్రసరించిన ప్రభావానికి చాల విలువనిస్తాడు ఫ్రాయిడ్. అతడు ప్రతిపాదించిన దే లెబిడో సిద్ధాంతము.

'ప్రతి శిశువు అసలు కామవాంఛ[2] తోనే జనిస్తాడు,' అంటుంది లెబిడో సిద్ధాంతము. శిశువు కామవాంఛ దేనిని కోరుతుంది ? అంటే అతని కామవాంఛకు వస్తువులు (Objects) ఏవి ? ఒకటి అతడి శరీరం, రెండు అతడి తల్లి. ఈ రెండింటిపై అతడి కామవాంఛ కేంద్రీకృతమవుతుంది. ఆ శిశువు తరువాతి పెరుగుదల అంతా గూడ, మొదట్లో అతడి శరీరం తల్లి- ఈ రెండూ అతనికి ఎటువంటి అనుభవాలను అందిస్తున్నాయి ! అనే ప్రాతిపదిక మీద, ఆధారపడి ఉంటుంది. రోగం, ఆకలిబాధలకు శరీరం మూలము. ఒంటరితనం వల్ల జనించే భయానికి (తల్లి ఏదైన పని మీద కొంచెం అలా అవతలికి వెళ్ళినప్పుడు), శిశువుకు తల్లి మూలము. ఈ విధంగా శిశువు సుఖసంతోషాలకు, బాధా దుఃఖాలకు మూలం అతని శరీరం, తల్లి అవుతున్నారు. ఇది 'రాగద్వేషా'లకు

2. ఇక్కడ కామవాంఛను వయోజనుడు అర్థం చేసుకొన్నట్లు, సంతానం కోసం యువతీయువకులు నిర్వహించే సృష్టికార్యం మాత్రమే కాదు. చలికాలంలో ఉన్నికోట్లు వేసుకొంటే కలిగే వెచ్చదనం నుంచి నోట్లో వ్రేలువేసుకొని చూపిస్తే వచ్చే సుఖం వరకు ఈ కామంలో చేరి ఉంటాయి. యువతీ యువకకామం ఇందులో ఒకభాగం మాత్రమే;

ప్రాతిపదిక. అతని సుఖసంతోషాలకు కారణమైన దానిని (శరీరంగాని, తల్లిగాని) ప్రేమిస్తాడు. దానిపై 'రాగం' జనిస్తుంది. బాధాదుఃఖాలకు కారణమైన దానిని (శరీరంగాని, తల్లిగాని) ద్వేషిస్తాడు. దానిపై ద్వేషం జనిస్తుంది. ఇటువంటి 'రాగ ద్వేష' ప్రాతిపదిక ప్రతి శిశువుకు సామాన్యమే. అయితే శైశవారంభంలో అనేక ఇతర కారణాలవల్ల ఈ 'రాగద్వేష' మనే తులాదండం ఏవైపుకు మొగ్గింది? అనే దానిమీద ఆధారపడి శిశువు మూర్తిమత్వం రూపుదిద్దుకొంటుంది. (పెరిగి పెద్దైన తరవాత ఈ ప్రపంచాన్ని గురించి ఏర్పరచుకొనే ఆశావహ, నిరాశావహ దృక్పథాలకు ప్రాతిపదిక ఇక్కడే ఏర్పడుతుంది.) బాధల వైపుకు మొగ్గితే శరీరమన్నా, తల్లిఅన్నా పరాఙ్ముఖత ఏర్పడుతుంది. ఈ విముఖ సంవేదనలు అనేక పార్శ్వ ప్రభావాల (Sideeffects)కు దారితీస్తాయి. ఇవి మొత్తం మూర్తిమత్వానికే రంగులు పులుముతాయి. ఇక మూర్తిమత్వం ఈ పులుమబడిన రంగులలోనుంచి ప్రపంచాన్ని దర్శిస్తుంది. అందుకని మనకు సత్యం ఎప్పటికి గోచరం కాదు. అందుకనే మన వేదాంతులు ఈ రంగుల పొరలను చేదించుకొంటూ పోతే గాని (మోహావికారాలను తొలగిస్తేగాని) అసలు ఆత్మ బయటపడదంటారు.

ఇప్పుడు ఈ సిద్ధాంతాన్ని దృష్టిలో ఉంచుకొని అతని జీవితాన్ని, రచనలను, స్వప్నాలను పరిశీలించి, అతని మూర్తిమత్వాన్ని మలిచిన ఆ శైశవ ప్రభావాలేవో కనుగొనాలి. సాధారణంగా పెద్దవాళ్ళ జీవితచరిత్రలు, రచనలే లభ్యమవుతాయి. కాని కాఫ్కా విషయంలో మనకు అతని స్వప్నాలు అచ్చు అయి లభిస్తున్నాయి. కాఫ్కా తన రచనలను, స్వప్నాలను అన్నింటిని తగులబెట్టవలసిందని మాక్స్ బ్రాడ్‌కు వీలునామాలాంటి ఉత్తరం వ్రాసినా, కొన్ని కారణాలను పురస్కరించుకొని అతడా పని చేయలేదు. అది తరువాతి తరాలవారి అదృష్టము.

అతని స్వప్నాలను, రచనలను, ఉత్తరాలను, జీవితచరిత్రను పరిశీలించిన మీదట, అతనిపై శైశవంలో పనిచేసినవి రెండే రెండు మూలకాలని తెలుస్తుంది. అవి (1) కాఫ్కాకు తన శరీరంపై ఉన్న విహ్యాత, పరాఙ్ముఖత (2) తల్లి తనను త్యజించిందన్న భావన. ఈ రెండు భావాలు అతని మూర్తిమత్వశీలాన్ని (character of personality) మలిచాయి.

శైశవంలో కాఫ్కాకు తనశరీరంపై విముఖత, విహ్యాత ఎందుకు ఏర్పడినట్లు? దీనికి ముఖ్య కారణం తండ్రి కొడుకుల మధ్య ఉన్న సంబంధము. వస్తుతః కాఫ్కా శరీరం చాల పెళుసైనది, బలహీనమైనది. దీనికి తోడు అతని తండ్రిదేమో మల్లుని శరీరము. అందుకని ఇద్దరి శరీరాలమధ్య అంతరం ఎక్కువైంది. తండ్రి భీమశరీరాన్ని ఎప్పుడు చూచినా, కాఫ్కాకు విస్మయమే కలిగేది. తండ్రి శరీరం ముందు తన శరీరం ఏపాటి? అనే ప్రశ్న అతని మదిలో పదేపదే వేధిస్తేది. దీనితో అతడు క్రుంగిపోయేవాడు. న్యూనతాభావం (inferiority complex) అతనికి నిద్రపట్టనిచ్చేది కాదు.

ఆ మాటకొస్తే ప్రతిపిల్లవానికి ఈ సమస్య ఎదురయ్యేదే. ఏ పిల్లవాని శరీరమైనా తండ్రి శరీరం ముందు కొంచెపాటిదే గదా! పిల్లవాడు తండ్రిముందు బలహీనుడే గదా! అలాగైతే మరి ప్రతిపిల్లవాడు న్యూనతాభావంతో కుంగిపోవలసిందే గదా! మరి అది కాఫ్కా ఒక్కడికే ప్రత్యేకం కాదు గదా. అవును, నిజమే. ఈ న్యూనతాభావానికి విరుగుడు ఉంది. ఎలాగంటే ప్రతి పిల్లవాడు తండ్రి

అంతటివాడు కావాలని కోరుకొంటాడు ఎందుకు? తల్లి శ్రద్ధాసక్తులు, ప్రేమ తండ్రిని కేంద్రంగా చేసుకొంటున్నాయి. తల్లిప్రేమలో తండ్రి తనకు ప్రత్యర్థి అవుతున్నాడు. అదీగాక తల్లి తన మాట కాక తండ్రిమాట వింటున్నది. మరి తల్లి పూర్తిగ తనకే కావాలంటే ఎలా?[3] తండ్రిని అడ్డైనా తొలగించాలి (చంపివెయ్యాలి) లేదా తండ్రి లక్షణాలు తాను పుణికిపుచ్చుకోవాలి. అప్పుడు గాని తల్లి పూర్తిగా తనకే దక్కదు; తననే ప్రేమించదు. మొదటిది (తండ్రిని చంపడం) అసాధ్యం కనుక, రెండవ మార్గం అనుసరించాలి. అంటే తను తండ్రి అంతటివాడు కావాలి. మరి తాను తండ్రి అంతటివాడు కావడం ఎలా? తండ్రితో తాదాత్మ్యం (identification) చెందడమే. తాను చిన్నపిల్లవాడు గనుక, తండ్రి చేసే పెద్దపెద్ద పనులు తాను చేయలేడు గనుక, మానసికంగా తనను తండ్రి స్థానంలో ఊహించుకొని, తండ్రిని సమానాగా గ్రహించి, తండ్రితో తాదాత్మ్యం చెంద ప్రయత్నిస్తాడు. ఈ ప్రక్రియలో తండ్రి తోడ్పాటు ఉంటే, బిడ్డ తండ్రితో తేలికగా తాదాత్మ్యం చెందుతాడు. ఒకసారి తాదాత్మ్యం చెందినతరువాత "తాను తండ్రి అంత" అని మానసికంగా భావించి, న్యూనతా భావం నుంచి బయటపడతాడు. న్యూనతా భావం నుంచి బయటపడడానికి "తాదాత్మ్య ప్రక్రియ" తోడ్పడుతుంది.

తాదాత్మ్య ప్రక్రియలో కాఫ్కా సఫలుడు కాలేదా? ఇద్దరి శరీరాలమధ్య అంతరం మామూలుకంటె ఎక్కువగావడం, తాదాత్మ్య ప్రక్రియలో అతనికి తండ్రి ఏ మాత్రం దోహదం చేయకపోవడంతో అతడు సఫలుడు కాలేదు. తండ్రి అతనిని ఎప్పుడూ దూరంగానే అట్టిపెట్టాడు. దగరకు రానిచ్చేవాడు కాదు. అయినా తండ్రితో తాదాత్మ్యం కోసం కాఫ్కా ఎంతగానో ఆక్రోశించినట్లు కనపడుతుంది. తండ్రిని కనీసం తన రచనల ద్వారానైనా చేరాలని ప్రయత్నించాడు. "నేను వ్రాసేదంతా నిన్నుగురించే నాన్నా" అని చెప్పుకొన్నాడొకచోట. తను వ్రాసిన గ్రంథాన్ని ఒక దానిని తండ్రికి అంకితమిచ్చి, దానిని చూడమని తండ్రికివ్వబోతే "తర్వాత చూస్తా, ఆ బల్లమీద ఉంచు." అన్నాడు తండ్రి. ఈ విధంగా తండ్రి అతనిని ఎప్పుడూ దూరంగానే ఉంచాడు. "తండ్రితో తాదాత్మ్యం చెందలేని కాఫ్కా తండ్రి కాలేకపోయ్యాడు." అసలు పెళ్ళే చేసుకోలేదు. "పిల్లల్ని కనలేక కథల్ని, కలల్ని కన్నాడు."[4]

తండ్రి తనను దరిచేరనీయక పోవడంతో శరీరం మీద ఏర్పడిన అల్పభావన అలాగే ఉండిపోయింది. దానిమీద ఏహ్యాత విరక్తికి దారితీసింది. దానిని కప్పిపెట్టుకోవడానికి ఎప్పుడూ అతడు మంచి దుస్తులను ధరించేవాడు. తనకు విరక్తి జనింపజేసిన శరీరం నాశనం కావలసిందే. ఆ పనే చేశానని కాఫ్కా చెప్పుకొన్నాడు. 1917 లో క్షయ అంకురించినా, డబ్బు, వైద్యసౌకర్యాలూ ఉన్నా అతడు 1924 లో మరణించేవరకు (1883 లో పుట్టాడు) సరైన వైద్యం చేయించుకోలేదు. కాఫ్కా

3. ఇడిపస్ భావగ్రంథి (Oedipus Complex) సిద్ధాంతం ప్రకారం ప్రతి మగపిల్లవాడు తల్లిని కామించి తండ్రిని ద్వేషిస్తాడు. ఇలెక్ట్రా భావగ్రంథి (Electra Complex) ప్రకారం ప్రతి ఆడపిల్ల తండ్రిని కామించి తల్లిని ద్వేషిస్తుంది. స్థలాభావం వల్ల ఈ రెండింటి వివరణ ఇక్కడ సాధ్యం కాదు.

4. ఒక యువతి, తాను కాఫ్కాకు బిడ్డను కన్నానని మాక్స్‌బ్రాడ్‌కు ఉత్తరం వ్రాసింది.

క్షయను "మధుర"మైనదానిగా "ప్రియ"మైనదానిగా "రక్షక దేవత"గా అభివర్ణించాడు. తనకు క్షయకు ఉన్న సంబంధాన్ని కొంగుపట్టుకు తిరిగే పిల్లవానికి తల్లికి ఉన్న సంబంధంతో పోల్చాడు.[5] క్షయ అతనిని ఫెలిస్ బార్‌ను వివాహం చేసుకొనే అవకాశం నుంచి, అసలు పెళ్ళినుంచే తప్పించింది.

శైశవంలో అతని మీద బాగా నాటుకుపోయిన రెండవ భావం "తల్లి తనను త్యజించడం." "పెళ్లైన మిథునం" (The married-couple) అనే కథలో ఒక పాత్ర అంటుంది: "నీవేమైన చెప్పు, తల్లి అద్భుతాలు చేయగలదు. మనం పాడు చేసిన వాటిని పునః సృష్టి చేయగలదు. నేను ఆమెను చిన్నతనంలోనే పోగొట్టుకొన్నాను." కాఫ్కా చిన్నతనంలో, తల్లి తండ్రితోపాటు పురుష ప్రపంచమైన వ్యాపార రంగంలో (తండ్రివృత్తి వ్యాపారం) లీనమైపోయింది. తల్లికి తండ్రికి మధ్య తేడా అతనికి కనిపించలేదు. తల్లి మరొక తండ్రిగా (పురుషుడుగా) గోచరించింది. ఆ విధంగా తల్లి అతనికి మానసికంగా దూరమైపోయింది. అందుకే అతడు ప్రేమించిన స్త్రీలు, రచనలలో సృష్టించిన స్త్రీలు – పురుష లక్షణమైన ధాష్టీకాన్ని (అంటే మగరాయుళ్ళుగ) పుణికి పుచ్చుకొన్నారు. అతడు ప్రేమించిన ఫెలిస్ బార్, మిలెనా జెసెన్‌స్కాలు పుంభావ స్త్రీలు. అతని నవలలోని హోటలు మేనేజరు క్లారా, "అమెరికా"లోని బ్రనెల్డా, "ట్రయల్" లోని బ్యూరస్టనర్, లెనిలు, "కాసిల్" లోని సత్రం నడిపే ఆమె, గిసా, ఫ్రెడాలు – అందరు అతని తల్లినుంచి ఊడిపడినవారే. 'కాసిల్' నవలలో తల్లి తండ్రి 'K' కు ఎదురై నిలుస్తారు. అసలు అతని కలలలో కనిపించిన స్త్రీలంతా అటువంటివారే.

ఈ విధంగా శరీరంపై ఏహ్యత, తల్లి దూరం కావడం. తండ్రి నిరాదరణలు అతనిని నిష్క్రియునిగా, చొరవ లేనివానిగా నిర్ణయాలు తీసుకొని నిక్కచ్చిగా వ్యవహరించ లేనివానిగా, ఎప్పుడూ తొట్రుపాటు పడేవానిగా, బ్రహ్మచారిగా, పిరికివానిగ – అన్నీ అవాంఛనీయతలే-తయారుచేశాయి. అయితే ఈ "లేమి" అతని రచనలలో "కలిమి"గా మారింది.

మిలెనా ఒక ఉత్తరంలో బ్రాడ్‌కు ఇలా వ్రాసింది. "మీరు అతనితో పోస్టాఫీసుకు ఎప్పుడైనా వెళ్లారా? ఎలాగో అటూ ఇటూ తచ్చట్లాడి చివరకు సరైన కౌంటర్ దగ్గరకు చేరుకొంటాడు. టెలిగ్రామ్ ఇస్తాడు. కౌంటర్‌లో ఉన్న యువతికి డబ్బు ఇస్తాడు. ఆమె బిల్లు పోను మిగతా చిల్లర ఇస్తుంది. అతడు లెక్కపెట్టుకొంటాడు. ఒక క్రౌన్ పొరపాటున ఆ యువతి ఎక్కువ ఇచ్చిందనుకొని ఆమెకు ఆ క్రౌన్‌ను ఇచ్చివేస్తాడు. పోస్టాఫీసు మెట్లు దిగుతాడు. మళ్ళీ లెక్కవేసుకొంటాడు. తనదే పొరపాటని, ఆమెకు అనవసరంగా ఇచ్చివేశానే అని బాధపడతాడు. ఒక కాలిమీద శరీరం బరువును మోపి, చివరిమెట్టు వద్ద నిలబడి, 'ఇప్పుడు ఏమి చేయడం?' అని ఆలోచిస్తుంటాడు. ఏమీ చేయలేడు.

ప్రతిసాపులోను ఇదే తంతు"

ఈ ఊగిసలాటకు మరో రూపమే అతని రచనలలోని విరోధాభాస.

---

5. మానసిక కారణాలు క్షయకు ఎలా దారితీస్తాయో కాఫ్కాను ఉదాహరణగా గ్రహించి జాన్. యస్. వైట్ అనే ఆయన పరిశోధన చేశాడు.

మై, నిత్యమై, అతీంద్రియాలైన పదార్థాలను ప్రకాశింపచేసేందుకు శబ్దాత్మకమైన వేఱొకరు తోడుగా దేశాంతర, కాలాంతరవర్తులైన మహర్షిప్రభృతులు పరార్థహితులై ప్రభుసమ్మితమైన వేదవాఙ్మయాన్ని శాస్త్ర, కావ్య, పురాణేతిహాసరూపంలో ప్రపంచించినారు. సృష్టి స్థితిలయకారణమైన ఈ పరతత్త్వాన్ని సగుణ, నిర్గుణ రూపంలో స్థిరపరుస్తూ లోకస్థితికి మూలమైన ఇహపర సాధన రూపఫలాలను అందించే ధర్మమయ మహావృక్షంగా మహాభారతాన్ని సృష్టించినారు. అందుకే ఆమ్నాయ రూపంలో ప్రఖ్యాతమైన ఈ వ్యాసమహాభారతాన్ని తెనిగించిన ఇద్దరు మహాకవులలో నన్నయ ఈ భారతాన్ని 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమని, కవి వృషభులు మహాకావ్యమని, పౌరాణికులు బహుపురాణ సంచయమని' భావించినట్లు చెప్పగా, తిక్కన 'వేదములకు నిఖిలస్మృతి వాదములకు బహుపురాణవర్గంబులకున్ వాదైన చోటుల దామూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్' అంటూ చెప్పి భారతానికి మరింత ప్రామాణికతను కూర్చినారు. ఆది యుగాలల్లో జ్ఞానచక్షువులైన మహాపురుషులూ, మంత్రద్రష్టలూ, మంత్రకర్తలూ తపశ్చరులై కేవల కైవల్య ప్రాప్తికొరకే తపించక లోకానుగ్రహకాంక్షతో తపస్సును ధారవోసి పెన్నిధివంటి వాఙ్మయవారసత్వాన్ని కల్పించినారు. అట్టి నిధులలో ఒకటి మహాభారతం. ఈ గ్రంథంలో శ్రీకృష్ణుడు ఆధార అధేయంగా ఒక నూతనమైన ధర్మాద్వైతవిధానం ప్రవేశపెట్టబడింది. అంటే కేవల తత్తద్దేశకాల యోగ్యమైన పరమధర్మప్రకారం అది. అందుకే ఆ శ్రీహరి లీలావిశేషాలు కానీ, మహాపరాక్రమవంతులైన భారతవీరుల యుద్ధనీతికానీ, వారి జయాపజయ విధానం కానీ సామాన్యుల ఊహకు అందక, నిరీహాస్థాయికమైన శాంతంవైపు మనను మరలిస్తూంటాయి.

సర్వసాధారణంగా అందరి నాలుకపై ఆడుతూ ప్రతి చెవిలో గుయింమనేమాట ఈనాడు ధర్మం అనే మాట. కానీ ఇది అంత సులభంగా అవగాహనం అయ్యేది కానీ, ఆచరణసాధ్యం అయ్యేది కానీ కాదు. అందుకే భీష్మనిఅంతటివాడు ధర్మజ రాజసూయాధ్వర సందర్భంలో శిశుపాలుని పురస్కరించుకొని జ్ఞానవృద్ధులైన సంయమురెరిగినట్లు అల్పరాజ్యాభిమానాంధబుద్ధియైన బాలభావుడైన శిశుపాలునికి ధర్మస్వరూపం తెలుస్తుందా అన్నాడు. ఈ ధర్మస్వరూపం అతి సూక్ష్మమైంది. ఉల్లేఖాలంకారం వలె ఈ ధర్మాన్ని అనేకులు అనేక విధాలుగా నిర్వచించినారు. కొందరు వర్ణాశ్రమాచారయుక్తమైన కర్మల నియతాచరణంచేత ఉత్పన్నమయ్యే ఒక గుణవిశేషం ధర్మం అని చెబితే మరికొందరు 'సదాచారోహి ధర్మః' అన్నారు. మరికొందరు 'నియతకర్మలను ప్రయోజనాపేక్ష లేక నిష్కామంగా ఆచరించినప్పుడు చిత్తము ప్రసన్నతను పొంది తత్త్వజ్ఞానాన్ని స్ఫురింపచేస్తుంది. అదే ధర్మం. అది మోక్షహేతువై నప్పుడు పరమధర్మంగా భాసిస్తుందన్నారు. ఈ ధర్మం ఈశ్వరచోదనంతో వ్యక్తమౌతుందని ప్రశస్తపాదుల మతం (చోదనా లక్షణోఽర్థో ధర్మః). వేరొక కొందరు వైదిక కర్మల వల్లనే ధర్మం ఉత్పన్నమౌతుందని చెబుతూ అందుకు పరిశుద్ధమైన జీవితమూ, పరిశుభ్రమైన ఆహారమూ తప్పనిసరి ఐన సాధనాలుగా సూచించినారు. ఇతే వేద ప్రతిపాదితమూ ప్రయోజనవంతమూ ఐన అర్థమే ధర్మం అంటూ చెప్పి తద్విరుద్ధమైంది అధర్మం అన్నారు. ఇంకొక కొందరు 'క్రియాసాధ్యత్వే సతి శ్రేయస్కరమితి లౌకికాః' క్రియాసాధ్యమైకూడ కల్యాణకారి ఐనది ధర్మం అంటూ ప్రతిపాదించినారు. దాదాపు ఈ భావాన్నే తలపింపచేస్తూ వైశేషిక దర్శనకర్త ఐన కణాదుడు 'యతోఽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః' అంటూ నిర్వచించినాడు. అంటే ఈలోకంలో ఉన్నతినీ పరలోకంలో మోక్షాన్నీ లభింపచేసేదే ధర్మం అని మనం భావింపవచ్చు. ఈ అభ్యుదయ నిఃశ్రేయస పదాలను వ్యాఖ్యానిస్తూ అభ్యుదయమంటే లౌకికసుఖం అనీ, నిఃశ్రేయసమంటే అలౌకికమైన మోక్షసిద్ధి అనీ ఉదయునుడు వివరించినాడు. 'ధరతి ధారయతి వా లోకం ఇతి ధర్మః' అనే వాక్యం ఏ నియమం ఈ సమస్తలోకాన్ని ధరించి ఉందో అదే ధర్మం అనే నిరుక్తం చెప్పినమాటనే సార్థకం చేస్తుంది. 'శాస్త్రోక్త కర్మానుష్ఠానంవల్ల ఉత్పన్నమయ్యే భావిఫలరూప శుభాశుభభాగ్యమే ధర్మం' అంటూ కోశార్థాలు కానవస్తున్నాయి. ఈ చిక్కుల జోలికి పోలేనివారు వేదం ఏది ధర్మం అని ప్రవచిస్తుందో అదే ధర్మం అంటూ వేదప్రామాణ్యాన్నే అంగీకరించినారు. అందుకే ఈ ధర్మవిషయంలో ప్రమాణజన్యజ్ఞానం సాధ్యం అని కొందరూ కాదని కొందరూ వాదిస్తున్నప్పటికీ సకలజన శ్రేయోదాయియై ఇహపరసాధకమై కుటిల రహితమైన హితమార్గమే ధర్మం అని మనం భావించవచ్చు.

చతుర్వర్గసాధకమై, విజ్ఞానసర్వస్వఘనమైన భారతంలో వివిధమైన వినూత్నవిధానాలను అనుసరించి ధర్మప్రబోధం చేయబడింది. ప్రత్యక్షోపదేశరూపంలో, ఆఖ్యానోపాఖ్యాన రూపంలో, గీతారూపంలో, గీతలరూపంలో, నీతులరూపంలో, అవధూతాదుల సంవాదరూపంలో, తీర్థక్షేత్రాదిమాహాత్మ్య ప్రకటనరూపంలో, నరకయాతనాది వర్ణనరూపంలో, విధినిషేధరూపంలో ధర్మస్వరూపాన్ని రంగరించి విసువు

కలిగింపకుండ పాతకులచేత భారతామృతాన్ని గ్రోగింప జేసినారు. ఈ విధానాల్లో చెప్పదగినది యక్షప్రశ్నలు.

ద్వైతవనంలో పాండవేయులున్నప్పుడు ఆర్తుడైన బ్రాహ్మణుడొకడు వచ్చి యజ్ఞోపకారియైన తన అరణిని ఒక మృగము ఎత్తుకొని పోతున్నదని తనకు నియమభంగం కలుగకుండ ఆ అగ్నిని రక్షింపవలెనంటూ కోరినాడు. నిజానికి తమపాట్లు తాము పడుతున్న ఈ పాండవులకు మృగమువెంట పరుగెత్తవలసిన పని లేదు, కాని సమర్థవంతుడైన వీరునికి ధర్మరక్షణం ప్రధానవిధి అని పరోక్షంగా చెప్పటానికే ఈ కథ కల్పింపబడింది. అందుకే భరతశ్రేష్ఠులైదుగురూ ఆ బ్రాహ్మణుని విద్యుక్తధర్మానికి అఘాతం కలుగకుండా మృగాన్ని వెంబడించి, అలసి, దాహపీడితులై ఖిన్నులైనారు. సమీపంలోనే నిర్మల జలపూర్ణమైన సరస్సును చూచి నీటిని తెమ్మంటూ పెద్దవాడైన ధర్మజుడు నియమాన్ని పాటిస్తూ తమ్ముని పంపినాడు.

అక్కడ యక్షరూపియైన ధర్మదేవత తా నడిగినప్రశ్నలకు సమాధానమివ్వక నీటిని తాకరాదంటూ చెప్పిన మాటను లక్ష్యపెట్టక నీరు గ్రోలి దాహానికి ఓర్వలేని పాండవుడు నిర్జీవుడైనాడు, ఈ విధంగా ఒకరివెంట ఒకరు వెళ్లి రాకపోవుటతో ధర్మజుడే బయలుదేరి వెళ్లి అక్కడ విగతజీవులై పడి ఉన్న తమ్ముల చూచి దుఃఖించుమందగా ఆశరీరియైన ధర్మదేవత మాటలు విని ధీరుడై తొందరపాటు లేక, ఆగ్రహింపక, నిర్లక్ష్యం చేయక ఆ ప్రశ్నలకు సమాధానం ఇచ్చినాడు. ఇవే యక్షప్రశ్నలనే పేర ప్రఖ్యాతం బనవి. ఈ భాగం వనపర్వాంతర్గతమై ఆరణేయపర్వంలో 45-113 వరకున్న శ్లోకాలలో పర్యాప్తమై ఉంది.

సాధారణంగా ఆంగ్లేయభాషతో పరిచయం ఉన్న విద్యావంతులు ప్రశ్నోత్తరరూపం అయిన ఈ ధర్మప్రచార విధానం (Socretic method of question and answer) అనే ఛాయలో నడిచినట్లు భావించడం పరిపాటి. కానీ ఈ విధానం మనకు ఎంతో ప్రాచీనకాలంనుండీ అంటే ఋగ్వేద కాలంనుండీ ప్రచారంలో ఉన్న విశేషమే. మన దానస్తుతులలో యజుర్వేదాధర్వవేదాల్లో కూడ ఉపనిషత్తులలో కూడ విజ్ఞానమంతా ప్రశ్నోత్తరరూపంలోనే నడిచింది.

అంతకన్నా విశేషంగా ఈ ప్రశ్నలు ఒక విప్పుకథ లేదా ప్రహేళికారూపంలో అంటే ఒక Riddle రూపంలో స్థిరపడ్డాయి. సూత్రప్రాయంగా, సూక్ష్మంగా ఉన్న తత్వాన్ని గ్రహించి, చిక్కులనూ, ముడులనూ విప్పి చెప్పడం అంత సులభసాధ్యం కాదు. ఎన్నో శాస్త్రరహస్యాలనూ, తత్త్వసిద్ధాంతాలనూ, జీవితవిశేషాలనూ, ఋతసత్యాలనూ ఇముడ్చుకున్న ఈ ప్రశ్నలకు సంయమి సర్వజ్ఞుడైనవాడు మాత్రమే గ్రహించి నేర్పుగా సమాధానం చెప్పగలడు. అందుకే మన ప్రాచీనులు గహనాలైన శాస్త్రరహస్యాలను కూడ ఆనందంతో మేళవించి, ఒక కళగా భాసింపచేసినారు. ఈ యక్షప్రశ్నలన్నీ పరార్థరూపమైన తత్త్వరహస్యాలనే కాక అనేకవిషయపరిజ్ఞానంతో కూడుకొన్నట్లు గోచరిస్తున్నాయి. స్థూలంగా ఈ సాహిత్యాన్ని నాల్గుభాగాలుగా విభజింపవచ్చు. 1. ఆత్మసంబంధమైనవి. 2. సాంఘిక, రాజకీయ, నైతిక విలువలకు సంబంధించినవి. 3. శాస్త్రసంబంధాలైనవి. 4. సామాన్యజన జీవనోపయుక్తాలైనవి. ఈ భాగంలో యక్షప్రశ్నాగర్భితమైన ఒక్కొక్క శ్లోకంలో నాల్గు ప్రశ్నలూ వాటికి సమాధానరూపమైన ఒక్కొక్క శ్లోకంలో నాల్గు సమాధానాలూ వింతగా ఇమిడి ఉన్నాయి. ఉదాహరణకు:

'కిం స్విదాదిత్యమున్నయతి కేచ తస్యాభితశ్చరాః
కశ్చైనమస్తం నయతి కస్మింశ్చ ప్రతితిష్ఠతి.'

అనే తీరులోఉన్న కొన్ని శ్లోకాలనూ వాని సమాధానరూపాలను తెనుగులో అనువాదరూపంగా సౌలభ్యంకోసం ప్రదర్శిస్తున్నాను.

'దినకరుని నడుపునది ఏది? ఆతనిచుట్టు కొలుచువారెవ్వరు? ఆతడు ఏమిట అస్తమించును? దేనియందు ఆతడు ప్రతిష్ఠితుడగును? అంటూ సృష్టి స్థితి లయ కారణభూతమైన పరమరహస్యాన్ని గూర్చి యక్షుడు ప్రశ్నింపగా, ధర్మజుడు ఆ నాల్గింటికి వరుసగా 1. బ్రహ్మము దినకరుని నడుపును. 2. దేవతలు ఆతనిచుట్టు తిరుగుదురు. 3. ధర్మము చేత అస్తమును పొందును. 4. సత్యమునందు ప్రతిష్ఠితుడగును అంటూ సమాధానమిచ్చినాడు. ఈ సమాధానాలు వ్యాఖ్యానం లేకుండా మనకు అవగతం కావు. ఈ సందర్భంలో నీలకంఠ దీక్షితులవారు ప్రచ్ఛన్నమైన ఒక ఆత్మతత్త్వ రహస్యరూపసిద్ధాంతాన్ని ప్రతిపాదించినారు. ఉపనిషద్వాణి ననుసరించి ఆత్మజ్ఞానియైనవాడు సుఖదుఃఖద్వంద్వాతీతుడై సంచరిస్తాడు. అందుకే ఇక్కడ అదిత్యశబ్దాన్ని ఆత్మపరంగా గ్రహిస్తూ ఆ ఆత్మరూపుడైన ఆదిత్యుని నడుపునది 'బ్రహ్మం' అన్నాడు. ఇక బ్రహ్మ అంటే వేదము, లేక విద్య అని గ్రహింపవలె. ఏ విద్య ఆత్మానాత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తుందో అదే వేదమై ఆత్మసూర్యుని ప్రకాశింపజేస్తుంది. వీరి దృష్టిలో దేవతలంటే శమదమాదులైన గుణవిశేషాలు. అట్లే ధర్మశబ్దానికి కూడా ఉపాసన, లేక కర్మవిశేషం అనే అర్థం గ్రహించినప్పుడు ఆ ఆత్మ

హృదయాకాశంలోని నిత్యుని నోయగాన్ని దర్శిస్తూ ఈ ఆత్ముడు పరమాత్మునిలో లీనమౌతాడు. ఈ ఆత్మ సత్యం చేతనే ప్రతిష్ఠితమౌతుంది అంటూ సూక్ష్మసూక్ష్మాతిభేదం తో నిరూపించినారు. ఇంత గహనమైన మార్గం కాకుండా సృష్టిరహస్యాన్ని ఇమిడ్చినట్లుగా సూర్యుని ఉదయింప చేసేది బ్రహ్మ అంటే ఒక నియంతయైనశక్తి అదే జగదీశ్వరమై, ఆదిమధ్యాంతరహితమై, విశ్వంభరమైన బ్రహ్మము. ఈ సూర్యుని చుట్టూ తిరిగే విగ్రహోపగ్రహాలు. అవే మనకు దేవతలు. లేదా సూర్యుని కర్మసాక్షిగా, జ్ఞాన ప్రదాతగా, చీకట్లను తొలగించి వెలుతురునిచ్చే మహోపకారిగా భావించినప్పుడు దేవతారూపులైన విద్వజ్జనులు ఆతని కొలుస్తూ చుట్టు తిరుగుతూ నమస్కరిస్తుంటారు. అందుకే దేవతలు అంటే సప్తర్షిమండలమని కానీ, జ్ఞానులని కానీ అర్థం చెప్పుకోవచ్చు. ఇక సూర్యుడు ధర్మంతో అస్తమిస్తాడు అనేది కొంత విడ్డూరంగా కానవస్తుంది. కాని ఇక్కడ ధర్మం అంటే కాలరూపియైన భగవంతుడు. పూర్వాపరసంధ్యారూపమైన కాలధర్మాన్ని అనుసరించి త్రివిక్రముడైన సూర్యనారాయణుడు సాయంవేళ అస్తమించవలసిందే. అదే ధర్మం. అదే నియమపాలనం. ఇట్లాగే తిరిగి సూర్యుడు సత్యంతో ప్రతిష్ఠితుడౌతాడు. అంటే ఆయన ఉదయం శాశ్వతమైందీ, నిత్యమైంది అని. లేదా సత్యమార్గంలోనే జ్ఞానరూపియైన సూర్యుడు ప్రతిష్ఠ చేయబడుతాడు అని గ్రహింపవచ్చు. అట్లే ఋతకాలాలను తప్పక ఉదయాస్తమయాలను పొందేవాడు ఆదిత్యుడు, ఈ చరాచర సకలజగత్తునూ, ప్రకృతినీ నడిపించేది పురుషరూపియైన బ్రహ్మమూ అని మనము గ్రహింపవచ్చు. ఇట్లే :

కింస్విత్సుప్తం న నిమిషతి ? కింస్విజ్జాతం న చోపతి
కస్యస్విద్ధృదయం నాస్తి ? కింస్విద్వేగేన వర్ధతే ?

అంటూ అడిగిన ప్రశ్నలకు సమాధానంగా కౌంతేయుడు:

1. నిద్రించినను కన్ను మూయనిది చేప. 2. పుట్టి (జన్మించి) కూడ చేతనత్వాన్ని పొందనిది గుడ్డు. 3. ఆకారము కల్గి కూడ హృదయము లేనిది రాయి. 4. వేగంచేత వర్ధిల్లేది ఏరు (నది). అంటూ చెప్పినాడు. ఈ సమాధానాలలో శాస్త్రమిళితమైన తాత్త్వికజ్ఞానగర్భితమయిన నిత్యసత్యం ఇమిడి ఉంది. ఇతర జీవజంతు సామాన్యంగా కాక చేప నిద్రిస్తూ కూడా కన్ను మూయక తెరిచే ఉంటుంది. ఇది చేపజాతి సామాన్య లక్షణం. సూక్ష్మపరిశీలనంతో వ్యక్తమయ్యే విషయం కానీ ఇందులో తాత్త్వికమైన జీవనరహస్యం ఇమిడి ఉంది. ఇక్కడ మత్స్యశబ్దం జీవికి సంకేతం. చేప ఒక తీరంనుండి మరొక జలరాశికి ప్రవేశించినట్లే జీవుడు జాగృత్స్వప్న నిద్రావస్థలను పొందుతాడు. సుషుప్తిలో జీవి నిశ్చలుడై సర్వాన్ని మరచిఉన్నప్పటికీ ఆ జీవి అంతఃకరణం మాత్రం కన్ను మూయదు. జీవి అనుభవించే ఈ దశలను వివరిస్తూ బృహదారణ్యకోపనిషత్తు— 'తద్యథా మహామత్స్య ఉభే కూలేఽనుసంచరతి పూర్వం చాపరం చ ఏవమేవాయం పురుష ఏతావుభావంతావనుసంచరతి స్వప్నాంతం చ' అంటూ ఉపమించింది. అట్లే జీవి గర్భంలో రేతశ్శుక్ల సంయోగంతో అండరూపాన్ని పొంది కూడ చైతన్యవంతమైన ప్రాణమయం (ప్రాణి) కానంతవరకూ కదల నేరదూ, పరిభ్రమింప నేరదు. అట్లే అప్రాణవంతాలైన శిలాదులకు హృదయం ఉండదు. కాని సప్రాణియైన శరీరి హృదయవంతుడు కానప్పుడూ అంటే దయాదాక్షిణ్యాలు లేక, ఎదుటివాని దుఃఖాన్ని చూచి ద్రవించనప్పుడు వానికి హృదయం ఉండికూడా లేనివాడే. అంటే వాడు రాయితో సమానుడు. అందుకే మనలో కఠినచిత్తులైన క్రూరులను చూసి 'అబ్బో రాయియైనా చమరుస్తుంది కానీ వీడా!' అంటాం. ఇక నాల్గవది, వేగంతో నది వర్ధిల్లుతుంది. జల జల ప్రవహించే అభ్యుదయానికి వేగం తోడైనప్పుడూ, అంటే చైతన్యశక్తికి అనుకూల్యమైనవేగం తోడైనప్పుడు అభివర్ధనం సహజంగా కలుగుతుంది.

సామాన్య సాంఘిక నీతికి సంబంధించినవి

కింస్విత్ప్రవసతోమిత్రం కింస్విన్మిత్రం గృహే సతః।
ఆతురస్య చ కిం మిత్రం కింస్విన్మిత్రం మరిష్యతః॥

అనే ప్రశ్నలకు సమాధానంగా తెరువు (దారి) నడచువానికి స్నేహితుడు సార్థము, గృహస్థునికి ఇంటియందు భార్య, రోగార్తునికి వైద్యుడూ, మృతినొందనున్నవానికి అంటే చావు సమీపించినవానికి దానం అనేవి స్నేహితులంటూ యథార్థస్థితిని మన కండ్లయెదుట ఉంచినాడు. ఇట్లే తల్లి తండ్రిని పురస్కరించుకుని యక్షుడు,

కింస్విద్గురుతరం భూమేః కింస్విదుచ్చతరం చ ఖాత్ః
కింస్విచ్ఛీఘ్రతరం వాయోః కింస్విద్బహుతరం తృణాత్॥

అంటూ అడిగిన ప్రశ్నలకు సమాధానంగా ధర్మజుడు, భూమికంటె భారమైనది తల్లి, ఆకాశానికంటె ఉన్నతు

డైనవాడు తండ్రి. గాలికంటె వేగమైనది మనస్సు. గడ్డి పరకలకంటెకూడ ఎక్కువై అసంఖ్యాకాలుగా పుట్టేవి చింతలు లేదా భావాలు అంటూ సమాధానం ఇచ్చినాడు. ఈ సృష్టిలో భూమ్యాకాశాల్లో భూమికి ఉన్న భారవహమైన సహనాన్ని దాని గరిమనూ నిరవధికమైన ఆకాశం యొక్క ఔన్నత్యాన్ని ఒకవంక మనకు చూపుతూ రెండవవంక అంతకంటె గురుతరమైంది తల్లి. ఉన్నతుడు తండ్రీ అంటూ దృఢపరచి వారు పూజనీయులంటూ అన్యాప దేశంగా ఉపదేశించినాడు. అల్లే అన్నిటికన్న వేగవంత మైన వాయువు పోలికతో దానికన్నా శీఘ్రతరగమనం కలది మనస్సు అంటూ చెప్పి, దాన్ని అదుపులో ఉంచు కోవటం అలవరచుకొమ్మన్నాడు. గడ్డి ఏ ఎరువూ లేకుం డానే నీటితుంపరలతో పుష్కలంగా మొలుస్తుంది, అల్లే భావాలుకూడా తండోపతండాలుగా వస్తాయి. కాని ఆ భావాలు తృణప్రాయాలుగాకాక, ప్రయోజనవంతాలు శుచి మంతాలుగా ఉండవలెనంటూ ప్రబోధించినాడు.

ఈ విధంగా గృహస్థ ధర్మాలను చెప్పినట్లు ప్రశ్నలడిగి మానవుడు ఇహపర సాధనకు మంచి నడవడి కలిగి ఉండ వలె నన్నట్లుగా కొన్ని ప్రశ్నలడిగినాడు యక్షుడు.

కః శత్రుః దుర్జయః పుంసాం కశ్చ వ్యాధిరనంతకః।
కీదృశశ్చ స్మృతః సాధురసాధుః కీదృశః స్మృతః॥'

అందుకు ధర్మజుడు, దుర్జయుడైన శత్రువు క్రోధం అనీ, ఎప్పటికీ కుదరని (నయంకాని) రోగం లోభం అనీ (అది అనుభవించినకొద్దీ, కాంక్షిత వస్తువు సమకూరిన కొద్దీ ఆ రోగలక్షణం పెరుగుతుంది కానీ తరగదు. వాడికి సుఖాను భవం కూడా తక్కువే). అల్లే సర్వభూతహితుడైన దయాళువే సాధువనీ, దయారహితుడైన రాతిగుండె అ సాధువు అంటూ పరమమైన కారుణిక ధర్మాన్ని వ్యక్తం చేసినాడు. ఇల్లే లౌకికమైన విలువలను పురస్కరించుకొని యక్షుడు:

'మృతః కథంస్యాత్ పురుషఃకథం రాష్ట్రం మృతంభవేత్?
శ్రాద్ధం మృతం కథం స్యాత్ కథం యజ్ఞోమృతో భవేత్?

అంటూ అడుగగా ధర్మజుడు, దరిద్రుడైన పురుషుడు మృతునితో సమానుడంటూ చెప్పి లోకయాత్రలో దారిద్ర్యం యొక్క భయంకర స్వరూపాన్ని ప్రదర్శింప జేసినాడు. అల్లే సమర్థుడైన ప్రభువు లేని రాజ్యం అరా చకమై నశిస్తుంది అనే రాజకీయ రహస్యాన్ని వెల్లడించి నాడు. ఇల్లే అశ్రోత్రియమైన శ్రాద్ధం అంటే విధివిధానం లేని కర్మ నిష్ఫలమై మృతమౌతుందన్నాడు. ఈ రీతిగనే దక్షిణలేని యజ్ఞము నష్టమౌతుందన్నాడు. యజ్ఞం చేసి దేవతలను తృప్తులను చేసినట్లే ఆ యజ్ఞయాగాది కర్మ లను జరిపించిన విద్వాంసులను ధన వస్త్రాది దక్షిణలతో సత్కరించనిదే ఆ యజ్ఞం మృతప్రాయం అంటే నిర ర్థకం ఔతుందని అర్హసత్కారం, దానధర్మం అధికారి ఐనవానికి విద్యుక్తధర్మాలుగా ప్రబోధించి చెప్పినాడు.

ఈ దానధర్మాలు ఎందుకు చేస్తారో వివరించమన్న ట్లుగా యక్షుడు.

'కిమర్థం బ్రాహ్మణో దానం? కిమర్థం నటనర్తకే?
కిమర్థం చైవ భృత్యేషు? కిమర్థం చైవ రాజసు?'

అని ప్రశ్నింపగా ధర్మజుడు, ధర్మార్థమై అంటే ఇతర వ్యాపృతులను వదలి కేవలం విద్యావ్యాసంగంతో తప స్సుతో, సత్యశౌచాదులతో జీవించే జ్ఞానిని పోషించడం ధర్మాన్ని రక్షించడమే. అందుకే ధర్మం కోసం ఈ ఉత్తమ గుణగరిష్ఠుడైన బ్రాహ్మణుని పోషింపవలె అన్నాడు. ఇక కీర్తికోరకు నటనర్తకులకు దానం చేస్తారు. వారివల్ల దాతపేరు రసికుడుగా, దానకర్తగా దశదిశలు వ్యాపిస్తుంది. కళాపోషణ జరుగుతుంది. ఇక పరిచారకులకు, భరించేం దుకు అంటే వారిని తనవారినిగా ఆదుకునేందుకు వారు జీవించేందుకు, భృత్యులకు దానం చేయవలె అన్నాడు. అల్లే భయకారణం చేత అంటే ఎక్కడ దండెత్తి వస్తాడో? ఏ నష్టం కలిగిస్తాడో? ఏ సౌకర్యం కల్పించడో? ఏ అపాయంనుండి కాపాడడో? అంటూ రాజుకు కర (పన్ను) రూపంగా దానం చేయవలె అంటూ సమాధానం చెప్పినాడు. ఇట్లా నీతిరత్నాకరం వంటి ఈ యక్ష ప్రశ్న ల్లో నా శక్తిని అనుసరించి కొన్ని మణులను మాత్రం ఏరి చూపగలిగాను. విజ్ఞులు మన్నిస్తే చాలు.



# శ్రీ రామకృష్ణ ప్రభ

## విషయ సూచిక



# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము

- తిరుమలకు భగవంతుని దర్శనార్థము వచ్చే భక్తులలో పేదలైనవారికి ప్రసాదదానము చేయుటకు మీరు వాంఛించుచున్నారా ?

- పేదలకు అన్నదాన ప్రాశస్త్యమును హిందూమతగ్రంథములు అనేక విధములుగా ఉగ్గడించినవి. తిరుమలవంటి పుణ్యస్థలములలో గావించు అన్నదానము మరింత విశిష్టమైనది. అన్నదానమువలెనే ప్రసాదదానముకూడ దాతలకు శుభదాయకమైయుండును.

- కావున తిరుమల తిరుపతి దేవస్థానములు, "శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము" అను పేరున ఒక నూతన విధానమును ప్రవేశపెట్టినవి. ఈ పథకముక్రింద మీకు అన్నప్రసాద పొట్లములు, లడ్డులు, వడలు పేద యాత్రికులకు పంచిపెట్టవచ్చును.

- ఈ కార్యక్రమములో పాల్గొనదలచినవారు రు. 500/- శాశ్వతనిధి ఏర్పాటు చేసినచో దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో, 20 లడ్డులుగాని, 15 వడలుగాని, 20 అన్నప్రసాద పొట్లములుగాని మీరు నిర్ణయించిన దినమున క్యూ వరుసలోని పేద యాత్రికులకు పంచిపెట్టబడును.

- మీ జన్మదినముగాని, వివాహదినముగాని, మీ పిల్లల జన్మదినములుగాని, మీ జననీజనకుల శ్రాద్ధదినములుగాని, మీకు స్మరణీయమైన మరి యే దినమునుగాని - మీరు నిర్ణయించితే ఆ దినమున ఉదయము స్వామివారి కొలువులో మీ నామధేయము, గోత్రము, మీ పేర ప్రసాదదానము జరుగబోవునట్లు విన్నవించబడును.

- రు. 500/- చొప్పున మీరు ఎన్ని నిధులైనను ఏర్పాటు చేయవచ్చును. (ఒక్కొక్క నిధికి ఒక్కొక్క నిర్ణీత దినమునుగూడ మీరు సూచించవచ్చును. కనీసము 20 నిధులు (రు. 10,000/-) ఏర్పాటు చేసినవారు, నిర్ణీతదినమున కుటుంబ సభ్యులు ఐదుగురితోసహా శ్రీవారి ప్రత్యేక దర్శనముకూడ పొందవచ్చును.

- ఈ ప్రసాదదాన కార్యక్రమము 1980 ఉగాదినుండి ప్రారంభమయినది. ఇందులో పాల్గొనదలచిన నిధి దాతలకు ఆదాయపు పన్ను మినహాయింపు గలదు. విరాళములు ఆంధ్రాబ్యాంక్ అన్ని బ్రాంచీలద్వారా మీరు పంపవచ్చును. తక్కిన ఏ బ్యాంక్ డి. డి. ద్వారా అయినను కూడ పంపవచ్చును. విరాళములను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానము పేరున, మేనేజర్, ఆంధ్రా బ్యాంక్, గాంధిరోడ్, తిరుపతి-517501 అను విలాసమునకు పంపవలెను. నామధేయము, గోత్రము, పూర్తి విలాసము, పంపకమునకు ఎన్నుకున్న ప్రసాదము పేరు, నిర్ణీత దినము. ఈ వివరములనుకూడ నిధి ఏర్పాటుదారులు తెలియజేయగలరు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.






ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

సంపుటము ౨౫ 1962 - సెప్టెంబరు సంచిక 9

# శ్రీ మహిషాసురమర్దినీ స్తోత్ర

అయిగిరినందిని నందితమేదిని విశ్వవినోదిని నందినుతే
గిరివరవింధ్య శిరోధినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే
భగవతి హే శితికంఠకుటుంబిని భూరికుటుంబిని భూరికృతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 1

సురవరవర్షిణి దుర్ధరధర్షిణి దుర్ముఖమర్షిణి హర్షరతే
త్రిభువనపోషిణి శంకరతోషిణి కిల్బిషమోషిణి ఘోషరతే
దనుజనిరోషిణి దితిసుతరోషిణి దుర్మదశోషిణి సింధుసుతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 2

అయి జగదంబ మదంబ కదంబ వనప్రియవాసిని హాసరతే
శిఖరి శిరోమణితుంగహిమాలయ శృంగనిజాలయ మధ్యగతే
మధుమధురే మధుకైటభగంజిని కైటభభంజిని రాసరతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 3

అయి శతఖండ విఖండితరుండ వితుండితశుండ గజాధిపతే
రిపుగజగండ విదారణచండ పరాక్రమశుండ మృగాధిపతే
నిజభుజదండ నిపాతితఖండ విపాతితముండ భటాధిపతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 4

అయి రణదుర్మద శత్రువధోదిత దుర్ధరనిర్జర శక్తిభృతే
చతురవిచార ధురీణమహాశివ దూతకృత ప్రమథాధిపతే
దురితదురీహ దురాశయదుర్మతి దానవదూత కృతాంతమతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 5

అయి శరణాగత వైరివధూవర వీరవరాభయ దాయకరే
త్రిభువన మస్తక శూలవిరోధి శిరోధికృతామల శూలకరే
దుమిదుమితామర దుందుభినాద మహో ముఖరీకృత తిగ్మకరే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 6

అయి నిజ హుంకృతిమాత్ర నిరాకృతధూమ్రవిలోచన ధూమ్రశతే
సమరవిశోషిత శోణితబీజ సముద్భవ శోణిత బీజలతే
శివశివ శుంభ నిశుంభమహాహవ తర్పిత భూత పిశాచరతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 7

ధనురనుసంగ రణక్షణసంగ పరిస్ఫురదంగ తటిత్కటకే
కనక పిశంగపృషత్కనిషంగరసద్భటశృంగ హతావటుకే
కృతచతురంగ బలక్షితిరంగ ఘటద్బహురంగ రటద్బటుకే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 8

జయజయ జప్యజయే జయశబ్దపరస్తుతి తత్పర విశ్వనుతే
ఝణఝణ ఝింఝిమి ఝింకృతనూపుర, సింజితమోహిత భూతపతే
నటితనటార్థ నటీనటనాయక నాటితనాట్య సుగానరతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 9

అయి సుమనః సుమనః సుమనః సుమనోహర కాంతియుతే
శ్రితరజనీ రజనీ రజనీ రజనీ రజనీకర వక్త్రవృతే
సునయనవిభ్రమర భ్రమర భ్రమర భ్రమర భ్రమరాధిపతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 10

సహితమహాహవ మల్లమతల్లిక మల్లితరల్లక మల్లరతే
విరచితవల్లిక పల్లికమల్లిక ఝిల్లికభిల్లిక వర్గవృతే
సితకృతపుల్ల సముల్లసితారుణతల్లజపల్లవ సల్లలితే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 11

అవిరలగండగలన్మదమేదుర మత్తమతంగజ రాజపతే
త్రిభువనభూషణభూతకలానిధి రూపపయోనిధి రాజసుతే
అయి సుదతీజన లాలసమానస మోహనమన్మథ రాజసుతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 12

కమలదలామల కోమలకాంతి కలాకలితామల భాలలతే
సకలవిలాస కలానిలయక్రమ కేలిచలత్కల హంసకులే

అలికుల సంకుల కువలయ మండల మౌలిమిలద్బకులాలికులే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 13
కరమురలీరవవీజిత కూజిత లజ్జితకోకిల మంజుమతే
మిలితపులింద మనోహరగుంజిత రంజితశైల నికుంజగతే
నిజగుణభూత మహాశబరీగణ సద్గుణసంభృత కేళిరతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 14
కటితటపీత దుకూలవిచిత్ర మయూఖతిరస్కృత చంద్రరుచే
ప్రణతసురాసుర మౌలిమణిస్ఫురదంశులసన్నఖ చంద్రరుచే
జితకనకాచల మౌలిపదోర్జిత నిర్భరకుంజరకుంభకుచే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 15
విజిత సహస్రకరైక సహస్రకరైక సహస్రకరైకనుతే
కృతసురతారక సంగరతారక సంగరతారక సూనుసుతే
సురథసమాధి సమానసమాధి సమాధిసమాధి సుజాతరతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 16
పదకమలం కరుణానిలయే వరివస్యతి యోఽనుదినం సశివే
అయికమలే కమలానిలయే కమలానిలయః స కథం న భవేత్
తవ పదమేవ పరంపదమేవను శీలయతో మమ కిం న శివే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 17
కనకలసత్కల సింధుజలైరను సించినుతే గుణ రంగభువం
భజతి స కిం న శచీకుచకుంభ తటీపరిరంభ సుఖానుభవం
తవ చరణం శరణం కరవాణి న తామరవాణి నివాసి శివం
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 18
తవ విమలేందుకులం వదనేందుమలం సకలం ననుకూలయతే
కిము పురుహూత పురీందుముఖీ సుముఖీభిరసౌ విముఖీక్రియతే
మమ తు మతం శివనామధనే భవతి కృపయా కిముత క్రియతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 19
అయి మయి దీనదయాలుతయా కృపయైవ త్వయా భవితవ్యముమే
అయి జగతోజననీ కృపయాసి యథాసి తథాఽనుమితాసిరతే
యదుచితమత్ర భవత్యురరీ కురుతాదురుతాపమపాకురుతే
జయజయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 20

# నేటి సమాజంలో సన్న్యాసుల కర్తవ్యం

కంఖల్ (హరిద్వార్)లోని 'శ్రీరామకృష్ణ మిషన్ సేవాశ్రమం'లో డిసంబర్ 4, 1981 లో ఏర్పాటు చేయబడ్డ సన్యాసుల, మండలేశ్వరుల బృహత్సభలో 'శ్రీమత్ స్వామి వీరేశ్వరానందాజీ మహారాజ్' గారు ఇచ్చిన "మోనాస్టిసిజమ్ అండ్ ఇట్స్ డూటీ టు సొసైటీ టు డే" అన్న ఆంగ్లోపన్యాసానికి ఇది స్వచ్ఛంద తెలుగునేత. ఈ వ్యాసం 'ప్రబుద్ధ భారత' అనే ఆంగ్ల పత్రిక, జూన్ 1982 లో ప్రచురింపబడింది.

—దానప్ప

'నేటి సమాజంలో సన్యాసుల కర్తవ్యం'- నేడు నాకివ్వబడిన ఈ విషయం కాస్త కఠినమైనదే. ఎందుకంటే ఈ విషయం గూర్చి నేనేమి చెప్పినా, అదొకవిధంగ 'ఉపదేశం'గా పరిణమించే అవకాశముంది. అయితే మును ముందుగానే నేను మీకీ విషయం స్పష్టం చేయదలచుకొన్నాను; నేను ఉపదేశం ఇవ్వబోవటం లేదు. ఈ విషయమై నాలో చెలరేగిన భావాల కొక రూపాన్ని మాత్రం ఇవ్వదలచుకున్నాను. పోతే, నా మనసులోని కాస్త మాటను గట్టిగా ప్రదర్శిస్తానేమో!

స్వామి వివేకానంద స్పష్టంగా అంటారు— "ప్రతి దేశానికీ ఒక ఆదర్శముంటుంది. ఆ ఆదర్శాన్ని సాధించటానికి, అనుభవించటానికి అది ఆశిస్తుంది కూడ. ఆ ఆదర్శం నిత్యనూతనంగా వర్ధిల్లినంత కాలం, దేశం అభ్యుదయాన్ని పొందుతుంటుంది. కాని ఆ ఆదర్శం దిగజారి పోతే, దేశం కూడ దిగజారుతుంది; క్రమంగా ఆ ఆదర్శం నశిస్తుంది, దాంతో దేశం కూడ కనుమరుగౌతుంది."

ఇతర దేశాల మాదిరిగానే, భారతదేశానికి కూడ ఒక ఆదర్శముంది. ధర్మము (రిలిజియన్), మోక్షము-ఇదే ఆ ఆదర్శం. ఈ ఆదర్శాన్ని దాదాపుగా నాల్గువేల సంవత్సరాలు లేదా అంతకుపైగానే, అనుసరిస్తు వస్తున్నది. కొంత కాలం ఆ ఆదర్శం అత్యంత ఉన్నత దశలో, మరికొంత కాలం కాస్త తగ్గుస్థితిలో ఉన్నప్పటికీ, ఆ ఆదర్శాన్ని మాత్రం మన దేశం విడిచిపెట్టలేదు. ఈ ఆదర్శాన్ని ఎప్పటికప్పుడు సముద్ధరిస్తూ, ఎంతో మంది మహనీయులు భగవంతున్ని తెలుసుకోటానికి, మోక్షాన్ని పొందటానికి ప్రయత్నించారు. ఈ (మోక్షమనే) ఆదర్శం, అందరికీ అందుబాటులో ఉండేటట్లు వ్యాప్తి చేయబడింది. ప్రతివ్యక్తీ, ఒక్కమారుగా, మొదట్లోనే ఈ ఆదర్శాన్ని అందుకోలేడన్న సంగతి భారత ఋషులకు తెలుసు. అయితే ఆ ఆదర్శం వరకు చేర్చేందుకు ప్రతి వ్యక్తికి శిక్షణ ఇవ్వవలసి యుంటుందన్నది కూడ వారికి తెలుసు. ఆ శిక్షణా కాలంలో, తన సంస్కారాల కనుగుణంగా, తన జీవితాన్ని భోగించటానికి ఆవ్యక్తికి కొంతమేరకు స్వేచ్ఛ ఇవ్వబడింది. దాని కోసమనే సమాజాన్ని నాల్గు ఆశ్రమాలుగా విభక్తం చేశారు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలుగా వాటిని పేర్కొన్నారు. వాటికి ప్రత్యేక నియమాలను కొన్నింటిని ఏర్పరిచారు. లౌకిక జీవితానికి దూరంగ విద్యార్థులనుంచటం బ్రహ్మచర్య ఆశ్రమ మూలోద్దేశంగా, దాని

నియమాలు ఏర్పాటు చేశారు. సదాచారులు, సద్గుణసంపన్నులయిన గురువుల చెంత, సమాజానికి దూరంగ విద్యార్థులుండి; విద్యాభ్యాసం కొనసాగించేవారు. విద్య పూర్తి అయిన తర్వాత, తిరిగి సమాజంలోకి ప్రవేశించి, సమాజ బాధ్యతలను స్వీకరించేవారు. సమాజ సంక్షేమానికై పాటుపడేవారు.

ధనం సంపాదించటానికి. కొంతవరకు లౌకిక భోగం అనుభవించటానికి, సమాజాభ్యుదయంలో తమ తమ సహకారం అందించటానికి, పరమలక్ష్యమైన మోక్షాన్ని సన్న్యాసులు పొందటానికి వీలుగా ఆ ఆదర్శ మార్గాన్ని కాపాడటానికి, గృహస్థులకు, గృహస్థ జీవితంలో నియమింపబడింది. నిజానికి మిగతా మూడు ఆశ్రమాలకు, గృహస్థాశ్రమమే ఆధారం. సమాజానికి, దేశానికి అవాక స్తంభంలాంటిది.

సన్న్యాసాశ్రమం చివరిది. ఇందులో తన సర్వస్వమూ త్యజించి, వ్యక్తి తన జీవిత కాలాన్నంత కేవలం మోక్షమనే ఆదర్శాన్ని పొందటానికే వినియోగిస్తాడు. వైరాగ్యాన్ని, త్యాగనిరతిని ప్రబోధిస్తూ, అలా జీవిస్తూ సన్న్యాసులు, వాటిని సర్వదా ప్రకాశింపజేస్తారు. మోక్షమనే ఆదర్శాన్ని దేశానికి సర్వదా ప్రకటిస్తూనే యుంటారు. ఈ విధంగా సమాజ పురోభివృద్ధికి, దాని లక్ష్యసాధనకు వారు పాటుపడితే, సమాజం వారి కవసర అవసరాలను తీర్చేది. ఆహారం, వస్త్రంలాంటి అత్యావసర వస్తువులను వారి కందించేది. తమ అవసరాల గూర్చి సన్న్యాసులు ఆలోచించేవారు కాదు. వారు తమ మోక్షసాధనను నిరాటంకంగా కొనసాగించుకోటానికిగాను, వారి కత్యావశ్యకమైన వాటిని సమాజమే వారికి సమకూర్చి పెట్టేది.

ఇది పూర్వకాలపుస్థితి. నేటిస్థితి దీనికి తగినట్లుగా లేదు. నేటి సామాజిక జీవితం వికటించింది. జాతీయ జీవనం అస్తవ్యస్తమయింది. గీతలో, మొదట్లోనే, కృష్ణునితో యుద్ధపు దుష్ఫలితాలగూర్చి అర్జునుని మాటలు మనం చదువుతాము. "యుద్ధం దుష్టమయింది. దాని మూలకంగ ఎంతో మారణహోమం జరుగుతుంది. తత్ఫలితంగా అధర్మం వ్యాపిస్తుంది. అధర్మం ఉన్నచోట, సర్వవిధ దుష్కార్యాలు, దుర్భావాలు విస్తరిల్లుతాయి. ఉన్నతాదర్శాలు మటుమాయమైపోతాయి. సమాజమంతా అవినీతికి, అధర్మానికి నిలయమైపోతుంది." అంటూ అర్జునుడు చెబుతాడు.

మన కాలంలో రెండు ప్రపంచయుద్ధాలు సంభవించాయి. వాటి ఫలితం ఎలాఉందో చూస్తున్నాము; ఆ ఫలితాలను చూస్తుంటే, అర్జునుని మాటలు ఒక్కటీ పొల్లుపోకుండా సత్యాలవుతున్నాయని తోస్తున్నది. సమాజ జీవితం కకావికలైంది. ఉన్నత విలువలు నశించాయి. జనం తప్పుడు మార్గాలను అనుసరిస్తున్నారు. ఒక విధమయిన అత్యంత ఆందోళనాపూరితమైన గడ్డుస్థితి నేడు కేవలం భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతటా వ్యాపించి యుంది. మన ముందు నేడున్న ప్రపంచ చిత్రం వెలవెల బోతున్నది.

ఇలాంటి విషమస్థితిలో సన్న్యాసులమైన మన కర్తవ్యమేమిటి? మనకిప్పుడు ఎంతో గడ్డు పరిస్థితి ఎదురైయుంది. దీన్ని పరిష్కరించటానికి రెండే రెండు మార్గాలున్నాయి. ఇంతవరకు వస్తున్నటుగా సమాజంతో మనకేలాంటి సంబంధం లేదనుకొని, దాంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవటమో లేదా సమాజ దుఃఖాన్ని మనదిగా తలచి, ప్రజల్లోకి

వెళ్ళటము, సామాన్యుని స్థాయికి అవతరించటము, వారిని నైతికోత్తేజానికి వారితో కలిసి పనిచేయటమో ఈ రెంటిలో దేన్నో ఒకదాన్ని మనం అనుసరించవలసి యుంటుంది. నాకు రెండో మార్గమే చాలా ఉచితంగా కనబడుతున్నది. సమాజాన్నుండి దూరంగ ఉన్నట్లయితే, జనులతో పాటు కలసి మెలగక పోతే, మన సన్న్యాసాశ్రమం ప్రమాదాన్ని దుర్కోవలసి వస్తుంది; క్రమంగా అది తన ప్రభావాన్ని, శక్తిని కోల్పోతుంది.

మన దేశంలో నున్న సన్న్యాస సంప్రదాయా లన్నింటిలో, సన్న్యాసు లరుదుగా నున్నారని నా కన్పిస్తుంటుంది. ఇందులో అత్యుక్తి ఉండవచ్చును; కాని యథార్థాన్ని పరిశీలించి చూస్తే యోగ్యులయిన సన్న్యాసులు కాలం గడుస్తున్నకొద్దీ చాలా తక్కువగా కన్పిస్తున్నారు. ఇలా ఎందుకు జరుగుతున్నదో కాస్త ఆలోచిద్దాం. ప్రప్రథానంగ సమాజంలోనే వైరాగ్యం, త్యాగభావన అడుగంటిపోయింది. మరి సన్న్యాసులు స్వర్గం నుండేమి ఊడిపడరు కదా! వారు కూడ సమాజంలోనుండే పుట్టుకవస్తారు. సచ్ఛీలత, నైతికత పరిపూర్ణంగ గల సమాజం మాత్రమే సద్వర్తన గల యోగ్యులైన సన్న్యాసులను ప్రసాదిస్తుంది.

సన్న్యాసులమైన మనమిప్పుడు ప్రజల్లోకి వెళ్ళి, వారి మధ్య నుండి వారితో పాటు కృషి చేయకపోతే, వారు తమను తాము ఎలా సరిదిద్దుకోగలరూ! సన్మార్గగాములు ఎలా కాగలరూ? నైతికంగ, ఆధ్యాత్మికంగ వారి మనసులు అభివృద్ధి చెందినప్పుడే కదా, వైరాగ్యవంతులు, త్యాగ ధనులయిన బాలురు మనకు లభిస్తారూ! అలా కాకుండా, ఏదో విధంగ, బలహీనమయిన ఈ సంఘం నుండే, కొంతమంది యువకులు (బాలురు) సన్న్యాస జీవితం గడపటానికి సిద్ధపడివస్తారనుకుందాం. అప్పు డేమౌతుంది? తన గీతా వ్యాఖ్యలో, "పిశునాః కలహోత్సుకాః"* అని శ్రీధర స్వామి అన్నట్లుగా, వారెప్పుడు ఏవో ఛిద్రాన్వేషణాతత్పరులై, సదా కలహిస్తూనే యుంటారు. కనుక, కనీసం మన స్వప్రయోజనం కోసమైన, ప్రజల మధ్యకు వెళ్ళి, వారిని నైతికంగాను, ఆర్థికంగాను మెరుగుపరచవలసిన అవసరం మనమీదే ఉంది.

పైగా మనం సమాజాని కెంతో ఋణపడి యున్నాం. దాన్ని మనం తప్పక తీర్చవలసి యుంది. ప్రజల స్థితిగతుల్ని బాగుపరిచి, నూతన ప్రమాణాలతో, నూతన విలువలతో సమాజాన్ని పునర్నిర్మించుకోటానికి తగిన సహాయ సహకారాలందించి, మన మా ఋణాన్ని తీర్చవలసి యుంది.

అయితే మరి, ఇలాంటి అభ్యుదయ కార్యక్రమంలో సాధువు లేవిధంగా పాల్గొనాలి? అని మీరడగవచ్చు. నాకొక విషయం తోస్తున్నది. మన సమస్యలన్నింటికీ, మన దుఃఖాలకన్నింటికి మూల కారణం 'నేటివిద్య'. మనకు నేడివ్వబడుతున్న విద్య, నిజానికి విద్య కాదు. అది విద్య పేరిట చలామణి అవుతున్న విద్యారాహిత్యమే! (నెగటివ్ ఎజ్యుకేషన్). నైతిక విలువలకు, ధార్మికతకు నేటి విద్యావిధానంలో ఏమాత్రం అవకాశాలు లేవు. పిల్లలకు(విద్యా

ప్రమాదినోర్బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః। సంన్యాసినోఽపి దృశ్యన్తే దైవ సందూషితాశయాః॥

—సురేశ్వరుడు, నైష్కర్మ్యసిద్ధిః గీతా 6.1 ను వ్యాఖ్యానిస్తూ శ్రీధరస్వామి పేర్కొన్నారు.

ర్థులకు) సత్సంస్కారాలు కల్గించటానికి మన విద్యాసంస్థలు అసలే కృషి చేయుటలేదు. మన విద్యావిధానం ఇంత అధ్వాన్నంగ ఉన్నప్పుడు, అలాంటి సంస్థలనుండి మహనీయులెవరో సంభవిస్తారని, దేశాన్ని పురోగమింప జేస్తారని, ప్రజలను ముందుకు గొనిపోతారని ఆశించటం వృథాప్రయాసయే ఔతుంది.

అందుకని మునుముందుగా విద్యావిధానం పరిపూర్ణంగా, వివేకయుక్తంగా మార్చబడాలి. మనిషిని మనిషిగా తయారుచేసేదే నిజమైన విద్య అని స్వామిజీ (వివేకానంద) అంటారు. దానికోసం మనం చేయవలసింది చాలా ఉంది. సన్న్యాసులే విద్యారంగాన్ని చేబట్టాలి. అప్పుడే అధ్యాత్మికపు పునాదులపై విద్యా ప్రణాళికని నిర్మించటం సాధ్యమౌతుంది. పూర్వం భారత దేశంలో ఇలాంటి విద్యా విధానమే ఉండేది. సామాజిక స్పృహతో పాటు, ఆధ్యాత్మిక విలువలనుకూడ నాటి విద్యా విధానం జనుల కందజేసేది.

ఈ సందర్భంలో నాకో కథ జ్ఞాపకమొస్తున్నది. ఒకప్పుడు నారదుడు సనత్కుమారుని వద్దకు వెళ్ళి, "నేను వేదాదులన్నీ అభ్యసించాను. కాని మనశ్శాంతి మాత్రం లభించటం లేదు" అని చెబుతాడు. అది విని ఆ గురువు, "ఎన్నింటినో నువ్వు నేర్చుకున్నావు, మంచిదే. కాని సత్యాన్ని గ్రహించావా!" అని అడుగుతాడు. "గ్రహించలేద"ని నారదుడు బదులిస్తాడు. ఈ కథవల్ల మనకో విషయం అవగతమౌతున్నది. ధార్మికతను ఆధారంగ కల్గియున్నప్పుడే మన విద్య ప్రయోజనకరమౌతుంది. చంద్రమండలానికి వెళ్ళాం, కుజగ్రహాన్ని అందుకున్నామంటూ, వైజ్ఞానిక విజయాల గూర్చి ఎంత ఘోషించినా ఫలితంలేదు; అవి మానవులను మన ఆదర్శానికి చేర్చలేవు.

ఇట్టి అవస్థలోనే మన సాధుసమాజాలు ఏదైన గట్టిమేలు చేయవలసియుంది మన పిల్లలలో శీలవృద్ధిని కల్గించే విద్యను, నేటి మన విద్యాసంస్థలు ఇవ్వలేకపోతున్నాయి. ఇలాంటి దశలో సన్న్యాసులమైన మనమే విద్యారంగాన్ని చేబట్టి నిర్వహించాల్సిన ఆగత్యముంది; మనపిల్లలకు యుక్తమైన విద్యను గరపవలసిన అవసరం మనకే ఉంది.

కేవలం ధనం-ఐశ్వర్యం మాత్రమే మనిషికి రక్షణ కల్పించజాలవు. 'ఒక్క తిండిచేతనే మనిషి బ్రతకలేడు' అన్న వాక్యంలో ఎంతో నిజముంది. తిండికన్నా మించింది అతనికి మరేదో కావాలి అదే ఉన్నతమైన జీవనం. ఆ ఉన్నతమైన జీవన విలువలను ప్రజల్లో వ్యాప్తి చేయటమే మనపని, దానికోసం మన సాధు సమాజం ఊరూరు తిరగాలి. మనిషి మనిషినీ కలవాలి. ధర్మం - అధ్యాత్మం బోధిస్తూ శీల వృద్ధికి వారికి విజ్ఞానయుతంగ శిక్షణ ఇవ్వాలి. దీనితో సరిపోదు. దీనితో పాటుగా వారికి చేతి పనుల్లో గ్రామీణ పరిశ్రమల్లో శిక్షణఇవ్వాలి. ఆరోగ్యసూత్రాలు బోధించాలి. ఆరోగ్య సంరక్షణ కవసరమైన (ప్రాథమికస్థాయి) (hygiene) ఔషధ విజ్ఞానాన్ని నేర్పించాలి. ఒక్క ధార్మిక పరమైన విద్య అంతగా ఉపకరించదు; మన దేశ ప్రజల్లో అత్యధికులు దారిద్ర్యానికి దిగువస్థాయిలోనే బతుకులు ఈడుస్తున్నారు. వారా దారిద్ర్యాన్నుండి ముందు బయటపడే మార్గం మనం చూపెట్టాలి. అప్పుడే ధార్మికబోధ వారి మనసుల్లోకి ఎక్కుతుంది. శ్రీరామకృష్ణ పరమహంస ఒక సందర్భంలో అన్నమాటలు

ఇప్పుడు జ్ఞాపక మొస్తున్నాయి. "మతం, ఖాళీ కడుపులకోసం కాదు సుమా!"

ఈ విధంగ సాధు - సన్న్యాసులు ప్రపంచ ప్రజల మధ్యలోకి వెళ్ళి, మనిషి - మనిషికీ మధ్యనుండే అసహజమైన భేద భావాలను తొలగించి, కులమతాల కారణంగ ఏర్పడిన అసమానతలను ధ్వంసంచేసి ఒక వినూత్న సమాజాన్ని నిర్మించగల్గుతారు. వీలయినన్ని ఎక్కువ పాఠశాలలను, కళాశాలలను వారు నడపాలి. ఆ విద్యాలయాల్లో విద్యార్థులు భారతీయ జీవిత విలువల నభ్యసిస్తూనే, సామాజికపరమైన విద్యను కూడ నేర్చుకోగల్గాలి.

ఇలా చేస్తే, సాధు సమాజ సభ్యులతో ప్రజలు స్వేచ్ఛగా కలిసి పోగల్గుతారు. సామాన్య ప్రజానీకంతో సన్న్యాసు లిలా మొదటినుండే కలిసి మెలసి ప్రవర్తించియుంటే, ఇతర మతాలను మన సోదరులు ఆశ్రయించ వలసిన దుర్గతి మనకు పట్టేది కాదు. ఇటీవల ఎంతోమంది మతాన్ని మార్చుకొన్న సంగతి మన మందరము ఎరిగిందే కదా! ఈ సంఘటన ద్వార మనం ఒక గుణపాఠం నేర్చుకోగల్గాలి...సమాజ మందున్న ప్రతి మనిషితో, అతను ఏ స్థాయిలో నున్న సరే సత్సంబంధాలను ఏర్పరచుకోటానికి మనం క్రియావంతులం కావాలి. సామాజిక అవసరాలకు తగిన విద్యను వారికి బోధిస్తూనే, మన ఆదర్శమైన మోక్ష ప్రాప్తికి వారిని సన్నద్ధులను చేయాలి.

మోక్ష విద్యను వారికి మనం అందిస్తూనే ఉన్నాం. నిజమే, కాని ఖాళీకడుపుల కది జీర్ణమౌతుందా? ఆలోచించండి. సాధు సమాజ లమైన మనం, మన స్థాయినుండి దిగి రావలసిన అవసరం నే డెంతేని ఏర్పడి యుంది. మన మిప్పుడు ప్రజలతో కలిసిపోవాలి. వారికి సరైన విద్య గరపాలి. వారిని ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా, సాంస్కృతికంగా పరిపుష్టులను చేయాలి. ఇవన్నీ సాధింపబడినప్పుడే, మనుషుల మనసులు మతంవైపు మరలుతాయి. సమాజంలో ఇలాంటి ఆరోగ్యకర వాతావరణం పరిఢవిల్లినప్పుడు, మనం తిరిగి మన యథాస్థానాల్లోకి వెళ్ళిపోవచ్చు; లౌకిక కార్యాలనుండి విరమించి, మనం ఆశ్రమాల్లోకి వెళ్ళిపోవచ్చు; లేదా అరణ్యాల్లోకి ఏకాంతంలోకి వెళ్ళిపోవచ్చు; సంప్రదాయానుసారంగ మనం మన జీవితాలను గడపవచ్చు. స్వామీ వివేకానందగారి ఆదర్శ ఆశయం యొక్క అభిప్రాయం ఇదే.

నా పరిమితుల నధిగమించి నేను మాట్లాడానేమో! కాని, మీకేదో ఉపదేశమివ్వాలన్న అభిప్రాయంతో మాత్రం మాట్లాడలేదని గమనించాలి. దయచేసి నా మాటల్ని అపారం చేసుకోవద్దు. సాధు సమాజ సభ్యులకు ఉపదేశాలిచ్చేంత వాడిని కాను నేను. అయితే ఒకటి; నేను శాస్త్ర శ్రద్ధగా మాట్లాడి (ఆలోచించి) యుంటాను. నన్ను నేనే ఒకవిధంగా విశ్లేషించుకొని యుంటాను. ఎంతోకాలంగ నాలో ఈ అభిప్రాయాలు చెలరేగుతున్నాయి; సన్న్యాసులు, ఈ సమాజానికేమీ చేయలేరా! అన్న సమస్యతో సతమత మవుతున్నాను. నాలో చెలరేగుతున్న ఈ అభిప్రాయాలకి, నేడొక రూపాన్ని ఇవ్వటానికి ప్రయత్నించాను. అంతేకాని, అందులో మరో ఉద్దేశమేమి లేదు.

# వాము శరదశ్శతం

డాక్టర్ బాగంటి సూ రి

'జీవామ శరదశ్శతం' అని శ్రుతివాక్యం. వేదకాలంనాటి పండితులకు, పామరులకే కాక నేటికాలపు మానవజాతికంతకు 'జీవామ శరదశ్శతం', 'మోదామ శరదశ్శతం' అనునవి జీవితలక్ష్యం అనుట అతిశయోక్తి కాదు. సత్య దూరంగాదు. దీనికొరకే జీవిత వ్యాపారం అంతా. 'స్వర్గకామో యజేత' అనే కర్మ కాండ ననుసరించి చేసిన యజ్ఞం కూడా. స్వర్గం సంగతి దేవు డెరుగు. చేసిన యజ్ఞ మానికి తృప్తి, సంతోషం కలుగచేస్తుంది. ఏదో ఆశయం కోసం నేడు కొందరు చేసే నిర శన వ్రతములు కూడా ఆనందదాయకములే. కాబట్టి ఆనందం జీవితలక్ష్యం. ఇట్టి జీవిత లక్ష్యాన్ని మఖలో పుట్టి పుబ్బలో పోయే బ్రతుకు ఏం సాధించగలదు? అందుకే ఋషి నూరు శరత్తులు చూచి ఆనందిస్తానని-సూర్యు నితో మనవి చేస్తున్నాడు. ఈ నూరేండ్ల ఆయుఃప్రమాణం నాడూ నేడూ కూడా మాన వుని జీవితలక్ష్యమే! ఈ శాంతి పాఠం చూడండి!

భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాగ్ సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో౽రిష్టనేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు.

ఈ నూరేండ్లు జీవించి సాధించే దేమిటి? ఈ శాంతి పాఠం ఇట్లు చెబుతోంది. "మా చెవు లలో మంచినే వినెదముగాక! కళ్ళతో శుభ మునే చూచెదముగాక. దేవతలారా! సుస్థి రములైన పుష్టిమంతములైన శరీరములతో సంతృప్తితో జీవితకాలమంతా మీ (దేవతల) ప్రీతికొరకే గడిపెదముగాక! దేవతలైన ఇంద్రుడూ పురాతనులైన సిద్ధపురుషులు, సర్వజ్ఞు లైన సూర్యుడూ, ఆపదలనుంచి కాపాడు వాయువు (ఆధ్యాత్మిక సంపదనిచ్చు) బృహ స్పతి వీరందరు శుభప్రదులగుదురుగాక.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శాంతి- అనగా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక బాధలు లేని పరమసౌఖ్యదాయక మైన శాంతి అని అర్థము. "శాంతములేక సౌఖ్యములేదు" అని త్యాగబ్రహ్మ చెప్పిన శాంతి. 'శాంతిరస్తు, పుష్టిరస్తు' అని చేసే దీవన యొక్క లక్ష్యం. అంతేకాని, ఏమీ పనిచేయకుండా, స్తబ్దత వహించి "ఊరు కోవడం లేదు. ఇది వేదకాలంనాటి వారి లక్ష్యమే కాదు. నేటి జీవితలక్ష్యం కూడా ఇదే. కాని నేడు సాధించగలిగామా! సాధించకపోతే కారణమేమిటి అనేదే ప్రశ్న.

వేదకాలంనాటి జీవితం ప్రశాంతవాహిని. ఒడుదుడుకులు లేనిది. జనానీకం ఏ కొద్ది కాతమో తప్ప జనపదములలోనే జీవించేవారు. పట్టణముల సంఖ్య బహుస్వల్పం. మనము నేడు నాగరికత అని వ్యవహరించే జీవితవిశే షం, వైజ్ఞానిక సాంస్కృతిక ప్రజ్ఞ ఆశ్రమము లందు, నదీతీర ప్రాంతములందు ఎక్కువగా ఉండేది. జీవిత ప్రధానావసరములైన స్నాన పానాదుల కవసరమగు పరిశుద్ధజలము, దాని సమృద్ధి, తినుటకు వర్షాధారములైన యవాది ధాన్యములు, ఫలములు, కందమూలములు

మొదలగునవి పుష్కలముగ లభించెడివి. ఎండ వానలకు తలదాచుకొనుటకు కుటీరములు, శరీరాచ్ఛాదనకు నారచీరలు, చర్మములు దొరికెడివి. అన్నింటిని మించినది స్వల్పజనసంఖ్య అందుకోసమే కదా! 'ప్రజాతంతుం న విచ్ఛేదయ' అని శ్రుతి చెప్పుచున్నది. 'పుత్ర పౌత్రాభిరస్తు' అను దీవెన. ఆ రోజులలో (వేదకాలములో) దొంగలు, క్రూరజంతువులు, శత్రుభీతి, అనారోగ్యం, దారిద్ర్యం మొదలైనవి లేవనికాదు. ఉంటే ఇట్టివి నగరముల లోనే ఉండెడివి. ఆశ్రమములందు మృగ్యము. అంతేగాక నగరములందును జనసామాన్యము యొక్క జీవితలక్ష్యావరోధములు అంతగ లేవు. అన్నిటికంటె విశేషం ఏమిటంటే సంపదలుగాని, రాజకీయాలుగాని, తొందరగాని జీవితయాత్రలో అంతగా ప్రాధాన్యం వహించలేదు. సోమపానం విషయం చెప్పలేముగాని మద్యపానం; ధూమపానం మొదలైన మత్తు పదార్థములను ఉపయోగించు అలవాటు జనసామాన్యంలో ఉండేదికాదు. ఈపైన చెప్పినవన్నీ జీవితవేగానికి అనుచరులు. జీవితలక్ష్యమైన శాంతిని దిగలాగేవి. ఈనాడు ఇవన్నీ మానవుని నిత్యజీవితంలో పరిపాటి. ఈ చెడు అలవాట్లలో కలుషితమైన శరీరములో శాంతి నెట్లు సాధించగలరు? ఇట్టివారు ఎట్టి ప్రయత్నం చేసినా 'సర్వేజనాః సుఖినోభవంతు' అనే విశ్వశాంతి ఎలా సిద్ధిస్తుంది? 'జీవామ శరదశ్శతం' అనే జపంతోటే సిగరెట్లు త్రాగుతూ నూరేండ్లు జీవిస్తారా? నోబెల్ బహుమానం పొందిన ఒక ప్రముఖశాస్త్రవేత్త జంతు శరీరంలో 'Stress Hormone' అనే ఒక పదార్థం కనిపెట్టాడు. Stress అనగా భయము, తొందర, నిర్వేదాదులవల్ల కల్గు జీవిత సంక్షోభం. వీని వల్ల శరీరంలో ఎక్కువగా ఈ stress Hormone తయారవుతుంది. ఇది సరైన మోతాదులో ప్రశాంతమైన జీవిత ప్రాశస్త్యానికి అవసరము. కాని నేటి జీవితములో ఇట్టి శాంతి ఎక్కడిది? పుష్టికరమైన ఆహారంకోసం, పరిశుద్ధమైన జలం కోసం, నిర్మలమైన వాతావరణంకోసం, ధనము కోసము, పదవికోసము, మనిషికి మనిషి, దేశమునకు దేశము పందెములో గుఱ్ఱాలవలె పరుగెత్తుచున్నవి. జీవితం బాణవేగంతో సాగిపోతున్నది. ఈ ఆతురతవల్ల పైన చెప్పిన Stress hormone మొదలైనవి మోతాదుకు మించి తయారు అవుచున్నవి. ఇవే నేటి రక్తపోటుకు, గుండెజబ్బుకు, అతిమూత్రవ్యాధికి, ఇతర మానసిక వ్యాధులకు ప్రాతిపదికలు. చూడండి! జీవితవేగం తక్కువగా ఉండెడి కాలినాలిలో జీవించెడి జనులలో ఈ వ్యాధులరుదు. అన్నింటిని మించినది జీవితములో ధనముయొక్క స్థానము. ధనేషణ. ఎవరో విశ్రాంతి తీసికొన్నవాళ్ళు తప్ప అందరూ ఆతురతతో కాలము గడుపుచున్నారు. ఆఫీసుకు సమయమునకు వెళ్ళుటకు నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని పరుగెత్తుట, పరీక్షసమయానికి నిద్ర లేకపోయినను వెళ్లుట, మంత్రులు మొదలైన వానిచుట్టూ పనులకోసం తిరుగుట ఎన్నో వ్యగ్రతలు. ఈ విధముగ కాలమునకు జీవితము బానిస. ఈ కాలమునకు ధనమునకు లంకె. అందరికి నాలుగు గడియలు ఎక్కువ పనిచేసి నాలుగు డబ్బులు ఎక్కువ సంపాదించవలెననెడి ఆశ.

ఈ కాలము మనకు ఊరికేరాదు. కాలం యమస్వరూపము. ఈ చెప్పిన సంసార యాతనలో, మానసిక ఆందోళనలో Stess hormone మోతాదు ఎక్కువయి, పైనచెప్పిన వ్యాధులు

త్త్వాకర్షణ సిద్ధాంతాన్ని ఎలా అన్వయిస్తాము? కనుక ప్రకృతి నియమబద్ధంగా ఉండితీరాలి. ఈ 'నియతి' భౌతికశాస్త్రాలలోనే కాక, ఆర్థిక, రాజకీయ, జీవభౌతిక, సామాజిక, మనోవిజ్ఞాన శాస్త్రాలలో గూడ ఉన్నదని భావించబడుతోంది. అయితే అత్యంతంగా ప్రగతి సాధించిన భౌతిక విజ్ఞానశాస్త్రం 'నియతి' సూత్రాన్ని బల్లగుద్ది బలపరచడంలేదని సిడ్నీ హుక్ సంపాదకత్వం వహించిన (Determinism and Freedom in the Age of Modern Science) అనే గ్రంథం అంటున్నది.

మానవునితో సహా ఈ విశ్వాన్ని అంతా కలిపి ఒక కోణంనుంచి చూస్తే ఈ ప్రపంచంలోని ప్రతి సంఘటన పూర్వనిశ్చితమని, మరొక కోణంనుంచి చూస్తే మనిషికి స్వేచ్ఛ ఉన్నదని అర్థమవుతుంది. ఈ రెండు దృక్పథాలను జాగ్రతగా నిష్పక్షపాతంగా పరిశీలించాలి. నిష్పక్షపాతి రెండిటి సమన్వయదృక్పథానికి చేరతాడు. నాటినుంచి నేటి వరకు నిశ్చయవాదాన్ని (Determinism) బలపరిచిన వారూ ఉన్నారు. వీరివాదాన్ని 'ఘననిశ్చయవాద' (Hard Determinism)మని అంటారు. అందులో స్వేచ్ఛకు ఏమాత్రం సందు ఉండదు. అలాగే పూర్తిస్వేచ్ఛను బల పరిచినవారూ ఉన్నారు. అయితే ఇక్కడ 'స్వేచ్ఛ' అంటే పూర్తి విశృంఖలత కాదు. 'స్వేచ్ఛ' అంటే మనిషికి వ్యక్తిగతంగా కొన్ని వికల్పకల (Alternatives)లో లేదా కొన్ని సంభావ్యతల (Possibilities)లో దేనినో ఒకదానిని ఎన్నుకొనే అవకాశము. ఈ 'స్వేచ్ఛ' బి.యఫ్. స్కినర్ అనే ప్రవర్తన మనోవిజ్ఞానశాస్త్రవేత్త చెప్పిన ప్రతికూల ఉద్దీపన (aversive stimulus) కు దూరంగా జరగడమే ననిపిస్తుంది. అంతేగాని 'అవశ్యకతను గుర్తించడమే స్వేచ్ఛ' అనే హేగెల్ తాత్త్వికనిర్వచనంగాని, 'మోహవికారాదులవీడి సత్యసందర్శనం చేయడమే స్వేచ్ఛ' అని చెప్పే ఫ్రాయిడ్ నిర్వచనంకాని కాదు. ఇక్కడ 'స్వేచ్ఛ' అనేది పరిమితార్థంలో గ్రహించాలి. ఎందుకంటే లభ్యమయ్యే అవకాశాలలోనేగదా ఎంపిక జరిగేది. ఈవాదాన్ని 'అనిశ్చయవాదమ'ని (Indeterminism) అనిగూడ అంటారు.

## నిశ్చయవాదం :

మానవుని ఆటవికదశలో, విజ్ఞానానికి అంకురార్పణ జరగనిస్థితిలో, ప్రకృతిబీభత్సాలను చూచి భయవిహ్వలుడై ఒణికిపోయిన మానవుడు క్రమంగా విజ్ఞానం పెరగడంతో ఈ విశ్వంలోని క్రమతను గ్రహించాడు. అసలు జ్ఞానం పెరగడమంటేనే విశ్వంలో 'నియతి' ఉన్నట్లు, ఎలాగంటే, విజ్ఞానమంటే సూత్రాల వ్యవస్థీకరణము. మరి విశ్వం సూత్రబద్ధమైతేగదా సూత్రాలను మనం ఏర్పరచగలిగేది. శాస్త్రం సాధించిన ప్రగతితో విఖ్యాతులయిన తాత్త్వికులు, విజ్ఞానవేత్తలు ఈ విశ్వం నియమబద్ధమన్నారు. ఇలా విజ్ఞానంతో ఈ నిర్ణయానికి కొందరు వస్తే అజ్ఞానంవలని భయంతో కొందరు అదే నిర్ణయానికి వచ్చారు. ప్రకృతిబీభత్సాలతో భయపడినవారికి ఏదో ఒక ఆలంబనం కావాలి. ఈ ఆలంబనాన్ని వారు దేవునిలో, అదృష్టంలో, కర్మలో చూశారు. కర్మ నియతమేగదా! ఆవిధంగా తమ బాధ్యతలనుంచి, పురుషకారంనుంచి బయటపడ్డారు. ఊరట చెందారు. వీరి ఆలోచనలఫలితంగానే విధివ్రాత, అదృష్ట, కర్మ సిద్ధాంతాలు బయలుదేరాయి. ఈవిధంగా అటు శాస్త్రపరంగా, ఇటు తాత్త్వికంగా నియతిని శాస్త్రీయ ప్రాతిపదికపై నిలపడానికి ఎందరో ప్రయత్నించారు. ఇలా ప్రయత్నించినవారిలో ఒమర్ ఖయామ్ మొదలు స్పినోజాలాంటి హేతువాదివరకు ఉన్నారు.

'భూమి మొదటి మట్టిలోనుంచి చివరి మనిషి సృష్టిక మలచబడ్డది' అన్నాడు ఒమర్ ఖయామ్. మనకు ఎప్పుడు ఏ కోరికలు పుడతాయో, ఏ ఆలోచనలు వస్తాయో మన అధీనంలో ఏమీ లేదు; అన్నా డొక తాత్త్వికుడు. 'మానవుని జీవితం ఒక గడియారం' అని చెపుతూ, 'మనిషి తానేది అనుకొంటే అది చేస్తాడు గాని, ఏది అనుకోవాలో మాత్రం అతని అధీనంలో లేదు' అన్నాడు షోపెన్‌హర్.

నిశ్చయవాదాన్ని శాస్త్రీయసిద్ధాంతంగా పరిగణించినట్లయితే, ఈ ప్రపంచమంతా కార్యకారణ శృంఖలాబద్ధమని తేలుతుంది. ప్రపంచంలోని సంఘటనలన్నీ వాటికి ముందర జరిగిన సంఘటనలతో వివరించబడుతున్నాయి. ప్రకృతినియమాలను, ప్రపంచంలోని సంఘటనలన్నీ కార్యకారణబద్ధాలని నిర్ణయించిన శాస్త్రం సాధించిన ప్రగతిని చూసిన మానవుడు మానవప్రవర్తనకూడ తన చుట్టూ ఉన్న ప్రపంచంవలె, నియమబద్ధమే అని భావించసాగాడు. సుదూరాకాశంలోని నక్షత్రాలనుంచి, వాటినుంచి రాలిపడే ధూళివరకు అన్నీ నియమబద్ధంగా నడుస్తుంటే మానవుడు మాత్రం ఆ సూత్రానికి సాపవాదం ఎందుకవుతాడు? అందుకని మానవుని గ్రంధులు. భావగ్రంధులు, (Complexes) అచేతన ఉత్సుకతలు (Unconscious drives), జానపద రీతులు (Flokways) ఆచారవ్యవహారాదులు మానవజీవితాన్ని నియతం చేస్తున్నాయి. అనువంశికత, పరిసరం మనిషి ప్రవర్తనను దిద్దుతున్నాయి. దీని కనుగుణంగానే ప్రవర్తనవాదానికి చెందిన మనోవిజ్ఞానశాస్త్రవేత్త B. F.

స్కిన్నర్, 'మనం మరోవిధంగా వివరించడానికి చేతకాక మనం ప్రతిపాదించిన ఒక పరికరమే స్వయంచాలిత* అంతరమానిషి (Autonomous man) (ఆత్మ)' ఈ 'అంతరమానిషి' మన అజ్ఞానంనుంచి సృజింపబడ్డాడు. మన అవగాహన పెరిగేకొలది అతడు (ఆత్మ) ఏ పదార్థంతో చేయబడ్డాడో ఆ పదార్థమే అదృశ్యమవుతుంది' ఆ పదార్థం అదృశ్యమైనతరువాత మిగిలేది యాంత్రికసమానమైన శరీరము, అప్పుడు ఈ శరీరప్రవర్తన యాంత్రికమవుతుంది. యాంత్రికమంటేనే స్వేచ్ఛ శూన్యం గదా. అంటే అతడు మనం పురుషకారానికి, వ్యక్తిస్వేచ్ఛకు బాధ్యతలకు అవకాశం కల్పించడంకోసమే 'లోపలి మనిషిని' ప్రతిపాదించామంటాడు.

నిశ్చయవాదాన్ని తీవ్రంగా ఆశ్రయించినవాడు ప్రముఖ హేతువాది బెనిడిక్ట్ స్పినోజా. ఇతనిప్రకారం దేనిపై ఆధారపడకుండ స్వయంసిద్ధ అస్తిత్వాన్ని కలిగిఉన్నది దేవుడొక్కడే లేదా ప్రకృతిమాత్రమే. ఇతని దృష్టిలో ప్రకృతికి దేవునికి తేడా లేదు. రెండూ ఒకటే. అదే సత్యం. మనస్సు, పదార్థం లేదా ఆలోచన (thought), వ్యాప్తి (Extention) ఆ ఏకసత్యం లక్షణాలు. ప్రకృతి వ్యాప్తిచెందితే పదార్థమవుతుంది. అది ఆలోచించినప్పుడు 'మనస్సు' అవుతుంది. బుద్ధి, సంకల్పాలు ఆలోచన రూపాంతరాలు (Modifications) ఆ ఉన్న ఏకసత్యం వ్యక్తికం (Personal) కాదు. దానికి ఉద్దేశసంకల్పాలు లేవు. ఎందుకంటె మూర్తిమత్వం, సంకల్పాలు పరిమితులను విధిస్తాయి. అందుకనే స్పినోజాను నాస్తికుడని అజ్ఞేయ-అద్వైతి (Agnostic-monist) అని ప్రకృతి-పురుష అభేదవాది అని, దేవుని మత్తెక్కినవాడని అంటారు. ఇక్కడ మనకు సంబంధించినంతవరకు అతనిది అద్వైత నిశ్చయవాదము. 'అనంత విశ్వక్రమత మనలను పాలిస్తున్నది. అందువలన అదృష్టాని (Chance)కి స్వయంభుకత్వాని (Spontaneity)కి ఈ ప్రకృతిలో స్థానంలేదు. సత్యం పూర్తిగా హేతుబద్ధం. అంతట క్రమం, ఐక్యత, ఆవశ్యకత తప్ప అన్యం లేదు' అంటాడతడు. మనుషులు కొంతమంది కొన్నిసార్లు కొన్నిపనులు తమంతట తాము స్వేచ్ఛగా చేశామని భావిస్తారు. అది సరిగాదు. వారికి సరైన కారణాలు తెలియక ఆ పనులకు తామే కారణమనుకొంటారు. అంతేకాక ఈ ప్రపంచంలో విధినిషేధాలకు, పొగడ తెగడలకు స్థానం లేదు.

విధివ్రాత :

నియతివాదానికి మరోరూపం 'విధివ్రాత' సిద్ధాంతము మరీ కరుడుగట్టిన నిశ్చయవాదము. దీనిప్రకారం ప్రపంచంలో జరగబోయే ప్రతిదానిని దేవుడు ముందుగానే వ్రాసిపెడతాడు. కనీసం మానవుని అదృష్టాన్నయినా ముందుగా లిఖిస్తాడు అతని నొసటన. దేవుడు సర్వజ్ఞాని, సర్వాంతర్యామి, సర్వశక్తిమంతుడు ఆయినప్పుడు ప్రపంచంలో ప్రతిదానిని అతడు ముందుగా నిర్ణయిస్తాడనడంలో ఆశ్చర్యం లేదు. దీనిప్రకారం మనిషి మదిలో మెదిలే ప్రతి ఆలోచన, ప్రపంచంలో జరిగే ప్రతి సంఘటన దైవ నిర్దేశితాలే. అయితే ప్రతిదీ భగవంతుడే నిర్ణయిస్తే మానవుడు దేనికీ అన్న సందేహం కలిగిన కొందరు మనిషికి కొంత స్వేచ్ఛ కల్పించదలచి, ఈ సిద్ధాంతానికి కొన్ని సాపవాదాలు చేర్చారు. మొత్తంమీద ప్రతిదీ భగవన్నిర్దేశితమే కాని కొన్నివిషయాలలో మనిషికి కొన్ని పరిమితులకు లోబడి కొంత స్వేచ్ఛ ఉన్నదన్నారు. ఈవిషయం హిందువులకు బాగా తెలుసు

మనిషికి స్వేచ్ఛ ఉన్నా, అతడు భగవంతునికి బాధ్యత వహించవలసి ఉంటుందని చెప్పబడింది. ఇది యూదు క్రైస్తవమతాలలో కనిపిస్తుంది. క్రైస్తవదర్శనంలో కాల్విన్ వాదంలో ఇది పూర్తిగ అభివ్యక్తమైంది. హిందువులు దీనిని ఒప్పుకొంటారు. సనాతన ఇస్లామ్ ప్రకారం 'ఏది జరిగినా అది దైవేచ్ఛయే!'

ఇలాంటి అతి నిశ్చయవాదం పెద్ద వ్యతిరేకతనే సృష్టించింది. ప్రతిదానికి భగవంతుడే కర్త అయితే, అతడే అన్నింటిని నిర్ణయిస్తుంటే, మానవుడు చేసినపాపాలకు గూడ భగవంతుడే బాధ్యత వహించవలసి ఉంటుంది, కనుక మానవుడు చేసే పాపపుణ్యాలకు బాధ్యత భగవానునిదే. అయినప్పుడు మనిషిని నిందించవలసిన పని ఏమిటి? అందుకని, ఈ తర్కాన్ని కొనసాగించ లాగిన కొందరు

---

* మనం మామూలుగా మనిషిలో మనిషి ఉన్నాడని, ఈ లోపలిమనిషి స్వయంచాలితుడని, బయటిమనిషిని నడుపుతున్నాడని భావిస్తాము. లోపలిమనిషి ఆత్మకు సమానము.

loose play) ఉంది. దీనికి అర్థం ప్రపంచంలో ప్రతికీ కార్యకారణబద్ధంగా లేదు; కొంతమేరకు వస్తువులన్నీ ప్రపంచంలోనే యథార్థంగా బహుళత్వం (pluralism) ఉంది. అందుకనే భవిష్యత్తులో వాస్తవికతల (Actualities = యథార్థంగా జరిగేవి) కంటె సంభావ్యతలు (possibilities) ఎక్కువ.

అంతేకాదు; నిశ్చయవాదిగూడ పశ్చాత్తప్తుడవుతాడు. 'అయ్యో, ఇది చేయకుండా ఉంటే ఎంత బాగుండేది' అనుకొంటాడు ఒక్కొక్కమాటు. అంటే చేయకుండ ఉండడానికి వీలున్నదని కార్యకారణవాది భావిస్తున్నాడు. హత్య, ఆత్మహత్యలు అతనికి పెద్ద ప్రశ్నార్థకాలు. హత్యను మిగతావిశ్వమంతా కార్యకారణ సూత్రంమీద నిర్ణయిస్తే మరి ఇంక వగపేల? శిక్ష ఏల? అలాంటప్పుడు బుద్ధిహీనుడుమాత్రమే పశ్చాత్తాపపడాలి.

స్వేచ్ఛ ఈ ప్రపంచంలో ఉందని సైద్ధాంతికంగా రుజువు చేయలేము. అది ఈ ప్రపంచానికి సంబంధించిన ఒక అభ్యుపగమము (Postulate) అంటే అది రుజువు లేకుండానే అంగీకరించవలసిన ప్రారంభవిషయము. ఆమాటకొస్తే కార్యకారణసిద్ధాంతాన్ని, ఏకతా సిద్ధాంతాన్ని (Causality and uniformity) ఈ విశ్వం అనుసరిస్తున్నదని రుజువు చేయలేదు. రేపు సూర్యుడు తూర్పున ఉదయిస్తాడని ఎవరూ రుజువు చేయలేరు. గతంలో అలా జరిగింది గనుక రేపూ అలా జరుగుతుందని చెప్పగలదే గాని, అంతకంటె రుజువు చెప్పలేరు. మరి రుజువు లేకుండానే ఆ సూత్రాలు ఈ విశ్వాన్ని నడిపిస్తున్నాయని ఒప్పుకొన్నప్పుడు, రుజువు లేకుండానే స్వేచ్ఛ ఈ ప్రపంచంలో ఒప్పుకోవడానికి అభ్యంతరం ఎందుకు? ఇదీ ఒక అభ్యుపగమ మనుకొందాము.

అసలు నియతి, కారణతలు ఈ ప్రకృతిలో లేవు. అవి ఉన్నది మన మనస్సులోనే. కామెర్ల రోగికి ప్రపంచమంతా ఎలా పచ్చగా కనిపిస్తుందో అలాగే నియతి, కారణతలు మనస్సులో ఉన్నవాడికి ప్రపంచమంతా నియమబద్ధంగా, కారణబద్ధంగా కనిపిస్తుంది. అసలు మనిషి మనస్సులో నుంచి ఆ రెండు రంగుటద్దాల (నియమిత, కారణతలు) తొలగించి చూడలేడు. అందుకని అతనికి ఈ ప్రపంచంలో నియతి, కారణతలకంటె భిన్నమైన గందరగోళ అస్థిర స్థితి కనుపించదు. వర్ణాంధునికి (colour blindness) కొన్నిరంగులు కనిపించవు. అతనికి సంబంధించినంత వరకు ఈ ప్రపంచంలో ఆ రంగులు లేవు అలాగే అంతా నియతినే చూసేవానికి 'అనంహతశీల' కనిపించదు

ఈ విశ్వంలో విభుకతను అంగీకరించినప్పుడు ప్రపంచం ఎంతో 'సుసంహతం'గా (ఎటువంటి లోపాలు లేకుండ) నడుస్తుందో, స్వేచ్ఛను అంగీకరించినా అంతే సుసంహతంగా నడుస్తుంది. ఎలాగంటే, స్వేచ్ఛావాది ప్రపంచంలో ఏదిఎటుకైతే అది ఎలాగైతే అలా జరుగుతుందని భావించడు. సవేతనుడైన మానవుని ఎంపిక చేసుకొనే 'అవకాశం' ఉందనిమాత్రమే చెబుతాడు. ఒక ఊరు చేరేందుకు నాలుగైదు బాటలు ఉండవచ్చు. ఈ దారులు సంభావ్యతలు (Possibilities) మాత్రమే. వానిలో ఏదారినైన ఎన్నుకొనే స్వేచ్ఛ అతనికి ఉంది. ఎన్నుకొన్నతరవాత ఆ దారి వాస్తవ (Actuality) మవుతుంది. అంతకుముందు అది సంభావ్యత మాత్రమే.

మంచి, చెడూ రెండూ చేయడానికి అవకాశం ఉంది చెడును పరిహరించి, మంచిని చేసినప్పుడే ఆనందం, గొప్పతనం ఉంది చెడు చేయడానికి వీలులేక, మంచి చేయడానికి మాత్రమే వీలుండి, మంచిని మాత్రమే చేస్తే అందులో విశేషం లేదు. లేక చెడునుమాత్రమే చేయడానికి అవకాశం ఉంది. మంచిని చేయడానికి వీలులేకపోతే, చెడు చేసి పశ్చాత్తాపపడటంలో అర్థం లేదు. రెండింటిని సమన్వయపరచాలనుకొనే నియతివాది అంతా మనమంచికే, చెడుగూడ మంచికి మారురూపమే అని సమర్థించుగాని గ్రుడ్డిగా నమ్ముకొంటాడు.

ఇంతవరకు మనం రెండువాదాలను కొంతవరకు చర్చించాము. ఈ రెండువాదాలమధ్య ప్రపంచం చీలిపోయింది. అయితే సిద్ధాంతాదులుగూడ లేకపోలేదు. శాస్త్ర ప్రగతినిచూచి నియతివాదంతో ప్రభావితులైనవారు, 'అంతా నియమితం, స్వేచ్ఛ భ్రమ', 'ఈ ప్రపంచం ఒక నాటకరంగం, అందులో మనమంతా పాత్రలం' అని చెబుతారు. వీరితో మనం ఏకీభవించలేము. అలాగే ఎదిరిపక్షం 'నియతి ఒట్టి భ్రమ, ఉన్నదంతా స్వేచ్ఛే' అంటారు. ఇదీ అంగీకారం కాదు. కేవలం ఇదో, కేవలం అదో కాని సంధిస్థితి ఒకటి ఉన్నదన్న విషయాన్ని విస్మరించరాదు. నియతివాదాన్ని సామాన్యకారణంగా సిద్ధాంతంగా (Universal causation) భావించి, వికల్పాలమధ్య ఏదో ఒకదానిని ఎంపిక చేసుకొనే అవకాశాన్ని స్వేచ్ఛగా భావించి రెండింటిని సమన్వయంచేసే వీలున్నదని గుర్తించాలి వాస్తవానికి ఈ మధ్యే స్థితికి అనుకూలమైనసాక్ష్యాన్ని నేటి భౌతికశాస్త్రం అందిస్తున్నది. అనేకమంది శాస్త్రవేత్తలు, దార్శనికులు దీనిని బలపరిచారు.

నిశ్చయవాదాన్ని స్వేచ్ఛతో సమన్వయపరచడం ఎలా?

'ప్రతిసంఘటన కారణజనితమైంది', అనేది ఆధారంగా ప్రతిశాస్త్రవేత్త ముందుకు సాగుతాడు. అసలు శాస్త్రీయ ఆలోచనకు మూల ప్రాతిపదిక 'ప్రకృతిలో మనం ఆధార పడదగిన క్రమత ఒకటి ఉంది' అనే సూత్రము. దీనిని ఆధారంచేసుకొని శాస్త్రం ప్రగమించింది. వ్యక్తి నడత గూడ కొన్ని పరిస్థితుల కారణంగా నిర్ధారితమవుతుంది. అలా కాకపోతే అతని చర్యలకు అర్థం చెప్పలేము. కనుక వ్యక్తివిషయంలో కాని, ప్రపంచంలో జరిగే సంఘటనల విషయంగాని, మనం ఇచ్చేవివరాలన్నింటికి మూలం నియతియే. అయితే ఈ నియతి లేదా కార్యకారణసూత్రం అనేకరూపాలలో గోచరిస్తుంది. గురుత్వాకర్షణ విద్యుదయస్కాంత, రసాయనిక మొదలైన నియతులున్నాయి. ఒక గోళీ రెండవగోళీని ఢీకొని రెండవదానిని చలింపచేయడంలో ఉన్న కార్యకారణబంధం వేరు. మానవ ప్రవర్తనాపరిధిలో, ప్రవర్తనను వివరించడానికి. భౌగోళిక, జీవభౌతిక, మానసిక, సామాజిక, సాంస్కృతిక కారకాలతో వివరిస్తాము. ఈ కారణతలు పైవాటికంటె భిన్నమైనవి. ఇలా అనేకస్థాయిలలో అనేకరకాల కారణతలున్నాయి.

ఏదో ఒకరూపంలో శాస్త్రం నియతివాదాన్ని ఒప్పుకొన్నా ఆధునికభౌతికశాస్త్రం. 'కేవల యాంత్రిక కారణతకు, లేదా కేవల భౌతిక నియతికి' విముఖత చూపిస్తున్నది. ఉదాహరణకు ప్రముఖ భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్త హైజెన్‌బర్గ్ ప్రతిపాదించిన 'అనిశ్చయతసూత్రం' (Principle of indeterminancy) ఒక 'కణం' యొక్క దిశను వేగాన్ని - రెండింటిని ఏకకాలంలో నిర్దుష్టంగా నిర్ణయించలేము అంటున్నది. పరమాణుప్రవర్తనపై మన పరిశీలనప్రభావం పడుతుంది కనుక (మనం ఒక చెట్టును చూస్తున్నామంటే మన చూపుప్రభావం [కంటి మీదనుంచి ప్రతిబింబించిన కిరణాలు వగైరా] ఆ చెట్టుమీద కొంతైన పడుతుంది) మన పరిశీలన ప్రభావం పడని పరమాణు ప్రవర్తనను తెలుసుకోలేము. అంతేకాక పరమాణు గర్భాన్ని పరిశోధించిన శాస్త్రవేత్తలు గర్భస్థవిషయాల స్వభావాన్ని ఇదమిత్థంగా చెప్పలేకపోతున్నారు. ఈ చెప్పలేకపోవడం వారికి శక్తిలేకపోవడాన కాదు. అసలు విషయం అలా ఉంది. అందుకని అణుగర్భంలో ఉన్నదేమిటో స్పష్టంగా చెప్పలేక దానిని 'అస్పష్టం' (Hazy) అనే పదంతో అభివర్ణిస్తున్నారు. గుళికావాదం (Quantum Physics) ప్రకారం శక్తి ప్రసారం ధారంవలె అవిచ్ఛిన్నం (Continuous) గా కాకుండ మధ్య మధ్య 'ఖాళీ'ల (Discontinuous)తో గుళికలుగ పొట్లాలుగ ప్రసరిస్తుంది. అందువల్ల సాతత్యత ఎగిరిపోతుంది. (ఉదాహరణకు నాతరగతిలో 40 మంది పిల్లలుంటారుగాని 40.14 గురు పిల్లలుండరు ఉంటే 41 మంది, లేదా 42 మంది ఉంటారు అలాగే శక్తి (energy) గూడ గుళికలు గుళికలుగ ప్రసరితమవుతుంది.) ఇటువంటి భౌతికశాస్త్ర దృక్పథంతో ప్రపంచానికి సంబంధించిన దృక్పథమే మారిపోతుంది.

'మనిషికి ఏమాత్రం స్వేచ్ఛను ప్రసాదించని న్యూటన్ విధిర్వాళ యాంత్రికసూత్రాల సాలెగూడునుంచి మనిషిని బయట పడవేసింది. ఇటీవలి భౌతికశాస్త్రం' అన్నాడు హెన్రీ మార్గెనో. ఈవిధంగా న్యూటన్ విధించిన నియతి ఉక్కుచట్రంలోకి కొంత అనిశ్చయతను ఎక్కించడంద్వారా, బహుశ ఈ అనిశ్చయతలలో మనిషికి కొంత మెసులుబాటు లభిస్తుందేమోనన్న ఆశ మోసులెత్తింది.

అణువు అణువుగా ఒకరకంగా ప్రవర్తిస్తే, అదే అణువు వస్తువులో భాగంగ మరొకతీరులో ప్రవర్తిస్తుంది. ఎందుకంటె వస్తువు అవయవి (Whole) గా తన భాగాల (Parts)ను ప్రభావితం చేస్తుంది. ఒంటరిగా ఉన్నప్పుడు మనిషి ఒకరకంగా ప్రవర్తిస్తే పదిమందిలో మరొకతీరులో ప్రవర్తిస్తాడు. కనుక నియతివాదమే 'సర్వం' కాదు. బహుశా అది అమూర్తవిషయాల (Abstract entities)కు మాత్రమే వర్తిస్తుందేమో. 'పెరుగుతున్న విజ్ఞానంతో మానవుని విమానవుని (dehuman)గా చేసి అతడిని బానిసగ చేయవచ్చు. లేదా మనోవిజ్ఞానశాస్త్రాలను మనిషి నియంత్రించడానికి గాక విముక్తుని చేయడానికి, అనుగుణ్యుని (Conformist) గా చేయడానికిగాక నిర్మాణాత్మక వైవిధ్యంతో ప్రవర్తించేవానిగా, ప్రతి ఒక్కనిని తనకు తాను నిర్దేశించుకొన్నపథంలో (Self directed way) పరిణమించేవానిగా, తనను తాను అధిగమించేవానిగ (Self surpassing) చేయవచ్చు' అన్నాడు కార్ల్ రోజర్స్ అనే ప్రముఖ మనోవిజ్ఞానవేత్త.

దీనినిబట్టి చూస్తే మధ్యమవాదులు నిశ్చయవాదాన్ని స్వేచ్ఛతో కలిపి పురుషకారానికి చోటు కల్పిస్తున్నారు. మనిషి కేవలం పరిసరాలకు తల ఒగ్గేవాడే కాదు; అవసరమైతే అతడు పరిసరాన్ని తన అనుకూలంగా మలచుకొంటాడు; సృష్టిస్తాడు; విమర్శిస్తాడు; మారుస్తాడు. ఈ లక్షణాలున్నట్లు మనకు ఎలా తెలుస్తుంది? ప్రతిమనిషికి అవ్యవహిత స్వేచ్ఛ అనుభవంలో ఉంది. దత్తాలైన వికల్పకలలో కొన్నింటిని తాను ఎంపిక చేసుకొంటున్న

ప్రతి ఒక్కరికి తెలుసు. ఒక వికల్పకను ఎన్నుకొన్న తరువాత. దీనినికాక మరొకదానిని ఎన్నుకొంటే బాగుండేది అని జీవితంలో ఒకమారైనా అనుకోనివారు లేరు. మనకు అసలు కొంతస్వేచ్ఛ ఉన్నది కనుకనే మనం దానికి జాగరితులమవుతున్నాము. లేనివస్తువుకు ఎవడూ జాగరితుడు కాలేడు. ఉన్నవస్తువుకే ఎవడైన జాగరితుడు కాగలడు. అంతేగాక మనలో కొంతమంది ఎవరి ఒత్తిడిలేకుండానే ఐచ్ఛికంగానే బాధ్యత వహించేవారున్నారు. పొగడ్తలు, నిందలు, దండనపారితోషికాలు. ఆమోదనిరాకరణలు స్వేచ్ఛనే మరొకసారి నొక్కి చెబుతున్నాయి. పైగా మనిషికి పర్యాలోచనా (Reflective thinking) శక్తి ఉంది. ఒకపని చేయబోయేముందు, 'ఎందుకయ్యా పరుగులు తీస్తావు. నిలబడి మరొకసారి ఆలోచించు' అంటూ ఉంటాము. స్వేచ్ఛ లేకపోతే ఈ పర్యాలోచనకు అర్థం లేదు.

మానవుడు ఆలోచనాపరుడు, ఆత్మచైతన్యవంతుడు (Self conscious) కావడాన ప్రకృతినుంచి తాను పొందిన అనుభవాల ఆధారంగా ప్రకృతి నియమాలను రూపొందించాడు. ప్రకృతినియమాలు మనలను ఏలుతున్నాయన్నప్పుడు, వాటిని మానవుడు రూపొందించాడన్న విషయాన్ని మరువరాదు. దీనికి అర్థం ప్రకృతిలో నియమాలు లేవని కాదు. ఉన్న నియమాలను మానవుడు సూత్రీకరించాడు. కనుక జాగ్రత్తగా పరిశీలిస్తే, యాంత్రిక కారణత (Machanical causation), వ్యక్తికకారణత (personal causation) రెండు ఉన్న ప్రపంచంలో మనిషి నివసిస్తున్నట్లు అర్థమవుతున్నది. ఈ రెండింటిమధ్య వైరుధ్యం లేదు. శాస్త్రీయపరిశోధనలలో ఉద్దేశమూ (Purpose) ఉంది; యాంత్రికత (Machanism) ఉంది. ఈ రెండింటి కలయికయే శాస్త్రీయపరిశోధనలు.

స్వేచ్ఛావాదులు శాస్త్రాలు ప్రతిపాదించే కార్యకారణ సంబంధాన్ని కాదనరు. మనిషికి సంపూర్ణస్వేచ్ఛ ఉన్నదనీ చెప్పరు. వారు చెప్పేది మనిషి కొన్నిసార్లయినా కారణకర్త అవుతున్నాడు. పురుషకారానికి చోటున్నది. ఎంపికకు అవకాశం ఉంది. అయితే ఒకప్రక్క ఆత్మ (Self) పై ఇతరకారకాలు పనిచేస్తూంటే, మరోప్రక్క ఆత్మ ఇతరసంఘటనలను ప్రభావితం చేస్తున్నది. మరోవిధంగా చెప్పాలంటే ప్రతిదీ కార్యకారణబద్ధమే. మనిషి కొన్ని కార్యాలకు కర్త ఎలా అవుతున్నాడంటే, అతడు ఆత్మచైతన్యవంతుడు గనుక. కొన్ని సంఘటనలను తాను నిర్ణయించిన లక్ష్యం వైపు మలచగలుగుతున్నాడు. మానవునికి స్వేచ్ఛ ఉన్నదంటే, అది నియమాలనుంచి, కారణాలనుంచి స్వేచ్ఛ కాదు. తాము ఎన్నుకొన్న లక్ష్యాల దిశలో పనిచేసే శక్తియే స్వేచ్ఛ. ఈ లక్ష్యాలు అనుభవం, ఆలోచన, ప్రేరణ, వాంఛ, అవసరాలవల్ల జనించినవి కావచ్చు కాక. మన ఉద్దేశాలు నెరవేరేట్టు యంత్రాంగాన్ని నిర్దేశించడమే స్వేచ్ఛ. కార్యకారణనియమం లేకపోతే మన ఉద్దేశాలు నెరవేరవు.

మానవుడు విలక్షణమైనవాడు. అతడు చేతనుడే కాదు, ఆత్మచేతనుడు గూడ. చేతనం అంటే పరిసరాలను గుర్తించడం, ఆత్మచేతనం అంటే పరిసరాలనేగాక, తన మనసులోని విషయాలను, తన మనసుచేసే చేష్టలను గుర్తించి మెలగడము. దీనిని మనం ఆత్మవిమర్శగూడ అనవచ్చు. అంటే తనకు తానే కర్త కర్మ అనిగూడ తెలుసుకోగలుగుతున్నాడు. ఈ ఎరుకే లేకపోతే స్వేచ్ఛే లేదు. విజ్ఞానం, ఆత్మవికాసం పెరిగేకొలది సంభావ్యతలు ఎక్కువ కనిపిస్తాయి. స్వేచ్ఛపరిధి పెరుగుతుంది. ఒకే సంభావ్యత ఉన్నప్పుడు ఎంపికస్వేచ్ఛ ఉండదు.

సంపూర్ణస్వేచ్ఛ ఎవరికీ లేదు కాని కొంత స్వేచ్ఛ ప్రతి ఒక్కరికీ ఉంది. మన చర్యలలో ఎక్కువ మేరను వసతి, నీడ, తిండి నిర్దేశిస్తాయి. ఈ అవసరాలతో బాధితులైన వారికి జీవితలక్ష్యాల ఎంపికలో స్వేచ్ఛ మృగ్యము. ఆతరవాత మన అలవాట్లు, సామాజిక ఒత్తిడులు మన ప్రవర్తనను మూసలలో మలుస్తాయి. అందువలన ఎక్కువమందికి సచేతనంగా ఆలోచించి ఎంపిక చేసుకొనే సందర్భాలు ఉండవు. స్వేచ్ఛ, ఆత్మవికాసం విజ్ఞానంమీద ఆధారపడి ఉంటాయి గనుక. అసలు స్వేచ్ఛ ఉన్నదా లేదా అని కాక మనిషికి ఏమేరకు స్వేచ్ఛ ఉన్నది? అని ప్రశ్నించుకోవాలి.

ఆత్మాభివ్యక్తీకరణం స్వేచ్ఛ. అయితే ఈ ఆత్మాభివ్యక్తీకరణం కొన్ని పరిమితులకు లోబడి ఉంటుంది. విజ్ఞానం పెరిగేకొలది పరిమితులు కుంచించుకుపోయి స్వేచ్ఛ బహుళమవుతుంది.

# మహాభారత దర్శనము

## భారతీప్రియ

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్ ॥

శ్రీమన్ మహాభారతము స్థూల దృష్టితో పరిశీలించినపుడే కొన్ని విశేషార్థములు గోచరించుచు రచింపబడినదని తోచును. మరి సూక్ష్మ దృష్టితో చూడగలవారికి అందలి అంతరార్థములన్నియు పరమార్థములుగా దర్శనమిచ్చును. అట్టిసూక్ష్మదృష్టులకు సూత్ర ప్రాయమైనది విరాటపర్వము

ఇందు విరాటరాజు కొలువులో పాండవులు అజ్ఞాతవాసము చేయుట బహుచమత్కార మైన సన్నివేశము. ఈ పర్వమునందలి సకల సన్నివేశములు వ్యక్తుల ప్రవర్తనములు అన్నియు విరాట్పురుషుని యందు లీనమైన జీవుని జీవితమును నిరూపించుచున్నవి. అపుడు జీవుడు విరాట్పురుషునితో తనకు సన్నిహిత సంబంధము కలదని తెలిసికొని జీవితముపై జయవిశ్వాసము కలిగి జయము పొందును. కనుకనే శ్రీమహాభారతమును "జయము" అని వేదవ్యాస మునీంద్రుడు పేర్కొనెను. మనమిపుడు ఆ కృష్ణద్వైపాయనుని జయదర్శనానుభూతిని పొందుదుముగాక!

1. పాండవులు అజ్ఞాతవాసము చేయుటకు నిశ్చయించినపుడు తమ ఆయుధములన్నియు ఊరివెలుపల శ్మశానము నందున్న శమీ వృక్షముపై కట్టకట్టి పెట్టుట దానిపై పశుకళేబరము, మానవకళేబరము పైకప్పుగా కట్టుట.

2. విరాటరాజు కొలువులో ధర్మరాజు కంకభట్టు అను పేరుతో అక్షక్రీడావినోదకారుడుగాను, భీముడు వలలుడు అను పేరుతో పాచకుడుగాను, అర్జునుడు బృహన్నల పేరుతో నాట్యాచార్యుడుగాను, నకులుడు దామగ్రంధి పేరుతో అశ్వశిక్షకుడుగాను, సహదేవుడు తంత్రీపాలుడు అను పేరుతో గోపాలకుడుగాను, మాలిని తనకు ఐదుగురు గంధర్వపతులు గలరని చెప్పట, ద్రౌపది, మాలిని అను పేరుతో సుధేష్ణవద్ద సైరంధ్రిగాను చేరుట. వీరందరు పాండవులవద్ద ఆయా పనులు చేయుచున్నట్లు చెప్పట.

3. కీచకుడు మాలినియందు వ్యామోహ పడుట.

4. సుధేష్ణ మద్యము తెచ్చుటకై కీచకుని యొద్దకు మాలినిని పంపుట.

5. విరాటరాజు కొలువులో వలలుడు శమీవృక్షమును విరాటుని శిక్షించుటకై పెకలింపబోగా ధర్మరాజు వారించుట.

6. కీచకుని వలలుడు నర్తనశాలలో రాత్రి వేళయందు సంహరించుట.

7. ఉత్తరకుమారుని అసీరలక్షణము, బృహన్నల గాండీవము గ్రహించి, తాను అర్జునుడనని ఉత్తరునకు తెలుపుట. ఉత్తరుని సారధ్యముతో తాను కౌరవులనోడించి గోగ్రహణము చేయుట.

8. విరాటరాజపుత్రిక యైన ఉత్తరను అర్జునుడు తాను స్వీకరింపక తనకుమారుడైన అభిమన్యునకిచ్చి పెండ్లి చేయుట.

9. ఈ విధముగా ఉత్తరాభిమన్యుల వివాహముతో పాండవులు అజ్ఞాతవాసము చేయుటలో జయము పొందుట.

ఈ మున్నగు సన్నివేశములు బహువిధచమత్కారములు గలవై సహజస్ఫూర్తిగల రహస్యార్థములతో భారతమునందు కృష్ణద్వైపాయనునిచే చెప్పఁబడినవి. వాని విశేషార్థములు మనమును విందుముగాక.

ఈ విరాటపర్వము యొక్క పరమార్థము పట్టుబడవలెనన్నచో మనకు చక్కగా నిద్రపోవుట చేత కావలెను. కలలుగనుచు కలత నిద్రలో నున్నచో నిద్రపోయి ప్రయోజనము లేదు. నిద్రలో కూడ మరల మనము, మన స్నేహితులు, మనబంధువులు, మన రాగద్వేషములు ఇవియే ఉన్నచో నిక అజ్ఞాతవాసమే మున్నది. మనము నిద్రించునపుడు, మన పేరు, మనరూపము, మనహోదా, మనవ్యక్తిత్వము, అన్నింటిని విడిచిపెట్టి నిద్రింతుము. ఇదియే అజ్ఞాతవాసము. ప్రశాంతముగా నిద్రించునపుడు మనలో నేనున్నాను అను భావము ఎక్కడ మిగిలియున్నదో, ఆ భావము ఎక్కడ నిలిచియున్నదో, అప్పుడు మన ఇంద్రియశక్తులన్నియు ఏమైనవో పరిశీలింపవలెను.

మనము గాఢనిద్రలో నున్నపుడు కాళ్లు, చేతులు కదలవుగాని గుండె కొట్టుకొనుచునే యుండును. ఊపిరితిత్తులు చేయుచునే యుండును. జీర్ణకోశము పనిచేయుచునే యుండును. ఇవి పనిచేయుట మన అనుమతితో సంబంధించికాదు. ఆయా అవయవములందు లోపలనున్న ఖాళీ ప్రదేశము మనకంటికి నల్లని చీకటిగా (కృష్ణ ద్వీపము) కనిపించినను, అందు నిత్యము ఉదయించుచున్న విరాట్పురుషుని అవతార వ్యక్తివలన జరుగుచున్నది. ఆ వ్యక్తినే పరాశరతనయుడైన వ్యాసునిగా తెలిసినవారు చెప్పిరి. కనుక ఈ విరాటపర్వ వృత్తాంతమంతయు వ్యాసదర్శనముగా చెప్పబడినది. మనము నిద్రించునపుడు 'నేనున్నాను' అను భావము హృదయమునందు మిగిలియుండును. కాని ఆ హృదయము పనిచేయుట మన యిష్టముపై ఆధారపడి లేదు. కనుక రాత్రి నిద్రపోవునపుడు మన గుండెను నిత్యము ఎవని అనుగ్రహము వలన పనిచేయుచున్నదో వాని యందు సమర్పింపవలెను. అతడే విరాట్పురుషుడు. అతడే విరాటరాజు. అని చెప్పబడెను. మనము నిద్రించునపుడు మన వ్యక్తిత్వమును విడిచిపెట్టెదము గనుక మారుపేరుతో అనగా అసలుతత్త్వముతో పరమాత్మయందు సమర్పించుకొనుటయే అజ్ఞాతవాసముగా చెప్పబడినది. అప్పుడు దేహభావము ఉండదు గనుక దేహములు నశించు స్మశానముగా చెప్పబడినది. అచ్చటనున్న చెట్టు శమీవృక్షము అగ్ని తత్త్వముగల జీవుడు నిద్రలో జీవుని శరీరము కళేబరము కనిపించుచు వ్యక్తిస్పృహ లేకుండ యుండును, గనుక పాండవులు ఊరి వెలుపల శ్మశానములో శమీవృక్షముపై కట్టిన ఆయుధములపైన మృతకళేబరము కూడ కట్టబడినట్లు చెప్పబడినది. నిద్రలో మనలోని పశుభావనలన్నియు సమసిపోవును. కనుక ఒక పశుమృత కళేబరము కూడ ఆయుధములపై పొదివిరని చెప్పబడినది. పంచపాండవులనగా మన యొక్క పంచేంద్రియములే. వారి ఆయుధములు ఇంద్రియశక్తులే. ఈ ఇంద్రియశక్తులన్నియు నిద్రలో నాడుల నాశ్రయించి యుండును. గనుక అవి చూచువారికి నాడులవలె నుండు పాములుగా కన్పించునని చెప్పబడినది. మనము నిద్రించునపుడు దేహభావమును విడిచిపెట్టి విరాట్పురుషునిలో లీనమగుదుము. కనుక ముందుగా పాండవులు శ్మశానమున శమీవృక్షముపై ఆయుధములు భద్రపరచి విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసమునకు చేరిరని చెప్పబడినది.

మానవ శరీరము మనమనుకొనుచున్నట్లు ఒక వ్యక్తికి నిలయము కాదు. అనేక దేవతలకు నివాస స్థానము. జీవుడు విరాట్పురుషుడైన దేవుని అంశగనుక అతనియందును సమస్త దేవతాంశములు పనిచేయుచుండును. పగలు మేల్కొనియున్నపుడు మానవుడు ఆయా దేవతా తత్త్వములను గమనింపలేక ఇది నా కంఠము. ఇవి నా ఊపిరితిత్తులు. ఇది నా పొట్ట. ఇది లింగస్వభావము. ఇది నా దేహము అని అహంకరించును. కాని మూగవాడు మాటలాడలేనప్పుడు, ఉబ్బసపురోగి గాలి పీల్చలేనప్పుడు, అజీర్ణ వ్యాధిగ్రస్తుడు కడుపునొప్పితో బాధపడుతున్నప్పుడు, దంపతులు సంతానము కలుగక పరితపించుచున్నప్పుడు, ఈ దేహము ఎట్లు వచ్చినదో అట్లే పోవుచున్నప్పుడు, (మరణము) మానవుడు ఎట్టి సమాధానమును చెప్పలేక పోవుచున్నాడు. కాని వివేకవంతుడై గుర్తింపగలిగినప్పుడు, తాను నిద్రించినపుడును తన అనుమతితో సంబంధము లేకుండ పనిచేయుచున్న యింద్రియములను చూచి అవి దేవతా ప్రజ్ఞలని గుర్తింపగలుగును. పగలు ఆయాపేర్లతో పిలువబడిన అవయవములు రాత్రియందు అసలు తత్త్వములుగా మారి పనిచేయుటయే పాండవుల అజ్ఞాతవాసముగా చెప్పబడినది. ఇందలి వారి పేరులన్నియు ఆయా దివ్యతత్త్వములను తెలుపుచున్నవి. అవి యిచట వివరింపబడును.

**1. ధర్మరాజు :-**

ఇతని పేరు కంకుడు. కం అనగా శిరస్సు కంక అనగా శిరస్సుకలవాడు. అనగా కంఠ తత్త్వము కలవాడు అని అర్థము. అచటనే జీవుని వాగ్రూపమునకు బాహ్యరూపమైన స్వర [illegible] యున్నది. అటివాక్ తత్త్వము కలవాడు గనుకనే విరాటునితో వినోదములాడుచు కాలక్షేపము చేసెను. పాచికలాట అనగా అక్షక్రీడ యోగశాస్త్రము ననుసరించి పంచేంద్రియ కేంద్రములను చక్రములుగా గుర్తించినపుడు వానిమధ్య ప్రయాణము అక్షక్రీడ అనబడును. అందువలన అతడు విరాటునితో పాచికలాడినట్లు చెప్పబడినది.

అక్షములనగా ఇంద్రియములని పరమార్థము. సృష్టిధర్మము ననుసరించి దివ్యచైతన్యము ఇంద్రియములతో వర్తించుటయే అక్షక్రీడ.

**2. భీముడు :—**

ఇతని పేరు వలలుడు. వలనము అనగా తిరుగుట. ఇతడు వాయుపుత్త్రుడు గనుక వాయుతత్త్వమైన ప్రాణశక్తి అని అర్థము. ఈ ప్రాణశక్తియే మనము తిను ఆహారపదార్థములను కడుపులో పచనము చేయుచున్నది గనుక వలలుడు వంటలవాడుగా నుండెనని చెప్పబడినది.

**3. అర్జునుడు :—**

బృహన్నల అనగా కొంత వ్యక్తమగుచు మరి కొంత అవ్యక్తముగా నున్న అగ్నితత్త్వము అని అర్థము. బృహత్ + నల బృహన్నల. బృహత్ = బృంహణమై వ్యక్తమగుట, నల = అనగా బంధింపబడి వ్యక్తము కాపోవుట.

ఆకలి ఎంత వ్యక్తమైనను పైకి కనబడదు. దేహములోనే అవ్యక్తమై యుండునుగదా! ఇదియే మన పొట్టలో ఆకలిగా పనిచేయుచున్నది. ఆకలివేసినపుడు అణువణువున నీరసము కలుగును. ఇట్లు ఆకలి అను అగ్నిరూపము [illegible]

అవ్యక్తముగా నుండుచు జీవుని స్వభావమును దేహముకంటె వేరైనదిగా నిరూపించు అగ్ని తత్త్వమే బృహన్నల. కనుకనే యితడు ఉత్తరకు నాట్యము నేర్పినట్లు చెప్పబడినది. ఉత్తర అనగా జీవుని దేహమునుండి దాటి వర్తించు స్వభావము. ఇది విరాట్పురుషునిచే ఇవ్వబడినది, గనుక ఆమె విరాటుని కూతురుగా చెప్పబడినది. ఈ స్వభావము జీవ తత్త్వముచే అణువణువున (అకలివలె) స్పందించుచు. ఇదియే ఉత్తరకు బృహన్నల నాట్యము నేర్పుట. ఈ స్పందనము దేహమునందు జరుగుచున్నది గనుక అదియే నర్తనశాల. నిద్రలో జీవుడు ప్రత్యేక వ్యక్తిత్వమును కలిగియుండుట లేదు గనుక బృహన్నల పౌరుషహీనుడుగా చెప్పబడినాడు.

4. నకులుడు :—

దామగ్రంథి. ఇతడు అశ్వశిక్షకుడుగా నుండెను. అశ్వము జీవుల లింగ తత్త్వమునకు సంకేతము దామగ్రంథి అనగా త్రాడుయొక్క ముడులుకలవాడు. లింగతత్త్వముచే ఉత్పత్తియగు తరతరముల ప్రజలు కలవాడు అని అర్థము.

5. సహదేవుడు :-

తంత్రీపాలుడు. తంత్రమనగా దేహవ్యాపారము. దానిని నిర్వర్తించువాడు. అనగా దేహమును నిల్పువాడు. దేహమునకు గోవు సంకేతము కనుక ఇతడు గోపాలకుడుగా నుండెను. సహదేవుడు దేహముతో సహా (కూడ) ఉండు దేవుడు. దివ్యప్రజ్ఞ.

6. ద్రౌపది :—

మాలిని అనగా మాలకలది. పంచేంద్రియములను ఒక పుష్పమాలికగా కూర్చుదారము వంటిది మనస్సు. అట్టి మనస్సునకు సంకేతమే ద్రౌపది. కనుక ఆమె పేరు మాలిని అని చెప్పబడినది. ఆమెయు ఉత్తరకు మాలాలంకరణ చేయును. అనగా జీవస్వభావమునకు ఇంద్రియసుఖములను సమకూర్చుట.

పీరు పాంచాలి, ధర్మరాజుల కొలువులో నున్నవారమని చెప్పుకొనుట, అనగా నీ దేవతాప్రజ్ఞలు పంచేంద్రియములకు సంబంధించిన పనియు, ఇప్పుడని అజ్ఞాతవాసమున (దేహనిద్ర) ఉండుటచే ఇటు వర్తింతుమనియు చెప్పుట.

మాలిని తనకు ఐదుగురు గంధర్వపతులు గలరని చెప్పెను. సృష్టి వ్యక్తముకాక పూర్వము విరాట్పురుషునిలో లీనమైయున్న దేవతలను సాధ్యులు అందురు. ఇదియే "యత్ర సాధ్యాస్సంతి దేవాః" అని పురుషసూక్తమున పేర్కొనబడినది. సృష్టిని సాధించువారు గనుక సాధ్యులు అని వీరికి పేరు. వీరినే గంధర్వులు అని కూడ అందురు. అందువల్లనే మాలిని విరాటుని కొలువులోనున్న తన భర్తలనుద్దేశించియే ఐదుగురు గంధర్వభర్తలు గలరని చెప్పినది.

3. ఇట్లు పాండవులు అజ్ఞాతవాసములో నుండగా కీచకుడు అను విరాటుని బావమరిది మాలినియందు వ్యామోహపడెను. విరాటుడు విరాట్పురుషుని ప్రతీక గనుక మానము వహించుచు. అతని ప్రకృతి సుధేష్ణ, ఆ ప్రకృతి యందు పుట్టు వికారము కీచకుడు. ప్రకృతి యందు మానవుల మనస్సులు వికారములకు లోనగుటయే కీచకుడు మాలినిపై వ్యామోహపడుట. విరాటుని రాజ్యముమత్స్య దేశము అనగా మదరూపముగా ఏర్పడినది. ఇదియే పరమాత్మని సంకల్పము భౌతిక శరీరము దాల్చుట. అప్పుడా శరీరమునందలి జీవుడు తనకు శరీరముపై అధికారము కలదని విఱ్ఱవీగును. ఇదియే కీచకుడు మత్స్యరాజ్య

ముపై కారము చెలాయించుట, దేహము నిచ్చినది పరమాత్మయైనను దేహము రూపొందుట ప్రకృతి ధర్మముగా జరుగుచున్నది. గనుక అందలి మనస్సు గుణవికారములకు లోనైనను పరమాత్మ పట్టించుకొనుట లేదు. అట్లే సుధేష్ణ వద్దనున్న మాలినిని కీచకుడు అల్లరి పెట్టుచున్నను విరాటుడు మాటాడలేదు. లోకములో ఆత్మహత్యలు చేసుకొనువారు తీవ్రాలోచనలచే పిచ్చిపట్టించుకొనువారు కీచకబాధితులే. అంతేకాదు మాలినిని తరుముకొనుచు కీచకుడు విరాటుని కొలువులోనికి ప్రవేశించినను అతడేమియు అనలేకపోయెను. సత్కర్మాచరణము లేక నిరంతర నీచభావ పీడితులైన వారిస్థితి యిట్టిదే. వారిని సత్కర్మాచరణమే రక్షింపగలదుగాని మరి పరమాత్ముడుకూడ రక్షింపలేడు. కాని తాత్కాలికముగా ఉపశమనము గావింపగలుడు. అట్లే విరాటుడును కీచకుని ఓదార్చి ఉపశమింపజేసి పంపివైచి మాలినిని ప్రమాదమునకు లోనుగాకుండ తప్పించెను.

4. అట్లే సుధేష్ణకూడ మాలిని మానసంరక్షణమునకై ప్రయత్నము చేయకపోగా, కీచకుని వద్దకే మద్యము తెమ్మని పంపెను. పరమాత్ముడు ఉదాసీనుడై యుండగా అతని ప్రకృతి జీవుల మనస్సులను ఇంద్రియార్థముల కొరకు ఆయా వస్తువుల మీదికి పంపునదిగా నున్నది. మనము దైవప్రార్థనకై కూర్చొని యుండగా మన మనస్సు మన విరోధులను గూర్చి ఆలోచించుచుండును. దీనికి ప్రకృతి ప్రేరేపణయే కారణము. అందువల్లనే సుధేష్ణయే మాలినిని మద్యము కొరకై తమ్ముని యొద్దకు పంపినట్లు చెప్పబడినది. మన మనస్సులో ఇతరులపైనున్న దుష్టభావములు పోవువరకు విరోధులుగా నుండుటయే గాక మన మనస్సు వారిమీదికే పోవుచుండును. ఇది జీవుల సంపూర్ణ మనశ్శాంతికై పరమాత్ముడు ఏర్పాటు చేసిన ప్రకృతి పద్ధతి. సంఘములో కూడ ఒక దుష్టుడు ఉన్నపుడు అందరును వాని దుష్టచేష్టలను గూర్చియే చర్చించుచుందురు. ఆ దుష్టుడు అంత మొందువరకు ఆ చర్చలు కొనసాగుచునే యుండును. అపుడు కొందరు సమర్థులు పూనుకొని ఆ దుష్టుని అంతము చేయుదురు. అపుడు సంఘమునకు సంపూర్ణ శాంతి లభించును. అట్లే సుధేష్ణ మాలినిని కీచకుని యొద్దకు పంపించినది. అతడామెను బలాత్కరించినాడు. అపుడు వలలుడు పూనుకొని వానిని నర్తనశాలలో తుదముట్టించెను. అందువలన కీచకుడు వాని మృత్యువునకే మాలినిపై మోహపడెను. ప్రకృతిలో దుష్టుడు నశించుటకు ఏర్పరుపబడిన పద్ధతి ఇదియే.

5. కీచకుడు ద్రౌపదిని తరుముకొనుచు విరాటరాజు కొలువులోనికి వచ్చెను. అప్పటికిని ఆమె అందకపోగా కాలితో తన్నెను. అప్పుడు విరాటరాజు ఏమియు చేయలేని వాడైనప్పటికిని మాలినిని జాలితో చూచుచు కీచకుని ఓదార్చు మాటలు పలికి పంపివైచెను. దైవరక్షణమనగా ఇట్లుండును. విరాటరాజు పాండవులకు రక్షణ విషయమై ఎట్టి హామి యివ్వలేదు. అందువలన అతడసమర్థుడని తోచును. కాని నిజముగా అతడు అసమర్థుడుగాడు. అట్లే అయినచో కీచకుడు కొలువులో విరాటుని మాటలకు ఏల మరలిపోవును. వాని ఔద్ధత్యము ఇతరులకు (సుధేష్ణకు కూడ) ఆపజాలినది కాదుగదా! ఇదియే భయంకర వ్యాధులు వచ్చినవారు బ్రతికి బయటపడుట చూచినపుడు, భయంకర ప్రమాదము కొద్దిలో తప్పిపోయినప్పుడు విరాట్పురుషుని సామర్థ్యము వెల్లడియగును. ఇట్టిది నిర్మలమనస్కులైన పిల్లలలో అనుభవసిద్ధము.

పిల్లవాడు ప్రకృతితో ఆడుకొనుచున్నప్పుడు అది పడినను వానికి దెబ్బతగులక కొద్దిలో తప్పిపోవును. అట్లే కుక్క మొదలగు జంతువులతో ఆడుకొనునప్పుడును అవి వానినేమి చేయవు. కాని ఎదిగిన వయసులోనున్న మనము ఆ ప్రమాదము లన్నిటిని దేహమునకు సంబంధించినవిగా భావించి వ్యాధి గ్రస్తులకు దేహ చికిత్స చేయుదుము. నిజమునకు మనలను బాధించునది వ్యాధికాని దేహముకాదు.

6. అజ్ఞాతవాసమున ప్రధానమైన ఘట్టము కీచకవధ. భీముడు నర్తనశాలలో కీచకుని సంహరించును. అందుకొరకై ద్రౌపది కీచకుని రాత్రివేళ నర్తనశాలకు రమ్మని సంకేతము చెప్పును. నర్తనశాలయనగా జీవుని స్వభావము నర్తించు (ప్రవర్తించు) దేహమే. అందు ఉత్తరయనగా దేహముకంటె వేరై దేహమునందు నర్తించు జీవుని ప్రజ్ఞాశక్తి. ఆ జీవుడే అగ్నిరూపమైన బృహన్నల పగటిపూట జీవుని సంకల్పము ననుసరించి ప్రజ్ఞ పనిచేయుచుండును. ఇదియే పగటిపూట బృహన్నలయొద్ద ఉత్తర నాట్యము నేర్చుకొనుట రాత్రిపూట జీవుని సంకల్పముండదు గనుక ప్రజ్ఞ పనిచేయదు. అందువలన దేహము నిశ్శబ్దమైన నర్తనశాల వలె నుండును. అందు పనిచేయునది పంచేంద్రియములను పనిచేయించు మనస్సే అనగా సైరంధ్రియైన మాలినియే. ఆమె కీచకుని అర్థరాత్రి నర్తనశాలలోనికి రమ్మని సంకేతము చెప్పినది. కీచకుడనగా ప్రశాంత నిద్రకు జీవుని ప్రశాంత జీవితమునకు భంగము కలిగించువాడు. సంస్కృత భాషలో కీచకమనగా వెదురు బొంగు అని అర్థము. "కీచ్-కీచ్ మని శబ్దము చేయునది" అని వ్యుత్పత్తి మన వెన్నెముక వెదురుబొంగు వంటిది. అందున్న వెన్ను పాములో ప్రాణ సంచారము జరుగుచుండును. ఈ సంచారము ఏయే ఇంద్రియములకు సంబంధించి యుండునో ఆయా ఇంద్రియములకు సంబంధించిన పనులు జరుగుచున్నట్లు కలగా నిద్రలో కనిపించును. ఒక్కొక్కపుడు ఆయా ఇంద్రియములకు సంబంధించిన కలవరపాటులో మనస్సు పీడింపబడినపుడు ఆ మనస్సు ఆ ఇంద్రియమునకు సంబంధించిన ప్రజ్ఞను ఈ కలవరపాటును దేహమునందొక చోట కూర్చును. కీచకుడు ప్రాణ సంచారమునకు సంబంధించిన కలవరమును కలిగించినవాడు కనుక ద్రౌపది వాయుపుత్రుడైన భీముని నర్తనశాలకు పంపినది. రాత్రి నిద్రలోనే యిట్టి కలవరపాటు కలుగును. గనుక రాత్రివేళ కీచకుని ద్రౌపది రమ్మనినట్లుగ చెప్పబడినది. మనకొక పీడకల వచ్చినపుడు మనలను ఎవరో గొంతుపిసికి చంపుచున్నారని కలవచ్చినపుడు మనకు మెలకువరాగా మన ప్రాణశక్తి చేత పీడకల తొలగిపోవును. ఇదంతయు నిశ్శబ్దముగా ఎవ్వరికీ తెలియకుండ జరుగును. కావున ప్రాణస్వరూపుడైన భీముడు పిడికిలి పోటులతో కీచకుని నిశ్శబ్దముగా సంహరించినట్లు చెప్పబడినది. ఈ విధముగా నిద్రలో పీడకలనుండి మెలకువ వచ్చుట జీవితములో మృత్యుభయము లేకుండ ప్రశాంతముగా జీవింపగలుగుట కీచకవధగా వర్ణింపబడినది.

7. విరాటరాజు జీవితము చమత్కారముగా చిత్రింపబడినది. ఆయన అసమర్థుని వలె నుండగా అతని కొడుకు ఉత్తరుడు పిరికిపందగా ప్రసిద్ధుడై యున్నాడు. ఉత్తరుని తత్త్వము తెలియవలెనన్నచో ఉత్తర తత్త్వము తెలియవలెను. ఉత్తర అనగా జీవుని దేహముకంటె వేరై పనిచేయు ప్రజ్ఞాశక్తి. మనము మాట్లాడునపుడు, ఆలోచించునపుడు, సంకల్పించునపుడు ఈ ప్రజ్ఞ మనకు తెలియుచుండును. ఇట్లు దేహము నుత్తరించి (దాటి) పనిచేయు

టలో తత్తరపడి వెనుకంజవేయు అసమర్థ జీవుడే ఉత్తరుడు. మనము దేహము విడిచి పెట్టినను మరియొక దేహములోనికి తప్పక ప్రవేశింపగలము అను సృష్టి సత్యము ప్రతి నిత్యము రాత్రి దేహస్పృహ లేక పరుండి మరు నాడు మేల్కొనుచుండుట వలననే అనుభవ సిద్ధముగా ఋజువగుచున్నది. అయినను దేహము ఉత్తరించి జీవించుటకు భయపడు వాడు ఉత్తరుడు. మొదట మొదట దేహ జ్ఞానము ఆత్మజ్ఞానము, లేనప్పుడు దేహభావము కలిగిన జీవుడు తానే దేహమును రక్షించు కొనగల్గినట్లు భ్రమపడి ప్రగల్భములు పలు కును. ఇదియే ఉత్తరుడు రథికుడుగా నుండి ప్రగల్భములు పలుకుట. అపుడు అసలు దేహ మును నడిపించుచున్న అగ్నిస్వరూపుడైన జీవుడు సారథిగా మాత్రమే తోచును. ఇట్లుం డగా భీష్మ, ద్రోణ, కృపాది ధన్వి నికరాభీల మైన కౌరవసైన్యమును చూచినపుడు మన స్సుతో బాటు శరీరముకూడ వణకును. ఇదియే ఉత్తరుడు భయపడుట. అపుడర్జునుడు శమీ వృక్షము వద్దకు కొనిపోయి అచ్చటి గాండీవ మును స్వీకరించి తాను అర్జునుడనని ఉత్తరు నకు తెలిపెను. అనగా ప్రశాంతిపొంది మన స్సును వశపరచుకొని ఆత్మజ్ఞానమును పొందుట. అప్పటినుండి ఆత్మస్వరూపుడైన తాను దేహ మునకు రథికుడుగా నుండును. అంతకుపూర్వము భయపడు జీవుడు ఇపుడు నిర్భయముగా జీవి తము కొనసాగించుటకు నిశ్చయించును. ఇదియే ఉత్తరుడు. అర్జునునకు సారథ్యము వహించుట. గోగ్రహణ మనగా గోవులను పట్టుకొనుట, గోవు అనగా దేహము. మనము పెట్టు నానా గడ్డితిని మనకు సాధువుగా తన శక్తిని పాలవలె ధారపోయునది కనుక దేహ మును గోవు యని వేదర్షులు వరించిరి. మనము చేయు అనేక కార్యములే కౌరవసేన, కురు వంశమువారు అనగా మనము చేయు పనుల వలన ఏర్పడు ఫలితములు. ఎంతోదూరము నడిచినచో కాళ్లులాగును. తీవ్రముగా ఆలో చించినచో బుర్ర వేడెక్కును. మితిమీరి తిన్నచో అజీర్ణము చేయును. ఇట్టి కార్యఫలి తములు దేహమును పట్టి పీడించుచున్నవి కదా! ఇదియే కౌరవసైన్యము గోగ్రహణము చేయుట అందులోని జీవుడు ఉత్తరుడై భయ పడువాడైనపుడు గోగ్రహణము మిక్కిలి భయంకరముగా నుండును. ఆత్మజ్ఞానముచేత దేహమునకు ప్రమాదము లేదని గ్రహించి తనకు అపజయము లేదని ధృఢనిశ్చయుడై ఆత్మకు సారథ్యము అప్పగింపగా చేసిన కార్య ఫలితములన్నియు ఆత్మజ్ఞానముచేత నిస్తేజము లయి పోవును. గనుక దేహము దెబ్బతినదు. మరల స్వాధీనములోనికి వచ్చును. ఇదియే అర్జునుడు ఉత్తరుడు సారథిగా భీష్మాదికురు వీరు లను జయించి గోవులను మరలించినట్లు చెప్ప బడినది.

8. ఈ విధముగా పాండవులు విరాటునకు పరిచయముకాగా అతని పుత్రికయైన ఉత్తరను అర్జునుని పెండ్లాడుమని కోరెను. అపుడర్జునుడు తన కుమారుడైన అభిమన్యునకు చేసుకొనెను. అనగా పరమాత్మయైన విరాట్పురుషుని సన్ని ధిలో పంచేంద్రియజ్ఞానము కలుగగా జీవునకు విరాట్పురుషుడు తన ప్రజ్ఞను అనుగ్రహించును. అప్పుడతడు ఆ ప్రజ్ఞతో నిర్భయముగా జీవితము గడుపును. ఇది పరమార్థముగా ఒకే శరీరము నందు జరుగుచున్నను అప్పటికి దేహములో కలిగిన మార్పు అనగా అజ్ఞాతవాసము పూర్తియై గోవులను మరలించి తెచ్చుట అనగా అజ్ఞాన

జీవితము పూర్తియై విరాట్పురుషుని దేహమును దుష్కార్యఫలితములనుండి తప్పించి పరమాత్మ సేవకే అంకితమొనర్చుట అప్పటినుండి ఇతని ప్రజ్ఞ వేరుగా పనిచేయును. సృష్టికి అభిముఖముగానున్న మహాజ్ఞానము అతని అనుభవమునకు వచ్చును. ఇతని జీవితమునకొక దీక్షయలవడును. అతడే అభిమన్యుడని చెప్పినారు. దేహమును దాటిపోగల అతని స్వభావమే ఉత్తర గనుక ఆమెను అభిమన్యునకిచ్చి వివాహము చేసినట్లుగ చెప్పబడినది. కనుకనే అతడు పద్మవ్యూహమును ఛేదింపగలిగెను. అనగా ఇంద్రియ వికాసమును పొందిన దేహమును దాటి పరమాత్మస్థితిని పొందగలిగెను. అతని కుమారుడు పరీక్షిత్తుగా చెప్పబడెను. పరీక్షిత్తు యనగా పరీక్షించి చూచువాడు, అనగా సకల జీవులయందును పరమాత్మను చూడగలిగినవాడు అని అర్థము. ఉత్తర అను ప్రజ్ఞచేత తాను దేహముకంటె వేరైన పరమాత్మనని ఎవడు తెలుసుకొనగలుగుచున్నాడో అతడు అందరి దేహములకంటె వేరుగానున్న పరమాత్మను చూడగలడుగదా! అందువలన ఉత్తరను అభిమన్యునికిచ్చి వివాహము చేసినట్లు చెప్పబడినది.

9. ఈ విధముగా విరాట్పురుషుని అనుగ్రహముగా లభించు ఉత్తర రూపమైన ప్రజ్ఞ మన జ్ఞానమునకు తోడుకాగా మనయొక్క అజ్ఞానజీవితము పూర్తియగును. అప్పటినుండి ఆ పరమాత్మయే మన జీవితకార్యములలో విజయము చేకూరుటకు స్వయముగా ప్రయత్నించును. ఇదియే ఉద్యోగపర్వము. శ్రీకృష్ణుడు పాండవుల రాజ్యముకొఱకై రాయబారమునకు పోయినట్లు అది విఫలమైనను యుద్ధమున విజయము సమకూర్చినట్లు చెప్పబడినది. ఈ విధముగా మనము పరమాత్మను తెలుసుకోలేని అజ్ఞానములో నున్నను భగవంతుని అనుగ్రహముచే జీవితమున కార్య విజయము పొందుటయే పాండవులు అజ్ఞాతవాసమును విరాటుని కొలువులో విజయవంతముగా పూర్తిచేసి ఉత్తరాభిమన్యుల వివాహము జరిపించినట్లుగా వర్ణింపబడినది. ఈ విధముగా మన అజ్ఞాన జీవితము పూర్తియై భగవంతుని అనుగ్రహమునకు పాత్రులమై నిత్యము నానందము ననుభవించుచుండుటనే విరాటపర్వము చదివినచో వానలు కురియునను సంప్రదాయముగా వాడుకలో నున్నది. ఇది యోగులకు, సమాధిస్థితిలో సుధాధారాసారముగా అనుభవములోనున్నది. గ్రామమునందు వానలు కురియుట భక్తి శ్రద్ధలతో నిఃస్వార్థబుద్ధితో చదివిన వారి అనుభవమున నున్నది. ఇట్టి ఆనందము మన జీవిత క్షేత్రమునందు వర్షించుగాక

శ్రీ యోగ వాసిష్ఠ కథలు-2

(స్థితి ప్రకరణము)

ఓం ప్రకాశ్

# చెట్టు మీద ఒక మహాముని

## (దాశురముని కథ)

వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

గుండె లదిరిపోతున్నాయి. ఎగశ్వాసలకు ముక్కుపుటాలు కంపిస్తున్నాయి. ఎఱుపెక్కిన కపోలాలమీద వేడి వేడి కన్నీటిచుక్కలు పడి రాలుతున్నాయి. తెల్లని ఆ నేత్రాలు రక్త వర్ణమై కన్నీటితో నిండిపోయాయి.

"నాన్నా...! నాన్నా...!" అంటూ మరింత బిగ్గరగా ఏడుస్తూ తల బాదుకొంటున్నాడు. ఆ రోదన ధ్వని ఆ అరణ్యమంతా వ్యాపించిపోయింది. పర్వత పాషాణాలకు తగిలి అది ప్రతిధ్వని చేస్తూ సానుభూతి చూపిస్తున్నది. పర్వతాగ్రం పైని ఆ కీకారణ్యంలో పంచభూతాలు, ప్రకృతి తప్పించి, ఆ దుఃఖిత వ్యక్తికి తోడెవరూ లేరు.

"నాన్నా...!" అంటూ ఆవ్యక్తి హృదయ విదారకంగా విలపిస్తూనే ఉన్నాడు. "నాన్నా నన్నొంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయావా? ఎక్కడికి పోయావు నాన్నా...! అమ్మ లేదనుకుంటే, అమ్మకుబదులు నేనున్నాను బాబూ అంటూ నన్ను ఓదార్చేవాడివి కదా! నన్నిప్పుడెవ్వరోదారుస్తారు నాన్న. నన్ను దిక్కులేనివానిగా, ఇలా అనాధునిగా చేసి వెళ్ళటం నీకేమైన న్యాయంగా ఉందా? హాయ్యో, నాన్న! నే నిప్పుడేం చేసేది? ఎలా బతికేది?" ఆ వ్యక్తి తండ్రి శరీరంపై బడి తల బాదుకున్నాడు.

"నాన్నా, నీవు గొప్ప తపోధనుడవు కదా! నిన్ను అపరబ్రహ్మ అని అనేవారు కదా! అంతటి మహాత్ముడైన నిన్నుకూడ మృత్యువు కబళించడమూ ఆ మృత్యువున వదిలిపెట్టి నా కోసం రా నాన్నా; రా నాన్న

ఆ వ్యక్తి దీనాలాపాలకు ప్రకృతియే స్తంభించి పోయిందా అన్నట్లుగా, ఆ పర్వతాగ్రం పైని చెట్లన్నీ నిశ్చలంగా ఉన్నాయి. కదళీ కదంబ వృక్షాలు సానుభూతి చూపిస్తున్నట్లు కదలటం మానేశాయి. పొదలు చలించటం లేదు. లతలు 'అయ్యోపాపం!' అంటున్నట్లు అతని చేరువులో పడిఉన్నాయి. చెట్లకొమ్మలు ఊగటం లేవు. ఆకులు తొణకటం లేవు.

చిరుప్రాయపు ఆ బాలుని ఏడ్పుకు పశుపక్షి మృగాదులు కూడ ఆర్ద్రహృదయంతో కూడుకొని సహానుభూతి పూర్వకంగా చూస్తున్నాయి. పక్షుల కలరవాలు ఆగిపోయాయి. హరిణాల గంతులు ఆగిపోయాయి. కోతుల వికృతచేష్టలు ఆగిపోయాయి. పశుపక్షి వృక్ష లతగుల్మాదులతో కూడిన ఆ వనమంతా తల్లీ దండ్రీ లేని ఆ పసివాని ఏడ్పుకు కరిగిపోయింది.

తోడూ - నీడగా నున్న ఆ ఒక్క మనిషి కూడ ఆ బాలున్ని వదిలిపెట్టి పోయాడు. నిర్జనమైన ఆ వనంలో ఆ బాలున్ని పల్కరించి ఓదార్చేదెవరూ? పశువులకా, మాటలురావు. మృగాలా, కఠినత్వం తప్పించి మృదుత్వం అవి ఎరుగవు. పక్షులా, వింత వింత కూతలుకూస్తాయి. అవి ఆ బాలునికి అర్థమౌతాయా? వృక్షాలు కదిలిరాలేవు. లతలు పాకగల్గినా, పల్కరించేందుకు వాటికి నోళ్ళు లేవు. రాళ్లూ రప్పలు జడ

పదార్థాల మాదిరి స్పందనలకు గురికావు ఇక ఎవరున్నారు, తండ్రిని పోగొట్టుకొని అపార దుఃఖాలలో మునిగిపోయియున్న ఆ పిల్లవాణ్ణి ఒడిలోకి తీసుకొని ఓదార్చటానికి? ఆ వనం, ఆ వనానికి అధిష్ఠానమైన వనదేవత, తప్ప!

ఎవరూ దిక్కులేని ఆ పిల్లవాని దీనస్థితి చూసి స్త్రీ హృదయం, వనదేవత మాతృ హృదయం ద్రవించింది. వనదేవత మాతృ వాత్సల్యా దీపించే స్త్రీ ఆకారం ధరించి మాతృ మూర్తిలా ఆ బాలుని చెంతకువచ్చింది. * ఆ బాలున్ని ఒడిలోకి తీసుకుని ఓదార్చింది. కన్నీరు తుడిచింది. ధైర్యం చెప్పింది.

"బాబు, ఇటు చూడమ్మా! ఇలా ఏడిస్తే ఎలా చెప్పు. పోయిన మీ తండ్రి జీవం తిరిగి ఈ శరీరాన్ని ఆశ్రయిస్తుందా? కాలధర్మం. దానికి అందరూ లొంగవలసిందే! మీ తండ్రే కాదు, ఈ సృష్టిలో కనబడేవన్నీ, కాలానికి వశవర్త్యే ఉన్నాయి. అవన్నీ ఎప్పుడో ఈ సృష్టిలోకి జనించి వచ్చాయి. వాటి వాటి కాలం తీరేవరకూ అవి ఇక్కడ ఉంటాయి. ఆ తర్వాత అన్నీ మరణించిపోతాయి. సర్వభూత కోటి నిలయమైన ఈ సృష్టంతా చంచలమై, జనన, మరణాల చక్రంలో పరిభ్రమిస్తున్నది. అలా భ్రమించి, భ్రమించి, చివరికి ఈ సృష్టంతా కూడా నశించిపోతున్నది. అలాంటి నశించి పోయేదానికోసం ఇలా ఏడుస్తారా ఎవరైనా? గాజుబొమ్మ ఎప్పుడైనా పగిలిపోతుంటు. ఆ నిజం తెలిసిన వారెవ్వరూ గాజుబొమ్మ శాశ్వతమై ఉండాలంటూ దానిపై ఆశలు పెంచుకోరు." అని చెప్పి వనదేవత ఆ పిల్లవాని కపోలాలను, తన ఆకుపచ్చని కోకతో తుడిచింది. ఆ మాతృ మూర్తి ఓదార్పుకు, ఆ బాలుని హృదయం శాంతస్థిమితపడింది. ఏడ్పు మానివేసి, ఆ తల్లి ముఖంలోకే చూడసాగాడు. ఆమె ముఖంలో ప్రసన్నత ప్రకాశిస్తున్నది. పెదవులపైన చంద మామను కన్నెల్లా చిరునవ్వు తారాట్లాడుతున్నది. ఆమె ప్రసన్నవదనం చూసి, ఆమె ధైర్య వచనాలు విని, ఆ బాలుడు తన దుఃఖాన్ని మరిచిపోసాగాడు. దుఃఖాతీతులు తప్ప దుఃఖితుల దుఃఖాన్ని ఎవరు పోగొట్టగలరూ!

"బాబు" అంది వనదేవత.

"చెప్పమ్మా" అన్నాడా బాలుడు.

"బాబు, ఒక విషయం బాగా తెలుసుకో. ఈ దృశ్య ప్రపంచం అంటే ఈ కన్పించే పదార్థాలన్నీ నశించిపోతాయి. ఈ సృష్టిచేసే ఆ బ్రహ్మ ఉన్నాడుకదా, అతను కూడా, కాలం తీరగానే కాలగర్భంలో కలిసిపోతాడు. కన్పించే ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతంకాదు. ఈ నిజం తెలుసుకో! దుఃఖాన్ని వదులుకో!"

"అమ్మా!" అన్నాడా బాలుడు. ఆ బాలుని ముఖంలో నూతన తేజస్సువచ్చింది.

"బాబు, నీవు ఋషిపుత్రుడవు. అందులో ప్రజ్ఞావంతుడవు కూడా. అంతటివాడవైన నువ్వే అజ్ఞానిలా ఇలా దుఃఖిస్తే ఎలా? ఉదయించిన సూర్యుడు అస్తమించటం చూస్తూనే ఉన్నావు కదా! మీ తండ్రి అస్తమిస్తే ఎందుకు విలపిస్తున్నావు మరి!! లే. పుత్తు విడిచేయి. దుఃఖాన్ని వదలిపెట్టు. మోహాన్ని త్యజించి చేయవలసిన పనులు చేయి" అని వనదేవత బాలున్ని లేపింది.

బాలునిలో అప్పటికే దుఃఖం మటుమాయమైపోయింది. అతను లేచి తండ్రికి సక్రమంగా అంత్యక్రియలు జరిపాడు. వన

* మూలంలో 'అదృశ్య శరీరయా' అని ఉంటూ వనదేవత అదృశ్యంగానే ఉండి బాలున్ని సాంత్వన పరిచినట్లుంది. రసపోషణ కోసం ఇక్కడ వనదేవతను ప్రత్యక్షంగా వర్ణించటం జరిగింది.

దేవత ఉపదేశం మేరకు, ఆ అరణ్యంలోనే ఉత్తమ సిద్ధికోసం తపస్సుకు పూనుకున్నాడు.

కాని అతనికి సక్రమంగా ధ్యానం కుదరటం, ఆ భూప్రదేశాన సాధ్యం కాలేదు. ఎంత ప్రయత్నించినా, సంకల్పనిరోధానికి అవరోధం కల్గుతూనే ఉంది. పశువులు, మృగాలు, ఇతర భూచరజీవాలు, అతని ధ్యానానికి సత్యాం, నిరంతరం విఘ్నం కల్పిస్తూ ఉన్నాయి. అతనికి నానావిధంగా అయితే సిద్ధిపొందలేనని అనిపించింది. ఆలోచనాంతర్గతుడై పరిష్కారమేమిటాని యోచించసాగాడు.

ఆ చిటారు కొమ్మన అతనికి పక్షులు కనబడ్డాయి. ఎంత హాయిగా, స్వేచ్ఛగా ఉన్నాయి అవి! వాటి స్వేచ్ఛకు భూగత జంతువులు, ఇతర జీవులు ఆటంక పరచలేవు. ఆ పక్షుల్లా తానూ వృక్షాగ్రాన ఉండగల్గితే, హాయిగా, నిర్విఘ్నంగా సాధన చేసుకోవచ్చును కదాని అనుకున్నాడతను. ఆ స్థితిని పొందటానికి ఒక యజ్ఞాన్ని ఆరంభించాడు.

అగ్ని సప్తజిహ్వలతో ప్రజ్వలిస్తున్నది. అతను సమంత్రకంగా, సస్వరంగా యజ్ఞ కార్యాన్ని కొనసాగిస్తున్నాడు. యజ్ఞానికి కావలసిన ముఖ్యమైన వస్తువులు వేదమంత్రాలు, ఎండిన మోదుగపుల్లలు (సమిధలు), ఆవునెయ్యి, కాని అతను విలక్షణంగా ఆ యజ్ఞాన్ని చేస్తున్నాడు. భగభగమండుతున్న ఆ యజ్ఞకుండంలో తన భుజస్కంధాల్లోని మాంసాన్ని కోసి హోమం చేస్తున్నాడు. అతని ఆ యజ్ఞానుష్ఠానానికి అగ్నిదేవుడు సంతోషించాడు. సూర్యునివంటి తేజంతో కూడిన ఆకారంతో అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. అతను అగ్ని భగవానుని చూడగానే నమస్కరించాడు.

"భగవాన్, యజ్ఞపురుషా! నీకు ప్రణాముము. నన్ను దాశురముని అంటారు. మా తండ్రి శరలోమ మహర్షి."

"దాశుర కుమారా! నీ విషయమంతా నే నెరుగుదును. నేను అగ్నిని. నా ద్వారానే సర్వదేవతలకు యాజ్ఞిక హవిర్భాగాలందుతుంటాయి. నీ అభీష్టమేమిటో చెప్పు దాన్ని నెరవేరుస్తాను."

"మహాత్మా! ఈ భూభాగమంతా నానావిధ ప్రాణులచేత నిండియున్నది. నా మనస్సు వీటి మధ్య పరిశుద్ధం కావటంలేదు. పక్షుల్లా వృక్షాగ్రాలపైన వసించి తపస్సు చేసుకోవాలనుంది. నాకా వరాన్ని ప్రసాదించు."

"ఏవమస్తు."

దాశురమునికా శక్తినిచ్చి అగ్నిదేవు డదృశ్యుడైపోయాడు. దాశురముని లేచి, తన కనువైన ప్రదేశం కోసం చూడసాగాడు. ఒక చోట పొడవైన కదంబవృక్షము కన్పించింది. అది మబ్బులను తాకుతున్నది. దాశురముని సంకల్పమాత్రం చేత ఆ వృక్షాగ్రాన్ని చేరి, అక్కడే కూర్చుండిపోయాడు. సర్వసందేహాల నుండి తన మనసును దూరం చేశాడు. సర్వ శంకలను నశింపజేసుకున్నాడు. చిత్తాన్ని క్రమంగా శాంతిపరచి, ఏకీకృతం చేసి, ఆ వృక్షాగ్రాన స్థితుడైపోయాడు. కాలం ఎంత గడిచిందో అతనెరుగడు. అసలు దేశకాలాలనేవి ఒకటున్నవన్న సంగతే అతను విస్మరించాడు. అతని చిత్తం నిర్మలమైంది. అతి నిర్మలమైంది. ఆ పరిశుద్ధచిత్తంలో అతనికి ఎప్పుడు గోచరించిందో, ఆత్మజ్యోతి దివ్యప్రకాశం గోచరించింది. ఆ దివ్యప్రకాశానందంలో విలీనుడైపోయాడు. ఆ ఆత్మజ్ఞానానంద డోలికలలో ఊగిసలాడసాగాడు.

ఆ నిర్వికల్పసమాధిలో అతనెంతో కాలం అలాగే ఉండిపోయాడు. ఆ సమాధ్యానం

దాధిలో లయమై యుండగా ఒకరోజతనికి హఠాత్తుగా సమాధి భంగమైంది. అంతఃకరణం తిరిగి ప్రవర్తించసాగింది. అతను కనులు నెమ్మదిగా విచ్చి చూశాడు.

విశాల లోచనాలు మెరుపుల్లా తళతళలాడుతూ కన్పించాయి. తామర రేకులవంటి

వింతగా చూస్తుండిపోయాడు. ఆ కనుగవలను నెమ్మదిగా దాటిన అతనిదృష్టికి చందమామ సొగసును మించిన, గుండ్రని, అందమైన ముఖపద్మం గోచరించింది; అరుణాధరాలు కన్పించాయి. అవి చిన్నగా వణుకుతూ అందాలను వెదజల్లుతున్నాయి.

దాశురముని ఆశ్చర్యంతో తన కన్నులను నులుపుకొన్నాడు. 'ఏమిటీ! ఈ చిటారు కొమ్మన ఈ చిన్నారి ఎలా వచ్చింది!'—అని అనుకున్నాడు. మళ్ళీ చూశాడు. మిథ్య కాదు; నిజంగానే ఒక అతివ తన ఎదురుగుండా ఉంది. పుష్పాలనే వస్త్రాలుగా ధరించింది. ఎవరీ వింత కాంత—అని అబ్బురపడ్డాడు.

ఆ అందగత్తెను చూసినా అతని మనసులో ఎలాంటి వికారం కల్గలేదు. అందుకే ఇతర తాపసుల్లా, అతను కోపతాపాలకు గురికాలేదు.

ఆ స్త్రీ. ఆ చిటారు కొమ్మన అతి సునాయాసంగ నిలబడియుంది. ముని చూపు తన వైపు ప్రసరించటం చూసి, ఆమె మెల్లగా తన సుందరమైన వదనాన్ని విప్పింది.

''మునివరా!'' అంది. ఆమె కంఠం సుమనోహరంగా ఉంది. అత్యంత కోమలంగా ఉంది. శ్రవణమధురంగా ఉంది.

''మునివరా! వందనము. నేను వన దేవిని''

అదా సంగతి— అనుకున్నాడు దాశురముని. సామాన్యస్త్రీలకు ఇలా చెట్టు చివరి భాగాన నిలబడే శక్తి ఎక్కడిది?—అని సమాధాన పడ్డాడు.

''లతాంగీ! నేను తపస్విని. ఏకాంత జీవిని. ఆ ఏకాంతం కోరుకునే నేని వృక్షాగ్రాన్ని ఆశ్రయించాను. నా ఏకాంతానికి నువ్వెందుకు భంగం కలుగజేయ తలచుకున్నావో, ఆ విషయం చెప్పగలవా?''

''తపోధనా! నన్ను మన్నించండి. మహాత్ములు, సర్వసమర్థులన్న విశ్వాసంతో మిమ్ములను దర్శించాను. చిరకాలంగా నా కోరిక ఉంది. ఆ కోరికను మీద్వారా తీర్చుకుందామన్న ఆశతో వచ్చాను.''

''తన్వంగీ! ఏమిటా కోరిక. సందేహించకు. తప్పక నెరవేరుస్తాను.

''మహాపురుషా! చాలాకాలంగ సంతానాపేక్షతో బాధపడుతున్నాను. మహాత్ములైన మహాపురుషునిద్వార పుత్రుణ్ని పొందాలన్న అభిలాషతో సతమత మౌతున్నాను. నాకో పుత్రుణ్ని ప్రసాదించి, పుత్రలేమివల్ల గల్గిన ఈ దుఃఖాన్నుండి నాకు ఉపశమనం కల్గించండి''.

''విశాలాక్షీ! నీవు దేవజాతి స్త్రీవి. మర్త్య కన్యలాగ పుత్రేషణతో ఇలా బాధపడవచ్చా?''

''తేజోరూపా! దేవజాతి స్త్రీలకు మాత్రం ఈషణాత్రయ బాధలుండవని ఎందుకనుకుంటున్నారూ? ఆ విషయం మీకు తెలియనిదా! సర్వభూతాలు చిత్తసంకల్పభ్రమలకు చిక్కుకుని తిరుగాడుతున్నాయన్న సంగతి మీకు నేను వేరుగా చెప్పాలా! పరమ దయానిధీ! మీలాంటి ఆత్మజ్ఞులద్వార తనయున్ని పొందాలన్న కోరిక నాలో ఎందుకో ప్రబలంగా ఉంది. ఆ

కోరిక నెరవేరకపోతే, నేనగ్నికి ఆహుతై పోతాను.''

''అంత సాహసం వద్దు; మృదుభాషిణీ! నన్నాశ్రయించినవాళ్ళెవరికీ నిరాశ ఇంతవరకు నిన్నాశ్రయించి యుంటుందా? విచారించకు. నీ మనోరథం నెరవేరుతుంది''

వనదేవికి ధైర్యం చెప్పి దాశురముని ఒక్క క్షణం ధ్యాననిమగ్నుడై ఆలోచించాడు. భావిలో జరగబోయే కార్యమేమిటో అతనికి గోచరించిందో ఏమో ఆతనామె కోరికను తీర్చటానికి పూనుకున్నాడు.

''సుందరీ! నీ అభీష్టం నెరవేరుతుంది. నా యోగబలం వల్ల నీకొక మాసంలోనే ఒక కుమారుడు కల్గుతాడు. వాడు జగత్పూజ్యుడౌతాడు. ఆత్మజ్ఞాన సంపన్నుడౌతాడు. ఇక సంతోషంగా వెళ్ళిరా.'' అని ఆ ముని ఆ తన్వికి ఒక పుష్పాన్ని ఇచ్చి, ఆమె కుడిచేతిలో పెట్టి, కనురెప్పపాటు కాలం ఆమె కనుబొమల మధ్యప్రదేశాన్ని తదేకంగా వీక్షించాడు. ఆ చూపుకా వనదేవి దేహం జలదరించింది. ఏదో దివ్యతేజం తనలో ప్రసరిస్తున్నట్లనిపించిందామెకు. ఆమె ప్రఫుల్ల నయనాలతో ముని పాదపద్మాలకు నమస్కరించింది. కన్నులకు, శిరోమధ్యానికి అతని చరణరజాన్ని తాకించి; నెమ్మదిగా వెళ్ళిపోయింది. దాశురముని చిరునవ్వుతో ఆమెవైపే చూడసాగాడు.

ఋతువులు వచ్చాయి; వెళ్ళిపోయాయి. మళ్ళీ వచ్చాయి; మళ్ళీ వెళ్ళిపోయాయి. వేసవి గడిచి, వర్షాకాలం వచ్చింది. అది గడిచి శీతాకాలం పలకరించింది. ఇలా త్రికాలాలు క్రమం తప్పకుండా ఒకదాని వెంట ఒకటి వస్తూ, తమతమ విధులు నిర్వహించుకొంటూ, సెలవు గైకొంటున్నాయి. సూర్యుడు అస్తమిస్తూ ఉద రోజులు వడివడిగా నడిచిపోతూనే యున్నాయి. మాసాలు పరుగెత్తుతూనే యున్నాయి. సంవత్సరాలే పరిభ్రమించాయి కాలచక్రంలో! కాలచక్రం మాత్రం ఆగలేదు. దాశురముని ఆత్మానందంలో ఓలలాడుతూనే ఉన్నాడు.

ఆ స్థితిలో ఒకరోజు, లతాంగీ-పత్రపుష్పవస్త్రధారిణీ అయిన వనదేవత అతని చెంతకు వచ్చింది. చిలకరంగు ఆకుపచ్చని ఆకుల చీరలో, తెల్లని మల్లెపువ్వుల రవికెలో, యౌవనాన్ని దాటి ప్రౌఢత్వంలోకి అడుగు పెట్టిన ఆ వనదేవత, అత్యాకర్షకరంగా కన్పించింది. ఆమె కన్నుల్లో ప్రశాంతత నిండి యున్నది. ఆమె పెదవులపైన తృప్తికరమైన మందహాసమున్నది. ఆమె వదనం సర్వవాంఛలను పూర్ణం గావించుకొన్నట్లు గంభీరంగా ఉన్నది.

దాశురముని ఆ వనదేవత మాతృసౌందర్యాన్ని చూసి ఆనందించాడు. ఆమె అడుగులో అడుగు వేసుకుంటు, గున్నఏనుగును వెంటబెట్టుకొని వస్తున్న ఆడఏనుగులా అతన్ని సమీపించింది. శ్వేత తామరకాడలవంటి చేతులతో అతని పాదాలంటి నమస్కరించింది. అతనామెను లేవనెత్తి, ఆసీనురాలిని చేశాడు.

ఆమె లలితమైన తన కంఠస్వరాన్ని విప్పింది.

''ప్రభో! వీడు మన కుమారుడు. వీన్ని దీవించండి.''

దాశురమునికి, అప్పటికిగాని ఆమె వెంట మరో వ్యక్తి ఉన్నాడన్న సంగతి జ్ఞాపకం రాలేదు. కనులెత్తి ఆ కుమారునివైపు చూశాడు. బాలుడు; బాల్యావస్థను దాటి కౌమారావస్థలో నున్నాడు. పన్నెండేండ్ల కుమారుడు. తల్లి అందాన్ని, తండ్రి గాంభీర్యాన్ని పుణికి పుచ్చుకొని యున్నాడు. వాని

ముఖం తేజస్సుతో ప్రకాశిస్తున్నది. ప్రసన్నతతో దీపిస్తున్నది. దాశురమునికి మహదానందం కలిగింది.

"కుమారా! ఇటురా తండ్రీ!"

ఆ కుమారుడు తండ్రివైపు అలా చూసి, తల్లివైపు అదోలా చూశాడు.

"నాయనా! వీరే మీ తండ్రిగారు. వచ్చి సాష్టాంగ ప్రణామం చేయి." అని వనదేవత తెలియజేసింది. ఆ కుమారుని కన్నులు తళుక్కున మెరిసాయి. సంతోషంతో ఆ మహామునిని సమీపించి సాష్టాంగనమస్కారం చేశాడు.

"తండ్రీ, మీ కివే నా శతాధిక వందనాలు."

"కుమారా, లెమ్ము." అని ఆ కుమారుని లేపి తన కుడిప్రక్కన కూర్చుండబెట్టుకున్నాడు. ఆ దృశ్యం వర్ణనాతీతం. తల్లీకొడుకుల మధ్యనున్న నిరంతర తపస్వి అయిన ఆ పరమేశ్వరుని మాదిరిగా ఆ దాశురముని ప్రకాశించాడు.

"నాథా, వీడికి సర్వవిద్యలూ చెప్పించాను వాటిలో పారంగతున్ని చేశాను కానీ..." వనదేవత తడబడుతూ మునివైపు చూసింది

"చెప్పు దేవీ".

"లౌకిక విద్యలందు వీడు సర్వజ్ఞుడే. అయినా వాటివల్ల వాస్తవ ప్రయోజనం నెరవేరదు కదా! అవి కేవలం శరీరపోషణకు, శారీరక భోగాలకు మాత్రమే పనికివస్తాయి. ఈ శరీరమున్నంతవరకే వాటి ప్రయోజనం అందుకని.

"అందుకనీ. !" దాశురముని కుతూహలంతో ఆమె కన్నుల్లోకి చూశాడు. ఆమె కనురెప్పల్ని బరువుగా క్రింది వాల్చింది.

"అందుకని, శాశ్వత ప్రయోజనం చేకూరే జ్ఞానం మీరు వీడికి ప్రసాదించాలి. ఈ సంసార చక్రంలో, ఈ జననమరణాల చక్రంలో మళ్ళీ తగులుకోనకుండా ఉండే పరమతత్త్వజ్ఞానాన్ని, దివ్యమైన ఆత్మజ్ఞానాన్ని వీడికి బోధించాలి. ఆ జ్ఞానబోధ చేయటానికి మీరు తప్ప సమర్థులు నాకింకెవరూ గోచరించ లేదు. మీరు మహాత్ములు. అందునా ఒక కుమారునికి తండ్రులు. ఏ తండ్రైనా, తన కుమారుడు జ్ఞానహీనుడుగా ఉండటం చూసి మిన్నకుండగలడా? సమర్థుడై యుండికూడ కుమారున్ని జ్ఞానవంతుడుగాతీర్చి దిద్దకుండా ఉండగలడా!"

వనదేవత అభిలాష దాశురమునికి మరింత ఆనందాన్ని కల్గించింది.

"దేవీ, నీ వంటి తల్లులు ప్రపంచంలో చెప్పు మంది ఉద్భవించాలని నా అభిలాష. ఆత్మజ్ఞానం కోసం. స్వంత కొడుకును, ఏ తల్లయినా నీలా త్యజించటానికి సాహసించగలదా! ప్రపంచంలో తల్లులు తమ కొడుకులు సర్వదా సర్వథా ఈ సంసారంలోనే తమలాగే మూఢమైన బతుకు బతకాలనీ, తమనే అంటిపెట్టుకుని ఉండాలనీ, తమ ఇతర, తన శరీరాదుల రక్షణ పరిపోషణలందే జీవితాన్నంతా వ్యర్థపుచ్చుకోవాలనీ కోరుకుంటారు కదా! తమ పుత్రుడు పెరిగి, పెండ్లి చేసుకుని, ఒక యువతి మోహపాశానికి అధీనుడై, ఆ తర్వాత తన జీవితమంతా పలుబాధాలతో సాలెగూడులా జల్లిబిలి చేసుకొని అందే పొరలుతూ క్రుగ్గిపోవాలనీ కోరుకొంటారు కదా! నీలా ఏ ఒక్క తల్లయినా, తన కుమారుడు, తన కుమారుడుగానే మిగిలిపోవాలని, ఇక మరెవ్వరికి అతను పుట్టకూడదని, అతనికిక జన్మంటూ ఉండకూడదని ఈ జన్మమృత్యుచక్రం నుండి సర్వదా సర్వథా విముక్తుడు కావాలని, ఆశిస్తుందా? అలా ఆశించే తల్లులే తల్లులు. దానికై పురికొల్పే తండ్రులే తండ్రులు. ఆ తల్లిదండ్రులు ధన్యులు."

దాశురముని వనదేవతవైపు ప్రశంసా

పూర్వకంగా చూశాడు. ఆమె వినయంతో నతశిరస్కయై అతని పాదాలకు నమస్కరించింది. కాలి బొటన వ్రేళ్లు స్పృశించి, సెలవు పుచ్చుకొంది.

"మహాత్మా, ఇక నేను వెళతాను. వీడు మన కుమారుడు కాడు. ఇక నుండి మీ శిష్యుడు." అని చెప్పి కుమారుని తల మూర్కొని, ఫాలభాగాన, భ్రూమధ్యంలో మెత్తగా ముద్దు పెట్టుకొని, కుడి అరచేతితో శిరస్సు నడిమి ప్రదేశాన్ని సవ్యంగా నిమిరి, వెళ్ళిపోయింది. వనంలో కలిసిపోయింది.

దాశరముని కుమారుణ్ణి, శిష్యుని భుజం పట్టి దరికి చేర్చుకున్నాడు.

దినాలు గడిచిపోతున్నాయి. ఒకరోజు ఆ కుమారుడు దాశరమునిని సమీపించి, నమస్కరించి కూర్చున్నాడు.

"గురువర్యా, మనిషి జన్మనెత్తినవారు సాధించవలసినదేమిటి? ఆ తత్త్వం గూర్చి, తెలియజేయండి."

దాశరముని కుమారుని పరిశీలనగా చూశాడు. అది సరైన సమయమని నిర్ధారించుకున్నాడు. జ్ఞానబోధ కుపక్రమించాడు

"తత్త్వం అన్నావు. కుమారా, దాన్ని విపులీకరించి చూడు. తత్ త్వం, అదే నీవు. ఏది నీవూ? అదే. అదే ఏది? ఇది సాధించటమే మనిషి జన్మకు సాఫల్యం."

"ఎలా సాధించటం?"

"విచారణ ద్వార వివేకయుతమైన బుద్ధి ద్వార. నిన్ను నీవు విశ్లేషించుకోవటం ద్వార. అదే సాధన. ఆ సాధన ఎప్పుడు ప్రారంభించేయకు. వాటికి సమాధానాలు లేవు. నీలో జిజ్ఞాస కల్గింకా, ఆ సాధన నీకు తెలియకుండానే ఎప్పుడనుకో ప్రారంభించావన్నమాట నీ ఈ జిజ్ఞాస శమించిందా, నీ సాధన ముగిసిందన్న మాట"

"జిజ్ఞాస అంటే?"

"బాహ్యప్రవృత్తినుండి అంతర్గతంగా నివృత్తుడవు కావటం. పంచేంద్రియాలవెంట పరుగిడటం మాని, అంతరింద్రియాలవైపు మరలటం. నీ చిత్తంలో పుట్టి పెరిగి వశించే సంకల్ప వృత్తులను గమనించటం. 'ఏమిటిది! ఆశ్చర్యంగా ఉందే. ఇంతవరకు "నేను-నేను" అనుకున్నదంతా నేను కాకుండా పోతున్నదే! అయితే అసలు నేనేమిటి!' అన్న కుతూహలం రేకెత్తటం, ఇదే జిజ్ఞాస."

"నివృత్తుడను కావటం ఎలా?"

"దానికి నీ మనసును మథించాల్సి ఉంటుంది. ఈ మనస్సు సంకల్పాత్మకము. తన సంకల్పిత చేష్టల చేతనే ఇది పరిణమిస్తూ మనిషిని సుఖదుఃఖాది భ్రమలకు లోను చేస్తుంది. లేనిపోని ఆశాపాశాలకు గురి చేస్తుంది. ఇది సత్త్వరజస్తమూలతో కూడి ఉత్తమ మధ్యమ అధమ శరీరాలను ధరిస్తుంది. నీచ కార్యాలు తమస్సు. అది క్రిమికీటకాది శరీరాలకు కారణం. నిరంతర వ్యవహారం, చంచలత్వం రజోగుణం. ఇది పుత్రదారానురంజితమగు సంసార మోహాన్ని కలుగజేస్తుంది. ధర్మమందు, జ్ఞానమందు పరాయణుడై యుండటం సత్త్వం. ఇది మనిషిని విముక్తున్ని చేయటానికి సహాయకారి అవుతుంది. ఈ మూడు గుణాలు కూడ సంకల్పాలకు ఆధారాలు. కనుక

ఇదే సంకల్ప నిరోధం

జరిగి, సంకల్పరూపమగు మనసు కరిగిపోతుంది. తన స్వస్వరూప జ్ఞానం, పరమాత్మపదం లభ్యమౌతుంది. ఇదే నివృత్తికవు కావటమంటే. వృత్తులను సమూలంగా నిర్మూలించుకోవటం."

"సంకల్ప నిరోధం సాధ్యమయ్యే విషయమేనా?"

"అసాధ్యమనే దేమి లేదు. అన్నీ సాధ్యాలే. పోతే మూఢుల కిది బహు క్లేశకరమైనది. విచారసంపన్నుల కిది తేలిక. సమస్త దృశ్య దృష్టులను ముందుగా పరిత్యజించటం నేర్చుకోవాలి. తద్వార నీ మనసులోని సంకల్పాలు నీకు గోచరమౌతాయి. ఈ సంకల్పక్షయానికి నీ మనసే నీ కుపకరణము. నీ మనసే నీకు గురువు. మరి ఏ యితర గురువులద్వార అది క్షయించదు. దత్తాత్రేయుడే వచ్చి బోధించనీ, దుర్వాసుడే చెప్పనీ, బుద్ధుడే గిరపనీ. నీ మనసును నీవు నియమించుకోకపోతే ప్రయోజనం లేదు. మనోలయం సంకల్ప క్షయం ద్వారానే సాధ్యం. వేలవేల సంవత్సరాలు ఘోరతపస్సు చేసినా, ఈ స్థూల దేహాన్ని శిలలకేసి చూర్ణమయ్యేలా కొట్టుకొన్నా, అగ్నిలో దహించినా, బడబాగ్నిలో దూకినా, లోతైన గోతిలో, కత్తులవాడి కొనలపై పడినా, అవి నీ మనోలయాని కేవిధంగాను సహాయపడవు. నీ సంకల్పాలను నువ్వే నిరోధించుకోవాలి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వచ్చి ఉపదేశమిచ్చినా, నీ సంకల్పక్షయం జరగదు. అది నీకు నీవే చేసుకోవలసినట్టిది. నీ స్థూల దేహం స్వర్గమందు వసిస్తే, పాతాళమందు కష్టపడితే, భూలోకమందు వ్యథపడితే సంకల్పక్షయం జరుగుతుందనుకోకు. ఆ సంకల్పవృత్తులను నీకు నీవే క్షయింపజేసుకోవాలి."

"[illegible]...ఎలా అని?"

"సాధన చతుష్టయం అనే పురుష ప్రయత్నం చేయి. ఈ జగత్తంతా సంకల్పజనితమే. నీ సంకల్పం ప్రకారమే ఈ దృశ్యజగత్తు భాసిస్తుంది. కనుక అసలు సంకల్పమే చేయకుండా అలలు లేని సముద్రంలా గంభీరంగా ప్రశాంతంగా ఉండు. నీ చిత్తం విష[illegible] ద్వార సంకల్పాలకు ఆస్కారం లభిస్తుంది; స్వప్నము ప్రభావాత్మక రూపం ధరిస్తుంది. నీ జన్మ అసత్యం. నీ స్థితి అసత్యం. నీ మరణం అసత్యమే. ఇవన్నీ నీ చిత్తం సంకల్పించే రూపాలు. ఈ దృశ్యరూపాలందు అనాసక్తి వహించి. పరిపూర్ణ ఆనందాన్ని నీవు అనుభవం చేసుకుంటే సంకల్పం నశిస్తుంది. పూర్వమనుష్ఠించినవాటిని, భావికాల సుఖదుఃఖాదులను, వర్తమానంలోని స్థితులను స్మరించకు. ఈ స్థితిని సాధించగలిగితే నీ సంకల్పక్షయం జరిగి, ఆత్మసిద్ధి లభిస్తుంది. నీవు నీ స్వేచ్ఛను తిరిగి పొందుతావు. ఆ ప్రయత్నం నేడే చేయి."

దాసురకుమారుడు, గురూపదేశాన్ని ఆచరించి, అచిరకాలంలోనే ఆత్మతత్త్వాన్ని ఎరిగి, ఆత్మజ్ఞాన సంపన్నుడయ్యాడు.

(సూచన:— కథలోనే కావలసినంత వివేచన ఉన్నది కాబట్టి 'కథా వివేచనము' దీనికి చేయుటం జరగలేదు.)

—పై సంచికలో పాఠకంలో 'పరమహంస'

## భక్తి భావనం

శ్రీ కృష్ణ చైతన్యస్వామి, శ్రీరంగక్షేత్రంలో చాతుర్మాస్యము జరిపినప్పుడు, ఆ పుణ్యక్షేత్రములో, విష్ణుభక్తుడైన ఒక బ్రాహ్మణుడు దేవాలయములో గీతాపారాయణ చేయసాగాడు. పద్దెనిమిది అధ్యాయములు పారాయణ చేయుచున్నప్పుడు చాలా తప్పులు దొర్ల సాగాయి. అతని చదువు చూసి అనేకమంది నవ్వుతున్నా, హాస్యము చేస్తున్నా అతడేమో ఆనందవశుడై చదువుతునే వున్నాడు, కన్నుల ఆనందబాష్పాలను కార్చుచునే వున్నాడు. నీవు యిలా తప్పులతో చదవకూడదని అనేకమంది పండితబృందము అతని దూషించుచు వున్నారు. ఇదంతా చైతన్యస్వామి గ్రహించి, ఆ బ్రాహ్మణుని చూసి "అయ్యా! మీరు పారాయణ చేస్తున్నప్పుడు మీకింత ఆనందం కలగటానికి కారణ మేమిటి? మీ కన్నుల వెంట నీరు ఎందుకు స్రవిస్తోంది!" అని ఆ పండితుల ఎదుటే ప్రశ్నించారు. ఆ బ్రాహ్మణుడు అందుకు "స్వామీ! నేను చదువు వచ్చినవాడిని కాను, గీతలోని శబ్దముల అర్థము నాకు తెలియదు. అప్పో, ఇప్పో, నా గురువుగారి వద్ద నేర్చినది రోజు చదువుతూ వుంటాను. పుస్తకము పారాయణమునకు మొదలుపెట్టిన వెంటనే, తెల్లని గుఱ్ఱముల రథము, అందులో సారథిగా నల్లనయ్య, కన్నులకు కట్టినట్లు కనిపిస్తుంది. చదువుతున్నంతసేపు ఈ విధంగానే వుంటుంది. అందువలన చదువుతునే వుంటాను. పారాయణ ముగిసిన వెంటనే ఆ మూర్తి కూడ మాయమవుతుంది." అని బదులు చెప్పాడు. స్వామి అతని మాటలు విని "మహనీయోత్తమా! తమరే గీతాపారాయణము చేయుటకు తగినవారు. ఎందుకంటే, మీరు దానికి సారమును గ్రహించారు. గీతాపురుషుడు మీకు దర్శన మిచ్చాడు. మీరు ధన్యులైనారు. భావము ప్రధానము కానీ భాష కాదు" అంటూ అతనిని కౌగలించుకున్నారు. అతడు స్వామివారి పాదాలపై పడి లేచి చూసే సరికి శ్రీకృష్ణుడు దర్శన మిచ్చాడు.

## శ్రీరామకృష్ణ మఠం, మద్రాసు-4. సెప్టెంబరునెల విశేషకార్యక్రమం

| | |
|---|---|
| 12 వ తేదీ ఆదివారం | శ్రీ అభేదానందస్వామి జయంతి |
| 17 వ తేదీ శుక్రవారము | శ్రీ శ్రీ అఖండానంద జయంతి, మహాలయ అమావాస్య |
| 18 వ తేదీ శనివారము | నవరాత్రి ప్రారంభము |
| 23 వ తేదీ గురువారం | శ్రీ శ్రీ దుర్గాపూజ (షష్ఠి) |
| 24 వ తేదీ శుక్రవారము | మహాసప్తమి |
| 25 వ తేదీ శనివారము | మహాష్టమి (సంధిపూజ రాత్రి 10-31 నుండి 11-19 వరకు) |
| 26 వ తేదీ ఆదివారము | మహార్నవమి |
| 27 వ తేదీ సోమవారము | విజయదశమి (సాయంకాలిక ఆరాత్రికము పిదప శాంతిజలసేచనము) |
| 13 వ తేదీ సోమవారం<br>28 వ తేదీ మంగళవారం | ఏకాదశి దినములు |

# సమతా బుక్స్ పరిచయం

ఆధ్యాత్మిక గ్రంథాలు ప్రచురించే సంస్థలు కొన్ని మూతబడుతున్న సమయంలో సమతా బుక్స్ సంస్థ ఆధ్యాత్మిక గ్రంథాల ప్రచురణకు పూనుకోవడం మెచ్చదగిన సాహసం. అందు లోనూ అలభ్య గ్రంథాలను ముద్రించి వెలుగుకు తీసుకరావడం మరింత మెచ్చదగిన సాహసం. ఈ సంస్థవారు ప్రప్రథమంగా ఆంగ్లంలో కొన్ని ఉత్తమ గ్రంథాలను వెలువరించి ఇప్పుడు సంస్కృత గ్రంథాల ముద్రణ చేపట్టినారు. ఆ పిమ్మట తెలుగులో కూడ కొన్ని ఆధ్యాత్మిక గ్రంథాలను వెలువరించే ఆశయం కలిగియున్నారు.

ఈ ప్రచురణ సంస్థ ఏర్పడి ఇంకనూ 5 సంవత్సరాలు కాలేదు. ఈ సంస్థవారు శంకర గీతాభాష్య ఆంగ్లానువాదంతో ఉపక్రమించారు. అది ప్రసిద్ధమైన అల్లాడి మహాదేవ శాస్త్రిగారి అనువాదం. "దుష్కరమైన శంకర గీతా భాష్యాన్ని మీరు చక్కగా అనువదించారు" అని స్వామి వివేకానంద 1897 లో శాస్త్రిగారికి లేఖ వ్రాశారు. 80 సంవత్సరాలలో ఈ గ్రంథం 6 సార్లు ముద్రితమై అలభ్యమైన పరిస్థితిరాగా సమతావారు చేపట్టిన మీదట 5 ఏండ్లు కాకుండానే 3 సార్లు ముద్రించవలసివచ్చింది. (వెల: రూ. 35/=). శాస్త్రిగారి మరొక ఆంగ్ల అనువాద గ్రంథాన్ని "దక్షిణామూర్తి స్తోత్ర" అనే పేరుతో (వెల: రూ. 25/=) వెలువరించియున్నారు. ఈ పుస్తకంలో వేదాంత సిద్ధాంతము అనే విపుల పీఠిక, దక్షిణామూర్తి స్తోత్రం, సురేశ్వరాచార్యుల మానసోల్లాసవార్తికం, దక్షిణామూర్తి ఉపనిషత్తు చేర్చబడినవి. శాస్త్రిగారి మరొక ఆంగ్లానువాద గ్రంథం తైత్తిరీయ ఉపనిషత్తును కూడ ముద్రించారు. (వెల: రూ. 100/=). ఈ గ్రంథంలో శంకరభాష్యం, సురేశ్వరాచార్య విద్యారణ్యుల భాష్యం, కైవల్య అమృతబిందు ఉపనిషత్తు అనువాద సహితం, ఉపనిషత్తు పరమార్థ ఉపోద్ఘాతం అనే పేరుతో విపులమైన పీఠిక చేర్చబడినవి. "జ్ఞానేశ్వరి" అనే పేరుతో ప్రసిద్ధమైన భావార్థదీపికను (జ్ఞానేశ్వరుల గీతాభాష్యం మరాఠీలో విరచితమైనది). ఆర్. కె. భాగవత్ గారి ఆంగ్లానువాదంతో ఈ సంస్థవారు ముద్రించారు. (వెల: రూ. 116/=). ఈ గ్రంథం 35 ఏండ్లుగా అలభ్యమైన సంగతి గుర్తించవగినది. యోగవాసిష్ఠాన్ని జ్ఞానానంద భారతీ స్వామి ముముక్షువుల సౌలభ్యానికోసమై 1698 శ్లోకాలలో సంగ్రహించి వాసిష్ఠ సంగ్రహం అని పేరిడిన గ్రంథాన్ని మూలశ్లోకాలు ఆంగ్లానువాదంతో సహా ఈ సంస్థవారు ఈ మధ్యనే వెలువరించారు. (వెల: రూ. 41/=).

ఈ ఐదు పుస్తకాల ప్రచురణతో తృప్తి చెందక ఈ సంస్థవారు ఇప్పుడు ఒక గుణతర ప్రచురణ కార్యాన్ని చేపట్టియున్నారు. 'సంపూర్ణ శంకర గ్రంథావళి' పేర శంకర భగవత్పాదుల రచనల నన్నిటిని 13 సంపుటాలలో దేవనాగరి లిపిలో ముద్రించి వెలువరించనున్నారు. ఇప్పటికి 4 సంపుటాలు వెలువడ్డాయి. మిగిలిన 9 సంపుటాలను కూడ త్వరత్వరగా వెలువరించాలనే సంకల్పంతో సమతా సంస్థవారు కార్యతత్పరులై యున్నారు. (సంపూర్ణ శంకర గ్రంథావళి 13 సంపుటాల వెల: రూ. 800/=).

ప్రతులకు: సమతా బుక్స్, 10, కామరాజ్ భవనం, 573, మౌంట్ రోడ్, మద్రాసు - 600 006.

# బాలల రామకృష్ణ

## దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుడు

దక్షిణేశ్వర కాళికాలయము ఎంత అందమైనచోటు! పడమరగా గంగ పారుతున్నది చుట్టూ . . అనేక దేవతల దేవాలయములు, పూలతోను పండ్లతోను విడలిపోతున్న చెట్లు. శ్రీరామకృష్ణుడు ప్రతిష్ఠా మహోత్సవము చూడడానికి వచ్చాడు. ఆ చోటు అతనికి నచ్చింది. ఆ రోజు మాత్రము ఝూంపుకూడు వెళ్ళిపోయినా తర్వాత అన్నతో దక్షిణేశ్వరము వచ్చి అక్కడే ఉండిపోయాడు. కొన్నిరోజుల తర్వాత హృదయ రాముడను అతని మేనల్లుడు వచ్చాడు. అతడు శ్రీరామకృష్ణునితో సమానమైన వయస్సు కలవాడు.... హేమాంగినికి కుమారుడు. రామకృష్ణుడు చాలా సంతోషించాడు.

మధురబాబు రాణి రాసమణి అల్లుడు. అతనితో కూడా ఆమె అప్పుడప్పుడు దక్షిణేశ్వరము వచ్చేది. భర్త చనిపోయిన తర్వాత తన జమీందారీని తానే నిర్వహించింది. మధురబాబు సలహా చెప్పుడు, ఆమె పనిలో సహాయంగా ఉండేవాడు. అప్పుడు శ్రీరామకృష్ణుడు ఇరవై ఏళ్ళ అందమైన యువకుడు. అతడు వాళ్ళిద్దరిని ఆకర్షించాడు. అతడు దేవుళ్ళమీద దేవతలమీద పాడే పాటలు, మట్టితో చేసిన దేవతా విగ్రహములు చూచి ముగ్ధులైనారు. అతన్ని కాళికాలయ అర్చకునిగా నియమించాలనుకున్నారు. రామకుమారునికి చెప్పారు. అతడు శ్రీరామకృష్ణునికి తెలిపాడు.

శ్రీరామకృష్ణుడు మొదట కొంత భయపడ్డాడు. కాని మధురబాబే స్వయముగా చెప్పిన తర్వాత అంగీకరించక తప్పలేదు. అప్పటినుండి శ్రీరామకృష్ణుడు కాళికాదేవికి రోజూ అలంకారము చేసేవాడు. కాని అమ్మవారి ఆభరణాలను జాగ్రత్తపరిచే బాధ్యత మాత్రము అతనికి లేదు. ఆ పనికై హృదయరాముడు నియమింపబడి ఆభరణాలను జాగ్రత్తపరిచే పని చేస్తుండేవాడు.

శివుని ప్రతిమను మట్టితో చేసి పూజ
చేయుటను చూచి మథురుని చిత్తమలరి
రామకృష్ణుని చూపించె రాణికపుడు,
గౌరవమపార మాతనిపై వహించె.

# శ్రీ రామకృష్ణ ప్రభ

## విషయ సూచిక

# శ్రీ రామకృష్ణ ప్రభ

విషయ సూచిక



## శ్రీ రామకృష్ణ ప్రభకు

చందాదారులుగా చేరండి - చందాదారులను చేర్పించండి.

---

శ్రీ వేంకటేశ్వరాయ నమః

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము

- తిరుమలకు భగవంతుని దర్శనార్థము వచ్చే భక్తులలో పేదలైనవారికి ప్రసాదదానము చేయుటకు మీరు వాంఛించుచున్నారా?

- పేదలకు అన్నదాన ప్రాశస్త్యమును హిందూమతగ్రంథములు అనేక విధములుగా ఉగ్గడించినవి. తిరుమలవంటి పుణ్యస్థలములలో గావించు అన్నదానము మరింత విశిష్టమైనది. అన్నదానమువలెనే ప్రసాదదానముకూడ దాతలకు శుభదాయకమైయుండును.

- కావున తిరుమల తిరుపతి దేవస్థానములు, "శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాదదాన నిధి పథకము" అను పేరున ఒక నూతన విధానమును ప్రవేశపెట్టినవి. ఈ పథకముక్రింద మీరు అన్నప్రసాద పొట్లములు, లడ్డులు, వడలు పేద యాత్రికులకు పంచిపెట్టవచ్చును.

- ఈ కార్యక్రమములో పాల్గొనదలచినవారు రు. 500/- శాశ్వతనిధి ఏర్పాటు చేసినచో దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో, 20 లడ్డులుగాని, 15 వడలుగాని, 20 అన్నప్రసాద పొట్లములుగాని మీరు నిర్ణయించిన దినమున క్యూ వరుసలోని పేద యాత్రికులకు పంచిపెట్టబడును.

- మీ జన్మదినముగాని, వివాహదినముగాని, మీ పిల్లల జన్మదినములుగాని, మీ జననీజనకుల శ్రాద్ధదినములుగాని, మీకు స్మరణీయమైన మరి యే దినమునుగాని - మీరు నిర్ణయించితే ఆ దినమున ఉదయము స్వామివారి కొలువులో మీ నామధేయము, గోత్రము, మీ పేర ప్రసాదదానము జరుగబోవునట్లు విన్నవించబడును.

- రు. 500/- చొప్పున మీరు ఎన్ని నిధులైనను ఏర్పాటు చేయవచ్చును. ఒక్కొక్క నిధికి ఒక్కొక్క నిర్ణీత దినమునుగూడ మీరు సూచించవచ్చును. కనీసము 20 నిధులు (రు. 10.000/-) ఏర్పాటు చేసినవారు, నిర్ణీతదినమున కుటుంబ సభ్యులు ఐదుగురుతోసహా శ్రీవారి ప్రత్యేక దర్శనముకూడ పొందవచ్చును.

- ఈ ప్రసాదదాన కార్యక్రమము 1980 ఉగాదినుండి ప్రారంభమగుచున్నది. ఇందులో పాల్గొనదలచిన నిధి దాతలకు ఆదాయపు పన్ను మినహాయింపు గలదు, విరాళములు ఆంధ్రాబ్యాంక్ అన్ని బ్రాంచీలద్వారా మీరు పంపవచ్చును. తక్కిన ఏ బ్యాంక్ డి. డి. ద్వారా అయినను కూడ పంపవచ్చును. విరాళములను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానము పేరున, మేనేజర్, ఆంధ్రా బ్యాంక్, గాంధిరోడ్, తిరుపతి-517501 అను విలాసమునకు పంపవలెను. నామధేయము, గోత్రము, పూర్తి విలాసము, పంపకమునకు ఎన్నుకున్న ప్రసాదము పేరు, నిర్ణీత దినము. ఈ వివరములనుకూడ నిధి ఏర్పాటుదారులు తెలియజేయగలరు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీరామకృష్ణ ప్రభ

ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

సంపుటము 39 | 1982 - అక్టోబరు | సంచిక 10

## ప్రార్థన

మా ప్రాణముల ప్రాణమా ! 'భోగాల్లో సుఖంలేదు'-అన్న అనుభవం మళ్ళీమళ్ళీ కల్గుతుంది. అయినా దుష్టమైన ఈ మనసు వాటిలోనే సుఖముందని మళ్ళీ మళ్ళీ నిన్ను మరచి, వాటివైపే పరిగెడుతుంది, ఎంతగానో చెప్పిచూస్తాను. అయినా వినదు. నీ స్వరూపచింతనలందు నిమగ్నంచేయ దలుస్తాను. ఎప్పుడో ఒకప్పుడు అలా నిమగ్నమయినట్లే కనబడుతుంది. కాని నిజానికి అదేమీకాదు. స్వామీ ! ఎంతగానో ప్రయత్నించాను; అలసిపోయాను. ఇక దాన్ని నియమించటం నావల్లకాదు. నీ కృపాశక్తిని ప్రయోగించి, దాన్ని నీవైపు లాగేసుకో. నేను సర్వవిధాల నీవాడనె అగునట్లుగా నన్ను మార్చు. ధనం-ఐశ్వర్యం-మానం-ఏమైనాసరే, నీమార్గంలో అడ్డుగాఉంటే, నిర్దాక్షిణ్యంగా వాటిని లాగేసుకో. నన్ను వీధిన పడియుండే బికారిగా మార్చినా, అందరిచేత తిరస్కృతుడ్నిచేసినా, నాకేం బాధలేదు. కాని నీ స్మృతి మాత్రం నాకిమ్ము, కేవలం నీ స్మరణచేస్తూ, నీ రూపగుణచింతనమందు గడుపుతూ, సచ్చిదానందమందు లీనమైపోవునట్లు అనుగ్రహించు. నాపై వచ్చిపడే సుఖదుఃఖాలు, లాభనష్టాలు అన్నీ నీ స్మృతిలో విలీనం కాని, అది ఎలావచ్చినా, పోయినా సరే, నేనుమాత్రం నీ ప్రేమసాగరంలో మునిగియుందునుగాక ! సర్వుల్లోను, సర్వావస్థల్లోను, సర్వభావాల్లోను, సర్వక్రియల్లోను, సర్వసృజనసంహారాల్లోను, సర్వత్రా, సర్వత్రా నీఉనికినే అనుభవింతునుగాక ! నీ ప్రియమైనస్పర్శని అనుభవిస్తూ, సర్వకాలాల్లోను ఉల్లసితున్నయి ఉందునుగాక !

నామనసునుండి సర్వమూ విస్మరింపజేయుము. దానికిబదులుగా, నామనసులో నీ స్మరణాన్ని మాత్రమే నింపివేయుము. నిన్ను మరిపించేక్షణం ఒక్కటికూడ ఉండకుండునుగాక ! అలాంటిక్షణమేదైనా సంభవిస్తే, నీటినుండి బయటపడిన చేప గిలగిలలాడి చనిపోవులాగున నామనస్సుకూడ నశించునుగాక !

నాప్రాణం సర్వదా నీతోనే వుండనీ ! నీ విరహము నాకెప్పుడు ఉండకుండుగాక ! అట్టిస్థితి ఏర్పడితే, తైలంలేని దీపం ఆరిపోవులాగున, నాప్రాణం శాంతమై నీలో విలీనం కాని !

నీవు నావాడవని, నేను నీవాడినని ఎల్లప్పుడు అనుభవింతునుగాక ! నీవు నన్ను చూస్తున్నావు, నేను నిన్ను చూస్తున్నాను; నీవు నాచేయి పట్టుకున్నావు, నేను నీచేయి పట్టుకున్నాను; నీవు నన్ను కౌగిలించుకొన్నావు, నేను నిన్ను కౌగిలించుకున్నాను; నీవు నాలో లీనమైయున్నావు, నేను నీలో లీనమైయున్నాను; నీవు నాలో ఉన్నావు, నేను నీలో ఉన్నాను; ఈ అనుభవం నాకెప్పుడూ ఉండుగాక !

మా ప్రాణముల ప్రాణమా ! ఆలసించ కిక. ఎంతో సమయం వ్యర్థమయింది. భ్రమిస్తూనే ఉన్నాను. నేను నీవాడనైయుండికూడ, ఇట్టి దుర్దశలో పడిపోతే, ఎలా చూస్తూ ఊరుకుంటున్నావు ? భగవాన్, ఇక త్వరగా అనుగ్రహించుమా, నీ పరమదయానుభవమును చవి చూపుము. స్వామీ నీకు సర్వదా వందనము.

(గీతా ప్రెస్‌వారి 'ప్రార్థన' అనే చిన్నపుస్తకంనుండి)

**భూతేశానందజీతో ముఖాముఖి :**

# దేశ దేశాలలో రామకృష్ణోద్యమం

(శ్రీ రామకృష్ణమఠ ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి భూతేశానందజీ మహరాజ్ ఇటీవల దూర ప్రాచ్య దేశాల పర్యటన పూర్తిగావించి తిరుగు ప్రయాణంలో జూన్ 3 నుంచి 5 వరకు మద్రాసు మఠంలో ఉన్నారు. ఈ సందర్భంగా వారి అనుభవాలను తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో వేదాంత కేసరి ప్రతినిధి స్వామీజీతో సంభాషణ జరిపారు. ఆ సంభాషణ వివరాలను పాఠకులకు అందజేస్తున్నాము.)

ప్రశ్న:- మీరు సందర్శించిన దూర ప్రాచ్య దేశాలలో వేదాంత ఉద్యమ ప్రభావాన్ని గూర్చి తెలియజేయండి.

స్వామీజీ:- రామకృష్ణ ఉద్యమానికి చెందిన మనం మొట్టమొదట ఒక విషయం గమనించాలి. మనకు వేదాంతమంటే కేవలం శ్రీ శంకర, రామానుజుల సంప్రదాయగ్రంథాలలో వివరించబడిన మూల సూత్రాలు మాత్రమే కాదు. వారి బోధనలను అత్యంత శ్రద్ధగా అధ్యయనం చేస్తాము. అయితే రామకృష్ణోద్యమంలో మనకు శ్రీరామకృష్ణ వివేకానందుల జీవితోపదేశాలు వేదాంత భాష్యానికి ప్రాతిపదిక. మానవ రూపంలో దైవాన్ని సేవించటం ద్వారా వేదాంతపరమైన అవగాహన అభివ్యక్తం కావాలని గురుమహరాజ్, స్వామిజీ- ఇరువురూ ఉద్ఘాటించారు. 'శివజ్ఞానే జీవసేవ' (ఈశ్వర భావంతో జీవారాధనము) దీనినే స్వామిజీ అనుష్ఠాన వేదాంతం అన్నారు. సంప్రదాయ గ్రంథాలలో వేదాంతము కేవలం సిద్ధాంతపరంగా ప్రవచింపబడింది; కాని మహత్తరమైన వేదాంత సత్యాలను తోటి మానవాళి నిత్యజీవితంలో అనుసరించేలా చేయాలనే దృఢప్రయత్నం కానరాదు.

ప్రశ్న:- రామకృష్ణ మిషన్ చేపట్టే కార్యక్రమాలలో భారత దేశానికీ, దూరప్రాచ్య దేశాలకూ వ్యత్యాసమేమైన ఉన్నదా ?

స్వామీజీ:- భారతదేశం నేటికీ పేద దేశమే. ఆధ్యాత్మికతకు, ఆకలి కడుపుకూ పొత్తుకుదరదు అన్నారు శ్రీరామకృష్ణులు. అందుచేత మన దేశంలో రామకృష్ణోద్యమం జనసామాన్యం ఆర్థికంగా, సాంఘికంగా పురోగతి సాధించేందుకు బహువిధాలుగా కృషి చేస్తున్నది తద్వారా వారు ఆధ్యాత్మిక మహా సత్యాలను గ్రహించేందుకు అర్హులు, ఆసక్తిపరులు అవుతారు. అయితే నేను ఈమధ్య పర్యటించిన దేశాలన్నీ సంపన్న దేశాలే. అక్కడ పేదరికం, ఆకలివంటి సమస్యల పరిష్కారానికి మనం పూనుకోవలసిన పని లేదు. వాటిలో అధికభాగం సంక్షేమ రాజ్యాలు (welfare states). అక్కడ పౌరులకు కావలసిన సర్వ సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వాలే స్వయంగా అన్నివిధాలైన చర్యలు గైకొంటాయి. అయితే ఈ పథకాలలో లోపమేమంటే అవి కేవలం భౌతికవాదంతో కూడిన ఆలోచనలపై ఆధారపడిఉంటాయి. ఆధ్యాత్మిక ఆదర్శాలతో ఉత్తేజితం కానిదే ఏ పథకమూ ప్రజలకు సుఖ సంతోషాలను సమకూర్చ లేదు, అని పెక్కుసార్లు స్వామీజీ వక్కాణించారు. అందుచేత ఆ దేశాలలో నా ప్రసంగాలన్నింటిలో సంక్షేమ కార్యక్రమాలకు ఆధ్యాత్మిక చైతన్యం ప్రాతిపదికగా ఉండాలని ఉద్ఘాటించాను. ఆ దేశాలకు అనువైన అనుష్ఠాన వేదాంతమదే. సర్వమతాలవారు కలుసుకొని సమష్టి సంక్షేమానికి కృషిచేయడానికి వేదాంత ఉద్యమం ఒక విశాలమైన వేదికగా ఉపయోగపడుతున్నది. ఇదే దాని విశిష్టత

ప్రశ్న:- జపాన్‌లో మిషన్ కార్యాన్ని గూర్చి మీ అభిప్రాయమేమిటి?

స్వామీజీ:- జపాన్ ఉదాహరణ మనకు మిక్కిలి ఉత్సాహజనకము. చిత్తశుద్ధిగల కొందరు భక్తుల బృందము ఇక్కడ కార్యక్రమాలు ప్రారంభించి నిర్వహిస్తున్నది. వారు రెండు కేంద్రాలను స్థాపించారు. రామకృష్ణ వివేకానంద సారస్వతంలో అత్యధిక భాగాన్ని జపనీస్ భాషలోకి అనువదింపజేసుకొన్నారు. వారు పత్రికలను నిర్వహిస్తున్నారు. అధ్యయనం, చర్చాగోష్ఠి, ధ్యానం మొదలైన కార్యక్రమాల నిమిత్తం క్రమబద్ధంగా సమావేశమవుతున్నారు. ఈ కేంద్రాలలో సభ్యులు దాదాపు 200 మంది మాత్రమే ఉంటారు. కాని, పత్రికలు, గ్రంథాలు, వ్యక్తిగత పరిచయాల ద్వారా ప్రభావితమై స్వామీజీయొక్క నవీన వేదాంతాన్ని ఆసక్తితో స్వీకరించిన జపాన్ దేశపు స్త్రీ పురుషులు బహుళ సంఖ్యలో ఉన్నారు.

ప్రశ్న:- జపాన్ దేశస్థులు మన సన్న్యాస సంప్రదాయంలో చేరుతున్నారా?

స్వామీజీ:- అవును. ప్రస్తుతం ఇద్దరు చేరి ఉన్నారు. ఈ సందర్భంగా ఒక విషయం గమనించాలి. వేదాంతం ప్రతి భారతీయుని రక్తంలో జీర్ణించుకొని ఉన్నది. అందుచేత మన దేశంలో యువకులు మిషన్‌లో చేరడానికి సులభంగా ముందుకు వస్తారు. కాని జపాన్ వారి సాంస్కృతిక వారసత్వం వేరు. వారు భారత దేశానికి వస్తే ఆహారం, ఆరోగ్యంవంటి విషయాలలో ప్రబలమైన ఆటంకాలను ఎదుర్కొనవలసివస్తుంది. అందుచేత మిషన్‌లోనికి జపాన్ వారి ప్రవేశం అవశ్యం తక్కువగా ఉంటుంది. నిజానికి మిషన్‌లో చేరమని మనం వారిని ఉద్బోధించము. అది వారి వ్యక్తిగత ప్రేరణపై ఆధారపడి ఉంటుంది. ఆసక్తిగలవారు చేర దలచుకున్నప్పుడు చేరవచ్చును.

ప్రశ్న:- ఆ దేశాలలో రామకృష్ణమిషన్ స్వామీజీల ఆధ్వర్యంలో అనుబంధ కేంద్రాలను స్థాపించే ఉద్దేశ్యమేమైన ఉన్నదా?

స్వామీజీ:- మొట్టమొదట సమస్య స్వామీజీల కొరత. భారత దేశంలోని వివిధ ప్రాంతాలలో తక్షణ కార్యక్రమాలకే సన్న్యాస సభ్యులను పంపలేకపోతున్నాము. అందులో, జపాన్‌లో మఠం కేంద్రం స్థాపించటమంటే పెక్కు సమస్యలతో కూడుకొని ఉంటుంది. ఒక భారతీయ సాధువును పంపాలంటే అతనికి జపాన్ జీవనవిధానానికి సంబంధించిన శిక్షణ తగినవిధంగా జాగ్రత్తగా ఇవ్వాలి. అలాగే, ఒక జపాన్ దేశీయుని స్వామీజీగా తీర్చిదిద్దాలంటే, దానికీ, ఎంతో శ్రద్ధతో గూడిన యోజన శిక్షణ కావాలి. మనం అత్యుత్సాహంతో శిక్షణను కుదించినా, సడలించినా అది మహోద్దేశ్యానికి హానికరము. రామకృష్ణసంప్రదాయంలోని సాధువుల శిక్షణకు వివేకానంద స్వామి నెలకొల్పిన ఖచ్చితమైన ప్రమాణాలను మనం ఎట్టి పరిస్థితులలోను దిగజార్చరాదు కదా!

ప్రశ్న:- ఫిజీలో మిషన్ కార్యంపై మీ అభిప్రాయమేమిటి?

స్వామీజీ:- ఫిజీలో రామకృష్ణమిషన్ కార్యక్రమం ఏభై సంవత్సరాలుగా జరుగుతున్నప్పటికీ, అది ప్రధానంగా ప్రవాస భారతీయులకు మాత్రమే పరిమితమై ఉన్నది. స్వామి రుద్రానందజీ గావించిన మహత్తర సేవలవలన ఆయన పట్ల వారికి అపారమైన గౌరవప్రపత్తులున్నాయి. మిషన్ చేపట్టిన విద్యావిషయక

కార్యక్రమాలు వారి అవసరాలకు మించి నాయి. ఎందుకంటే అక్కడ విద్యారంగాన్ని పూర్తిగా ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. ఇటీవలనే మిషన్ ప్రారంభించిన సాంకేతిక పాఠశాలకూడా అధికవ్యయంతో కూడిన సంస్థ అయింది. అది ప్రభుత్వమే నిర్వహించవలసి రావచ్చు.

ప్రశ్న:- ఆస్ట్రేలియా విషయం వివరిస్తారా?

స్వామీజీ:- ఆస్ట్రేలియాలో నేను కేవలం అయిదు నగరాలు మాత్రమే సందర్శించాను. అందుచేత ఆస్ట్రేలియన్లకు ప్రాతినిధ్యం వహించే వివిధవర్గాల ప్రజలను కలుసుకొన్నానని చెప్ప జాలను. అయితే ఇక్కడ మనం అనుకోని విధంగా అక్కడి మన కేంద్రాలలో ఆస్ట్రేలియా లోని భారతీయులు, తెల్లవారు చక్కని పరస్పర సహకారంతో కలిసి మెలిసి స్వేచ్ఛగా పనిచేస్తున్నారు. ఇది చూసినప్పుడు మిక్కిలి సంతోషం కలుగుతుంది. పెర్త్‌లోని కేంద్రం గణనీయమైన ప్రగతి సాధించటానికి ఇద్దరు వ్యక్తులు—ఒక భారతీయుడు, ఒక యూరోపియను – కారణభూతులు. వారు 200 పౌన్లు సేకరించుకొని, పరిమితమైన ప్రచురణలతో కేంద్రం ప్రారంభించారు. నేడు వారి గ్రంథ విక్రయశాల కొన్నివేల పౌన్లు కిమ్మత్తుగల పుస్తకాలు, పత్రికలతో నిండిఉన్నది. శ్రీరామకృష్ణ వివేకానంద భావ ప్రచారం విస్తృతంగా వించబడింది. అయితే సంచలనాత్మకమైన ప్రకటనలతో ఆధ్యాత్మిక ప్రమాణాలను దిగజారుస్తున్న ఇతర మతసంస్థలు, నకిలీ ఆధ్యాత్మిక సంస్థలు ఆస్ట్రేలియాలో అధికసంఖ్యలో పని చేస్తున్నాయని అంగీకరించవలసి ఉన్నది.

ప్రశ్న:- సింగపూర్‌లో మిషన్ కార్యాన్ని గూర్చి తెలియపరుస్తారా?

స్వామీజీ:- సింగపూర్‌కు సంబంధించి గమనార్హమైన విషయమేమంటే అక్కడి ప్రభుత్వం నిజంగా లౌకికమైనది. మతాలమధ్య విచక్షణ లేకుండా అన్నీ సమానంగానే చూడబడుతున్నాయి. కాని ప్రభుత్వం సదా జాగ్రత్తగా ఉంటుంది. తమకు యిచ్చిన మతస్వేచ్ఛను ఏ సంస్థ అయినా దుర్వినియోగం చేస్తే తీవ్రచర్య గైకొనటానికి ప్రభుత్వం వెనుకాడదు. పాఠశాలలో మతబోధను ప్రోత్సహిస్తారు; కాని మత దురభిమానాన్ని సహించరు.

ప్రశ్న:- భారతదేశంలో పుట్టిన వివిధమత సంస్థలు విదేశాలలో సాగిస్తున్న దుశ్చర్యల దృష్ట్యా రామకృష్ణమిషన్ నిర్వహిస్తున్న పాత్ర ఎలాంటిది ?

స్వామీజీ:-మతసంస్థలయొక్క అవాంఛనీయ ధోరణులు మనకు క్రొత్తకాదు; అవి కేవలము విదేశాలకు పరిమితమూ కాదు. స్వదేశంలోనే ఇంతటి ప్రాచీన సంప్రదాయం కలిగి ఉన్నప్పటికీ, అప్పుడప్పుడు కుక్కగొడుగులవంటి సంస్థలు తల ఎత్తుతుంటాయి. అలాంటి కపటసంస్థలను నిర్మూలించటానికి ఇంద్రజాలంవంటి దేమీ లేదు. మన ఆధ్యాత్మిక రంగంలో ఇలాంటి లోపాలకు మనమంతా బాధ్యులమే. ఉపనిషత్తులు, గీత వంటి గ్రంథాలు ఎన్ని చెప్పినప్పటికీ ప్రజలు యింకా అద్భుతాల వెనుక పరుగులు తీస్తూనే ఉన్నారు. సహజంగానే వంచకులు, మతాలు వీరినుంచిసొమ్ము చేసుకోవటానికి ప్రయత్నిస్తారు. నిజమైన ఆధ్యాత్మికతపట్ల దృఢవిశ్వాసంతో మనలో ప్రతిఒక్కరు నిష్ప్రయోజనమూ, ప్రమాదకరమూ అయిన ప్రయత్నాలు విడనాడాలి.

ప్రశ్న:- పాశ్చాత్య కేంద్రాలలో యోగం నేర్పబడుతున్నదా?

స్వామీజీ:- అత్యధిక సంఖ్యాకులైన ప్రజల దృష్టిలో యోగమంటే హఠయోగం మాత్రమే. ఆరోగ్యాన్ని మెరుగుపరచి కొంతవరకు మానసిక ప్రశాంతతను సమకూర్చే శారీరక అభ్యాసాలంటే వారికి ఆసక్తిమెండు. కాని, స్వామీజీ ప్రవచించినట్లు జ్ఞానం, భక్తి, నిస్వార్థకర్మ, ధ్యానమూ మొదలైన వీటన్నింటి ద్వారాగాని లేక ఏ ఒక్కదాని ద్వారా గాని బాహ్యమూ, అంతరమూ అయిన ప్రకృతిని వశపరచుకొనుటయే-నిజమైన యోగమని స్పష్టీకరిస్తున్నాము.

ప్రశ్న:- మిషన్ వారు క్రొత్తపంథాలో ప్రయత్నించి మరింత ఎక్కువ జనసంఖ్యను వేదాంతంలోకి ఆకర్షించకూడదా?

స్వామీజీ:- ఏ సంస్థ అయినా తన సిద్ధాంతాలకు అనుగుణంగా పనిచేస్తుంటుంది. మనకు మార్గదర్శక సూత్రాలను రూపొందించిన వివేకానందస్వామి, ఈ సందర్భంగా, మనం ఫలితాన్ని ఆశించకుండా, నిస్వార్థతతో, అసహనానికి లోనుగాకుండా, శ్రీరామకృష్ణుని అభయహస్తంపై పరిపూర్ణ విశ్వాసముంచి సంఘటితమైన తీవ్ర కృషిసలపాలని ఉద్బోధించారు. అందుచేత రామకృష్ణమిషన్ సంచలనాత్మక విధానం అనుసరించే ప్రసక్తిలేదు. మనకార్యం క్రమబద్ధము నిశ్చయము. ఆధ్యాత్మిక గురువులుగా నటిస్తూ అయిదు డాలర్లకు సమాధిస్థితిని అమ్మజూపేవారితో మనము సమఉజ్జీలుగా పోటీపడము.

ప్రతినిధి:- తమరు ఓర్పుతో మా ప్రశ్నలన్నింటికి వివరంగా సమాధాన మిచ్చినందుకు ధన్యవాదాలు స్వామీజీ.

---

# అభ్యర్థన

కృష్ణా! వాసుదేవా!

నీ అనుగ్రహాన్ని పొంది తరించమని నీవే తెలియచేశావు. సాధనతో నిన్ను తెలుసుకొని ధన్యత నొందమని ప్రబోధించావు. పూజ సలపమన్నావు. సంకీర్తన చేయమన్నావు. జపం సాగించమన్నావు. ధ్యానం ఆచరించమన్నావు. హే ప్రభో! ఇవన్నీ నేనుచేస్తే నీవు నాకు ముక్తిని ప్రసాదిస్తావు. అంతేకదూ! అయితే నీవూ ఒక వ్యాపారివే అవుతావు.

డబ్బు పుచ్చుకొని వర్తకుడు సరుకులిస్తాడు. మా ప్రార్థనలు ఆలకించి నీవు మాకు సద్గతిని ప్రసాదిస్తావు. అలాంటప్పుడు నీ దయయొక్క స్థానమేమిటి? ఇలాంటి వర్తకసంబంధముతో నీవు దయాస్వరూపుడవు కాలేవు. నేను చేసే సాధనలను నీవు అనుగ్రహించడముకాదు. నేను ఏమీ చేయను. అయినా నీవు అనుగ్రహించాలి. అప్పుడే నీవు కారుణ్యమూర్తివి కాగలవు.

భగవాన్! ఇప్పుడు నేను ఏమీ చేయడంలేదు. చేయడంలేదనే సంకల్పంకూడా వదలిపెట్టాను. సంకల్పాలు కదలడంలేదు. సంకల్పాలు కదిలేచోటుకెళ్ళి చూశాను. అంతా నిశ్శబ్దంగావుంది. నిస్తరంగ జలధిలా అచలమైంది. ఆ శాంతిసాగరంలో మునకవేశాను. నేనే ప్రశాంతిగా మారిపోయాను. అప్పుడు తెలిసింది. భగవాన్! నీవెవరివో కావని, నేనే నీవని, నీవే నేనని, మన ఇరువురికి భేదంలేదని.

నీ దయ ఏమిటో ఇప్పుడు తెలిసింది. సాగితే అర్థంకాదని, ఆగితే అవగతమవుతుందని తెలిపావు. అడగడంలో లేని ఆనందం, ఆగడంలో వుందని ఎరుకపరచావు.

నాకు నేనుగా ఆగిపోయాననుకున్నాను గాని, నీవు ఆపితే ఆగినట్లు ఇప్పుడే గ్రహించాను. అడగమని నా మనస్సు ప్రేరేపిస్తే ఆగమని నీ దయ ఆదేశించింది. కదలిపొమ్మని నా మనస్సు ప్రకోపిస్తే కరగిపొమ్మని నీ దయ దారిచూపింది.

అనంత కృపాసాగరా! నీ దయ అనిర్వచనీయం. నీ దయ వుంటే తప్ప నీ దయాస్వరూపాన్ని వర్ణించను వీలుకాదు.

—బ్రహ్మచారి సుందరరాజన్.

# గ్రీక్ అవధూత సోక్రటీస్

జాన

"మీ ఆఖరి కోరిక ఏమిటి?"

"ఆఖరి కోరికా!? ఓహో... ఔను కోరిక కదూ?...ఉంది తీరుస్తావా?"

కోటీశ్వరుడైన శిష్యుడడిగిన ప్రశ్నకు, ప్రశాంతంగా, మందహాసం చేస్తూ ఆ గురువు మారడిగాడు. శిష్యుని వదనం వాడిపోయివుంది. దుఃఖాశ్రువులు ధారాపాతంగా కారుతున్నాయి. ధరించిన నిడుపాటి చొక్కా– ఆ కన్నీటి బిందువులను పీల్చుకోలేక పీల్చుకొంటున్నది. అతని నోటినుండి మాట రావటమే కరువైంది. గురువు నలాంటి భీకరస్థితిలో చూస్తూ తల్లడిల్లి పోతున్నాడు. ఆ భీకరస్థితి నుండి తప్పించేందుకు సర్వసమర్థుడైకూడ, సర్వసన్నాహాలు చేసి కూడ, నిస్సహాయుడై కూర్చున్నాడు. తానెంత ప్రయత్నం చేసినా, దానికి గురువు సుముఖంగా లేక పోవటం వల్ల ఆ శిష్యుడు చేవ యుండీ దీనుడయ్యాడు. చివరికి కనీసం, గురువుగారి చివరి కోరికనైనా తీర్చి సంతృప్తి పడదామనుకున్నాడు. అందుకే గురువునలా అడిగాడు. గురువు దానికి వెంటనే అనుకూల ప్రశ్న వేయుగానే, ఆ శిష్యునిలో తిరిగి కాస్త ఉత్సాహం కన్పించింది.

"తీర్చకపోవట మేమిటి!! మీ కోరిక ఎంతటిదైనా సరే, నా సర్వస్వాన్ని ధారబోసైనా తీరుస్తాను. చెప్పండి త్వరగా."

శిష్యుని ఆసక్తికి, కుతూహలానికి, గురుభక్తికి ఆనందంతో గురువుగారు పరవశించి, నవ్వుతూ ఇలా అన్నాడు.

"అస్క్లేపియన్స తెలుసుకదా నీకు – నా మిత్రుడు. అతనికొక వస్తువివ్వాలి. ఇచ్చేవాణ్ణే. కాని అనుకోకుండా నాకీ మహా ప్రయాణం సంభవించింది కదా! వీలయితే, ఆ వస్తు

నా ము.'

"ఏమిటది?"

"కోడిపెట్ట."

ఆ సమాధానం విన్న క్రీటోకు నవ్వాలో, ఏడ్వాలో అర్థంకాలేదు. మరేదో అడుగుతాడనుకున్నాడు. తన భార్యా బిడ్డల పోషణ భారాన్ని తన కప్పగిస్తాడేమోనని అనుకున్నాడు. చివరి దశలోనైనా తనను తప్పించమని కోరుతాడేమోనని అనుకున్నాడు. కనీసం తన ఐశ్వర్యమంతా, తన సిద్ధాంత ప్రచారం నిమిత్తం వినియోగించమనైనా అడుగుతాడేమోనని అనుకున్నాడు. కానీ క్రీటో అభిలాషలు, మనోరథాలు ఒక్కటీ నెరవేరలేదు. అడగక అడగక ఈ 'కోడిపెట్ట' నడిగాడు. తనంతటి కోటీశ్వరుడైన శిష్యుణ్ని అడగవలసింది దేనా? ఏదో తన మనసుకు బాధ కల్గించకుండా ఉండేందుకు ఇలా అడిగాడు గానీ...నిజంగా గురువుగారు కోడిపెట్ట బాకీ పడిఉన్నారో లేదో, ఎవరికి తెలుసూ?

కోడి పెట్టనడిగిన ఆ గురువుగా రెవరనుకున్నారూ? అతనే సోక్రటీస్. మహా మేధావి, మహాజ్ఞాని అతను. తూర్పున భరతఖండంలో సర్వవిద్యలు విలసిల్లి, ప్రపంచానికంతటికీ జ్ఞానదానం చేసినట్లుగానే, పశ్చిమంలో గ్రీసు దేశం కూడ అంతటి ప్రసిద్ధి బడిసింది. నేడు గ్రీసు దేశపు నామం అంతంత మాత్రంగానే ఉన్నా, ఒకప్పుడు అదీ అన్ని రంగాల్లోను ప్రపంచానికి మార్గదర్శకత్వం వహించింది. పైథాగరస్ లాంటి తాత్త్వికులు, గణితజ్ఞులు వెలసిన దేశమది. ప్లేటోలాంటి మహాధీమంతులు ఉద్భవించిన దేశమది. అలెగ్జాండర్ లాంటి శౌర్యం, పట్టుదల, ఆత్మవిశ్వాసంగల ధీరులుప్పతిల్లిన ప్రాంతమది. ఆ దేశంలో కళలేమిటీ, ప్రకృతి శాస్త్రాలేమిటీ, సామాజిక విద్యలేమిటీ, రాజనీతి విజ్ఞానాలేమిటీ,

ప్రతి ఒక్కటీ నాటికాలంలో అక్కడ ఉన్నతంగా వికసించాయి.

మన దేశంలో లాగానే, ఆ దేశంలోను భాషాపరమయిన స్వల్పమైన ప్రాంతీయ భేదాలుండేవి అయితే మొత్తంమీద వారు తమ భాష ఒక్కటే అని స్థిరనిశ్చయం గల్గియుండేవారు. ఒకప్పుడూ మనకు అంతటి అదృష్టముండేది. మన దేశభాష సంస్కృతమని సగర్వంగా చెప్పుకొనేవారము. కాని నేడు సంస్కృతానికి ఆదరణ తగ్గింది. తత్ఫలితంగా ఎన్నెన్నో భాషా భేదాలు పుట్టుకొచ్చాయి. మన అంతర్గత కలహాలను అవకాశంగా తీసుకొని మహమ్మదీయులు, ఆంగ్లేయులు తమ ప్రాబల్యం పెంచుకొన్నట్లుగానే, నేడీ భాషాభేదాల కారణంగా, పరభాష అయిన ఆంగ్లం తన ఆధిపత్యాన్ని పెంచుకొని, మన భాషలనన్నింటినీ శాసిస్తున్నది. ఇదెంతయినా శోచనీయం. ఇది ఇలాగే కొనసాగితే, కొంతకాలం తర్వాత దేశీయ భాషలు కుంచించుకుపోయి, సమసిపోయే ప్రమాదముంది. భాషావేత్తలు, ప్రాజ్ఞులు, దేశీయతను ప్రేమించేవారు సాధ్యమైనంత త్వరలో రంగంలో దిగి ఈ విషయమై తగు పరిష్కారం చేయవలసిన అవసరమెంతయినా ఉంది. జర్మనీలో జర్మన్ భాష, జపాన్‌లో జపాన్ భాష, రష్యాలో రష్యాభాష, చైనాలో చైనీస్ భాష — నేడు విరాజిల్లి ప్రకాశిస్తున్నాయి. తమ తమ వైజ్ఞానిక విషయాలన్నింటినీ, అన్వేషణల నన్నింటినీ తమ తమ భాషల్లోనే వెలువరుస్తున్నాయి. ఒక్క అమెరికా, ఒక్క ఇంగ్లాండ్, మరికొన్ని దేశాలనుతప్పించి, ఇంగ్లీష్‌ను తమ జాతీయ, శాస్త్రీయ భాషగా ఏ ప్రఖ్యాత దేశం కూడ స్వీకరించ లేదన్నది పైదానివల్ల విదితమవుతున్నది. ఆయా దేశాలు తమ కవసరవిషయాలను సూటిగా మూలభాషనుండే తమ భాషల్లోకి అనువదించుకొని, తమ భాషను పుష్టివంతం చేసుకొంటున్నాయి. మన దౌర్భాగ్యమేమోగాని, మనకు ఇంగ్లీష్ భాషా పారతంత్ర్యం నేటికీ పోనట్లు లేదు. పైగా మనకంటూ ఒక దేశీయ జాతీయ, శాస్త్రీయ భాష లేకుండా చేసుకున్నాం. అలాంటి స్థానాన్ని ప్రాంతీయ భాషలు స్వీకరించ లేవు. హిందీ స్వీకరించగల్గినా. అది అందరిని సమ్మతింప జేయజాలకున్నది. సంస్కృతంపై ఎవ్వరికీ విద్వేషం లేదు; పైగా అందరికీ అభిరుచి ఉంది. దేశీయులకే కాదు, ప్రపంచ దేశ ప్రజలందరికీ సంస్కృతంపై మక్కువ ఉన్నది. ఈ సంస్కృత భాషను సాధ్యమయినంత త్వరలో మన దేశీయులందరికీ అలవరిచిన నాడు, తిరిగి మన దేశంలో వికాసపు జ్యోతులు ప్రకాశిస్తాయి. తిరిగి నలందాలాంటి విశ్వవిద్యాలయాలు, నాగార్జునిలాంటి ఆచార్యులు, ఇతర దేశాలకు విజ్ఞాన దానంచేస్తారు. ఆ ఉచ్ఛదశ అతిత్వరలో వస్తుందని ఆశిద్దాము.

అన్నట్లు సోక్రటీస్ గూర్చి ముచ్చటిస్తూ ఈ భాషా గొడవలో ఎందుకు పడ్డాము! దానికి కారణముంది. సోక్రటీస్ గాని, మరేతర పాశ్చాత్య మేధావిగాని, తమతమ భాషల ద్వారానే విశ్వవిఖ్యాతి నొందారు. అందుకే స్వభాషను ఆదరించి పుష్టివంతం చేసుకోవాలని చర్చించటమైనది.

గ్రీసు ప్రజాతంత్ర రాజ్యము. ఏథెన్స్ దానికి ప్రధాననగరము. కేంద్రీయ చర్యలన్నీ ఈ నగరం నుండే నిర్వహింపబడేవి. ప్రజలంతా శాసనసభ్యుల నెన్నుకొనే వారు. ఆ సభ్యులు అధికారిక కార్యకలాపాలను నిర్వహించేవారు. అయితే ఆ రాజ్యంలో న్యాయవాదు లుండేవారు కారు. న్యాయస్థానాలు మాత్రం ఉండేవి. నేరస్థులు, ముద్దాయిలు స్వయంగానే స్వపక్ష వాదం చేసుకొనేవారు.

తన అభిప్రాయాన్ని చక్కగా వ్యక్తం చేయనప్పుడు, అలా వ్యక్తం చేయగలిగేందుకు మరొకరి సహాయం తీసుకునేవారు తప్ప నేటి కాలంలో లాగా ప్రభుత్వ న్యాయవాదులని, డిఫెన్సు లాయర్లనిగాని ఉండేవారు కాదు. ఇది కొంతవరకు నయమేమో అనిపిస్తుంది. ఈ పద్ధతి ద్వారా ముద్దాయి తనపైని నేరారోపణను రద్దుచేసుకోగల్గక పోయినా, నేటిలా న్యాయవ్యవస్థలో అవినీతికి మాత్రం స్థానం ఉండేది కాదు. తిమ్మిని బమ్మిచేసే అన్యాయులైన న్యాయవాదుల ఆటల కవకాశం ఉండేదికాదు. చిరు చిరు పోట్లాటల కారణంగా తమ సొత్తునంతా లాయర్ల జేబుల్లో నింపి తాము బికారులైపోయేందుకు వీలుండేదికాదు. ధనవ్యామోహంలో పడి న్యాయవాదులు, కేసులను చిలువలు పలువలు చేసి ఉభయ పార్టీల మధ్య విద్వేషాగ్నులు రగులు కొల్పేందుకు వీలుపడేది కాదు. నిజానికి న్యాయవాదులు లేకుండా ఉంటే, పోట్లాటలు ఇంతగా పెరిగి, మనుష్యుల మధ్య ఇంత ఎత్తున ఈర్ష్యాద్వేషాలు ప్రజ్వరిల్లేని కావేమో! క్రీస్తు నుడివినట్లు, కోర్టుకు వెళ్ళేదారిలోనే ఇరుపక్షాలు రాజీ కొచ్చేవేమో! కాని నేడీ అవకాశం ఏ మాత్రం కనబడ్డం లేదు. రాజీకి వీలయిన కేసులను కూడ స్వప్రయోజనపరులైన న్యాయవాదులనేవారు దీర్ఘవ్యవహారాలుగా మారుస్తున్నారు. బహుశ న్యాయవాదుల వలని ఇన్ని అనర్థాలు జరిగే అవకాశ ముందనే ఎంచి కాబోలు ఏథేన్సు పాలకులు, అలాంటి పదవులకు స్వస్తి చెప్పారు. మన భారతదేశంలో కూడ పూర్వం ఇలాంటి స్థితే ఉండేదన్నట్లు శాస్త్ర పరిశీలిస్తే తెలుస్తుంది. రాజులో, మంత్రులో, న్యాయాధికారులో, పురోహితులో, న్యాయాధిపతిత్వం వహించి, నేరాలను విచారించేవారు. ముద్దాయిలు, స్వయంగా తమ తమ వాదాలను విన్పించేవారు. చివరికి ఒక శునకము, శ్రీరాముని ముందు తనవాదం స్వయంగా మొరపెట్టుకొన్నదంటే న్యాయవ్యవస్థలో ముద్దాయిల కెప్పు డెంత ప్రాముఖ్యమివ్వబడిందో తెలుస్తుంది. నిజమే! ఒక వ్యక్తి స్వపక్ష వాదాన్ని, మరోవ్యక్తి ఎంత విజ్ఞుడైనా ఎలా వివరించగలడూ? తన స్వంత భావాలే చెప్పగలడు కాని, ముద్దాయి మనసులోని భావాలను వ్యక్తీకరించగలడా? పరిస్థితి ఇలాంటిది కాబట్టే, మన పూర్వులు, గ్రీకులు సైతం న్యాయవాదులంటూ ప్రత్యేక వ్యక్తులకు స్థానం కల్పించ లేదు. ఈ విషయం కూడ నేటి పాలకులు ఆలోచించవలసిందే.

సోక్రటీస్ కూడ తనపైని నేరాన్ని తానే వాదించుకోవలసి వచ్చింది. అంతటి మేధావి, అంతటి మహాజ్ఞాని కూడ నేరం చేశాడా అని అంటారేమో! నాటి ఏథేన్సు వాసులతన్ని నేరస్థుడనే, చెప్పాపెట్టకుండా బంధించి, న్యాయమూర్తి ముందు నిలబెట్టారు మరి! వారి అభిప్రాయంలో అతను నేరస్థుడే. కాని యువకులకు మాత్ర మతను పరిశుద్ధమైన హృదయుడే నని మనం గుర్తించాలి.

నాటిపెద్దలే సోక్రటీసును నేరస్థు డన్నారు. దానికాకారణం లేకపోలేదు. సోక్రటీసు అతి మెత్తగా వారి అజ్ఞానాలను, అహంకారాలను బట్టబయలు చేసి, వారి నిజస్వరూపాలను బయటపెట్టాడు. ప్రసిద్ధులైన వక్తలను, నాటకకర్తలను, కవులను, వృత్తివిద్యావేత్తలను, రాజకీయవాదులను, తదితరుల అందరి జ్ఞానాహంకారాలను బయటపెట్టి, వారిలో అజ్ఞానం పాలే ఎక్కువగా నున్నదని నిరూపించాడు. ఈ చర్య కతను వింతమార్గాన్ని అనుసరించేవాడు. తమకు ఫలానా విషయం

బాగా తెలుసునని అనుకొనేవారి వద్దకు వెళ్ళి, ఆ విషయం గూర్చి తనకేమి తెలియదని చెప్పి, దాన్ని తెలియజెప్పమని కోరేవాడు. దాంతో మొదట్లో ఆయావ్యక్తులు ఉబ్బిపోయి ఏదో చెప్పేవారు. సోక్రటీస్ వారిని గుచ్చి గుచ్చి ప్రశ్నించి, చివరికి వారిని నిరుత్తరులుగా చేసి వేసేవాడు. వారి భావాలన్నీ అసత్యాలేనని వారినోటనే పల్కించేటట్లు చేసేవాడు. ఈ కారణంగా దురభిమానులయిన ఆ పెద్దలందరికి సోక్రటీసంటే భయం-క్రోధం-ద్వేషం పెరిగి పోయాయి. నాటకకర్తలు తమ నాటకాల్లో సోక్రటీస్‌ను వక్రంగా చిత్రించి తృప్తిపడే వారు. కవులు అతనిపై వ్యంగ్యకావ్యాలు వ్రాసి ఆనందించేవారు.

సోక్రటీస్ కేవలం ఇలాంటి పండితమ్మన్యుల బండారాన్ని బయటపెట్టటమే కాదు, సామాజిక పరమైన మూఢాచారాలను, నమ్మకాలను కూడ బాహాటంగ ఖండించేవాడు. నాటి సంఘంలో పూనకాలను, వారి మాటలను దైవ తుల్యంగా జనులు నమ్మేవారు. దేవతలు, మనుష్యులను ఆవేశించేవారని, ప్రజలకు వారి ద్వార తమ భావాలు తెలిపేవారని పౌరులు నమ్మేవారు. నాటి ప్రజల విషయమేమో గాని, నేడు మన భారతదేశంలో, పల్లీయులు, విద్యావంతులుసైతం కొండొకచో వైజ్ఞానిక విద్యావేత్తలు సైతం ఇలాంటి పూనకాలను గుడ్డిగా నమ్ముతున్నారంటే, మన మెంతగా మానసిక దైన్యావస్థలో నున్నామో గ్రహించ వచ్చును. మోడరన్ విద్య నభ్యసించిన కొందరు యువరచయితలు సైతం, జనులలో ఇలాంటి మూఢాభిప్రాయాలను నాశనం చేయు టానికి మారుగా, వాటిని సమర్థించే టట్లుగా చేతబడులు - మంత్రాలు - భూతాలు లాంటి వాటితో కూడిన పరమ చెత్తసాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. వీరి కలాలను మూయించే సోక్రటీస్ ఎవరయినా ఉదయిస్తే బాగుండును. నాడు సోక్రటీస్ వీటినన్నింటిని వొట్టి బూటకాలే అని ఖండించి, సత్యవిషయాన్ని తెలియజెప్పాడు. ఖగోళవిషయాల శాస్త్రీయసత్యాలను స్పష్టపరచి, పూనకాలవారి మాటలు పచ్చి అబద్ధాలని ఋజువు చేశాడు. నాటి గ్రీ ప్రజలనేక దేవతలను నమ్మేవారు. ఆ నమ్మకాన్ని కూడ ఆక్షేపించి, సర్వేశ్వరుడొక్కడే నని చెప్పి, అతను జ్ఞానస్వరూపుడని వివరించాడు.

ఇలా నాటి విద్యావేత్తల, ప్రాజ్ఞుల, పౌరుల భావాలను, విశ్వాసాలను తీవ్రంగా ఖండించటం మూలంగా, అంతా ఒక్కటై సోక్రటీస్‌పై ప్రతీకారం తీసుకోదలిచారు. దానికే మాత్రం అవకాశం దొరుకుతుందా అని వేచియున్నారు. అలాంటి స్థితిలోనే సోక్రటీస్ బోధలయెడల యువకులు ఆకర్షితులైనారు. అతని బోధల పరమ ప్రయోజనమేమిటో వారు గ్రహించారు. మనుష్యుల్లో వివేకాన్ని జాగృతం చేయటమే సోక్రటీస్ ఉద్దేశమని వారు తెలుసుకొన్నారు. ప్రజలకు, సోక్రటీస్ తమ్ముతాము కాలం క్రమంగా విమర్శించుకోవలసి దని సూచించాడు. పూర్వాచారాలను, మూఢ నమ్మకాలను సహేతుకంగా ఎదుర్కొని ప్రశ్నించమని హెచ్చరికగా చెప్పాడు. మిథ్యాగర్వాలను త్యజించమని, సత్యాన్వేషణ చేయుమనికోరాడు. "జ్ఞానాన్ని ఆశ్రయించండి. తర్కాన్ని ఆయుధంగా ధరించండి. సత్యంవైపు సాగండి. దద్దమ్మలై ఒకచోటనే ఆగిపోకండి. మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి మీ చుట్టూ జరిగే సంఘటనలను విమర్శించి సత్యం రాబట్టండి. కేవలం సత్యంకోసం, జ్ఞానంకోసం మాత్రమే యత్నించండి, ఆగవద్దు విశ్రమించవద్దు మూగ

పోవద్దు. జీవితాంతం వివేకంతో, వివేచన చేస్తూ, బుద్ధికి పదును పెట్టండి." అంటూ ఏథెన్స్ వాసులకు బోధించాడు.

నిశితబుద్ధిని అలవరచుకోమని చెప్పేబోధ మూఢబుద్ధులయిన పెద్దలకు నచ్చకపోయినా, యువకులను మాత్రం ఆకర్షించింది. అతని చైతన్యవంతమైన గతిశీలమైన ఆ బోధలు వారిలో ప్రబోధం కల్గించాయి. ఆ యువత సోక్రటీస్‌ను, పెద్దలను సైతం కాదని అనుసరించింది. పెద్దలకు సోక్రటీస్ ఉనికి కంటకప్రాయమై పోవటమేగాక, వారి కుమారులు సైతం తమ చేదాటిపోవటంవల్ల, వారిక సహించలేక పోయారు. యువకులను తప్పుడుమార్గంలో పెడుతున్నాడని, దేవతల నధిక్షేపిస్తున్నాడని నేరాలుమోపి అతన్ని బంధించి, న్యాయస్థానం చేత అతనికి మరణశిక్ష విధింపజేశారు.

ఆ శిక్షవిని శిష్యులెంతగానో కలవరపడ్డారు. కాని సోక్రటీస్ మాత్రం తొణకలేదు ఎప్పటి చిరునవ్వుతోనే ప్రశాంతంగా దాన్ని స్వీకరించాడు. "ముసలితనంలో చచ్చేకన్నా, శరీరం ఆరోగ్యంగా ఉన్నప్పుడే చావటం మేల"ని వ్యాఖ్యానించాడు. సోక్రటీస్‌కు రాగద్వేషాది భావాలు లేవు. అతనికి ఎవరిపైనా ద్వేషభావం లేదు. అందరినీ ప్రేమించేవాడు. చివరికి తనకు మరణదండన విధించిన ప్రభుత్వాన్ని సైతం తప్పుపట్టలేదు. "ప్రభుత్వశాసనం, అది ఎలాంటిదైనా దానికి ప్రజలు కట్టుబడియుండాలి. లేదా శాసనాన్ని మార్చుకోవాలిగాని, దాన్ని ఉల్లంఘించకూడదని" చెప్పేవాడు. అందుకే తనకు విధించిన శిక్షను కూడ సంతోషంగా విధేయుడై గ్రహించాడు. ఎంతోమంది శిష్యులు ఇతరులు అతన్ని తప్పించటానికి సంసిద్ధులయినప్పటికీ, అలాంటి అపమార్గాన్ని సోక్రటీస్ అనుసరించలేదు. మృత్యువంటే అతనికి ప్రత్యేకమయిన భావం లేదు. చావు బ్రతుకులను సమానంగానే చూసేవాడు. "జీవితాన్నెంత ఆనందంగా స్వీకరించానో, మరణాన్ని కూడ అంతే ఆనందంగా ఆహ్వానిస్తాను" అని చెప్పిన స్థితప్రజ్ఞుడతను "మరణం కష్టమా? కాదు. జీవితం పాపపంకిలమగుటయే కష్టము" అని పరిశుద్ధ, పవిత్ర జీవితం గడిపిన వాడతను.

అతను పేదవాడు. నిరాడంబర జీవి. అయినా సత్యసంతోషి. అతని భార్య అతన్నెంతగానో పీడించేదని చెబుతారు. ఆమె గయ్యాళితనాన్ని కూడ చిరునవ్వుతో స్వీకరించిన వాడతను. అతనికి అన్నపానీయాదులందు ఆసక్తిలేదు. ఏదైనా తాగేవాడు. కొన్నిమార్లు అసలవి లేకుండానే కాలం గడిపేవాడు. ఒక్కోమారు త్రాగుబోతులు సైతం తాగలేనంతగా తాగేవాడు. అయినా మామూలుగానే ఉండేవాడు.

సోక్రటీస్ జీవితంలో కొంతకాలం సిపాయిగా కూడ పనిచేశాడని చెబుతారు. సిపాయిగా, శత్రువులను దునుమాడేవాడు. అతనికక్కడ భావావేశం కల్గేదికాదు. కేవలం కర్తవ్యదృష్టేయుండేది. అలాంటి జీవితంలోనే ఒకానొకవేళ అతనిలో జ్ఞానోదయమయింది. తనకు తెలిసిన జ్ఞానం, నిజమయిన జ్ఞానమేనా, ఇంతకు మించిన జ్ఞానం మరెక్కడయినా మరేదయినా ఉందా అన్న అన్వేషణ కొనాటినుంచి పూనుకొన్నాడు. "నాకు తెలిసింది ఒక్కటే, నాకేమీ తెలియదని" అని అతను అంటుండేవాడు. 'నిన్ను నీవు తెలుసుకో'. ఆవేశాలకు లొంగిపోకు. అసూయ, స్వార్థాలతో ఆలోచించినప్పుడు సత్యం బయటపడదు. రాగం, ఆసక్తి, ప్రేమ ఇవికూడ సత్యాన్వేషణానికి అడ్డుకులే. వీటిని సైతం దాటి గమించాలి. ఎవరు ఏదీ చెప్పినా, నాదైనాసరే, గుడ్డిగా నమ్మవద్దు. మీ హేతుబుద్ధితో విచారించాలి,

ఎవరు ఏదీ కొత్తగా చెప్పరు. ఆ విషయాలు, ఆ సత్యం ప్రతి ఒక్కరిలోను ఉంది. దాన్ని వెలికి తీసుకోటమే వారి పద్ధతి. మనిషిలోని ఆలోచనాశక్తిని బయటికి లాగటమే కాని నేను మరేమి చేయటం లేదు'' అని విశద పరిచేవాడు.

సోక్రటీస్‌లో భయమనేది ఏకోశాన కన బడదు. అతను నిర్భయంగా సంచరించేవాడు. ప్రజల మధ్యనే ఎక్కువ కాలం తిరుగుతూ వారిని ప్రబోధం వైపు తీసుకెళ్ళేవాడు. ఒక్కసారు గంటలకొలది ఏదో ధ్యానంలో అలాగే నిలబడి పోయేవాడు. వీధిలో వారంతా అతని చుట్టూ పోగై ఎంత గొడవ చేసినా అతనికి తెలిసేది కాదు. చివరికి ధ్యానం సడలి చుట్టూ సారించి, ఒక్క చిరునవ్వు నవ్వి చరచరా వెళ్ళిపోయేవాడు.

ప్రజలతన్ని అవమానించినా, కొన్నిమార్లు హింసించినా వాటిగూర్చి ఇసుమంత కూడ ఆలోచించేవాడు కాదు. అతనికి ప్రజల చేష్టల కన్నా, మానవునిలోని జ్ఞానవికాసం గూర్చే ఆలోచన ఉండేది. అందరికి సత్యదర్శనం చేయించాలన్న పట్టుదల ఉండేది. అంతటి హితాభిలాషిని, శ్రేయోభిలాషిని, ఆ నాటి ప్రజలు కసికొద్ది విషమిచ్చి చంపించటానికి సిద్ధమయ్యారంటే, వారి వ్యక్తిత్వాల నెలా పేర్కొనాలో తెలియటం లేదు.

కొన్ని కారణాల చేత సోక్రటీసును వెంటనే చంపలేకపోయారు. నెలరోజుల వరకు అతన్ని బంధించారు. ఆ నెలరోజు లతను సామాజిక ఆధ్యాత్మిక విషయాల గూర్చి బోధించాడు. జైలు అధికారికి సైతం సోక్రటీస్ అపరాధి కాడన్న సంగతి అప్పటికే స్పష్టమయింది. సోక్రటీస్‌పై అతనికెంతో గౌరవమూదయించింది. సోక్రటీసతన్ని ప్రేమతో పలకరించేవాడు. అతని ప్రేమను చూసి జైలు అధికారి ''మహాత్మా, మీలాంటి మనుషుల నేనిదివరకు చూడలేదు. నన్నింతవరకు, బంధితులంతా అగౌరవంగానే చూసేవారు. కాని మీరు మాత్రం నన్ను సాటి మనిషిగా ప్రేమిస్తున్నారు. మీ చావుకు నేనే సాధనాలు సమకూరుస్తా నన్న సంగతి తెలిసికూడ మీరు నన్ను గౌరవంగానే చూస్తున్నారు. నిజానికి నేను. పై అధికారుల ఆజ్ఞను మాత్రమే నిర్వహిస్తున్నాను తప్ప, నేనుగా ఈ నీచకార్యం చేయటం లేదు కదా! ఈ విషయం మీ రొక్కరే గ్రహించారు. నిజంగా మీరు మహాత్ములు''ని కొనియాడాడు.

రావలసిన రోజు రానే వచ్చింది. జైలు అధికారి ఎంతో ఆవేదనతో విషపాత్రను తీసుకొచ్చి అందించాడు. సోక్రటీసు, అదేదో పానీయమన్నట్లుగా గ్రహించి, నవ్వుతూ అతని వైపు చూశాడు.

''దీన్ని త్రాగి ఏం చేయాలి.''

''పడుకోవాలి. కొద్దిసేపట్లో అది మీ ప్రాణాలను హరిస్తుంది'' అంటూ జైలు అధికారి దుఃఖించాడు.

సోక్రటీస్ విషపాత్రను ఎత్తి గొంతులో పోసుకున్నాడు. అంతా త్రాగి హాయిగా పడుకొన్నాడు. ఆ నిద్ర దీర్ఘనిద్రగా కొద్దిక్షణాల్లోనే పరిణమించింది. సోక్రటీస్‌ను అమరున్ని చేసివేసింది.

సోక్రటీస్‌లాంటి జ్ఞాని మళ్ళీ పాశ్చాత్య లోకంలో జన్మించలేదు. అతని తర్వాత వచ్చిన తాత్త్వికులంతా, సోక్రటీస్ అనుసరించిన జ్ఞానమార్గాన్ని అనుసరించక, తర్కమార్గాన్ని అనుసరించి అన్వేషించారు. బహుశ సోక్రటీస్ లాంటి జ్ఞానులను పాశ్చా

త్యులు ఆదరించరని ఎంచే నేమో, మళ్ళీ అలాంటి, అవధూత లాంటి, సోక్రటీస్ లాంటి తాత్త్వికున్ని, పాశ్చాత్యదేశం చూడ లేక పోయిందేమో! చాలాకాలం తర్వాత క్రీస్తు, అలాంటి వ్యక్తిత్వంతో వచ్చాడు. అయినా అతనికీ సోక్రటీస్ గతే పట్టింది.

ప్రజలు వారి భౌతిక కాయాలను నాశనం చేయ గల్గారు. అలా నాశనం చేసిన ప్రజలు కూడ కాలాంతరంలో నామరూపాల్లేకుండా భూస్థాపితమయ్యారు. కానీ కతికొద్దీ వారే మహాత్ములనైతే మరణం పాలు చేశారో, వారు మాత్రం, ఆ ప్రజలు చచ్చినా, ఇంకా అమరులయ్యే ఉన్నారు. ఉంటారు కూడ. మహాత్ములకు చావు లేదు వారు చిరంజీవులు సుమా! అందుకే సోక్రటీస్ ఇప్పటికీ సజీవంగా మన ముందు నిలచియున్నాడు.



# స్వామి వివేకానంద సూక్తులు

మీలో మీరు మాటలాడుకొన్నప్పుడు కూడ ఇతరులను గూర్చి నిందా వాక్యములాడుట పాప మని గ్రహింపుడు. దానిని పూర్తిగా త్యజింపవలెను. మనస్సునందు ఎన్నో తలంపులు పొడచూపు చుండును. ఆ తలంపులను వుచ్చరింపబోవుచో గోరంతలు కొండంతలుగా మారును. క్షమించి మరచుట నభ్యసించినచో సర్వము పరిసమాప్తమగును.

*  *  *

దయా బుద్ధివలన ఇతరులకు మేలు చేయుట మంచిదేకాని సర్వజీవులను భగవత్ స్వరూపము లుగా భావించి సేవించుట యింకను మంచిది.

*

ఈ లోకమున పిరికి వారికి స్థానములేదు. పారిపోజూడకుము. జయింతునో, ఓటమినొందుదునో, అని ఆలోచింపకుము.

*

సత్యము, శౌచము, అస్వార్థత—ఇవి కలవానిని అణగద్రొక్కగల శక్తి ముల్లోకములం దెవ్వరికి లేదు. జగత్తంతయు మాఱొడ్డి నిలిచినను ఈ గుణములు గలవాడు ఒంటరిగా వారినందరిని ఎదిర్చి నిలువగలుగును.

*

మీ ఆదర్శమునెడ మీకు పరమ నిష్ఠాగరిష్ఠత వలయును. ఆ నిష్ఠ క్షణికముకాక, ప్రశాంత మును, శ్రద్ధాన్వితమును, సుస్థిరమును అయివుండవలెను. ఉరుముల, మెరుపుల మధ్య ఆకసమువంక చూచుచు, వర్షోదకము కాని త్రాగకుండు చాతకపక్షికి గల నిష్ఠవంటిది మీరు సాధింపవలెను.

# ఒకసారి గమనించండి !

ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీరామకృష్ణ వివేకానంద అలీన సంస్థల తొలి సదస్సు గత ఫిబ్రవరి 20, 21 తేదీలలో హైదరాబాదు నందలి శ్రీరామకృష్ణ మఠంలో నిర్వహింపబడింది. కలకత్తాలో బేలూరుమఠం వారి ఆధ్వర్యంలో 1980 డిసెంబరులో జరిగిన ద్వితీయ అంతర్జాతీయ రామకృష్ణ సమ్మేళనంయొక్క లక్ష్య సాధనకు అనుగుణంగా రాష్ట్రస్థాయిలో ఈ సదస్సు జరిగింది. ఇందులో రాష్ట్రవ్యాప్తంగా వివిధ జిల్లాలనుండి ప్రతినిధులు పాల్గొన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో రామకృష్ణమఠం మిషన్‌లకు ప్రత్యక్షంగా అనుబంధ కేంద్రాలు మూడు మాత్రమే. అవి హైదరాబాదులోని రామకృష్ణ మఠం, రాజమండ్రిలోని రామకృష్ణమఠం, మిషన్ కేంద్రం, విశాఖపట్టణంలోని రామకృష్ణ మిషన్ ఆశ్రమం. మిగిలిన కేంద్రాలన్నీ అలీన సంస్థలుగా గృహస్థ అనుయాయులయొక్క నిర్వహణలో ఉన్నాయి. ఈ సంస్థల కార్యక్రమాలను సమన్వయం చేయాలనే సంకల్పం ప్రపంచ సమ్మేళనం తర్వాత మరింత బలపడటంతో ఇందు నిమిత్తమై ఏర్పడిన సదస్సు సంఘం సదస్సు ఏర్పాటుకు కృషిచేసింది. దీనిని రామకృష్ణ సంఘముయొక్క ఆంధ్రప్రదేశ్ భాగపు ప్రతినిధి సభ అనవచ్చు. (రామకృష్ణ సంఘం అంటే పరివ్రాజకులు, అలీన సంస్థలు, సాధారణభక్తుల సమాహారము).

రాష్ట్రంలో 45 అలీనకేంద్రాలు పనిచేస్తున్నట్టు యింతవరకు సేకరింపబడిన సమాచారాన్ని బట్టి తెలుస్తున్నది. వీటికిగాను ప్రస్తుత సదస్సులో 30 కేంద్రాలకు చెందిన వందమంది ప్రతినిధులకు పైగా పాల్గొన్నారు. ఈ కేంద్రాలు 16 జిల్లాలలో విస్తరించి ఉన్నాయి. సదస్సులోని చర్చనీయాంశాలస్థాయి దృష్ట్యా ఒక్కొక్క కేంద్రంనుండి పాల్గొనదగిన ప్రతినిధులు సంఖ్యపై గరిష్ఠపరిమితి విధించారు. సదస్సు లక్ష్యాలను ఈ క్రింది విధంగా ప్రకటించారు :

(1) శక్తిదాయకమూ, ఏకతాసాధకమూ, ఔన్నత్యప్రదాయకమూ అయిన శ్రీరామకృష్ణ వివేకానంద ఉద్యమ ఆశయాదర్శాలకు అనుగుణంగా రామకృష్ణ సంప్రదాయానికి, శారదామఠం మరియు రామకృష్ణ శారదా మిషన్‌లకు చెందిన సన్యాస సభ్యులకృషికి ప్రోద్బలంగా గృహస్థభక్తుల పాత్రను పెంపొందించుట;

(2) రామకృష్ణమఠం మరియు మిషన్‌ల నిర్వహణలో నెలకొల్పబడిన ఉన్నత ప్రమాణాలు ఆదర్శంగా అలీన సంస్థల నిర్వహణలో నాణ్యతను పెంపొందించుట;

(3) అలీన సంస్థలను పరస్పరం సన్నిహితం గావించటమేగాక వాటి కార్యక్రమాలను ఉమ్మడిగా రామకృష్ణమఠ, మిషన్‌ల ఆధ్వర్యంలో సాగుతున్న ఉద్యమ ప్రధానస్రవంతిలో మిళితం చేయడానికి కృషి సలుపుట;

(4) పట్టణాలలోని మురికిపేటలలోను, పల్లె ప్రాంతాలలోను నివసిస్తున్న బలహీనవర్గాల వారికోసం సేవా కార్యక్రమాలను నిర్వహించుట.

పై లక్ష్యాలకు అనుగుణంగా ఈ సదస్సులో వివిధ అంశాలపై చర్చలు, తీర్మానాలు జరిగాయి.

## సేవాశ్రమ మహామండలి ద్వారా జరిగినకృషి

1974 సంవత్సరము ఉగాదినాడు విజయవాడలో కోస్తాజిల్లాలలోని అలీనసంస్థల ప్రతినిధులు మద్రాసు రామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్ స్వామి తపస్యానందజీ మహరాజ్ వారి సమక్షంలో సమావేశమైనారు. ఈ సంస్థల కార్యక్రమాలను సమన్వయ పరచవలసిన

అవసరాన్ని గుర్తించినవారై స్వామీజీ ఆశీస్సులతో శ్రీరామకృష్ణ సేవాశ్రమ మహామండలి పేరుతో ఒక సమాఖ్యను ఏర్పరచుకొన్నారు అప్పటికి అందిన పరిమిత సమాచారంతో సుమారు 20 సంస్థల సమీకరణతో ఏర్పడిన సేవాశ్రమ మహామండలి తన పరిధిలో యథోచితంగా దివిసీమ సహాయపునరావాసం తదితర కార్యక్రమాలలో సభ్యసంస్థల ద్వారా పాల్గొన్నది. రాష్ట్రస్థాయిలో ప్రస్తుతం సదస్సు నిర్వహణకు సేవాశ్రమ మహామండలి నెఱపిన ప్రాథమిక కృషి మిక్కిలి ప్రయోజనకారి అయినది.

## ప్రారంభ సమావేశం

20-2-'82 ఉదయం 8-30 గం.లకు మొదలైన తొలిసమావేశం స్వామి పరహార్థానందజీ ప్రభృతుల వేదపఠనంతో ప్రారంభమైంది. శ్రీమత్ స్వామిరంగనాథానందజీ మహారాజ్ వారు అధ్యక్షత వహించారు. సదస్సు స్వాగత సమితి అధ్యక్షులు శ్రీ జి. వెంకటరమణారెడ్డి గారు ప్రతినిధులకు స్వాగతం పలికారు. సేవాశ్రమ మహామండలి అధ్యక్షులు శ్రీ V. N. శర్మగారు తమ ప్రసంగంలో వ్యవస్థ సమాజానికి ప్రాణమని అన్నారు. సేవాశ్రమ మహామండల సంయుక్త నిర్దేశకులు శ్రీ కె. గౌరీ శంకర్ సేవాశ్రమ మహామండలి ద్వారా జరిగిన కృషిని వివరించారు. ప్రవాసాంధ్రులైన A. S. R. మూర్తి ఆదివాసీ ప్రాంతాలలో చేస్తున్న కృషిని గూర్చి తెలియజేశారు. బేలూరు మఠం నుండి ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీమత్ స్వామి స్మరణానందజీ తమ ప్రారంభోత్సవ సందేశంలో రామకృష్ణోద్యమం ప్రజాసామాన్యపు ఉద్యమంగా రూపొందుతున్నదనీ, ఇందులో గృహస్థభక్తులు ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు వచ్చి ప్రముఖ పాత్ర వహించవలసినదని ఉద్బోధించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన స్వామి రంగనాథానందజీ వారు రామకృష్ణోద్యమ తత్త్వాన్నీ, లక్ష్యాలనూ వివరించి, రాబోవు 5 సంవత్సరాలలో ప్రతి జిల్లా కేంద్రంలోనే గాక తాలూకా స్థాయివరకు రామకృష్ణోద్యమ కేంద్రాలను విస్తరించటానికి ఈ సదస్సులో నిర్ణయం గైకొని అమలుపరచవలసినదిగా ప్రబోధించారు. రామకృష్ణోద్యమాన్ని గ్రామ స్థాయివరకు కొనిపోవడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఒక ప్రయోగశాలగా భావించి విజయం సాధించాలన్నారు.

సదస్సుయొక్క విజయాన్ని ఆకాంక్షిస్తూ రామకృష్ణ మఠం మరియు మిషన్‌ల అధ్యక్షులు శ్రీమత్ స్వామి వీరేశ్వరానందజీమహారాజ్, స్వామి ఆత్మస్థానందజీ, స్వామి అనన్యానందజీ ప్రభృతులనుండి వచ్చిన శుభాశంసన సందేశాలను సభలో చదివారు.

## తెలుగునాట నేటి ఉద్యమ స్థాయి

రెండవ సమావేశానికి స్వామినందానందజీ అధ్యక్షత వహించారు. వివిధ కేంద్రాలనుండి వచ్చిన ప్రతినిధులు తమ సంస్థల సంస్థాపన నుండి చరిత్రను సంక్షిప్తంగా వివరిస్తూ నిర్వహించిన కార్యక్రమాలపై నివేదికలు సమర్పించారు.

ప్రతినిధులు ప్రాతినిధ్యం వహించిన కేంద్రాలు: మచిలీపట్నం, బాపట్ల, రెంటచింతల, గుంటూరు, విజయవాడ, నెల్లూరు, కాకినాడ, హైదరాబాదు (బేగంపేట), పాల్వంచ, కొత్తగూడెం, చిలకలూరిపేట, పాకాల, పుదపుట్ల, తిరుపతి, ఎండగండి, నూజివీడు, శిరిపురం, నల్గొండ, ప్రొద్దుటూరు, అమ

లాపురం, పెనుగుడుకుపాడు, శ్రీకాకుళం, సైనికపురి, అశోక్‌నగర్, మరిపల్లి, దర్శి, సూర్యారావుపేట, ఒంగోలు, బూరగగూడెం, రాజమండ్రి మొ॥.

స్వామి నందానందజీ తమ ప్రసంగంలో 'శిష్యుల స్మృతులు' అనే గ్రంథంలో స్వామీజీని గూర్చి, "తేజస్వి అయిన ఈ నిప్పులాంటి ప్రాచ్యదేశపు మహర్షి, గ్రహించగలిగిన వారందరికీ శక్తి ప్రదానం చేశారు" అని వ్రాయబడింది. అందుచేత శ్రీరామకృష్ణ వివేకానందుల సందేశంలోని మహత్తర శక్తిని గ్రహించటం మన బాధ్యత అన్నారు.

## గృహస్థుల పాత్ర

**మూడవ సమావేశంలో** చర్చనీయాంశం: శ్రీరామకృష్ణ వివేకానంద భావ ప్రచారంలో గృహస్థ భక్తుల పాత్ర.

స్వామి స్మరణానందజీ ప్రసంగిస్తూ శ్రీరామకృష్ణ వివేకానందుల ప్రబోధాలను గృహస్థులు స్వయంగా నిత్యజీవితంలో అనుసరిస్తూ ఇతరులకు మార్గదర్శకంగా నడచుకోవటం కంటె మరో ఉత్తమ మార్గం లేదన్నారు. శ్రీ A. S. R. మూర్తి సేవా కార్యక్రమాలకు భగవద్విశ్వాసం ప్రాతిపదిక అన్నారు. శ్రీ M. రామమూర్తి తమ ప్రసంగంలో గ్రామీణ సేవా కార్యక్రమాలు, మహిళలకు విద్య, యువతులకు శిక్షణ, కరపత్రాలు మొదలైన వాటిద్వారా కృషి సాగాలన్నారు. శ్రీ ముఖర్జి ప్రసంగిస్తూ శ్రీరామకృష్ణులు కేవలం దేవాలయాలకు పరిమితమైన దైవం కాదనీ, ఆయన సందేశాన్ని ప్రతి ఇంటికీ గొనిపోవాలనీ కోరారు. శ్రీరామకృష్ణ బోధామృతాన్ని ప్రతి గృహంలో అవశ్యపఠనీయమైన వాచకంగా ప్రోత్సహించాలనీ అప్పుడు మాత్రమే అవిద్య, కులతత్వము, వరకట్నము వంటి సమస్యలు అంతరిస్తాయనీ అన్నారు.

శ్రీ ఎస్. కపూర్ తమ ఉపన్యాసంలో సాంఘిక సేవను ఆధ్యాత్మిక జీవనానికి మార్గంగా భావించుకోవాలని సూచించారు.

శ్రీ B. S. R. ఆంజనేయులుగారు మాట్లాడుతూ [illegible]ట్లో విజయవంతంగా అమలు జరుపబడిన పథకాలే స్వానుభవంలో శారదామాత అనుగ్రహానికి నిదర్శనమన్నారు. శ్రీ కె. వి. నాగేశ్వరరావుగారు తమ ప్రసంగంలో ఉద్యమానికి ప్రేరణకర్తలైన స్వామీజీలను సమర్పించవలసిన బాధ్యత ప్రధానంగా గృహస్థులదేనని గుర్తుచేశారు. అప్పుడు ఒకరు ముగ్గురు పిల్లలుగలవారు కనీసం ఒకరిని రామ కృష్ణ మఠానికిగాని శారదా మఠానికిగాని పంపడానికి ముందుకువస్తే బాగుంటుందని సూచించారు. శ్రీ జి. వెంకటరమణరెడ్డిగారు ప్రసంగిస్తూ నైతిక, ఆధ్యాత్మికభావాలు పసి వయసులోనే బాలబాలికలకు అందించాలనీ, తన జీవితంలో బాల్యంలోనే ఈ భావాలు మనసులో నాటుకొన్నాయని అన్నారు.

స్వామి శ్రీరంగానందజీ తమ సందేశంలో సాకార త్యాగమే శ్రీరామకృష్ణులు. త్యాగ భావంతో ఎవరిని సేవించినా వారిని సేవించినట్లే. భగవంతుడు మనచేత పరికరాలవలె ఈ పనులు చేయిస్తున్నాడు. అందుచేత ఏ విధమైన విభేదాలకు తావివ్వకుండా అందరూ రామకృష్ణకులమూ రామకృష్ణగోత్రాలకు చెందినవారివలె విశ్వజనీన భావంతో ప్రవర్తించాలని ఉద్బోధించారు.

## సంస్థల నిర్వహణలో నైపుణ్యం

అలీన సంస్థల నిర్వహణలో శ్రేష్ఠత్వాన్ని సాధించడం ఎలా? అనే అంశంపై చర్చ

ప్రారంభిస్తూ అధ్యక్షత వహించిన స్వామి స్మరణానందజీ సంస్థల విజయానికి సభ్యులలో ఐక్యత ముఖ్యమనీ, ఇతరుల దోషాలను ఎంచకుండటం, ప్రేమమయమైన ధోరణి ఉన్నప్పుడే అది సాధ్యమని అన్నారు. సంస్థలకు ప్రతిష్ఠ ముఖ్యమని, ధనం విషయంలో ఖచ్చితంగా ఉండాలని సూచించారు. ఉన్నత ప్రమాణాలు అనేవి అలీన సంస్థలకైనా, అనుబంధ సంస్థలకైనా ఆవశ్యకమే అని స్పష్టం గావించారు.

డా॥ కె. వెంకట్రామశాస్త్రి తమ ప్రసంగంలో మానసిక పరివర్తనతో కూడిన సామాజిక విప్లవంకోసం వ్యక్తి నిష్ఠతో సామాజిక నిష్ఠను సమన్వయం చేయాలి; అప్పుడు నైతిక విలువల అవగాహనపై ఆధారపడిన సామాజిక విప్లవం సిద్ధిస్తుంది; ఇందుకు ధర్మదృష్టి ఆవశ్యకం అన్నారు. శ్రీ కె. వి. నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ సంస్థలు ప్రజావసరాలకు అనుగుణమైన కార్యక్రమాలను ఎన్నుకోవాలని, చేపట్టిన కార్యక్రమాలలో సభ్యులందరూ పాల్గొనాలని కోరారు. ప్రజాహితమైన కార్యక్రమాలకు ధనలోపం ఉండదని వెల్లడిస్తూ తీర్మానాలు, నిర్ణయాలు ఏకాభిప్రాయంతో గైకొనటం బాగుంటుందన్నారు. శ్రీ ముఖర్జి ప్రసంగిస్తూ ప్రతి కేంద్రంలోనూ స్వామీజీ ఆశయ ప్రేరితులైన పదిమంది పిడుగుల్లాంటి యువకులను సిద్ధం చేసుకోవాలని కోరారు.

సమావేశపు సమన్వయకర్త స్వామి సద్భావానందజీ తమ ఉపన్యాసంలో 'నేను లేకపోతే ఈ కార్యక్రమం జరుగదు' అన్నంత ఆసక్తితో ప్రతి ఒక్కరు సంస్థల కార్యక్రమాలలో పాల్గొనాలని, సుహృద్భావం ముఖ్యమని ఉద్బోధించారు.

స్వామి రంగనాథానందజీ 'చైతన్యవంతమైన ఆధ్యాత్మికత - జడభక్తి' అనే అంశంపై ప్రసంగించారు. మన మతంలో జడభక్తి చోటు చేసుకున్నదనీ శ్రీరామకృష్ణులు దాన్ని నిరసించారనీ అందుచేత జడభక్తిని విసనాడి చైతన్యవంతమైన ఆధ్యాత్మికతతో సమాజాన్ని పునరుజ్జీవింప చేయటం నేటి తక్షణావశ్యకత అని సోపపత్తికంగా ఉద్ఘాటించారు.

స్వామి శ్రీరంగానందజీ భక్తిగీతంతో నాటి సమావేశాలు సమాప్తమైనాయి.

రెండవరోజు తేది 21-2-'82 న తొలిసమావేశంలో అలీన సంస్థల కార్యక్రమాలను రామకృష్ణ మహోద్యమ ప్రధాన స్రవంతిలో మిళితం చేసే విషయమై చర్చించారు. స్వామి స్మరణానందజీ తమ ఉపన్యాసంలో స్వామీజీలయొక్క ప్రత్యక్ష మార్గదర్శనం మినహా అలీన సంస్థకు విలీన సంస్థకు తేడా లేదనీ, కార్యక్రమాలన్నీ ఒకేవిధమైనవనీ అన్నారు. స్వామి వివేకానందుని బోధనలకు అనుగుణంగా గ్రామీణ పేద ప్రజల సేవాకార్యక్రమాలకు మఠంవారు ఇస్తున్న ప్రాధాన్యతను గుర్తించి అలీన సంస్థలు కూడా అదే పంథాలో కార్యక్రమాలు చేపట్టాలని కోరారు.

శ్రీ సి. టి. దేవరాజ్ మద్రాసులో తాను నడుపుతున్న స్వయం ఉపాధి సలహా కేంద్రం గూర్చి తెలియజేశారు. శ్రీ B. S. R. ఆంజనేయులుగారు మాట్లాడుతూ అలీనసంస్థల సమన్వయ సంఘంతో సన్నిహితంగా మార్గదర్శనం వహించవలసినదిగా రంగనాథానందస్వామీజీని సభాముఖంగా ప్రార్థించారు. శ్రీ V. S. S. మూర్తిగారు ప్రసంగిస్తూ ఇలాంటి సదస్సులను నిర్ణీతక్రమానుసారం తరచు నిర్వహించాలనీ, యువకులకు శిక్షణా కార్యక్రమాలు చేపట్టాలని కోరారు. మిషన్ వారు పుస్తక విక్రయశాలలు, గ్రంథపఠనాలయాల పర్యవేక్షణ వంటి అంశాలను స్వచ్ఛంద కార్యకర్తలకు

అప్పగించినట్లైతే స్వామీజీల అమూల్య సేవలను అలీనసంస్థలు నిర్వహించే మరింత ప్రధానమైన కార్యక్రమాలకు వినియోగించవచ్చునని సూచించారు. శ్రీ కే. వి. నాగేశ్వరరావు గారు తమ ప్రసంగంలో హైదరాబాదులో రామకృష్ణమఠం కేంద్రం మాత్రమే గాక మిషన్ శాఖను గూడ ప్రారంభించాలని, అలీన సంస్థల కార్యకలాపాలను సమన్వయ పరచడానికి బేలూరు మఠంవారు ఒక స్వామీజీని పంపాలని కోరారు. అలీనసంస్థలు తమ కార్యక్రమాల నిర్వహణకు క్రమంగా గౌరవవేతనంపై పనిచేసే కార్యకర్తలను సమకూర్చుకోవాలని కోరారు. శ్రీ కె. సి. యస్. శాస్త్రి అఖిల భారత వివేకానంద యువ మహామండలి ఆశయాలను, కార్యక్రమాలను వివరించి ప్రతి అలీనసంస్థ కూడా మహామండల శాఖ స్థాపనకు, దాని ప్రగతికి ప్రోత్సాహమిచ్చినట్లైతే భవిష్యత్తులో ఆ సంస్థల కార్యక్రమాలు అవిచ్ఛిన్నంగా సాగటానికి మార్గం సుగమం అవుతుందని తెలియజేశారు.

స్వామిరంగనాథానందజీ తమ ప్రసంగంలో దేశ, విదేశాలలో అలీన సంస్థల కార్యక్రమాలను వివరిస్తూ వీటి నన్నింటిని అనుబంధం గావించడం మఠంవారికి సాధ్యపడదని అన్నారు. అందుచేత ఉద్యమంలో గృహస్థ భక్తులు ఇతోధిక పాత్ర నిర్వహించాలని కోరుతూ శ్రీ రామకృష్ణుని ప్రవచనాన్ని గుర్తు చేశారు. "ప్రపంచంలో నివసించు, కాని ప్రపంచాన్ని నీలో నివసించనీయకు. నావ నీటిలో ఉండవచ్చుగాని నీరు నావలో ప్రవేశించగూడదు కదా!" సేవాకార్యక్రమాలను భగవద్భక్తితో నిర్వహించాలి. ధ్యానం, సేవాకార్యం తోడుతోడుగా ఆచరించాలి. అప్పుడే సంస్థల కార్యక్రమాలు ఇనుమడిస్తాయి. ఆంధ్రలో మఠంవారి కార్యక్రమాలు ఈసంస్థల కార్యక్రమాలను సమన్వయం చేసే విధంగా రూపొందింపబడుతున్నాయని తెలియజేస్తూ స్వామీజీ తాము అన్ని సంస్థలకు చెందినవారమని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

## గ్రామీణ సేవాపథకాలు

రెండవ సమావేశంలో చర్చనీయాంశం గ్రామీణ సేవాకార్యక్రమాల ఎంపిక - నిర్వహణ.

స్వామి స్మరణానందజీ తమ ఉపన్యాసంలో 'జాతి కుటీరాలలో నివసిస్తున్నది, జనసామాన్యాన్ని నిర్లక్ష్యం చేయడమే జాతిచేసిన మహాపాపం' అనే స్వామీజీ బోధనలను ఉటంకిస్తూ మిషన్ వారు గ్రామీణ పేదప్రజలకు అవసరమైన సేవాకార్యక్రమాలను ఎన్నుకొని నిర్వహిస్తున్నారని తెలియజేశారు. పశ్చిమ బెంగాల్ లో మిషన్ వారు 'పల్లిమంగళ్' (గ్రామ కళ్యాణం) అనే పేరుతో జయరాంబాటి తదితర గ్రామాలలో సంక్షేమ కార్యక్రమాలు చేపట్టినట్లు వెల్లడించారు. గ్రామీణులకు అనియమిత విద్యగఱపాలని, పారిశుద్ధ్య పరిజ్ఞానం అందజేయాలని కోరారు.

శ్రీ జి. వెంకటరమణారెడ్డిగారు మాట్లాడుతూ ప్రభుత్వం రూపొందించిన కొన్ని ప్రజాసంక్షేమ పథకాలను స్థానిక స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చి ప్రభుత్వ సహకారంతో అమలుపఱచినట్లైతే ఆ పథకాలు మెరుగుగా అమలు జరుగుతాయనే అభిప్రాయం వ్యక్తం చేస్తూ సంస్థలు అందుకు ముందుకురావాలని కోరారు.

కిషన్ బాయిగారు మాట్లాడుతూ జాతీయ బ్యాంకులు గ్రామీణ గృహనిర్మాణ పథకాలకు, కుటీర పరిశ్రమలకు, వ్యవసాయానికి

స్వయం ఉపాధికల్పనకు, ప్రత్యేకంగా రూపొందించే వివిధ పథకాల క్రింద అందజేసే సహాయాన్ని వినియోగించుకొని సమగ్ర గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో స్వచ్ఛంద సంస్థలు చురుకుగా పాల్గొనవచ్చునని సూచించారు. అలీనసంస్థలవారు గ్రామాలను దత్తత చేసుకొనే విషయమై యోచించవచ్చునని కూడా విజ్ఞప్తి చేశారు.

డా॥ కమలాజయరావుగారు సమావేశాలలో అన్ని ఆంగ్లప్రసంగాలను వెనువెంటనే చక్కని తెలుగులోకి అనువదించినందున చర్చలు అందరికీ పూర్తిగా అర్థమైనాయి.

:నాలు

సలహా సమన్వయ సంఘాన్ని ఏర్పరుస్తూ తీర్మానించారు. విస్తృతస్థాయిలో రాష్ట్రమంతటికీ ప్రాతినిధ్యం వహించే సలహా సమన్వయ సంఘం ఏర్పడి సమగ్ర నిబంధనావళితో పని చేయనున్న దృష్ట్యా సేవాశ్రమ మహామండలి అనావశ్యకమైనందున దానిని రద్దుపరచవలసినదిగా కోరుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించారు.

## సమారోప సమావేశం

స్వామి స్మరణానందజీ తమ సమారోప ప్రసంగంలో మానవుని సర్వతోముఖ అభ్యుదయానికి కేవలం రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే చాలదనీ, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం కూడా మిక్కిలి అవసరమని అందుచేత రామకృష్ణ భక్తులు ఈ ఉద్యమాన్ని ప్రజా ఉద్యమంగా పరిగ్రహించాలని ఉద్బోధించారు.

స్వామి రంగనాథానందజీ వీడ్కోలు సందేశమిచ్చారు. ఆ సందర్భంగా వివేకానందస్వామి బ్రహ్మానందస్వామిని ... ది వ్రాసిన లేఖలోని అంశాలను ప్రస్తావిస్తూ కార్యకర్తలు 'పంతెన నిర్మాణానికి' సిద్ధమైన కార్మికులవలె త్యాగమయమైన జీవితంతో ఉద్యమాన్ని విస్తరింపజేయాలని ఉపదేశించారు. నజ్రుల్ ఇస్లామ్ ప్రస్తుతించినట్లు 'కలియుగంలో శ్రీరామకృష్ణుడు కలిగించిన సత్యయుగపు పుణ్యస్మృతులను' సమాజంలో ప్రజానీకపు అనుభూతికి తేవడానికి మీరు కృషిచేయాలని ఉద్బోధించారు.

నందానందజీ, శ్రీరంగానందజీ, సంధ్యానందజీ, అవిముక్తానందజీ, జితాత్మానందజీ ప్రతినిధులకు అభినందనలను ఆశీస్సులను అందజేశారు. శ్రీ వి. ఎన్. శర్మగారు మాట్లాడుతూ రామకృష్ణమఠం వారి కీర్తి ప్రతిష్ఠల పరిరక్షణకు మరింత బాధ్యత వహించవలసినదిగా అలీనసంస్థల నిర్వాహకులైన ప్రతినిధులకు గుర్తుచేశారు.

సదస్సు విజయవంతంగా సమాప్తమైన సందర్భంగా శ్రీ ముఖర్జీ ప్రతినిధులకు తదితరులకు వందన సమర్పణ చేశారు. స్వామి పరమార్థానందజీ భక్తిగీతంతో సమావేశం ముగిసింది.

## ప్రదర్శన - సందర్శన

21 వ తేదీ రాత్రి ఏర్పాటుచేసిన రంగుల స్లైడుల ప్రదర్శన (Slide Show) విదేశాలలో రామకృష్ణ మిషన్ కార్యకలాపాలను తెలియజేసి ప్రతినిధులను ఆకర్షించింది.

19 వ తేదీ సాయంత్రం ప్రతిధులు IDL ధర్మసంస్థ వారి గ్రామీణాభివృద్ధి పథకాలను సందర్శించే ఏర్పాటుచేశారు. హైదరాబాదు సమీపంలోని కూకట్ పల్లినద్ద IDL Chemicals వారి ధర్మసంస్థ ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న వివిధ గ్రామీణ అభివృద్ధి

ప్రాజెక్టులు - సౌరశక్తి వినియోగం, బయో గ్యాసుబట్టీ, గాలిమర, పశుపోషణ కేంద్రం, మేలుజాతి పశువృద్ధి కేంద్రం, పశువైద్య పరిశోధనాగారం మొదలైనవి ప్రత్యక్షంగా చూసి అధికారులనుంచి వివరాలు గ్రహించటం జరిగింది. ఆసక్తిగల కార్యకర్తలకు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో శిక్షణ నివ్వనున్న గ్రామీణ సేవా కార్యక్రమాలు చేపట్టనున్న దృష్ట్యా ఆలీన కేంద్రాలవారికి కొన్ని చక్కని ఆచరణీయమైన పథకాలు లభించాయి. ప్రభుత్వము, బ్యాంకులు తదితర ఆర్థిక సంస్థలు ఆర్థిక ప్రణాళికలతో ఈ ప్రగతి పథకాలను సమన్వయ పరచి గ్రామీణ ప్రజల ద్వారా వివిధ సమాజ వికాస కార్యక్రమాలు చేపట్టవచ్చును.

## సదస్సు ప్రభావం

రాష్ట్రంలో ఇంతవరకు చేపట్టిన కార్యక్రమాలను, తద్వారా సాధించిన ప్రగతిని మదింపు వేసుకొనే అవకాశం ఈ తొలి ప్రతినిధి సభలో లభించింది. ప్రాతినిధ్యం ప్రధాన కార్యకర్తలకు మాత్రమే పరిమితం చేసినందున పరస్పర అభిప్రాయ ప్రకటనకు, సున్నితమైన అంశాలపై ప్రయోజనాత్మకమైన చర్చకు కలకత్తా సమ్మేళనంలో కలగని అవకాశం యిక్కడ లభించింది. ఎదుగుతున్న సమాజావసరాలకు అనుగుణంగా రామకృష్ణోద్యమం వేగంగా విస్తరించవలసిన అవసరాన్ని గుర్తించటం జరిగింది. సమీప భవిష్యత్తులో కలకత్తా సమ్మేళనం సరళిలో రాష్ట్రస్థాయిలో విస్తృత ప్రాతిపదికపై సాధారణ భక్తులు, సభ్యులు, కార్యకర్తలు, సానుభూతిపరులు మొదలైనవారితో రామకృష్ణ సమ్మేళనం జరగటానికి, రామకృష్ణ సంఘం పటిష్ఠం కావడానికి తగిన ఆధారపీఠం ఏర్పడింది. అనుకొన్న ప్రకారం మరో అయిదుసంవత్సరాలలో ప్రతి జిల్లా పట్టణంలోను కేంద్రాలతో ఉద్యమాన్ని తాలూకా స్థాయివరకు తీసుకొని వెళ్ళగలిగితే ఆంధ్రప్రదేశ్ అక్షరక్రమంలోనేగాక రామకృష్ణోద్యమ ప్రగతిలోను ఒక సఫలప్రయోగశాలగా ఆదర్శప్రాయమైన రాష్ట్రమవుతుంది. నూతనోత్తేజంతో, ఉత్సాహంతో, కార్యదీక్షతో పరస్పరం సెలవు తీసుకొని గృహోన్ముఖులైన ప్రతినిధులను చూసినప్పుడు ఈ సదస్సు వారిని పైమహత్కార్యానికి సన్నద్ధం చేసిందని నిశ్చయంగా చెప్పవచ్చు.

—తుర్లపాటి లక్ష్మీనారాయణరావు

## శివ పంచాక్షరస్తోత్రమ్

నగేంద్ర హారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ తస్మై నకారాయ నమఃశివాయ
మందాకినీ సలిల చందన చర్చితాయ నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందారముఖ్య బహుపుష్ప సుపూజితాయ తస్మై మకారాయ నమఃశివాయ
శివాయ గౌరీవదనాబ్జ బృంద సూర్యాయ దక్షాధ్వరనాశకాయ
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ తస్మై శికారాయ నమఃశివాయ
వసిష్ఠకుంభోద్భవ గౌతమార్య మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానరలోచనాయ తస్మై వకారాయ నమఃశివాయ
యక్షస్వరూపాయ జటాధరాయ పినాకహస్తాయ సనాతనాయ
దివ్యాయ దేవాయ దిగంబరాయ తస్మై యకారాయ నమఃశివాయ.

# రామకృష్ణమఠము: సన్న్యాసమునకు క్రొత్త నిర్వచనము

స్వామి లోకేశ్వరానంద

కలకత్తాలో, 1898 ఏప్రిల్ మాసములో, ప్లేగు వ్యాపించినది. ఇది మొదటిసారి కాదు. కనుక కలకత్తావాసులకు ఆ వ్యాధియొక్క భయంకర పరిణామాలు బాగా తెలుసు. భయభ్రాంతులైన ప్రజలు, చచ్చిపోతున్న తమ ఆప్తులను వదిలి, పారిపోవడం మొదలుపెట్టారు. అసలే కలకత్తా చక్కటి పట్టణమని చెప్పడానికి వీలులేదు. ఇప్పుడు వీథులలో చెత్తాచెదారం నిండిపోవడములో మరీ అసహ్యంగా నున్నది. సైన్యాన్ని సహాయానికి పిలిపించారు. అసలే గందరగోళంగానున్న పరిస్థితి యింకా గొడవగా మారింది. ప్రజలలో భయ మెక్కువైనది. వాళ్ళ యిక్కట్లు పెరిగాయి.

ఇలానుండగా నొకనాటి ప్రొద్దున వారు చూసిన దృశ్యమేమిటి? కొంతమంది సన్న్యాసులు ఒక విదేశీ యువతి కలసి యింటింటికీ వెళ్ళి, ప్రజల బాగోగులడిగి వారికి చేయగలిగిన సహాయం చేస్తున్నారు. రోగులకు ఉపచారాలు చేసారు. కుళ్ళిపోతున్న శవాలను బయటకుమోసారు. ఆ సన్న్యాసులే వీథుల్లోని చెత్తనెత్తి, వీథుల నూడ్చారు!

ఇటువంటిదృశ్యాన్ని ఎప్పుడు యింతకుమునుపు చూడలేదు. ఇలా జరుగగలదని ఎప్పుడు ఊహించలేదు. సన్న్యాసులంటే ముక్కు మూసుకుని జపం చేసుకునేవారనే తెలుసు. కాని ఇతరుల శ్రేయస్సుకు కూడా పాటుపడతారని తెలియదే! ఈ విషయాన్నిగూర్చి పలువురు పలువిధాలుగ అనుకొన్నారు, కొందరు ప్రశంసించారు, కొందరు విరసించారు. సన్న్యాసులు లౌకికవిషయాలలో ఈ విధముగా తలదూర్చడం వింత కాబట్టి, ప్రజలు విరసన చూపినా ఆశ్చర్యపోవలసినది లేదు.

ఈ సంఘటనను ఒక వింతగ చెప్పుకున్నారే కాని దీనిలోని అంతరార్థ మెవ్వరు ఆనాడు గ్రహించలేదు. ఆధ్యాత్మికరంగంలో యిది ఒక క్రొత్తదారి; ఒక క్రొత్త అధ్యాయం. ఇదే రామకృష్ణ మిషనుకు నాంది అని చెప్పుకోవచ్చు. ఆ రోజు వీథుల్లో కనపడిన సన్న్యాసులు, రామకృష్ణమఠపు సన్న్యాసులు. మొట్టమొదటిసారిగా వారు బహిరంగంగా, కష్టాలలోనున్న ప్రజలను ఆదుకోవడానికి ముందుకు వచ్చారు. వారి నాయకుడైన స్వామి వివేకానందుడు. కార్యాచరణలో పెట్టగలిగే వేదాంతాన్నిగురించి బోధించారు; మానవునియందున్న దేవుణ్ణి పూజించమన్నారు. ఆ ఉదాత్తమైన బోధనను ఎలా కార్యాచరణలో పెట్టాలో, నేడు వీరు నిరూపించారు. అయితే, నేటి ఈ సన్న్యాసబృందంలో వివేకానందులు లేరు. కాని వారి ఆజ్ఞానుసారమే ఈ పని చేపట్టడమైనది. అమెరికాదేశమునుండి తిరిగి వచ్చినప్పటినుండి విరామం లేకుండా ఉపన్యాసాలిస్తూ, వివేకానందులు పూర్తిగ అలసిపోయారు. వారి ఆరోగ్య మేమాత్రము బాగుగ లేదు. వైద్యుల సలహాపై వారు డార్జిలింగుకు వెళ్ళారు. ఆ శీతలవాతావరణం, విశ్రాంతివల్ల వారికి మరల కొంచెము ఆరోగ్యము చేకూరింది. అదేసమయంలో, కలకత్తాలో ప్లేగువ్యాధి వ్యాప్తి, దానివల్ల ప్రజలు పడుతున్న కష్టాలు, భయాలనిగూర్చి వార్తలు వివేకానందులవారికి అందాయి. ఇక డార్జిలింగులో నుండడము అసంభవమైనది. వైద్యులు వలదంటున్నా, ఆరోగ్యము సరిగా లేకపోయినా, తాను ప్రజలకు ఏవిధముగ సహాయాన్ని అందించాలను ఆలోచనతో కలకత్తాకు వెంటనే తిరిగి వచ్చేసారు.

"ఈ పనులకు ధన మెక్కడనుండి వస్తుంద"న్నారు, కొందరు. నిజమే - కాని వివేకానందులకు ఇవన్ని విడమరచి చెప్పే సహనం లేదు. "అవసరమవుతే బేలూరు మఠాన్నే అమ్మివేస్తా"నని గర్జించారాయన. భగవంతుని దయవల్ల అంతపని చేయవలసినగతి రాలేదు. వలసిన నిధులు దొరికాయి. అదృష్టవశాత్తు, ప్లేగువ్యాధి త్వరలోనే తిరుగుముఖము పట్టింది.

•

వివేకానందులవారు రెన్నోరంగాలలో, ఎంతో కార్యసిద్ధిని పొందారు. కాని అన్నిటిలోకి మిన్నగ చెప్పుకోవలసినది వారు స్థాపించిన నూతన సన్న్యాసులమఠము. తద్వారా వారు సన్న్యాసానికే ఒక క్రొత్తనిర్వచనము, ఒక క్రొత్త హోదా ఇచ్చారు. తద్వారా హైందవమతాన్ని పునరుద్ధరించారు. నన్ను ముట్టుకోకు నామాలకాకి యని అన్నిటికీ దూరంగానున్న హైందవసంస్కృతిని మేల్కొలిపి, జీవితములోని యథార్థమేమిటో తెలుసుకోమన్నారు.

రామకృష్ణమఠము కేవలం హిందువులకొరకు స్థాపింపబడలేదు. ఇతరమతాలవారికీ యిది ఎంతో ఉపయోగకరంగా నున్నది. శ్రీరామకృష్ణులు ఏదో ఒక ప్రత్యేకమైనకులాన్ని, ప్రత్యేకమైన మతాన్ని ఉద్ధరించడానికి అవతరించలేదు కదా! వారి రాక, ధర్మాన్ని రక్షించడానికే కదా! రామకృష్ణ మఠము ఒక ప్రత్యేకమైన కులానికి, మతానికి, దేశానికి చెందదు. అది సమ సమానవాళికి సేవ చేస్తుంది. ఈ విశ్వజనీనమైన స్వరూపమువల్ల, ప్రతి మతధర్మాన్ని స్వీక

రించటమువల్లనే రామకృష్ణమఠానికి నింద్రొక్కుడనే శక్తి యున్నది.

రామకృష్ణమఠాన్ని వివేకానందులవారు స్థాపించడమెలా జరిగినదన్నది చాలా ఆసక్తికరమైన విషయము. అది యిక్కడ మననము చేసుకోవచ్చు శ్రీరామకృష్ణుల శరీరము చాలించేముందు, వివేకానందుని పిలిచి తమ 'పిల్లలను' (శిష్యులను) చూచుకొనేభారము ఆయనమీద మోపారు. వివేకానందులవారు చేయవలసినదేమిటని ఇదమిత్థంగా తెలుపలేదు; తెలిపినట్లు ఎక్కడ వ్రాసి లేదు బహుశా వారందరు సరైన ఆధ్యాత్మికమార్గంలో నడిచేటట్లు వివేకానందులు చూడాలన్నది రామకృష్ణులవారి తలంపు అయి యుండవచ్చు. వారందరు ఒక సంఘంగా ఏర్పడి రామకృష్ణులవారి బోధనలను కార్యాచరణలో పెట్టి లోకానికి చూపించాలన్నది కూడ గురువుల ఆలోచనై యుండవచ్చు.

వివేకానందులవారు గురువుల ఉద్దేశ్యాన్ని గ్రహించారో లేదో మనకు తెలియదు. బహుశా గ్రహించకపోవచ్చు. తనమీద మోపబడిన భార మెటువంటిదని వారు గ్రహించారన్నట్లు మనకెక్కడ నిదర్శనం లేదు. భగవద్దర్శనానికై చేస్తున్న తపస్సాధనలు శిష్యసోదరులు విరామము లేకుండ జరుగుట చూడడమే తన బాధ్యతని వివేకానందులు తలచి యుండవచ్చు. సన్న్యాసకాంక్షగ్ని చల్లారకుండ చూడాలి; వారికి ఇందులో తాను చేయగలిగిన సహాయము చేయాలి. ఇంకను సంసారబాధ్యతలు పూర్తిగ తొలగని యువసన్న్యాసి - తానింతకంటె ఏమి చేయగలడు?

వివేకానంద స్వాములవారు కాని, తదితర శిష్యసోదరులుకాని - తాము సన్న్యాసాశ్రమము స్వీకరించాలని శ్రీరామకృష్ణులవారి కోరిక యని బహుశా గ్రహించకపోయి యుండవచ్చు. తమలో నేదో అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక జిజ్ఞాస కలదనిమాత్రము వారందరు గ్రహించారు. అయితే, అదేమిటి, దాని గమ్యమేమిటని వారికి తెలియదు. వీరు ఇతరులవంటి వారుకాదని శ్రీరామకృష్ణులు మొదట్లోనే గ్రహించారు. ఏ ఆర్భాటము లేకుండ వారు ఈ శిష్యులకు సన్న్యాసాశ్రమ స్వీకరణకు తర్ఫీదు యిచ్చారు.

తమ శిష్యులు సన్న్యాసులు కావాలనేగాక, వారందరు కలసి ఒక సంఘముగ నేర్పడాలని కూడా రామకృష్ణుల యొక్క తలంపు. అసలు రామకృష్ణమఠానికి వారే శంకుస్థాపన చేశారని చెప్పవచ్చు; తగిన యువకులనెంచి, సుశిక్షణ యిచ్చారు. అంతేగాక వారలయందు ప్రేమబీజాలు నాటి, ఆ ప్రేమలతికలు వారందరినీ కలిపి బంధించేటట్లు చేసారు. స్వామి వివేకానందులు నుడివినట్లు, రామకృష్ణులు మూర్తీభవించిన ప్రేమస్వరూపము. తమప్రేమను అందరియెడల ప్రసరింపజేసారు. వారు నోరువిప్పి చెప్పకపోయినను, ఈ ప్రేమచే శిష్యులు ఒకరి నొకరు పెనవేసుకుని, తమందరిగమ్యము ఒకటేనన్న తలంపుతో కలసి మెలసి యున్నారు. వివేకానందుని తమ నాయకునిగ గ్రహించమనికూడా రామకృష్ణులే తెలిపారు. ఈవిధముగ సమలంకృతము చేసేటట్లుగ వివేకానందుని తీర్చిదిద్దారు.

వివేకానందులవారికి కాని, ఇతర శిష్య సోదరులకు కాని, సన్న్యాసమంటే ఏమిటి, మఠమంటే ఏమిటని సరిగ్గా తెలియనే తెలియదు. వారు సన్న్యసించడము, మఠము యేర్పాటు చేసుకొనటము కూడా అనుకోకుండగనే జరిగినవి. ప్రేమానంద స్వాములవారి తల్లి ఆహ్వానముపై వీరందరు ఒకరోజు వారి స్వగ్రామమైన అంతపురము వెళ్లారు. ఒకరాత్రి వారు పెద్ద చలిమంట వేసుకొని, దాని చుట్టు కూర్చొని ధ్యానము చేశారు. కొద్దిసేపైనపిమ్మట వారు ఏసుక్రీస్తునిగురించి, ఆయన త్యాగశీలతను గూర్చి, భగవత్ప్రేమ, శరణాగత తత్త్వాలనుగురించి మాట్లాడుకొనుట ప్రారంభించారు. ఈ చర్చలో వివేకానందులు ప్రముఖపాత్ర వహించారన్నది వేరేగ చెప్పనక్కరలేదు. వారి వాగ్ధాటికి ముగ్ధులయి, తమ చుట్టునున్న ప్రపంచాన్నే విస్మరించారు వీరు. కాసేపటితర్వాత, ఇతరవిషయాలు చర్చించారు. తామింతగ ఏసుప్రభువు నెందుకు తలంచుకొన్నామని వారు ఆశ్చర్యపోయారు. ఎప్పుడైతే ఇది డిసెంబరు 24వ తేదీ (క్రిస్మస్ పండుగ తొలినాడు) అని వారికి స్ఫురించినదో, అప్పుడు వారి భవిష్యత్కార్యక్రమ మేమిటి అన్న విషయంకూడా స్ఫురించినది. వెంటనే వారందరూ, క్రీస్తు శిష్యులవలె, గురువులకై తమ సర్వస్వము త్యజించి కలసి కట్టుగా జీవించవలెనని నిశ్చయించుకొన్నారు.

వారు ఇంతకుక్రితమే ఒక మఠం స్థాపించుకొన్నారని చెప్పవచ్చు; కలకత్తాలో ఒక యిల్లు అద్దెకు తీసికొని, అందులో సన్న్యాసులవలెనే జీవిస్తున్నారు. ఇప్పుడు సన్న్యాసస్వీకారానికి ముందు జరపవలసిన విరజహోమాది విధులన్నీ నెరవేర్చారు. తదుపరి, కొందరు అక్కడే (బారానగర్ మఠములో) ఉండిపోయారు. కొందరు పరివ్రాజకులై తీర్థాటనలు సలిపారు. ఎక్కడనున్నా వారి ధ్యేయముమాత్రము భగవద్దర్శనమే, ఇదే మానవజీవితానికి పరమావధియని వారి గురువులు తెలిపారు కదా. తినడానికి తిండి, కట్టుకోవడానికి గుడ్డ సరిగా లేక తిప్పలుపడిన కాలమది. కాని, తమ తపస్సు సరిగా జరుగుతున్నదా లేదా

యన్నదే వారి తలంపు. శ్రీరామకృష్ణుల స్మృతి వారిని వెంటాడి, సర్వము త్యజించి, భగవద్దర్శనానికై గట్టిగా ప్రయత్నించండని ప్రబోధించినది. ఇక నాయకుడు సరే సరి - ఇంకా కష్టపడండని తొందర పెడ్తూనే ఉన్నాడు.

* * *

పైన చెప్పిన విశేషాలన్నీ తెలుసుకొనకపోతే, రామకృష్ణమఠముయొక్క వైశిష్ట్యాన్ని అర్థము చేసికొనడము కష్టమే. రామకృష్ణమఠపు సన్న్యాసుల ఏకైక ధ్యేయము - భగవద్దర్శనము. భగవల్లాభము. ఏవిధముగ చేకూరుతుంది శ్రీరామకృష్ణులు తెలిపారు - ఆమార్గమే వీరి గమ్యము - వీరు ఇల్లు వాకిలీ విడిచి, కుటుంబబాధ్యతలన్నీ తెంచేసుకున్నది. వాటినుండి తప్పించుకొని పారిపోవటానికి కాదు. నా వారన్నవారిమీద మమకారముకంటే భగవతే ప్రేమ ఎక్కువగా నుండడమే దీనికి కారణము. వీరిలో చాలా మంది సంపన్నగృహాలలో పుట్టి పెరిగి, మంచి విద్యోపార్జన చేసినవారే కొంతమంది శ్రీమంతులు కూడా. కాబట్టి తిండికి గడవక, ఇల్లువదలి పారిపోయి వచ్చారన్నది కల్ల. జీవితములో విరాశా నిస్పృహలను చవి చూసి విసిగినవారు కూడా కాదు. భగవద్దర్శనలాలస అధికముగానుండి, భవిష్యత్తునుగురించి ఆలోచనకూడా చేయకుండా వచ్చి చేరినవారు, వీరందరు.

సన్న్యాసాశ్రమము భారతదేశానికి క్రొత్త కాదు. బహుశా భారతీయసంస్కృతి యంత పాతది. కాని, బౌద్ధయుగము తర్వాత మళ్ళీ ఒక సన్న్యాసులసంఘము ఏర్పాటుకావడ మిదే మొదటిసారి కావచ్చు. విద్యావంతులు, అభిజాతులైన యువకులు యందుకో చేరుతున్నారు. ఇదొక చారిత్రిక విశేషము. ఇది భారతదేశముపైన, దాని సంస్కృతిపైన చెరగని ముద్రవేస్తుంది. హిందూమతములోని శ్రేష్ఠత్వాన్ని శ్రీరామకృష్ణులు చూపారన్నది గ్రహిస్తే రామకృష్ణమఠముయొక్క గొప్పదనము తెలుస్తుంది. శ్రీరామకృష్ణుల ఉపదేశాలను సంగ్రహపరచి, వాటిని కార్యాచరణలో పెట్టడానికే వివేకానందుల వారీ మఠాన్ని స్థాపించారు. ఇక్కడ, అక్కడ కొలదిమంది వ్యక్తులు ఈ ఉపదేశాలను పాటించినంతమాత్రాన, అవి శాశ్వతముగ నిలువవు. కనుక దీక్షపరులైన యువకులు వీటిని విపులీకరించి, కార్యరూపేణచేసి చూపెట్టవలసిన అవసర మెంతైన ఉన్నది. ఈ రామకృష్ణమఠాన్నిగురించి ముఖ్యముగ చెప్పుకోవలసినది, దాని దూరదృష్టి, పురోగమనభావము. విజ్ఞాన శాస్త్రవిధానాన్ని ఒప్పుకొని, దానిని ఉపయోగించినను, సనాతన భారతీయధర్మాలను విడనాడదు. ఈ రెండింటినీ సమ్మిళితము చేయవచ్చుననే దీనిభావము. అంతే కాదు, ఈనాడు అవిధమైన సమ్మేళనము ఎంతైనా అవసరమని నమ్ముతున్నది. గత కొన్ని శతాబ్దములుగ భారతదేశములో సన్న్యాసమంటే, ఎంతసేపు వెనుక చూసేవని, క్రొత్తభావాలని వారు స్వీకరించరన్న భావము నాటుకుపోయినది ఆదిశంకరుని తదనంతరము హిందూమతము నిద్రాణమైనది. వర్తమానకాలపు సమస్యల నది యెరుగ్గానేజాలదు. గతకాలపు తేజస్సును, ఉత్తేజమును కోల్పోయి ముందంజ వేయలేనిస్థితిలో నున్నది. ఎందరో సన్న్యాసులు. ఎన్నో ఆశ్రమములు వెలిసినను, యథార్థమైన హిందుత్వానికి నిదర్శనంగా నిలబడలేకపోయినది. హిందుత్వమనగా ఒక ఉత్తేజితపూర్వకమగు వ్యవస్థ; ఎంత తెలిసికొన్నను ఇంకా యెక్కువగా తెలిసికోవాలన్న తపన; క్రొత్త ఊహలను, సరిక్రొత్త ఆలోచనలను చేసట్టినను, సనాతనధర్మపు విలువలను విడనాడదు.

ఏనాడు సన్న్యాసాశ్రమ విలువలు దిగజారిపోయినవో ఆనాడే హిందుమతము కూడ పతనము కాజొచ్చినది. హిందుప్రజానీకానికి సనాతనధర్మాన్ని గురించి పరివ్రాజకులు బోధించేవారు. కనుకనే నిరక్షరాస్యత ప్రబలంగానున్నను, ప్రజలకు తమ మతాన్నిగురించి బాగా తెలుసు. కాని వారి గురువులే అజ్ఞానంలో మునిగియుంటే, వారు ప్రజల కేమి బోధించగలరు? హిందుమతము నశించకుండ నుండవలెనంటే, ఒక క్రొత్త సన్న్యాసులవ్యవస్థ అవసరమైనది.

నేటిసమస్యల నెదుర్కోవడానికి బహుశా రామకృష్ణమఠానికి అవకాశ మెక్కువగా నున్నదని చెప్పుకోవచ్చు. పాతవను ఉద్దేశ్యముతో పురాతన విలువలను విడనాడదు. అలాగే, క్రొత్తవని నూతనభావాలన్నింటినీ పులుముకోదు. రెండింటిలోను ముఖ్యమైనవాటిని యెన్ని పాతక్రొత్తల సమ్మేళనము జరుపుతుంది. రామకృష్ణమఠపు సన్న్యాసుల్లో చాలామందికి ఇంగ్లీషువచ్చు. కాని వారు సంస్కృతాధ్యయనముకూడా చేస్తారు. శ్రోత్రియ ఆచారాలంటే గౌరవమున్నది. సనాతనధర్మాలను విడనాడకుండా పాశ్చాత్యులభావాలను సంక్రమింపచేసుకొనవలెనని స్వామి వివేకానందులవారు చెప్పేవారు వారు చెప్పినట్లు నడచుకొనడానికే రామకృష్ణమఠ సన్న్యాసులప్రయత్నము స్వామి వివేకానందులు చెప్పినట్లు. వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రముల ద్వారానే పాశ్చాత్యులు తమ జీవితానికి వలసిన లౌకిక సుఖములన్నీ యేర్పాటు చేసికొనగలిగారని, ఈ సన్న్యాసుల నమ్మిక. ఆర్థికముగ వెనుకబడిన భారతదేశపు సమస్యలు వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రముద్వారానే తీరగలవని వీరెరు

గుడదు. కనుకనే విజ్ఞానశాస్త్రమును అభ్యసించట మెంతో అవసరమని అయితే. దీనితో సమానముగ సంస్కృతాధ్యయనముకూడా అవసరమన్న విషయము వీరు విస్మరించరు. ఈ రెంటి సమన్వయమువల్లనే భారతదేశానికి, సమస్తవిశ్వానికికూడా క్షేమము చేకూడుతుందంటారు.

దేశపు ఆర్థిక యిబ్బందులగూర్చి సన్న్యాసు లెందుకు పట్టించుకోవాలని అడుగవచ్చు. దీనికి ప్రత్యుత్తర మొకటే – భారతదేశములో లౌకికక్షేమానికి, అధ్యాత్మికచింతనకు విభేదము లేదు. సత్యము ఒకటే – అది మనము చూచే కోణమునుబట్టి వివిధముగ కనపడుతుంది. భగవద్దర్శనము లేక బ్రహ్మజ్ఞానమే మానవజీవిత పరమావధియని మన మహర్షు లన్నారు. ఈ పరమసత్యాన్ని చేరుకోవడానికే మానవుడు సర్వవిధముల ప్రయత్నము చేయాలి. అయితే అంతమాత్రాన సంసారబాధ్యతలను విస్మరించాలని కాదు. మానవుడు చేసే ప్రతిపని ఈ పరమావధికి దగ్గరగా చేర్చవచ్చు. లేక దూరముగ తీసికొనిపోవచ్చు. సాంఘిక బాధ్యతలను విస్మరించిన వ్యక్తి ఆత్మమోక్షానికికూడా దూరమవుతాడు. కనుకనే మతధర్మము బాగా ప్రబలవలెనంటే, ముందుగా దారిద్ర్యనిర్మూలనము జరగాలి.

ఇంతకు క్రితం పేర్కొన్నట్లు, భగవల్లాభముకొరకు, ప్రయత్నము చేయుటే, రామకృష్ణమఠపు సన్న్యాసుల పరమధ్యేయము. అయినా. వీరు పాఠశాలలు. కళాశాలలు, వైద్యాలయాలు నడిపిస్తున్నారు; వ్యవసాయములో హస్తకళలయందు శిక్షణ నిస్తున్నారు; పత్రికలు నడుపుతారు, పుస్తకాలు వ్రాస్తారు, ఉపన్యాసాలిస్తారు. తమ ఆఫీసుల్లో లెక్కలు చూసుకోవడము, పద్దులు వ్రాయడము, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడము చేస్తారు. ఇవన్నీకూడా బహు శ్రద్ధతో చేస్తారు. పనిసామర్థ్యం బాగుగ నున్నవారిగ ప్రతీతి. భగవల్లాభాపేక్షకులను వీనితో నేమి నిమిత్తమని అడుగవచ్చు. ఇవి భగవద్విషయములు కావు; పైపెచ్చు భగవంతుని విస్మరింపజేస్తాయి. వీనికి యిటువంటి కార్యకలాపాలలో మునగరాదు కదా? సన్న్యాసు లిటువంటిపనులలో మునిగితే, భగవద్ధ్యాన మెలా కుదురుతుంది? దీనివల్ల వారి ఆధ్యాత్మిక పురోగమనమునకు అడ్డురాదా? ఇటువంటిపనులు జేసేవారసలు, ఇల్లు వాకిలి యెందుకు వదలి వచ్చినట్లు?

సన్న్యాసులు ఏపని జేసినను భగవదర్పణగ భావించి చేస్తారు భగవల్లాభమే వారి ధ్యేయము; ఈ పనులు దానికి సోపానములు మాత్రమే. సాధారణముగ సన్న్యాసులు ధ్యానము చేస్తారు, శాస్త్రపురాణాది గ్రంథాలు చదువుతారు, తీర్థయాత్రలు సలుపుతారు. ఇవి చెయ్యకూడదని వివేకానంద స్వాములవా రెన్నడు అనలేదు. కాని. వీనితోపాటు నిస్స్వార్థసేవ చేయుమన్నారు. నిస్స్వార్థసేవకూడా ఒక తపస్సాధనయని వారి అభిప్రాయము. ఈ కలియుగములో ఇదే శ్రేష్ఠమైన పూజావిధాన మన్నారు వారు. తమ పరివ్రాజకకాలములో ఇతర సన్న్యాసులు ఏవిధముగ కాలము గడుపుతారన్నది వారు గమనించారు. వీరు కాలము ఇంకా సద్వినియోగము చేసుకొనుటకు వీలుందని వారు అభిప్రాయపడ్డారు. ఏ ఒకరిద్దరు మహాత్ములో అహర్నిశలు జపధ్యానాదికాలు చేయగలరు. ఇతరులు వీనితోపాటు పనులు కూడా చేయాలి, అవి సత్కర్మలయి. నిస్స్వార్థముగ, ఫలాపేక్ష లేకుండ చేస్తే, భగవదర్పణతో సమానమని స్వామి వివేకానందుల అభిప్రాయము భగవద్దర్శనము అన్నిటికంటే మిన్న; తదనంతరం జీవసేవ చేయుడము శ్రేష్ఠతరము. ఆవిధముగనే భగవద్ధ్యానమునకు ప్రయత్నించడం మంచిది, అంతకంటే మేలు, నిష్కామకర్మ.

కాని జీవసేవ అతివినయముతోను, ప్రేమపూర్వకముగ నుండాలి. ఒకరికి సహాయము చేస్తున్నానను అభిమానము ఉండకూడదు. ఒకరి సేవచేసే భాగ్యం తనకు దక్కినందుకు, ఆ సేవను అవతలి వ్యక్తి గ్రహిస్తున్నందుకు మనము భాగ్యశాలులమని భావించాలి. వారినుండి కృతజ్ఞత నాశించకూడదు. భగవంతుడు సర్వత్ర కలడు. విశేషముగ మానవులందు ప్రకాశిస్తాడు – కనుక మానవసేవయే మాధవసేవ యను భావముండాలి. అధమునికి కూడా గౌరవముతో సేవచేయాలి – వారిలోకూడా పరమాత్ముడున్నాడు. గుళ్లల్లో ఆలయాలలో భగవంతుని పూజించవచ్చు. తోటి మానవుని ప్రేమతోను, గౌరవముతోను సత్కరించినను మనకు అదే ఫలితము దక్కుతుంది.

జీవసేవ యనే భావమునకు వివేకానందునిలో నంకురార్పణ జేసినవారు శ్రీరామకృష్ణులు. ఈ ప్రేమాంకురమే తదనంతరం వటవృక్షమైనది. వివేకానందునికి తొలిలో లౌకికవిషయముల గురించి ఆలోచనే లేదు. తన మోక్షము గురించే ఆలోచించువారు. ఒకనాడు శ్రీరామకృష్ణులు జీవితపుటాశయమేమిటో విశ్కచ్ఛిగ వివేకానందులకు తెలిపారు. భగవల్లాభజ్ఞానము కలిగేటట్లు దీవించమని వివేకానందులు శ్రీరామకృష్ణులను వేడించేవారు. ఎప్పటికప్పుడేదో సాకుచెప్పి శ్రీరామకృష్ణులీ విషయము దాటేస్తు వచ్చారు. ఒకదినము వివేకానందులు, నసపెమిరా అన్నారు. శ్రీరామకృష్ణులకు చికాకు కలిగినది. "నీకేమిటి కావాల

న్నారు. తాను యెల్లప్పుడు సమాధిస్థితిలో నుండునట్లుగ దీవించమన్నారు వివేకానందులు. శరీరధ్యాసయే వలద కూడదన్నారు. ఈ శరీరమును విడువకోవడానికి అప్పు డప్పుడు క్రిందిస్థాయికి దిగివచ్చి యేదో కొంచెము భుజి స్తాను. భగవల్లాభమును గురించియే బోధిస్తు, తానును యెల్లప్పుడు సమాధిస్థితిలో నుండు శ్రీరామకృష్ణులీ విష యము విని సంతోషించవలసినది. కాని వారికి చాల కోపము వచ్చినది. "ఛీ! సిగ్గుచేటు. నీవేదో ఘనకార్యము చేపట్టుతావనుకొన్నాను. నేను పొరబడ్డాను. నీ మోక్ష మొకటే కోరుకుంటున్నావు. నీవును యితరులవలె స్వార్థ పరుడవు; అన్నారు. "నీవు జనమార్గములో మర్రిచెట్టువలె నుంటావనుకొన్నాను. మార్గాయాసమువల్ల, ఎండవల్ల అలసి సొలసినవారికి ఆశ్రయమిస్తావనుకొన్నాను. కాని, నీలో కూడా యితరులవలె స్వాపేక్షయే కాని లోకుల క్షేమముకొరకు చింతలేదు" అన్నారు శ్రీరామకృష్ణులు.

ఈ చీవాట్లు వివేకానందుల మనస్సులో చెరగని ముద్ర వేసుకున్నాయి. తదనంతరకాలములో వారు ఆకలిగొన్న ఒక కుక్కకు తిండిపెట్టడానికి కోటిజన్మలెత్తవలసి వచ్చి నను సిద్ధమే నన్నారు.

ఇది పైపై మాటకాదు. స్వానుభవముచేత కలిగిన భావము. హిందువుల అభిమతమేమిటంటే, ఆధ్యాత్మిక సాధన ఒక దశను చేరినప్పుడు, గొప్ప బీద, మంచిచెడు, నీచోన్నతములను భావములన్ని నశించిపోతవి. ఈ విష యము ప్రస్తావిస్తు శ్రీరామకృష్ణులు యిట్లనేవారు: "కొండ శిఖరమును చేరినపిదప, క్రిందనున్నదంతా సమానముగ, ఎత్తుపల్లములు లేనట్లుగ కనపడుతుంది. ఆధ్యాత్మికోన్నతిని పొందినవ్యక్తి భావముకూడ నంతే 'ఒకటే' తప్ప 'వివిధ ములు' కానరావు. ఎవరు దుఃఖించినను అది తనదుఃఖమే. అట్లే సుఖము, సంతోషము మొదలైన భావములుకూడ." ఇది శ్రీరామకృష్ణుల జీవితములో నక్షరాల జరిగినది. ఒక సారి ఒక పడవ సరంగు తన తమ్ముని కొట్టగ, శ్రీరామ కృష్ణులు తమను కొట్టినట్లె బాధపడి, కెవ్వన కేకవేసినారు. వారి వీపుమీద వ్రేళ్లముద్రలు కూడ కనిపించినవి. ఇతరుల సుఖదుఃఖాలలో నిజముగ పాలుపంచుకొనుటకు నిదర్శన మిదే. ఇది ఆధాత్మిక సాధనా శిఖరము. అంతేకాదు. మన సుఖసంతోషముల నితరులకుకూడా పంచిపెట్టాలి. లేకపోతే నీవు దొంగవన్నమాట అని స్వామి వివేకానందులన్నారు.

శ్రీరామకృష్ణ మఠంలోని నూతనాంశమేమనగ, భగవ ద్దర్శనకై సాధన చేయుటతోపాటు మానవసేవ కూడ చేయాలని వారు బోధిస్తారు. నీవు పరమాత్మవు కమ్ము; ఇతరులనుకూడ పరమాత్మునివలె చూడుమని వివేకానందు లన్నారు. రామకృష్ణమఠమువారి బోధనే పాటించుటకు ప్రయత్నిస్తారు. భగవద్దర్శనమే పరమధ్యేయము. జీవసేవ ఈ గమ్యానికొక మార్గము.

ఈ రెండింటినీ సమానముగ నిర్వహించుట సాధ్యము కాదని కొందరి వాదన. అదేదో పాశ్చాత్యభావమును వివేకానందులు సంతరించుకొన్నారంటారు వీరు. వారా దేశములు సందర్శించినపుడు వారి సాంఘికసేవా కార్య క్రమములచేత ప్రభావితులయ్యారు. ఇటువంటివి మనకు లేకపోవడమే వారికి బాధ కలిగించియుండవచ్చు. కనుక, ఇటువంటి సేవా కార్యక్రమాలు మన దేశములో కూడా మొదలుపెట్టాలని వారు తొందరపడ్డారు. ఎవరిచేత ఈ పనులు చేయించాలో తెలియక, సన్న్యాసులనే యిది మొదలుపెట్టమన్నారు. కాని దానికొక ఆధ్యాత్మికత లేక పోతే వాటికవి నచ్చవని వివేకానందులకు తెలుసు. కనుకనే జీవసేవ వ్యక్తి ఆధ్యాత్మికోన్నతికి యేవిధముగ తోడ్పడ గలదని వారు గట్టిగ చెప్పారు.

సేవా కార్యక్రమాలు రామకృష్ణమఠము వారి కార్యక్రమ ములలో నొక ముఖ్యాంశమైన పిదపకూడా చాలా సంవ త్సరాలవరకు, దీనివలన ఆధ్యాత్మిక ప్రగతి జరుగుతుందా యన్న సందేహము చాలామందికి నుండింది. భారతీయ సన్న్యాసధర్మమునకు, దీనికి పొంతనలేదని మఠములో జేరిన సన్న్యాసులే భావించారు. ఇది శ్రీరామకృష్ణ యుప దేశములకే విరుద్ధమని కొందరన్నారు. ఈ విధముగ భావిం చిన వ్యక్తి ఒకరు ఒకసారి వారణాసికి వెళ్లారు. అక్కడ ఆసుపత్రిలో సన్న్యాసులు రాత్రింబవళ్లు రోగోపచారములు చేయుటయు, అంత్యజులు కూడా చేయనొల్లని పనులు చేయుటయు చూసి విభ్రాంతపోయారు. ఇకంత శ్రీరామ కృష్ణుల యుపదేశములకు విరుద్ధమున్నారాయన. ఆ వ్యక్తి మీద సన్న్యాసులకు గౌరవము మెండు. కనుక, ఈయన చెప్పుతున్నదని నిజమే కాబోలునన్న సందేహము కలిగి నది. ఆ సమయములో మాతృమూర్తి శ్రీ శారదాదేవిగారు వారణాసిలోనే యుండిరి. వారు శ్రీరామకృష్ణుల నందరి కంటె మిన్నగ నర్థముచేసికొన్నారు కాబట్టి, సన్న్యాసులు సందేహనివృత్తికై వారివద్దకు వెళ్లారు. నిస్వార్థ, నిష్కామకర్మ ఆధ్యాత్మిక ప్రగతికి తప్పక ఒక సాధనమే నని ఆవిడ నిక్కచ్చిగ చెప్పారు. ఇది శ్రీరామకృష్ణుల యుపదేశములకు అనుగుణముగనే యున్నదని కూడా ఆవిడ అన్నారు. వారు ఆ ఆసుపత్రికి వెళ్లి, కొంత ధనము విరాళముగ నిచ్చారు. దీనితో వాదోపవాదములన్ని సమసి పోయినవి.

ఇది శ్రీరామకృష్ణుల భావములకు విరుద్ధము కాదనడానికి యింకొక్క ఉదాహరణము. శ్రీరామకృష్ణులు మధురబాబుతో తీర్థయాత్రలకు బయలుదేరి దేవఘడ్ చేరుకున్నారు. అప్పుడు దేవఘడ్‌లో కరువుకాటకములు తాండవమాడుతున్నాయి. పేదప్రజలందరికి అన్నము పెట్టించమని శ్రీరామకృష్ణులు మధురబాబును కోరినారు. మొదట్లో బాబు వెనుకంజవేసినను, శ్రీరామకృష్ణుల ఒత్తిడిని కాదనలేక ఒప్పుకొనవలసియే వచ్చినది.

పై సంఘటనద్వారా, శ్రీరామకృష్ణులు ఆకలిబాధలచే అలమటిస్తున్నవారిపై నెట్టి సానుభూతి చూపేవారో మనకు తెలియవస్తుంది. సదా భగవద్ధ్యానపరులైనను, జీవుల కష్టాలకు అతీతులుగ నుండలేదు. తిండిలేని మనిషికి భగవద్విషయములు చెప్పిన యేమి లాభమనేవారు. కనుక, వీరి యుపదేశానుసారము నడచుకునేసన్న్యాసులు యితరజీవుల కష్టాలనుజూచి ఊరకనే యెట్లు ఉండగలరు? అందుకే జీవసేవనుగురించి అంత గట్టిగ చెప్పారు స్వామి వివేకానంద. ఇట్లు మాట్లాడటములో వారు గురువుల అడుగుజాడలను మాత్రమే అనుసరించారు. రామకృష్ణమఠమువారుకూడా అదే చేస్తున్నారు.

జీవసేవ తమ కార్యక్రమములలో నొక ముఖ్యాంశమైనను, ప్రాంతీయావసరములనుబట్టి దీని రూపము మారుచు నుంటుంది. భారతదేశములోను, ఆసియాఖండములోని యితరదేశములందు వారు విద్యావైద్యసౌకర్యముల నందజేస్తున్నారు. పాశ్చాత్యదేశములలో సాంస్కృతికాధ్యాత్మిక బోధనాకార్యక్రమములను చేపట్టినారు. అనతికాలములో ప్రాచ్యదేశములకుకూడా విద్యావైద్యసహాయములు అవసరపడవని ఆశిద్దాము. ప్రభుత్వాలే వాటిని పూర్తిగ చేపట్టవచ్చు. అప్పుడు ప్రాచ్యపాశ్చాత్యదేశాలు రెండింటిలోకూడా ఆధ్యాత్మిక, సాంస్కృతిక విలువలను పెంపొందించుటకు ప్రయత్నములు చేయవచ్చు.

రామకృష్ణమఠమునకు కొన్ని ప్రత్యేకమైన ఆలోచనాసరళులున్నాయి. ఉదాహరణకు, వివేకానందులవారు చెప్పినట్లు, ప్రతిమానవునియందు పరమాత్మ గర్భితమైయున్నాడని అంటారు. ఇది యితరదేశముల వారికొక వినూత్నమైన భావము. భారతదేశములో నుద్భవించిన ఈ భావము, ఈ దేశములోనే చాలామందికి తెలియదు; తెలిసినవారు దానిని కార్యాచరణలో పెట్టను లేదు. ఇది సరిగా గ్రహించిననాడు మానవులమధ్య స్నేహబాంధవ్యాలు యెంతగానో మెరుగుపడుతాయి. ద్వేషవిద్వేషములు తొలగిపోతవి. అందరిమధ్య స్నేహము, ఒకరిపట్ల నొకరికి గౌరవము పెరుగుతవి.

ఇంకొక భావము, మానవసేవయే మాధవసేవ యని తెలిసికొనుట. భగవంతునియెడల చూపు వినమ్రత, భక్తి మానవునిపట్లకూడా చూపగలిగితే ఈ ప్రపంచమే వేరుగ నుంటుంది. సహనమునుగూర్చి శ్రీరామకృష్ణులు పదేపదే చెప్పేవారు. రామకృష్ణమఠమువారు దీనిని యెల్లప్పుడు పాటిస్తూనే యున్నారు. మతవ్యవహారములలోనేగాక, ఏ విషయములోనైనను సరే ఘర్షణకు తావు కలిగినచో దానిలో సహనత చూపుతారు. నేడు మనదేశంలో భాష పేరిట, మతముపేరిట, ప్రాంతీయ రాజకీయములందు యెన్నో ఘర్షణలు జరిగినను, వాటిలో వేలాదిజనులు పాల్గొన్నను, రామకృష్ణమఠమువారు వీటన్నిటికిని అతీతముగ నున్నారు. ఈ మఠములో వివిధరాష్ట్రములనుండి, వేరువేరు దేశములనుండి వచ్చి చేరినవారున్నారు. వారందరు సమైక్యభావముతోనుండి, తమ ఆశయములను విడనాడక, తమచుట్టు యెంత ఘర్షణ జరుగుతున్నను, వాటికి అతీతముగనుండి తమవిధులు తాము నెరవేరుస్తున్నారు. ఈవిధమైన సర్వాతీతభావము, సహనశీలత వర్తమానకాలములో ఎంతైనా అవసరము. మానవసౌహార్ద్రతను ఛిన్నాభిన్నముచేసే ఈ సందర్భములలో రామకృష్ణమఠసన్న్యాసుల ప్రవర్తన ఉద్రిక్తతను కొంతవరకైన తగ్గించగలుగుతుంది. విశ్వశాంతికి సౌహార్ద్రతకి వీరు చేసే సహాయమిది.

ఏ మతస్థులతోనైనా శ్రీరామకృష్ణులు కలిసిమెలిసి యుండేవారన్న విషయము జగద్విదితము. వీరు తమలో తాము కలహించుకొనేవారు. కాని, శ్రీరామకృష్ణులు కెవరితోను కలహించుండేది కాదు పైగా. వారందరినీ దగ్గరగ తీసుకువచ్చుటకు ప్రయత్నించేవారు, ఏ సందర్భములోనైనను యథార్థమైన ఆధ్యాత్మికత కనపడినచో అది విచిత్రమైన ఆచారముగ కనపడినను, దానిని సగౌరవముతో స్వీకరించేవారు. ఏది లోకువ కాదు అనేభావము వారికుండేది.

వివేకానందులకీ భావముండుటవల్లనే పాశ్చాత్యదేశములలో నెచటకు వెళ్లినను వారు జనప్రియులైనారు, ఎన్నో మార్లు హిందుమతమును భారతదేశమును కాపాడవలసిన

భారము వారిమీద పడేది. చాలా గట్టిగ వాదులాడేవారు. కాని యెట్టి సందర్భములోను యితరుల మనస్సు నొప్పించలేదు. వారికొక కులము లేదు. మతము లేదు. బహుశ ప్రత్యేకమైన జాతీయభావముకూడ లేకపోవచ్చు. వారు మానవుని విశ్వజనీనమైన సౌగుణ్యమునకు ప్రతినిధులు. హైందవమునుగురించి మాట్లాడినప్పుడు, ఏవిషయములు సర్వమత సమ్మతముగ నుండునో, అవియే మాట్లాడవారు. మతము మార్పిడి చేయించవలెనను ఉద్దేశ్యమే లేదు. క్రైస్తవులు వరిష్ఠులయిన క్రైస్తవులు కావలెనని, మహమ్మదీయులు వరిష్ఠులయిన మహమ్మదీయులు కావలెనని, హిందువులు వరిష్ఠులయిన హిందువులు కావలెననియే వారి కోరిక. ఏ మతమునకు చెందినను, ఏ రాజకీయసిద్ధాంతములను పాటించినను, ఆ వ్యక్తిజీవితము మెరుగుపరచవలెనని వారి తలంపు. అన్నిదేశములమధ్య సౌహార్ద్రత పెంపొందవలెనని వారు కోరినారు. మాకు అన్ని యున్నవి, యితరులవద్దనుండి తీసుకొనవలసిన దేదియు లేదని ఏ దేశము తలవరాదని వారన్నారు. పాశ్చాత్యదేశములనుంచి శాస్త్ర సాంకేతికజ్ఞానము భారతదేశము గ్రహించవలసియున్నదనియు, పాశ్చాత్యులు భారతదేశమునుండి ఆధ్యాత్మికత భావమును నేర్చుకొనవలసియున్నదనియు వారు భావించారు. వారు తమ దేశము కొరకు కాక, మానవజాతికోసమే పాటుపడ్డారు. "మానవునియందున్న దైవత్వమునే నేను నమ్ముతా" నన్నవారి వాక్యము, వారిభావమును ప్రతిబింబింపచేస్తుంది తాను సన్న్యాసి; తాను ప్రత్యేకమయిన దేశమునకు కాని, జాతికి కాని చెందడు. భారతదేశము యొక్క ఆధ్యాత్మిక సంపత్తువలన ఈ దేశమంటే వారెక్కువ ప్రేమ చూపినారు. ఈ సంపదవలన సర్వప్రపంచమునకు యోగక్షేమములు చేకూరగలవని వారి అభిప్రాయము. భారతదేశపు సంక్షేమానికే కాక యావత్తు విశ్వము యొక్క సంక్షేమమునకై ఈ భారతీయ ఆధ్యాత్మికసంపత్తి నాశనము కాకుండా చూడాలని వారి తపన.

రామకృష్ణమఠపు సన్న్యాసులు, మేము ప్రపంచపౌరులమనే భావముతోనే పనులు చేస్తారు. వారు లోకములో నలుదిక్కులనున్నారు. ఎక్కడున్నను పరాయిదేశములో నున్నట్లు భావించరు. వారి విశాల దృక్పథము, ఆ దేశపు సంస్కృతిని స్వీకరించే ఔదార్యము చూపి ఆ ఆ దేశపు ప్రజలు వారిని సమ్మానిస్తారు. ఇతరులకు తెలియని విషయములు తాము తెలుపగలమను బడాయి భావము వారిలో కనపడదు. భారతీయ సనాతన ధర్మమును గౌరవ, వినయములతో వితరులకు చెప్పుతారు. ఆ చెప్పే విధానము యితరుల అభిమానమునకు దెబ్బకొట్టినట్లుండదు. అవతలవారు, తమకు నచ్చినవి ఎన్నుకుంటారు. ఇతరులకు నేర్పేటప్పుడు వారినుండి వీరెన్నో నేర్చుకుంటారు. సేవయే వారి ధర్మము అది స్వార్థరహితమైన సేవ. వారి ధ్యేయమొక్కటే: పరమాత్మ తత్త్వము తాను తెలుసుకోవాలి, యితరులు కూడ తెలుసుకోగలగాలి.

పైన చెప్పినరీతిన, భావములోను చేతలలోను కూడా రామకృష్ణమఠపు వ్యవహారము మునుపటి సన్న్యాసాశ్రమములనుండి భిన్నముగనున్నది మనదేశపు చరిత్రలో నింతకుమునుపు సన్న్యాసులెవ్వరును, సమాజములోని వ్యత్యాసములను రూపుమాపుటకు ప్రయత్నము చేయలేదు. ఈ విధముగ కులతత్త్వము, జాత్యభిమానము భాషా దురభిమానములకు అతీతముగ నుండలేదు. ప్రజాసంక్షేమమునకై ఇంత దీక్షతో, నిర్విరామముగ కృషి చేయలేదు. మానవులందరిని సమైక్యభావముతో చేర్చుటకు యింతకు మునుపు యెవ్వరు పాటుపడలేదు.

తెలుగుసేత: డాక్టర్ కమల జయరావు

---

## శ్రీరామకృష్ణ మఠం, మద్రాసు-4. అక్టోబరునెల విశేషకార్యక్రమం

| | |
|---|---|
| 2 వ తేది శనివారం | శ్రీ శ్రీ లక్ష్మీపూజ (సాయంకాలికా రాత్రికానంతరం) |
| 16 వ తేది శనివారము | శ్రీ శ్రీ కాళీపూజ ( ,, ) |
| 29 వ తేది శుక్రవారము | శ్రీ సుబోధానంద జయంతి |
| 31 వ తేది ఆదివారం | శ్రీ విజ్ఞానానంద జయంతి |
| 13 వ తేది బుధవారం<br>28 వ తేది గురువారం | ఏకాదశి దినములు |

ఓం ప్రకాశ్

# పాతాళంలో పరమహంస

## (బలిచక్రవర్తి కథ)

తేజోశరీరం గల దైత్యగురువు శుక్రాచార్యుడు దానవరాజు బలినిచూశాడు. బలి మౌనియై ధ్యానమగ్నుడైయున్నాడు. సంసార రూపభ్రమనుండి రహితుడై నిశ్చలుడై యున్నాడు. స్థిరబుద్ధిగలవాడై, ప్రసన్నచిత్తుడై విశుద్ధపరమపదాన్ని పొంది యున్నాడు. అతిశయశాంతిమయ పరమానందంలో విలీనుడైపోయాడు. నిర్వికార పరమపదంలో విశ్రమిస్తున్నాడు. చిత్తభ్రాంతినుండి సర్వదా రహితుడై సచ్చిదానందసాగరంలో కరిగిపోయాడు.

శుక్రాచార్యునికి బలి పొందిన స్థితిని చూసి మహదానందం వేసింది. బలిని చూడ వచ్చిన దానవులను, తదితరులనందర్నీ ఒకమారు పర్యాలోకించాడు.

"దానవుల్లారా! మీ చక్రవర్తి గూర్చి ఆందోళన పడకండి. ఇతని అజ్ఞానయుక్తభ్రమ తొలగిపోయింది. తన స్వయంప్రకాశము ఇతనికి లభించింది. నిర్వికల్ప సమాధిలో పరమానందాన్ని అనుభవిస్తూ, జన్మజన్మాంతరాల నుండి ఎదురుచూస్తున్న చిరవిశ్రాంతిలో సుఖిస్తున్నాడు. మీ రెవ్వరితనికి ఎలాంటి విఘ్నం తలపెట్టకండి. సమయం వచ్చినప్పుడు స్వయంగానే జాగృతుడౌతాడు. మీరిక వెళ్ళండి. రాచకార్యాలనన్నిటినీ సక్రమంగా మీ రే నిర్వహించండి. మీ చక్రవర్తి ఒక వేయిసంవత్సరాల తర్వాత సమాధిస్థితినుండి జాగ్రదవస్థలోకి వస్తాడు."

దైత్యులకు, నాగులకు, గృహాధిపతులకు, దేవసమూహాలకు, పర్వతాధిష్ఠాతృదేవతలకు, దిక్పాలకులకు, వనచరజీవాలకు, గగనచర ప్రాణులకు అందరికీ, మనుష్యులకు కూడ గురుదేవుని వచనాలు సంతృప్తిని కల్గించాయి. బలి ఏలుబడిలోనున్న ప్రాణులన్నీ సంహర్షంగా తమ తమ నెలవులకు వెళ్ళిపోయాయి.

దైత్యగురువు, బలిచక్రవర్తిని ప్రేమమీర ఆప్యాయతతో తిలకించాడు. అంతక్రితమే బలి ఒకమారు తనను స్మరించాడు; పరమాత్మ ధ్యానంలో ఉన్న తనకు తన శిష్యునిస్థితి అవగతమయింది. బలి తత్త్వజ్ఞానాన్ని అభిలషిస్తూ తనను స్మరించాడని తెలిసి శుక్రాచార్యుడు వెంటనే అతని చెంతకు వెళ్ళి ప్రత్యక్షమయ్యాడు. బలిచక్రవర్తి అతన్ని తగిన విధంగా సత్కరించి, అత్యంత విలువైన ఆసనాన్ని సమర్పించాడు. ఆచార్యుడు విరాజమానుడు కాగానే, నమ్రతతో బలిగురుదేవులకు నమస్కరించాడు.

"భగవాన్! దయతో నన్ననుగ్రహించండి. మహామోహాన్ని కల్గజేసే ఈ భోగాలంటే నాకు విరక్తి పుడుతుంది. ఈ మోహాన్ని నాశనం చేసే జ్ఞానం నాక్కావాలి. ఆ పరమ తత్త్వయుత జ్ఞానమేదో, కృపతో సెలవీయండి."

"దానవేంద్ర! సంక్షేపంగా ఆతత్త్వం చెబుతున్నాను. విను." శుక్రాచార్యుడు శిష్యుని జిజ్ఞాసకు పరితృప్తుడయిపోయాడు.

"శ్రద్ధగలవారికి చెప్పేబోధ సంక్షిప్తంగా ఉన్నాసరే, దాన్ని వారు గ్రహిస్తారు. శ్రద్ధలేనివారికి ఎంత చెప్పినా, అది బూడిదలో

పోసిన ఆహుతే (నెయ్యి) అవుతుంది. కనుక శ్రద్ధగా విను. మనకు దృశ్యమానమయ్యేదంతా సచ్చిదానంద ఘనస్వరూపమే; బ్రహ్మమే; చైతన్యమే. ఈ సంసారంలో చైతన్యం తప్ప మరొకటి లేదు. ఈ జగత్తంతా చిన్మయమాత్రం. నీవు, నేను, ఈ లోకమంతా చైతన్యమే. ఇదే సమస్త సిద్ధాంతాల సారం. ఈ చైతన్యం యొక్క విషయాకార కల్పన మున్నది కదా, అదే బంధనం. ఈ విషయాకార వృత్తినుండి రహితుడు కావటమే ముక్తి అదే నీ మోహాన్ని నాశనం చేస్తుంది. నీకు చైతన్యస్వరూపమైన పరబ్రహ్మసాక్షాత్కారాన్ని కలుగజేస్తుంది. సర్వదుఃఖాలు నీకు శమిస్తాయి. పరమశాంతి లభిస్తుంది. ఆ విషయాకార రాహిత్యాన్ని సాధించు. చైతన్యాన్ని అనుభవించు. నీ మహామోహం మాయమైపోతుంది.''

శుక్రాచార్యుడు చేసిన బోధ శిష్యుని హృదయంలో ప్రవేశించింది. బలిచక్రవర్తి కలాబోధచేసి శుక్రాచార్యుడు గ్రహాలతో నిండిన ఆకాశంలోకి వెళ్ళిపోయాడు.

శుక్రాచార్యునికిదంతా జ్ఞాపకం వచ్చింది. సమాధిస్థితుడైన శిష్యునివైపు తృప్తిగా చూశాడు. తానలా వెళ్ళివచ్చేలోగానే బలి సమత్వస్థితిని సాధించటం ఆనందం కల్గించింది. ఆ స్థితిని చూసి, వాస్తవమెరగని దానవులు భయపడిపోయి తనను పిలిచారు కాబట్టి తాను త్వరగా రాగల్గాడు లేకపోతే ఈ దానవులు బలిసమాధికి భంగం కల్గించి యుండేవారే! వారుత్త అజ్ఞానులు; సమాధిస్థితికి మృత్యువు స్థితికి భేదం తెలియనివారు. తమ రాజు చనిపోయాడేమో నన్న ఆందోళనతోనే వారు తనను స్మరించారు. తను రావటం మంచిదే. అయింది. ఇక బలికిప్పుడు ఎలాంటి ప్రమాదం లేదు.

శుక్రాచార్యుడు బలిని నిర్వికల్పసమాధిలో వదిలి, యథాస్థానానికి వెళ్ళిపోయాడు.

కాలచక్ర పరిభ్రమణంలో సహస్రవర్షాలు గడిచిపోయాయి. బలి సమాధినుండి క్రమంగా జాగ్రదవస్థలోకి వచ్చాడు.

సమాధిస్థితిలోకి పోయేముందు బలి మనస్సును బాగా నుధిచాడు. గురుదేవుల బోధ గూర్చి మననం చేశాడు. అతని కాబోధలో వాస్తవమే కన్పించింది. ఇంద్రియాలు, శరీరము, మనసు, ఇచ్ఛ అన్నీ చైతన్య స్వరూపాలే నని తోచాయి. అంతస్సులో, బాహ్యంలో, సమస్త భావపదార్థాల్లో, సర్వజగత్తులో చైతన్యమే స్ఫురించింది. చైతన్యం తప్పించి అతనికి మరో యథార్థం తోచలేదు. ముల్లోకాలూ, సర్వదిశలూ, సర్వక్రియలు కూడ చైతన్యంగానే ప్రకాశించాయి. ఒక్కమాటలో చెప్పాలంటే అతనికి కేవలం ఒకేఒక సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపం అనుభవంలోకి వచ్చింది.

''చైతన్య పరమాత్మతప్ప మరోవస్తువు సత్తాయే లేనప్పుడు, ద్వైతానికెక్కడవకాశముంది? ద్వైతమే లేనప్పుడు ఎవరికెవరు శత్రువు, ఎవరికెవరు మిత్రుడూ? ఆ సత్యస్థితిలో రాగద్వేషాలకునికెక్కడిదీ? మనసుకు, దాని వృత్తులకు తావెక్కడిదీ? నిజానికి ఆ చిన్మయ పరమాత్మలో వికల్ప కల్పన చేయుట మెలా సంభవం?''

బలిచక్రవర్తి విచారణతో నిమగ్నుడై క్రమక్రమంగ మనోతీత అవస్థలోకి జారుకున్నాడు.

"నేను సర్వవ్యాపిని; నిత్యానందమయుణ్ని; వికల్ప కల్పనారహితుణ్ని; ద్వైతశూన్యమైన కేవల సచ్చిదానంద ఘనపరమాత్మను. నేను అనంతుణ్ని సూక్ష్మాతి సూక్ష్ముణ్ని. ఈ సుఖ దుఃఖాదులు నన్ను స్పర్శించనైనా స్పర్శించ లేవు."

అలా వివేచన చేస్తూ, ఓంకారంలోని అర్థ మాత్ర'మ్' కారార్థభూత తురీయ పరమాత్మ ధ్యానంలో లీనమయ్యాడు. అతని సంకల్పాలు శాంతించాయి. శంకలన్నీ నశించాయి. ధ్యాత, ధ్యేయ, ధ్యాన రహితుడయ్యాడు. నిర్మలుడై, వాసనాశూన్యుడై, నిశ్చలుడై పోయాడు. సమాధి స్థితుడయ్యాడు. పరమపదాన్ని పొందాడు. అలా; అవిచలనభావంతో, నిర్వికల్ప సమాధిలో ఈ వెయ్యి సంవత్సరాలు గడిపాడు. నేడతనికి తిరిగి సమాధిస్థితినుండి ప్రపంచంలోకి మెలుకువచ్చింది. కనులు విప్పి పరిసరాలను చూశాడు. రాజభవనం, రాజ్యం స్ఫురణకు వచ్చాయి.

"ఈ రాజ్యవైభవ సంపత్తివల్ల నాకేమిటీ ప్రయోజనం?" అని అనుకున్నాడు. అతని అజ్ఞానమంతా నశించిపోయింది. తనకు బంధం మోక్షం అనేవేవి లేవన్న నిశ్చయజ్ఞానం కల్గింది. ధ్యానం చేస్తేనేం చేయకపోతేనేం; అన్న సర్వాతీతావస్థానుభవం దృఢంగా చేకూరింది.

"నేను చింతారహితుణ్ని సమభావమందు స్థితుణ్నై యున్నవాణ్ని ఈ లోకమున్నా లేకున్నా, ఈ భోగాలున్నా లేకున్నా వాటి విషయం నాకవసరంలేదు. భోగాదుల రాకపోకలతో నాకు పనిలేదు. నా వంటూ ఏవీ లేవు. ఏవీ కూడ నేను కాను. నాకు కర్తవ్యమెలా లేదో, అలాగే అకర్తవ్యం కూడా లేదు. నేను కేవలం ఆ పరమశాంతిలో స్థితుడనై యున్నాను."

బలిచక్రవర్తి తన నిజస్వరూపజ్ఞానంతో స్థిరుడై, మెల్లిగా లేచాడు.

"అయినా ఈ రాజ్యపాలన అనే కర్మ ఒకటి ప్రస్తుతమైయున్నది దీన్ని నేనెందుక్కాదనాలి?"

ఆత్మజ్ఞానమందు దృఢచిత్తుడైన బలి, ఒక నటుని మాదిరిగా వ్యవహారంలో ప్రవర్తించటానికి సంసిద్ధుడైయ్యాడు. వాసనారహిత మనసుతో తిరిగి రాచకార్యాలను చేపట్టాడు. సర్వులయెడల సమవర్తియై పాలన చేశాడు.

ఇలాంటి రాజ్యపాలనతోనే, పూర్వం తత్త్వజ్ఞానం లభించక పూర్వం అతనికి మహా విసుగెత్తిపోయింది. ఆ విసుగులో, అతని మనసు విచలితమైపోయింది. ఇలా ఎంతకాలం శాసనం చేయాలి? తానీలా ఈ త్రిలోకాల భారాన్ని ఎంతకాలం మోయాలి? అని అతను విచారించాడు. ఈ రాజ్యాదిభోగాలు పరిణామంలో నాశవంతములైనవి కదా! వీటివల్ల తనకేమి సుఖం లభిస్తుందనీ! ఏది లభిస్తే, మరేతర వస్తువుల అవసరముండదో, అట్టి పరమ ఉదార అద్వితీయఫలం తనకు దొరికితే బాగుండును కదా! ఈ క్షణభంగుర భోగాలతో తనకేమి పని!

బలి అలా విచారిస్తుండగా, అతనికి విరోచనుని ఉపదేశము జ్ఞాపకం వచ్చింది. విరోచనుడతని తండ్రి. ఆత్మతత్త్వజ్ఞాన సంపన్నుడు.

"ఆత్మ ఒకరాజు. బుద్ధి అతని మంత్రి. బుద్ధిని గెలిస్తే చాలు సర్వమూ లభిస్తుంది. కాని బుద్ధియుక్తమైన ఈ మనసును జయించటమే కష్టమైనపని. బలప్రయోగంవల్ల అది లొంగదు. దాన్ని యుక్తిద్వారానే లొంగదీసుకోవాలి."

విరోచనుడు పుత్రునికి ఉపదేశిస్తున్నాడు

"కుమారా! సర్వవిషయాల యెడ వైరాగ్యం పూనటమనే యుక్తి ఈ మనసును త్వరగా వశంచేస్తుంది. ఈ యుక్తిని అవలంభించటమెంత కష్టమో, అంత సులభం కూడ. అభ్యాసంవల్ల ఇది సులభంగా పట్టుబడుతుంది. క్రమంగా విషయాలనుండి విరక్తతను సాధించటమే అభ్యాసము. విషయవైరాగ్యం లభించక పోతే ఈ మనసు కల్పించే దుఃఖాలలోపడి మగ్గవలసిందే! శారీరిక బలమెంతున్నా, వైరాగ్య అభ్యాసం సాధించనిదే, ఈ మనసును జయించలేరు."

తనకు శారీరిక జన్మనిచ్చిన తండ్రి, తనకు మృత్యురాహిత్య, జన్మరాహిత్య స్థితి లభించే ఉపాయం చెబుతున్నందుకు, బలికి మహదానందమైంది. బలి జనకుని మాటలు శ్రద్ధగా గ్రహించసాగాడు. విషయ వైరాగ్యమే, మనో నిశ్చలతకు మార్గమని ఎంత సూటిగా చెబుతున్నాడు! నిజానికి తత్త్వబోధ ఇంత సులభంగా ఉన్నప్పుడే కదా సాధకునికి అందు రుచి ఏర్పడుతుంది. దానిలోని పరమసారం అర్థమౌతుంది!

బలి తండ్రి మాటలను క్షుణ్ణంగా తర్కించుకొని నిశ్చయం చేసుకొన్నాడు. ఈ విషయవైరాగ్యం దృఢం కావాలంటే దానికి మార్గమేమిటీ అన్న సంశయం వచ్చింది.

విరోచనుడది గ్రహించినట్లున్నాడు.

"పుత్రా!" అని పిలిచాడు. "ఆత్మ సాక్షాత్కారం కలిగితేకాని ఈ విషయాసక్తి పూర్ణంగా నశించదు. ఆ సాక్షాత్కారం పవిత్రమైన, తీక్షణమైన బుద్ధిచేత, అత్యుత్తమమైన వివేక విచారాలచేతగాని సాధ్యంకాదు. కాబట్టి నిరంతర అభ్యాసం చేస్తుండాలి. దినంలో [illegible]లు సచ్ఛాస్త్రాల అనుశీలనంలో గడపాలి. తద్వార చిత్తం వైరాగ్యమయం అవుతుంది. మూడవభాగాన్ని ఏకాంతంలో గడపాలి. మనసును సచ్చిదానందఘన పరమాత్మ ధ్యానంలో లీనంచేయాలి. ఇక మిగిలిన నాల్గవ భాగపు దినమున్నది కదా, ఆ సమయంలో గురు సేవాశుశ్రూషలు చేయాలి. శ్రద్ధాభక్తి పూర్వకంగా గురువును సేవిస్తూ, అతని ఆజ్ఞలను పాలిస్తూ గడపాలి."

బలికి యథార్థ తత్త్వం అరచేతిలోని ఉసిరికాయలా సులభగ్రాహ్యమయింది. అతని మనసు వికసించింది. వదనం ప్రఫుల్లితమైంది. మెరిసేకళ్ళతో తండ్రినే తిలకిస్తున్నాడు.

"కుమారా! నిజంగా పుత్రుడవంటే నీవే సుమా! పున్నామనరకం నుండి తప్పించటానికి, పితృలోకాలనుండి పురోగమింపజేయటానికి, నీ పూర్వీకులకు నీ కంటే సత్పుత్రుడెవడు దొరుకుతాడు. కేవలం పెండ్లిచేసుకొని, పదిమంది పిల్లల్ని కని సంసారాన్ని పెంచుకొన్నంతనే పితృదేవత లుద్ధరింపబడతారా? అదెమోగాని సంసారాన్ని పెంచుకొన్నందువల్ల నీవు బాధపడటమేగాక, సంఘ జీవితానికి కూడ భారం కల్గజేసినవాడవుతావు. ఆత్మ విచారణయందాసక్తిగల నీవంటి సత్పుత్రుడొక్కడు చాలు గదా! బంధువులే కాదు, పితృదేవతలే కాదు, సర్వమానవులు కూడ నీలాంటి పుత్రులవల్ల ఉద్ధరింపబడతారు."

విరోచనుడు బలివైపు ఆనందంతో చూస్తూ కాసేపు తన్మయుడైపోయాడు. కొన్ని క్షణాల తర్వాత ప్రసన్నవదనంతో బలికి మరల ఉపదేశం చేశాడు.

"ఈ చిత్తమున్నది చూశావా? ఇదొక పసిపిల్లవానివంటిది. పవిత్రమైన మాటలచేత, యుక్తులచేత, దీన్ని వశం చేసుకోవాలి. అను

వైన శాస్త్రాల అనుశీలనం ద్వార సమాధాన పరచాలి. మృదువుగా, మెల్లిగా, ప్రేమతో, ఓర్పుతో దీన్ని ఓదార్చి ఒడిలోకి చేర్చుకో వాలి. అలాంటి ప్రయత్నం ద్వారానే తప్ప పరమశాంత స్థితి లభించదు. అలా కాక, ఈ చిత్తాన్ని స్వేచ్ఛగా వదిలివేస్తే, అది నీకే ప్రమాదాన్ని కొనితెస్తుంది. అది స్వభావాను సారంగా విషయభోగాలవైపు గంతులేస్తూ పరిగెడుతుంది. ఆ విషయాల్లోనే ఆనందముం దని భ్రమించి, వాటినే ఆస్వాదించాలని కోరు కొంటుంది. అలాంటి చిత్తం గల మనుషులకు శాంతి సౌఖ్యం ఎప్పుడూ లభించవు. పరమ తత్త్వజ్ఞానం వారికసలే అందదు. నిస్సీమ నిరతి శయ ఆనందం పొందాలంటే పరమాత్మ తత్త్వ శ్రవణం చేయవలసిందే. మరో మార్గం లేదు."

విరోచను డొక క్షణం ఆగి చూశాడు. బలి శ్రవణంలో లీనమైయున్నాడు.

"సకామభావంతో అనేక కర్మలు చేస్తుం టారు. యజ్ఞాలు చేస్తారు. దానాలు చేస్తారు. తపస్సు చేస్తారు. సుదీర్ఘమైన తీర్థయాత్రాదులు చేస్తారు. వీటి ఉద్దేశం ఒక్కటే, భోగ భాగ్యాలు లభించాలి. లభిస్తాయి; స్వర్గ సుఖాలుకూడ లభిస్తాయి. కాని వారి అంతరం గం, వారి హృదయాంతర్గత చిత్తం ఆశించే శాంతి మాత్రం లభించదు. వారు పరమ శాంతిని కోరే, తప్పుడు మార్గాలను, సకామ మార్గాలను అనుసరిస్తుంటారు. వారికి లక్ష్యం యొక్క గ్రహణ లేకపోవటమే కాదు, సరైన మార్గం కూడ తెలియదు. తమ లక్ష్యం పరమ శాంతి అన్నది మరచి భోగాలసేవనమేనని భ్రమపడతారు. సకామమార్గమే సరయినదని ఎంచి చివరికి అనంతమైన దుఃఖాలవలలో చిక్కుకుంటారు. కుమారా! వాస్తవమేమంటే నిష్కామ కర్మాచరణమే సవ్యమైన పథం. ఈ జపతప యజ్ఞాదుల ముఖ్యోద్దేశం విషయ వైరాగ్యమేగాని, విషయలంపటత్వం కాదు. ఈ విషయ వైరాగ్యాన్ని నిష్కామకర్మల ద్వారా సాధించేందుకు యత్నించాలి. ఆ వైరాగ్యం పరమాత్మ సాక్షాత్కారానికి, పరమశాంతికి దారితీస్తుంది."

బలిలో నూతనోత్సాహం కల్గసాగింది.

"కుమారా! సామాన్యులు ఈ స్థితికి ఎలా చేరాలో ఆ ఉపాయం చెబుతాను విను. సామాన్యులకు ధనాసక్తి అధికంగా ఉంటుంది. వారిని ఆ దశనుండే ముందుకు అడుగులు వేయించాలి. అలాంటి సామాన్యులుముందుగా న్యాయపూర్వక పురుషార్థం ద్వార ధనాన్ని సంపాదించుకోవాలి. ఆ ధనాన్ని శీలవంతులు, గుణవంతులయిన వారికై వినియోగించాలి. సత్పురుషుల సేవకై ఉపయోగించాలి. సత్పు రుష సాంగత్యంచేత క్రమంగ శాస్త్రాల యథార్థ సారం గోచరిస్తుంది. అనుభూత మవుతుంది. ఆ పిమ్మట క్రమ క్రమంగ పరమ పద స్వరూప పరమాత్మ ప్రాప్తి లభిస్తుంది."

విరోచనుని సుదీర్ఘమైన, సుసంపన్న తత్త్వ జ్ఞాన యుతమైన, సులభగ్రాహ్యమైన మహో పదేశం బలిలో పురుషప్రయత్నాన్ని జాగృతం చేసింది. అతణ్ని ప్రబుద్ధున్ని గావించింది.

ఎప్పుడో విన్న ఆ ఉపదేశం బలి మనసును నిశ్చలం చేసింది. ఆ నిశ్చలమైన మనసులో గురుదేవులయిన శుక్రాచార్యులను ధ్యానిం చాడు. శుక్రాచార్యుడు వెంటనే ప్రత్యక్షమై సంక్షిప్తంగా చైతన్యబోధ చేశాడు. ఆ బోధతో బలి క్రమంగా నిర్వికల్ప సమాధిలో విలీనుడై పోయాడు.

వెయ్యి సంవత్సరాల తర్వాత మరల మేలుకున్నాడు. మేలుకుని సమచిత్తుడై, నిర్వికారుడై తన కప్పగింపబడిన రాచకార్యాలను నిర్వహించాడు.

నిర్వికారుడైన బలికి భోగాభిలాష లేదని, లక్ష్మీపతి విష్ణుభగవానుడు నిశ్చయించుకొన్నాడు. సిద్ధిదాత అయిన ఆ భగవానుడు బలికి ఉత్తమస్థితి ప్రసాదించ దలిచాడు.

బలి, అశ్వమేధయాగానికి పూనుకొని, ఆ మహాయజ్ఞంలో దీక్షితుడైయున్నాడు. ఆ సమయంలో వామనావతారుడైన విష్ణుభగవానుడు ఆ యాగస్థలాని కేతెంచాడు. భోగాలలో చిక్కిన భక్తుడు తనకు దూరం కావటం భగవంతుని కిష్టం ఉండదు. తన భక్తునియందు భగవంతునికి ప్రేమ కల్గితే, భగవంతుడతన్ని భోగాల నుండి దూరున్ని చేస్తాడు. సర్వదా తన స్మరణ ధ్యానాలలోనే గడిపేటట్లు చేస్తాడు. తనను లక్ష్యపెట్టని వారికి భగవంతుడు ఈ భోగాలను ఇచ్చి, వారిని దూరంగానే ఉంచుకుంటాడు.

దేవేంద్రుడు భోగాసక్తుడు. అతనికి భగవంతునికన్నా, స్వర్గాధిపత్యమే ప్రధానం అతడెప్పుడు మొర పెట్టుకున్నా, స్వర్గరాజ్యం కావాలనే కాని, భగవంతుడే కావాలని కాదు. అలాంటి వారిని దూరంగా ఉంచాలనే ఉద్దేశంతో వామనరూప భగవంతుడు బలిని యాచించి, విరాట్ స్వరూపంతో సర్వలోకాలను కొలుచుకొని, ఆ జగద్రూప అరణ్యాన్ని ఇంద్రునికిచ్చివేశాడు. బలిని పాతాళ రాజ్యంలో అధిష్ఠితున్ని చేసి, తానుకూడ అక్కడే ఉండిపోయి, నిరంతరము భక్తుడైన బలిని కాపాడుతూ ఉన్నాడు.

బలి జీవన్ముక్తుడై బ్రహ్మస్వరూప ఆత్మలో స్థితుడైయున్నాడు. సర్వదా పరమాత్మచింతనలోనే మనసును లగ్నంచేసి, శాంతుడైయున్నాడు. పాతాళంలో ఉంటూకూడ, ఆపత్తిని - సంపత్తిని సమదృష్టితో చూస్తున్నాడు. పూర్ణకాముడైయున్నాడు.

ఈ బలిచక్రవర్తి భవిష్యత్తులో మరల ఇంద్రపదవి చేబట్టబోతాడు. అప్పుడనేక వర్షాలు ఈ లోకాలను పాలిస్తాడు. భావిలో లభించే ఇంద్రపదవి అనే ఆశచేత అతనికి సంతోషం కల్గటంలేదు. అతను సర్వభావాల నుండి అతీతుడై సముడై, సంతుష్టచిత్తుడైయున్నాడు.

తనకు ప్రాప్తించిన భోగాలను అనాసక్తుడై అనుభవిస్తున్నాడు. బలి ఆకాశం మాదిరి తన ఆత్మలో నిత్యస్థితిలో స్థితుడైయున్నాడు.

ఇంతటి పరమహంస, బలిచక్రవర్తి రాబోయే కాలంలో మహేంద్ర పదవినలంకరిస్తాడు. ఆహా! ఆ కాలపు జీవులు ఎంత అదృష్టవంతులయుంటారో కదా!

## కథావివేచనము

శ్రీ యోగవాసిష్ఠంలోని ఉపశమనప్రకరణంలో ఈ కథ. సంసారజీవులమైన మనకు ఉపశమనము కల్గిస్తుంది. ఈ వృత్తాంతము 22.29 సర్గల పర్యంతము ప్రయాణం సాగిస్తూ మనలను శాంతచిత్తులను చేస్తుంది.

సృష్టిలోని సర్వజీవులకూడ మోక్షగాములై జననమరణ చక్రములందు పరిభ్రమిస్తున్నాయి. ఆ పరిభ్రమణంలో మానవజన్మ లభించి, వాస్తవ మోక్షసాధనకు కారణమవుతుంది.

మానవజన్మ ఎత్తిన ప్రతిజీవి మోక్షానికి ప్రయత్నిస్తాడని చెప్పలేము. గీతా భగవానుడు చెప్పినట్లు అనేకానేక జనుల్లో ఎవరో ఒకరు దానికై యత్నిస్తారు, ఆ యత్నించే వారిలోకూడ ఎవరో ఒకరు మాత్రమే తీవ్రమైన అభ్యాసం చేస్తారు. అలా అభ్యాసం చేసేవారిలో ఏ ఒక్కరో సిద్ధి పొంది పరమాత్మానందానుభవంలో లీనమవుతారు.

బలి సంసారంనుండి విరక్తుడై జీవితంయొక్క ఉద్దేశ మేమిటి అన్న ఆలోచనలో పడ్డాడు. ప్రతిజీవికి ఎప్పుడో ఒకప్పుడు ఇలాంటి విరక్తిజన్యమైన భావం ఉదయించక పోదు. అయితే అది శ్మశానవైరాగ్యంలా క్షణికమైనదైతే, దానివల్ల ప్రయోజనంలేదు. గౌతమబుద్ధునిలా ఆ విరక్తి స్థిరమై యుండాలి.

విరక్తివల్ల వివేచన ఉదయిస్తుంది. తగిన గురువు, అభ్యాసవిధానం లభ్యమవుతాయి. తీవ్రఅభ్యాసంచేత సంసారభ్రమ నశిస్తుంది.

జీవన్ముక్తి పొందటమంటే, సంసారంనుండి తొలగి పోవడం కాదు. దేహమున్నంతవరకు మన మెక్కడి కెళ్ళినా సంసారం మనవెంటాతా ఉండనే ఉంటుంది. ఇల్లు విడచి పోలేము. కాని ఇంటిపై ఆసక్తిని త్యజించవచ్చు: ధనాన్ని త్యజించమని ఎవరూ చెప్పరు. దానిపై మమ తను త్యజించమంటారు, భార్యాపుత్రులనువదిలి ఏ అరణ్యాలకో వెళ్ళమని ఏ ప్రబుద్ధుడూ చెప్పడు; వారిపైనున్న స్వాభిమతాన్ని, స్వామిపతిత్వాన్ని, అహంకారాన్ని, 'స్వ' కారాన్ని వదిలివేయమంటారు.

ముక్తి మనసుకు సంబంధించింది. శరీరానికి కాదు. శరీరం జడపదార్థం. దానికి ముక్తిబంధనా లేమిటి? మనసుకే బంధనం. దానికే ముక్తి. వింత ఏమిటంటే ఆ మనసే ముక్తికి సాధనం. మనసుతోనే మనసును విముక్తి పరచటం! ఇదే మన ద్రష్టల విశిష్ట ఆవిష్కారం!

గౌతమబుద్ధుడు, శరీరాన్ని ఎక్కడో సామాజిక జీవనానికి దూరంగా తీసుకువెళితే, ముక్తి (నిర్వాణం) లభిస్తుందని భ్రమపడ్డాడు. శరీరానికి ఆహారపానీయా లందించటమే బంధమనుకున్నాడు. శరీరాన్ని సర్వ సుఖభోగాల నుండి దూరం చేయటమే మోక్షమనుకున్నాడు శరీరానికే స్వేచ్ఛ అనే విశ్వాసంతో రాజ్యాన్ని, భార్యాపుత్రులను వదిలి, శారీరకక్లేశకరమైన కఠిణమైన సాధనలు చేశాడు. కాని తద్వార అతనికి స్వేచ్ఛ లభించలేదు. చివరికి ఆ సాధనలు చాలించి, తన సిద్ధాంతంలో, తన నిర్ణయంలో ఎక్కడో లోపముందని గ్రహించాడు. అప్పుడు బోధి వృక్షంక్రింద స్థిరాసనంలో కూర్చుని ఆలోచించటం మొదలుపెట్టాడు.

మనసును ఏకాగ్రం చేయగానే, అతనికి సత్యం గోచరించింది. ఈ బంధం, ఈ ముక్తి అన్నీ ఈ మనసుయొక్క భావాలే సుమా! ఈ సంసారభ్రమకూడ ఈ మనసు చేసే లీలయే సుమా: అని గ్రహించాడు. ఆ జ్ఞానంతో ముక్తుడై తిరిగి సంఘంలోకి ప్రవేశించి, ఆ సత్యాన్ని వేనోళ్ళ చాటి చెప్పాడు.

కనుక శరీరాన్ని ఎక్కడో దాచిపెడితే ముక్తి లభించదు. మనసును నిర్వాణం చేసుకుంటేనే ముక్తి లభిస్తుంది. బలి అదే చేశాడు. సత్యదర్శనం అయిన తర్వాత, శరీరాన్ని తిరిగి మామూలు కార్యక్రమాల్లో ప్రవేశపెట్టి, నిర్వాణమనస్సుతో వ్యవహరించాడు.

జీవన్ముక్తి అంటే ఇంతే ఇదేదో అసాధారణవిషయం కాదు. ఇది అత్యంత సులభం. అందరికీ అందుబాటులో నున్నదే. మతదాంభికులు, ధార్మిక వేషధారులు, తమ తమ స్వార్థజీవన వృత్తులకోసం, ఈ సత్యాన్ని కలగాపులగం చేశారు. ముక్తి అన్న పేరు వింటేనే ప్రజలు జడుసుకొనేలా దాన్ని అనేకవిధాల సంక్లిష్టం చేశారు. మోక్షమంటే అదేదో కాషాయధారులకుమాత్రమే సాధ్యం అన్నట్లుగా కొన్ని వివిధకర్మోపాసనలతో సందిగ్ధం చేశారు. ఈ వేషధారులవల్లనే మన సనాతనధర్మం సామాన్యులకు, సర్వజనులకు బహుదూరంగా వెళ్ళిపోయింది, తినటంలో దోషం, పడుకోవటంలో దోషం, అడుగుతీసి అడుగు వేయటంలో దోషం. ఇలా తప్పులతడకలతో ఈ మోక్షరసామృతాన్ని ఎవరికీ దక్కకుండా దాచిపెట్టారు.

ఈ వంచకులను దూరం చేసుకుంటేనేగాని, మన సమాజం, మన సనాతనధర్మం ప్రకాశించవు.

బలిచక్రవర్తి తన యింట్లోనే ఉంటూ, సాధనలు చేశాడు. రాచకార్యాలుకూడా చక్కగా నిర్వహించాడు, మోక్షానికి సంసారం ఏమాత్రం అడ్డురాదని నిరూపించాడు. అసలు సంసారం అనేది ఒకటుంటేకదా! అది మన మోక్షమార్గానికి అడ్డు రావటానికి? అది కేవలం మనోకల్పితభ్రమ. అదొక నాటకం. పాత్రధారి నాటకాన్ని రసవత్తరంగా నటించినట్లే, మోక్షకామి ఈ సంసారంతో క్రీడించాలి. బలిచక్రవర్తిలా నిర్వికారుడై, ప్రసన్నుడై సంసారంలో ఉంటూనే జీవన్ముక్తావస్థను అనుభవించాలి.

—వచ్చే సంచికలో 'గూడులో ఎవరున్నారు?'

# కొంచెం దారి వదలాలి!

శారదాకుమార్

మనమందరమూ నవసమాజంకోసం ఎదురు చూస్తున్నాం. రాబోవు యీ నవత మానవతకు హారతి పడుతుందో, దానవతకు నివాళి చేస్తుందో చూడాలి. దా'నవత'లోనూ మా'నవత'లోనూ 'నవతి' వుండటం యాదృచ్ఛికమే కావచ్చు. మార్పు రావాలి, మార్పు త్వరగా రావాలి అని అంతా హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్‌కోసం ప్లాట్‌ఫాం మీద నిల్చుని ఎదురుచూచినట్లు చూస్తున్నాం, నిజమే. ఏ వేళ బయలుదేరి, ఏ వేళకు చేరుకుంటుందో అది మరీ మన రైళ్ళలాగే.

ఒకటిమాత్రం మనకు తెలుసు. మార్పు రైల్లోనో, విమానంలోనో రాదు. అది కాలి నడకనే వస్తుందని. ఈ సందర్భంలో ఒక స్వాములవారు గుర్తుకొస్తున్నారు నాకు. తన బోధనలోని గొప్పతనాన్ని చెబుతూ, "ఏమండీ, మనం ఢిల్లీకి పోవాలనుకుంటే నడిచి గాని, కారులోగాని, ట్రెయిన్‌లోగాని, విమానంలోగాని పోవచ్చు. ఔనా! అయితే అన్నిటికంటే విమానంలో పోతే ముందుగా ఢిల్లీ చేరుకుంటాం. అలాగే మోక్షానికి అనేకానేక మార్గాలున్నాయి. వీటిలో నేను బోధించే మార్గం వుంది చూశారూ, విమానప్రయాణం వంటిదండీ" అని సెలవిచ్చేవాడు!

ఈ విషయం జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా [illegible] పరమహంస అన్నమాటలు నాకు స్ఫురిస్తాయి. 'దైవసాక్షాత్కారానికి సులభ మార్గాలనేవి లేవు. దాని మూల్యం దానికి చెల్లిస్తేనే అది లభిస్తుంది' అనేవారు ఆయన. కాని కొందరు సాధకులు సదరు సులభమార్గాలనే, అడ్డదారులనే, వెదుక్కుంటూ 'విమాన కాముక్కుచుని, అలసి. అలాగే కునికేస్తారు వున్నచోటనే. ఇలాగే బతుకు తెల్లారిపోతుంది పాపం, వాళ్ళకు.

కొందరు రాజకీయ స్వాములు ఏమి సెలవిచ్చినప్పటికీ సామాజిక అభ్యుదయ సాధనకు అడ్డదార్లు (షార్ట్‌కట్స్) లేవేమో అనిపిస్తుంది. ఈ ప్రయాణం చాల దూరం. ఎక్కడో ఒక చోట అది మొదలుకావాలి. దాని మూల్యమూ దానికి చెల్లించాల్సి వుంటుంది.

ఈ వ్యవస్థ బాగులేదు. దీన్నిలా సంజీవి తాకించి, అమృతం తాగించి, బ్రతికించడం తప్పు అని మనం అనుకుంటే వెంటనే మనం మరోబాటకు మళ్ళాలి. దైనందిన జీవితంలో తెల్లవారి బట్టలు వేసుకుని బజారుకు బయల్దేరినప్పట్నుంచీ మనం ఆ మార్పుకోసం, సువ్యవస్థిత స్థితికోసం పాటుపడాలి. అంతేగాని, నేనూ మార్పు కావాలనేవాణ్ణే అంటే ఒరిగేదేముంది! ముఖ్యంగా, సమాజంలో మార్పు కావాలనుకుంటే సమాజ జీవనాన్ని ప్రభావితం చెయ్యగల భావాలు ప్రచురంగా, నేల నాల్గు చెరగులా ప్రచారం కావాలి. ఇది జరక్కుండా మార్పు, మార్పు అంటూ కంఠశోషపడితే మాత్రం ఆ మార్పు వస్తుందా? భావవిప్లవం రాకుండా, సామాజిక చైతన్యాన్ని కదలించే వేదనా విసుహూ కనిపించకుండా, నవసమాజం ఆవిర్భవించదు.

ఆవిర్భావం అంటే గుర్తొస్తుంది. శ్రీరాముడు కౌసల్య కడుపున పుట్టినా, ఆతల్లి ప్రసవవేదన ఎరుగదట—ఆయన ఆమెకు మనలా జన్మించలేదు, ఆవిర్భవించాడట. అంటే తల్లికి కేకలూ, కన్నీళ్ళూ లేకనే యీ పాపాయి—రాముడు—పుట్టాడు. కాని మనం అందరం

కోరే మార్పు యిలా ఎన్నటికీ ఆవిర్భవించదు; ఆకాశంలో నుంచి వూడిపడదు. చైతన్యవంతులైన యువకులేగాక, ప్రగతికాములూ, పురోగమనశీలురూ అయిన అన్ని వయస్సుల్లోనూ వున్న మేధావి 'యువకులు' ఈ మార్పు మహారథాన్ని తలా ఒక చెయ్యివేసి ముందుకు లాగాలి.

వేలాదిసామాజిక సమస్యలకు రాజకీయవాదులు మాత్రమే పరిష్కారం కనుక్కోలేరు అంటుంది చరిత్ర. రాజకీయాలనేవి సంఘంలో మార్పుకు పనికిరావని కాదు సమాజంలో ఆర్థికపరమైన పరివర్తనం సాధించగలవి బహుశా రాజకీయాలు మాత్రమే. కాని సంఘంలో సంస్కరణ సాధించడానికి రాజకీయవాదులు మాత్రమే చాలరేమో! రాజకీయ జీవితంలో మనిషి ఎలా అడుసులో కూరుకపోతున్నాడో పదవి అనే రంభను పరిరంభం చేసుకునేందుకు ఎలా విరహంలో కొట్టుకుంటున్నాడో—ఒకసారి ఆరంభను అనుభవించడం ఆరంభించాక దాన్ని వదల్లేక, నానాగడ్డీకరిచి విడాకుల్లేకుండా చూసుకుంటున్నాడో చూస్తూ—చూస్తూ— యీ రాజకీయాలతోనే యీ రాజకీయవాదులే — సమాజాభ్యుదయానికి క్రొత్త పాదులు తవ్వి, క్రొత్త అంట్లు తొక్కి, క్రొత్త పండ్లు కాయిస్తారని అనుకోలేంస్మీ.

రాజకీయవాదుల్లో మేధావులున్నారు. అట్లాటి పెద్దలు వాళ్ళగద్దెలు వాళ్లు భద్రపరచుకుని, పల్గురినాల్కలమీద వుంటారు. వారిని గురించి ప్రత్యేకంగా చెప్పేదేమీ లేదు. కాని, ఏ రాజకీయాల జోలికీపోకుండా ఏ యిజాల కౌగిట్లోనూ నలక్కుండా స్వస్థంగా వున్న పెద్దలెవరైనా వుంటే—పిన్నలైనా ఎవరైనా వుంటే—వాళ్ళు వానపాముల్లాగ నమ్రంగా వుండిపోతున్నారేమో, యీ దేశంలో. వీళ్లు నిజంగా నమ్రతవల్ల కలుగులోంచి వెలుగులోకి రారో, లేక, లేచి నిలబడి చెప్పదల్చింది చెప్పేసే సామర్థ్యం కొరవడిందో—అసలు, సమాజం పట్ల వీళ్ళకు బాధ్యత ఒకటున్నదనేదే ఎరుకలో లేదో! ఇవన్నీ ప్రశ్నలే. మరి ఏవిజవాబులు!

మేథ్యూ ఆర్నాల్డ్, 'మధురిమ, మహస్సు' అనే వ్యాసంలో భావదాస్య విముక్తి (ఇంటలెక్చ్యుయల్ లిబరేషన్) గురించి చెబుతారు.

భావదాస్యానికో చక్కని చిన్న వుదాహరణ మీకు చెబుతాను. మా ఆవిడ పుట్టింటికి పోయి వుంది. నేను తీసుకరావడానికి వెళ్లాను. ప్రయాణానికి సిద్ధమై మా వూరికి బయలుదేరుతున్నాం. మా ఆవిడ బామ్మగారు సాక్షాత్తూ వాళ్ళింటి సుప్రీంకోర్టు. 'యీవేళ బయల్దేరకూడదు, వూరుకోండి, రేపు పోవచ్చు' అన్నది. ఆమె అలాగే అంటూ వుంటుంది. ఎందుకమ్మా అని ఖర్మగాలి మనం అడిగినా, 'మీకు తెలీదూ అంటే వినరేం. కూడదన్నాను, అంతే', అని వూరుకుంటుంది. ఆ బామ్మగారంటే మా ఆవిడకు ప్రాణం. బామ్మగారి తర్కం వుండే అదంటే నాకు ప్రాణాంతకం. మీకు తెలీదన్నాను కదా అంటే ఓహో మాకు తెలీదు కామోసు అనుకుంటూ వూరుకోవటం మామూలుగా జరిగేది. ఈసారి మాత్రం నా పనితొందరవల్ల బామ్మగారి ఆజ్ఞకు వ్యతిరేకంగా — మా ఆవిడకు యిష్టం లేకున్నా— యిద్దరం బయల్దేరాం. రైలుటైముకు రావడమనే శుభశకునం దగ్గర్నుంచీ, సామాన్లన్నీ క్షేమంగా కొంప చేరేదాకా అన్నీ శుభంగానే జరిగాయి. ఆ వచ్చిన ఏడో నెలల్లోనే మా ఆవిడను పురిటికని అత్తారింటికి తీసుకెళ్లారుకూడా!

అప్పుడు తెలిసింది బామ్మ నీకు తెలియదంటే నేను నాకు తెలియదు కాబోలనుకోవడం నిజంగా తెలియని తనమే కాకుండా తెలివి మాలినతనం కూడా అని.

భావదాస్యమనేది బామ్మగారికయినా, భగవద్గీతకయినా, ఒకటే. అంటే భగవద్గీతా, బామ్మగారూ ఒకే ప్రామాణికతతో వున్నారని కాదు. అనూచానంగా వస్తున్న విలువల్ని బామ్మగారి అథారిటీగా తీసుకోకుండా సమకాలీన సమాజానికి ప్రయోజనకరంగా అన్వయించేటట్లు వ్యాఖ్యానించుకోవడం ఎంతో ముఖ్యమైన కర్తవ్యం. ఇలా వ్యాఖ్యానించిన మనుషుల్నే Intellectual liberators గా సమాజం గౌరవిస్తుందంటాడు ఆర్నాల్డ్.

మచ్చుకి, భగవద్గీతలోని యజ్ఞం అన్న పదానికి పని – స్వధర్మం – అని అర్థం చెప్పారు స్వామి వివేకానంద. ఆఫీసుల్లోనూ, ఫ్యాక్టరీల్లోనూ పొలాల్లోనూ, మనిషి నిర్వర్తించే స్వధర్మ విహితమైన కర్మను యజ్ఞం అన్నారాయన.

'Work is Worship' పనీ, పూజా ఒకటే అన్నారు. యజ్ఞమంటే అగ్నీ, సమిధలూ, ఋత్విజులూ మనకు గుర్తుకువస్తే—వాటినుంచి మనం పారిపోతాం అని స్వామిజీకి తెలుసు. మారుతున్న సంఘానికి చేరుతున్న విలువలకు స్థానం కల్పిస్తూ, శాశ్వతమైన సత్యాలకు మనం క్రొత్త వ్యాఖ్యానం చెప్పుకోవాలి. ఇదే మేధావుల కర్తవ్యం.

గాంధీజీ కూడా యీ కర్తవ్యాన్ని గొప్పగా నిర్వర్తించారు. ఆయన కేవలం నిరాహార దీక్షలు చేస్తూ కూర్చున్నారనడం సరికాదు. భారతీయుల జీవనాడుల్లో జీర్ణించుకపోయిన ఆధ్యాత్మిక విలువలను చేరువకోణం నుంచి దర్శించి మన జనానీకానికి మూరు మనసు కల్గించారు. సత్యాగ్రహాన్నీ, సహాయ నిరాకరణోద్యమాన్నీ అస్పృశ్యతా నిరోధాన్నీ బాపూజీ రూపొందించడం పాత ఆధ్యాత్మిక విలువలకు కొత్తరూపాన్ని తాపించడమే. ఆ ప్రవక్త ప్రమేయంలేని స్వాతంత్ర్యసమరాన్ని భయం భయంగా నేను వూహించినప్పుడు ఆనాటి కిరాతక శ్వేతముఖులు భారతదేశ చరిత్రను మొన్నటి బంగ్లాదేశ్ చరిత్రకు మల్లేనే కన్నీటికడలిలోనూ, నెత్తుటి వరదలోనూ ముంచి వేసేవారేమో అనిపిస్తుంది. ఆయన ఎందరో అభిమన్యులనూ, అశ్వత్థామలనూ, సమరోత్సాహం నుంచి నిరోధించి సరికొత్త భారత యితిహాసం సృజించారు. బాపుజీ సత్యకాముడు. తన సత్యాన్వేషణకు అంగభూతమైనవే ఆయన మహోద్యమాలు. అలా అని ఆయనే అన్నారు. రాజకీయ దాస్యంనుంచే కాక భావదాస్యం నుంచి కూడా మనజాతి విముక్తం కావాలని ఆశించారు. అందుకే గాంధీజీ జాతిపితయేగాక జాతిగురువు Mentor of the Nation. కూడా. కేవల రాజకీయ నాయకుడుగా యీ స్థానం ఆయనకు దక్కేదికాదు.

దానవతను సమాధిచేసి, మానవతకు పునాది వేసేనవత సమాజంలో ప్రతిష్ఠింప బడాలంటే రాజకీయవాదులుగానట్టి మేధావులు కళ్లు నులుపుకుని లేచిరావాలి. రాజకీయవాదులు వాళ్ళకు కొంచెం దారి వదలాలి.

# మందు

చిన్మయ చైతన్య

ఒకప్పుడు శ్రీకృష్ణుని పట్టపురాణులలో అహంకారం తలయెత్తింది. పరబ్రహ్మస్వరూపుడైన శ్రీకృష్ణభగవానుడిని మేమే నిరంతరమూ సేవిస్తున్నాం. సదా ఆయన సాన్నిధ్యంలోనే ఉంటున్నాం ఏపనిచేస్తున్నా ఆయన ధ్యానంతోనే ఉన్నాం భక్తశిరోభూషణాలం మేమే కదా, అన్నభావం వారికి తెలియకనే వారిలో అంకురించి చిగుళ్ళు తొడగసాగింది.

అందరి హృదయాలలోనూ అలరారి ఉండే శ్రీకృష్ణుడికి తెలియనిదేముంది ? ఇది కూడా తెలిసిపోయింది. భక్తజనమందారుడైన శ్రీకృష్ణుడు తన భక్తులలో లోపాలను సహించి ఉండగలడా? వెంటనే దానికి నివారణోపాయం ఆలోచించాడు

ఆయనకేదో వ్యాధి కలిగింది. భగవంతుడికి కలిగే వ్యాధిని ఎవరు కనుక్కోగలరు? దేవవైద్యుడైన ధన్వంతరియే దిగి వచ్చాడు. పరీక్షచేసి రోగనిదానం చేశాడు. తలవాల్చి విచారంగా కూర్చుండిపోయాడు.

శ్రీకృష్ణభవన ప్రాంగణంలో అశేషభక్తజనం సమవేతులై ఉన్నారు. అందరి మనస్సుల్లోనూ తమ ఆరాధ్యదైవం ప్రాణానికి ప్రాణం అయిన శ్రీకృష్ణుడు ఎప్పుడు బయటపడతాడా అన్న ఆలోచనయే.

శ్రీకృష్ణభవనంలో ఆయన పదహారువేలమంది భార్యలూ వ్యగ్రులై ఉన్నారు. శ్రీకృష్ణుడు లేక వారి జీవితం లేదు. ఏడేడు లోకాలలోనూ వారికి ఆయన తలపు తప్ప రుచించేదేదీ లేదు. ఆయనకోసం వారు ఏం చేద్దామా ఏం చేద్దామా అని తహతహపడుతూ ధన్వంతరి ఆదేశం కోసం కాచుకుని ఉన్నారు.

శ్రీకృష్ణమందిరంలో ఆయన అష్టభార్యలూ చేరి ఉన్నారు, శ్రీకృష్ణుని వ్యాధివలని బాధ వారినే ఆక్రమించిందా అన్నట్లుగా దీనవదనలై నోటమాటలేక కన్నులనుండి అశ్రుధారలు ప్రవహిస్తూ ఉండగా నిశ్చేష్టలై నిల్చుని ఉన్నారు.

ఆయన పర్యంకంపై పాదసేవచేస్తూ రుక్మిణీదేవి కూర్చుని ఉన్నది. ధీరమానసయైన ఆమె మనస్సులో ఏ ఆత్రుతలు తాండవనృత్యం చేస్తున్నవో ఎవరికి తెలుసు ? ఆమె కన్నులలో ఒక్క కన్నీటిబొట్టయినా లేదు. ఆమె హృదయంలోని శోకాగ్నివలన అశ్రుబిందువులు కూడా ఆవిరైపోయాయా ?

ఆమె ధన్వంతరిని ఇలా అడుగుతున్నది: "భిషగ్వరా ! మాటలాడరేమి? మీరు ఆలస్యం చేసేకొద్ది ప్రాణనాథుని వ్యథ ఎక్కువవుతున్నది గదా !" ధన్వంతరి కష్టంతో తల ఎత్తి ఇలా అన్నాడు: 'అమ్మా, ఈ వ్యాధి తెలియనిది కాదు. మందులేనిదీ కాదు. కాగా ఈ మందు అందరివద్దా ఉన్నదే. కాని ఎవరూ ఇవ్వసాహసించరు.' రుక్మిణీదేవికి మాట రుచించలేదు. 'ధన్వంతరి, భగవంతుని కీయలేని వస్తువు భక్తులవద్ద ఉండగలదా ? ఈ జగత్ప్రభువు స్వాస్థ్యం కోరుతూ ఎందరు జనులు చేరిఉన్నారో చూస్తూ మీరు ఈమాట ఎలా అనగలిగారు? వెంటనే చెప్పండి ఆ మందేదో' అని అర్థించింది.

ధన్వంతరి దుఃఖహాసంచేసి 'తల్లీ, చెప్పటానికి కూడా నాకు నోరు రావటంలేదు. అయినా చేయగల భక్తులెవరయినా ఉంటే ఈ వైద్యం ఎవరైనా చేయవచ్చు. కావలసిందంతా ఒక్కకణం. ఒక్క ధూళికణం. భక్తుడెవరైనా తన పాదధూళిలో ఒక్క కణాన్ని ప్రభువుచేత సేవింపజేస్తే ఆక్షణమే వారికి ఎప్పటి స్వాస్థ్యం చేకూరుతుంది. సెలవు.' దిగ్భ్రాంతురాలై రుక్మిణీదేవి మూర్తీభవించిన విషాదంలాగా నడచిపోతున్న ధన్వంతరినే చూస్తున్నది. అతడు కనుమరుగుకాగానే మొదలునరికిన చెట్టులాగా మూర్ఛితురాలై పడిపోయింది.

ధన్వంతరివైద్యం అంతఃపురకాంత లందరిచెవులా పడింది. ఆనోటా ఈనోటా అంతటా పాకిపోయింది. అయినా భగవంతుడిచేత తన పాదధూళి సేవింపజేసి రౌరవాది ఘోరనరకాలలో అడుగుపెట్టేసాహసం ఎవరికున్నది?

త్రిలోకసంచారియైన నారదుడు మందుకోసం వెదుకుతూ వ్రజభూమికి వచ్చాడు. శ్రీకృష్ణుడి సాన్నిధ్యంనుండి వచ్చాడని వినగానే వ్రజగోపికలందరూ మురళీగానంవిన్న గోవులలాగా పరుగెత్తుకుంటూ వచ్చారు. ఆయనచుట్టూచేరి ప్రశ్నలవర్షం కురిపించారు. మెల్లగా నారదముని వ్యాధిసంగతి బయటపెట్టాడు. 'మరి దానికి మందులేదా?' ఉత్కంఠతో కూడిన వారిప్రశ్నకు నారదుడు సానుకంపంగా ఇలా బదులుచెప్పాడు. చదువూ సంధ్యాలేని అజ్ఞానులుకదా వాళ్ళు! 'భక్తపాదధూళి ఒకటే దానికి మందు. త్రిలోకపావనుడైన శ్రీహరిచేత పాదధూళి సేవింపజేసి ఏభక్తుడు నరకానికి పోగోరుతాడు? శ్రీకృష్ణుడి పట్టమహిషితోసహా ఎవరూ ఈవైద్యానికి సాహసించలేదు.'

ఏకకంఠంతో గోపికలందరూ ఇలా ఘోషించారు. 'నారదమహర్షి, నారదమహర్షీ, ఇవిగో మాపాదాలు, వాటినిండా ఎంతోధూళి. తీసుకుపో. మేము భక్తులమే అయితే ఆయనవ్యాధి తప్పక నయమవుతుంది. ఆయనకు ఒక్కక్షణమైనా ఆనందమూ సంతోషమూ కలిగించగలిగితే శాశ్వతంగానే మేము నరకవాసం సంతోషంగా చేయగలం.'

# లల రామకృష్ణ

## దేవుడు మనకు ఆప్తుడు, అతి సన్నిహితుడు

కాళికాలయముతోపాటు దక్షిణేశ్వరములో రాధా గోవిందాలయము, పన్నెండు శివాలయములు వున్నాయి. ఆ దేవాలయములలో రోజూ వేరువేరు అర్చకులు పూజ చేస్తుంటారు.

శ్రీరామకృష్ణుడు కాళీపూజారిగా చేరిన కొద్దిరోజులకు ఒక ప్రమాదం జరిగింది. అది నందోత్సవము జరిగినరోజు అనగా కృష్ణాష్టమి వెళ్ళిన మరురోజు. మధ్యాహ్నపుపూజ అయినతర్వాత రాధా కాంతాలయ పూజారి గోవిందుని పాన్పుపై పరుండబెట్టుచుండగా చేయిజారి, విగ్రహముయొక్క కాలు విరిగింది.

విరిగిన విగ్రహము పూజకు పనికిరాదు. ఏమి జరుగనున్నదో గదా! మథురనాధుకు, రాణి రాసమణికి ఈసంగతి తెలియజేశారు. వారు పండితులనుపిలచి వారి అభిప్రాయాలు అడిగారు. పండితులందరు విరిగిన విగ్రహమును గంగలోవేసి, కొత్తవిగ్రహానికి పూజ చేయాలని శాసించారు.

కాని శ్రీరామకృష్ణుని ఈవిషయంలో విచారించలేదేయని మథురనాధునకు తోచింది. శ్రీరామకృష్ణుని అడుగగా, ఆయన ఇలా చెప్పాడు. "రాణిగారి అల్లుండ్రలో ఒకరి కాలు విరిగితే అల్లుణ్ణి పారవేస్తారా? లేక వైద్యుని పిలిపించి బాగుచేయిస్తారా? ఈ విషయములోగూడా అలా జరగాలి. విరిగినకాలు బాగుచేయించి పూజించండి" అందరు అప్పుడు అసలు విషయాన్ని గ్రహించారు. నిజమే! ప్రతివారు దేవుడు తమ స్వంతంగాను, ఆప్తునిగాను భావించి, ఆయనను తల్లిగానో, తండ్రిగానో, బిడ్డగానో సేవించాలి. అలాగాక వారికి దేవుని విగ్రహము విగ్రహముగానే తోచింది. శ్రీరామకృష్ణుడు విరిగిన విగ్రహపు కాలును అందముగా సరిదిద్దాడు.

పగిలిపోయిన ప్రతిమను పారవేసి
వేరు ప్రతిమకు పూజ గావింపుడనగ
రామకృష్ణుడు అనెనంత రాణిగారి
అల్లునకు కాలు విరిగిన నతని విడిచి
వేరె అల్లుని దెప్పించు విధమటంచు.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము 1 వ భాగము | 8 00 |
| శ్రీ రామకృష్ణ కథామృతము 1 వ భా. క్యాలికో | 12 00 |
| ,, ,, 2 వ భాగము | 13 00 |
| ,, ,, ,, క్యాలికో | 18 00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10 00 |
| ,, ,, క్యాలికో | 14 00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 12 00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీరామకృష్ణపరమహంస నీతికథారత్నములు | (ముద్రణ) |
| గురూపదేశములు | 2 00 |
| నా గురుదేవుడు | 1 25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1 50 |
| శ్రీ రామకృష్ణపరమహంస జీవితసంగ్రహము | 0 75 |
| ఆరాత్రికము మరియు శ్రీ రామనామసంకీర్తనము | 0 50 |
| శ్రీ శారదాదేవి జీవితచరిత్ర | 00 |
| శ్రీ శారదాదేవి | 50 |
| శ్రీ శారదాదేవి ప్రసంగములు | 50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0 80 |
| శ్రీ వివేకానంద జీవితచరిత్ర | 75 |
| బాలల వివేకానందుడు | 00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 6 వ సంపుటము | 15 00 |
| 8 వ సంపుటము | 6 50 |
| 9 వ సంపుటము | 6 50 |
| 10 వ సంపుటము | 50 |
| స్వామి శిష్య సంవాదములు | 10 50 |
| సందేశతరంగిణి (మొదటి భాగము) | 7 50 |
| (రెండవ భాగము) | 5 50 |
| భారత యువజనులారా! | 3 00 |
| ప్రబోధ రత్నాకరము | 3 75 |
| జ్ఞానయోగము | 13 00 |
| రాజయోగము | 6 25 |
| కర్మయోగము | 4 00 |
| భక్తియోగము | 4 00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 5 50 |
| ,, (రెండవభాగము) | 3 00 |
| హిందూమతము | 4 00 |
| వివేకసూర్యోదయము | 4 00 |

| | |
|---|---|
| అనుష్ఠాన వేదాంతము | 3 00 |
| ప్రాచ్యము-పాశ్చాత్యము | (ముద్రణలో) |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3 00 |
| భారతదేశము | 2 00 |
| భారతీయ మహిళ | 2 00 |
| నా జీవితము, జీవితకార్యము | 1 25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ: తదాదర్శములు | (ముద్రణ) |
| షికాగో నగరోపన్యాసములు | 1 25 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0 80 |
| నవీన భారతదేశము | (ముద్రణ) |
| సర్వం విష్ణుమయం జగత్ | 0 35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0 20 |
| యువకులకు వివేకానందుని పిలుపు | 1 50 |
| వివేకానంద (బొమ్మల పుస్తకము, పిల్లలకు) | 2 50 |
| బ్రహ్మానంద బోధనలు | 4 75 |
| తాపత్రయ చికిత్స | 0 60 |
| ముక్తిమార్గము | 0 30 |
| పారమార్థిక సంభాషణలు | 6 50 |
| నారదభక్తిసూత్రములు | 4 00 |
| పరతత్త్వప్రసంగము | 8 75 |
| దేవీమాహాత్మ్యము | 4 00 |
| శ్రీమద్భగవద్గీత | 10 00 |
| ,, (క్యాలికో) | 12 00 |
| శ్రీమద్భగవద్గీత చిన్నసైజు | 3 00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3 75 |
| ,, మూలము | 2 00 |
| కఠోపనిషత్తు | 2 00 |
| గిరీశచంద్ర | (ముద్రణలో) |
| భక్తిమార్గము | 1 00 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 1 00 |
| రామ ఉవాచ | 0 80 |
| శ్రీ కృష్ణవాణి | 0 80 |
| బుద్ధ ఉవాచ | 0 80 |
| క్రైస్తు సూక్తిమాల | 0 80 |
| మహమ్మదు సూక్తిమంజరి | 0 80 |
| శంకర ఉవాచ | 1 00 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 2 00 |
| కీర్తన సంగ్రహము | 2 00 |

**ఇవియేగాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును, వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీరామకృష్ణప్రభ (తెలుగు) శ్రీ రామకృష్ణవిజయము (తమిళము) అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగునవెన్నియో మాయొద్ద లభింపగలవు.**

**మద్రాసు-600 004.**